శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

# అనుభవాలూ-జ్ఞాపకాలూను



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Sripada Subrahmanyasastri - Experiences & Memories

ప్రచురణ నెం. : 2122

వి.పి.హెచ్. తొలి ముద్రణ : జనవరి, 1999



వెల: రూ.180/-



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# తెలుగువాడు తెలుగుకు కట్టిన పట్టం

వచనానికి కండబలం, గుండెబలం ఇచ్చిన రచయితల్లో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గణనీయులు. అధునిక తెలుగు కథకు గురజాడ జీవం పోస్తే తరువాతి తరంలోని శ్రీపాదవారు దానికి జవం కల్గించారు. కవనం – వచనం రెండూ సమాంతరంగా తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్న కాలంలో వచనానికి పెద్ద పీట వేశారు. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చిక్కని తెలుగుదనం ఉడుపులో గ్రామీణ భావజాలం, పోయిన పోకిళ్లూ, సోయగాలూ దర్శించాలంటే శ్రీపాద వారి వచనం చదవాల్సిందే!

కథలకు వర్టికల్‌గానూ హారిజాంటల్‌గానూ విరాడ్రూపం కల్పించింది శ్రీపాద వారే. ఈ శతాబ్దం అయిదూ, ఆరూ దశకాలలో విరివిగా వచ్చిన నవలికలకు వీరి కథలే తొలిరూపాలు. తెలుగు వేళ్లున్న అంతర్జాతీయ కథకుడు. వీరి కథలను మూడు సంపుటాలుగా ఇంతకు ముందే మేం అందించాం. పాఠకులు చాలా ఆప్యాయంగా ఆదరించారు. ప్రస్తుతం శ్రీపాద వారి ఆత్మీయ కథ "అనుభవాలూ – జ్ఞాపకాలూను" అన్న గ్రంథాన్ని మీ కందిస్తున్నాం. నీలంరాజు వెంకటశేషయ్యగారు నడిపిన "నవోదయ"లో తొలిసారిగా ఇది క్రమంగా వచ్చింది. ఆదిలో దీన్ని 3 సంపుటాలుగా ప్రకటించారు. రచయిత అకాలమరణంవల్ల ఈ గ్రంథం అసంపూర్ణంగా ఆగిపోయింది.

వీరేశలింగంగారి స్వీయ చరిత్రతో ఆరంభమైన ఆధునిక స్వీయచరిత్ర ప్రక్రియలో ఇప్పటికి సుమారు వందకు పైనే గ్రంథాలు వచ్చాయని ఈ శాఖలో ప్రత్యేక కృషిచేసిన శ్రీ అక్కిరాజు రమాపతిరావు అంచనా. అందులో ఈ రచన పురిపండా అప్పలస్వామిగారి మాటల్లో "భారతీయ భాషల్లో నేనెరిగినంతవరకూ ఈరకం గ్రంథం లేదు". శ్రీపాదవారు "1924 నుండి వ్యవహారిక భాషా ఉద్యమానికి అండదండలందించారు". భావ సంఘర్షణ, ఆచార సంఘర్షణ, ఆచరణ సంఘర్షణల కాలంలోని శ్రీపాదవారికి హిందీ, గాంధీ–ఖద్దరు అంటే ఎలర్జీ. 1921 నుండి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు నడిపిన ప్రబుద్ధాంధ్ర పత్రిక తమ సిద్ధాంతాల ప్రచారానికి ఓ ఉద్యమంగా పని చేసింది. 1934 నుండి పద్యాలను నిషేధించి వచనానికే కేతనమై వచన రచయితలనందర్నీ ఒక తాటిపైకి తెచ్చింది. ప్రస్తుతం ఈ గ్రంథంలో "అనాటి తెనుకు పల్లెటూళ్ల జీవితము, ఆచారములు, శ్రౌతుల గృహాల శోభ, ఆ సంస్కృతి, సర్వము రమణీయము"గా దర్శించగలం. నాటి సభ్యతా చరిత్రకిది నిలువుటద్దం. "సత్య ప్రఖ్యాపనకు తార్కాణంగా" నిలిచిన సజీవ సాహిత్య సంపుటం. శ్రీపాదవారి కథలను ఆదరించినట్లుగానే ఈ గ్రంథాన్ని సైతం తెలుగు పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ...

ఏటుకూరి ప్రసాద్
సంపాదకుడు

# కనకాభిషేక చిహ్నం

విశాఖపట్నం చరిత్రలో, 25-4-1955 తేదీ స్వర్ణాక్షరముగా, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి జీవితంలో గొప్ప సుదినముగ్ను. 65 వ జన్మదినం పురస్కరించుకుని విశాఖపట్నం పౌరులు, శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, ఘనమైన సన్మానం జరిగించి, ఆ సందర్భంలో కనకాభిషేకముగ్నా చేయించారు. ఆ మహోత్సవం, పౌరులపక్షాన కవితాసమితివారు నిర్వహించారు. శ్రీ అంకితం వేంకట భానోజీరావు ఎం.ఎల్.ఏ.గారు సన్మాన సంఘాధ్యక్షులు. శ్రీ బి.జి.ఎం.ఏ. నరసింగరావు ఎం.ఎల్.ఏ.గారూ, కవితాసమితి అధ్యక్షులు శ్రీ పురిపండా అప్పలస్వామిగారూ కార్యదర్శులు. ఢిల్లీనుంచి ప్రత్యేకంగా దయచేసి, నాటి మహోత్సవసభకు అధ్యక్షత వహించి, శ్రీ తెన్నేటి విశ్వనాథం పంతులుగారు శ్రీ శాస్త్రిగారికి స్వయంగా కనకాభిషేకం చేశారు. సన్మానసంఘం వారి యేర్పాటుతో, ఈ గ్రంథం, ఆ కనకాభిషేకానికి చిహ్నంగా ప్రకటితమై శ్రీ శాస్త్రిగారికి సమర్పించబడ్డది.

★ ★ ★

# చదివినవారన్న మాటలు

"మీ 'అనుభవాలూ జ్ఞాపకాలూనూ' చదివాను, చదివించాను. ఆ చదివినవారూ నేనూ గూడా ఒక్క గుక్కలోనే చదివాం. ఇంకా ఇది వేయిళ్ళ పూజారిగానే ఉంది.

తెలుగుగుడి కట్టాలి, కట్టాలని పరితపించిన శ్రీరామచంద్రశాస్త్రిగారు గనుక బ్రతికి ఉంటే అక్షరాలతో కట్టిన ఈ తెలుగుగుడికి ఎన్ని గోపురాలు ఎన్ని సోపానాలు కట్టి ఉండేవారో కదా?

తెలుగువారిలో తెలుగుతనం చచ్చిపోయి ఎన్నో ఏండ్లయిపోయింది. 'అది ఎప్పుడో ఉండేది' అని కూడా మన తెలుగుపిల్లలెరగరు. 'నీ తెలుగెవ్వరిపాలు చేసి తిరిగెద వాంధ్రా!' అని నేను సుమారు నలుబదేండ్లక్రితం ప్రశ్నించాను. తెలుగువారే కాబోలు వీరు నవ్వి ఊరుకున్నారు. మీ యీ పుస్తకమున్నూ శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రపురాణమున్నూ వచ్చినవి. చాలు – 'కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.'

ఈ సంపుటంలో అంతరంగా ఉన్న తెలుగుదనమూ దానికి చాలకమైన స్వయంకృషీ: వీనికి దేవతలు గూడా సంతోషిస్తారు. వీనికి దోహదంగా చమత్కారం కలిగించే సంఘటనలు ఎన్నో, విఘటనలు ఎన్నో చదువరుల నాచికొంటవి.

తెలుగుబిడ్డ వయ్యా నీవు. 'తెనుగుబిడ్డ లండీ మీరు' అని వ్రాస్తే ఈ అర్థం సంపన్న మయితే 'తెనుగుబిడ్డ లండీ మీరు' అనే వ్రాసే నని అనుకోండి. తెలుగువారిలో తెలుగు ఉన్నదని ఈ పుస్తకం కళ్ళు తెరిపిస్తుంది. ప్రతి హైస్కూలునూ, ప్రతి కాలేజీనీ, ప్రతి తెలుగువ్యక్తినీ ఈ పుస్తకం చదవమని అనురోధిస్తాను.

'తెలుగుభాష ఆడవాళ్ళలో ఉంద'ని '......' వ్రాశారు. 'కాంతాసమ్మితతయా ఉపదేశయుజే' అని దెప్పినవాడు తెలియకుండా మీ నోట్లోంచి ఊడిపడ్డాడు. దానికీ కొంత తేడా లేకపోలేదు గాని తరచిచూస్తే ఈ రెండూ ఒకదాని అవతారాలే. భేష్! తరువాయి సంపుటాలకు ఎదురుచూస్తున్నాను.

**వేలూరి శివరామశాస్త్రి.**

**2**

"తామెంతో వాత్సల్యంతో పంపిన 'అనుభవాలూ – జ్ఞాపకాలూను' అందగానే అందినట్లు వ్రాసుకున్నాను. ఇప్పటికి గ్రంథం ముమ్మాటు చదివాను. ఇంకో రెండుమూడు సార్లు చదివేట్టున్నాను.

కారణం?

పెద్దలతో పోలికకు తగను; కాని తమకూ నాకూ ఎన్నెన్నో పోలికలున్నాయ్! శ్రీపాదవారివలె జలసూత్రం వారున్నూ – తత్రాపీ – మాకోవ, శ్రీవిద్యోపాసనే తమకు ఆస్తిగా కలవారు. మాయింటు, ఏమంచి జరిగినా మాఅమ్మవారి కృప అనుకుంటాము.

భారతి చదివినందుకు మాతండ్రిచేత దెబ్బలుతిన్నాను. నానాహింసలు పడ్డాను. ఎందుకూ? కవితావ్యాసంగాని కనీ, స్మార్తం చెప్పకోనందుకు – చెప్పకున్నది మరిచినందుకు అనీ. నేనూ నక్షత్రేష్టి – ఇత్యాదులు చెప్పకొన్నాను. నా పెళ్లికి పురోహితుణ్ణి అగమనకుండానే మంత్రా

లన్నీ నేనే చెప్పుకున్నవాణ్ణి. ఇద్దరికీ ఆంగ్లం రాదు. రాదు అనే దుగ్ధ ఉంది. ఇట్లాగా ఎన్నెన్నో కనపడ్డవి. కాని తేడా ఒక్కటే ఉంది. అది పెద్దది. అదేమిటంటే? తాము హఠంతో 'పారదృశ్వా' అయినారు. నేను - రెంటికిం జెడిన రేవడ నైతిని. శాస్త్రిగారూ, ఇంతే - చాలదూ?

## కొన్ని మొక్కలు

నేల నెవరో పదునుచేస్తారు. కుదురు ఏర్పరుస్తారు. మొక్కను పాతుతారు. నీళ్ళుపోస్తారు. శ్రద్ధచూపిస్తారు. పెంచుతారు. మొక్క-పెరగవచ్చు. పెద్దదీ కావచ్చు.

## మరికొన్ని మొక్కలు

కొండల్లో పుడతై. కొండను ఛేదిస్తయ్. తలెత్తుతై - ఏ తుపానుకూ చలించవు. ఈ కొండ చెట్టన్నది చూచారూ, ఇది అతిగా ప్రాణశక్తిని కర్చుపెట్టిగాని తలెత్తలేదు. తలెత్తిందా, దాన్ని తుంచడం - బ్రహ్మ దేవుడికి వశంకాదు.

## మీరు

గిరివృక్షం వంటివారు. ఉద్యానంలోని చెట్టుకారు. అ-ంత జీవశక్తిని క్షణంక్షణం వెచ్చిస్తేనేగానీ - 'ఇల్లుపట్టిన వెధవాడబడుచు' 'షట్కర్మ యుక్తా' 'అపిదళతి వజ్రస్య హృదయం' 'మార్గదర్శి' 'జాగ్రత్త పడవలసిన ఘట్టాలు' 'కచ్చిత మైన జవాబు' ఇత్యాది ఘనకథల రచయిత - ఏ ఆంగ్లకథనో తెరువాటుకొట్టి వెలిగే సాటిరచయితల్లో, కేవలం సాలీడువలె - తనలోంచే అంతా సృష్టించుకొనే రచయిత ఆవిర్భవించలేదు.

ఇందుకు - ఇందుకు మీ చిన్న అన్నగారికి మీతోపాటు అందరూ కృతజ్ఞులు. ఓఁ!

వేదం, శ్రౌతం, స్మార్తం, యజ్ఞం, అగ్నిహోత్రాలు, రథంతరసామగానం (నేను చెప్పకోలేదు సామాలు) దగ్గిరనుంచీ, బెంగాలీపత్రిక దగ్గిరనుంచీ - అట్టకు అట్టా కదిలింది. ఎంత గొప్ప సంగతి! చదివి ఏడ్చాను. నవ్వాను. పాపం, ఎక్కడా ఇంతే అనుకున్నాను. గొప్పపుస్తకం.

కావడానికి మీరు సిద్ధాంతిగారి అబ్బాయి; కాని నవీనాంధ్రకథకులలో ఘనాపాఠీ.

చెరుకుపానకం తాగరు - పుచ్చుకుంటారు. కనకనే తియ్యటి తెలుగు వ్రాస్తారు. తెలుగువచనం తీపి మీసొత్తు.

నేను సిగరెట్లు తాగుతాను. చివరికి మిగిలేది నుసి.

శాస్త్రులవారూ! నేనూ వారాలు చేశానండోయ్! నేను మాధుకరం ఎత్తలేదు. శాస్త్రిగారూ, ఇంత వైదిక సంపద తెలుసు గనకనే - మీరు - 'అయ్యో, చెడిపోతున్నారు' అని అంత విచారపడివుంటారు గనకనే - 'బ్రాహ్మణాగ్రహారం' వ్రాశారు. 'ఔటులై నిది బ్రాహ్మణాగ్రహారమునకు' 'పెంచను లేదు కుదించలేదు' భేష్!

శాస్త్రులవారూ, మీరు ఈ పుస్తకం రచించకనే వుంటే - చాలా నష్టం వచ్చేది.

వివరిస్తాను.

ఇది సామాన్యమానవుడి చరిత్ర కాదు, క్షోభ! ఘోష!

ఈ ఘోషను ఆ సామాన్యుడు అమోఘమైన భాషలో చెప్పాడు. బాగానే వుంది. కాని ఆ సామాన్యుడు, - జీవితం - పరమపదసోపానపటం. (వైకుంఠపాళీ) ఆడాడు. వేదం, జ్యోతిషం, శ్రౌతంలో ఎత్తాడు తెరచాప. బాబా, అది వచ్చివచ్చి బ్రహ్మసమాజకుడి లెవెల్‌కు దేకించింది. అంటే - కాలపురుషుడు (తంత్రపరిభాషలో) కాళి పక్కానికి తెచ్చింది.

అవునా?

ఇక్కడో. చిత్రం ఉంది.

కాలానికి తగిన ప్రాణి, ఆత్మ. విరుద్ధవాతావరణంలో పుట్టి పెరిగింది. అసలు ఆ ఆత్మ రణపెంకెది. చీల్చి చూస్తుంది దేన్నయినా గుడిపాటి వెంకటాచలం వలె, విశ్వనాథ సత్యనారాయణవలె. వీరందరికీ చిత్తశుద్ధి, పట్టుదలలు సామాన్యం. మనకు ఎందుకు పోనిద్దూ అని ఊరుకోరు.

అంత తీవ్రత కలవాళ్ళు కనకనే –

సత్యనారాయణ, సు – బ్రహ్మణ్యశాస్త్రి, వెంకటాచలం గార్లు ఘనాపాఠీలు అయినారు.

'ఇదిగో మా సంపద' అని ఎవరైనా చెప్పుకోతగ్గట్టు తయారు అయినారు.

వీరికి జోహారు! క్షమించండి. జేజే, జోజో, జేతలు.

ఇక

మీ పుస్తకం సకాలంలో వచ్చింది.

విశదపరుస్తాను, నావ్యూహను.

వ్యాఖ్యానం చేస్తాను.

భాష్యం చెయ్యక తప్పదు.

మీరు అన్నట్టు – ఇది యుగసంధి.

కావటానికి ప్రతిక్షణమూ యుగసంధే. కాని – ముత్తుస్వామిదీక్షితులు, త్యాగయ్యలనాడు, నేడు మనకున్న భావసంఘర్షణ, ఆచారసంఘర్షణ, ఆచరణసంఘర్షణలు లేవు.

గతం గతం కాదు. కావలసినన్ని తలపుళ్ళు కడుక్కోడానికి గాను – సర్వరక్షాకరచక్రస్వాములుగా – (1) బ్రహ్మసమాజం (2) ఆర్యసమాజం (3) కాంగ్రెసు (4) సోషలిజం (5) కమ్యూనిజం – ఇత్యాదిగా ఉద్యమాలు వచ్చినై. తెలుగులు ప్రతిదాంట్లోనూ గభీమని ఉరికారు. తేట ఎవరికో ఐతే తెట్టెలు మనవి. ప్రతి ఉద్యమంలోని చెడూ మనవంటికే పట్టింది. ఇక – పైన చెప్పినవి అన్నీ గుల్లలు అని తేలింది – నాగరికతను అవేవీ పెంచలేకపోయినై. నేడు ప్రతి గుండెలోనూ ఘోషించేది 'లాలస.'

స్త్రీదాహం, పదవీదాహం, ధనదాహం – ఇంతే నేటి నాగరికత ఇచ్చినది.

ఇది నిలవ దని ప్రతివారూ పైకి అంటారు. కాని అవే కావాలి.

అంటే. చిత్తశుద్ధి నశించింది.

రసికత లేని మైథునం.

అసమర్థ నిర్వహణం.

అరగని ఆరగింపులూ.

వచ్చిపడి పీడిస్తున్నాయ్.

పర్వతాలంత పెరిగి ఉన్నయ్.

ఇవి నాశనం కావాలి.

ఎట్లా?

సమర్థులు, వజ్రాయుధంవలె కలం నడపగలవారు – తీక్ష్ణదృక్కులు, తీవ్రవాక్కులు, ధీరులు – ఈ మాయపర్వతాలను ఛేదించాలి, భేదించాలి. చూర్ణం చూర్ణం చెయ్యాలి.

బ్రహ్మచర్యం విలువ నచ్చచెప్పి స్త్రీదాహం కట్టాలి.

'నేను ఇంత చాటపెయ్యనా?' అనిపించి, అటువంటి అక్కలక్కర నోటపడేసి, ఒక దాహం కట్టాలి.

జఠరపుష్టి లేనివా ణ్ణని వాడికి వాడికే తెలియజెయ్యాలి.

ఇది మీ గ్రంథం సాధించుతుందనుకుంటాను.

మన జాతిమీదనేనా?

కనీసం పదిమంది మీద – చాలదూ?

క్రమంగా కొందరు, మరికొందరు మారుతారు.

ఆ ఆశ నాకు ఉంది.

ఐతే,

అవసరాన్ని మించి, అతిగా జీవశక్తి ఖర్చుపెట్టాలసినవా రయినారు మీరు, చలంవలె, విశ్వనాథవలె.

అందుకే –

వారివలెనే – మీరూ అతిగా చెప్తారు అనుకున్నాను కొంతచదివి.

తరవాత తెలిసింది, 'గ్రంథం ఉపదేశకం. పడిన వ్యథ అతీతం–కనకనే అంత చెబుతున్నారు'. అనుకున్నాను, చివరికి. ఐనా మీరు చిన్నప్పటి సంగతులు వ్రాస్తున్నారు కదా!

మల్లిడి సత్తిరెడ్డిగారింట –

ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికల ప్రస్తావనలో –

'అప్పటికి కాంగ్రెసు మరకలు పడలేదు' అనడం తప్ప అనను గాని, అనవసరం. అప్పటి మీ ఉత్సాహం, వాటిని చూడగా ఆనాడు మీకు కలిగిన ఉద్రేకం వ్రాస్తే గొప్పగా వుండేది! అనుకుంటాను.

అక్కడక్కడ ఇట్లాగే –

'ఈ పంక్తులు ఎందుకు వ్రాశారు? లేకపోతే పుష్టి కలిగేదికద ఇంకా –' అనుకున్నాను, బహుకొద్దిసందర్భాల్లో. మన్నించండి, ఇట్లా వ్రాస్తున్నందుకు.

మీతల్లిగారి ఫొటో, మీ పెద్దన్నగారి ఫొటో – ఈరెండూ లేకపోడం గ్రంథానికి మచ్చ, ఖాయం.

'చిన్నన్న కాల్చుకుతిన్నాడని, ఆయన బొమ్మ వేశారా?' అని ఒక్కరు గూడా అనుకోగూడదు.

ఆ చిన్నన్న అంతపట్టుపట్టకపోతే – శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు – ఇంత పట్టుదల మనిషి, ఇంత శ్రద్ధాళువు, ఇంత ఘనాపాఠీ అయివుండరు.

నిజమే, అందుకే ఆయన ఫొటో, తండ్రి ఫొటోతో పాటు – వాస్తవమే.

కాని, తల్లిగారిదీ, మిగిలిన అన్నగారిదీ ఫొటోలు ఉంటే – ఎంత నిండు వచ్చేది అనుకున్నారు!

ఎంత సూక్ష్మంగా మీ చిన్నన్నగారు దెబ్బతినేవారు అనుకున్నారు!!

ఓః!!!

మిగిలిన సంపుటాలు ప్రింటు అయినయ్యా?

ఇంకా కాలేదూ?? అబ్బ!! గబగబా అచ్చుకావాలి.

పరాక్రమించాలి.

శాస్త్రులవారూ, సొంత సోదిలో పడుతున్నాను.

1952 మే మాసంలో – నాలో మథన ప్రారంభం ఐనది. తీవ్రరూపం పొందింది. 1952 ఫిబ్రవరి నుంచి అసలు మార్పు ప్రారంభం. 1952 నవరాత్రాలనుంచీ సంధ్యావార్చనిదీ పచ్చి మంచినీళ్లు త్రాగడంలేదు. 1953 జనవరి 29 నుంచీ – మా పెద్దలవలె, నేనున్నూ శ్రీవిద్యోపాసకుణ్ణి – ఆ చమత్కారాలు ముఖాముఖీని మనవిచేసుకోతగ్గవి. ఎప్పుడో మీపాదాల దగ్గిర వ్రాలి ఆ కథ చెప్పకుంటాను.

నేడు, నా వ్యూహాలు, నా మార్గాలు, నా స్నేహితుల మార్గాలతో భేదించినవి. నా నమ్మకాలు మారినవి.

తెనుగు భాష మధురం అయినది. కాని, ఏగొప్ప సంగతి చెప్పాలన్నా చాలదు అనిపిస్తోంది.

సంస్కృతం....!

అడిగారూ?

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

కాని, ప్రజాపరంగా, మూకమొత్తంమీద చెప్పాలంటే తెనుగే అవసరం, సంస్కృతం చాలదు. ఇట్లాగా కొట్టుకుంటున్నాను.

ఇలాగే – 'రాజకీయాలు, సినాదాలు, ఎంత గగ్గోలు ఎత్తించినా అశాంతిని పెంచేవి కాని ఆత్మతృప్తిని అవి కలిగించలేవు' అని నమ్ముతున్నాను.

ముఖ్యంగా, "సినాదాలు అరుపులు – చాలా – కన్నులలో దుమ్ము కొడుతున్నాయ్" అని నమ్ముతున్నాను.

గ్రామఫోను, రేడియోలు సంగీతాన్నీ, విద్యనూ చవకచేసి మోహం మొత్తించి – చంపుతున్నవి అని భావిస్తున్నాను.

'సినిమా' నటనాశక్తిని పోగులుపెట్టింది అని విశ్వసిస్తున్నాను.

యంత్రం, బస్సు, బియ్యాప్యాక్టరీ లేనిచోట బ్రతుకుదాం అని ఆశ పడుతున్నాను.

ఇదంతా **'రియాక్షనరీ'** (వెనక్కు మళ్లేతత్వం) అంటారు, నాకు మిగిలిన బహుకొద్దిమంది స్నేహితులు.

ఇంకా ఇంకా నాలోనే నేను తలపట్లు పట్టుకుంటున్నాను.

ఇట్లాంటి వేళల్లో 'మీ అనుభవాలూ జ్ఞాపకాలూ' నాకు ఎంత గొప్పగా ఉంటాయో మీరే యోచించండి.

ఈ గ్రంథం వ్రాసింది మీరు కాక – మరెవరైనా – నా ఈడుజోడువాడు వ్రాసి ఉంటేనా – ?

బుగ్గనులిపి,

కావలించుకొని, ముద్దెట్టుకొని వుందును.

మరి – వ్రాసింది మీరు – అందుకని –

'అంగీరస బార్హస్పత్య భారద్వాజ త్రయారుషేయ ప్రవరాన్విత భారద్వాజసగోత్రః–

ఆపస్తంబసూత్రః –

యజశ్శాఖాధ్యాయీ –

రుక్మిణీనాధశర్మా – అహం భో అభివాదయే'

మీ పాదాలు ముద్దు పెట్టుకొంటున్నా –"

మీ

రాత్రి 10–38. **జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి.**

## 3

**"శాస్త్రిగారూ,**

మీ 'అనుభవాలూ, జ్ఞాపకాలూను' ఇప్పటికైదారు మాట్లయినా చదివాను. ఇంకా తనివితీరడంలేదు. మళ్ళీమళ్ళీ చదివింపచేసే ఘట్టాలు చాలా ఉన్నాయందులో, చూద్దామంటే మరొకచోట లభించనివి.

పాత వ్యవస్థకు మీతరం చాలా సన్నిహితమైంది. అందులోనూ మీరు ఎదురుతిరిగి లక్ష్యాన్ని సాధించిన దీక్షాపరులు. అంచేత, మీకు తెలిసినంతగా ఆ వ్యవస్థ గుణదోషాలు మరొకరికి తెలియవు. లక్ష్యం మాత్రమే భేదిల్లడంచేత నిష్పాక్షికంగానూ చూడగలిగారు మీరు. మాతరం వారి కానాటిజీవితం కేవలం ఊహాప్రపంచం. ఏ వ్యవస్థా లేకుండా పోతున్న మన జాతికి మంచితరుణంలో వచ్చిన హెచ్చరిక మీపుస్తకం.

వాడీ వేడీ సమృద్ధిగా ఉన్న భాష మీది. అవసర మైనచోట్ల అస్థిదఘ్నంగా అంటుకుపోయే కశాఘాతాలు తగిలించారు మీరు. చూసినవాడు దూరంగా ఉండడం సాధ్యం కాదు – తీసి చదివాడా, మీముద్ర పడితీరుతుంది.

మీతక్కిన పుస్తకాలన్నీ ఒకయెత్తు – ఇదొక్కటీ ఒకయెత్తు. దీన్నిగూర్చి సరిగా చెప్పాలంటే మీ మాటల్లోనే చెప్పాలి.

కొత్త సంగతులు తెలిపి, కొత్త రుచులు మప్పి, కొత్త చూపు అలవర్చి, కొత్త దారులు కనపరిచి, కొత్తశక్తి సంఘటించి, కొత్త ఆవేశం పురికొలిపి, కొత్త ప్రపంచంలో వురికించే కొత్త వాఙ్మయానికి పురోగామి మీ పుస్తకం.

రసవంతమైన నవలలా సాగిన మీ రచనలో మంచి కథపట్టులో ఆగినట్టుంది మొదటి సంపుటం. ఎంత చెడ్డా, తెనుగుజాతి రసజ్ఞం కాబట్టి తక్కిన సంపుటాలు త్వరత్వరగా రప్పించుకుంటుందని ఆశిస్తున్నాను."

మీ

జమదగ్ని.

## 4

"మీకుశలపత్రికా 'అనుభవాలూ – జ్ఞాపకాలూనూ' చేరినవి. నిన్ననే రాత్రి సుమారు 10 గంటలకు పుస్తకం సాంతంగా చదివితిని, మరి, మీ రచన చదవకుండా ఎట్లుండగలను? సన్నివేశాలూ సందర్భాలూ కొలతలూ వేరే కాని ప్రపంచం మన యిద్దరిదీ ఒక జాతిదే. మరిచిపోయిన అలౌకికానుభవాలను అలౌకికంగా జ్ఞప్తికి తెచ్చి అనుభవింపజేసినారు మీరు. మీ పుస్తకం చదవకపోతే, ఈకాలంవారి కెవరికీ ఇటువంటి ప్రపంచ మొకటి ఉండిందని ఊహించడాని కైనా వీలులేదు. కాలపరిస్థితులంతగా మారిపోయినవి. నిజంగా మన మెన్ని యుగాలు దాటినామో?

రచనలో – అచ్చులో – మీదే ఒక స్వచ్ఛందశయ్య. కృత్యాకృత్యాలలో మీకున్న భావోద్రేకా లన్నీ అన్నిచోట్లా ప్రతిఫలించింది మెరయించే శక్తి మీది. దాని వేధ శక్తినుంచీ తప్పించుకోగలిగిన చదువరి అరుదు."

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

## 5

"చాలా పల్లెలు సంచారంచేసి నిన్ననే ఇక్కడికి చేరుకున్నాను. ప్రయాణం వొకచోట స్థాయిలేక వచ్చిన ఉత్తరాలన్నీ యిక్కడే పడి ఉన్నాయి. రాగానే చూతునూ, వాటిల్లో మీ పాకెట్టుంది. ముందు అదే విప్పాను. 'భారతమా' అనుకున్నాను. సైజు కాదంటూనే వుంది. విప్పి చూతునూ, మీ 'అనుభవాలూ – జ్ఞాపకాలూను'. క్షణంలో ఈ 23 దినాల ప్రయాణబడలిక యావత్తూ యెగిరిపోయింది. ఆ ఆనందం చెప్పలేను. ముఖవికాసం చూసి ఏమిటేమిటి అంటుంది మా ఆవిడ. మీరు దగ్గిరే వున్నట్టు భావించి అమాంతంగా మిమ్మల్ని కౌగలించుకుని మీ చేతులు ముద్దాడాలనిపించింది నాకు.

నమ్మండి, నాకు ఈ రచనమీద అపరిమిత మయిన అభిమానం. వెంటనే చదవడం ప్రారంభించాను. నిన్ననే పూర్తిచేశాను. ఈమధ్య ఏ పుస్తకమూ ఇంత వేగంగా చదవలేదు. అక్కడక్కడ ఘట్టాలు మా వాళ్ళకీ వినిపించాను. మీరు రాతప్రతి చదవగా వినే వున్నా, మళ్ళీ మీరు దగ్గిరవుండి మాట్లాడుతూ వున్నట్టే ఫీలయాను అనేకచోట్ల.

ఉపక్రమణిక మాంచి పకడ్బందీగా వుంది, పరిణతి పొందిన మీవ్యక్తిత్వం ద్యోతకం చేస్తూనూ.

ప్రతీ ఆంధ్రుడూ తెల్లవారితే మననం చేసుకోతగ్గ ఆదర్శవాక్యాలు ఎన్నో వున్నాయి, గ్రంథం నిండా.

సాహిత్యతపస్సిద్ధి పొందిన మహారచయితలు మీరు, ఈనాటి సాహిత్య సాధకులకే కాదు; రాబోయే తరంవారికీ కూడా మీ 'అనుభవాలూ జ్ఞాపకాలున్నూ' ఎంతో ఒరవడిపెడుతుంది.

ఇది సాహిత్య చరిత్రలోనే అపురూపం. భారతీయభాషల్లో నేను ఎరిగినంతవరకూ ఈరకం గ్రంథం లేదు. బంగాళీలో రవీంద్రుడు రాసిన చిన్న గ్రంథం వుంది. అది యింగ్లీషులో కూడా అనువాదమయింది. అయితే, రవీంద్రుడి గ్రంథం వేరు, మనది వేరున్నూ. మనది అద్భుతం, అనన్యసామాన్యం. ఇది రాసి మీరు నేటి రచయితల్లో వొక హిమాలయపర్వతం అయిపోయారు.

అన్నిటికంటే అజరామరమైన కీర్తి తెస్తుంది మీకీ గ్రంథం. దీన్ని చదివిన ప్రతీవ్యక్తీ, ఈరోజుల్లో వచ్చిన గొప్ప గ్రంథం అని అంగీకరిస్తాడు."

**పురిపండా అప్పలస్వామి.**

## 6

"తమ గ్రంథముయొక్క నూత్నత్వము, తమరు గ్రంథాదియందే వ్రాసియున్నారు గాన నేను వ్రాయనక్కరలేదు.

తమరి వాడుక భాషను గూర్చి క్రొత్తగా నేమి వ్రాయను? ఆధునికాంధ్రమున వాడుక భాషను నిర్మించిన కొలదిమందిలో మీరొకరు.

మరి, యీ గ్రంథము కొంత యాత్మకథవంటిది.

మీచిన్ననాటి తెనుగుపల్లెటూళ్ళ జీవితము, ఆచారములు, శ్రౌతుల గృహాల శోభ, ఆ సంస్కృతి, సర్వము రమణీయముగా నున్నది.

ఆనాటి కొన్ని సంగతులు మీరు చెప్పితేగాని యీనాడు తెలియవు.

కొన్ని ప్రయోగాలు శబ్దాలు మీ పూర్వగ్రంథాలలో కూడ లేవు.

సర్వథా తమ రీనాటి యాంధ్ర వ్యావహారిక భాషా నిర్మాతృగణ ప్రథమ గణనీయులు."

**విశ్వనాథ సత్యనారాయణ.**

## 7

"అనుభవాలూ జ్ఞాపకాలూ చదివాను, ఒకసారి కాదు, పలుమార్లు. అది పూర్వపు ఆత్మకథల వంటిదని కొందరనుకుంటారు. సుతరామూ కాదని తర్వాత తెలుస్తుంది. అది మీతో నడిచిన అరువదేండ్ల ఆంధ్ర సభ్యతా చరిత్ర. సజీవ సాహిత్యసంపుటం. మీ కథలకంటే ఇదే ఎక్కువ చదువుతారేమో అని భయంగా ఉంది. అంటే మీ కథలను చిన్నబుచ్చడం కాదు. దీనిచేవ అంతటిది."

**ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.**

## 8

"తమరు దయతోఁ బంపిన "శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ-జ్ఞాపకాలూను" అను గ్రంథము నామూలాగ్రముగఁ బఠించితిని. శ్రీపాదవారి రచన లాపాతమధురములు. తెలుఁగుగడ్డయందుఁ గీర్తిప్రతిష్ఠలను గడించిన మీరచన నిరుపమానము. తమ గ్రంథమును,

నన్నయభట్టారకుడు తను రచించిన భారతమునందలి భారతమహిమను గుఱించిన ప్రస్తావనమున 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహా కావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని యైతిహాసికు లితిహాస మనియుఁ, బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని' యుద్ఘాటించిన రీతిగా నున్నదని నేను నిరాఘాటముగఁ జెప్పగలను. ఇందతిశయోక్తి యించుకంతయు లేదు. బాల్యమునుండియు మీచరిత్రము నత్యంత కుతూహలముతోఁ బఠించునట్లు సకలవిషయముల నాకళించి వ్రాసిన మీవ్రాఁత శ్లాఘింపఁ దగియున్నది. ఈ వయస్సున నావివిధ విషయములనెట్లు జ్ఞాపకముంచుకొని పుస్తకరూపమున వెలువరింపఁగల్గితిరా యని యచ్చెరు వందుచున్నాడను. ఈ రచనలోఁ గల విశేషమొక్కటి యెల్లరును దప్పక గ్రహింపఁదగినదియును, ననుభవమున నుంచుకొనఁ దగినదియుఁ గలదు. అదేమందురా? నాఁడు – నేఁడు ఆచారవ్యవహారములలోఁ గల్గిన భేదములును, విద్యార్థులయందుఁ గల్గిన మార్పులును, విద్యార్జనమునందుఁ గల యుత్సాహములును, పెద్దలు తమపిల్లలను బెంచుపద్ధతులును, పిల్లలకుఁగల యభిమానవిద్యలయందును వృత్తులయందును గలుగు నుత్సుకతయును, భాషావిషయక మగు కృషియుఁ దప్పక మనసునం దుంచుకొని యనుక్షణము నాచరణం దుంచుకొనఁ దగియున్నదనుట నిస్సంశయము.

కొన్నికొన్ని పదము లిదేశమువారి కర్థముగానివి యున్నను మొత్తము మీఁద సందర్భమున గ్రహింపఁదగియుండునవియే యని చెప్పఁగలను. పుస్తకమును బఠించుటకుఁ గ్రహించినఁ దుదివఱకుఁ బఠింపక నిలుపుట కేవారును సమ్మతింప రనుట మీరచనయందుఁగల ప్రధానగుణము. ఇఁక నేవిషయ ముందునా చూడవలయుఁ జదువవలయునను సంకల్పమే కలుగుచుండును గాని ఇఁక జాలింతము చాలులెమ్మను నూహ యెవరికినిఁ గలుగదు. ఇది నిక్కమైన మాట. వ్యావహారిక భాషా విషయమై తమరు గావించు కృషి యద్వితీయము. తమ కలము సవ్యసాచిత్వము నందియున్నదనుట కనేక నిదర్శనములు మీరచనలే! సమయానుకూలముగా నెల్లరఁ దృష్టిపఱుపఁజాలు మీరచన వాంఛనీయము. ఈ గ్రంథమున మీరు తెల్గు లోకమునకు గ్రహింపఁదగిన యంశములు మిక్కుటముగఁ దెల్పియున్నారు. ఇవి యెల్లరకుఁ బ్రీతిపాత్రములేగాని యుల్లంఘింపఁదగినవి గావు, ఆచరింపఁదగినవి యనుట నిస్సంశయము. ఒక్కొక్క విషయమును గూర్చి వివరించుచు వ్రాయఁదలఁచినఁ దమగ్రంథమంతయు యగునేమో అని తలంచుచున్నాను. ఒక్కటి మాత్రము తప్పకవ్రాయుచున్నాను. అత్యంత కుతూహలముతోఁ బఠించుచున్న నాకుఁ పుస్తకము ముగియఁగనే తర్వాతివిషయములు తెలిసికొనలేక నిరుత్సాహముగలవాఁడ నైతిని. మీమీఁద నాకుఁ గోపము వచ్చినది. ఏల మధ్యేమార్గమున వదిలితిరో? నాటక పరిశ్రమవఱకుఁ దెలిపితిరి. తర్వాత – తర్వాత ఏమియుఁ దెలియదయ్యె. ఉత్కంఠతోఁ దక్కిన విషయమెఱుఁగఁ గుతూహలపడు నా వాంఛఁ దీర్చి శాంతమతి నొనరింతురో? ఇంతకంటె నా యనుభవమును దమ గ్రంథవిషయమున వ్రాయ నశక్తుఁడ."

**జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ.**

**9**

బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన "అనుభవాలూ – జ్ఞాపకాలూను" ఆమూలచూడము చదివితిని. శాస్త్రిగారి రచన షష్టిపూర్తి తరువాత పరినిష్ఠితస్థితికి వచ్చినది. నాకు వారి రచన లన్నిటిలోను వడ్లగింజల తరువాత లెక్కింపదగిన రచన యిదియే యనిపించినది. ఈ గ్రంథము శ్రీశాస్త్రిగారి జీవితముతో ననుబంధించియున్నను, ఎన్నియో కథపట్టులతో నిండి, మొదటినుండి తుదివఱకు నుపాదేయముగ నొనర్చుచున్నది. శాస్త్రిగారి యనుభవములు వర్ధమానచంద్రులకు సత్పథ ప్రదర్శకములు, ప్రాచీనసంస్కృతికి నిదర్శనములును. వారి జ్ఞాపకములు సత్యప్రఖ్యాపనకు తార్కాణములు.

**చిలుకూరి పాపయ్యశాస్త్రి.**

## (10)

"......నేను చదివినంతవరకూ మీ పుస్తకంలో నన్ను ఆకాశానికెత్తివేశారు. వాత్సల్యం కురిపించారు. అంతపొగడ్తకు నేను తగను. మీపై, మీ రచనలపై నాకు గల అభిమానం చేతనే మీచేత ఆనాడు 'నవోదయ'లో అనుభవాలూ జ్ఞాపకాలూ వ్రాయించడానికి నేను నిమిత్తమాత్రుడనైనాను, అంతకుమించి నేను చేసిన ఘనకార్య మేదీ లేదు. అయినా, మీరు తలపెట్టిన నాలుగు సంపుటాలూ వస్తే ఆ మహానందంలో నేనూ పాల్గొంటాను."

**నీలంరాజు వేంకటశేషయ్య.**

## (11)

"మీ అనుభవాలూ జ్ఞాపకాలూ ఆమూలాగ్రంగా చదివాను. అది అనుభవజ్ఞానానికి నికషోపలంగా తోచింది. అందులో విద్యార్థిదశను వివరించు ఘట్టములు చాల ముచ్చటగా నున్నవి. ప్రతి చిన్న సన్నివేశము జ్ఞాపకముండో, లేదా జ్ఞాపకము చేసుకొనో చిత్రించినట్లే కనిపిస్తుంది గాని కృతకంగా లేదు. భాషా పాటవము, సమ్యక్పరిశీలన, వివేచనాశక్తి సమగ్రంగా పరిస్ఫుటమగుచు పాఠకులపై ప్రసరిస్తున్నాయి. మీ రచనను గురించి యింతకన్న చాల యెక్కువగా వ్రాయాలిసివుంది. కాని అనవకాశకారణంగా విరమిస్తున్నాను. ఆశీర్వదించండి."

**చిలుకూరి లక్ష్మీపతిశాస్త్రి.**

## (12)

"మీ అనుభవాలూ జ్ఞాపకాలూ చదివాను. వారాలు చేసుకొని చదువుకొన్ననాటి అనుభవాలు, విద్యార్థులమధ్య వుండే పోటీలు, వైమనస్యాలు నా మనస్సుకు హత్తుకుపోయాయి. వైదికకుటుంబాలలో తెలుగు భాషమీద వుంటూవచ్చిన నిస్సాకారం, అసహ్యం మొదలయినవి మాకు అనుభవం గాకపోయినా వాటినుంచి గతచరిత్ర తెలుసుకొనే అవకాశం ఏర్పడుతుంది. రచననుగురించి నేను చెప్పడాని కేముందీ, మీరు సిద్ధహస్తులు.... మీ రచనావిశిష్టత చదివేవారిని నిల్చోనివ్వదు. మిగిలిన భాగాలు కూడా తెనుగుదేశం త్వరలోనే చూడగలదని ఆశిస్తున్నాను."

**మహీధర రామమోహన్.**

## (13)

"....పూజ్యపాదులు బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'చిన్నకథలు' 'నాటకాలు' ఇటీవల వెల్వడిన వారి 'అనుభవాలూ – జ్ఞాపకాలూను' క్షుణ్ణంగా చదివాను. ఇతరుల గ్రంథాలూ చూచాను కాని శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారి కూర్పులో ఒక క్రొత్తదనం ఒక జాతీయతా ఒక ప్రత్యేకతా ఒక విశిష్టతా అడుగడుక్కీ గోచరిస్తాయి. వారి రచనల్లో ఉపయోగింపబడే మధురమంజులమనోజ్ఞ పదజాలం తెచ్చిపెట్టుకొన్నట్టు గాక సహజంగా సన్నివేశ సందర్భాల కనుకూలంగా సాగిపోతుంది. వారి కావ్యసృష్టిలో పాత్రలు సజీవంగా ప్రత్యక్షమౌతాయి. మోతాదు తప్పని రసోత్పత్తితో పాఠకలోకాన్ని పరవశుల్ని చేస్తాయి. ప్రతి పాత్రలోనూ కవియొక్క తాదాత్మ్యం స్ఫోరక మౌతుంది.

'పద్యంలోనే పసందు ఉం'దని అనుకునే ప్రాతకాలపు నమ్మకాలు శ్రీశాస్త్రిగారి వచనరచ నాసమీక్షలో సంస్కారం పొంది 'గద్యమే హృద్య'మని ఘంటాపథంగా చాటి చెప్పతారు. వారి

ఉపజ్ఞా, ప్రతిభా, సారస్వతరంగానికి సమీచీన సందేశాలందిస్తాయి.'

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సనాతన ధర్మాన్ని అధునాతన లోకానికి ఆదర్శ ప్రాయంగా అందజేయగల అభ్యుదయ కవితా సంప్రదాయ సంపన్నులు. వ్యుత్పన్నులు. ~~కాల~~ క్రాంతదర్శిత్వం విజ్ఞానసంస్కృతులూ మానవ సమాజాన్ని తీర్చిదిద్దే మహత్తర సాధనాలు. వారినిగన్న తెనుగుతల్లి వీరమాత. వారికి సమకాలికులమై పుట్టుట మన కొక గర్వకారణం.

సర్వజ్ఞమూర్తియైన భగవానుడు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి యింకొక షష్టిపూర్తి మహోత్సవం జరిగించుకోటానికి సదవకాశం దయచేస్తాడని నా సంపూర్ణవిశ్వాసం."

**"దీక్షితదాసు."**

## 14

"మన వీరేశలింగంగారితో అరంభమైన స్వీయచరిత్రలు – మీదానితో – నాకు తెలిసినంతవరకు 14 మాత్రమే. డాక్టరు కేసరిగారు 'నా చిన్ననాటి ముచ్చట్లు' అని పేరుపెట్టారు. అందుకనుగుణంగానే ఉన్నవి. మీ అనుభవాలూ జ్ఞాపకాలూ కూడా సార్థకనామము వహించినవి. నేను వీటన్నిటినీ సమీక్షిస్తూ ఆంధ్రప్రభలో ఒక వ్యాసం వ్రాసితిని.

మీ అనుభవాలూ జ్ఞాపకాలూ ఒక నూతనఫక్కీని నడచినవి. అవి ఆంధ్రజాతి కుత్తేజకరాలూ, ఉద్బోధకరాలూను. ఈనాడు భాష నానా సంకరమై నశించిపోతున్నది. ఇటువంటి సమయంలో మీ రచన భాషకు మహోపకారకం కాగలదని నా అభిప్రాయం.

మీ భాషలో జాతీయమైన పలుకుబడి పూర్తిగా ఉన్నదనుట సర్వజనులు అంగీకరించేదే. అది యెలా అలవడిందీ మీరు స్పష్టంగా చెప్పియున్నారు. నిజంగా, తెనుగునుడికారమూ, శ్లేషా, వ్యంగ్యవైభవమూ, సామెతలూ స్త్రీలలోనే కలవు. వారితరభాషలు నేర్వకపోవట మిందుకు కారణము. మన ముసలమ్మల నోటనుండి వచ్చే భాష ఎంతో ఎంతో సజాతీయ మైనదీ, ఎంతో సజీవ మైనదీని. ఈ సంగతి నాకున్ను అనుభవమే.

ప్రయోగ విజ్ఞానం స్త్రీలవల్లనే అలవడిందని మీరు స్పష్టపరిచారు.

మర్యాదగల భాష మీరు రాజబంధువుల ద్వారా అలవర్చుకున్నట్లు విశదంచేశారు. రాజరాజు చదివితే ఈసంగతి బాగా తెలియగలదు.

ఆత్మాభిమానమూ, అత్మగౌరవమూ, అత్మమర్యాదా మీదగ్గిర బాల్యం నుంచీ చూచాను. 'యాదృశం పురుష స్యాత్మా తాదృశం సంత్రభాషతే.' 'యథా భాషక స్తథా భాషా' భాషించువారిని బట్టి భాష ఉండును గద! ధీరోదాత్తమైన భాష మీది. వల్లభబాయి పటేల్ మాదిరి మీరు దాపరిక మన్నది ఏమీ లేకుండా కుండపగలకొట్టినట్లు చెప్పడమే మీ స్వభావము. అందుచేతనే మీకు ప్రాణమిత్రులూ బలవద్విరోధులూ కూడా ఉన్నారు.

మీదంతా కొత్తచూపు. ఈ కొత్తచూపే మీరు కౌరవపక్షం అంటే అభిమానం చూపించడానికీ, రాణీసంయుక్త పృథివీరాజును పరిణయమాడరాదని చెప్పడానికీ కారణాలైనవి. అలాగే ఇంకా పెక్కు.

మీ యీ రచన సాహిత్యప్రియులకు అధికంగా ప్రయోజనకారి కాగలదు. మీరు సాహిత్య సంబంధమైన పెక్కు మర్యాదలు తెలిపారు. మళ్ళీ మళ్ళీ చదివి తెలుసుకోవాలనుకుంటున్నాను చదువుతాను కూడా. మీది తిలక్కుగారి పద్ధతి. 'శఠం ప్రతిశాఠ్యం' కాంగ్రెస్సుక సంబంధించినంతవరకూ మినహాయిస్తే అన్నిటా నేను మీతో ఏకీభవిస్తాను.

మీ అనుభవాలవల్ల, మీకు, ఆంధ్రభాషయెడల అభిమానం అధికం అన్నట్టు కనుపిస్తున్నది ఆంధ్రులకు మీరు శిరోధార్యులు. అయితే, ఆంధ్రులెందుకు మిమ్ములను పూజించడంలేదంటే వారు అధఃపతితు లయ్యారు. వారికి దూరదృష్టి ఏనాడూ లేదు. ఆవేశం తప్ప ఆలోచన

తక్కువ. ఆంధ్రుడు ఆంధ్రుణ్ణి ఆదరించడు. ఇది కొంతవరకూ భారతీయలక్షణం కూడా. ఇది బానిసజాతిలక్షణం అనవచ్చు.

మీవంటివారి ప్రభావం వల్ల జాతి చైతన్యం పొందగలదనే ఆశిస్తున్నాను. మళ్లీ మిమ్ము ఒకసారి దర్శించాలనుకుంటున్నాను. మీ అనుభవాలూ జ్ఞాపకాలూ తక్కిన సంపుటాలున్నూ అందుకుని చదివే భాగ్యం త్వరలోనే కలుగునని ఆశిస్తున్నాను."

**గొర్రెపాటి వేంకటసుబ్బయ్య.**

## 15

'అనుభవాలూ – జ్ఞాపకాలూను' చదివి, చాలా సంతోషించినానని విన్నవించు కుంటున్నాను. తతిమ్మా భాగములు కూడా త్వరలో అచ్చువేయించండని ప్రార్థన."

**మల్లాది రామకృష్ణశాస్త్రి.**

## 16

"నమస్కారాలు, మీ 'అనుభవాలూ – జ్ఞాపకాలూను' చదివాను. చాలా శ్రద్ధాభక్తులతో చదివాను. దాదాపు ఒక బిగిని చదివి ఆ రాత్రి 2–30 గంటలకు నిద్ర కుపక్రమించాను. చాలాసేపు పుస్తకాన్నిగురించే ఆలోచిస్తూ పడుకున్నాను. వెంటనే నిద్రపట్టింది నాకు. ఇంతకుముందు, చిన్నప్పుడే, తెనుగు కథాసాహిత్యంలో ఉత్తమస్థానం అలంకరించిన మీ చిన్నకథలతో కొంత పరిచయం కలిగింది. అప్పటి అనుభూతి వేరు.

నేను ఆంగ్లంలో, కొన్ని స్వీయచరిత్రలు, జీవిత చరిత్రలు చదివాను. స్వీయ చరిత్రల పేరున ఇతరులు వ్రాసినవి కూడా చదివాను. వాటి అనుభూతి వేరు.

ఆ రోజు ఉదయం నాన్నగారు మీ పుస్తకం యిచ్చి చదవమన్నారు. పగలంతా ఏదో పనిలో ఉన్నాను. సాయంకాలం మళ్ళీ అడిగారు – 'మొదలు పెట్టావురా?' అని. ఆ రాత్రి ఎనిమిదింటికే మొదలుపెట్టాను. పూర్తి అయ్యేదాకా నాకు నిద్రనుగురించి కానీ, మరో విషయం గురించిన ఆలోచన కానీ రాలేదు. నెమ్మదిగా చదివాను. సామాన్యంగా స్వీయచరిత్రలు ఏకబిగిని చదవవలసిన అవసరం ఉండదు, కొన్ని నవలలలాగా. మరీ కొన్ని నవలలలో, ఆత్మకథలలో కొన్ని పుటలు దాటేసి కూడా చదవవచ్చు ననిపిస్తుంది. ఇక్కడ అది కుదరలేదు. కొన్నిట్లో, చెప్పే విషయం కాక, చెప్పే విధానం మనస్సు నాకట్టుతుంది. సామాన్యంగా 'ఏం చెప్పారు?' అని కంటే 'ఎట్లా చెప్పారూ?' అని చూస్తాం. మీరు చెప్పే విధానంతో పూర్వమే కొంత పరిచయం ఉన్నది. అది చాలా సరళమైనది. నూతనమైనది. మిక్కిలి ఇంపైనది కూడాను.

కాగా, దానికి తోడు చెప్పే విషయం కూడా నన్ను మరింత ఆకర్షించింది. నేను దాదాపు ఎరుగని విషయాలన్నీ చెప్పారు. నావంటివాళ్ళకి తెలియని ఎన్నో పాత సంప్రదాయాలను ప్రసంగవశాన చెప్పకుపోయారు. ఏ సంప్రదాయాలు క్రమంగా ఎలా పోయాయో చెప్పారు. నాకు బాధ కలిగింది. ఆ పేద విద్యార్థులను గురించి వ్రాసినదంతా దివ్యంగా ఉంది. మరొకరు అలా చెప్పలేరు. పుస్తకంలో ఎన్నో చిన్నకథలున్నాయి పైకి కనిపించకుండా. నీటిలో మెరుస్తూ అడుగున ఉన్న ముత్యాల లాగా కాస్తపరీక్షగా చూస్తే తెలుస్తుంది. వాటి నన్నిటినీ అతినేర్పుగా ప్రధాన కథకు బంధించారు. కావడానికి వారంతా మీకు బంధువులే అనుకోండి. కాని పాఠకుడు 'ఏదో బంధువుల ప్రశంస చేస్తున్నారులే' అని యెక్కడా అనుకోకుండా చేస్తూ, చివరకు వారంతా మాకూ బంధువులుగా కనిపించేలాగున రచన చేశారు. మరిచిపోతున్న ఎన్నో మంచి విషయాలను మాకందరికీ జ్ఞాపకం చేశారు. కొన్నిచోట్ల చక్కని విమర్శ కనిపించింది. నేటి విద్యార్థులు

మీ రచన చదివి నాటి విద్యార్థుల వినయసంపదలో కొంతభాగమైనా సంపాదించగలిగితే – వాళ్ళసంగతి అలా వుంచండి, – ప్రస్తుత పాఠశాలల్లో, కళాశాలల్లో పనిచేసే – కొన్నిచోట్ల (పాఠాలు చెప్పే) పంతుళ్ళు ఎంతో అదృష్టవంతు లవుతారు.

అసలు 'మంత్రాలంటూ ఉన్నయ్యా?' అనేదాకా వచ్చిందీ పాఠకలోకం. పత్రికలలో దానిపై ఉత్తరప్రత్యుత్తరాలు... 'రాచపుండు నయమైంది' అని వీళ్ళకు తెలియదో, కాక తెలిసి కూడా ప్రక్కవాళ్ళకు తెలియనీయకూడదనో – కొన్ని అధ్యాయాలు వెనక్కు వెళ్ళి మళ్ళీ చదువుకుంటూ వెళ్ళాను. విసుగు పుట్టలేదు. పూర్తి అయ్యాక మళ్ళా ఒకసారి చదువుదామనిపించింది. వచన రచనలో మరలా చదువుదా మనిపించేవి చాలా కొద్ది. వాటిలో మీది మొట్టమొదటిది.

అందుకు, మీకు, నా హృదయపూర్వక నమశ్శతాలు.

మిక్కిలి వినయంగా నమస్కరిస్తున్నాను."

ము ర యా

(మునిమాణిక్యం రఘురామ యాజ్ఞవల్క్య).

★ ★ ★

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ - జ్ఞాపకాలూను

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ - జ్ఞాపకాలూను

☆ ☆ ☆

## మొదటి సంపుటం

★ ★ ★

### ఉపక్రమణిక

మిత్రులు శ్రీ సీలంరాజు వేంకటశేషయ్యగారు, తమ నవోదయ కోసం నా అనుభవాలూ - జ్ఞాపకాలూ రాసి పంపమని అడిగారు.

ఒకమాటు కనపడినప్పుడడిగారు, మరోమాటు కార్డు రాశారు, చివరి కింకోమాటు కలుసుకున్నప్పుడు తప్పదంటూ తొందరకూడా చేశారు.

దీనికి సాయం, అంతక్రితం, ఆనందవాణి పత్రికలో చిన్ననాటి నాదీపావళి ముచ్చట్లు చదివివుండిన మిత్రులు, అటు వేంకటశేషయ్యగారి సంకల్పం మిక్కిలీ ప్రశంసించి, యిటు రచన సాగించమని ప్రోత్సాహపరిచారు నన్నెంతో.

"కాదు" అనలేకపోయా న్నేను.

నేనెప్పుడూ అనుకోని విషయం, ఇది.

నిజంగా, నాకిది మిక్కిలీ కొత్త ప్రేరణ.

అయినా, వారందినాలు గడిచాటప్పటికే స్థాయిభావం యేర్పడిపోయింది నాకీ విషయమై.

ఇలాంటి రచనల విలవ గుర్తించిన తెలుగు పత్రికల్లో నాకు తెలిసినంతవరకూ నవోదయ రెండోది.

అంతకిముందు, కీ.శే. శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి ప్రజామిత్ర పత్రిక బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అనుభవాలూ - జ్ఞాపకాలూ (?) కొన్ని ప్రకటించివుంది.

అయితే, తెనుగు పత్రికల్లో మరి దేనికిన్నీ యీ విషయం ఆకర్షకం కాలేకపోయింది.

నాటికి నేడు నవోదయ మాత్రమే పూనుకుం దిందుకు దృఢంగా.

ఇంగ్లీషులో యీరకం రచనలు చాలా వున్నాయిట, తెనుగులో మాత్రం అదే మొదటిది నేను చూసినంతవరకూ.

అమృతంకంటేనూ మిక్కిలీ మధురమైన శివరామశాస్త్రిగారి వచనరచన కావడంవల్ల నన్నెంతో అకర్షించిం దది.

దీంతో, కొన్నాళ్లు నేను మిక్కిలీ బాధపడ్డాను, హఠాత్తుగా ఆ రచన ఆగిపోయినందుకు.

అప్పటిమాట యేమయినా, సాహిత్య తపస్విద్ధులు శివరామశాస్త్రిగారి అరచన, మన తెనుగుజాతికి, ఇప్పుడూ యెప్పుడూ అగత్యమైనదే.

నిజానికి, మనవారికి "నా" అన్న అభిమానమే వుంటే వొక్క శివరామశాస్త్రిగారే కాదు – క్లిష్టసమస్యలు సాధించిన అనుభవాలతోనూ, అస్థిగతా లయిపోయిన వాటి జ్ఞాపకాలతోనూ పండబారిన దీర్ఘజీవితాలతో మహర్షు లయినవారింకా యెందరో వున్నారు, మన తెనుగు వారిలో.

అన్ని విద్యల్లోనూ వున్నారు.

రచనల్లో ఆరితేరినవారున్నూ వున్నా రెందరో.

తక్కిన మన పత్రికల సంపాదకులు మాత్రం వారిలో వొక్కరినీ కూడా కదిపిన పాపానపోవడం లే దిప్పటికీ.

కారణం లేశమూ గుర్తించలేకుండా వున్నా న్నేను; కాని ఉత్సాహమూ, సాహసమూ, స్తోమతూ మాత్రమే వుండడం కాదు, పత్రికలు నడపడానికి కావలసిన యోగ్యత.

తెలుసుకోగలిగితే, వేత్తలే రచించిన స్వీయ జీవితరహస్యాలు ఎంతెంతలేసి పత్రికలకున్నూ అంతస్థుకి అంతస్థూ పెంచుతాయి, విలవకి విలవా కలిగిస్తాయి.

**కాక:-** దీక్షాకంకణధారులైన కళాతపస్వుల సాధకావస్థలూ, ఉత్తీర్ణులైన కళావేత్తల ప్రతిభాప్రాగల్భ్యాలూ, వర్ధమానచంద్రులైన తమ జాతియువకులకు పరిచయం చెయ్యవలసిన బాధ్యత తప్పించుకోడం, పత్రికల సంపాదకులకు, శిక్షార్హమైన నేరం.

**కించ:-** తెనుగు జాతి కొత్తకొత్త వీధుల్లో ముందంజ వెయ్యవలసిన యుగసంధి యిది.

పత్రికా సంపాదకులు మాత్రమే యిందుకు సరి అయిన మార్గం నిర్దేశించగలరు.

ఈ విశేషం గుర్తించలేనివారు, సాహసించి యీపదవి కెగబాకడం జాతికి శ్రేయస్కరం కాదు.

**ఏతావతా:-** నాజీవితరహస్యాలు కొన్ని ప్రకటించడం వల్ల, తమ నవోదయ అంతస్థు ఏమాత్రం పెరుగుతుందో, తమ పూని క్కూడా యేమాత్రం సఫలం అవుతుందో అది మిత్రులు వేంకటశేషయ్యగారే చూసుకుంటారు.

ఇక వున్నదల్లా యేమి టంటే?

ఈ సంకల్పమూ, యీ పూనికా జర్నలిజంలో వారికుండుకున్న పరిజ్ఞానానికి పతాకలు.

జాతి అభ్యున్నతి విషయమై వారికిగల ఆవేదనకు సాక్షీభూతాలున్నూ.

ఏమంటే?

గతం పరిశోధించుకునీ, వర్తమానం సమన్వయించుకునీ, భవిష్యత్తు నిర్ధారణగా రూపించుకోడమూ, అందుకు తగ్గ వొక ప్రణాళిక వేసుకుని జాతిని ఆమార్గాన నడిపించడమూ – ఇవీ సంపాదకుని ముఖ్యవిధులు.

రాగద్వేషాలూ, ఇష్టానిష్టాలూ, ఈర్ష్యాసూయలూ, స్వపరభేదభావాలూ – ఇవి సంపాదకులకు పతన హేతువులున్నూ.

పైపెచ్చు, – తమ ధర్మం నిర్వర్తించుకోవాలనుకోగలిగిన సంపాదకులకు వేత్తల ననువర్తించడమే రాజమార్గం కాని శుష్క – పాక్షిక – రాజకీయాల్లో దిగబడి ప్రజల క్షేమం అప్రధానం చేసుకున్న అపరిణతబుద్ధుల కాళ్లు పట్టుకుని యీడిగిలపడ్డం కాదు.

ఎంచేతనంటే?

రాజకీయాలకు సత్యం లేదు, ధర్మమూ లేదు.

స్వార్థం తప్ప మరేమీ కూడా లేదు.

అధికారమే వాటికి ప్రాప్యం.

ఆసుడిగుండంలో పడిపోయినవారికి చెవులు వినలేవు, కళ్ళు చూడాలేవు.

వారి మనస్సుకి నిగ్రహశక్తి వుండదు, బుద్ధికి గ్రహణపరాయణతా వుండదు.

గుండెలుండనే వుండవు వారికి.

వారి అడుగులకు మడుగు లొగ్గేవారి సంగతి యిక చెప్పడానికేమి వుందీ?

తత్వం పరిశీలించుకోగలిగితే రాజకీయాలు, కలసివున్న – అథవా కలిసివుండ దగినవారిని విడదీస్తాయి.

రాజకీయాల్లో దిగితే అతీతు లయినవారు గాని ఈ అపాయం తప్పించుకోలేరు.

ఏమయినా, పత్రికాసంపాదకుల అంతస్థు, రాజకీయాల్లో పనిచేసేవారి అంతస్థు కెంతో పైది.

ఈ రహస్యం తెలియనిచోట పత్రికాసంపాదకత్వానికి లేశమూ అర్హత లేదు.

ఈ అర్హత లేనిచేతుల్లోపడ్డ పత్రికలు జాతీయతనూ రూపొందించలేవు.

## 1

ఆహారనిద్రాభయాదులు మనుష్యమాత్రుల కందరికీ సమానాలే; గాని వారిలో కొందరికి మాత్రమే నిశితదృక్కూ, విశిష్టశక్తీ వుంటాయి, నిగూఢంగా.

అవుండినవారిలో నయినా కొందరే ఆసంగతి గుర్తించుకోగలుగుతారు.

అలా గుర్తించుకోగలిగినవారిలోనున్నూ మళ్ళీ కొందరే వినియోగపరుచుకోడానికి ప్రయత్నిస్తారు.

ఆప్రయత్నంలో విజయం పొందేవారున్నూ కొందరే అయితే, ఆ పూనిక వుండడమున్నూ కొంత విశేషమే.

ఏమంటే, తామెత్తిన మనుష్యజన్మ ఆంతర్యం అలా ప్రయత్నించేవారికే అవగాహన అవుతుంది, మరి.

అలాంటివారే జీవిత పరమావధిగా యేదో వొక విద్యకు లేదా – వొక కళకు పరిణతి కలిగించడానికి పూనుకుంటారు.

అదొక తపస్సమాధి ఆ వ్యక్తికి.

అది వేత్తృతకు నికషమున్నూ.

అయితే, ఆ పూనికలో ఆ వ్యక్తి ప్రవృత్తి, కొండ లెక్కుతుంది, లోయల్లో పడుతుంది.

వెనక్కి మళ్ళుతుంది, ముందుకి దుముకుతుంది.

గిరగిర తిరుగుతుంది, స్తంభించిపోతుంది.

అయినా, బంతివంటిది కాని, మట్టిముద్దవంటిది కాదది.

తన లక్ష్యం కోసం – తన ప్రాప్యం కోసం అది ప్రవర్తమానం అవుతూనే వుంటుంది.

స్వప్నావస్థా, సుషుప్త్యవస్థా కూడా దానికి జాగ్రత్పర్యాయాలే.

అదొక యౌగిక శక్తి.

చిత్తవృత్తినిరోధం ఆ వ్యక్తికి సాధనం గాని సాధ్యం కాదు.

ఆ ప్రయత్నం పోనుపోను మిక్కిలీ బలిసి, చివరికి ఆ వ్యక్తికి జీవన్మరణ సమస్య అయి కూచుంటుం దది.

దాంతో, అతని దృక్పథమూ, అభిరుచులూ, జీవన సరణీ విలక్షణంగా తయారవుతాయి.

లోకసామాన్య ధర్మాల కతీతుడయిపోతా డతను.

గతానుగతికంగా సంసారసాగరంలో పడి తన్నుకునేవారికి ఆవ్యక్తి అంతస్థు లేశమూ అర్థంకాదు.

అందువల్ల, అది, స్వధర్మాతిక్రమణ మనీ, మతిభ్రమ అనీ, ఆత్మహత్యా ప్రయత్న మనీ, గుసగుసలుపోతారు, దృఢంగా తీర్మానించుకుని.

అతనిమీద జాలిపడతారు, తామేమో మహా దయార్ద్రహృదయు లైనట్టు.

మెల్లిమెల్లిగా మందలిస్తారు.

తమ ప్రాకృతదృష్టి కందిన మంచిమార్గాన మళ్ళించడానికి పూనుకుంటారు.

కూకలేస్తారు.

కసురుకుంటారు.

శాపాలు పెడతారు. తామేమో దేవత లయినట్టూ ఆకాశంనుంచి వూడిపడ్డట్టూను.

హేళన చేస్తారు.

తాటాకులు కడతారు.

దుష్ప్రచారం ప్రారంభిస్తారు.

రాళ్లు రువ్వుతారు.

అడుగడుక్కీ అడ్డుతగులుతారు.

ఏమిటేమిటో చేస్తారు.

ఏమయినా చేస్తారు.

అయినా చలించ డావ్యక్తి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

తన ప్రాప్యం మరచిపోడు.
తన లక్ష్యం మార్చుకోడు.
తన దృక్పథం మళ్ళించుకోడు.
తన ప్రణాళిక చింపేసుకోడు.
తన సాధన విరమించుకోడు.
తన దీక్ష విడిచిపెట్టుకోడు.
తన యేకాగ్రత చెరుచుకోడు.

స్థానభ్రంశం కలగనీ, నిద్రాహారాలు కరువయిపోనీ, ప్రాణభయమే తటస్థించనీ అడుగు మాత్రం ముందుకే వేస్తాడు, నిశ్చలంగా.

చివరికి జయమా అపజయమా అంటే అది వేరే సంగతి; కాని సంకల్పమూ, నిశ్చయమూ, ఆశా, ప్రతీక్షా, తపనా, ప్రయత్నమూ, ధైర్యమూ, సాహసమూ, విశ్వాసమూ, సహనమూ, దీక్షా, యేకాగ్రతా – ఇవి అతని ప్రతీ అడుగులోనూ ప్రతీ కదలికలోనూ అచ్చుకట్టేవుంటాయి.

ఊపివ్యాపిన్నీ వురికిస్తాయి, ముందుకి.

అదిగో, ఆ వికారాల విసురులే అనుభవాలు.

ఆ అనుభవాల నీడలే జ్ఞాపకాలు.

చర్మచక్షువుల కవి బులబులాగ్గా కనపడతాయి; కాని మిక్కిలీ జటిలా లయి వుంటా యవి.

"ఏముందీ వీటిలో?" అనిపిస్తాయి; కాని తరిచినకొద్దీ ప్రౌఢిమ వహిస్తాయి.

అవి నిత్యసత్యాలు, కట్టుకథల్లా మాత్రం వుంటాయి.

అవి బాధాప్లావితాలు; కాని రసబంధురా లయివుంటాయి.

కాగా:– అవి చదవడం వొక పూర్వపుణ్యం

అవి తరచడం బ్రహ్మవిద్యోపాసన.

అవి మననం చెయ్యడం మంత్ర పునశ్చరణ.

ప్రపంచ:– నలుగురిలోనూ తల తిప్పుకునే మనిషి కనపడితే "ఈ మనిషి యీ స్థితి కెలా వచ్చాడూ?" అన్న జిజ్ఞాస కలుగుతుంది కొందరి కయినా, అప్రయత్నంగా.

వారి సంఖ్య తక్కువే కావచ్చు; కాని చూపు మాత్రం బహూ నిశితం అయి వుంటుంది.

ఆజిజ్ఞాస, ఆవిశిష్టత యేమిటో తెలుసుకోవాలన్న ఆవేదనకు బాహ్యరూపం.

అయితే, వారిలో చాలామంది కది జిజ్ఞాసగా మాత్రమే వుండిపోవచ్చు.

కొంతమంది కయినా తీరేదాకా అణగారిపోనిదిన్నీ కావచ్చు.

ఏమయినా, వారిలో వొక్కణ్ణయినా అది నూత్నపథానికి మళ్ళించి, ఉన్నతోన్నతశిఖరా లెక్కించకపోదు.

ఇక విశేషం యేమిటంటే?

అలాగ ఉన్నతోన్నత శిఖరా లధిరోహించడంలో, అ జిజ్ఞాసువుకి, ఆ విశిష్ట వ్యక్తి అనుభవాలూ జ్ఞాపకాలూ వినోదానికి వినోదమూ పుట్టిస్తాయి.

లోకజ్ఞానానికి లోకజ్ఞానమూ కలిగిస్తాయి.

ఉత్సాహానికి ఉత్సాహమూ రెట్టిస్తాయి.

బుద్ధికి మారాకు వేసి, ప్రతిభకు నవనవోన్మేషం అలవర్చి, చూపులకు వెలుగు తోపించి, నరాలకు బింకం పుట్టించి, ఆ జిజ్ఞాసువు నొక్కొక్క మెట్టే యెక్కించుకునిన్నీ పోతాయి, చెయ్యిపట్టుకుని.

## 2

"కావచ్చు – అయితే, అంత విశిష్టత వుందనే వేంకట శేషయ్యగారు నీ అనుభవాలూ – జ్ఞాపకాలూ ప్రకటించడానికి పూనుకున్నారా?" అంటే, యేమో, అది వారు చెప్పవలసిన సంగతి.

నానమ్మకం యేమిటంటే?

ఇంగ్లీషు చదవడంవల్ల మాత్రమే వేంకట శేషయ్యగారికి జర్నలిజంలో రుచిపుట్టి వుండలేదు.

పత్రికానిర్వహణానుభవమున్నూ వారికి నవోదయతోనే ప్రారంభం కాలేదు.

అదృష్టంవల్ల, ప్రతిభకు సాయం మద్రాసులో వారికి నివాసం తటస్థపడ్డది.

ఆ మద్రాసు నవనాగరికత కొక విశిష్టస్థానం.

అక్కడి భౌతికదృష్టికి భారతదేశంలో ప్రత్యేకత వుంది.

అక్కడి లోకజ్ఞానం బాగా పరిణత మైనది.

అక్కడి సాహచర్యం కొత్తదారులు తొక్కించగలది.

దీనికి సాయం, ఆ మద్రాసులో చిన్నా పెద్దా – సాధారణాలూ అసాధారణాలూ యెన్నో పత్రికలు.

అవిన్నీ రకరకాలు.

భిన్నజాతులు నిర్వహించే పత్రికలు – భిన్నదృక్పథాలు అలవరిచే పత్రికలు – భిన్నలక్ష్యాలు సాధించే పత్రికలు – భిన్నప్రాప్యాలు ఆశించే పత్రికలు.

ఊళ్ళవూళ్ళ నుంచీ, దేశదేశాలనుంచీ, ఖండఖండాలనుంచీ కూడా కురిసిపోయే పత్రికలున్నూ యెన్నో అక్కడ.

ఇది చాలదన్నట్టు ఆంధ్రజాతికి జీవనజ్యోతిఅయిన ఆంధ్రపత్రికలో వారికి పూచీగల పదవి.

అన్నిటికీ శిఖరాయమానంగా కళాదృష్టి.

నాటకాలతో – ఫిలిములతో – సాహిత్యసభలతో – సాహిత్య నిర్మాతలతో సాహచర్యమూ, సహజీవనమూ, నిర్వహణప్రసక్తిన్నీ.

చాలు, వేంకటశేషయ్యగారి దృష్టి కుశాగ్రసూక్ష్మం కావడానికీ, చూపు నిశితం కావడానికీ, ప్రతిభ నవనవోన్మిషితం కావడానికీ, ఆశయాలు మహోన్నతాలు కావడానికీ, ఆరంభాలు నిస్స్వార్థాలు కావడానికీ, ముఖ్యంగా జర్నలిజం చక్కగా అవగాహన అయివుండడానికీ వేరే సాధన సామగ్రి అక్కరలేదు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

మరి, అలాంటివారు, సాధకుల జీవితరహస్యా లేకోణాల నుంచి పరిశీలిస్తారో నాకేమి తెలుస్తుందీ?

అంచేత, నా అనుభవాలూ – జ్ఞాపకాలూ కావాలనడంలో వారి వుద్దేశా లేమిటో నేనేమి చెప్పగలనూ?

అయితే, సాహసించి నేనిందుకు పూనుకోడానికి మాత్రం బలీయమైనవే మూడు కారణా లున్నాయి.

ఒకటి:– కావా లని కోరి, వేంకటశేషయ్యగారు, రాసేదాకా తోచనివ్వకపోవడం.

రెండు:– నేనూ వొక సాధకుణ్ణే అని నాకున్నూ దృఢమైన ఆత్మప్రత్యయం వుండడం.

మూడు:– ఆంధ్రవాఙ్మయానికి సంబంధించిన సరికొత్త శాఖల్లో వొకటి నాపేరుమీదుగా రూపొంది బలపడే అదృష్టం నాకు పట్టబోతున్నప్పుడు కాదని నేనది జారవిడుచుకో లేకపోడం.

ఈ సందర్భంలో నాకో తృప్తి మాత్రం వుందెంతో.

ఆంధ్ర భాషలో చెత్తవాఙ్మయం చాలా వస్తోందిప్పుడు.

దానివల్ల జాతీయత చాలా దెబ్బతింటోంది.

అలాంటి దిక ముందయినా రాకుండా దేశీయులు ప్రతిఘటించా లంటే వారి దోషాగ్నికి నా యీ రచన కూడా వొక సమిధ అవుతుంది.

కనక, నాకిది తలకు మించిన పని అయితే కావచ్చు; కాని యీ కారణంవల్ల వారి ఆజ్ఞ కాదనడానికి మాత్రం నేను సాహసించలేక పోయాను.

## 3

వేదమూ, శ్రౌతమూ, స్మార్తమూ, జ్యోతిశ్శాస్త్రమూ, మంత్రశాస్త్రమూ, వీటి సమ్యగ్బోధకు సాహిత్యవిద్యా–మాకులవిద్య లివి.

యజ్ఞయాగాది వైదిక కర్మానుష్ఠానం అనూచానసంపత్తిగా వుండిన వంశం మాది.

అందులోనూ, మళ్ళీ మాకుటుంబంలో ప్రతీతరంవారూ పురుషులందరూ వైదికవిద్య లన్నీ యితిశ్రీగా నేర్చినవారూ క్షుణ్ణంగా తెలిసినవారూ యజ్ఞాలూ యాగాలూ చేసినవారున్నూ.

ఈలక్షణా లన్నీ పూర్తిగా పట్టినవారు మా నాయనగారు.

వారు, నాకు, స్మార్తం అంతా చెప్పారు.

శ్రౌతంలో ఔద్గాత్రమూ దర్శపూర్ణమాసాలూ చెప్పారు.

సాహిత్యం యేకొంచెమో అలవర్చారు.

పంచాంగాలు చెయ్యడమూ, జాతకాలు రాయడమూ, ముహూర్తాలు స్థిరపరచడమూ, ప్రశ్న చెప్పడమూ నేర్పారు.

పరాయతం చెప్పించారు.

ఒక్క పాదుకాంతదీక్ష యివ్వడానికి మాత్రమే "మరి కొన్నాళ్ళు పోవా" లన్నారు.

ఆ మార్గం విడిచిపెట్టకుండా వుంటే ఆ విద్యల్లో నేను బాగా ముందుకి వెళ్ళివుందును, గర్వం అనుకోవ ద్దిది.

మరి, నా ప్రస్తుత స్థితి?

నామట్టుకి నాకు, వొక్కొక్కమాటు, ఆగి వెనక్కి తిరిగి చూసుకుంటే శరీరం జలదరిస్తుంది.

ఏమంటే?

ఆ విద్యలన్నీ నేను విడిచిపెట్టేశాను.

ప్రయత్న పూర్వకంగా – కారణం తరవాత చెబుతాను – నిరసనభావంతో విడిచిపెట్టేశాను.

కొత్తదారి తొక్కాను.

చాలా ముందుకిన్నీ వెళ్ళిపోయాను.

అయినా "అహ మస్మి" అంటూ నేనిప్పుడు నలుగురిలోనూ తలయెత్తుకునే తిరగ్గలుగుతున్నాను.

మేరలేని ఆత్మానందమూ అనుభవించగలుగుతున్నాను.

"ఎంచేతా?" అంటే, తెనుగుభాషలో వొక రచయితను కాగలిగినందుకు.

తెనుగుభాషలో – మధురాతిమధురమైన తెనుగుభాషలో – నా జాతివాళ్లు చిన్నచూపే చూస్తూ వుండినా, మాధుర్యం గుర్తించి శక్తిన్నీ అవగాహన చేసుకుని పాశ్చాత్యులు కూడా ముక్తకంఠంతో కీర్తించిన నా మాతృభాషలో, కలంపట్టి నాలుగుబంతులు రాసే అదృష్టం పట్టినందుకున్నూ.

అయితే, నాకు శిక్షణ వొకదాల్లోనూ పరిణతి మరో దాల్లోనూ అయింది.

"మరి యెలా తటస్థించిందీ యిదీ?" అంటే, అదొక పేద్దగాథ.

కేవలమూ గాథ మాత్రమే కాదు, సంకులసమరం.

సంకులసమరం మాత్రమున్నూ కాదు, కల్లోలం.

సహజంగా నాభావయంత్రం యెంతదృఢమైన దయినా, అది యెన్నిమాట్లాగిపోయిందో, ఎన్నిమాట్లు తిరుగుబాటు చేసిందో, యెన్ని మరమ్మతులకు పాల్పడిందో, యెన్ని కొత్త భాగాలు చేర్చి పునర్నిర్మాణం చెయ్యబడ్డదో, తత్ఫలితంగా యెలాంటి వడిదుడుకుల్లోనూ కూడా యెలా నిలవతొక్కుకోగలిగిందో – అదొక భయంకరవిప్లవం.

అచ్చంగా ప్రళయమున్నూ.

కాగా; – నాఅనుభవాలూ – జ్ఞాపకాలూ రాయడం అంటే ఆ గొడవ అంతా విడమర్చి చెప్పడం అన్నమాట.

అయితే, యిందుకు పూనుకోడంలో, స్వీయచరిత్ర రచించు కోవాలన్న వుద్దేశం లేశమూ లేదు నాకు.

ఇది చరిత్రపద్ధతిన్నీ కాదు.

కాని, చరిత్రలు రచించేవారికి మాత్రం యిలాంటి విషయాలు మంచి సాధనసామగ్రి అవుతాయి – తేదీలు చేర్చుకునీ, పౌర్వాపర్యాలు సరిదిద్దుకునీ, కొంత సొంత అభిరుచి పూతపెట్టుకోగలిగితే.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఇంతకీ, -

చరిత్ర కానప్పుడు సంతతసాహచర్యంతో బాగా పరిశీలించి వొకరి అనుభవాలూ - జ్ఞాపకాలూ మరొకరు రాసినా రాయవచ్చు.

కాని, మన ఆంధ్రుల్లో యిప్పట్లో యిది అసాధ్యం.

ఏమంటే?

మనవారి ప్రతిభాప్రాగల్భ్యాలు అర్థంచేసుకోగలమే; గాని మనం అంగీకరించలేము.

మనలోనూ సమర్థు లున్నారని అనుకోగలమే గాని ఆమాట పైకి చెప్పలేము.

నిరసించగలమే గాని - కనీసం తూష్ణీంభావంగా నైనా వుండిపోగలమే గాని మనవారిని ఆరాధించుకోలేము.

ఎంచేతనంటే?

"నేను" అన్న అహంకారమే గాని "నాది" అన్న మమకారం పుట్టలేదు మన కింకా.

అయినా, తాత్కాలికావేశంతో యెవ రయినా అలాంటి పనికి పూనుకోడమే తటస్థించినా, అవి యెవరికి వారే రాసుకున్నంత నిక్కచ్చిగానూ వుండవు, సమగ్రంగానూ వుండవు.

దీనికి బలమైనదే వుంది, ప్రతిబంధకం వొకటి.

అనుభవాలలో కాయికాలకంటే మానసికా లుత్తమాలు.

అవి యెక్కువ కూడానూ.

మానసికాలకంటే హార్దికా లుత్తమోత్తమాలు.

అవే ప్రధాన మైనవి.

కనక, వొకరి కవి బోధపరచడంకంటే రాసెయ్యడమే సుళువూ, మంచిదిన్నీ.

అంచేతనే నా యీ పూనిక.

నా నమ్మకం మాత్రం వొకటుంది.

నా చిన్నకథలూ, నా నవలలూ, నా నాటకాలూ, నా రూపికలూ, నా వ్యాఖ్యానాలూ, యెవరి నయినా ఆకర్షిస్తూ వుంటే నా అనుభవాలూ - జ్ఞాపకాలూ కూడా వారి నాకర్షిస్తాయి.

ఈ విషయమై అత్యాశా నిరాశా కూడా లేవు నాకు.

కాక:- ఏ రచనైనా జిజ్ఞాసువుల చేతబెట్టడమో మానడమో అది కాలం పని.

పోతే:- మన తెనుగుజాతి, యివాళ, కొత్తదృక్పథంతో ముందుకి సాగుతోంది.

దానికి గల కారణాలు తెలుసుకోవా లంటే, ఆ ప్రగతికి ఆలంబనం అయినవారి జీవితరహస్యాలు పరిశీలించగలిగితేనే సాధ్యపడుతుంది.

దేశంలో నడుస్తూ వుండిన వృత్తం చూస్తే చాలదా అంటే, చాలదనే చెప్పాలి.

ఎంచేతనంటే?

అప్పుడు, వూహాల కెక్కువ ప్రాధాన్యం యేర్పడుతుంది.

దానివల్ల, సత్యం, వొక్కొక్కప్పుడు దూరందూరం అయిపోతుంది.

కాకపోయినా, ఉన్న సాధనసామగ్రీ అవకాశమూ వినియోగించుకోకపోవడం అవివేకం అనిపించుకుంటుంది.

ఇది చరిత్ర కాదన్నాను.

అయినా, చారిత్రికాంశాలు మాత్రం టూకీగా చెప్పవలసేవుంది, ఇక్కడ కొన్ని.

అది ఆత్మోత్కర్షకు గాదు, నా జీవితసరణి సుబోధం కావడానికి మాత్రమే.

మాది కౌశికసగోత్రం.

వైశ్వామిత్ర – అఘమర్షణ – కౌశిక – త్ర్యార్షేయప్రవరాన్విత కౌశికసగోత్రం.
ఆపస్తంబ సూత్రం.

అంటే, విశ్వామిత్రుని కోవ మాది.

ఇంకా యెంతమందిదో కౌశికసగోత్రమూ విశ్వామిత్ర గణమూనూ కాని వాటిని పురస్కరించుకుని మిత్రు లయిన వారు ఛలోక్తు లాడినా అసహనపరు లయినవారు వక్రోక్తులాడినా వొక్క మా శ్రీపాదవారినిగురించే.

అది మా ఆదిపురుషులు సాధించిన విశిష్టత.

ఇది సర్వజనవిదితమైన విషయం, నేను చెప్పాను కనక ఆత్మస్తుతి అనుకోనక్కరలేదు.

నాకు తెలిసినంతవరకూ శ్రీపాదవారి దందరిదీ యిదేకోవ.

అనన్యసాధ్య మైన శ్రీవిద్యోపాసన కారణంగా వచ్చిన "బిరుద" నామం "శ్రీపాద" అన్న మా యింటిపేరు.

దేశంలో యెక్కడెక్కడ వుండిన శ్రీపాదవారికీ కూడా పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు సమీపాన వుండుకున్న "గుమ్మలూరు" అనే గ్రామం మూలపీఠం.

పొరుగూళ్లు వెళ్ళిపోయినవారు వెళ్ళిపోగా, యిప్పటికీ అక్కడ శ్రీపాదవారి కుటుంబాలు కొన్ని వుండనేవున్నాయి.

జగత్ప్రసిద్ధు లైన తార్కికులు శ్రీపాద రామశాస్త్రి గారిదీ, మొన్నటిదాకా పిఠాపురం సంస్థాన తర్కపండితులుగా వుండిన శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారిదీ అదే స్వగ్రామం.

వారిద్దరూ సోదరులున్నూ.

నరసాపురంలో అడ్వకేటు, బహుశ్రుతులు, బహుద్రష్టలున్నూ అయిన శ్రీపాద లక్ష్మీనరసింహంగారి స్వగ్రామం కూడా ఆ గుమ్మలూరే!

అనేక కారణాలవల్ల యెందరో శ్రీపాద వంశీయులు అక్కణ్ణుంచి యెక్కడెక్కడికో వెళ్ళి వొక్కొక్క కోవకు మూలపురుషు లైనారు.

అలా వెళ్ళినవారిలో పేరయ్యగా రొకరు.

వారు గుమ్మలూరు విడిచి, రాజమహేంద్రవరం తాలూకాలో గోదావరి వొడ్డునే వున్న "మునికొడవలి" అనే గ్రామంలో ప్రవేశించారు.

వారే మా కోవకి మూలపురుషులు.

"మునికొడవలి" అన్నది "మునికూడలి" అన్నమాట కపభ్రంశ రూపం.

ఈ మునికొడవలికి సంస్కృత (వైదిక) గ్రంథాల్లో వాడుక అయివుండిన పేరు "మునికూటాలయం" అని.

"బొప్పనభట్టీయం" అన్న పేరుతో ఆపస్తంబగృహ్య సూత్రానికి భాష్యం రచించిన బొప్పనభట్టు ఈ మునికొడవలి నివాసే.

ఇది మునీశ్వరులు తపస్సు చేసుకుంటూ వుండిన ఆశ్రమ భూమి కావడంవల్ల పరమపవిత్రమైన యీ గడ్డమీద యజ్ఞం చెయ్యడానికే పేరయ్యగా రక్కడికి వచ్చివుండే వారని పారంపరిక మైన ఉదంతంగా మా నాయనగారు చెబుతూ వుండేవారు.

అయితే, మా వంశవృక్షంలో వారిపేరు పేరయ్య గారు అని మాత్రమే వుంది.

వారి పేరుగా పేరయ్య సోమయాజులు మాత్రం కొందరుండేవారు మా పూర్వుల్లో.

ఆ పేరయ్యగారి కోవలో – మళ్ళీ మా పితృపితామహక్రమంలో నే నెనిమిదో తరంవాణ్ణి.

1. పేరయ్యగారు.
2. అక్కుసోమయాజులుగారు.
3. ఉమామహేశ్వరసోమయాజులుగారు.
4. అక్కుసోమయాజులుగారు.
5. సోమలింగసోమయాజులుగారు.
6. శివరామసిద్ధాంతిదీక్షితులుగారు.
7. లక్ష్మీపతిసోమయాజులుగారు.
8. సుబ్రహ్మణ్యశాస్త్రి.

మా పూర్వుల్లో, మా పితామహులు శివరామసిద్ధాంతి దీక్షితులుగా రొక్కరు మాత్రమే యజ్ఞం చెయ్యడం పడలేదు.

సన్యసించా లనిన్నీ అనుకున్నారుట వారు, అదీ పడలేదు.

వారు ఆధానం చేసిన కొన్నాళ్ళకి, యజ్ఞసంకల్పంలో వుండగా మా నాయనమ్మగా రకాలమరణం పొందారు.

అది వయస్సు మళ్లాక సంభవించడంవల్లా, మళ్ళీ పెళ్ళి చేసుకోడాని కిష్టపడలేకా, అపత్నీకులు కావడంవల్ల అధికారం పోయీ, – ఈ కారణాలవల్లనే వారు యజ్ఞం చెయ్యలేకపోయారు.

తరవాత మా నాయనగారు చేశారు మళ్ళీ యజ్ఞం.

చేశా రంటే, పట్టుపట్టి నేను చేయించాను.

మా నాయనగారు, వేదం అశీతిద్వయమూ, శ్రౌతం కాండత్రయమూ, జ్యోతిషం స్కంధత్రయమూ క్షుణ్ణంగా అభ్యసించినవారు.

స్మార్తంలో రెండో ఆపస్తంబులు.

ధర్మశాస్త్రంలో పారంగతులు.

మంత్రశాస్త్రంలో పాదుకాంతదీక్షాపరులు.

అలాంటి వంశంలో పుట్టి, అన్ని వైదికవిద్య లతిశ్రీగా నేర్చివుండి, స్వధర్మ నిష్ఠులున్నూ అయివుండినవారు యజ్ఞం చెయ్యకపోడం పెద్దలోటుగా కనపడింది నాకు.

పేసపాటి సోమనాథశాస్త్రిగారూ, వారిసోదరులు గౌరు సోమయాజులుగారూ, చావలి మహాదేవశాస్త్రిగారూ మొదలైన జగత్ప్రసిద్ధశ్రౌతులూ, మా బంధుకోటికి చెందిన విద్వాంసులున్నూ కూడా యెందరో యజ్ఞం చెయ్యవలసిందని మా నాయనగారిని ప్రోత్సహిస్తూ వుండడమున్నూ నే నెరుగుదును.

దీనికి సాయం, లక్ష్మీపతిసోమయాజులు అని మా నాయనగారికీ, మహాలక్ష్మీ సోవిదేవి అని మా అమ్మగారికీ పుట్టుపేళ్లు.

ఇంచేత కూడా అంతపట్టుపట్టి నే నది చేయించాను.

అప్పటికి నేను మహేంద్రవాడ గ్రామంలో ప్రవేశించి నాలుగేళ్ళయింది.

కాగా, నా జన్మస్థలం అయిన పొలమూరిలోనే జరగవలసిన ఆ యజ్ఞం మహేంద్రవాడలో జరిగింది.

సంకల్పం చెయ్యడానికే మా నాయనగారు కొంచెం తటపటాయించారు గాని చేసినవెంటనే నాలుగు వేలదాకా ద్రవ్యం అతి సులువుగా సమకూరింది.

దాంతో, సర్వతంత్రస్వతంత్రులైన ఋత్విక్కులతోనూ, ద్విగుణ దక్షిణలతోనూ, భరద్వాజవిందులతోనూ దేవేంద్ర వైభవంగా జరిగిందా యజ్ఞం.

అనేకయజ్ఞాలు చూసీ, చేయించిన్నీ వుండిన శ్రౌతులందరూ ఆ వైభవం చూసి, చకితులయినారు.

అదిమొదలు పదచలనం మానేసి, మానాయనగారు నిత్యాగ్నిహోత్రాలు సాగించుకున్నారు గాని జ్యేష్ఠశుద్ధంలో యజ్ఞం జరిగింది. ఆశ్వయుజశుద్ధంలో – మహానవమినాడు మా అమ్మగారు పరమపదించారు.

మాతృవియోగమే దుర్భరం.

దీనికి సాయం, నేనే చేయించిన యజ్ఞం పూర్తయిన నాలుగు మాసాలకే అది సంభవించడం.

చాలా బాధపడ్డాను, నే నందుకు.

ఎవరి తల్లి వారికి దేవతా సమానమే; సందేహం లేదు.

అయితే, నా విషయంలో మా అమ్మగారు మరో మెట్టుపైనే.

మా నాయనగారి ఆగ్రహానికి తాము గురి అవుతూవుండిన్నీ యెన్నో సందర్భాల్లో, అనేక విధాల నా భిన్నరుచికి దోహదం చేసి, కల్లోలసమయంలో కూడా నా కవితాసాధనకు బలం చేకూర్చినవారు మా అమ్మగారు.

ముఖ్యంగా నా సీతను నాకు సంపాదించిపెట్టినవారు మా అమ్మగారు.

మా అన్నదమ్ములం వేరుపడ్డ తరవాత, రెక్కలురాని నాకు తమ నోటి దగ్గిర అన్నం పంచియివ్వడంలో మా నాయనగారితో సమంగా – కొన్ని సందర్భాల్లో యెక్కువగాకూడా ఔదార్యం కనబరిచినవారు మా అమ్మగారు.

## 5

మా నాయనమ్మగారి లాగే తామూ పసుపుకుంకుమలతో వెళ్ళిపోవడమే తథ్యం అంటూ వుండేవారు మా అమ్మగారు.

అది యజ్ఞం కూడా చేసుకున్నాక సంభవించింది; మిక్కిలీ ధన్యురాలే ఆమె, మేమే దురదృష్టవంతులం.

పుట్టింట మహారాజు కూతురన్నట్టు సుఖపడ్డా రామె.

అత్తింటా లోటువడి యెరగ రెప్పుడూ.

మా నాయనగారు దోసిళ్ళకొద్దీ డబ్బు సంపాదించి తెచ్చేవారు, నిశ్చింతగానూ నిపుణంగానూ మా అమ్మగారు సంసారం నిర్వహించేవారు.

అయితే, మునికోడవలి గ్రామంలో వుండినంతకాలమూ మా అమ్మగారు మా నాయనగారూ కూడా సంవత్సరాని కొక్కమాసం రోజులు చాలా బాధపడేవారు.

దాని క్కారణం గోదావరి వరదలు.

మునికొడవలి గోదావరి పాయకీ పోతగట్టుకీ మధ్యగా వుంది.

అంచేత, వరదలకాలంలో యేటా అది మునిగిపోతూ వుండేది.

ఆ వరదలు, పూర్వవరదా వుత్తరవరదా అని పది పదిహేను దినాల్లో రెండుమాట్లు వూరు ముంచేసేవి.

ఆ పది పదిహేనుదినాలూ బంధువుల యిళ్ళకు పొరుగూళ్ళు వెళ్ళినవారు వెళ్ళిపోగా, వుండిపోయినవారందరూ వానకి తడుస్తూనూ యెండ కెండుతూనూ పోతగట్టుమీదే కాపరం.

ఒకవైపున మూడుమైళ్ళ వెడల్పున కూలంకషమైన అఖండ గోదావరీ ప్రవాహం.

మరోవైపున నాలుగైదు నిలువుల లోతున పోతగట్టు పొడూగునా కొండలోయలాగ పల్లం.

ఇటు కాలుజారితే సాగరమే గతి.

అటు కాలుజారితే పచ్చడి అయిపోడమే పర్యవసానం.

ఇలాంటి పరిసరాల్లో, పది పన్నెండు అడుగుల వెడల్పు మాత్రమే వుండిన పోతగట్టున మకాము.

ఆ మకాములు తొక్కుకుంటూ, రాజమహేంద్రవరం మొదలు ఏనుగుతలకాయ కొండదాకా ఎడతెగని బాటసారులు.

ఎవరయినా సులభంగా గ్రహించవచ్చు, ఆ స్థితి.

అదిగో అది భరించలేకా, పొలమూరిలో వుండుకున్న ఈనాంభూమి తాలూకు శిస్తు తెచ్చుకోడానికి వెళ్ళినప్పుడల్లా ఆ వూరి మున్సబు తటపర్తి భీమరాజుగారు (సంపన్న నియోగి గృహస్థు) నిర్బంధించడంవల్లా మా నాయనగారు పొలమూరిలో ప్రవేశించారు.

తరవాత వొక సంవత్సరానికి పొలమూరిలోనే నా పుట్టుక.

తటవర్తి భీమరాజుగారూ, రామవరపు గ్రామకరణం బుద్ధవరపు లక్ష్మీనరసింహం గారూ, మహేంద్రవాడ పెద్దకాపు కర్రి సుబ్బారాయడూ (భూమంచిరెడ్లు) మాకు పెట్టనికోటలయి వుండేవా రక్కడ.

నా బాల్యం అంతా ఆ గ్రామంలోనే గడిచింది.

పాతికేళ్ళ వయస్సు వచ్చేవరకూ అక్కడే వున్నా న్నేను.

భీమరాజుగారి కేడుగురు కుమాళ్ళు.

వారిలో చిన్నవా రిద్దరూ నాకు సహచరులు.

నే నింటవుండే వైదికవిద్యలు నేర్చుకుంటూ వుండగా దొడ్డంపేట (వేగాయమ్మపేట) వెళ్లి వారి ద్దరూ ఇంగ్లీషు చదువులు ప్రారంభించారు.

చదువులు మాత్రం సెకండుఫారం అయినా కాలేదు గాని నాలుగైదు మాసాలు గడిచింది మొదలు, ఇంటికి వచ్చినప్పుడల్లా "పాస్‌పీస్" అంటూ తమలో తాము స్వదేశీ యింగ్లీషు మాట్టాడుతూ వూళ్ళోనే వుండిపోయిన మా స్నేహితులనందర్నీ డెకారించేవారు వారు.

అది చూసి, ఇంగ్లీషు చదుకోవాలనీ వారికంటే యెక్కువగా "పాస్‌పీస్"మనాలనీ నే నెంతో వూగీసలాడిపోయేవాణ్ణి.

ఇంగ్లీషు చదవనందు కప్పుడే కా దిప్పుడూ చాలా కించగానే వుంది నాకు.

ఎంతో లోటుగానూ వుంది.

నా కింగ్లీషు రాకపోడమే మంచిదయిందనే స్నేహితులున్నా రెందరో, నేనూ అలాగే అనుకుంటూ వుంటాను తరుచు; కాని "అయ్యో" అనిపిస్తూ వుంటుం దెప్పుడయినా నాకు.

నిజానికి, ప్రపంచం అంతటా బహుళప్రచారంగల యింగ్లీషు రాకపోవడం నాకే కా దెవరికయినా దౌర్భాగ్యమే.

కాని "బి.ఏ.లూ, ఎమ్.ఏ.లూ అయిన్నీ యేవిధంగానూ ఇంగ్లీషు నుపయోగించుకోని వాళ్ళకంటే నేనే నయం" అనిపిస్తూనూ వుంటుం దప్పుడప్పుడు.

ఈ లాభనష్టాలేమీ బేరీజు వేసుకోకుండానే నాకూ మా అన్నలకూ కూడా యింగ్లీషు చెప్పించకూడ దనుకున్నారు, మా నాయనగారు.

నా విషయమై మా అమ్మగారు కొంచెం ప్రయత్నించారుగాని ప్రయోజనం లేకపోయింది.

స్వధర్మభ్రంశం తటస్థిస్తుందన్న భయమూ, తూగలేకపోవడమూ యిందు క్కారణాలు.

అయితే, కాలం మార్పు గుర్తించి, వారు, మాకు సాహిత్యమూ, జ్యోతిషమూ, శ్రౌతంలో కొంతా చెప్పారు.

స్మార్తం నాకు పెళ్ళినాటికే - పన్నెండేళ్ళు నిండాటప్పటికే అయిపోయింది.

పెళ్ళినాటికి బడిచదువు నేను మూడో తరగతిలో పద్దెనిమిదో పాఠం చదువుతున్నాను.

అంతే, మరి నేను బడికి వెళ్ళలేదు.

మా కులవిద్యలు నిరాఘాటంగా అబ్బాలనే మా నాయనగారు నన్ను బడి మాన్పించారు.

## 6

పెళ్ళినాటి క్కావ్యపాఠం రఘువంశం మాత్రమే పూర్తయింది నాకు.

మా నాయనగా రింటోవుండినంతసేపూ కదలకుండా కూచోడమూ, వారిదగ్గిర జ్యోతిషమూ, శ్రౌతమూ, స్మార్తమూ నేర్చుకుంటూ వుండడమూ - వారిల్లు

కదిలారా, వూళ్ళో కుదాయించడమూ - ఇలా జరిగింది నా విద్యాభ్యాసం చిన్నతనంలో.

శబ్దాలూ, సమాసాలూ ధాతువులూ అవ్యయాలూ - ఇవి వేదం సంతచెప్పినట్లు చెప్పి, మా నాయనగారే వల్లింపచేశారు; కాని కావ్యపాఠం మా పెద్దన్నగారు చెప్పేవారు నాకు.

ఆయనకు నేనంటే యెంతో ప్రేమ.

"బహద్దర్" అని ముద్దుపేరు పెట్టారు నా కాయన.

ఆ బహద్ద రొక్కొక్కప్పుడు "బహదూర్" అయేది, మరొక్కొక్కప్పుడు "బాదర్" అయిపోయేది.

ఆ చనువువల్ల నాకు భయం అన్నది లేకుండాపోయిం దాయనదగ్గిర, లేశమున్నా.

**కాగా:-** పోరి ఆయన పిలిస్తేనే పుస్తకం పుచ్చుకుని పాఠాని కొచ్చేవాణ్ణి నేను.

ఇదిలా వుండగా, సొంతానికి జ్యోతిషం నేర్చుకుంటూ పంచాంగం వెయ్యవలసివుండే దాయనకు.

అక్కడికీ యిక్కడికీ వెళ్ళవలసివచ్చేది, తరుచు.

పోనీ అంటే, మా చిన్నన్నగా రప్పటికి పొరుగూళ్ళలోనే చదువుకుంటూ వుండేవారు, సాహిత్యగ్రంథాలు.

అంచేత, కావ్యపాఠంకోసం పొరుగూరు వెళ్ళవలసివచ్చింది, తప్పనిసరిగా నాకు.

మా అమ్మగారి దగ్గిర గారాం - మా పెద్దన్నగారిదగ్గిర అతి చనువు - వూరినిండా స్నేహితులు - సహజంగా ఆటలంటే మిక్కిలీ మక్కువ - నా సంగతి యిలా వుండగా, తాము తరుచు ఆ వూరూ యీ వూరూ వెడుతూవుండడం - ఇన్ని కారణాలవల్ల ఇంటో నాకు సాహిత్యం అబ్బదని యిది యిలా నిర్ధారణ చేశారు మా నాయనగారు.

అయితే, పొరుగూళ్ళంటే కొంచెమున్నా భయంలేదు నాకు. రెండుదినాల్లోనే వూరి వయసుగాళ్ళతో జతకట్టేసుకోగల న్నేను; కాని, చదువుకోసమే అయినా ఆ వయసులో నేను పొరుగూళ్ళు వెళ్ళడం - కనీసం ఆ స్థితిలో వెళ్ళడం సుతరామూ యిష్టంలేదు, మా అమ్మగారికి.

"పన్నెండేళ్ళు వెళ్ళాయి. అంతేనా?" అని వొకమాటు "మొన్ననేనా పెళ్ళయింది?" అని యింకోమాటు "చద్దన్నం లేకుండా వుండగలడా అబ్బాయి?" అని మరోమాటు మా అమ్మగారెన్నో అడ్డంకులు చూపిస్తూనే వచ్చారు గాని, లాభంలేకపోయింది.

"చద్దన్నం మానుకోవలసివస్తుం దని చదువే మానుకోడమా? పెళ్ళయాక గూడా యింకా కాళిదాసత్రయంలోనే వుంటే యెప్పటికి తేలనూ? ఒక్క నెల కష్టం ఇల్లు విడిచీ చద్దన్నం లేకుండానూ వుండడం - తరవాత అదే అలవాటయిపోతుంది" అంటూ అన్నిటికీ సద్దిచెబుతూ చెబుతూనే తీసుకువెళ్ళి పొరుగూరిలో విడిచిపెట్టేశారు మా నాయనగారు నన్ను.

బహూ ధీమాగా వెళ్ళా న్నేనయినా, రెయిలుసంచీ పుచ్చుకుని జంకన్నది లేకుండా.

బాగానేవుంది, అయితే, చదువయాక పెళ్ళా, పెళ్ళయాకే చదువా?

వైదికవిద్యల్లో నిధు లయి, సనాతనధర్మపరులున్నూ అయివుండిన మానాయనగారి కేది ముందో తెలియంది కాదు.

అయినా, శాసించే నాథుడు లేక శాస్త్రవిరుద్ధా లయిన సంప్రదాయా లప్పటికే మనలో అనేకం యేర్పడిపోయాయి.

శంకరాచార్యపీఠమున్నూ అప్పటి కింకా మంచి స్థితిలోనే వుంది; కాని స్వాములవారు మాత్రం చూసీచూడనట్టూరుకునేవారు, అదే పనా తమ కన్నట్టు.

ఊరుకునేవారంటే నిజమే, కనకనే సరిపోయింది, కాలప్రవాహానికి వారున్నూ యెదురీదలేకపోయే వుందురు.

మానాయనగారివంటి మహాపండితులు కూడా అలాంటి కొత్తసంప్రదాయా లవలంబించడమూ, ప్రారంభ మయి వుండినవాటికి తలవొగ్గడమూ బాహాటంగా జరిగిపోతున్నప్పుడు విజాతీయమున్నూ అయిన పరప్రభుత్వంలో, వారు మాత్రం యేమి చెయ్యగలరూ నైతికంగా?

దీనికి తగ్గట్టు:– తమ పిల్ల లందరికీ తామే పెళ్ళిళ్ళు చెయ్యడం, తల్లిదండ్రుల బాధ్యత మనలో

అది యెంత త్వరగా తీరిపోతే వారికంత నిశ్చింతా, ధన్యతా కూడానూ.

సుష్టుగా సంసారం నిర్వహించుకోడంకంటే, గృహస్థులకు, పిల్లలకు శుభకార్యాలు కానిచ్చేసుకోడమే గొప్ప ప్రయోజకత్వంలో లెఖ్ఖ.

ఇద్దరు సంతానవంతు లయినా, సంతానవతు లయినా కలుసుకుంటే, సాధారణంగా వారు తమ బిడ్డల పెళ్ళిళ్ళ విషయమే మాట్లాడకుండుకుంటా రిప్పటికీ.

జ్యేష్ఠానుక్రమంగానే పెళ్ళిళ్ళు కావలసిన విధి వుండడంవల్ల పెద్దవాడి కాలస్యమయితే, ఆవరసన తక్కినవాళ్ళకిన్నీ అందరికీ ఆలస్యం అయిపోతూనే వుంటుందని వారికి గొప్పఆందోళన కూడా వొకటి.

దీనికి సాయం, పంచశిఖలతో వుండగానే కొడుకులకు పెళ్ళిళ్ళు చెయ్యగలగడం గొప్ప అనే భావంకూడా యెక్కువగా వుండే దప్పుడు.

పోనీ, పెళ్ళియీడు వచ్చేదాకా ఉపనయనం చెయ్యకుండా వుంటారా అంటే, అమ్మో, సుతరామూ వల్లకా దది.

వైదికకుటుంబాల్లో గర్భాష్టమంలోనే ఉపనయనాలు జరిగిపోయే వాకాలంలో.

మాచిన్నక్కగారి వివాహంలో యేడో సంవత్సరం నడుస్తూ వుండగానే నా కుపనయనం జరిగింది.

"అమ్మాయి పెళ్ళిలో అబ్బాయికో పోచ" అన్న సామెతకిదే మూలం.

పెళ్ళిళ్ళ ఆత్రమే కాకుండా, అనుపనీతునకు వేదమంత్రా లుపదేశించగూడకపోవడం కూడా వొకటుంది.

ఐహికవాంఛలకేసి దృష్టి ప్రసరించకపూర్వమే విద్యలు పూర్తి కావాలన్న సిద్ధాంతమే యీ ధర్మానికి ప్రాతిపదిక.

మైనారిటీ తీరేటప్పటికి పురుషుడేదో వొక విద్యలో వుత్తీర్ణుడయి వుండడం సాధారణం, అప్పుడు.

పైగా వుపనయనం గొప్ప సంస్కారం, వొట్టి శుభకార్యం మాత్రమే కాదు.

వేదమంత్రా లుచ్చరించడానికిన్నీ అధికారం పుట్టడానికి మాత్రమే కాదు, నియమపూర్వక మైన నడవడి అలవడ్డానికిన్నీ విధాయకం అది.

ఏమంటే?

ఉపనయనంతోనే బ్రహ్మ క్షత్రియ వైశ్య బాలకులకు ద్విజత్వ సిద్ధి.

రెండో జన్మ అనే దదే.

ఉపనయనం అయితేగాని బ్రహ్మచర్యమున్నూ ప్రారంభం కాదు మరి.

అంటే ఉపనయనం ధార్మిక జీవనానికి నాంది.

ఉపనయనంతోనే విధినిషేధాలు ప్రారంభం అవుతాయి.

ఉపనీతునకు చెయ్యరాని పను లున్నాయి, పోరాని స్థలా లున్నాయి, తినరానివిన్నీ వున్నా యెన్నో పదార్థాలు.

మనిషికి సంస్కారం (కల్చర్) అబ్బాలంటే యీ విధి నిషేధాలు సాధనాలు.

ద్విజుడంటే పూర్ణపురుషుడన్నమాట, మరేమీ కాదు.

సంస్కారం బుద్ధికి మాత్రమే కాదు, నడవడికిన్నీ మూలమే.

ఉపనయనం ముఖ్యోద్దేశమే యిది.

కనక, ఉపనయనం కానివాడు వ్రాత్యుడు.

వ్రాత్యుడు పంక్తిబాహ్యుడు.

కులభ్రష్టుడే కాదు, అస్పృశ్యుడున్నూ.

విషయవాంఛ లంకురించాయా, ఆమనిషి కుపనయనం చేసి యిక లాభం లేదు.

అవి అంకురించకపూర్వమే జీవితంలో విధినిషేధ పరిజ్ఞానం ప్రారంభం కావాలి.

స్వధర్మనిష్ఠా యేర్పడాలి.

ఇది గుర్తించగలిగితే గాని బ్రాహ్మణబాలునకు గర్భాష్టమంలోనూ, క్షత్రియబాలునకు గర్భైకాదశంలోనూ, వైశ్యబాలునకు గర్భద్వాదశంలోనూ ఉపనయనం చెయ్యాలన్న విధి సూత్రం అవగాహన కాదు.

సభ్యత అలవరిచే సంస్కారం అన్న జ్ఞానం లేకపోడమే ఉపనయనం విలవ మనవాళ్ళకి తెలియకపోవడానికి ముఖ్య కారణం, ఇప్పుడు.

మనవాళ్ళ నమ్మకం, చదువు సంస్కారంకోసం అని కాదు, పొట్టకూటికోస మని యిప్పుడు.

మన దౌర్భాగ్యానికీ పతనానికీ ఇదే బీజం.

చదువే పొట్టకూటికోసం అయితే, జీవితం విశృంఖలం కావడానికే అయిపోతుంది, వింత యేమిటీ?

ఈజ్ఞానం నాచిన్నతనంలో వున్నంతలే దిప్పుడు మనలో.

అప్పుడు పదేళ్లు నిండిన బ్రాహ్మణబాలకుల్లో ఉపనయనం కానివా రరుదుగా వుండేవారు.

పన్నెండేళ్ళు నిండిన కన్యలున్నూ యెక్కడోగాని కనపడేవారు గారు, బాగా వెతికితే గాని.

ఎక్కడో సక్రృతుగా తప్పితే, పెళ్ళికొడుకులున్నూ యిరవై యేళ్ళకు పైబడినవారుగానే వుండేవారు.

ఇరవైయేళ్ళు దాటాక పెళ్ళయితే పాతికేళ్ళునిండాకే పెళ్ళాం కాపరానికి వచ్చేది.

అంటే, వధువు కప్పటికి పదహారేళ్ళు దాటి వుండేవి సాధారణంగా.

ఈ వ్యవధి, భార్యమీద భర్తకూ, భర్తమీద భార్యకూ స్థాయిభావం కలగడానికి బాగా వుపయోగించేది.

భార్య అంటే అర్ధాంగి అన్న భావం శల్యగతం కావడానికే నిర్దిష్టం అయింది, ఈ దశాక్రమం.

పురుషుడు శీలవంతు డయితేనే దీనికి సాఫల్యం.

శీలం అలవడ్డానికే బ్రహ్మచర్యదీక్ష.

బ్రహ్మచర్యం ప్రారంభం కావడానికే ఉపనయనమున్ను.

ఇంతకీ:–

బ్రహ్మచర్యం అంటే ఆదరగౌరవా లున్న దినా లవి.

బ్రహ్మచర్యం అంటే యేమిటో తెలిసిన దినా లవి.

బ్రహ్మచర్యం ఆచరణలో కూడా వున్న దినా లవి.

అంచేత, ఇప్పటి మొగపిల్లలకున్నంత స్త్రీవ్యామోహం వుండేది కా దప్పటి వారికి.

ఎటు చూసినా నిగ్రహం యెక్కువగా వుండే దప్పుడు జీవితంలో.

అప్పటివారి చూ పెంతసేపూ చదువుమీదా, సంప్రదాయంమీదా వుండేది.

కాని ఈధర్మాలు భ్రష్టం కావడం అప్పుడప్పుడే ప్రారంభం అవుతోంది.

త్వరగా పెళ్ళిళ్ళు చేసేసి కన్నబిడ్డల నందరినీ వొక్కొక్క యింటివాళ్ళను చెయ్యడమే తల్లిదండ్రులకు గొప్ప అన్న భావం అప్పు డప్పుడే బలపడుతోంది.

ఇదే ప్రధానం మరి, కొడుకులకు వివాహవయస్సు వచ్చిందా లేదా అన్న విచారణే తగ్గిపోతోం దప్పటికే.

ఈ కొత్త సంప్రదాయం అనుసరించి, మా నాయనగారు, మా అన్నదమ్ములు ముగ్గురికీ చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు చేశారు.

నాకు మరీ చిన్నతనంలో – పన్నెండో సంవత్సరమే నడుస్తూ వుండగా పెళ్ళి చేశారు.

## 8

నా వివాహం సంగతి వొక విచిత్రగాథ.

ఆ గాథలో, కళ్ళుతెరవని పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యడంవంటి అశాస్త్రీయ విషయాలతోపాటు, బంధుత్వం తెగిపోనిచ్చుకోగూడ దన్న మమతా యెక్కువగా కనపడుతుంది.

వరకట్నాలపద్ధతి మెల్లిమెల్లిగా తలయెత్తుతోం దప్పుడప్పుడే.

"ఎక్కడో ఆ జిల్లాలో పుచ్చుకున్నారుట" అంటే "అక్కడిదాకా అక్కర్లేదు, మన తాలూకాలోనే యిచ్చారుట" అంటూ జనులు కొంద రుత్సాహంగానూ, కొందరు నిరుత్సాహంగానూ చెప్పుకుంటున్నా రప్పటికే.

సంపన్నులలో కూడా ఆ పద్ధతి నిరసించేవారే అప్పు డెక్కువగా వుండేవారు.

ఒకనాడు మా నాయనగారితో గోష్ఠిలో మహేంద్రవాడ గ్రామకరణం ముంజులూరి వెంకట్రామయ్యగా రన్నమాట నా కిప్పటికీ బాగా జ్ఞాపకం "పచ్చపచ్చగా వున్న కొంప లిక కుప్పకుప్పగా కూలిపోతా"యని.

వైదికులూ – వారిలో మళ్ళీ వైదికవిద్యలు నేర్చినవారూ "కట్నం" అనే మాటే సహించలేకపోయేవారు.

సంప్రదాయమూ దానియెడల ఆదరభావమూ కూడా లేని దరిద్రబ్రాహ్మణ కుటుంబాల్లో – వాటిలో కూడా బహూ అరుదుగా కన్యాశుల్కం పుచ్చుకునే ఆచారం అప్పటి కింకా నిలిచే వుంది.

గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" మా ప్రాంతంలో కన్యాశుల్కాలు బాగా తగ్గిపోయాకే వచ్చింది.

కన్యాశుల్కం పుచ్చుకున్న వాళ్ళని పంక్తిబాహ్యు లన్నట్టు హేయంగా చూసేవారు జను లప్పుడు.

"పిల్ల నమ్ముకున్నా"రనడం అప్పు డొక పెద్దతిట్టు.

దరిద్రులు కావడంతోపాటు ఈ తప్పున్నూ చేశారా, వారు, ధారాళంగా సభ్యసమాజంలోకి రాలేకపోయేవారు.

ఈ దురాచారం యిప్పుడు తగ్గిపోయిందనే చెప్పవచ్చు; కాని యింతకంటే అశాస్త్రీయమూ అమానుషమూ ఆయన వరకట్నాల దురాచారం ప్రబలిపోయింది.

ఇది గౌరవావహం అనిన్నీ ఆదరించబడుతోంది.

వేదవేదాంగాలు చదివినవారూ, యజ్ఞయాగాలు చేసినవారూ, నప్రతిగ్రహీతలం అని విర్రవీగేవారూ, లౌక్యులం అని యెత్తెత్తి కాళ్ళువేసుకునేవారూ కూడా సమంగానే చేస్తున్నారిప్పు డీనరమాంస విక్రయం.

ఇంకో విశేషం యేమిటంటే?

కన్యాశుల్కం ఘోరదురాచారం అని నిరసిస్తూనే వరశుల్కం పుచ్చుకుంటారు వీరు, కొసిరి కొసిరి.

దీంతో వివాహసంస్కారం పవిత్రతా పోయింది, ఆధ్యాత్మికతా రూపుమాసింది, జాతిశీలమూ నశించిపోయింది.

"వివాహం" కేవలం "బిజినెస్సు"గా మారిపోయింది, చివరికి.

సరే, యిప్పటి యేకరాత్ర వివాహాలు "కంట్రాక్టు" వివాహాల కిందే లెక్క, సందేహం అక్కరలేదు.

ఈ దురాచారం ప్రబలిపోడమేకాదు, మంచి సాంఘిక వ్యవస్థ వొకటి రూపుమాసి పోయిం దిప్పుడు.

అష్టాదశవర్ణాలవారిలోనూ వుండే దిది, వెనకటికి.

ఇప్పటివా రిది వినిన్నీ వుండరు; కాని నిరాక్షేపంగా మళ్ళీ ప్రారంభించవలసిన వ్యవస్థ.

అప్పుడు పెళ్ళిళ్ళకు ఎక్కడెక్కడి బంధువులూ సకుటుంబాలుగా వచ్చేవారు.

తప్పనిసరిగా వారలా రావడాని కీవ్యవస్థ కూడా వొక పెద్దకారణం.

వచ్చినవారు చూసి వెళ్ళిపోడం గాదు, అయిదురోజులూ వుండిపోయేవారు.

వచ్చినవారిలో, ఆడపెళ్ళివారి బంధువులు వధువుకీ, మొగపెళ్ళివారి బంధువులు వరుడికీ కట్నాలు చదివించేవారు.

అందుకు నిర్దిష్టసమయం ప్రోలు – అంటే, అయిదోనాడు నాగవల్లి సందర్భం.

ఆ కట్నాల్లో, వుంగరాలు – కాసులు – రకరకాల ఆభరణాలు – చీరలు – జామార్లు – రొక్కం ఇలాగ యెన్నోవస్తువులుండేవి.

ఆ కట్నం సామగ్రి, పురోహితుడు, సమంత్రకంగా యెలుగెత్తి చాటేవాడు, దేనికదే.

సమర్థు లయిన రాయసకాళ్ళు కూచుని జాపితా కూడా రాసుకునేవారు, ఎవరెవ రేమేమి యిచ్చిందీ.

ఒక్కొక్కచోట గంటలకొద్దీ కాలం పట్టే దందుకు.

పర్యాయత్వేనా యీ కట్నాలపద్ధతి అందరికీ వుపయోగించేదే కనక, యెవరికివా రొకరికి తీసిపోగూడదని పోటీలుపడి చదివించేవారు.

ఎవరి యింటో పెళ్ళికి తగినన్ని కట్నాలు రావో ఆ యింటి వారెవరికీ కట్నాలు చదివించిన పాపాన పోలేదని బంధువు లీసడించేవారు, చాటునా మాటునా.

ఇవి చదివించకపోతే యెంత చిన్నతనమో, స్వీకరించకపోయినా అంత చిన్నతనమే, వుభయులకూ.

ఈ కట్నాలపద్ధతి ఆంతర్యం చెప్పాలంటే ఇప్పుడు, కో–ఆపరేషను వొక్కటే సరయిన మాట.

కట్నాలు చదివించడం, బంధువులకు కొద్దితో మర్యాద తెచ్చేది, పర్యాయ త్వేనా తమ కుపయోగించేదిన్నీ.

పెళ్ళిచేసేవారికి పెళ్ళి ఖర్చులకు కలిసివచ్చే సహకారమూ, అప్పుడూ అప్పుడూ ఒక్కొక్కరికి మాత్రమే చెల్లుపెట్టవలసిందిన్నీ యిది.

ఉభయ వర్గాలవారికీ కొత్తబట్టలు పెట్టడం అప్పుడు తప్పనిసరి మర్యాద కనక, కట్నాల్లో వచ్చినబట్ట లందు కుపయోగపడేవి.

వస్తువులు వధూవరులకు చెందేవి.

వరునిమాట యేమయినా, దీనివల్ల, వధువు కెంతో కొంత నగలలోటు తీరేది.

అయితే, యీ కట్నాల విషయమ్మైనా వివాహంనాటికే వైముఖ్యం ప్రారంభం అయిపోయింది, మనవారిలో.

నాకు బాగా జ్ఞానం వచ్చేటప్పటి కివి అంతరించిపోయాయి.

పోయాయంటే పోనూలేదు, ఇటీవల మళ్ళీ ప్రారంభమే అయినాయి, మరో రూపాన.

ఇవాళ, పెళ్ళికొడుక్కీ పెళ్ళికూతురికీ గూడా ఏమిటేమిటో కానుక లందుతూనే వున్నాయి కానయితే:

ఇదీ కో–ఆపరేషను సూత్రం కిందికే వస్తుంది; కాని వధూవరులకు మాత్రమే గాని పెళ్ళిపెద్దలకు లేశమూ ప్రయోజనం లేదు వీటివల్ల.

ఇది మంచిదికా దనను; కాని వెనకటి పద్ధతి యింతకంటే చాలా మంచిది.

## 9

వరకట్నా లిటు పెరిగిపోతున్నాయి, ప్రోల్లో చదివించే కట్నా లటు తరిగిపోతున్నాయి – ఈ సంధిసమయాన జరిగింది నాకు వివాహం.

అన్నట్టు, వరపక్షంవారు కన్యావరణం మానుకోడమూ వధువు పక్షంవారే వరాన్వేషణకు బయలుదేరడమూ బాహాటంగా జరిగిపోతోం దప్పటికే.

కాని నా అదృష్టంవల్ల నా వివాహం సందర్భంలో మాత్రం ఆ దురాచారం జరగలేదు.

స్వయంగా మా అమ్మగారే బయలుదేరివెళ్ళి పిల్లను కుదిర్చారు నాకు.

శ్రోత్రియతతో పాటు మరో విశేషమున్నా వుం దందులో – ఉన్నదల్లా యేమిటంటే?

నాకు మేనమామ లిద్దరూ పింతల్లులు ముగ్గురూను.

వారి కందరికీ మా అమ్మగారే పెద్దలు.

చిన్నప్పణ్ణుంచీ మా అమ్మగారూ మా పెద్దమేనమామగారూ వొక జట్టూ, మా పింతల్లులూ మా చిన్నమేనమామగారూ వొక జట్టూను.

ఈ జట్లూ యీ అభిమానాలూ ఇప్పటికీ నిలిచేవున్నాయి, వారి సంతానంలో కూడా.

అందరిలోనూ మా అమ్మగారి దగ్గిరా మా పెద్ద మేనమామ గారి దగ్గిరా లౌక్యమూ దాపరికమూ వుండేవికావు.

వారి అన్యోన్యత కదే కారణం అయివుంటుంది.

మా పింతల్లులు ముగ్గురూ వొకటయినా మా అమ్మగారికి లోటుండేది గాదు.

మా మాతామహులు కంభంపాటి మీనయ్యగారికి మా అమ్మగారిమీదే మిక్కిలీ అభిమానమూ, చాలా ప్రేమాదరాలున్నూ.

తక్కినవారంటే వారికి లేశమూ వైముఖ్యం లేదు గాని మా అమ్మగారి విషయమై విశేషశ్రద్ధ, అంతే.

అందుక్కారణం విన సొంపైనది.

కంభంపాటి మీనయ్యగా రంటే, తణుకుతాలూకా రైతాంగంలోనూ, రెండుమూడు తాలూకాల బ్రాహ్మణ్యంలోనూ యెరగనివారూ – కనీసం విననివారూ లేరు.

బ్రాహ్మణ్యంలో వూరి కల్లా స్థితిపరు లాయన.

మంచి వ్యవసాయదారులున్నూ.

వ్యవసాయదారు లంటే "బాపనవ్యవసాయం" కాదు, కమ్మవారికిన్నీ ఆదర్శమూ అనుసార్యమున్నూ అది.

యాభై సంవత్సరాల వయస్సున కళత్రవియోగం సంభవించిం దాయనకు.

పోనీ అంటే సంతానమున్నూ లేకపోయింది.

అంచేత, మళ్ళీ వివాహ సంకల్పం కలిగింది.

యాభైయేళ్ళంటే మన కిప్పుడు ముసలితనంలోనే లెక్క కాని ఆరోగ్యాదికం విషయమై అప్పటి యాభైయేళ్ళవాడి కిప్పటి పాతికేళ్ళవాడున్నూ లొంచ్చు.

ముఖ్యంగా, అప్పటి వైదికుల్లో, పురుషుడికి పెళ్ళి వయస్సు పాతికసంవత్సరాలూ, పెళ్ళాం కాపరానికి రావడం ముప్ఫయ్యేళ్ళు నిండాకానూ.

బ్రహ్మచర్యం అనేది అప్పటివాళ్ళే యెరుగుదురు.

వాళ్ళే ఆచరించారు కూడా.

పాతికేళ్ళదాకా అప్పుడు విద్యాభ్యాసంతోనే సరిపోయేది.

అది చాలించుకున్నాకే వివాహం మరి.

అంచేత, ఆహారవిహారాల్లో ఆ కాలంలో నీతినియమాలు చాలా యెక్కువ.

గురుశుశ్రూష చేస్తూ, వారాల భోజనం సంపాదించుకుంటూ, తదేకదీక్షగా చదువుకుంటూ, తాటాకుచాపలమీద గాఢనిద్ర అనుభవించేవా రప్పటి వైదిక యువకులు.

దీనికి సాయం, ఆ కాలపువాళ్లు జొన్న అన్నం తినేవారు.

వరి అన్నం వా రెరగనే యెరగరు.

అప్పుడు వరిపంటే చాలా తక్కువ, వున్న దయినా మెట్టపంట, మాగాణిపంట కాదు.

ఆ మెట్టపంట అయినా, యే యింటి కాయింటివాళ్లే స్వయంగా దంపుకున్న బియ్యం.

సాధారణంగా, అప్పు డయినా, పథ్యపానాలకూ, మహావైభవం అనుభవిస్తున్నా మనుకునేవాళ్లకున్నూ మాత్రమే వరిబియ్యం వినియోగం.

సంపన్నులూ జొన్న అన్నమే తినేవారు, అప్పు డదే నియతాహారం తెనుగువాళ్ళకి.

వరి అన్నం గొప్ప అనేమాట అప్పు డప్పుడే ప్రారంభం అవుతోంది, మెల్లిమెల్లిగా.

వయస్సు మళ్ళింది మొదలు, ఈ నమ్మకం పెట్టుకుని, మా పితామహులు శివరామసిద్ధాంతిదీక్షితులుగారున్నూ జొన్న అన్నం ముట్టే యెరగరుట.

రెండు పూటల్లా వారి కొక్కరికి మాత్రమే వరిబియ్యం వండిపెట్టేవారుట మా నాయనమ్మగారు.

వారు భుజించగా యేమయినా మిగిలితే, మా మేనత్తగారూ, మా పెత్తండ్రులూ, మా నాయనగారూ "నాకు–నాకు" అంటూ కీచులాడుకునేవారుట చిన్నతనంలో, దినమ్మూ.

తరవాత్తరవాత యెన్నోమాట్లు చెబుతూవచ్చారు మా నాయనగారు "వరి అన్నం గొప్ప అనుకోడమే గాని – మిగిలింది యెదుటివాళ్లే యెందుకు తినాలీ అన్న పట్టుదల మాత్రమున్నే గాని – జొన్న అన్నం తిన్ననోటి కది చెరుకుపిప్పి నమిలి నట్టుండేది" అని.

కనక, ఆ జొన్నఅన్నం పిండశక్తీ కలిగించి వయస్తంభనమూ చేసిం దాకాలపువాళ్ళకి.

అంచేత, యాభైయేళ్ళ వయస్సున పెళ్ళంటే, ఆ రోజుల్లో, విడ్డూరమూ కాదు, నిందావహమూ కాదు.

కాగా, మా మీనయ్యతాతయ్యగారు మళ్ళీ పెళ్ళిప్రయత్నంలో వున్నారన్నమాట పుట్టాటప్పటికి, పొడగట్లపల్లి కాపురస్తులు వద్ధి లక్ష్మీనరసింహశాస్త్రిగారు తమ రెండో కొమార్తె నివ్వడానికి నిశ్చయించుకున్నారు.

ముక్కామలకూ పొడగట్లపల్లికీ రెండుమైళ్ళ వెడల్పున వశిష్ఠ గోదావరి మాత్రమే అడ్డు.

అప్పుడే కా దిప్పటికీ రాకపోకలు జరుగుతూనే వుంటాయి ఆ వూళ్ళ బ్రాహ్మలకు దినమ్మా.

ఈ రాకపోకలతో వొకరి సంకల్పాలూ, వొకరి వుద్దేశాలూ, వొకరి ఆశలూ వొకరి నిరీక్షలూ అవగాహన అయిపోయా యిద్దరికీ.

వర్గత్రయ పరిచయంవల్ల సంప్రదాయాదికం పరిశీలించుకోవలసిన అగత్యం లేకపోయింది వారికి.

పిల్లని చేసుకోవాలనీ యిస్తామనీ వున్నచోట తిరస్కరించడం మన శాస్త్రీయ సంప్రదాయమూ కాదు, అప్పటి మన వాళ్ళలో మర్యాదస్థుల పద్ధతీ కాదు.

ఈ కారణాలవల్ల సంబంధం స్థిరపరచుకోడానికి మా మాతామహులు పొటగట్లపల్లి వెళ్ళారు.

రాగిడీ, చంద్రవంకా, సూరీడూ, చంద్రూడూ తమలపాకూ, మొగలిరేకూ, పాపిడిపిందిరీలూ, జూకాలూ, దండ తావేజులూ – అడ్డబాసా మొదలైన – ప్రథమ కళత్రం తాలూకు నగలన్నీ మూటకట్టుకుని మరీ వెళ్ళారు.

వీటి సొగసూ తెలియదు, ఇవి ధరిస్తే వచ్చే నిండూ బోధకాదు, వీటి ఉద్దేశమూ గుర్తుకి రా దిప్పటివాళ్ళకి "పాత కాలపు మోటునగ"లన్న అపోహ తప్పిస్తే.

అందమే కాకుండా సంపన్నతకున్నూ గుర్తివి ఆ కాలపువారికి.

మా తాత గారవి పట్టుకుని గుమ్మంలోకి వెళ్ళేటప్పటికి పదకొండేళ్ళపిల్ల వీధిలో ఆడుకుంటోంది.

ఆమె యింటివారి పిల్లే అయివుంటుం దనుకుని "అమ్మీ, శాస్త్రులుగా రున్నారా?" అనడిగి, వున్నారని ఆమె చెప్పగా లోపలికి వెళ్ళారు మీనయ్యగారు.

మామూలు మర్యాదలు జరిగాయి.

సంగతి గుర్తించి స్త్రీలు, వీధిలో వున్న పిల్లని దొడ్డిదారి నింటోకి తీసుకువెళ్ళి కట్టే తొడిగీ తీసుకువచ్చి తండ్రిదగ్గిర కూచోపెట్టారు, వరుడి కెదురుగా.

ఆమె చెల్లెలున్నూ రమారమీ తొమ్మిదేళ్ళది చిరుబొజ్జ మీద చొంగ కార్చుకుంటూ వచ్చి అక్కగారి వెనక నుంచుంది.

నగలమూట విప్పి మీనయ్యగారు పిల్లకేసి చూశారు.

వీధిలో తాము పలకరించిన పిల్లే కావడం చూసి, చకితులై "నా కక్కర్లే దీపిల్ల" అనేశారు, వెంటనే.

"నే నీపిల్లను వీధిలో చూశాను. 'అమ్మీ' అని పిలిచాను; కనుక, నే నీమెను పెళ్ళిచేసుకోగూడ"దనిన్నీ చెప్పేశారు వెంటనే.

"అమ్మా" అంటే తల్లికీ "అమ్మీ" అంటే కూతురికీ ఆ కాలపువారి సంబోధన. ఇప్పటి "అమ్మడు" ఎరగ రప్పటివారు.

అప్పటి "అమ్మి" ఇప్పుడు నీచస్త్రీవాచకమున్నూ అయిపోయింది.

మీనయ్యగారి కారణం యిది కాగా. తన కారణం ఆయన వయసు ముదిరినవాడు కావడం అయి "నాకీయన వద్దు" అని ఆ పిల్లా అనేసింది.

నిర్విణ్ణు లయిపోయా రిది చూసి లక్ష్మీనరసింహశాస్త్రిగారు.

తలుపోరగా, గదిలో వున్న స్త్రీలున్నూ తెల్లపోయారు; కాని తన చూపుల్లో దివ్యజ్యోతు లంకితాలు కాగా "ఆనగలన్నీ నాకు పెత్తితే అయన్ని నేను పెళ్లాలతా"నంది ఆ దొంగపిల్ల స్పష్టంగా, తన ముద్దుమాటలతో.

అది మీనయ్యగారికి దేవతావాక్యం అయింది.

ఎగిసి గంతున్నూ వేసి "అదిగో, ఆ పిల్ల నాకు జయం చేకూరుస్తుంది. మీ కిష్టమయితే దా న్నివ్వండి" అన్నారు దానిమీద ఆయన, కన్యాదాత అనుకోనిదే.

అయినా వ్యవహారం యిలా పొక్తుపడగా మిక్కిలీ సంతోషించి "సరే" అన్నారు లక్ష్మీనరసింహశాస్త్రిగారు.

వెంటనే ఆ నగలన్నీ స్వయంగా ఆమె కలంకరించి తన దగ్గిర కూచోపెట్టుకున్నారు, మీనయ్యగారు.

లక్ష్మీనరసింహశాస్త్రిగారు తమ రెండోపిల్లకు మరో సంబంధం చూసుకుని మూడో పిల్లనే యిచ్చారు మా తాతగారికి.

అదిగో, ఆ చొంగపిల్లే మా అమ్మమ్మగారు.

ఇది ఈశ్వరలీల అయివుండాలి, లేకపోతే యిలా జరగదు.

ఏమంటే?

మా తాతగారిని తిరస్కరించిన పిల్ల పెళ్ళి అయిన కొద్ది దినాలకే – కాపరానికి వెళ్ళకముందే వితంతు వయిపోయింది.

"నా కిలాంటియోగం వుండడంవల్లనే నా నోట అప్పుడామాట వచ్చింది" అంటూ బతికివుండినంతకాలమూ పరితపిస్తూ వుండేవా రామె.

మా అమ్మమ్మగారి జీవితం నిత్యకల్యాణం పచ్చతోరణంగా వెళ్లింది.

అయినా అసూయపడక, మా అమ్మమ్మగారి కెన్నో పురుళ్ళు పోసిందామె, చెల్లెలన్న మమకారంతో.

పదమూడో యేట కాపరానికి వచ్చి, యాభై సంవత్సరాలు మా తాతగారితో మంచి వైభవా లనుభవించి, దీర్ఘాయుష్మంతులను ఆరుగురు పిల్లలను కనుక్కుని డెబ్బయ్యేళ్ళు నిండాక పరమపదించారు మా అమ్మమ్మగారు.

మా మాతామహులు ఖరాగా నూరేళ్ళు బతికారు.

ప్రథమ భార్యవల్ల సంతానం లేకపోగా, బిడ్డలకోసమే మళ్ళీ పెళ్ళిచేసుకున్న మా తాతగారు రెండోభార్య కాపరానికి వచ్చీ రావడంతోనే కలిగిన మొదటిబిడ్డ కావడంవల్ల మా అమ్మగారి నతిగారాబంగా చూసుకునేవారు.

తమ చెల్లెళ్ళ జట్టు పెద్దదయినా, తమ తండ్రి వాత్సల్యం యెక్కువగా తమకే తక్కుతూ వుండడంవల్ల యెప్పుడూ యే లోటూ యెరగరు మా అమ్మగారు.

మా అమ్మమ్మగారికి మాత్రం పిల్లలందరిమీదా సమానంగానే వుండేది ప్రేమ.

పిల్లలకున్నా తల్లియెడల యెక్కువ మమకారమే, సందేహంలేదు; కాని మా అమ్మగారికి తల్లిమాటమీదకంటే తండ్రిమాటమీదే యెక్కువ లక్ష్యం యెప్పుడూ.

ఏదయినా దెబ్బ తగిలితే – ఏ చీమ అయినా కుడితే – ఏ అప్రియమయినా తటస్థపడితే స్త్రీపురుషులందరూ, ఆబాల గోపాలమూ "అమ్మోయ్" అంటారు సంతాపసూచకంగా. కాని మా అమ్మగారు మాత్రం "నాయనోయ్" అనేగాని "అమ్మో" యనడం యెరగ రెప్పుడూ.

## 10

ఈ జట్లో ఈ అభిమానాలూ, యీ మమతలూ యెరిగివుండిన ముక్కామల గ్రామస్థులందరూ మా పెద్ద మేనమామగారి యేకపుత్రిక సీతను "మహాలక్ష్మి సోదెమ్మ కోడలే" అంటూ వుండేవారు, చిన్నప్పణ్ణుంచీ.

తామిద్దరూ వియ్యం అందా లని మా అమ్మగారూ మా పెద్దమేనమామ రామకృష్ణమ్మగారూ వుబలాటపడుతూనే వుండేవారు, మొదణ్ణుంచీ.

కాగా, మా చిన్న అన్నగారికి పిల్ల నిస్తామని వొక పెద్ద మనిషిరాగా, పనికట్టుకుని ముక్కామల వెళ్ళి "యేమి చెబుతా"వని అడిగారు మా అమ్మగారు, మా మేనమామ గారిని.

"చూద్దాం, తొందరేమి? మా అమ్మాయికి ఈడైనవాడు నీ కింకో కొడుకున్నాడుగదా? నీ రెండోకొడుక్కి యీ వచ్చిన సంబంధం దాటబెట్టుకోకు" అని వెంటనే బదులుచెప్పేశారాయన, అవ్యవధానంగా.

ఇంకా పెళ్ళికావలసిన మరొకణ్ణి నేనున్నాను, నిజమే మరి, మా చిన్నన్నగారి కిందుకివ్వరాదూ?

ఆయనదగ్గిర లోపం యేమయినా వుందా!

ఆయనకంటే నే నేమయినా విశేషం గలవాణ్ణా?

ఇదేమీ కాదు.

ఇది ఆయన స్వబుద్ధికి పుట్టిన మాట కానేకాదు.

మా మేనత్తగారికి మా సంబంధం యిష్టం లేదు.

మా మేనమామగా రామె మాట కాదనలేకపోయారు.

ఇదీ అసలు రహస్యం.

మా మేనత్తగారికి తన కూతుర్ని మా పింతల్లుల్లో మరొకామె కొడుక్కివ్వాలని ముచ్చట.

తన తమ్ముళ్ళలాగే ఆ మేనల్లుడు ఇంగ్లీషు చదువుతున్నాడు. కనక, తప్పకుండా వుద్యోగస్థు డయిపోతాడని ఆమె ఆశ.

ఇలాగ వైదికవిద్య లంటే వైదిక కుటుంబాల్లోనే వెగటు పుట్టుకువస్తున్న దినాలవి.

దీనికి సాయం ఆ కుర్రవాడు మా పింతల్లి కేకపుత్రుడు.

ఇక్కడ వధువు ఏక పుత్రికా, అక్కడ వరుడున్నూ యేక పుత్రుడూ కావడం వుండుకున్న విశేషం ఇప్పటికీ అవగతం కాలేదు నాకు.

ఏమయినా, ఆ మాటమీద మా అమ్మగా రింటికి వచ్చేశారు, కొంత ఆశతోనే.

ఇది మా నాయనగారికి మాత్రం కష్టం అనిపించింది.

అయినా వచ్చిన సంబంధం తిరస్కరించతగ్గది కాకపోవడం వొక టేర్పడింది.

దీంతో, కొంకుదురు వాస్తవ్యులు, పెద్ద గరిమెళ్ళ కుటుంబానికి చెందిన పెద్ద అన్నప్పగారి రెండో కొమార్తె నంగీకరించి, మా చిన్నన్నగారికి వివాహం చేసేశారు మా నాయనగారు, వెంటనే.

తరువాత నాకున్నూ సంబంధాలు రాసాగాయి.

ఈలోపున మా మేనత్తగారు తమ వుబలాటం తీర్చుకోలేకపోయారు, ఎంతో ప్రయత్నించిన్నీ.

జరిగిందేమిటంటే?

ఇంగ్లీషు చదువుతూవున్నాడు కనుక తమ కొడుక్కి కట్నం పుచ్చుకోవాలనుకున్నారు, మా పిన్నిగారు.

అతను పెద్ద వుద్యోగస్థు డయిపోతాడనే ఆమె నమ్మకం కనక, కట్నం పుచ్చుకుతీరాలని దీక్ష పట్టింది బాగా.

"ఇస్తా"మన్న వారూ కవబడ్డా రొకరిద్దరు.

దీంతో మా మేనమామగారి సంబంధం ఆమెకి జ్ఞాపకమే లేకపోయింది.

ఆమె కొకటే దృష్టి – డబ్బు – డబ్బు – డబ్బు.

అది వొట్టి డబ్బు కాదు, కట్నం – కట్నం – కట్నం.

ఈ విషయంలో, అక్కడ, మా పింతల్లిగారి భర్త అస్వతంత్రులు.

ఇక్కడ, మా మేనమామగా రయినా స్వతంత్రులే గాని భార్యమాట కాదనలేకపోయా రెప్పుడూ లేనిది, అప్పుడు.

ఇది యిలా తటస్థపడగా, వుండుండి, చూసిన్నీచూసి "నేను కట్నం యిస్తానా నీ"కంటూ మా మేనత్తగారూ "కట్నం లేకపోతే నీ పిల్ల లెక్కేమిటి నా"కంటూ మా పింతల్లిగారూ మాటమాటా అనుకున్నారు.

మా పింతల్లిగారు, చివరికి, కట్నంతోవచ్చిన పిల్లనే చేసుకున్నారు గాని ఆమెతో వియ్యం అందలేకపోయారు మా మేనత్తగారు.

ఇది, వున్న కసింత నెయ్యమూ పోగొట్టి వియ్యానికి బదులు కయ్యం సిద్ధం చేసింది వారి కిద్దరికీ.

అయినా, మరో సంబంధం చూసుకోవా లనుకున్నా రే గాని తమకూతుర్ని నా కివ్వడాని కిష్టపడలేకపోయారు మా మేనత్తగారు.

ఇది యిలా జరిగేటప్పుడే నా కివతల సంబంధాలు రాసాగాయి.

మండపేట నివాసులు, ససర్ల సుబ్రహ్మణ్య సోమయాజులు (తరవాత చయ నమున్నూ చేసిన బ్రహ్మణ్యులు) గారు ఎక్కడికో వెడుతూ మార్గవశాన మా వూరూ మా యింటికీ వచ్చినట్టు నటించి, ఇష్టాగోష్ఠిలాగ మాట్లాడుతూ మా స్థితిగతులూ నా విషయమూ ధ్రువపరుచుకుని, పనిలో పనిగా నన్ను కూడా కొంచెం

పరీక్షించి, చివరికి రాత్రి భోజనాలవేళ "నాకు మీతో వియ్యం అందాలని వుంది, యేమి చెబుతా"రని అడిగేశారు, మా నాయనగారిని.

ఆ సందర్భంలో తేల్చుకోవలసిన విషయాలు కూడా స్పష్టంగా తేల్చుకున్నారిద్దరూ.

"ఆలోచించి నేనే వస్తా"నన్నారు మా నాయనగారు.

"ఆలస్యం చెయ్యవద్దు సుమండీ" అని చెప్పారు సోమయాజులుగారు.

"అటా యిటా?"

మా నాయనగారే కాదు, మా అమ్మగారున్నూ నిర్ధారణ చేసుకోవలసివచ్చింది, నిమిషాలమీద.

ఇదొక సమస్య అయింది వారికి.

ఏమంటే?

అటు మేనరికం అయితే, యిటు మా కుటుంబం వంటిదే ఆహితాగ్నులయినవారి కుటుంబం.

మా నాయనగారికీ సుబ్రహ్మణ్య సోమయాజులుగారికీ చిరపరిచయమున్నూ వుంది, సంప్రదాయగౌరవంతో అంతకంతకు బలపడుతూ.

ఇంతటితో ఆగలే దిది, మా మేనమామగారి కూతురు సీత "నా మనిషి" అన్న ఆశ వొకటి నాకు.

సోమయాజులుగారి సంబంధం యెవరికయినా శిరోధార్యమే; కాని "సీతను వదులుకోడమేనా?" అని నా తహతహ.

నా సంగతి యెవరికీ తెలియదు; కాని నన్నే వెంటబెట్టుకుని వెంటనే ముక్కామల బయలుదేరారు మా అమ్మగారు.

మేము వెళ్ళేటప్పటికిన్నీ మా మేనత్తగారు మా చిన్న ఆడబడుచు పరాభవించినట్టే అనుకుంటూ మిక్కిలి బాధపడుతూనే వున్నారు.

మా మేనమామగారున్నూ చిరాకుపడుతూనే వున్నారు, తమని కాదని ప్రయత్నించి ఆ సంబంధం కుదర్చలేకపోయినందుకు తమ భార్యమీద.

ఆ చిరాకు మా పింతల్లిగారిమీదా వుందాయనకు, "డబ్బిస్తేనే నీ కూతుర్ని చేసుకుంటా"నన్నందుకు.

లౌక్యాలు సుతరామూ పనికిరా వొక్కటే దెబ్బా రెండు ముక్కలూ అన్న తత్వం ఆయనది.

ఈ స్థితిలో మేము ప్రత్యక్షం అయినా మక్కడ.

ఇదొక బాధ మా మేనత్తగారికి; కాని మాకు మామూలు మర్యాదలన్నీ జరిగాయి.

"మరి, పిల్ల నివ్వడం మాటేమిటి?"

ఈ ప్రశ్న మా అమ్మగా రడిగారే కాని ఆయనకీ వుంది లోపల్లోపల మధనపెడుతూ.

మాకంటే ముందే యెదురయివుం దిది మా మేనత్తగారికిన్నీ.

అయితే, రెండు సంవత్సరాలపాటు తీవ్రప్రయత్నాలు సాగించిన ఆ సంబంధం అలా కాగా, తమకి నచ్చిన మరొకటిన్నీ దొరక్కపోగా, అయినా నా విషయమై

యిష్టపడలేక పతకం మార్చి "ఈడు తగునా వదినా?" అని మెలికవేశారు వల్లమాలిన మమత మాత్రం నటిస్తూ ఆమె.

ఈడు చాలకపోడం నిజమే, మరొకరయితే దానికి బదులు చెప్పలేకపోదురు గాని ఆ మాట చెవినిబడాటప్పటికి పట్టరాని రోషం వచ్చేసింది మా అమ్మగారికి.

నిజానికి, మా అమ్మగారు, ఈడు చాలునా అన్నమాటలో మా మేనత్తగారికి నామీద యిష్టం లేకపోడమూ గుర్తించారు, ఆవిడ అసహాయురాలయి వుండడమూ గుర్తించేశారు.

దాంతో దిటవు తెచ్చుకుని "ఈడు చాలదూ? సంవత్సరం మీద తొమ్మిదిమాసాల వార చాలదేం పెళ్ళికి?" అంటూ నిలవతీశా రావిణ్ణి మా అమ్మగారు.

నన్నొకచేతా మా సీతనొకచేతా పట్టుకుని యిరుగుపొరుగిళ్ళకు బయలుదేరారు పట్టుదలతో

చిన్నతనమే అయినా మా మేనత్తగారి మాటమీద నేనూ చాలా బాధపడిపోయాను, నవనిధులూ చెయ్యిజారి పోతూన్నట్టు.

అదేమిటో యిప్పటికీ చెప్పలేను గాని చిన్నప్పణ్ణుంచీ సీత నా సొత్తు అనే నా నిశ్చయం.

మా మేనమామగారు మా చిన్నన్నగారికి మరో సంబంధం చూసుకోమన్నప్పుడు నే నెంతో సంబరపడ్డాను గాని మా పింతల్లిగారి సంబంధం తప్పిపోయాక గూడా నా విషయం వచ్చేటప్పటికి మా మేనత్త వేసిన మెలికతో నా హృదయం కలుక్కుమంది.

ఇటీవల శాకుంతలం చదివివుండినాను కనక జననాంతర సౌహృదం అనుకో గలుగుతున్నారు గాని అప్పట్లో నాకేమి బోధపడుతుందీ అదీ?

అది యేమయినా; – వయస్సుకి సంబంధించిన పూర్వపక్షం మాట అలా వుండగా, అప్పటికి నేను పొట్టిగా కూడా వుండేవాణ్ణి బాగా.

తరవాత్తరవాత నేనింత పొడుగవుతానని అప్పుడెవరున్నూ అనుకోనేలేదు.

మా వూళ్ళో, మైలవరపు జోగమ్మగా రనే ఆవిడ, నన్ను చూసి తరుచు "అదిగో వామనావతారం వస్తోంది" అనేవారు ముద్దుగా.

నిజాని కిద్దరమూ దూరానికి సమంగా వున్నట్టే కనబడినా అప్పటికీ యిప్పటికీ గూడా మా సీతకంటే నేనే పొడుగులెండి.

కాగా, వొడ్డూ పొడుగుల వ్యత్యాసం కూడా మా అమ్మగారి కడ్డంకి కాలేకపోయింది.

కాక: – తీరా చూస్తే మా మేనత్తక్కంటే మా అమ్మగారికే ఆ వూళ్ళో ఆత్మీయ లెక్కువ.

ఇద్దరి పుట్టింటివారి వూరూ అదే అయినా, మీనయ్యగారి పెద్దకూతురు కావడంవల్లా కలిసికట్టుతనం వుండడంవల్లా మా అమ్మగా రంటేనే ఆ వూళ్ళో ఆదరాభిమానా లెక్కువ.

ఇందువల్ల కూడా ధైర్యం చిక్కబట్టుకుని ఇంటింటికీ తీసుకెళ్లి, మమ్మల్ని దగ్గిరదగ్గిరగానూ నుంచోబెట్టి "ఏమర్రా, మా మరదలు మావాడికీ దీనికీ యీడు

చాలదంటుంది. మా తమ్ముడికి మావాడి కివ్వాలనే వుంది, మా మరదలే మెలిక వేస్తోంది. చూస్తూ వూరుకుంటారా మీరు? ముగ్గురు కొడుకుల్లోనూ వొక్కడికయినా నేను మేనరికం చేసుకోవద్దూ? పోనీ అంటే మా చిన్నతమ్ముడి కిప్పటికిన్నీ సంతానం లేకపోయింది గదా, నాకిక పుట్టిల్లు దూరం కావలసిందేనా?" అంటూ అడగసాగారు మా అమ్మగారు.

ఉత్తరక్షణంలో వూరందరూ మా అమ్మగారి పక్షమే అవలంబించేశారు.

"లేనిపోని వంకలు పన్నకు, మహాలక్ష్మి సోదెమ్మ యింటికి పెద్దాడబడుచు. నువ్వు కోరవలసింది పోయి, అదే కోరి నీ కూతుర్ని చేసుకుంటానంటోంది. కాదనడం సుతరామూ జయకరం కాదు నీ"కంటూ బ్రాహ్మణస్త్రీలే కాక, కమ్మ స్త్రీలున్నూ మా మేనత్తను దుయ్యబట్టసాగారు.

"సిద్ధాంతిగారి సంబంధం తపస్సు చేసి సంపాదించాడు మీ నాయన. అనుబంధం తెగిపోనివ్వకు," అంటూ పురుషులున్నూ మా మేనమామగారిని హెచ్చరించారు గట్టిగా.

పీసపాటి వెంకప్ప సర్వతోముఖ సోమయాజులుగారని ఆ వూళ్ళో వొక బ్రహ్మణ్యులు.

సర్వతోముఖం దాకా క్రతువులు చేసివున్న కర్మిష్ఠి ఆయన.

విశేషించి మా పింతల్లుల్లో చివరి ఆమె మామగారున్ను.

మీనయ్యగారి అల్లుళ్ళందరిలోనూ మా నాయనగారిమీద, తమ కుమారునిమీద కంటే ఎక్కువ వాత్సల్యం ఆయనకు.

విద్యలకు సంబంధించి యేర్పడ్డ పరమాదరభావం దానికి ముఖ్యహేతువు.

నేను ముక్కామల వెళ్ళినప్పుడల్లా, దినమ్మూ నేను వారి దర్శనానికి వెళ్ళకుండానూ వుండేవాణ్ణి కాదు, వెళ్ళినప్పుడల్లా నన్ను దగ్గిర కూచోబెట్టుకుని నాచేత సామాలు చెప్పించకుండా వుండేవారు కారున్నూ ఆయన.

నామీది ఆ వాత్సల్యంతో ఆయన, స్వయంగా మా పెద్దమేనమామగారి యింటికి వచ్చి "రామకృష్ణమ్మా, ఆలోచన యింకా తెగలేదూ? ఇలాంటి అల్లుణ్ణి సంపాదించగలవా నువ్వు?" అంటూ తొందరపెట్టారు.

ఇక మాట్లాడ్డం యెలాగ?

విధిలేక మా మేనత్తగారు "మీ యిష్టం, నేనేమి చెప్పగలనూ?" అన్నారు భర్తతో.

"నా కూతురు నీ కోడలే అని మొదణ్ణుంచీ నీ నిశ్చయమే కదా, యింకేం, ముహూర్తం స్థిరపరిపించు" అనేశారు మామామగారు, అవ్యవధానంగా.

ఉత్తరక్షణంలో పాలమూరు వచ్చేశాం మేము.

ముహూర్త నిశ్చయంకోసం మా మామగారున్నూ మాతో వచ్చారు.

అంతవరకూ "యిదేలా జరుగుతుందీ?" అని యెంతో ఆదుర్దాగా వుండిన మా నాయనగారు మూడు నిమిషాల్లో ముహూర్తం పెట్టేశారు.

వివాహమున్నూ సలక్షణంగా జరిగిపోయింది, వెంటనే.

ఇంతకీ: – మనలో మనమాట, నిజం చెప్పవద్దూ?

నాకు తనమీద లాగే సీతకున్నూ నామీదే యిష్టం.

అంచేతే, మా అమ్మగారు నా జబ్బా తన జబ్బా పుచ్చుకుని యిరుగుపొరు గిళ్ళకు తీసుకువెళ్ళినప్పు డల్లా సిగ్గుపడేదే గాని తనతల్లి అలా అయినా బెట్టుసరీ కూడా చెయ్యలేకపోతూ వచ్చింది.

అంచేతే, యిరుగుపొరు గమ్మలు కూకట్లు కొలిచాటప్పుడు పిలవడం తడువుగా. ముసిముసినవ్వులు నవ్వుకుంటూ – తక్కుతూ తారుతూ – వచ్చి బుజమూ బుజమూ రాసుకుంటూ నా సరసన నుంచుంటూనూ వచ్చింది.

ఇది పెళ్ళిలో మరీ స్పష్టం అయింది.

జీవయాత్రలో సరేసరీ.

## 11

చదువుకోసం నేను మొట్టమొదట వెళ్ళిన పొరుగూరు వల్లూరు.

ఇది, మా రామచంద్రపురం తాలూకాలోనే మండపేటకు రెండుమూడు మైళ్ళలో వున్న గ్రామం.

ఆ వూళ్లో రైతాంగం అంతా కమ్మవారు.

బ్రాహ్మల యిళ్లున్నూ ముప్ఫయి నలభైదాకా వున్నాయి.

బ్రాహ్మల్లో చాలామంది లోటు లేనివారు.

ఇద్దరు ముగ్గురు సంపన్నులున్ను.

వెలనాటివారిలో చేబోలువారూ, నియోగుల్లో బెండపూడివారూ అక్కడ అధికసంఖ్యాకులు.

కాసలనాటివారున్నూ యేడెనిమిది యిళ్ళవా రున్నారు.

నేను చూసినంతలో, విద్యార్థుల పాలిటి అన్నపూర్ణ సత్రం వల్లూరు.

గురువుగారి యింటనే భోజనం చేస్తూ, రెండు రోజుల్లో నే నేడువారాలూ కుదుర్చుకోగలిగాను.

మా అమ్మగారి భయమేగాని, నాకక్కడ చద్దన్నం యేర్పాటున్నూ జరిగింది.

చేబోలు వేంకట సోమయాజులుగారని అప్పుడా వూళ్ళో వొక గొప్ప విద్వాంసులు.

ప్రథమభార్య అకాలమరణం పొందగా మళ్ళీ పెళ్ళిచేసుకుని, రెండోమాటు కూడా సలక్షణంగా యజ్ఞంచేసిన కర్మిష్ఠి, ఆయన.

ఆయన అభిమానవిద్య మంత్రశాస్త్రం.

పాదుకాంతదీక్షాపరు లాయన.

మా నాయనగారున్నూ పాదుకాంత దీక్షాపరులే, కనక, తత్సంబంధంగానే వారి కిద్దరికీ చిరపరిచయం.

అయితే, వేంకటసోమయాజులుగారిది వామాచారం.

అంటే, వారి విధానం అంతా ఆగమసంబంధమైనది.

మాది శుద్ధవైదికం.

మహాతపశ్శాలి పిడప్రర్తి చలమయ్యశాస్త్రిగారి సంప్రదాయం మాది.

ప్రసక్తి రానే వచ్చింది కనక, వొక్కమా టాగి, ఆ మహర్షి లీల వొకటి చెబుతా నిక్కడ.

శివరామశాస్త్రిగారి కుమారు లాయన.

అటు పిడపర్తి పెద్దపూర్ణయ్య సిద్ధాంతిగారికి పితామహులూ, యిటు మా నాయనగారికి మాతామహులున్నూ ఆయన.

మహాతపశ్శాలి కావడం అలా వుండగా, జ్యోతిశ్శాస్త్రంలో అఖండపండితు లాయన.

అప్పుడీ ప్రాంతాన, చెప్పుకోతగ్గ సిద్ధాంతులు మరి లేరు, వుండినవారు వారి యెదట దివిటీముందరి దీపాలు.

ఇక్కడ, జ్యోతిశ్శాస్త్రం, ఆదిలో నోరివారిది.

ఆ నోరివారున్నూ మా మునికొడవలివారే.

నోరివారి దగ్గిరనుంచి పిడపర్తి వారికీ, పిడపర్తివారి దగ్గిరనుంచి మాకూ వచ్చింది జ్యోతిశ్శాస్త్రం.

అన్న సీతారామశాస్త్రిగారు, విజయనగర సంస్థానసిద్ధాంతులుగా, తండ్రిగారు సంపాదించిన బూరాడపేట అగ్రహారంలో వుండగా, చలమయ్య శాస్త్రులవారు, ఇక్కడ, రామచంద్రపురం సంస్థానసిద్ధాంతులుగా వుండేవారు.

ఎవరికి వారే పుంభావసరస్వతులు వారు గాని, యిద్దరికీ మాత్రం బద్ధవైరం.

ముఖావలోకనాలున్నూ లేనంత బద్ధవైరం అది.

కొంతకాలానికి, అక్కడ బూరాడపేట అగ్రహారంలో, సీతారామశాస్త్రులవారికి రాచకురుపు వేసింది.

ఒకానొక ఓఢ్రసిద్ధాంతికీ వారికీ వాగ్వాదం జరిగి, అందు విజితుడైన ఆ ఓఢ్రసిద్ధాంతి అసూయతో ప్రయోగం చెయ్యగా వేసిన రాచకురు పది.

సీతారామశాస్త్రులవారూ పాదుకాంత దీక్షాపరులే కాని, యేకారణంవల్లనో ఆ ప్రయోగం మళ్ళించుకో లేకపోయారు.

ఉండుండి అది ప్రకోపించింది.

యమబాధ.

చివరికి ప్రాణభయం.

అందరూ ఆశలు వదులుకున్నారు.

ఇదంతా తెలుస్తూనే వుంది గాని, చలమయ్య శాస్త్రులవారు చలించలేదు.

ఉండలేక బంధువులు గోలపెట్టారు "అవసానదశలోనైనా వొక్కమాటు చూసి వారిని పలకరించగూడదా?" అని.

ఏ కళని వున్నారో శాస్త్రులవారందు కిష్టపడ్డారు, ప్రయాణమూ సాగించారు.

అంచెనోళ్ళమీద బూరాడపేట అగ్రహారం అందిం దీవార్త.

అక్కడివారి కందరికీ ప్రాణాలు లేచివచ్చాయి.

వీరి రాక మహావిపత్సమయాన వారికి మహోత్సవప్రాయం అయింది.

బిక్కమొగాలతో వూరిబయటికే యెదురువచ్చి, స్వాగతం నివేదించి, అందరూ తోడుకుని వెళ్ళారు, శాస్త్రులవారిని, వూళ్ళోకి.

వాకట్లో అడుగుపెట్టేటప్పటికి కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వచ్చి "నడిసముద్రంలో వున్నాం నాయనా, వొడ్డు చేర్చరా?" అంటూ ప్రాధేయపడ్డారు వదినగారు.

"ఇంతమాత్రానికే బెంబేలుపడిపోతారా, వదినా?" అంటూ ముందు ఆవిణ్ణి సముదాయించి, శాస్త్రులవారు "అన్నగా రెక్కడ?" అనడిగారు, తరవాత.

అందరూ సీతారామశాస్త్రులవారున్న గదిలోకి దారి తీశారు, వ్యాధిమాట అలా వుండగా, ముఖావలోకనాలయినా లేని అన్నదమ్ములు కలుసుకోడంలో యేమవుతుందా అన్న ఆందోళనతో, నీరవు లయి.

నిజమే, మనసు కరిగితే అమృతమూ మనసు విరిగితే హాలాహలమూను, కనక, అటయితే నిత్యకల్యాణమూ యిటయితే మహాప్రళయమూ గదా; ఆందోళన కాక?

గదిలోకి వచ్చీ రావడంతోనే సీతారామశాస్త్రులవారు, కన్నెత్తి చూశారు తమ్ముణ్ణి, సప్రేమకరుణంగా.

"కురుపు వేసిందా?" అనడిగారు, చలమయ్యశాస్త్రులవారు సభక్త్యనునయంగా.

"అవును."

"బాధగా వుందా?"

"పాంచభౌతికదేహం గదా, వుండదూ?"

అంతే.

"స్నానం చేసి వచ్చి, యీ గదిలోనే ఆ మూల అలికి ముగ్గులు పెట్టి దీపారాధనమున్నూ చెయ్యండి" అన్నారు చలమయ్యశాస్త్రులవారు, వదినగారితో.

నిమిషంలో అది నిర్వర్తించా రామె.

"మీరంతా అవతలికి వెళ్ళిపోండి" అన్నారు చలమయ్యశాస్త్రులవారు, మళ్ళీ.

అందరూ యివతలికి వచ్చేశారు, అజ్ఞాతవిచికిత్సతో.

వెంటనే తామున్నూ స్నానం చేసి వచ్చి గదిలో ప్రవేశించి, లోపల గొళ్ళెం పెట్టుకుని దీపం దగ్గిర కూచున్నారు, చలమయ్యశాస్త్రులవారు.

ఇవతలివారి కందరికీ "యిక భయం లే"దని ధైర్యమే గాని, లోపల యేమి జరుగుతుందో తెలియక, ఆందోళన మాత్రం తప్పలేదు, వొక్కరికీ.

అక్కడ చలమయ్యశాస్త్రులవారు మంత్రోచ్చారణ కోసమూ, యిక్కడ చేరినవా రందరూ భావప్రకటన కోసమూ పెదవులు కదుపుకుంటున్నా రంతే, సర్వత్రా గాంభీర్యం నెలకొన్నది.

ఒక్క అరగంట గడిచింది.

ఆ అరగంటా చీమకూడా చిటుక్కు మనలేదు గాని, వున్నట్టుండి ఫిరంగి పేలినంత అగా వయింది, గదిలో

ఇవతలివా రందరూ తుళ్ళిపడ్డారు, కంగారుగా.

చలమయ్యశాస్త్రులవారు తలుపుతెరుచుకుని విసురుగా యివతలికి వచ్చారు, బీభత్సరూపంతో.

చూడగా, ఆయన వొంటినిండా చీమూ నెత్తురూనూ.

పరకాయించగా, గదిలో కూడా, గోడలు – నేల – మంచం – సీతారామశాస్త్రులవారి శరీరం – అంతటా కూడా చీమూ నెత్తుర్లే.

ఇవతలివా రందరూ కొయ్యయిపోగా "అన్నగారి శరీరం తడిగుడ్డతో జాగ్రత్తగా తుడిచి, మరో గదిలో యింకోమంచానమీద పడుకోబెట్టండి" అని మాత్రం చెప్పి, స్నానానికి కోనేటికి వెళ్లిపోయారు చలమయ్యశాస్త్రులవారు, నిశ్చలంగా.

వెళ్ళి చూడగా, బాధ అంతా మాయమై తేలిగ్గా వున్నారు సీతారామశాస్త్రులవారు, వీపున మాత్రం అగాధమైన బావి.

అందరూ భయభ్రాంతు లయిపోయారు గాని, వుభయులయెడలా గూడా విధేయులే కనక, అభావదృష్టులు పరుపుకుంటూ వుండిపోయారు.

ఇంతలో, స్నానంచేసి పొడిబట్టలు కట్టుకుని దయచేశారు, చలమయ్యశాస్త్రులవారు.

అప్రయత్నంగా అందరూ కాళ్ళమీద పడ్డారు.

ఒక్కమాటు చిరునవ్వు మొలిపించుకుని మళ్ళీ గాంభీర్యం వహించి, వదినగారిని పిలిచి విభూతి చేతి కందించి "అరారగా యీ విభూతి చల్లుతూ వుండండి, రెండు దినాల్లో పుండు అరిపోతుంది" అన్నారు చలమయ్యశాస్త్రులవారు.

అన్నా రంతే, అంటూనే బయలుదేరారు.

దోసిలివొగ్గి "భోజనం అయినా చేసి వెళ్ళండి" అని ప్రార్థించారు వదినగారు.

తక్కినవారు కాళ్ళా వేళ్ళా పడ్డారు.

ఉహూ ఉ.

వినిపించుకోలేదు చలమయ్యశాస్త్రులవారు.

చూడనూ లేదు.

నిలవనే లేదు.

మళ్ళీ యెనిమిది మైళ్ళు నడిచి, విజయనగరం చేరుకుని, అక్కడ భోజనం చేశారు వారు.

అదిగో, వశ్యవాక్కులు ఆ చలమయ్యశాస్త్రులవారు దయచేశారు, మా పితామహులు శివరామసిద్ధాంతి దీక్షితులుగారికి, తమ కొమార్తె రాజ్యలక్ష్మమ్మగారితోపాటు జ్యోతిషమూ, పాదుకాంత దీక్షానూ.

ఆ చలమయ్యశాస్త్రులవారి కయిదుగురు కూతుళ్ళూ వొక కుమారుడూను.

కూతుళ్ళ కందరికీ పసుపుకుంకుమల నిమిత్తం పుట్టెడేసి – యెనిమిదేసి యకరాల సుక్షేత్రఖండికలున్నూ దయచేశారు, వారు.

## 12

చెప్పవచ్చిం దేమిటంటే?

మంత్రశాస్త్రంలో, ఇలాగ, పిడపర్తి చలమయ్యశాస్త్రులవారి శుద్ధవైదిక సంప్రదాయం మాది.

పైగా, మా నాయనగారు, మేధాదక్షిణామూర్త్యుపాసకులు.

ఇలాంటి భేదాలుండినా, వేంకట సోమయాజులుగారూ మా నాయనగారూ చాలా అన్యోన్యంగా వుండేవారు.

వెళ్ళినప్పూాటే – భోజనం కాగానే మేము వారి దర్శనం చేసుకున్నాము.

అప్పటి కింకా ఆయన మాధ్యాహ్నిక భోజనం చేస్తున్నారు, పన్నెండింటికి, అగ్నిహోత్రాల తరవాత తపస్సు ముగించుకుని.

ఉభయకుశలోపరి నా చదువు మాట వచ్చింది.

వడ్డన చేస్తూ చేస్తూ వుండిన సోదెమ్మగారు ఆ మాట వింటూనే చకిత అయి "అయ్యో, చిన్నపిల్లాడు పాపం, చద్దన్నం లేకుండా వుండగలడా? తరవాణీ అన్నం తిందువుగాని మా యింటో, మొగమూటపడకబ్బాయీ" అన్నారు వాత్సల్యంతో.

నే నందు కానందముగ్ధ ణ్ణయిపోయాను.

మాట రాక నమస్కారం మాత్రం చేశాను. చేతులు జోడించుకుని.

అది గుర్తించారు సోమయాజులుగారు.

"ఏమంటారో?" అనుకున్నా న్నేను; కాని "మీ కిక భయం అక్కరలేదు, మీ అబ్బాయి పనికివస్తాడు, అతని కిక్కడ యెలాంటి లోటూ వుండ"దని మా నాయనగారికి ధైర్యం చెప్పా రాయన.

నిర్బంధం మీద రాత్రి మా భోజనం వారి యింటనే.

పాండిత్యానికి తోడు మాంచి రాజసం కలవారు సోమయాజులుగారు.

దబ్బపండు ఛాయతో నిండైన విగ్రహం ఆయనది.

మాట్లాడితే ఖంగుమనేది శంఖంలాగ కంఠం.

మంచి భోజనప్రియులు వారు.

నాటిరాత్రి, మా నాయనగారికి విందనడానికి పిండివంట గుర్తు, తక్కిన వంటకాలన్నీ వారికి మామూలే.

భోజనం చేస్తున్నంతసేపూ నాకేసి చూసేవా రాయన.

అదెందుకో నేను మొదటే గుర్తించేశాను.

ఇంగ్లీషుచదువులో పడ్డంవల్ల బ్రాహ్మణకుర్రవాళ్ళు భోజనం చెయ్యడంలో అప్పటికే అపస్మారం పనులు ప్రారంభం అయిపోయి వున్నాయి.

అక్కరలేని పదార్థం వద్దని నిషేధించకపోవడం, కావలసిందయినా కావలసినంతే వేయించుకుని వేయించుకున్నంతా అరగించకపోవడం, తినాటప్పుడు కోళ్ళు కెక్కిరించేటట్టు విస్తరి అంతా చిందరవందర చేసెయ్యడం, తిన్నదానికంటే యెక్కువగా విస్తరిలో విడిచిపెట్టెయ్యడం, అందరితోపాటుగా కాక వడ్డన అవుతూ వుండగానే భోజనం ప్రారంభించడం, తన భోజనం మాత్రం అయిందంటే తక్కినవారి సంగతి గమనించకుండా వొక్కొక్కడే లేచిపోవడం – ఇలాంటి పనులు సాహచర్యంవల్ల, ఇంగ్లీషులో ప్రవేశించని కుర్రవాళ్ళలో నున్నూ అప్పటికే ప్రవేశించి వున్నాయి, కొంచెంకొంచెం.

సంధ్యావందనం మాట దేవుడెరుగును, పరిషేచన అయినా సరిగా చెయ్యకపో వడమున్నూ ముదిరిపోతోంది.

నే నిలాంటి వేమయినా చేస్తున్నానేమో అని, సోమయాజులుగారి పరీక్ష

కాని, యిలాంటివాటి విషయమై మా నాయనగారున్నూ చాలా నిక్కచ్చిగా వుండేవారు.

కాగా, వారి చూపు నన్ను బాధించలేదు.

ఆ విషయం ప్రస్తావించి మా నాయనగారిని చాలా మెచ్చుకున్నారు కూడా, ఆయన.

నిజమే, ఆ మెప్పు మా నాయనగారికే తగును, నాకు కాదు.

తల్లిదండ్రులు మొదణ్ణుంచీ సరిఅయిన శిక్షణ అలవరిస్తే పిల్లల కసభ్యప్రవర్తన యెందు కలవడుతుందీ?

డబ్బు సంపాదించడంలో లేదు జాగ్రత్త చెయ్యడంలో వుంది విశేషం – అలాగే బిడ్డలను కనడంలో లేదు వారికి సభ్యత అలవర్చడంలోనే వుంది, తల్లిదండ్రుల ప్రయోజకత్వం.

ఏమంటే?

జాతిని పెంచేది పశుప్రవృత్తి, జాతిని సరిదిద్దేది మాత్రం మానవప్రవృత్తి.

ఈ భేదం గుర్తించనిచోట, కాళ్లు రెండా నాలుగా అనే తప్ప మరో మీమాంస అక్కరలేదు.

ఇప్పుడు తగ్గిపోయింది కాని, నా చిన్ననాడు పిల్ల నివ్వడంలోనూ పుచ్చుకోడంలోనూ సంప్రదాయానికే ప్రాధాన్యం.

మరి, సంప్రదాయం అంటే క్రమప్రవర్తనమే – చదువూ కాదు, ప్రయోజకత్వమూ కాదు.

మానవ సమాజమూ, పశువుల మందా – ఈ రెండింటికీ భేదకం అయిన యోగ్యత క్రమప్రవర్తనమే.

దీని విషయమై మా నాయనగారికి చాలా శ్రద్ధ.

ఇంగ్లీషు చదువుతున్న కుర్రవాళ్ళు ఆ సందర్భంగా ప్రవర్తిస్తున్నా రంటే అందుక్కారణం యింగ్లీషు కాదు, తల్లిదండ్రులకు శ్రద్ధ లేకపోవడమూ, గురువులు అలాగే తయా రయివుండడమూను.

ఇంగ్లీషు ఫిలుములు చూస్తూనే వున్నాం మనం, పాశ్చాత్యుల్లో సభ్యత యేమి తక్కువ?

ఎంతో కొంత పాశ్చాత్య విద్యే అభ్యసించినా, ఇలాంటివాటివిషయమై మా నాయనగారు చూపించేతంతటి శ్రద్ధ, నెల్లూరిలో శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి దగ్గిర చూశాను, నేను మళ్ళీ.

వా రిప్పుడు కీర్తిశేషులు.

వేషభాషల్లోనూ, అంతకంటే యెక్కువగా సభ్యత విషయంలోనూ రెడ్డిగారికి బహుశ్రద్ధ.

తమతో పని వుండి వచ్చినవారి పాదాలు పరీక్షించేవారు రెడ్డిగారు, ముందు.

ఒకనా డొక రెడ్డిగారు వచ్చారు, వారి దగ్గిరికి.

ఐశ్వర్యంలో నరసారెడ్డిగారితో సమాను డాయన; కాని వో–ట్టి నిర్గంధకుసుమం.

వర్తమానం అందుకుని మొదట లోపలికే రప్పించుకున్నారు గాని వెంటనే,

యెందుకో అన్నట్టు యివతలకు వచ్చి, పోర్టికోలో నుంచోబెట్టి మాట్లాడి పంపించేశారా సంపన్నుణ్ణి నరసారెడ్డిగారు.

వింతపడ్డాను కారణం గుర్తించలేక, నేను.

గునుపాటి యానాదిరెడ్డిగారు నరసారెడ్డిగారి సన్నిధానవర్తులు.

వారు, నెల్లూరిమండల సాహిత్య వేత్తలలో వొకరూ, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రులవారి ప్రియశిష్యులూ, వారి ప్రౌఢిమ అవగాహన చేసుకోగలిగినవారున్నూ.

నే నంటే యానాదిరెడ్డిగారి కెంతో యిష్టం.

వారు చెప్పారు నాకు అసలు సంగతి, తరవాత.

ఉన్నదంతా యేమిటంటే?

నాటుజోళ్ళు తొడుక్కుని నడిచివచ్చాడా సంపన్నుడు.

జోళ్ళకే కాదు, కాళ్ళకున్నూ పిక్కలపైదాకా దుమ్ము కొట్టుకునివుంది.

అది చూశారు, భరించలేకపోయారు నరసారెడ్డిగారు.

ఆ దుమ్ము గుర్తుంచుకోలేనివాడు ఎక్కడ నుంచోపెడితే మాత్రం కాదంటాడూ?

ఇంతకీ:—

పాశ్చాత్యవిద్య వల్ల పాశ్చాత్యుల ఆచారా లలవడితే అలవడవచ్చు, నియమనిష్ఠలక్కడా వున్నాయి, మరి అవో?

అవి అలవర్చుకోనక్కరలేదూ?

## 13

గురువుగారున్నూ తమ శిష్యు లందరిలో మొదటే నా కగ్రతాంబూలం యిచ్చారు.

వారి పేరు గుంటూరి సీతారామశాస్త్రిగారు.

వారి స్వగ్రామం, జల్లిసీమలో మోగల్లు.

తమకు సాహిత్య విద్య నేర్పవలసిందని కోరి, వల్లూరు నివాసులు చేబోలు సిద్ధాంతిగారూ, బులుసు సుబ్రహ్మణ్యంగారూ, సంవత్సరాని కింత యివ్వడం అని యేర్పాటు చేసుకుని, తమ వూరిలో నిలుపుకున్నారు, సీతారామశాస్త్రిగారిని.

ఉచితంగా మరెవరికి – ఎందరికి చదువు చెప్పినా వారి కభ్యంతరం లేదు; తమ పాఠం పోగూడదు, అంతే.

సీతారామశాస్త్రిగారు తార్కికులు.

జగత్పండితులు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రులవారి శిష్యులు వారు.

నిగర్వచూడామణులున్ను.

వారి దగ్గిర సంవత్సరం నర చదివాను – ఎలాంటి సందర్భంలోనూ యెవరిమీదా వారు కోప్పడ్డం చూడలేదు, నేను.

విద్యార్థు లంటే వారికెంతో వాత్సల్యం.

నే నంటే మరీ వాత్సల్యం.

దాని క్కారణం – ఒకటి నాకు బాగా చిన్నతనం కావడం.

రెండు – అంత చిన్నతనంలోనే నాకు పెళ్ళి అయివుండడం.

మరో విశేషం యేమిటంటే?

వారి చెల్లెలిని మా అత్తవారి వూళ్లోనే యిచ్చారు.

ముక్కామల వెడితే, చిన్నప్పణ్ణుంచీ, తరుచు ఆమె భర్త దగ్గిర కూచోడం నా కలవాటు.

మా సీతకున్నూ ఆవిడ దగ్గిర కూచోడమే అలవాటు.

శాస్త్రిగారి తండ్రి భానుమూర్తిగారు మా సీత నెరుగుదురు.

అంచేత, నా సంగతి విని, ఆయన "నువ్వటోయ్!" అంటూ మొదట నా వీపు తట్టి "ఇత నెవరో తెలుసా? ముక్కామల్లో అమ్మాయిదగ్గిర కూచుంటుందీ, ఆ సీతమ్మ మొగుడు" అన్నారు కొడుకుతో, చివరికి.

దీంతో, గురువుగారి దగ్గిర, విద్యార్థుల కెవరికీ లేని చనువు దొరికింది నాకు.

అక్కడ వుండినంత కాలమూ నాకు తల్లిదండ్రులను విడిచి వుండినట్టే అనిపించలేదు.

అప్పుడు వారి దగ్గిర వుండిన విద్యార్థుల్లో నేను నాలుగోవాణ్ణి.

నలుగురిలోనూ నేనే బాగా చిన్నవాణ్ణి.

నలుగురమూ వారాలు చేసుకునేవాళ్ళం.

మాతోబాటు, రిజల్టు స్కూలు మాస్టరున్నూ వారాలే చేసుకునేవాడు.

ఇంకా పదిమంది కయినా వారాలిచ్చే ఉదారు లావూరి బ్రాహ్మలు.

"గురుకుల వాసమూ, వారాల భోజనమూ – చదువుకునే వాడికివి మంచి"వనే నా నమ్మకం, యిప్పటికీ.

తెలివితేటలూ, శ్రద్ధా యెలా వుండినా, ముందు, అణకువా విధేయతా వుంటేగాని వూరివారు వారా లివ్వరు, విద్యార్థికి.

గురువులు పాఠాలూ చెప్పరు.

విద్యవిషయమై ఇంటిదగ్గిర తల్లిదండ్రు లెంత శ్రద్ధపడుతూ వుండినా, యిక్కడ, విద్యార్థి కదేమీ వుపయోగపడదు.

బాధ్యత అంతా విద్యార్థిదే యిక్కడ.

కాగా, చదువూ భోజనమూ కావలసినవాడు, సహజంగా యెంత పొగరుబోతయినా నమ్రత అవలంబించి తీరాలి, చదువుకునే వూళ్లో.

కొన్ని రోజులు కాక ఆ నమ్రత సంవత్సరాలకు సంవత్సరా లవలంబించి వుండాలి.

దాంతో, మనిషి యెంత చక్కగా తయారవుతాడో ఆలోచించండి.

ఇందుకు సాయం – వారాల భోజనంలో వింతవింత అనుభవాలు కలుగుతాయి.

ఒక్కొక్కవారం నిమిషాలమీద కుదురుతుంది, వొక్కొక్కవారం మిక్కిలీ శ్రమపడితేనే గాని కుదరదు.

ఒక యిల్లాలు "ఏదో, వచ్చాడు, తింటాడు, పోతాడు" అన్న నిరసనభావంతో పెడుతుంది, భోజనం.

ఒక యిల్లాలు విసుక్కుంటూ పెడుతుంది; పదార్థాలు కూడా విస్తరిలో విసిరిపడేసూ.

ఒక యిల్లాలు పంక్తిభేదం చూపిస్తుంది.

ఈ చిరాకంతా పోగొట్టడానికే అన్నట్టు ఒక్కొక్క యిల్లాలు, తల్లిలాగ బుజ్జగిస్తూ పెడుతుంది.

ఈ వ్యత్యాసాలకు తోడు, వేళాపాళా వుండదు.

ఒక అంతస్తున్నూ వుండదు.

ఈ రకరకాల భోజనమయినా, యిచ్ఛామాత్రంగా దొరకదు.

గురువుల విషయం చూతామా అంటే, అదో ప్రపంచం.

సామాన్యంగా, వేదవేదాంగాలు చెప్పే గురువు లందరూ మధ్యరకం సంసారులయి వుంటారు.

ఈనాములూ వుంటాయి, వొడిదుడుకులూ వుంటాయి, సమంగా వారికి.

అంటే, ఉన్నది చాలదు, యేకొంతో సంపాదించాలి, తప్పనిసరిగా.

అదంతా చూసుకుంటూ పాఠాలు చెబుతారు వారు, నిస్స్వార్థంగా.

కనక, విద్యార్థి, ఆ పనిలోనూ యీ పనిలోనూ సాయం చేస్తూ, గురువుగారికి, పాఠ ప్రవచనాల కవకాశం కల్పించుకోవాలి.

గురువు పొరుగూళ్ళు వెడితే కూడా వుంటూ, తన మూటతోపాటు ఆయన మూటా మొయ్యాలి.

ఆయన స్నానం చేస్తే, విడిచిన బట్ట వుతికి ఆరెయ్యాలి.

గురుపత్ని కన్నబిడ్డ అన్నట్టే చూసుకుంటుంది కాని; ఆ పనీ యీ పనీ చెబుతుంది.

ఒక్కొక్కచోట గురువుల చంటిపిల్లలను సముదాయించవలసిన్నీ వుంటుంది.

మా చిన్నన్నగారిచేత, వొక గురుపత్ని, పశువుల సాల బాగుచేయించి పిడకలున్నూ చరిపించింది, కొన్నాళ్ళు.

గురువుగారు, ఏదో నిర్వహించుకు రమ్మని పొరుగూరు పంపితే, వార్తాహరత్వమున్నూ నిర్వహించాలి.

ఒక్కొక్క గురువుదగ్గిర, పొరుగూళ్లు వెళ్ళినప్పుడు వంట చెయ్యవలసిన్నీ వుంటుంది.

ముగ్గురు గురువులకు ముక్కుపొడుము తయారుచేసి యిచ్చేవాణ్ణి నేను, నేటికీ అది వాసన అయినా చూడకపోయినా.

గురువుగారిమాటకేం, కొన్నిచోట్ల, విద్యార్థిని గ్రామ నౌకరుగా భావించే వూరిపెద్ద లుంటారు, కొందరు.

కొన్నిచోట్ల, వూరుమ్మడిమీద సంతర్పణలూ సమారాధనలూ యేమయినా జరిగితే, వడ్డన వగయిరాలు విద్యార్థులే చెయ్యాలి.

ఇన్ని చేసినా, నిన్న చెప్పిన పాఠం గట్టిగా వల్లించి వుండకపోతే యివాళ పాఠం చెప్పరు, గురువులు.

దినమ్మూ, ఉదయం, పాత పాఠాలు చింతన వేసుకోక పోయినా అంతే, కొత్త పాఠం చెప్పరు.

ఇదిన్నీ యిలా వుండగా, –

రకరకాల విద్యార్థులలో సహవాసం.

గురుప్రీతి సంపాదించుకోడంలోనూ, వూరివారి మంచితనమున్నూ సంపాదించుకోడంలోనూ విద్యార్థులకు పోటీలు.

ఈ పోటీలలో రకరకాల కల్పనలూ, కుట్రలూ కూడా వుంటాయి, తరుచు.

కొందరు విద్యార్థులు కొంటెపనులు మానలేరు. దాంతో, చెయ్యనివారికిన్నీ మందలింపులు తగులుతూ వుంటాయి.

ఊరివిద్యార్థులు, తా మధికుల మన్నట్టు, పొరుగూరి విద్యార్థులమీద సవారీ చెయ్యబోతూ వుంటారు.

చదువుసంధ్య ల్లేని ఊరియువకులు చేసే హంగామా వర్ణనాతీతంగా వుంటూ వుంటుంది.

బస యిచ్చిన ఉదారులుంటారు, వారినీ సేవించుకుంటూ వుండాలి.

స్వగ్రామంలో, స్వగృహంలో కూడా అగత్యం లేని యిన్ని పనులు చేస్తూ, యిన్ని ఢక్కా మొక్కీలకు ఆగివుంటే, అప్పుడూ చదువు.

ఇన్ని చేసినా, శ్రద్ధగానే చదివినా, చదువు అంటే యోగం వుండాలి, అది మనచేతిలో లేదు.

ఇలాగ, వారాలు చేసుకునే విద్యార్థికి, అవలంబించేది బ్రహ్మచర్యమూ, ఈదేది సంసారసాగరమూ అయి, చదువుతోపాటు గృహకృత్యాలు నిర్వహించుకునే నేర్పు కూడా అలవడుతుంది, అప్రయత్నంగా.

ఇంగితజ్ఞానమూ కలుగుతుంది, సంస్కారానికి తగ్గట్టు.

వారాలు చేసుకుంటూ నేను చదువుకున్న కాలం నాలుగైదేళ్ళకి పైని.

ఈ అనుభవాలన్నీ కలిగాయి, నాకు.

వారాల పద్ధతి యిలా వుండగా, గురుకులవాసంలో మాధుకరవృత్తి వొకటుంది.

తుమ్మెద కాస్త కాస్త చొప్పున పువ్వుపువ్వునుంచీ మకరందం సంపాదించుకుంటుంది.

భోజనం విషయమై విద్యార్థి కిది సరిగా అలాంటి వృత్తి.

కానయితే నే నెక్కడా అవలంబించలేదు గాని, వారాల పద్ధతికంటే, యిది మిక్కిలీ ఉత్తమం.

ఎంత ఉత్తమం అయినా ప్రతీదాన్లోనూ కొంచెమో గొప్పో యిబ్బందులూ వుంటాయి.

మొదట ఆ వూరి బ్రాహ్మల భోజనాలవేళ గుర్తించుకోవాలి, విద్యార్థి.

స్నానం చేసి మడిబట్టో, పట్టుపంచో – కనీసం నారబట్టో కట్టుకోవాలి.

కుడిచేత, జోలెకు సాయం, నీళ్ళతో చెంబున్నూ పుచ్చుకోవాలి. అది లేకపోతే మడి చెడుతుంది, దృష్టిదోషం కలిగి సంపాదించుకున్న అన్నాదికమూ అభోజ్యం అయిపోతుంది.

ఈ జాగ్రత్త చూసుకుంటూ, ఇంటింటికీ వెళ్ళి వీధి గుమ్మాన లేక తలుపు తెరిచివుంటే హాల్లో నుంచుని "భవతీ, భిక్షాం దేహి" అనాలి, వంటింటవున్న స్త్రీలకు వినపడేటట్టు.

ఆ యింటో భోజనాలయి వుండినా, అవుతూ వుండినా, యిల్లాలు వచ్చి కొంచెం అన్నం జోలెలో పడేస్తుంది.

వట్టి అన్నం పెట్టకూడదు కనక, కాస్త పప్పో, కాస్త కూరో, అవకాయబద్దో కూడా జోలెలో పడేస్తుం దామె, అందుకోసం జోలెకు అర లుండాలి.

ఇలాగ, మధ్యాహ్నం మాత్రం యింటింటికీ తిరిగి, రెండుపూట్లకో మూడు పూట్లకో చాలినంతా సంపాదించుకుని, ఆ పూట తిన్నది పోగా మలిపూటకి జాగ్రత్త చేసుకోవాలి, మిగిలింది.

రెండో పూటకు మిగుల్చుకున్నది యే పిల్లి అయినా కొట్టేస్తే, మళ్లీ మరికొన్ని యిళ్ళకు బయలుదేరాలి సాయంత్రం, తన అవస్థ చెప్పకుంటూ, లేకపోతే పస్తుండాలి.

ఇందుకు సిద్ధపడతాడా - ఆ విద్యార్థికి అన్నం సమృద్ధి.

ఒక్కొక్కప్పుడు, ఏ భిక్షకుల కయినా పెట్టడానికిన్నీ తగినంత సమృద్ధి అది.

కూర, యిళ్ళవారి కొక్కొక్కటే గాని, విద్యార్థికి అనేకాలు, జమీందార్లనున్నూ మించి.

నిజమే కాని చారూ పులుసూ మాత్రం వుండవు.

ఒక్కొక్కచోట బస యిచ్చినవారు కాస్త వడ్డించడం వుంటుంది కాని, లేకపోతే వాటికి నీళ్ళు వదలుకోవాలి.

మజ్జిగ మాత్రం దొరుకుతుంది, కొనుక్కోవచ్చు, కనక.

మజ్జిగ అంటే, చేసింది కాదు, కొనుక్కోగలిగితే పెరుగే కొనుక్కోవచ్చు, రెండు పూట్లకీ.

కాని, వొక్కొక్కచోట చిక్కు లుంటాయి, దానికీ.

ఒక వూళ్ళో, వొక విద్యార్థి సులభంగా వారాలు దొరికే వూరయినా, మాధుకరమే చేసుకునేవాడు, స్వేచ్ఛ కనక.

చదువుమీద వుండినంత శ్రద్ధా సంభావనలమీద కూడా చూపించేవా డతను, డబ్బుకి లోటు లేక కొన్నాళ్ళు పెరుగే కొనుక్కున్నాడు.

కాని, దాంతో బస యెగిరిపోయే స్థితి వచ్చిం దతనికి.

ఆ యింటివారి కొడుకు గారాల కూచి.

వారు సంపన్నులు కారు.

తల్లి కొడుక్కి మజ్జిగే పోసేది.

కుర్రవాడు పేచీ మొదలుపెట్టాడు విద్యార్థి భోజనం చూసి, తనకూ పెరుగే పొయ్యమని.

అప్పు డా యిల్లాలు విద్యార్థిని నిర్బంధించి "నువ్వు పెరుగు మానుకో - లేకపోతే నువ్వు కొనుక్కున్నది మా వాడికిన్నీ కాస్త పోస్తూ వుండు" అని.

పరిస్థితు లలా యేర్పడుతూ వుంటాయి అనుకోకుండా, యెవరేమి చెయ్యగలరూ?

దేనికయినా, సుఖాలతో పాటు కష్టాలూ వుంటాయి నీడల్లాగ.

అయితే, యీ వారాల పద్ధతీ, యీ మాధుకరం వృత్తీ నేటివి కావు, ఋషివాటికల్లో మునిబాలకు లవలంబించిన మహోత్తమవృత్తులు.

కాని, ఋషివాటిక లంతరించాయి, మునిబాలకులూ అపురూపం అయిపోయారు, యీ వృత్తులూ  అంతరించిపోతున్నా యిప్పుడు.

జాతి శీలమే మారిపోతోంది, .మంచికో చెడ్డకో

## 15

మొత్తానికి, నాలుగు పొరుగూళ్ళలో చదువుకున్నా న్నేను.

నాలుగుచోట్లా వారాలే చేసుకున్నాను.

భోజనం సందర్భంలో రెండుచోట్ల విచిత్రానుభవాలు కలిగాయి, నాకు.

మొదటిది వల్లూరుగ్రామంలోనే తటస్థించింది.

ఆ వూళ్లో వైదికుల్లో చేబోలువారూ, నియోగుల్లో బెండపూడివారూ అధిక సంఖ్యాకులని చెప్పివున్నాను.

ఎందరికయినా, వారూ వీరూ మాత్రమే వారా లిచ్చేవారు.

ఆ వూళ్ళో బులుసువారిది వొక్కటే కుటుంబం, ఆ యింటి యజమాని సుబ్రహ్మణ్యంగారున్నూ వారా లిచ్చేవారు.

ఉండినంతకాలమూ నాకు బసకూడా యిచ్చారు, వారు.

ఒకమాటు, అటు చేబోలువారికీ యిటు బెండపూడివారికీ జాతాశౌచమ్మృతాశౌచాలు వచ్చా యేకకాలాన.

సంధిదినాలు రెండు.

లెక్కకి రెండే కాని, మా విద్యార్థులకవి, దినాలు కాక, వారాలూ మాసాలూ కూడా కాక, సంవత్సరా  లయిపోయాయి.

నామట్టుకి నాకు "ఇక యిక్కడ చదువు సాగదా?" అన్నంత గడ్డుదినా లయిపోయా యవి.

ఆ రెండు దినాలూ గడిస్తే, మామూలుగా అన్నం సమృద్ధే, సందేహం లేదు.

తక్కిన యిళ్ళవారిని ప్రాధేయపడి లాభం లేకపోగా, యిద్దరు విద్యార్థులు, దగ్గిరే వున్న స్వగ్రామం నరిసిపూడి  వెళ్ళిపోయారు.

తర్కవిద్యార్థి, మండపేటలో కాలక్షేపం చేసి వస్తానని వెళ్ళి, యెక్కడో పస్తుపడివుండి, జాముర్రాత్రి అయాక వచ్చి, కడుపులో కాళ్లు పెట్టుకుపడుకుని మొదటి దినం గడిపాడు.

స్కూలుమాష్టరు సంగతి తెలియదు; గాని నేను మిగిలాను.

ఇంటికి వెడదా మంటే యేడెనిమిది మైళ్లు వెళ్ళాలి, రావాలి.

వెడితే మరో రెండు రోజులయినా వుంటేగాని స్నేహితులు విడిచిపెట్టరు, చదువు చెడుతుంది.

ఇదంతా ఆలోచించి ఎటూ పాలుపోక నేను తటపటాయిస్తూ వుంటే, తమ యింటోనే భోజనం చెయ్య మన్నారు, గురువుగారు నన్ను.

గురుపత్ని శేషమ్మగారు "నాయనా, మొగమాటపడకు" అనే అన్నారు గాని; నా కది యిష్టం లేకపోయింది.

ఏమయినా చేసేదిలేక మొదటినాడు వారియింటనే భోజనం చేశాను.

ఆ రాత్రి వోపట్టాన నిద్రపట్టలేదు నాకు.

చాలాసేపు తర్జనభర్జన చేసుకుని "యెలా గయినా రేపు వూళ్ళోనే భోజనం సంపాదించుకోవా"లని దీక్ష పట్టాను.

మర్నాడు పొద్దున్న బాగా ఆలోచించాను.

"ఫలానా ఫలానా వారి యిళ్ళల్లో వొక్కొక్కపూట అయినా భోజనం దొరక్కపో"దనుకున్నాను, బయలుదేరాను.

కాని తిరిగి తిరిగి విసిగిపోయాను.

మళ్ళీ ఆలోచించాను.

ఆ వూళ్ళో వొక సంపన్నగృహ స్థున్నాడు.

స్థితిపరులయినా తక్కిన బ్రాహ్మల వందరివీ యిళ్ళే, ఆయనది మాత్రం మేడ.

పిత్ర్యమూ యెక్కువే ఆయనకు, సొంత ఆర్జనా అధికమే, యేమీ లోటులేదు.

అయితే "కాకికి మెతుకు విదప"డనీ "పిల్లికి భిక్షం పెట్ట"డనీ ఆయన కావూళ్ళో బిరుదులు.

నే నెన్నో మాట్లనుకున్నాను "వారి యింటో వారం సంపాదించి రికార్డు బ్రేకుచెయ్యా"లని, అగత్యం లేకపోయింది.

ఉండగా వుండగా, తిరగ్గానున్నా తిరగ్గా, వారిమేడ తగిలింది, పెద్ద సమస్యలాగ.

అట్నుంచి నరుక్కువద్దామని మళుపు తిరిగాను.

"సమయాని కాయన యెక్కడి కయినా వెళ్ళివుండాలి" అంటూ వెయ్యిమంది దేవుళ్ళకు మొక్కుకుంటూనే వెళ్ళాను గాని; తీరా వెళ్ళాటప్పటికి, గుమ్మం చీడీలమీదికి కాళ్ళుంచుకుని అరుగుమీదే కూచుని వున్నా రాయన.

నా ప్రాణా లెగించిపోయాయి.

కాని, కీడులో మేలన్నట్టు, ఆయన వితంతుసోదరి, లోగుమ్మాన నుంచుని ఆయనతో యేదో మాట్లాడుతోంది.

ఆవిణ్ణే నమ్ముకునే వెళ్ళా నసలు నేను.

అక్కడిదాకా వెళ్ళినవాణ్ణి యేదో మాట్లాడకుండా వెనక్కి రావడానికి వీలులేక, జంకుతూ యెదటికి వెళ్ళి నసుకుతూ సంగతి చెప్పాను.

దానిమీద, ఆయన "మాకు ఆశౌచం, తెలుసా?" అంటూ గదిమారు, లేకపోతే మహా వారం యిచ్చేలాగ.

"తెలుసు"నన్నాను, నేను.

"తెలిసే వచ్చాను, మీ యింటో యెప్పుడూ మీ చెల్లెలుగారే వంటచెయ్యడం కనక, ఆశౌచం అడ్డురా"దని వ్యాఖ్యానం చేసిన్నీ చెప్పాను.

వారి మేడకి వెనక వున్న యింటో నాకు వారం వుంది.

ఆ యింటి యజమానికి నే నంటే మిక్కిలీ ప్రీతి.

వారూ వారూ జ్ఞాతులు.

ఆ యింటివారు, ఈ పెద్దమనిషి విచిత్రప్రవృత్తి తరుచు చెప్పుకుంటూ వుంటారు, కథలుగా.

అయితే, వొకచోట ఆనుకూల్యమూ కలిగిస్తుంది, మరోచోట ప్రాతికూల్యమూ కలిగిస్తుంది, బుకాయింపు.

అదీకాక:—

అలాగ ధైర్యంగా వున్నదున్నట్టు చెబితే, "పాపం, కుర్రపిల్లాడు" అన్న జాలితో ఆదరభావమూ కలిగిస్తుంది "అబ్బో, మాటలు నేర్చావు, కాస్తలేవుగాని —" అన్న తిరస్కారభావమూ పుట్టిస్తుంది, యెదుటిమనిషి సంస్కారాన్నిబట్టి.

అప్పుడక్కడ సరిగా రెండోదే తటస్థించింది కూడా.

"వాకబు చేసుకుని వచ్చావు పాపం! అసలు, కొంటెవాళ్లెవరో బాగా బోధించి పంపివుంటారు నిన్ను, ఫో ఫో" అంటూ వురిమా రాయన, కాళ్లు తాటించుకుంటూ.

"విన్నంతా కన్నాను గాని; యెదురువాదం చేసే వెళ్లిపోదాం" అనిపించింది నాకు.

మంచునే వున్నాను, ఆలోచిస్తూ.

అందుకు సహించలేక "మంచుంటావేం? వెళ్లు వెళ్లు. నీక్కాదూ చెప్పడం?" అన్నా రాయన కటువుగా, మళ్ళీ.

అనుకోకుండా ఆయన సోదరికేసి చూశాను.

ఆమె చూపుల్లో పరితాపమూ, జాలీ కనపడ్డాయి.

"చివరి కామె కలగ జేసుకోకపో" దన్న దిటవుకలిగింది నాకు, దాంతో.

బతిమాలాను.

"ఒక్కపూట భోజనం పెట్టలేరూ?" అనడిగాను.

అయినా, ససేమిరా అన్నా రాయన.

అందుకోడాని కవకాశం చాలకపోయింది కామోసు, మిడుతూ మిడుతూ చూస్తూ వుండిపోయిం దామె.

అన్నట్టు, ఆవేళ అమావాస్య, మొదట చెప్పడం మరిచిపోయాను.

హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది నాకామాట.

"నెగ్గేశాం" అనుకున్నాను.

కాని, నిరశ మాత్రం చేసుకుని "ఇదేంటండీ? ఇవాళ అమావాస్య ఆయె, పిలిచి బ్రాహ్మడికి ఔపాసన వడ్డించుకోడం లేకపోగా, బతిమాలినా లే దంటారు, ధర్మమేనా?" అనడిగాను, చివరి యుక్తిగా.

దీనిమీద అవ్యవధానంగా అందుకుని "ఆ పిల్లాడు చెప్పింది బాగుంది, ఈ పూటమట్టుకి రానివ్వరా పాపం" అందావిడ, మరింత తలుపుచాటుకి నక్కుతూ.

సొంతానికి ఆయనే లోభి గాని, సంప్రదాయసిద్ధమైన కుటుంబం అది, తవ్వి పెల్లగిస్తే కాస్తయినా ఔదార్యం వుండకపోదు తామసపిహితం అయి, మసిపాతను కట్టిన మణిలాగ.

కాగా, ఇక చేసేది లేక "అయితే, నీ యిష్టం వచ్చిన ట్టేడ్చుకో" అంటూ ఆవిడమీద ధుమధుమ లాడి, చివాలున లేచి వూళ్ళోకి చక్కాపోయా డాయన.

పొంగిపోయా న్నేను.

ఇసక పిండి తైలం తీసిన ట్టనిపించింది నాకు.

ఎండమావుల్లో గోదావరీ మధురజలధార లభించినట్టున్నా అనిపించింది.

ఎగిరిపోయాను.

"ఈ పూట భోజనం ఫలానాచోట" అని గురుపత్నికి చెప్పేశాను, వొగర్చుకుంటూ.

చెంబూ మడిపంచా పుచ్చుకుని వెళ్ళి, పెరట్లో పంచె తడిపి అరవెయ్యమని ఆవిడ కిచ్చి, అక్కడే – అరుగుమీదే కూచున్నాను, వచ్చేపోయేవాళ్ళు నన్నే చూసేటట్టు, పాత పాఠాలు గట్టిగా వల్లించుకుంటూ.

ఆయన అలాంటివాడు గాని ఆయన భార్య మహాయిల్లాలు.

జరిగిందంతా ఆడబడుచు చెప్పగా వింది కామోసు, ఆ పూట భోజనం చేసి నేను పెరట్లో చెయ్యి కడుక్కుంటూ వుండగా వెనకనే వచ్చి "సాయంత్రం, పొద్దుండగానే దొడ్డి గుమ్మాన రా నాయనా, మా వదిన పాడిఅన్నమే పెట్టి పంపేస్తారు" అందామె, కంఠం నొక్కుకుంటూ.

"అన్నపూర్ణతల్లివమ్మా" అనుకున్నా న్నేను మనస్సులో

సాయంత్రం ఆవిడ చెప్పినట్టే చేశాను, దగ్గిర కూచుని, బుజ్జగిస్తూ కడుపునిండా అన్నంపెట్టి, మళ్ళీ దొడ్డిదారినే పంపించేసిం దావిడ ఆడబడుచు.

పరమలోభులకు మహైశ్వర్యం పడుతుంది, పూర్వపుణ్యఫలం అనుకుంటాం మనం. పరిశీలించగలిగితే, అత్యుత్కట పుణ్యరూపంగా మహావ్యక్తులుంటా రాయింటో, నిగూఢంగా.

## 16

వల్లూరిలో ప్రవేశించడం మరో ప్రపంచాన పడ్డట్టుంది, నాకు.

చదువు రాసాగింది, ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళి జయించుకురాగలం అన్న ధైర్యం కలగజొచ్చింది, జీవనసరణిలో స్ఫుటమైన మార్పున్నూ ప్రారంభం అయింది, దాంతో.

నిజమే, అయితే, పొరుగూరిలోనే కలిగే మార్పది.

స్వగ్రామంలోనే వుండిపోతే అది సంభవించనూ సంభవించదు, జీవితం రసవంతమూ కాదు, ఆనందం అన్నది అనుభవానికీ రాదు.

పదమూడో సంవత్సరంలోనే నా కది ప్రారంభం కావడం నా అదృష్టం.

బాగానే వుంది, పొరుగూరిలోనే యిలాంటిది తటస్థపడితే, మరి జిల్లా దాటి వెడితే?

దేశమున్నూ దాటి వెడితే?

ఖండానికి ఖండమే దాటి వెడితే?

పుల్లయ్యా వేమవరం లాగ వెళ్ళడం కాక, ఆ వెళ్ళినచోట చదువుకోడమో, వ్యాపారం చెయ్యడమో సాగించివుంటే?

భారత రణక్షేత్రంలో అర్జునుడికి కలిగిందన్న విశ్వరూప సందర్శం అప్పుడే లభిస్తుంది, మనిషికి.

స్వార్థానికి పరసీమ లేవో, పరార్థానికి ప్రారంభాలున్నూ యెక్కడో అప్పుడే బోధపడుతుంది, కర్తవ్యపరాయణుడికి.

ఇంగితజ్ఞానం కలిగి, సృష్టిరహస్యం తెలిసి, మానవశక్తికి పరిమితి యెంతో గుర్తుకివచ్చి, ఐహికజీవితానికి ప్రాప్యం యేమిటో అదిన్నీ అవగాహన అయి, ధన్యత సిద్ధిస్తుంది, జిజ్ఞాసువుకి

ప్రవృత్తిపరంగా చూస్తే, పౌరుషానికి పరిపూర్ణత సిద్ధించడానికి సుగమం అయిన మార్గం యిదీ.

ఎప్పటి కప్పుడే – ఎక్కడి కక్కడే – ఎంత కంతే సంస్కారమున్నూ కలిగించే మార్గం యిదీ.

కాగా:–

"వల్లూరిలో ప్రవేశించడం మరో ప్రపంచంలో పడ్డట్టయింది నాకు" అన్న మాటకి వివరణ యిక్కడ ప్రారంభం అవుతుంది, మెల్లిగా.

జరిగిందేమిటంటే?

పాలమూరిలో నేను మా నాయనగారి కొక్కరికే భయపడేవాణ్ణి, వూరి పెద్దలతో నాకు ప్రసక్తే వుండేదికాదు.

వీలుతప్పితేనే పుస్తకం పుచ్చుకునేవాణ్ణి.

భోజనభాజనాలకు నా ప్రయత్నమే అక్కరలేకపోయేది.

ఇందుకు భిన్నంగా, – వల్లూరిలో నాకు పెద్దలతోనే ప్రసక్తి.

వారి కందరికీ నేను విధేయుణ్ణయి వుండవలసివచ్చింది.

నా భోజనం నేనే సంపాదించుకోవలసివచ్చింది.

చదువే అక్కడ ముఖ్యం అయిపోయింది, నాకు.

దాంతో, కశాఘాతం తిన్న పందెపుగుఱ్ఱం అయిపోయింది, నా పురుషకారం.

ఏమంటే?

వల్లూరిలో, నేను, సూర్యోదయాత్పూర్వమే మేలుకోవాలి, స్థండిలశయ్య విడిచి లేచిన్నీ పోవాలి, యెంత బద్ధకంగా వుండినా.

కాలకృత్యాలు తీర్చుకోడం తడువుగా, నా చెంబు నేను తోముకోవాలి, చన్నీళ్ళతో స్నానం చేసి నా బట్టలు నే నుతుక్కోవాలి, ఆరవేసుకోవాలి, అవి జాగ్రత్త కూడా నేనే చేసుకోవాలి.

పాత పాఠాలు చింతన చేసుకోవాలి.

స్త్రీలు వంట ప్రయత్నాలు ప్రారంభించకపూర్వమే వెళ్ళి వారం చెప్పుకోవాలి.

గురువుగారి యింటో నియతం అయిన పనీ, బస యిచ్చిన వారున్నూ వీలుతప్పి యేదయినా చెబితే అదీ చేసెయ్యాలి, నిమిషాలమీద.

వారంచెప్పినచోట సమయం గుర్తించి భోజనాల వేళకి ముందే వెళ్ళి అక్కడ కనిపెట్టు క్కూచోవాలి, కనపడుతూ.

వంచిన తలయెత్తకుండా పీటమీద కూచోవాలి, అది కావా లిది కావాలని అడక్కుండా భోజనం చెయ్యాలి, పంక్తిలో వున్నవారికి వెగటు పుట్టకుండా.

కొత్తపాఠం స్వయంగా చూసుకుని క్రమం యేర్పరచుకోవాలి, గురువుగారి వీలు కనిపెట్టి చెప్పించుకోవాలి. అది మరపురాకుండా వల్లించుకోవాలి. ఆజ్ఞలకు చెవు లొరజేసుకునేవుంటూ.

వేళ కని పెట్టుకుని మళ్ళీ రాత్రి భోజనం చెయ్యాలి.

వెంటనే పడుకుని నిద్రపోడానికి వల్లకాదు, దేహళీదత్త దీపం దగ్గిర కూచుని చదువుకోవాలి, యింటివారికి చిరాకు పుట్టకుండా గట్టిగానో మెల్లిగానో

ఇంటో అయితే, అర్ధరాత్రి అయినా ముసుగు తన్నుకునే వుండి, అమ్మని లేపి, గద్దించి తెమ్మనవచ్చు, అక్కడ మాత్రం దాహం కావచ్చు కనక, ముందే జాగ్రత్తపడి, సిద్ధంగా వుంచుకోవాలి మంచినీళ్ళ చెంబు – నిద్రమత్తుతో వొత్తిగిల్లడంలో చేతికో కాలికో తగిలి నీళ్ళు వొలికిపోయి, పడుకున్న చాపా, చాపమీద గావంచా, ముసుగుపెట్టుకునే దుప్పట్టీ తడిసిపోకుండా వుండేటట్టు.

ఇంత కార్యక్రమంలోనూ, మధ్యాహ్నం చెప్పించుకున్న కొత్త పాఠం వల్లించుకోడం తడువుగా ఎగిరిపోయి దేవాలయ గోపురం పై అంతస్థున కూచునేవాణ్ణి, ఏమి టేమిటో కలలు కంటూ నేను.

నాకు జ్ఞాపకం వుండినంత వరకూ, ప్రయత్నపూర్వకంగా నేను కల్పనకు పూనుకోడానికి మొదలు ఆ గోపురంమీదే.

అక్కణ్ణించి చూస్తే ఎదట, వరసగా, విరగబూసిన బొగడచెట్ల శిఖరాలు – ఎడమవైపున, ముడుచుకుపోయిన కలవలతో నిండివున్న కోనేరు – వెనక, చిరుగంటలతో ధ్వజస్తంభాగ్రమూ మిలమిల మెరిసే పసిడికుండతో దేవాలయ శిఖరమూను – కుడివైపున, చేతికందేటట్టు మనిషి కలవిగాని గెలలతో కొబ్బరిచెట్ల తలలు – ఇలాగ, ఆ పరిసరా లందు కనుకూలంగానే వుండేవి.

దీనికి సాయం, అక్కడ, నాలుగువైపులనుంచీ కమ్మనిగాలి రివ్వున కొట్టేది, మధ్యమధ్యమాత్రం గబ్బిలాల కంపుతో కలుషితం అయిపోతూ.

అయితే, భాష రాదు, అనుభవం లేదు, భావాలు పుట్టవు. అయినా, వినివుండిన కొద్ది కథలూ ఆధారంగా, చక్కని కథలు కల్పించాలనీ, రసవంతంగా చెప్పాలనీ సంకల్పమూ మొదటి ప్రయత్నమూ కూడా అక్కడే నాకు.

వల్లూరిలో నేను పడ్డ మరో ప్రపంచంలో, మళ్ళీ నా కిది యింకో ప్రపంచం.

నేను లేశమూ సంస్కారం లేనివాణ్ణే అయినా, ఆ ప్రపంచ స్వభావం అది కనక, అందులో పడ్డ వెంటనే నిర్ధారణ చెయ్యలేని ఆవేశం యేదో తలమున్కలయి పరవశుణ్ణి చేసేసేది న న్నుత్తరక్షణంలో.

అందువల్ల గోపురం దిగడం అంటే నా కెంతో బాధగా వుండేది.

పోనీ అంటే, గోపురశిఖరాలమీద సాధారణంగా సరీసృపాలుంటా యంటారు, చీకటి పడితే అవి అక్కడికి వస్తాయేమో అని జంకు.

సూర్యాస్తమయం అవుతుందనగా, సంధ్యావందనం నిమిత్తం తోటి విద్యార్థులు కోనేటికి వస్తారు, వూరివారితోబాటు పరమేశ్వరదర్శనమూ చేసుకుంటారు – అప్పుడు వాళ్ళతో వుండకపోతే యేమి చిక్కో అని కొంకు.

అది రచనా కాదు, రచనాసమాధి అసలే కాదు. సమాధి అంటే యేమిటో

ముక్కూ మొగమూ కూడా నా కష్టడేమీ తెలియదు–అయినా, సగంలో లేచిరావడం అంటే అప్పటికే నాకు బాధగా వుండేది.

తప్పేది మాత్రం కాదు.

గుడిగోపురంమీద సాయంత్రం దాకా కొనలుసాగిన యీ కల్పనా ప్రయత్నాలు, తరుచు, రాత్రిళ్ళు భోజన సమయానా, భోజనం అయాకా గూడా నా తలలో జాగృతా లవుతూనే వుండేవి.

అలాంటి సమయాన, ఎవరితో మాట్లాడ్డం అన్నా విసుగ్గానే వుండేది.

కాని, ఒక్కొక్క రాత్రి, బస యిచ్చిన బులుసు సుబ్రహ్మణ్యంగారు, యేమి టేమిటో అడుగుతూనూ, యేమి టేమిటో చెబుతూనూ జాము న్నరరాత్రి అయేదాకా కూచో పెట్టేవారు, కాదనడానికి వల్లకాకపోయేది.

ఒక్కొక్క రాత్రి, ఆయన భార్య యింటిపను లన్నీ తెమల్చుకొని బయటికి వచ్చేదాకా, అప్పటికి వారికి ఏకపుత్రుడైన సంవత్సరం లోపు కుర్రవాణ్ణి ఎత్తుకుని తిరుగుతూ జోకొడుతూ నిద్రపుచ్చవలసివచ్చేది. సుబ్రహ్మణ్యంగారితో మాట్లాడుతూనే.

ఇలాంటి స్వల్పవిషయాలు కొన్నివుండినా, గురువుగారి కుటుంబమూ, సుబ్రహ్మ ణ్యంగారి కుటుంబమూ చూపించే వాత్సల్యం నా కుత్సాహజనకంగానే వుండేది, మొత్తంమీద.

చదువుకంటే యెక్కువగా వల్లూరి జీవితమే నాకొక రకమైన విద్యాభ్యాసం అన్న ట్టుండేది.

ప్రాజ్ఞత రాని చిన్నతనాన, నా అన్నవాళ్ళెవళ్ళూ లేని పొరుగూరిలో, యిన్ని బాధ్యతలు మీదపడ్డ కుర్రవానికి, నిలకడ వుంటే, జీవనసరణి వొకరు తీర్చి దిద్దవలసిన అగత్యం యేమి వుంటుందీ?

## 17

ఇలాగ ప్రవృత్తి అంతా దానికే మారిపోవడంవల్ల, యే అనధ్యాయాల కయినా పొలమూరు వెడితే, అక్కడ పాలుపోయేది కాదు నాకు.

పొలమూరు ప్రవేశించేటప్పటికే వల్లూరి దినచర్య అంతా కట్టిపెట్టేసే టంతటి బద్ధకం అలుముకునేది, నిద్ర మైకంలాగ.

దీనికి సాయం, పొలమూరి సహచరులందరూ ఆటగాళ్ళు.

చదువు నిలిచిపోయి, పెద్దల శిక్షణ చాలినంత లేక, తినడమూ తిరగడమూ మాత్రమే నిరాఘాటంగా సాగిపోతున్న ఆటగాళ్ళు వారు.

నేను వచ్చానని. తెలిశాటప్పటి కెగిరివచ్చి "రా, ఆడుకుందాం" అనేవారు.

బ్రాహ్మణ పిల్లలు గదా వింటారని భావించి మంచిమంచి శ్లోకాలు చదివి చెప్పబోతే "నీ శ్లోకా లెవడి క్కావాలి, రావోయ్" అంటూ చెయ్యిపట్టుకుని లాక్కుపోయేవారు, వారు.

మున్సబుగారి అయిదో తమ్ముడూ, ఆరో తమ్ముడూ, పెద్దబ్బాయిగారి పెద్దబ్బాయీ, నేనూ – ఇదీ మా జట్టు.

ఇందులోనూ మళ్ళీ మున్సబుగారి అరోతమ్ముడు ఆనందానికీ నాకూ వొకటే ప్రాణం.

ఆటల్లో మా కిద్దరికీ కుండబంతి చాలా యిష్టం.

అందులో, మా వూళ్ళో మమ్మల్నెవరూ గెలవలేక పోయేవారు.

మేమిద్దరమూ అటూ యిటూ పెండేకాసులంగా వుండి, రెడ్డియువకుల్ని సత్రకాయలుగా చేర్చుకుని ఆడేవాళ్ళం తరచు అది.

అప్పు డప్పుడు ఉప్పట్టీ చెడుగుడూ కూడా ఆడేవాళ్ళం.

మా యీడు కుర్రవాళ్ళలో దండపట్లకు ఆనందమూ; దండ దెబ్బలకు నేనూ మొనగాళ్లం.

మా వూళ్లో (మా ప్రాంతంలోనే) చెరుకుతోటలు మెండు.

చెరుకుపానకం కోసం దినమ్మూ మే మొక్కొక్క గానుగు దగ్గిరికి వెళ్ళేవాళ్ళం.

మేమంటే – మున్సబుగారి తమ్ములూ, వైద్యుడుగారి పెద్దబ్బాయీ, సిద్ధాంతిగారి అబ్బాయీ కావడంవల్ల యెక్కడికి వెళ్ళినా, మాకు చెరుకుపానకమూ, చెరుకుగడలూ, వేడి బెల్లమూ, లంజె బెల్లమూ ప్రీతిగా యిచ్చేవారు రైతులు.

కొబ్బరీ, మోహనదుంపలూ పట్టుకువెడితే, పాకంలో వుడికించిన్నీ యిచ్చేవారు, తరుచు.

వేసవిలో ముంజెలు కొట్టించుకు తినడమున్నూ మా ముఖ్య కార్యాలలో వొకటి.

మేమిలాగ పొలాలు తిరుగుతూ వుండడంలో వొకనాడొక విశేషం జరిగింది.

ఆవేళ నేనూ ఆనందమూ దివాకరరాజుగారితో బయలుదేరాం, జట్టు విడిపోయి.

మా వూళ్ళో వొక్కటే క్షత్రియ కుటుంబం, ఆ కుటుంబం యజమానులే దివాకరరాజుగారు.

వారి యేకపుత్రులు సూర్యనారాయణరాజుగారితోనున్నూ మే మెప్పుడయినా ఆడుకునేవాళ్ళం, అయితే, మాకంటే కొంచెం పెద్దలు వారు.

పెద్దాపురం రాజబంధువులు వారు, లోటు లేని కుటుంబం.

ఇంటిపేరు "దాట్ల"వారు; కాని "శ్రీ దాట్ల"వారు అనాలి, వారిని.

బ్రాహ్మణ కుటుంబాలకూ ఆ క్షత్రియ కుటుంబానికీ ఆ వూళ్ళో యెప్పుడూ అభేదం.

బ్రాహ్మల కెవరికీ వారితో అర్థార్థిసంబంధం లేదు, హార్దికమే కాని.

దివాకరరాజుగా రప్పటికి కొంచెం వృద్ధులు, పళ్ళూడిపోయి వుండడంవల్ల పరిచితులకే విడిపోయేవి, వారి మాటలు.

రెడ్లలో యెందరో కౌలుదా ర్లుండేవారు, చెరుకుగానుగుల రోజుల్లో దినాని కొక గానుగు దగ్గిరికి వెళ్ళడం పెట్టుకున్నారు, దివాకరరాజుగారు.

వారే పిలిచారు మా అరుగుమీద కూచుని వుండగా, మమ్మ ల్నావేళ.

రాజుగారిని చూశాడు రైతు, వారితో మమ్మ ల్నిద్దర్నీ చూశాడు, యెదురువచ్చి రాజుగారికి స్వాగతం చెప్పాడు.

మేము ముగ్గురమూ దిమ్మమీద కూచున్నాం.

ఎదుట నుంచుని రాజుగారితో మాట్లాడుతున్నాడు రైతు, అతని తమ్ముడు చెంబులూ గ్లాసులూ కలిపి మూడు పాత్రలతో పచ్చిపానకం తెచ్చి మా యెదట వుంచాడు.

అయితే, వచ్చిన పని మరిచారు రాజుగారు, పానక పాత్రలూ గమనించలేకపోయారు, మాటమీద మాట ఆడేస్తున్నారు, రైతుతో.

మాకు మాత్రం నోళ్ళూరిపోతున్నాయి.

కాకపోయినా, ఆలస్యం అయితే, గానుగులో పిండినచెరుకు రసం కనరెక్కిపోతుంది, అందులో దవ్వ వేసినా.

ఉండలేకపోయాడు ఆనందం.

"తాగండి" అన్నాడు రాజుగారిని, ముందే మేము పుచ్చుకోడం ధర్మం కాదు, కనక.

కాని దాంతో యెగిసిపడ్డారు రాజుగారు, పళ్ళు పటపట్టాడిస్తూనూ, నిప్పులు కక్కుతూ చూస్తూను.

"తాగండిట తాగండి. నాలుక ఆడినట్టల్లా వాగడమేనా? కల్లు తాగుతారు, పానకం పుచ్చుకుంటారు, తెలుసా?" అనిన్నీ వురిమారు వారు, వూగిసలాడుతూ.

అదే మొదటి మాటు వారి ప్రచండ మూర్తిని చూడడం, చకితుణ్ణయి పోయా న్నేను.

కొయ్యే అయిపోయాడు, ఆనందం.

ఏమిటో, యెందుకో తెలియక దిగ్భ్రాంతు డయిపోయాడు రైతు.

చూసిచూసి, తమకి తామే ప్రసన్ను లయినారు రాజుగారు, కాగి చల్లారిన పాలవంటి వయస్సు కనక, వొక్కక్షణానికి.

అప్పటికీ మేము బెదురుచూపులే చూస్తున్నాం.

అది గుర్తించి ఫక్కున నవ్వేశారు రాజుగారు, ఆ పరిసరాలన్నీ సౌమ్యపరుస్తూ, ముందు.

"ఇంకెప్పుడూ అలా అనకండి, పానకం పుచ్చుకోండి తొరగా, కనరెక్కిపోతుంది, ఆలస్యం అయితే" అంటూ పాత్ర అందుకున్నారు, తరవాత.

మేమూ అందుకున్నాం పాత్రలు, వొక చుక్క అయినా మిగల్చకుండా పానకమూ పుచ్చేసుకున్నాం గాని; రాజుగారి మొగం చూడలేక పోయాడు, ఆనందం మరి ఆవేళకి సూటిగా. నాకు మాత్రం రాజుగారి ఆక్షేపణ అస్థిగతం అయిపోయింది.

చెప్పవచ్చిం దేమిటంటే?

అది మొదలు - మంచినీళ్ళు, పానకం, పాలు, పెరుగు, మజ్జిగ, సోడా, కాఫీ, టీ - ఇలాంటి వేమయినా - "పుచ్చుకోడం" "పుచ్చుకో" పుచ్చుకున్నాను. అనే తప్ప "తాగడం" "తాగు" "తాగుతున్నాను" అన్నమాట రాదు, నా నోట.

సొంతానికి కొన్ని తెలియకపోవచ్చు, తోచకా పోవచ్చు గాని; చూశాక కూడా మంచి పద్ధతులు అలవాటు చేసుకోకపోవడం వివేకం కాదు, ఎలాంటివారికీ కూడా.

సమానార్థకాలే కావచ్చు కొన్ని శబ్దాలు, భాషలో వాటి అంతస్థులు వేరూ, వాటి ప్రయోజనాలు వేరూ, వాటి ప్రయోగసరణిన్నీ వేరూను.

ఇది తెలిసి వాడితేనే శబ్దాలలో శక్తి కనపడనా, కవిత్వం పొటమరించినా.

గొప్ప పండితులు మాత్రమే అయినవారు చేసే రచనలు గొగ్గిపళ్ళలాగ అసహ్యంగా వుండడానికీ, నిజంగా కవులయినవారు చేసే రచనలు ద్రాక్షగుత్తుల్లాగ అస్వాద్యాలు కావడానికీ యీ పరిజ్ఞానం లేకపోవడమూ వుండడమూ తప్ప మరేమీ కారణం కాదు.

పద్యంలోనూ వచనంలోనూ కూడా వ్యాకరణగ్రంథాలెన్నో వున్నాయి మన భాషలో; కాని తత్కర్తలలో వొక్కడికిన్నీ ప్రయోగవైచిత్రికి సూత్రాలు వన్నా లన్న జ్ఞానమే లేకపోయింది.

జాతిని పట్టుకుని వుండే విషయాలకు సంబంధించి వచన వాఙ్మయం లేకపోయింది మనకి ప్రాచీనం, అంచేత కూడా మనవారికి మన భాషలో జాతీయమైన పలుకుబడి అందని పండయిపోయింది.

కాక:—

కవిత్వ పరిధుల్లోనే కాదు, శబ్దాలకు, సంఘ పరిధుల్లో కూడా యీ విచక్షణ మిక్కిలీ అగత్యమే.

కాని, అగ్రజాతులవారున్నూ అనేకులు స్థలాస్థలాలూ, తరతమభేదాలూ గుర్తించు కోకుండా దుడుగూదుడుగూ మాట్లాడేస్తారు, మనలో.

తరతరాలుగా. నిన్నటిదాకా ప్రభువులూ, ఇవాళదాకా జమీందార్లూ, వారివారి బంధువులన్నూ అయి వుండినవారు కనక, క్షత్రియులూ పద్మవెలమలూ మాత్రమే ఉన్నతసంప్రదాయాలు నిలుపుకుంటూ వస్తున్నారు మాటలు వాడ్డంలో, మనలో – ఇంకా.

స్త్రీలయినా పురుషులయినా ఉన్నతకుటుంబాలకు చెందిన యిద్దరు క్షత్రియులు కలిసి కాస్సేపు మాట్లాడుకుంటే, అది సాంసారిక ప్రసంగమే అయినా, మహాకవులున్నూ పట్టుకోవలసినంత మధురంగానూ హుందాగానూ వుంటుంది, వారి భాష.

చిన్నతనంలోనే రచనావ్యగ్రత కలగడానికి తోడు మా వూరిలోనే రాజబంధువు లయిన శ్రీ దాట్లవారి కుటుంబం వుండడమూ, ఆ కుటుంబంతో నిత్య సాహచర్యం వుండడమూ, నిజంగా, సరస్వతీదేవి సాక్షాత్కరించి కాళిదాసుకి నాలుక మీద బీజాక్షరాలు రాసిందిట చూడండీ – అలా అయింది నాకు.

## 18

తూర్పు తెల్లవారుతోం దనగా కలుసుకునేవాళ్ళం, మళ్ళీ చీకట్లు ముదురుతున్నా యనగా విడిపోయేవాళ్ళం మేము.

మా వూళ్ళో, బుద్ధవరపు పేర్రాజుగారనే నియోగివృద్ధు లొకాయన "ఇంకొకకన్ణో వన్ణయినా కలుపుకోండి, పంచపాండవు లయిపోతా"రనే వారు, మమ్మల్ని చూసి తరుచు.

మా పొలాల జమాబందీకి సంబంధించిన గాథ లనేకాలు, వాటిలో మరొకటి, – మా వూరి రైతాంగం అంతా భూమంచిరెడ్లు.

ఒక్క క్షత్రియకుటుంబమూ, పది పదిహేను కమ్మకుటుంబాలూకూడా వున్నాయి గాని, పెత్తనం అంతా ముందు మున్నబు కరణాలదీ, తరవాత రెడ్లదిన్నీ.

ద్వారంపూడి మంగిరెడ్డి అని రెడ్లలో వొక సంపన్నగృహస్థు.

అతని కిద్దరు తమ్ములు, ముగ్గురూ ఆణిముత్యాలు వారు.

వారిలో యెవరు కావలసినా పొలాల్లోనే దొరకడం తరుచు.

పగలంతా పొలాల్లో వ్యవసాయం పనులూ, రాత్రి యింటిలో నిద్రా – ఇంతే వారి దినచర్య.

మేము నలుగురమూ వొకనా డొక గానుగు దగ్గిర చెరుకు పానకం పుచ్చుకున్నాం, తృప్తిగా.

పచ్చిపానకం, చెరుకుగడలు, వేడిబెల్లం – వీటిలో వొకటి పుచ్చుకున్న చోట మరొకటి పుచ్చుకోగూడదని ఆనందం యేర్పాటు.

అదయ్యాక యెవరి గానుగు దగ్గిరికి వెళ్ళడమా అంటూ కూడబలుక్కుంటూ కాలవగట్టే వెనక్కి మళ్లాం.

ఊరికి దగ్గిరగా, వనుమలమ్మగుడికిన్నీ నైఋతిగా, కాలవ దక్షిణాన అరఫర్లాంగులో మంగిరెడ్డి చెరుకుతోటా, తోటమధ్య దిమ్మా, దిమ్మమీద గానుగూను.

"అందరమూ కాలవగట్టున వుండి, వొక్కొక్కళ్ళమే వెళ్ళి చెరుకుగడలు తెచ్చుకుందాం" అన్నా డానందం.

చివర, ఒక్క నిమిషం మేము ఇద్దరమూ "నువ్వు ముందు" అంటే "నువ్వు ముందు" అనుకున్నాక, ముందు ఆనందం వెళ్ళాడు.

ముగ్గురి తరవాతా నేను వెళ్లాను కాని; ఆ ముగ్గురికీ మూడు గడలిచ్చిన మంగిరెడ్డి, ఎప్పుడూ లేంది, నన్ను చూసి విసుక్కున్నా డావేళ, ముందు.

"ఇందాకా వచ్చి పుచ్చుకుని, గడ దాచేసుకుని మళ్ళీ వచ్చారా?" అంటూ నిలవతీశాడు, తరవాత.

దానిమీద "ఇష్టం లేకపోతే నువ్వు నా కివ్వడం మానెయ్యి, అంతేగాని, అబద్ధమాడుతున్నాననీ, మళ్ళీ వచ్చాననీ అనకు, నేనిదే రావడం" అని బదులు చెప్పి, మేము చేసుకున్న వప్పందమున్నూ వివరించి చెప్పా న్నేను.

కాని, అతనది వినిపించుకోలేదు.

అభిమానం ముంచుకువచ్చి, గిరుక్కున తిరిగి వెనక్కి వచ్చేశా న్నేను.

"సిద్ధాంతిగారి అబ్బాయి వచ్చినట్టులే దన్నయ్యా" అని అతని తమ్ముడు సుబ్బారాయ డనడమూ "వచ్చారు, నా చేత్తో నే నిచ్చాను గడ" అని మంగిరెడ్డి అనడమూ నా చెవిలో పడ్డాయి, వెనకనే వచ్చి.

నేను చాలా బాధపడ్డా నందుకు.

వచ్చి, జరిగిందంతా జట్టుతో చెప్పాను.

వారు ముగ్గురూ తమ గడల్లో నాకు వాటా లివ్వబోయారు గాని "మంగిరెడ్డి నే నబద్ధమాడా నన్నాడు. అతని తోటలో చెరుకుగడ నా కక్కరలే"దని నేను వారించాను, వారిని.

"మరో గానుగ దగ్గిరికి వెడదాం" అన్నా డానందం; కాని ఆ స్థితిలో అందుకూ అంగీకరించలేకపోయా న్నేను.

అందరమూ వూళ్లోకి బయలుదేరాం.

నాకు జరిగింది తలుచుకుని కించపడుతున్న ఆనందం, మంగిరెడ్డి తమ్ముడు నా వెనకనే వచ్చి మమ్మల్ని పరిశీలించి వెళ్ళిపోవడం గమనించాడు.

ఇంటికి వచ్చాక, మంగిరెడ్డి మాటలకింకా బాధపడుతూ బిక్క మొగం వేసుకుని నూతిపెరట్లోకి వెళ్ళిపోయి, నూతి పళ్ళెంలో వున్న నీరు అమృతపాణీ అరటిబోదెలకు మళ్ళిస్తూ కూచున్నా న్నేను.

కొంతసేపటికి వీధిలోకి రమ్మని నాకోసం మా చెల్లిలిని పంపారు, మా నాయనగారు.

వెళ్ళి చూడగా, అయిదారు చెరుకుగడలూ, వేడిబెల్లమూ స్వయంగా పట్టుకు వచ్చి మంగిరెడ్డి మా నాయనగారితో మాట్లాడుతున్నాడు.

నన్ను చూసీ చూడ్డంతోనే "మీకోసం చెరుకుగడలూ, వేడి బెల్లమూ తెచ్చాను, పుచ్చుకోం డబ్బాయిగారూ" అన్నాడుకూడ ఆత్రంగా అతను.

దాంతో జరిగిందంతా మళ్ళీ నెమరుకి వచ్చి, "నే నబద్ధాలాడుతానుగా? నాకు వద్దులే" అన్నాన్నేను.

మా నాయనగారూ అతనూ మాట్లాడుకున్నారు.

"తప్పుతప్పు, పెద్దమనిషి స్వయంగా యింటికి పట్టుకువచ్చాడు వద్దనగూడదు, పొరపడ్డా నంటున్నాడుగా?" అంటూ నాకు సద్దిచెప్పారు మా నాయనగారు.

"పుచ్చుకోండిబాబూ" అంటూ రెడ్డికూడా బతిమాలాడు.

మా నాయనగారు మళ్ళీ మళ్ళీ చెప్పగా – చివరికి కోప్పడగా "వాళ్ళతోపాటు నా కివ్వవలసిందొక్కటే గడ, తక్కినవి నా కక్కరలే"దన్నాన్నేను.

"సరే అలాగే చేయించండి" అన్నాడు రెడ్డి.

మోపు విప్పి వొక గడ యిచ్చాడు.

"తక్కినవి జాగ్రత్త చేయించండి, మరి" అన్నాడు మా నాయనగారితో, చివరికి.

"ఇంటో పెట్టు" అన్నారు మా నాయనగారు, నన్నే.

చేసేది లేక, నా గడ వొక్కటే ముందు ఇంటో వుంచివచ్చి తక్కినవి తరవాత పట్టుకువెళ్ళాను, బెల్లంతో సహా.

ఇది చూసి మంగిరెడ్డి తెల్లబోయాడు.

నాలుక కరుచుకున్నాడు.

"అబ్బాయిగారి పట్టుదల మహా చెడ్డది, నేను గుర్తించలేకపోయాను" అంటూ పశ్చాత్తాపపడ్డాడు.

బతికి వుండినంతకాలమూ యిది మరిచిపోలేదు, మంగిరెడ్డి.

మేము పొలమూరు విడిచి మహేంద్రవాడ గ్రామంలో ప్రవేశించాక గూడా యెప్పుడయినా కనబడితే యెంతో మర్యాద చేసేవా డతను.

అప్పు డీగొడవ అంతా అక్కడ వుండినవారితోనున్నూ చెప్పేవాడు.

ఇలాగ, మా జట్టుతో కలిసి ఆ రోజుల్లో ఎన్నో పొలాలు తిరిగా న్నేను.

ఎన్నో ఆటలాడాను.

అయితే, ఉన్నట్టుండి, మా ఆనందం, పెళ్ళి అయిన యేడాదికి, భార్య రజస్వల అయిన కొద్ది మాసాలకు, ఆకస్మికంగా జ్వరపడి, విషమించగా హఠాత్తుగా చనిపోయాడు.

ఎంతో తెలివయినవాడు మా ఆనందం,

ఎంతో చురుకయినవాడు.

ఏమిటేమిటో ప్లానులు వేసి నిమిషంలో సాధించేవాడు.

నాకు మన సిచ్చేసి నా మనసు పుచ్చుకున్నాడు.

అన్నగారిని కూడా కాదని తా నేది అనుభవిస్తే అది నేను కూడా అనుభవించేదాకా విడిచిపెట్టేవాడు కాడు.

నాకోసం భోజనమున్నూ మానేసేవాడు.

పెళ్ళి అయాక "యింకా యింకా" అంటూ కొసిరి కొసిరి మంచి శ్లోకాలు చదివించుకుని విని ఆనందించేవాడు.

మా ఆనందం అకాలమరణం వాతబడిపోయాడు.

నన్ను విడిచి ఆనందధామానికిన్నీ వెళ్ళిపోయాడు.

## 19

దీపావళి వస్తోందంటే తమ పత్రికలకు దీపావళి సంచికలు ప్రకటించుకోవాలని యిప్పటి పత్రికాసంపాదకుల కెంతెంతో తహతహ.

ఇది చూస్తే రకరకాల బాణసంచా తయారుచేసుకోవాలని నే నప్పుడు పొందుతూ వచ్చిన తహతహ అంతా జ్ఞాపకం వస్తోంది.

మొదటిమాటు, పది సంవత్సరాల వయస్సున నే నీ తహతహలో పడ్డట్టు జ్ఞాపకం.

చదువుకుంటూ మా అన్న లిద్దరూ పొరుగూళ్ళలో వుండేవా రప్పుడు.

మా చిన్నక్కా, నేనూ, మా చెల్లెలూ మాత్రం యింటో వుండేవాళ్ళం.

పెళ్ళయింది గాని మా చిన్నక్క యింకా కాపరానికి వెళ్ళలే దప్పటికి.

శరన్నవరాత్రులు వచ్చాయంటే, బండెడు తాటాకుపుస్తకాలూ, రెండు పెట్టెల కాగితం పుస్తకాలూ పూజాపీఠం మీద పేర్చి సరస్వతీపూజ చెయ్యడం తాతముత్తాతల దగ్గిర నుంచీ మా యింటో వున్న ఆచారం.

సంకురాత్రికంటేనూ పెద్దపండుగ మా కది.

మా అన్నలు అందుకోసం తప్పకుండా యింటికి వచ్చేవారు.

ఎవ రెవరి పెరళ్ళలోనూ వున్న పువ్వులన్నీ అడిగి కోసుకురావడమూ, ఏమేమి పిండివంటలు తయారవుతున్నాయో, అవి యెంతవరకూ వచ్చాయో మాటిమాటికీ అడుగుతూ మా అమ్మగారిని విసిగిస్తూ వుండడమూ, అందరికంటేనూ ముందుగా స్నానంచేసి, మడిబట్ట కట్టుకుని, పుస్తకాలమీద నిన్న పూజచేసిన పువ్వులన్నీ

తీసివెయ్యడమూ, నా పళ్ళెంలో మంచి పువ్వులుండేటట్టూ యెక్కువగా వుండేటట్టూ చూసుకోవడమూ, సాంబ్రాణి పొడిచేసి హారతికర్పూరమున్నూ విడివిడిగా పొట్లాలు కట్టడమూ, తాంబూలాలు సద్ది వుంచడమూ, తరవాత మా నాయనగారు మంత్రాలు చెబుతూ వుంటే మా అన్నలకంటే యెక్కువ ఉత్సాహంతో పూజచెయ్యడమూ – ఇలా వుండేది ఆ శరన్నవరాత్రుల్లో నా అడావుడి.

ఆ పూజలు ముగిసి, పుస్తకా లొకనాడు ఎండలో వుంచి, పెట్టెలలో పెట్టి యెక్కడి వక్కడ గడమంచీమీద సర్దడం తడవుగా "దీపావళి వచ్చేస్తోంది" అంటూ యింటో మా చిన్నక్క తొందర పెట్టేది, సాధన సామగ్రి సంపాదించడంలో నేను తహతహ లాడిపోయేవాణ్ణి, వీధిలో.

నా ప్రయత్నాలు చూసి మా చెల్లె లొక్కొక్కమాటు పొంగిపోయేది.

తలా తోకా లేని ప్రశ్నలు వేస్తూ వొక్కొక్కప్పుడు విసిగించేది.

కోపగించి మూతి బిడాయించుక్కూచునే దొకమూల, వొక్కొక్కప్పుడు.

ఇదంతా చూసి మా అమ్మగా రొకమాటు నవ్వుకునేవారు.

ఒకమాటు కోప్పడేవారు.

ఒక్కొక్కమాటు దగ్గిర కూచుని సలహాలు చెప్పేవారు.

తాటాకు టపాకాయలూ, చక్రకాయలూ, మంగాపు కాయలూ, మతాబాలూ, పేకజువ్వలూ – ఇవీ అప్పుడందరూ తయారుచేసుకునే బాణసంచారకాలు.

మతాబా అగ్గిపెట్టెలూ, గోడ టపాకాయలూ, సీమటపాకాయపెట్టెలూ, సిసింద్రీలూ, బందరు తూటాలూ, ఎక్కణ్ణుంచో అమ్మకానికి వస్తే యిష్టమైనవి కొనుక్కునేవాళ్లం.

చక్రకాయలూ, పేకజువ్వలూ, మంగాపుకాయలూ వయస్సు వచ్చినవాళ్లే తయారుచెయ్యగలవి.

అంచేత, నేనింకా పెద్దవాణ్ణి కాలేదే అని యెంతో యిదయిపోయేవాణ్ణి ఆ రోజుల్లో.

పెళ్లి అయాక గూడా అవి కట్టలేకపోవడం యేమిటనిపించేది, మరీని.

అప్పటికి నేను వల్లూరిలో చదువుకుంటున్నాను.

సరస్వతీపూజలు ముగిశాయి, ఏకాదశినాడు వల్లూరు వెళ్లాను, అష్టమి నవమిల్లో యింటికి వెడతా నని అనుజ్ఞ కోరాను గాని "బాణసంచా తయారుచేసుకోడానికి" అనేటప్పటికి మాత్రం "వల్లకా" దనేశారు గురువుగారు, కచ్చితంగా.

ఒక్కనాడు పాఠం పోయినా మిక్కిలీ పరితపించే గురువులు వారు.

దీనికి సాయం గురుపత్ని శేషమ్మగారు, దినమ్మూ కమ్మవారి యింటికి వెళ్లి మజ్జిగ తీసుకురావలసిన భారం నామీద వుంచివున్నా రదివరకే.

సమయానికి మజ్జిగ అందక అన్నాళ్ళిబ్బందిపడ్డాని కామెకూడా వొప్పుకోలేదు.

దానా దీనా బహుళపక్షం అంతా నా కక్కడే వుండిపోవలసివచ్చింది.

ఆ పక్షం పక్షం నా కాహారం సయించలేదు, నిద్రపట్టలేదు, చదువున్నూ వొంటబట్టలేదు, మనసు మనసులో లేక.

ఆ వూరి కుర్రవాళ్లు వొకటీ రెండూ టపాకాయలు పేల్చేస్తున్నా రప్పటికే, వీధివీధికీ తిరుగుతూ.

అవి బాగా పేలితే "మనమున్నా అలాగ పేలేటట్టు కట్టా"లనీ, అవి తుస్సుమంటే "ఛా, చేతకానివాళ్ళు" అనీ అనుకునేవాణ్ణి, నాలో నేను.

ఇలాగ నే నాందోళనపడగా పడగా, యేకాదశి వుపవాసం చేసి, ద్వాదశి పారాయణ కూడా కానిచ్చి, నిద్రపోయిన్నీ లేచి, పాఠం కూడా కానిచ్చేసి, అప్పుడు సెలవిచ్చారు గురువుగారు "మళ్ళీ త్వరగా రావాలి సుమా" అంటూ దృఢంగా ఆజ్ఞాపిస్తూనే.

"చిత్తం చిత్తం" అన్నాను సవినయంగానే; కాని మూట చంకన పెట్టుకుని గుమ్మం దిగాను, యెగిరిపోయాను.

## 20

"ఏం, అంత భయమెందుకూ?" అంటే అదే గురుకులవాసం విశిష్టత.

విద్యార్థి అయినవాడు "జీతం పారెయ్యడ"మూ, గురువయినవాడు "జీతపురాళ్లు చేతిలో వేసుకోడ"మూ అయితేనే అది మరో ప్రపంచం అవుతుంది.

"పూర్వరూపం ఆచార్యుడు. ఉత్తరరూపం శిష్యుడు. సంధి విద్య. సంధానం ప్రవచనం" అన్న ఉపనిషద్వాక్యం యిక్కడ అనుసంధించుకోవాలి.

కనక, డబ్బు కాదు ఇక్కడ ప్రవర్తకం, హృదయం.

గురువు పక్షంగా వాత్సల్యమూ, శిష్యుని పక్షంగా భక్తీ జీవనాడులై యిక్కడ ఆత్మీయత రూపొందిస్తాయి.

అంచేత, పనిమీద యింటికి వెళ్ళిన శిష్యుడు, మళ్ళీ వచ్చేటప్పటికి గురువుచేత "నాయనా, వచ్చావా?" అనిపించుకోవాలంటే, వినయం కాక ధౌర్త్యం యేమి వుపకరిస్తుందీ?

ఉన్నది యిది కావడంవల్ల, అనుకున్న వెంటనే నన్నింటికి వెళ్ళనివ్వనందుకు గురువుగారిమీద కోపం రాలేదు నాకు, వల్లూరులో వుండిన పనీ, వారు కదలవద్దనడానికి గల కారణమూ తెలుసు కనక.

అయితే, అంతవరకూ బిగపట్టుకున్న చాపలం అంతా, మళుపుతిరిగేటప్పటికి వుద్ధృతం అయి కంగారుపెట్టేసింది నన్ను.

కానయితే సూరేకారమూ గంధకమూ మండపేటలో కొనుక్కునే ముందుకు సాగాను; కాని యెన్నిమాట్లు లెక్క చూసుకున్నా, త్రయోదశీ చతుర్దశీ – రెండు దినాలే గడువు కనపడింది నాకు.

అమావాశ్యనాడు తెల్లవారాటప్పటికి తలంటు అయిపోతుంది, అదయాక మందు ముట్టుకోడం అంటే మహావెగటు.

మరి, ఆ రెండు దినాల్లోనూ యేమవుతుందీ?

చక్రకాయలు కొంచెమయినా తయారుచేసుకోవచ్చు, మరి జువ్వలు?

పేకముక్కలు సంపాదించాలి, తడిపి గొట్టాలు చేసి నారచుట్టి పిండిరాసి ఆరబెట్టడమే కాదే, యిక మందు దట్టించడం యెప్పుడూ?

టపాకాయలకున్నూ వొత్తులు చెయ్యాలి, అవి ఆరాలి, కూరాలి, కట్టాలి – ఇవన్నీ యెప్పుడూ?

తాటాకు కొట్టించాలి, ఎండాలి, గియ్యాలి – ఇవన్నీ యెప్పుడూ?

చక్రకాయల కోసం కోడియీాకలు కావాలి, వాటికోసం వూరంతా తిరగాలి – అదెప్పుడూ?

పోనీ, కాటుకలాగ మందయినా మెత్తగా నూరకుందామంటె కంది బొగ్గేదీ? అది కాకపోతే జిల్లేడు బొగ్గయినాయేదీ?

ఇదంతా తలుచుకునేటప్పటికి నాకు మతిపోయింది; కాని వొక్క దిలాసా మాత్రం కనపడింది, కావలసినంత.

ఇప్పుడుందో లేదో అది, ఆ రోజుల్లో వల్లూరు గ్రామంలో బ్రాహ్మణ యువకులూ కమ్మయువకులూ ముందు కలిసి, తరవాత రెండుపార్టీలుగా చీలిపోయి, పెద్దచెరువు గట్టున బాణసంచాతో రామరావణ యుద్ధం చేసేవారు, దీపావళినాటి రాత్రి.

ఇది గోదావరి జిల్లా అంతటా జరిగే వేడుకే గాని, వల్లూరి యుద్ధంలో "చీకటిజువ్వ"లని వొక కొత్తరకం బాణసంచా వుండేది.

వాటికి వడి యెక్కువ, ధ్వని యెక్కువ, పొగా యెక్కువే గాని పువ్వులు మాత్రం వుండవు.

ఇప్పటి విమానం ధ్వనిని మించిన ధ్వని దానిది.

చీకట్లో అంటించి విడిచిపెడితే, వస్తోంది అని తెలుస్తుంది; గాని కనపడ దది.

ఇంతలో మీదపడి అది నానా అల్లరీ చేసేస్తుంది.

అప్పటికీ యిప్పటికీ నే నది వల్లూరిలోనే చూడడం.

ఇప్పటి మాట యేమోగాని, అప్పటి మా పొలమూరి వాళ్లు అది వినిన్నీ యెరగరు.

"కనక, అవి సంపాదించుకువెడితే మనవూరివాళ్లు డంగయిపోతా"రని తోచింది నాకు.

పాతిక జువ్వలు కొనుక్కుని వెళ్లాను, చీకటిపడాటప్పటికి.

అప్పటికప్పుడు లైపిండి చేసి, కాగితం ముక్కలు కత్తిరించి, రాత్రంతా మేలుకుని వత్తులు చేశాను.

త్రయోదశినాడు పొద్దున్న చీకటితోనే చద్దన్నం తిని, సామగ్రి యెండవచ్చేచోట పెరట్లో పెట్టి, తాటాకు కొట్టించడానికి పొలాలకేసి బయలుదేరాను.

ఒకచేలో వున్న చెట్టు ఆకులు సాఫుగా వుండడం చూసి, ఆ ప్రాంతాన పశువులు మేపుతున్న కుర్రవాణ్ణొకణ్ణి పిలిచి, ముందు కానీ చేతిలో పెట్టి చెట్టెక్కమన్నాను.

అవసరం తీర్చుకోవాలన్న ఆదుర్దాతో, ఆ చెట్టు ఆకులు కొట్టించుకోవచ్చునో కూడదో, అసలది యెవరిదో ఆలోచించనే లేదు, నేను.

కానీ చూసుకున్నాడేగాని కుర్రవాడున్నూ యిది యోచించలేదు.

నే నాకులు కొట్టమన్నాను, వాడు చెట్టెక్కాడు, అంతే.

అయితే, వుడతలాగ పాక్కుంటూ యెక్కి నాలుగయిదాకులయినా వాడు కొట్టాడో లేదో, పక్కనే వున్న చెరుకుతోటలోనుంచి గావుకేకలు వచ్చాయి.

ఒక మనిషిన్నీ వచ్చాడు గాలి దుమారం లాగ, మండిపడుతూ,

చెట్టుమీది కుర్రవాడు, గడగడ వొణికిపోతూ ఆకుల్లోనక్కా డతణ్ణిచూసి.

అదేమిటో, యిదెందుకో నా 'కర్థం కాలేదు.

వచ్చిన మనిషి కూడా, అతిదురుసుగా బయలుదేరినవాడల్లా, నాకేసి చూస్తూ, క్రమాంతరాల మీద పడి తగ్గించుకుంటూ వచ్చి, "మీరు సిద్ధాంతిగారి అబ్బాయిలు కారండీ?" అనడిగాడు, ఆగ్రహం కూడా తగ్గించుకుని.

"అవు"నన్నా న్నేను, ఎందు కన్నట్టు చూస్తూ.

దీంతో, మరీ చల్లబడిపోయా డతను, మంత్రించినట్టు.

అనునయం కూడా తెచ్చుకున్నాడు.

సంగతంతా విని "ఎల్లుండే అమావాస్య కదా, పచ్చి ఆకులేం చేసుకుంటారు బాబూ, మీ రింటికి పదండి, నేనెండిన పాయలు తీసుకువస్తా"ననిన్నీ అన్నా డతను.

అతనొక శెట్టిబలిజ.

"పాలమూరి పాకలు" అన్న పేరితో, వూరి కరమైలు దూరానా, అక్కడికి ఫర్లాంగు సమీపానా వున్న శెట్టి బలిజగూడెంలో అతని కాపురం.

అప్పుడప్పుడు వచ్చి, మా నాయనగారిచేత అతను ప్రశ్నలు చెప్పించుకుంటూ వుండడం నా కప్పటికి జ్ఞాపకం వచ్చింది.

అయితే, యెండిన ఆకులయితే యిక లేనిదేమిటీ?

కొట్టినంతమట్టు కయినా పచ్చి ఆకులు విడిచిపెట్టడమున్నూ యెలాగా?

నా వుద్దేశం గ్రహించి "యిక్కడే వుండండి" అంటూ మరుగుకాలవ అవతల – బోదెకాలవ గట్టున వుండిన తన యింటికి వెళ్ళి చుట్టివుండిన పది యెండుపాయలు తీసుకువచ్చా డతను, ముందు.

పచ్చి ఆకులున్నూ పాయలు తీసి, అవీ యివీ కలిపి కట్టి, నెత్తిన పెట్టుకుని "పదండి బాబూ" అంటూ బయలుదేరాడు తరవాత.

"నేనే పట్టుకువెడతాను, మవ్వెందుకు పనిచెడీ?" అన్నా న్నేను గాని, అతను వినిపించుకోలేదు.

"ఎవరినీ అడక్కుండా నేను ఆ చెట్టు ఆకులు కొట్టించడం చెబుతాడేమో, నాయనగా రేం కోప్పడతారో" అని బిక్కూబిక్కూ మంటూ అతని వెనకనే వెళ్ళా న్నేను, బుర్ర వంచుకుని; కాని, అలాంటిది మాత్రం యేమీ జరగలేదు.

ఇల్లు చేరగానే కట్ట నా కందించాడు ముందతను.

తరవాత మా నాయనగారికి నమస్కరించి, వారిచేత ప్రశ్న చెప్పించుకున్నాడు.

"తాటాకులు వచ్చాయి గదా? ఎండిన ఆకులే దొరికాయి గదా?" అన్న సంబరంతో అతని మాటే మరిచిపోయి నేను బాణసంచా పనిలో మునిగిపోయాను.

అప్పటికి సూరేకారం బాగా ఎండింది.

చెలికాళ్ళ నడిగి వారిపని తీరిపోగా మిగిలిన కందిబొగ్గు తెచ్చాను గాని; మా అమ్మగారి నిర్బంధం వల్ల టపాకాయల ప్రయత్నం విరమించవలసివచ్చింది.

మతాబాల ప్రయత్నమే చేశాను.

ఇంతలో, నేను వచ్చానని తెలిసి ఆనందమూ అప్పలాచార్యులుగారూ వచ్చారు.

చీకటిజువ్వల సంగతి విని మొదట నమ్మలేకపోయారు గాని; చివరికి వింతపడి ఆశపడ్డారు కూడా.

"అవి బాగుండేటట్టయితే – కొన్ని మా కిచ్చేటట్టయితే మామూలుజువ్వలు మార్చిస్తా"నని ఆనందమూ "చక్రకాయ లిస్తా"నని అప్పలాచార్యులుగారూ చెప్పి వెళ్ళిపోయారు.

పొద్దు గూకింది.

అప్పటికి. మతాబాగొట్టాలు చెయ్యడమూ, అవి ఆరడమూ, మందు మెత్తగా నలగడమూ అయిపోయింది.

బాగా చీకటిపడ్డాక స్నేహితులిద్దరూ వచ్చి, నేను జువ్వకాల్చగా చూసి డంగయిపోయారు.

ఉత్తరక్షణాన, ఆనందం పాతికజువ్వలూ, అప్పలాచార్యులుగారు పాతిక చక్రకాయలూ యిచ్చి, చెరో పది చీకటి జువ్వలూ పట్టుకునిన్నీ వెళ్ళిపోయారు.

తెల్లవారాటప్పటికి చీకటి జువ్వల సంగతి కుర్రకారుని కంగారుపెట్టేసింది.

ఒక దేవాంగి యువకమిత్రుడూ, వొక రెడ్డియువకమిత్రుడూ వచ్చి "తాటాకు టపాకాయ లిస్తాం, చీకటి జువ్వలి"మ్మన్నారు.

జువ్వకు పాతిక కాయలివ్వడానికిన్నీ వొప్పుకున్నారు గాని, వొక జువ్వ కాల్చి చూపించాలని మాత్రం షరతు పెట్టారు.

నే నొప్పుకోలేదు.

వాళ్ళున్నూ వెళ్ళిపోయారు, బెట్టుసరిగా.

వెళ్ళిపోయారేగాని చీకటిజువ్వలమీద ఆశ చంపుకోలేక పోయారు, కొంచెమయినా.

ఆ రాత్రి దేవాంగియువకుడు యుక్తిచేసి, అప్పలాచార్యులుగారిచేత జువ్వ కాల్పించి చూసి, అద్భుతపడి ఆత్రాపడి ఆ రాత్రి తెల్లవార్లూ ఆరాటపడిపోయి, తెల్లవారడం తరవాయిగా నూరుటపాకాయలు పట్టుకుని వచ్చి వాలాడు నాదగ్గిరికి, "ఇచ్చెయ్యండి నాలుగు జువ్వలూ" అంటూ.

అతని వుబలాటం చూసి నేను కొమ్మెక్కి కూచున్నాను.

"జువ్వకి పాతిక్కాదు, యాభయి కాయలివ్వా"లన్నాను, కచ్చితంగా.

దానిమీద అతనికి కోపం, నిరాశ, విసుగు, ఉడుకుమోత్తనం, ఎలాగయినా జువ్వలు పట్టుకుపోవాలన్న పట్టుదల – ఇలాంటి వెన్నో కలిగాయి.

"ఎంత ఆశా?" అన్నాడు, హేళనగా.

"న్యాయం వుండవద్దా?" అన్నాడు, తెలివిగా.

"స్నేహం యింతేనా?" అన్నాడు, నిష్ఠురంగా.

చూసిచూసి, వినివిని "మరి, నువ్వు చూపించిన స్నేహం మాత్రం యేదీ?" అంటూ యెదురుకున్నా న్నేను.

"తెచ్చినవి పాతిక, వాళ్లకిచ్చేసినవీ నేను కాల్చేసిందీ పోను నాలుగే కదా నాకున్నవి? టపాకాయలు లేనేలేవు గదా, చీకటిజువ్వ లయినా వుండవద్దూ నా కామాత్రం అయినా?" అన్నాను యుక్తిగా.

తచ్చాడి తచ్చాడి, బతిమాలి బతిమాలి, అరవై టపాకాయలిచ్చి రెండు జువ్వలు పట్టుకుపోయా డతను, చివరికి.

"నాకు మాత్రం సరదా కాదూ?" అంటూ రెండు జువ్వలట్టే పెట్టుకున్నా న్నేను; కాని లాభం లేకపోయింది.

దేవాంగియువకుడు చెప్పగా కంగారుపడిపోయి, రెడ్డియువకుడున్నూ అరవైటపా కాయలూ పట్టుకువచ్చాడు పాపం, ఆశపడి; కాని నాకెందుకూ అవీ?

అతను టపాకాయలతోబాటు కాకరపువ్వొత్తులున్నూ తయారుచేసుకున్నాడు, చక్కగా బీడు కలిపి.

వాటిలో నే నేరుకున్నవి పది వత్తులిచ్చి ఆ రెండు జువ్వలూ అతను పట్టుకుపోయాడు.

"చీకటి జువ్వలు లేకపోతేం, తక్కినవి రకరకాలు దండిగా వున్నాయి గదా?" అని తృప్తిపడ్డా న్నేను.

సొంతంగా తయారుచేసిన మందు యాభై పైగా అయింది, మతాబాలు.

అవీ, కాకరపువ్వొత్తులూ, టపాకాయలూ మా చిన్నక్కా మా చెల్లెలూ పుచ్చుకున్నారు.

జువ్వలూ చక్రకాయలూ మిగిలాయి నాకు.

చద్దన్నం తిని అన్నీ యెండలో పెట్టు క్కూచున్నాను.

మధ్యాహ్నం భోజనం చేసి వూళ్ళోకి బయలుదేరాను, మిత్రుల్లో యెవ రెవరి సామగ్రి యేమాత్రమో చూద్దామని.

దేవాంగి యువకుని యింటికి వెళ్ళాటప్పటికి, అతని చెల్లెలు పన్నెం డేళ్ళది, తన భర్త తెచ్చి యిచ్చిన బాణసంచా అంతా తన అన్న బాణసంచాతో కలపకుండా వేరే యెండబెట్టుకుని పక్కనే చూరుకింద కూచుని మురిసిపోతోంది, మహా.

ఆ సన్నివేశం చూశాటప్పటికి మా సీత జ్ఞాపకం వచ్చింది నాకు.

అది కోరుకున్నది కోరుకున్నంతా తండ్రి కొని యిచ్చాడో లేదో అని బెంగపట్టుకుంది, వెంటనే నాకు.

"తండ్రి కొంటాడు, మానడు; కాని తమ్ము లేమయినా కొట్టేస్తున్నారేమో బెల్లించి" అని కంగారున్నూ పట్టుకుంది.

"పోనీ, మన కున్నదాన్లో కొంత దానికి పంపితే?" అని సరదా పుట్టింది, వెంటనే.

నిజమే, కాని అమావాస్య కదా ఆవేళ, మనిషి యెక్కడ దొరుకుతాడూ?

దొరికినా యిరవై మైళ్లు నడవాలి రెండు గోదావరులు దాటి, పొద్దేదీ?

ఇంతకీ, నా యీ వూహ చెబితే, మా చిన్నక్కా మా చెల్లెలూ యెగతాళి చేసి చంపుతారేమో?

మా బావగారు మా యింటి కేమీ పంపలేదు, అంచేత "మన బ్రాహ్మల్లో అలాంటి ఆచారం లే"దని కూడా అంటుందేమో మా చిన్నక్క?

మా అమ్మగారున్నూ యేమంటారో?

అంతకితం వెళ్లివుండినప్పు డేమయినా కొనుక్కోమని డబ్బేమయినా యిచ్చి వున్నారేమో, నాకు తెలిసినంతవరకూ మా అన్నలున్నూ. మా వదినగార్ల కేమీ పంపినట్టు లేదు, వాళ్ళేమంటారో?

నాయనగారున్నూ "అప్పుడే నీకింత స్వతంత్రమా?" అంటా రేమో, కళ్లెర్రజేసి?

కొంతసేపు చాలా తహతహలాడిపోయాను; కాని చటుక్కున స్ఫురించగా "వాళ్ల నాయన నన్ను పండక్కి తీసుకువెళ్ళినప్పుడు నేను మాత్రం ఆ పిల్లకెందుకు పంపించాలీ బాణసంచా?" అంటూ లా పాయింటు తీశా నంతలో.

కోప్పడ్డాను, విసుక్కున్నాను, "సరసం యెరగనివాళ్ళు"నుకున్నాను, యీసడించాను, "ఇంకేమి లాభం" అనుకున్నాను, సర్దుకున్నాను, మరిచిపోదామనుకున్నాను, అయినా మనస్సు పీకుతూనే వుండింది చాలాసేపు; కాని, యెండ తగ్గాటప్పటి కన్నీ మరిచిపోయి, సామా నంతా తీసి యింటో పెట్టేసి, పొట్టాల ప్రయత్నంలో పడ్డాను, మించిపోతోందన్నట్టు.

దీపాలు పెట్టేటప్పటికి మా చెల్లెలిచేత దివిటీలు కొట్టించారు మా అమ్మగారు.

నాలుగ్గడియల రాత్రి అయేటప్పటికి రెండు అరుగుల నిండా దీపాలున్నూ పెట్టేశా రావిడ, నేను చెప్పిన వరసన.

మా చిన్నక్కా మా చెల్లెలూ మధ్యమధ్య టపాకాయలు కాలుస్తూ, కాకరపువ్వొత్తులూ మతాబాలూ వెలిగించారు, వంతులు వేసుకుని సంబరపడుతూ.

మా పెద్దన్నగారు కాల్పించారు మా చెల్లెలిచేత టపాకాయలు.

ఒకటిరెండు మాట్లు వచ్చి, రెండేసి చక్రకాయలూ జువ్వలూ కాల్చి, వెళ్లి మా నాయనగారి దగ్గిర కూచున్నారు మా చిన్నన్నగారు.

తక్కిన చక్రకాయలూ జువ్వలూ నేను కాల్చాను.

ఆ దీపాలతోనూ, యీ బాణసంచాతోనూ మా వీధి అంతా కన్నులవైకుంఠం అయిపోయింది.

కొంతసేపటి కానందమూ అప్పలాచార్యులుగారూ వచ్చి నన్ను పిలిచారు, చీకటిజువ్వాలు పుచ్చుకుని.

వారిచేతిలో నే నిచ్చిన జువ్వలే వున్నాయి, నా చేతిలో మామూలు జువ్వలయినా లేక పొంగంతా చల్లబడి కుంగిపోయా న్నేను.

దీనికి సాయం, పదిమంది వున్నచోటల్లా ఆగుతూ "చూసుకోండి; అద్భుతం, ఆశ్చర్యం, గమ్మత్తు, తమాషా –" అంటూ చెరో చీకటిజువ్వా కాల్చి యెగిసెగిసి పడసాగారు, వారు.

దీర్ఘచతురస్రంగా వున్న పెద్దవీధి అంతా తిరిగారు, వా రలాగ.

కొంతదూరం వెళ్ళాకయినా వెనక్కి మళ్ళి వుండవలసింది నేను, కాని, జువ్వల తమాషా చూడకుండా వుండలేక, చివరికంటా వారివెంట తిరుగుతూనే వుండిపోయాను.

అయితే, వొక మళుపు తిరిగేటప్పటికి నాకొక మంచి ఆలోచన తట్టింది, హఠాత్తుగా.

వెంటనే వాళ్ళెగిసిపడ్డచోటనల్లా, అంతకంటే యెక్కువగా నేనూ యెగిసిపడసాగాను

"అవి వాళ్ళకెలా వచ్చాయో తెలుసా? నేనే యిచ్చాను, వాళ్ళు దేవుళ్ళాడగా" అంటూ; కాని నాకు కించమాత్రం పోలేదు కొంచెమున్ను.

పతకం వేసింది నేను, కొన్నది నేను, మోసుకువచ్చింది నేను, దయతో వాళ్ళ కిచ్చిందిన్నీ నేను; కాని, చూసినవారందరూ వాళ్ళనే మెచ్చుకున్నారు.

నా మాట విన్నవారూ, నాకేసిన్నీ చూసినవారూ కూడా లేకపోయారు.

చిక్కని పూలదండ గుచ్చింది వొకతే, ప్రియుడికి వేసి కులికింది వొకతే అన్నట్టయింది నా పని.

చక్కనిదే వస్తువు తయారుచేసి, తన అవసరం తీరేటంత ధరకట్టి, బెట్టుసరిగా అమ్మి, తరవాత, ఆ కొనుక్కున్నవా డది వాడుకుని ఆనందిస్తూ వుంటే అతని ఐశ్వర్యాని కసూయపడే పనివాడి లాగా అయిపోయా న్నేను.

దీపావళి పదిహేను దినా లుండనగా ప్రారంభం అయిన నా అడావుడి అంతా చివరికీ విధంగా చప్పబడిపోగా "ఛీ యింకెప్పుడూ యిలాంటి తెలివితక్కువ పని చెయ్యగూడ"దని బుద్ధి చెప్పుకుంటూ పోయి, వుసూరుమంటూ పడుకున్నాను చివరికి.

## 21

వల్లూరిలో వొక్కటే భట్రాజుల కుటుంబం.

ఆ కుటుంబయజమాని కొడుకు, యిరవై యేళ్ళవాడు, మా గురువుగారి దగ్గరే వసుచరిత్ర పాఠం చెప్పకునేవాడు.

నిజాని కతను మంచి తెలివయినవాడే.

చురుకయిన వాడున్నూ.

అడగడం తరవాయిగా అయిన పద్యాలన్నీ గడగడ అప్పగించిన్నీ వేసేవాడు.

వర్ణించిన అర్థాలున్నూ అక్షరం తప్పకుండానే చెప్పేవాడు; కాని పద్యభావం చెప్పమంటే మాత్రం ఠకీమని ఆగిపోయేవాడు.

పోరగా పోరగా, అందించగానూ అందించగా, దండాన్వయం మాత్రం యేకరువు పెట్టేవాడు, వరస చూసుకుంటూ.

శ్లేషలు వివరించమంటే మళ్ళీ ఆకాశం చూసేవాడు.

"ఎందుకు వచ్చిన శ్రమ?" అనేవారు గురువుగారు, అతని తండ్రితో.

తండ్రికి సాహిత్యజ్ఞానం లేదు.

ఆ వాసన అయినా లేదు గాని; చాటుపద్యాలు మాత్రం మహా పొంకంగా చదివేవా డాయన.

అసలు, మూర్తీభవించేలాగ చాటుపద్యాలు చదవడం భట్రాజుల సొమ్ము, ఆదినుంచీ.

భట్రాజుల్లోనూ మళ్ళీ ఆయన సొమ్ము.

కమ్మవారి యిళ్ళ పెళ్ళిళ్ళకు వెడితే, యెక్కడెక్కణ్ణుంచి వచ్చిన భట్రాజుల్లోనూ కూడా ఆయనదే అగ్రతాంబూలం.

అలాంటివా డల్లా పాపం, కొడుకు స్థితి చూసి కుసిల్లిపోయేవా డాయన.

మనిషి పిట్టంత వుండేవాడు, పద్యం యెత్తుకుంటే మాత్రం మేఘం వురుముతున్న ట్టుండేది ఆయన స్వరం.

ఆ విరవడం, ఆ వూాదిపలకడం, ఆ చేతులు తిప్పకోడం, మొగాన ఆ హావభావాలు కనబరచడం – ఇదంతా ఆయన కొక్కడికే చెల్లేది.

అది చూసి మా విద్యార్థులం వూగిపోయేవాళ్ళం.

"బాబూ, మా కులస్వామి రచించిన మహాగ్రంథం అది. అది చదివి, తెలుసుకుని, ఆనందించి, వొకళ్ళ . నానందపెట్టకపోతే ఆ మహాకవికి మేము ద్రోహం చేసినట్టు కాదూ?" అంటూ మహా పరితపించిపోయేవా డాయన.

అర్థమే చెప్పలేకపోయేవాడు గాని ఆ గ్రంథంలో పద్యాలెన్నో చదివేవా డాయన, అఖండ గోదావరీ ప్రవాహంలాగ.

తనకి సాహిత్యజ్ఞానం లేకపోగా, తనకీ కొడుక్కీ వుండవలసింది కొడుక్కయినా వుండవద్దా అని ఆయన తాపత్రయం.

మా గురువుగారి బసకు పది బారల్లో, నడివీధిన వుంది వారి యిల్లు.

అప్పుడప్పుడు కమ్మపెద్దలు వచ్చి వారి అరుగుమీద కూచుంటూ వుండేవారు.

పద్యాలున్నూ చదివించుకుని వూగిపోయేవా రాయనచేత.

వసుచరిత్ర చదివి వారికి చెప్పమనేవా డాయన, కొడుకుని.

కొడుక్కి సభాపిరికి పోవా లనీ, ప్రౌఢతనం అబ్బాలనీ ఆయన ప్రయత్నం.

పిరికితనమూ లేదు కొడుక్కి, పఠనచాతుర్యమూ లేదు.

"మీ ధోరణి రాదు, మీ అబ్బాయికి" అంటూ చప్పరించేసేవారు, కమ్మదొర లది చూసి.

తల కొట్టేసినట్టుండే దాయనకు, అలాంటప్పుడు.

నేను మాత్రం అదే వసుచరిత్ర చూడడం.

నేను మొట్టమొదట చూసిన తెనుగుప్రబంధమున్నూ అదే.

అంచేత, అదంటే యిప్పటికీ నాకు ప్రత్యేకశ్రద్ధ.

కఠినపాకం అంటూ వసుచరిత్ర నెవరయినా తృణీకరిస్తే కొరడాతో కొట్టి నట్టుంటుంది, నాకు.

ఏమంటే?

నన్నడిగితే, సాహిత్యంలో అలాంటి గ్రంథాలకే అగ్రపీఠం.

సాహిత్యవేత్త లయినవారికి నికషాలవి.

అవి పాఠం చెప్పగలిగితేనే – వాటి రచనావిశేషాలు వివరించనూ గలిగితేనే పాండిత్యం.

సంస్కృతంలో కూడా, రఘువంశమూ మేఘసందేశమూ శాకుంతలమూ ఉత్తర రామచరిత్రా – ఇత్యాదుల క్కంటే, నైషధమూ, మురారీ – ఇత్యాదులకు మాత్రమే పండితుల ఆదరగౌరవాలు.

కారణం మరేమీ లేదు.

రసం ఆస్వాద్యం.

రచన వ్యాఖ్యేయం.

రసికత వుంటే గాని ధ్వని అవగాహన కాదు, లేశమూ.

బుద్ధి వుంటే చాలు, చమత్కారమూ సారస్యమూ బోధపడతాయి, క్షుణ్ణంగా.

పాండిత్యాని కవే విలాస భూములు.

పండితుడైనవాడు అక్కడే తాండవం చేస్తాడు, ఆవేశంతో.

అసలు, శబ్దంమీద అధికారం యేర్పడితేనే దాని శక్తి తెలుస్తుంది, పండితునకు.

అదే వేత్తృత.

వ్యాఖ్యాతకు అదే యోగ్యత.

మరి, రచయిత అంతస్థు వేరు.

రచయిత అంటే కవికి పర్యాయం.

క్రాంతదర్శి అతను.

భావనాశక్తి సర్వజ్ఞత్వం ప్రసాదిస్తుంది, రచయితకు.

కనక, రచన, ద్రాక్షాపాకం అయినా, నారికేళపాకమే అయినా రచయిత అస్వాదించే పట్టులు వేరూ, పండితుడు వ్యాఖ్యానించే ఘట్టాలు వేరున్నూ.

కవిత్వమూ పాండిత్యమూ భిన్నశక్తులు.

అవి రెండూ కలిసిన స్థలాలుంటాయి; కాని కలవకపోడం మాత్రం లోపం కాదు.

వసుచరిత్ర కర్త స్పష్టంగా, ఆ రెండు శక్తులూ వున్నవాడు కూలంకషంగా.

మరి, పాండిత్యమయినా లేనివాడి కతని రచన యెలా కొరవడుతుందీ?

కొరకబడలేదని నిందించడమేనా?

అయితే, అప్పుడు, దినమ్మూ గురువుగా రాయనకు పాఠం చెప్పేటప్పుడు శ్రద్ధగా వినేవాణ్ణి గాని, పేరుకి తెనుగు గ్రంథమే అయినా, రుక్మిణీకల్యాణం బడిలోనే చదివి వుండిన నా కది మరొక భాషకు చెందిన గ్రంథం అనిపించేది.

తెనుగువాడికి సంస్కృతం పరిచితం కావడమూ, తెనుగే పరాయి భాషగా కనపడ్డమూ వింతే! అయితే, పరిచితం అయిన సంస్కృతం కూడా అందులోది నా కదో విధంగా కనపడేది.

అదేమీ అంటే, తెనుగుకవుల సంస్కృత ప్రయోగసరణి వే రన్నారు, గురువుగారు.

భరతఖండాని కంతటికీ సంస్కృతం సామాన్యభాషే అయినా, అన్ని ప్రాంతాలవారి సంస్కృత ప్రయోగసరణీ అలాగ, భిన్న భిన్నంగానే కనపడుతోం దిప్పుడు చూస్తే.

ఇది ప్రాంతీయాలైన మాతృభాషల ఘనతకూ ప్రాధాన్యానికీ మాయని గుర్తు.

ఈ సంగతు లప్పుడు నాకు లేశమూ తెలియవు.

చదువే కాదు, వయసే చాలదు తెలుసుకోడాని కయినా.

కాక:—

నా కప్పు డది అవగాహన కాకపోవడమే మంచి దయింది.

"నా తెనుగు నా కెందుకు తెలియకపోవాలీ?" అని నా కావేదన కలగడానికీ, దాని విషయమై శ్రద్ధ పుట్టడానికీ అదే కారణం.

ఈ ఆవేదనతో "దినమ్మూ నా కదిన్నీ చెప్పండి" అని కోరాను గురువుగారిని; కాని వారు చెప్ప నన్నారు.

"సంస్కృత సాహిత్యగ్రంథాలు పూర్తిచేసుకునేదాకా నువ్వు తెనుగు ప్రబంధాలు ముట్టుకోవద్దు" అని దృఢంగా నిషేధించారు కూడా, వారు.

ఒకమా టింటికి వచ్చినప్పు డీమాట చెప్పగా మా పెద్దన్నగారూ అదే అన్నారు.

సరే, నాకు మేఘసందేశమూ, భారవిలో కొన్ని సర్గలూ పాఠం చెప్పిన దర్భా భైరాగిశాస్త్రిగారు "చచ్చు తెనుగు, ఫోనిస్తూ" అనేవేశారు, నిరసనగా.

"సంస్కృత సాహిత్యం అంటనివాడే తెనుగుల్లో ప్రవేశిస్తాడు, మన కది తగదు" అనిన్నీ మందలించా రాయన,

తరవాత్తరవాత బహుపరిశీలనగా కనిపెడుతూవచ్చాను, సంస్కృత సాహిత్యపరుల దందరిదీ యిదే సిద్ధాంతం.

తెనుగు సాహిత్య పరులందరూ ఆదిలో తప్పనిసరిగా సంస్కృతంలో ప్రవేశించి వుండడమూ, అయితే, వారి సంస్కృత పాండిత్యం సామాన్యం అయిపోయి, తెనుగు ప్రావీణ్యమే అధికం కావడమూ భైరాగిశాస్త్రిగారి సిద్ధాంతానికి మూలమేమో నేను చెప్పలేను; కాని తెనుగులో వొక్క అక్షరమైనా తెలిసివుండకపోయినా, సీతారామశాస్త్రిగారి మాటే నా కప్పు డశనిపాతం లా తోచింది, భైరాగిశాస్త్రిగారి మాటతో నాకు ప్రాణాలే యెగిరించి పోయాయి.

కానయితే, సంస్కృతంలో నా కప్పటికి మంచి ప్రవేశమే కలుగుతోంది.

రుచిన్నీ బాగా పుట్టివుంది.

అది విడిచిపెట్టాలనీ లేదు.

అయితే మాత్రం తెనుగు చచ్చుదా?

తెనుగుభాష చచ్చుదయితే మరి తెనుగుజాతి?

పైగా తెనుగువాడే యిలా అనడమా?

మహా కసి పుట్టేసింది నా కీమాటమీద.

"తెనుగులో మంచిపాండిత్యం సంపాదించా"లనుకున్నాను, వెంటనే నేను.

పాండిత్యం సంపాదించడమే కాదు, గుడిగోపురంమీద యెందు కెందుకో కలలు కనడంలో గ్రంథాలు రచించా లనిన్నీ కలగన్నాను.

## 22

వల్లూరి ప్రస్తావన విడిచిపెట్టడానికి ముందు, బహూ రసవంతమైన వుదంతం వొకటి చెప్పవలసివుంది, తప్పనిసరిగా.

అప్రయత్నంగా – అనుకోకుండా కూడా శాశ్వతంగా నా జీవితం వొక పూలబాటకి మళ్ళడాని క్కారణమైన ఘటన అది.

ఇప్పటికీ నా కబ్బురపాటు కలిగిస్తూనే వుంటుం దది, జ్ఞాపకం వస్తే.

దాని క్కారణం యేమిటో, అప్పుడు గుర్తించా లేకపోయాను, ఇప్పు డూహించా లేకపోతున్నాను.

జరిగిందేమిటంటే?

ఒకటి రెండు మాసాల్లో నే నిక వల్లూరు విడిచిపెడతా ననగా, వొకనాడు

"ఒకమా టిలా రా నాయనా" అంటూ నన్నొక ముసలావిడ పిలిచింది, తన యింటోకి.

రమారమీ డెబ్భయి సంవత్సరాల వితంతు వామె.

ఇంటి కంతకీ తరుచు వొక్కర్తే వుండేది.

అంతకిముం దొకమాటు నీలాటి రేవున చూశా నావిణ్ణి.

ఆవేళ నేను స్నానానికి వెళ్ళేటప్పటికి నానా అల్లరిగానూ వుంది, కోనేటి పావంచాల రేవు.

స్నానాలు చేస్తున్నా రిద్దరు విద్యార్థులు నీళ్ల కలిచివేస్తూనూ, వొకళ్ళమీద వొకళ్ళు చల్లుకుంటూనూ.

వాళ్ళమధ్య స్నానం చెయ్యడం నాకిష్టం లేకపోయింది.

నదిలో నయినా, కాలవలో నయినా, చెరువులో నయినా యెంతమందితో నయినా కలిసి తృప్తిగానే స్నానం చెయ్యగలను గాని; అక్కడ యెవరయినా కేరింతాలాడుతూ వుంటే మాత్రం నావల్ల కాదు.

అప్పటికీ యిప్పటికీ యిదే నా పద్ధతి.

అంచేత, ఆ పావంచాల రేవుకి పాతిగ్గజాల పడమరగా వున్న కాలిరేవుకి వెళ్ళి స్నానంచేస్తున్నా నావేళ.

ఆ సమయాన వచ్చిం దావిడ తడిబట్టతో చిన్నబిందె బుజాన పెట్టుకుని.

పావంచాల రేవుకి ఆవిడా మళ్ళలేకపోయింది.

నలుగు రైదుగురు కమ్మస్త్రీలు మందలించే వెళ్ళారు గాని; అది నాటలేదా విద్యార్థులకు.

అందువల్ల నేనున్న రేవుకి వచ్చిం దావిడ, విసుక్కుంటూనూ గొణుక్కుంటూనూ.

అయితే, నేనున్న రేవులో దిగడమూ కష్టమే, యెక్కడమూ కష్టమే, వయసు మళ్ళిపోయినవాళ్లు.

అరవైయేళ్లు దాటిన స్త్రీ బిందె బుజాన పెట్టుకుని యెక్కడం సాధ్యమే కా దసలు.

అప్పటికి నా స్నానం ముగిసి, నేను పూర్తిగా పరిశుద్ధుణ్ణయి వుండడం గుర్తించింది కాబోలు "నాయనా, దిగి మళ్ళీ యెక్కలేను, ఈ బిందె ముంచి నా కందిస్తావా?" అనడిగిం దావిడ, నన్ను.

బదులు చెప్పలేదు నేను – మరింత లోతుకు వెళ్ళి, నిర్మలజలం ముంచి, బిందె ఆమె కందించాను, వెంటనే.

చాలా సంతోషించిం దందుకామె.

ఆశీర్వచనమున్నూ చేసి వెళ్ళిపోయిం దింటికి.

అదిగో ఆవిడే ఆవేళ నన్నింటోకి రమ్మని పిలిచింది.

నేను వెళ్ళాను.

"విద్యార్థు లందరిలోనూ వినయవిధేయతలు కలవాడవు నువ్వు. మీ గురువుగారు నిన్నే మెచ్చుకుంటారు, నాకు తెలుసు" అంటూ తానున్నూ మెచ్చుకుంటూ, నన్నొక మూలగదిలోకి తీసుకువెళ్ళి చాపపరిచి, కూచోమంది, ముందావిడ.

ఒక పటికిబెల్లం ముక్క నా చేతి కందించింది, తరవాత.

"తిను నాయనా" అంది.

"తప్ప"దంది, నా తటపటాయింపు చూసి.

"తింటేగాని వొప్ప"నంది.

ఇలాగ తప్పనిసరి కాగా నోట్లో వేసుకున్నా నది నేను, "అవేళ బిండె ముంచి యిచ్చినందు కిది ప్రతిఫలమా, మళ్ళీ యేదయినా పనిచేయించుకోడానికొక యెరా?" అనుకుంటూనే.

మంచినీళ్లున్నూ యిచ్చింది.

ఇదంతా అయాక యెదటి గోడకి చేరబడి కూచుని "నేనొక్క టడుగుతాను. అంటే, కోరతాను. నువ్వది చేసిపెట్టాలి. ఎక్కడా – ఎప్పుడూ – యెవరితోనూ చెప్పనూగూడ దేమంటావ్?"వంది.

"అదేమిటో చెప్ప"మన్నా న్నేను.

"ఎవరికీ చెప్పను, చేస్తా"ననిన్నీ అన్నాను.

ఇలా అన్నా నంతే, ఉత్తరక్షణంలో, పైటకొంగులో నుంచి వొక పుస్తకం తీసి నామీద పడేసిం దావిడ, బెల్లించి చూస్తూ.

చూడగా, మదనకామరాజు కథల పుస్తకం అది.

అదే మొదటిమాటు నేనా పుస్తకం చూడ్డం.

ఆ పేరయినా వినివుండలేదు నేనంతకు ముందు.

"కామరాజు"కి గల విశేషణం చూసి శృంగారగ్రంథం అయివుంటుందనీ అనుకున్నాను. వృద్ధవితంతువు చేతిలో వుండడంవల్ల ఆ పేరింటివాడు రచించిన వేదాంతగ్రంథం అయివుంటుందనీ అనుకున్నా న్నేనప్పుడు.

తీరుబడి అయినప్పుడల్లా వచ్చి – తాను పిలవనే అక్కర్లేదుట – వంటచేసు కునేటప్పుడు తప్ప పొద్దున వచ్చినా సరేట, మధ్యాహ్నం వచ్చినా సరేట – అది చదివి తనకి వినిపిస్తూ వుండమని ఆమె కోరిక.

ఎటూ చెప్పలేకపోయాను, కొంతసేపు నేను.

కాదనిన్నీ అనలేకపోయాను చివరికి.

ఆ మొదటినాడు వొక్క గంట పైగా చదివి చెప్పినట్టు జ్ఞాపకం.

వారాని కేవొకటి రెండురోజులో తప్ప, మొత్తానికి దినమ్మా చదువుతూనే వచ్చా న్నేనది దినానికి గంటకి తక్కువలేకుండా.

కొద్దిపేజీలు చదివేటప్పటికి అది శృంగారగ్రంథం అని తెలిసిపోయింది నాకా మొదటినాడే.

కాని, ఇటు వృద్ధవితంతువూ – అటు శృంగారగ్రంథమూ – ఈ సన్నివేశం యేమిటో నా బుద్ధి కందలేదు.

అయినా చదవడం మానలేదు నేను.

అయితే "ఆవిడకోసం చదువుతున్నానా, నా కోసమే చదువుకుంటున్నానా?" అనిపించింది కొన్నాళ్ళు గడిచేటప్పటికి నాకు.

కథలు వింటున్నాను - కథలు చెబుతున్నాను - కథ లల్లుతూనూ వున్నాను గాని కథల పుస్తకం చూసి యెరగనప్పటికి నేనెప్పుడూ.

"కథలకు పుస్తకాలుంటాయా?" అనిన్నీ అనిపించింది నాకు.

అంచేత, చిరకాలంగా వున్న లోటేదో తీరిపోయిందన్న తృప్తి కలిగింది దాని పరిచయంతో నాకు.

"ఇంకా యెన్ని రకాలున్నాయో కథల పుస్తకాలు బజార్లో?" అనుకున్నా న్నేను.

"ఆవిడదగ్గిరే వున్నా యేమో యింకా కొన్ని?" అనిపించింది గాని; సాహసించి అడగలేకపోయా నా మాట.

విని ఆవిడ సంతోషించడంకంటే యెక్కువయిపోయింది, చదవడంలో నా సంతోషం.

పాఠమూ పనులూ త్వరగా తెమల్చేసుకోసాగా నందుకోసం నేను.

భావనలో మైమరుపు కలిగించే గోపురం కూడా మరిచిపోయాను దాంతో నేను.

"రుచి పుట్టింది నాయనకి" అందొకనా డావిడే, నా ఆత్రం కనిపెట్టి.

అన్నట్టు చెప్పడం మరిచిపోయాను, దినమ్మూ పటికి బెల్లమ్ముక్క పెడుతూనే వుండిందామె నాకు.

పటికిబెల్లమ్ముక్కా, మంచినీళ్ళూ, ఆ పుస్తకమూ వొక్కమాటే తెచ్చి అక్కడవుంచే దసలావిడ.

"ఈ కథల మాధుర్యం ముందు పటికిబెల్లం తీపి యే మూలకి?" అన్నమాట నాలుక చివరికే వచ్చేసిం దొకనాడు నాకు; కాని నిగ్రహించుకున్నా న్నేనది.

అంటే యింకేమయినా వుందా?

అస్తమానమూ చదివి వినిపించ మంటూ కూచోదూ ఆవిడ?

అనకపోతే మాత్రం వూరుకుందా పోనీ?

పొద్దున్న వెడితే "మధ్యాహ్నం కూడా రాగలవా?" అనీ, మధ్యాహ్నం వెడితే "పొద్దున్న కూడా రాకూడదూ?" అని ప్రారంభించింది.

వెళ్ళకపోయినా వూరుకునేది కాని; అక్కడా అక్కడా అర్థం చెప్పమనేది.

శృంగారఘట్టాల్లోనే అడిగే దామాట.

మంచుతెరలో వున్న మనిషి అన్నట్టుండేది, వాటి అర్థం నాకు.

తెలిసినట్టుండేవి, అవగాహన అయేవి కావు.

కౌగిలివంటి శబ్దా లున్నవున్నట్టు చదవడానికిన్నీ యెబ్బెట్టుగా వుండేది నాకు.

"కాదూకూడ"దంటే "అక్షరం అలుముకుపోయిందండీ" అనేవా ణ్నొక్కొక్కప్పుడు.

దినమ్మూ ఆవిడ అర్థం అడగడమూ నేను తెలియ దనడమూ మాత్రం తప్పలే దెప్పుడూ.

"పాపం - కుర్రతనం" అంటూ జాలిపడే దావిడ అందుకు.

కొన్నాళ్ల కాపుస్తకం అయిపోయింది.

"మళ్ళీ మొదటికి ర"మ్మం దావిడ.

అప్పుడు సాహసించా న్నేను "ఇంకో పుస్తకం లేదూ?" అనడానికి.

"లేదు నాయనా" అందావిడ, యెంతో బాధపడుతూ.

"నా కెలా వస్తాయి నాయనా?" అనడిగింది, మరి, యిదెలా వచ్చిందో?

"ఎక్కడయినా దొరికితే నువ్వే తీసుకురా పోనీ" అంది.

"డబ్బులు నేనే యిస్తానులే" అని ధైర్యం చెప్పింది.

చేసేది లేక అదే మళ్ళీ చదివాను.

మళ్ళీ మళ్ళీ కూడా చదివాను.

క్రమాంతరాలమీద వొక్కొక్క సన్నివేశం కొంచెం కొంచెం అర్థం అవుతున్నట్ట నిపించసాగింది నాకు.

అది గ్రహించి తల పంకించుకునే దావిడ.

మొత్తం నాలుగయిదు మాట్లయినా మళ్ళీ మళ్ళీ చదివాను నేనది, విసుగు మాత్రం కలగలేదు నాకు.

ఆవిడ యెన్నాళ్ళబట్టి వింటోందో మరి, వ్యగ్రోత్సాహంతో అయితే, ఆవిడ కదొక్కటే గతి అయింది నాకేం?

అన్ని మాట్లది చదివేటప్పటికి వసుచరిత్ర మీదికి పోయింది నా చూపు.

గురువుగా రందుకు నిషేధం చెప్పివుండడంవల్ల ఔత్సుక్యం మరీ యెక్కువయి పోయింది.

తన అరుగుమీద కూచుని, భట్రాజుల అబ్బాయి, పాఠం వల్లించుకునేటప్పుడు చూడనూ చూశా నాగ్రంథం నేను.

అయితే పద్యాలా, వుక్కుతునకలా అవి?

పోనీ అంటే, వచనమూ అలాగే వుంది అందులోది, కరిగిన ద్రవం – జాతికి మాత్రం వుక్కే.

విసిగిపోయా న్నేను.

గుజిలీ పుస్తకమే అయినా, దాంతో మదనకామరాజు కథల భాష అమృతమే అయిపోయింది నాకు.

వచనంలో వున్న సౌలభ్యం పద్యంలో లేదని – వుండడానికే వీల్లేదని పాఠశాలలో మూడో తరగతిలో రుక్మిణీ కల్యాణం చదివినప్పుడే అనుభూతం అయివుండింది నాకు.

పోనీ, అర్థమే కానక్కరలేదనుకుంటే, వసుచరిత్రలో వాచకమే సరిగా నడవలేదు నాకు.

పాఠశాల చదువు తక్కువే అయినా, ధారాళమైన వాచకం నాది మొదణ్ణుంచీ.

గురువుగారే అనేవారీమాట, తక్కిన విద్యార్థులను నిరసిస్తూ.

కాని, ముళ్ళడొంకల్లో బోసికాళ్ళ నడక అయిపోయింది, ఆ వసుచరిత్రలో నా వాచకం.

పద్యంమీదకంటే వచనంమీదా, వచనంలో మళ్ళీ సులభమైన సరళవచనంమీదా రుచీ, అభిమానమూ కలగడాని కిదేకారణం అయింది నాకు.

తరవాత మరెన్నో ఘటనలున్నూ తటస్థపడి, యీ వచన ప్రీతి నాకు స్థిరపడిపోయింది.

ఇక యిక్కడ చెప్పవలసిం దేమిటంటే?

ఇలాగ మదనకామరాజు కథలు చదువుతూ చదువుతూనే, వుండుండి వొకనాడు "నేను రేపు మా వూరు వెళ్ళిపోతున్నా"నన్నా నావిడతో.

"ఏమి నాయనా?" అందావిడ, నిర్విణ్ణయి.

చాలా విచారించింది, ఆ మాటమీద.

ఏదో చెయ్యిజారిపోయేటప్పుడు కలిగే విచారంలా వుండిందామె విచారం.

"ఇక్కడ చదువు సాగడంలేదూ?" అనడిగింది.

నచ్చచెప్పడానికిన్నీ యెంతో ప్రయత్నించింది; కాని లాభంలేకపోగా "వెళ్ళేటప్పుడొకమాటు నాక్కనపడు. పోనీ యీ దారినే వెళ్లు" అంది.

ఎందుకో అర్థం కాలేదు గాని, మర్నాడు మూట చంకని పెట్టుకుని వెళ్ళగా, పెద్ద పటికిబెల్లం పొట్లం చేతిలో వుంచి "వెళ్ళినచోట శ్రద్ధగా చదువుకో నాయనా" అంటూ, దీవించి పంపించింది.

అయితే, నాచేత అది చదివించుకుని ఆవిడ పొందిన ప్రయోజనం యేమిటో గాని, నాకు మాత్రం మంచి కథాభిరుచి కలిగింది దానివల్ల.

అదే కథారచనలోకి దింపేసింది, చివరికి నన్ను.

తరవాత, ఈ అరవైయేళ్ళ జీవితంలోనూ నేనెన్నో కథల పుస్తకాలు చదివాను కాని, మదనకామరాజుకథ లంటే యిప్పటికీ నా కెంతో ప్రీతి.

అంచేత, ఆ వెళ్ళడంలో, మండపేటలో ఆ కథల పుస్తకం కొనుక్కునే నే నింటికి వెళ్ళాను.

రోజూ రోజూ చదివానది.

వయసు వచ్చినకొద్దీ అర్థం అయింది నాకది.

అర్థం అయినకొద్దీ ప్రీతిపాత్రమున్నూ అయింది నాకది.

దాని మాధుర్యానికి చొక్కి తరవాత చాలాకాలానికి సరళభాషలోకిన్నీ మార్చేశానది.

శ్రీవావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు చేయించా రాపని నాచేత.

వ్యాపారదృష్టితోనే వారాపని చెప్పారు, నాకు తగిన ప్రతిఫలం యిచ్చే చెప్పారు, నిజమే.

అయితే, దానియెడల నా కృతజ్ఞత తెలుపుకోడానికి – ముఖ్యంగా నా రుణం తీర్చుకోడానికి నేనే చెయ్యవలసిన పని కనకనే వారు నాకు చెప్పారన్న నమ్మకంతో అందు కొప్పుకున్నా న్నేను.

## 23

బ్రహ్మశ్రీ దర్భా బైరాగిశాస్త్రిగారు హుశేనుపురం అగ్రహారీకులు.

చామర్లకోటకి పశ్చిమంగా మైలుదూరాన వుందావూరు.

వారి పూర్వులకు పిఠాపురం మహారాజులుంగా రిచ్చివుండిన అగ్రహారం అది.

పిఠాపురంవారు దానికి పెట్టిన పేరు "నరసింహారాయపురం అగ్రహారం" అని.

అయితే, అది హుశేనుపురం గ్రామానికానుకుని వుంది.

అంచేత, చిరపరిచితమైన హుశేనుపురమే గాని ఆ పేరు వాడుక కాలేకపోయింది.

అగ్రహారం అన్న విశిష్టనామం కూడా హుశేనుపురానికే భుక్తం అయిపోయింది, చివరికి.

లెక్కల్లో మాత్రం "నరసింహారాయపురం అగ్రహారం" అనే వ్యవహారం, యిప్పటికీ.

బైరాగి శాస్త్రిగారు మాకు బంధువులు.

వరసకి నాకు అన్నగా రాయన.

ఆయన పితామహీ మా పితామహీ అక్కాచెల్లెళ్ళు.

మహాతపశ్శాలి పిడపర్తి చలమయ్యశాస్త్రిగారి కూతుళ్లు వారు.

బైరాగిశాస్త్రిగారి తల్లి – అంటే దర్భా చలమయ్య శాస్త్రిగారి భార్య చిన్నపూర్ణమ్మగారూ మా నాయనగారూ మేనత్తమేనమామ బిడ్డలు.

పిడపర్తి చలమయ్యశాస్త్రిగారికి కొమార్తె లయిదుగురూ వొక్కరే కుమారులు శేషాచలశాస్త్రిగారున్ను.

ఆ శేషాచలశాస్త్రిగారి కిద్దరు కుమారులూ. యిద్దరు కొమార్తెలూను.

వారి కుమాళ్ళిద్దరూ పూర్ణయ్యలే, కొమార్తెలున్నూ యిద్దరూ పూర్ణమ్మలే "పెద్ద" "చిన్న" అన్న ఉపసర్గలతో వారికి వ్యవహారం.

హుశేనుపురం దర్భావారు నప్రతిగ్రహీతలూ, నిరతాన్నదాతలున్నూ, మొన్నటిదాకా.

తరతరాలుగా సంస్కృత పండితులూ తపోధనులున్నూ.

కావ్యపాఠం కోసం నేను వల్లూరు వెళ్ళేటప్పటికి మా చిన్నన్నగారు, చదువుకుంటున్నారు, బైరాగిశాస్త్రిగారి దగ్గిర.

మే మిద్దరమూ వొక్కచోట వుండడం యెందుకని అప్పట్లో నన్ను వల్లూరిలో ప్రవేశపెట్టారు మా నాయనగారు.

వల్లూరిలో నాకు మేఘసందేశం సగం అయేటప్పటికి, సాహిత్యవిద్య పూర్తిచేసుకుని మా చిన్నన్నగారింటికి వచ్చేశారు.

వెంటనే మా నాయనగారు బైరాగిశాస్త్రిగారి దగ్గిరికి వేట్లపాలెం పంపించారు, నన్ను.

అటు భీమవరంతో చామర్లకోటలాగా, యిటు గునుపూడితోనున్నూ భీమవరంలాగా, బాపురంతో బరంపురంలాగా, వెలంపాలెంతో ద్రాక్షారామం లాగా, గుడపర్తితో కలిసి వున్న గ్రామం వేట్లపాలెం.

చామర్లకోటకు మైలులో హుశేనుపురమూ, హుశేనుపురానికి మైలులో వేట్లపాలెమూ వున్నాయి, కాలవగట్టునే పశ్చిమాన గాని; రెండింటికీ హస్తిమశకాంతరం వుంది.

హుశేనుపురంలో, బాహాటంగా పగలే వచ్చి, యెదటపడి గద్దించిన్నీ గాదెలు దోచుకుపోయేవారు దొంగలు, వేట్లపాలెంలో అలాంటిదేమీ లేదు.

ఆ బాధవల్లనే హుశేనుపురంలో వున్న బ్రాహ్మలందరూ – అంటే దర్భావారందరూ వేట్లపాలెంలో ప్రవేశించి వుండినారు, నేను వెళ్ళేటప్పటికి.

బైరాగిశాస్త్రిగారెప్పుడూ, యెవరికో కొందరికి కావ్యవ్యాకరణాలు పాఠం చెబుతూనే వుండేవారు.

కావ్యనాటకాలంకార గ్రంథాలు చదివారు, వారు.

మహావైయాకరణి నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దగ్గిర సిద్ధాంతకౌముదిన్నీ చదివారు.

విశేషం యేమిటంటే?

కౌముది నిక్కచ్చిగా పాఠం చెప్పేవా రాయన; యిక కావ్యనాటకాలకు, చదివిందీ చదవందీ అన్న భేదమే లేదు.

అగ్రహారీకులు కనక, అగత్యం లేక దేశం తిరగలేదు గాని, సాహిత్యవేత్తగా బాగా ప్రఖ్యాతి పొంది వుండతగ్గవారు బైరాగిశాస్త్రిగారు.

తల్లిదండ్రులకు చాలామంది పిల్లలు నష్టపోయాక నిలిచిన మొదటి పురుషసంతానం బైరాగిశాస్త్రిగారు, అంచాతే వచ్చింది 'బైరాగి' అన్నపేరు, వారికి.

జాగ్రదావస్థలో వుండినంతసేపూ జపం చేసుకోడమూ, పాఠాలు చెప్పడమూ – ఇంతే ఆయన దినచర్య.

నడుస్తూ కూడా ఆయన సాహిత్య విషయాలే ఆలోచించేవారు, తాదాత్మ్యంతో.

మరో విషయమే ఆయన తలకెక్కేది కాదు.

"రెండూ మూడూ యెంత?" అనడిగితే "యెనిమిది కాదూ?" అని యెదురడిగినట్టుండేది ఆయన లోకజ్ఞానం.

మొత్తానికి బైరాగిశాస్త్రిగారి స్వభావం విచిత్రంగా వుండేది.

నాకు బాగా చిన్నతనం.

ఒకమాటు, తమ పెద్దమేనమామ పెదపూర్ణయ్యసిద్ధాంతిగారి వూరు పులగుర్త నుంచి దీపాలు పెట్టేవేళకు మా పొలమూరు వచ్చా రాయన.

ఇంటో మా అమ్మగారూ, మా చిన్నక్కా, మా చెల్లెలూ, నేనూ మాత్రమే వుండినాం.

రాత్రి భోజనం కావడం తడువుగా "పిన్నీ, మరి వెడతా"నంటూ లేచా రాయన.

"రేపు పొద్దుటి బండికి వెడుదువుగాని, నాయనా" అన్నారు మా అమ్మగారు, ఆయన వినిపించుకోలేదు.

"ఇల్లు విడిచి నాలుగు దినాలయింది, వెళ్ళా"లనే తప్ప మరో మాటే రానివ్వలేదాయన.

పొలమూరికి మైలుదూరాన వున్న అనపర్తి దగ్గిర యెక్కితే, వారి గుమ్మంలో దిగుతుంది, చామర్లకోట కాలవపడవ, తెల్లవారాటప్పటికి.

రాత్రంతా మాత్రం పడవలో వుండాలి, అంతే.

కానయితే, పుచ్చపువ్వులా వెన్నెల కాస్తూనే వుంది.

అయినా ఆయన సంగతి తెలుసు కనక "నాయనా, చేలగట్ల మీదుగా వెళ్ళాలి. చీలికలు వచ్చినచోట నిర్దేశించి చెప్పడాని కిప్పుడెవరూ వుండరు. నువ్వు అనపర్తి వెళ్ళలేవు, నా మాట విను, వెళ్ళవద్దు" అంటూ చిలక్కి చెప్పినట్టెంత చెప్పినా ఆయన వినిపించుకోలేదు.

యాదాలాభంగా అయితే యెవ రెన్నిచెప్పినా వినేవా రాయన, సొంతంగా అనుకున్నారా, మరి ఫాలాక్షుడు చెప్పినా లాభం లేకపోయేది.

ఏమి తటస్థించనీ, అనుకున్నంతా చేసెయ్యవలసిందే.

అంచేత, చేసేది లేక "అయితే, యిదిగో, వుత్తరంగా వెళ్ళు. ఊరు దాటాక

మురుక్కాలవ తగులుతుంది, దిగి, దాటి, అవతలి గట్టెక్కి చేలగట్టే మళ్ళీ వుత్తరంగానే వెళ్ళు, కాలవగట్టే మాత్రం వెళ్ళకుమా" అని పదిమాట్లు చెప్పారు మా అమ్మగారు.

దీనిమీద "ఆ, కుర్రపిల్లవాడికి చెప్పినట్టంత చాదస్తంగా చెబుతావేమిటి పిన్నీ?" అంటూ చాలా అభిమానపడ్డా రాయన.

మా అమ్మగారూ, ఆమె వెంట నేనూ పదిబారలు వెంటవెళ్ళి సాగనంపి వచ్చేశాం.

"మహిమ్నః పారంతే" అంటూ శివమహిమ్నం అందుకుని అడుగు ముందుకి వేశా రాయన.

కొంతసే పాయన మాటే చెప్పుకుని మేము పడుకున్నాం.

తెల్లవారుతోంది.

నేను అరుగుమీద కూచుని దంతధావనం చేసుకుంటున్నాను.

అక్కడ పడవ దిగి యిల్లు చేరుకోవలసిన వేళకి "పిన్ని యేమి చేస్తోంది తమ్ముడూ?" అంటూ యిక్కడ మా యింటికి వచ్చారు బైరాగి శాస్త్రిగారు, మళ్ళీ.

నేను తెల్లపోయాను.

"ఏం, దారి తప్పావా నాయనా?" అనడుగుతూ మా అమ్మగారు కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చారు.

"నువ్వన్నట్టే జరిగింది పిన్నీ" అంటూ జరిగిందంతా చెప్పుకునివచ్చా రాయన, తాపీగా కూచుని.

ప్రతీ అక్షరమూ స్ఫుటంగా వుచ్చరిస్తూనేగాని మాట్లాడేవారు కారాయన.

సంధ్యావందనంలో గాయత్రీజపం దగ్గిరికి వచ్చాటప్పటికిది దీక్షే అయిపోయేది.

ఇతర్లకు అష్టోత్తరశతగాయత్రి ముగిశాటప్పటి కాయనకు దశగాయత్రి మాత్రమే అయేది.

కోరి, ప్రాధేయపడి పలికించుకుని మేమెన్నో మాట్లు విన్నాం, మాహేశ్వరసూత్రా లాయన ఉచ్చరిస్తే పరమేశ్వరుడు డమరుకం వాయిస్తున్నాడా అన్నట్టుండేది.

ఈ అలవాటు చొప్పున మహిమ్నశ్లోకాలు స్ఫుటంగా ఉచ్చరించడంలోనూ, వాటి భావం మననం చేసుకోడంలోనూ మురుగుకాలవ దగ్గిరికి వెళ్ళాటప్పటికి మా అమ్మగారు చెప్పిన వివరాలన్నీ మరుపువచ్చాయి, ఆయనకు.

"పిన్ని, కాలవ దాటి అవతలిగట్టే వెళ్ళమందా, దాటకుండా యివతలిగట్టే వెళ్ళమందా?" అంటూ విచికిత్స పట్టుకుందిక్కడ.

ఎటు చూసినా ఎవరూ కనపడలేదు.

పది నిమిషాలు మథనపడి, యీ విస్మృతికి పడవ దాటిపోతుందన్న ఆదుర్దా తోడు కాగా, కాలవ దాటకుండా యివతలి గట్టే పశ్చిమంగా బయలుదేరారు, చివరికి.

ఆ బయలుదేరడం తూర్పుగా అయితే, మైలు దూరాన మహేంద్రవాడ గ్రామమూ తగులును, యిబ్బందీ లేకపోయివుండును.

పశ్చిమంగా వెళ్ళడం అసందర్భమే కాదు, ముప్పున్నూ అయిపోయింది.

## 24

పొలమూరికి పశ్చిమంగా, రమారమీ మైలు దూరాన తుల్యభాగానది వుంది.

అఖండ గోదావరి సప్తశాఖల్లో వొకటీ, మొదటిదిన్నీ అది.

కాకినాడ దక్షిణాన, చొల్లంగి గ్రామం దగ్గిర సాగరంలో సంగమిస్తుం దానది.

సంతానకాంక్ష గలవారికి ఆవశ్యక మయిన సప్తసాగర యాత్ర, పౌషబహుళ అమావాస్యనాడు తుల్యాసాగరసంగమం దగ్గిరే ప్రారంభం అవుతుంది.

సప్తసాగరాలంటే అఖండ గోదావరి ఏడు శాఖలూ సాగరసంగమం చేసే స్థలాల కన్నిటికీ కలిపి పేరు.

సప్తసాగరయాత్రకు ఇక్కడ, సాగరాలు అని వ్యవహారం, జనసామాన్యంలో.

అయితే, తుల్యభాగ ఆదిలో అంతర్వాహిని.

తుల్యమహర్షి, తన ఆశ్రమప్రాంతం జలప్రచురం కాకపోవడం వల్ల చాలా బాధపడి బాధపడి, అఖండ గోదావరినుంచి తన ఆశ్రమం మీదుగా వొక పాయ తీసుకువెళ్ళాడు.

అదే తుల్యభాగ.

అయితే, తన అనుజ్ఞ పొందకుండా తుల్యు డాపని చేసినందుకు మిక్కిలీ ఆగ్రహపడి "తుల్యభాగ అంతర్వాహిని అయిపోవాలి" అని శపించేశాడు, గౌతముడు.

అది వంకరటింకర అయిపోయేటట్టున్నూ శపించేశాడు.

కాని తుల్యు డంతటితో నిరాశ చేసుకుని వూరుకోలేదు.

అది మళ్ళీ బహిర్వాహినిగా చేసుకున్నా డాయన, చాలా శ్రమపడి.

వింతగా వుంటుందా విధానం, వినడానికి.

నీరు పడేదాకా ఒకచోట నుయ్యి లాగ గొయ్యి తవ్వించా డాయన, మొదట.

ప్రవాహం యిటు సాగుతూ వుండివుంటుందని వూహించి దాని క్కిందుగా కొంత దూరాన అంత గొయ్యీ తవ్వించాడు, తరవాత.

మొదటి గోతిలో పసుపు కలిపాడు.

కొంతసేపు నిరీక్షించాడు.

చూడగా రెండోగోతిలో నీళ్ళు పచ్చబడ్డాయి.

దీంతో, ప్రవాహసరణి తేలిపోయింది.

వెంటనే ఆ రెండు గోతులూ కలిశేటట్టు కాలవగా తవ్వించాడు.

ఈ విధంగానే నది అంతా బయటికి తెచ్చుకున్నా డతను, దీక్షపట్టి.

సాగరసంగమమున్నూ చేయించాడు.

పొలమూరి దగ్గిర – అంటే తన ఆశ్రమం దగ్గిర తుల్యుడు ఆ నదిని వుత్తరవాహినిగా చేసుకున్నాడు.

వంకరటింకర అయిపోవాలన్న గౌతముని శాపం అతనలా వుపయోగించుకున్నాడు.

దీనికి తగ్గట్టు పొలమూరి శివాలయం పశ్చిమాభిముఖం.

అది శిధిలం కాగా, నాకు ప్రాజ్ఞత వచ్చాక వూరివారు మళ్ళీ కట్టించారది విప్పి, కాని దాని ప్రాతిపదిక బహుప్రాచీనం.

ఉత్తర వాహినీ, పశ్చిమ లింగమూ వున్నస్థలం గొప్పక్షేత్రం.

అటు వొక్క కాశీలో మాత్రమే వుందిట, మళ్ళీ యిటు పొలమూరిలో వుంది, అలాంటి దివ్యస్థలం.

పర్వం వచ్చిందంటే, ఆ ప్రాంతాలవా రనేకులు పొలమూరు వచ్చి తుల్యలో స్నానం చేసి ధన్యులవుతూ వుంటారిప్పటికీ.

డెల్టాసంబంధమైన కాలవలు రాకపూర్వం, తుల్య, కుల్య అంత సన్నంగానే వుండినా, పడవల వ్యాపారం జరిగేదిట మొదట బాహాటంగా.

బ్రిటిషు గవర్నమెంటు స్థిరపడి, ధవళేశ్వరం దగ్గిర అఖండ గౌతమికి ఆనకట్ట యేర్పడి, పంటచేల మురుగు పోడాని కాప్రాంతాన పెద్ద మురుగు కాలవ తవ్వించడంలో తుల్య కొన్నిచోట్ల అందులో కలిసిపోయింది.

ఇప్పటి పొలమూరు, ఆదిలో, పులిబూరు అన్న పేరితో ఆ వుత్తర వాహిని తూర్పుగట్టున వుండేది.

అది యెలా తటస్థించిందో యెవరూ చెప్పలేరు గాని; మునుపు పులిబూరు వుండినచోట, తుల్య గట్టున శ్మశానం ఏర్పడి వుందిప్పుడు.

ఆ కారణం వల్ల శివాలయం అనుకుని అరమైలు దూరాన తూర్పున మళ్ళీ రూపొందింది, ఆ వూరు.

దానికే యిప్పుడు పొలమూరు అని వ్యవహారం.

పధ్నాలుగోశతాబ్దంలో పులిబూరు విద్యాపీఠంగా వున్నట్టు రెండు శాసనాలున్నాయి.

"శ్మశానవాటిక" అన్న పేరితో (ఇప్పటిపేరు విషభుజంగం) నేను రచించివున్న నవలకు పులిబూరు వినాశమే కథావస్తువు.

అది నా కల్పన.

మురుగుకాలవ గట్టే పశ్చిమంగా వెళ్ళి, కాలవతోబాటు, దక్షిణంగా రెండుమూడు ఫర్లాంగులు వెళ్ళటప్పటికి, బైరాగి శాస్త్రిగారికి, అదిగో ఆ శ్మశానం తగిలింది.

అక్కడ వుండిన శిథిలపరికరాలనుబట్టే దాని నిజస్థితిన్నీ ఆయన కవగతం అయిపోయింది.

అప్పటికి తెలిసింది దారి తప్పినట్టాయనకు.

అయితే, నలిగిన బాటనే జనసంచారం వుందని ఆ సమయాన, ఆయన కక్కడ యెవరు దొరుకుతారూ, అసలు దారి చూపించడానికి?

దీంతో, చేసేది లేక, అక్కడే వొక చెట్టుకింద చతికిలపడ్డా రాయన, తెల్లవారితే గాని, మరి గతి లేదనుకుని.

మేరునగధీరు లాయన, భయమన్నది యెరగరు, బంధువుల కందరికీ తెలుసు, యీ సంగతి.

కాకపోయినా, నిజంగా "ఋషి" ఆయన, పిశాచా లాయన కళ్ళబడగలవా?

ఉండగా వుండగా, చంద్రగతిని బట్టి రాత్రి రెండు జాములు దాటి వుంటుందని ఆయన నిశ్చయించుకునే టప్పటికి, తుల్య అవతల, పంటకాలవ గట్టున యెక్కడికో వెడుతున్న యెవరిదో దీర్ఘసంభాషణ వినవచ్చింది.

ప్రాణాలు లేచిరాగా "ఆ వెళ్ళేవా రెవరో, దారి తప్పి నేనిక్కడ చతికిలబడ్డాను, వస్తున్నా నాగండి" అంటూ కేక వేశారు, శాస్త్రిగారు.

ఆ స్థలం యెరిగివున్నందున కామోను "బాబోయ్" అంటూ రివ్వున ఆ మనుష్యు లెగిరిపోయారు, ఇది వింటూనే.

తొడలోతు నది దాటి, పేరాసతో శాస్త్రిగారు పంటకాలవ గట్టు చేరుకునేటప్పటికి శ్మశానం తప్పిందంతే, మరి ప్రయోజనం లేకపోయింది.

ఏమిటీ చెయ్యడం?

ఉన్నచోటనే వుండిపోతే యీ జిజ్ఞాస కలక్కపోవును.

పోనీ, అకాలవగట్టే వెడదామంటే, సాహసించిన్నీ వెడితే, అనపర్తిగ్రామం ఆ వెళ్ళిన దిక్కునే వుండినా, ఈ కాలవ ఆ వూరి మీదుగానే వెడుతుందో, మరో వూరికేసే మళ్ళిపోతుందో?

మళ్ళీ అసహాయు లయిపోయి, వొక చెట్టుకింద ఆ కాలవ గట్టునే గడిపా రాయన, శేషరాత్రి.

తూరుపు తెల్లవారుతోం దనగా మళ్ళీ జనసంచారం ప్రారంభం కాగా, దారి తెలుసుకుని, ఆ పంటకాలవలోనే సచేలస్నానమున్నూ చేసి "మీ యింటో భోజనం చేసే వెడదామనుకుంటూ వచ్చా"నంటూ వచ్చా రాయన, మళ్ళీ మా యింటికి.

మా అమ్మగారు చాలా నొచ్చుకున్నారు.

అయితే, జరిగిపోయిన దానికి చేసేదేమీ లేక, వంట మాత్రం త్వరగా చేసి, భోజనం పెట్టి, శాస్త్రిగారిని పదకొండు గంటల బండికే పంపేశా రామె.

చెప్పవచ్చిం దేమిటంటే?

బైరాగి శాస్త్రిగారు, స్థూలదృష్టికి వో-ర్తి అమాయకులు.

సూక్ష్మదృష్టికి మాత్రం మహర్షి.

శత్రువులున్నూ ఆయన నడవడిలో హెచ్చుతగ్గులు చూపించలేరు.

అయితే, పంక్తి అన్వయించడం వచ్చిందా, అందులో యెదురువాదమున్నూ వచ్చిందా, యిక యెలాంటివాళ్ళనీ కూడా "పాతేసి" విడిచిపెట్టేవా రాయన.

ఆ మహానుభావుని అనుగ్రహంవల్లనే నా కోపాటి ప్రవేశం కలిగింది, సంస్కృతంలో.

అదే నా జీవితానికి వెలుగిచ్చింది.

## 25

మేఘసందేశం పూర్తి అయిపోయింది.

పూర్తి అయిందంటే, బండవల్లన చేసి శ్లోకాలూ శబ్దార్థాలూ జిహ్వాగ్రాన వుంచుకున్నా నన్నమాట, నేను.

కాకపోతే, మేధావులైన మహా మహా సాహిత్యవేత్తలకే అస్వాదించడం పూర్తిగా సాధ్యపడదుగదా, పదిహేనేళ్లు నిండని క్షీరకంఠుణ్ణి, నాకేమి అవగాహన అవుతుందీ, అప్పుడా గ్రంథసారస్యం?

మరి, అంత చిన్నతనాన గురువు లది యెందుకు చెబుతారూ విద్యార్థులకు?

ఈ పాఠ్యక్రమం చాలా అసందర్భంగా వుందని నేనెన్నో మాట్లనుకుంటూ వచ్చాను, తరవాత్తరవాత.

ఇంతకంటేనూ ఘోరం, నాలుగు శబ్దాలు వల్లించిన వెంటనే రఘువంశం ప్రారంభించడం.

సంస్కృత సాహిత్యంలో, అనేక గ్రంథాలు, దేని కదే మహాకావ్యం అయినా, రఘువంశానికి సాటి అయింది మరి లేదని నా నమ్మకం.

భావుకత వుంటే, బతికి వుండినంతకాలమూ ఆనందిస్తూ వుండడాని కా వొక్క గ్రంథమూ చాలు, విసువు లేకుండా.

కాళిదాసు, అంతటి మహానుభావుడయి వుండగా, అతని కావ్యాలు మూడూ కూడా లఘుత్రయంగానే నిర్ణయించి, మన పండితు లతనికెంతో అన్యాయం చేశారని నా పరితాపం.

అయితే, పిఠాపురం చదువు పూర్తిచేసుకున్నాక, రఘువంశమూ, కుమారసంభవమూ, మేఘసందేశమూ, భారవీ, మాఘమూ, శాకుంతలమూ, ఉత్తర రామచరిత్రా పరిశీలనగా చదివాను దీక్షపట్టి, మధ్యమధ్య తెనుగుగ్రంథం యేదిన్నీ ముట్టుకోకుండా, పూర్తిగా.

శ్రీహర్షుని నైషధమున్నూ, అప్పుడే చదివాను, స్థూలంగా.

నిజంగా, ఆ గ్రంథాల ఘనతే కాదు, సంస్కృతభాషా మాధుర్యమున్నూ నా కప్పుడే అవగాహన అయింది చక్కగా.

దాంతో, పాఠ్యక్రమానికి సంబంధించిన అసంతృప్తిన్నీ అప్పుడే నివారణ అయిపోయింది, నిశ్శేషంగా.

"పూర్వు లాలోచించే నిర్ణయించారు, సందేహం లే"దని నిశ్చయబుద్ధిన్నీ కలిగిం దప్పుడే.

గుణింతాలు కాగానే, నా చిన్ననాటి దాకా, బాలరామాయణం ప్రారంభించే వారప్పటి పాఠశాలల్లో.

దాని అంతర్యం తెలిస్తే పూర్వుల నిర్ణయం యెంత సహేతుకమో అర్థం అవుతుంది.

కొంచెం పరిశీలిస్తే దాని అంతర్యమున్నూ బోధపడుతుంది, సులువుగా.

అదేమిటంటే?

సంస్కృతం వినా తెనుగుభాషకు పరిపూర్ణత లేదు.

రానేరాదు కూడా.

పిల్లల విశుద్ధమనఃఫలకాలమీద, మొదట మొదట, మహా పురుషుల రూపాలు అంకితం చెయ్యాలి. కాకీకుక్కల క్షుద్ర రూపాలు కావు.

గుణింతాలు కాగానే – నోరు ముదిరిపోకుండానే వర్ణక్రమమూ, ఉచ్చారణరీతీ అలవర్చాలి, తరవాత అవి సాధ్యం కావు.

స్థిరపడవు కూడా.

ఆస్తికభావం అలవడాలంటే, అవగాహన చేసుకునే శక్తి ప్రారంభం కాకపూర్వమే దైవభక్తికి సంబంధించిన కొంత వాఙ్మయం నోటికి వచ్చివుండాలి.

ఈ అంశాలు బాగా పరిశీలించి, అప్ప్ డాలోచించండి, – చూస్తేనే తెలిసిపోయే "ఆవునకు నాలుగు కాళ్లు" అనే విషయమే చదవాలో, బాలరామాయణమే చదవాలో పిల్లలు?

మొదటే రఘువంశాదికం చెప్పడమూ యిలాంటిదే, తెలుసుకోగలిగితే.

ప్రారంభంలో బండవల్లన చెయ్యగూడ దనడమూ, పిల్లవాడే స్వబుద్ధితో సకలమూ గ్రహించా లనడమూ తప్ప్డు సిద్ధాంతాలు, పూర్తిగా.

పంచకావ్యాలు మాత్రమే కాదు, పద్యకావ్యాలూ, చంపువులూ, వచనగ్రంథాలూ, నాటకాలూ యెన్నో వున్నాయి, రసమహితాలు; కాని కావ్యపాఠం పూర్తి అయిపోయాక యెందరవి స్పృశిస్తున్నారూ, రసపిపాసువులే అయినా?

కారణం?

జ్ఞాపకమే రావు ఆ గ్రంథాల పేళ్లు కూడా, తీరుబడిమాట యేమయినా.

రఘువంశాదికం విషయం మాత్రం అలాకాదు.

చిన్నతనంలో, సర్గలకు సర్గలు గురువు లడిగినప్ప్ డల్లా, పుస్తకనిరపేక్షంగా గడగడ అప్పగించవలసివుంటుంది కనక, అలా చెయ్యగలగా లంటే అప్ప్డు బండవల్లన చేసితీరాలి కనక, ఆ మహాగ్రంథాల రసవత్తర ఘట్టాలయినా కొన్ని బతికి వుండినంతకాలమూ స్మృతిఫలకాన బొమ్మకడుతూనూ, చెవులలో ప్రతిధ్వనిస్తూనూ వుంటాయి, గుబురుగొమ్మల్లో మూసుకుపోయిన సంపంగి పువ్వుల మధురసౌరభం దానికదే దూసుకువచ్చి ఘ్రాణతర్పణం చేసేటట్టు.

లోకజ్ఞానంతోపాటు అర్థజ్ఞానమూ గ్రహణశక్తీ పెరిగి వుంటాయి కనక, ఆ స్మృతితో, ఆ మహాగ్రంథాలు మళ్ళీ వొకమాటు చదవా లని అభిలాషా రేకెత్తుతుంది, తరవాత్తరవాత, తప్పనిసరిగా.

నే నెరిగినవే యిలాంటి సన్నివేశా లెన్నో వున్నాయి.

కాక:–

విద్యాభ్యాసం ప్రారంభించిన కొత్తలో, మధురమూ, సులభమూ, లలితమూ, రసబంధురమూ అయిన భాష గల గ్రంథాలు చదివించడమూ, వల్లింపజెయ్యడమూ మిక్కిలీ అగత్యం.

కనక, ఆ పసితనంలో రఘువంశాదికం చెప్పడమే మంచిది, సందేహం లేదు.

## 26

మేఘసందేశం పూర్తయిపోయింది, భారవి ప్రారంభించా, నవ్యవధిగా.

దాంతో ఉన్నట్టుండగా, పున్నమి పండువెన్నెట్లోనుంచి అమాస కటికచీకట్లో పడ్డ ట్టయింది నా పని.

ముందుకి వెళ్ళి మొదటివాచకం పూర్తిచేసి, వెనక్కి వచ్చి అప్ప్డు గుణింతాలు ప్రారంభించినట్టున్నూ అయింది నా పని.

ఏమంటే?

భాషలో మార్పు, శైలిలో మార్పు, ధోరణిలో మార్పు, వస్తువులోనే పెద్ద మార్పు.

సాహిత్యసంపదలో అంతస్థు మారడాని కివన్నీ ఆవశ్యకాలే - కాదనను; కాని నా కా చిన్నతనంలో యీ రహస్యం గుర్తించతగ్గ పరిణతి యెక్కడిదీ?

అయితే, బైరాగి శాస్త్రిగారు పాఠం చెప్పడం అంటే, అరిటిపండు వొలిచి చేతిలో పెట్టడమే.

బోధించే నేర్పు ఆయన కున్నంత చక్కగా యే కొద్దిమందికో గాని వుండదు.

అంచేత, మొదటిసర్గ పూర్తి కావచ్చాటప్పటికి శైలీ ధోరణీ నాకు పరిచితా లయినాయి.

వస్తువు అందుబాటుకి వచ్చింది.

రుచిన్నీ పెరిగింది.

కాని, మూడోసర్గ పూర్తి అవుతుం దనగా, హఠాత్తుగా నే నక్కణ్ణుంచి వెళ్ళిపోవలసి వచ్చింది.

అందుకెంతో బాధపడ్డా, నయినా, వెళ్ళిపోవలసే వచ్చింది.

దాంతో, నా చదువుకి పెద్ద దెబ్బ తగిలింది.

విఘాతమే యేర్పడిపోయింది.

తరవాత చాలా సాధన చేశాను, అలా చేసినందుకు అప్పుడింకా చదువుకునే వుంటే యెంతో మేలు కలిగేది.

కాని, ఆ యోగం లేకపోయింది.

ఏమయినా, వెళ్ళిపోకతప్పింది కాదు.

పోనీ, వెళ్ళిపోకుండా వుండలేకపోయా న్నేను.

కారణం, నిష్కారణం.

వడ్లగింజలో బియ్యపుగింజాను.

ఎవరో సద్దిచెప్పనక్కరలేదు, నేనూ సద్దుకోగలిగిందే ఆ సందర్భం - సద్దుకో లేకపోయాను, అంతే.

ఉన్నదల్లా యేమిటంటే?

ఎన్నాళ్లు ప్రయత్నించినా వేట్లపాలెంలో నా కారువారాలే దొరికాయి, కష్టంమీద.

స్థితిపరులే గాని అక్కడి బ్రాహ్మల్లో చాలామంది ఉదారులు కారు.

దూరం వెళ్ళలేక దర్భావారు అక్కడ ప్రవేశించారేగాని అక్కడ విద్యావాసన బొత్తిగా తక్కువ.

దర్భావారివి మూడు, కంభంపాటివారివి రెండూ - అయిదిళ్ళే వున్నాయి ఆ వూళ్ళో వెలనాటివారివి, అయిదుగురూ వారాలిచ్చారు, గోల్కొండ వ్యాపారుల్లో వొక్క విరియాల రామయ్యగారు మాత్రమే వారం యిచ్చారు, తక్కిన బ్రాహ్మ లింకా యిరవైయిళ్ళవా ళ్ళయినా వున్నారు గాని, యేడోవారం కుదరలేదు.

తమ యింటో రెండు రోజులు భోజనం చెయ్యమన్నారు గురువుగారు, నా కిష్టం లేకపోయింది.

దినమ్మూ చద్దన్నం తింటూ వొకనాడు కూడా వారి యింటో భోజనం చేసేవాణ్ణి, అంచేత నేను మొగమోటపడిపోయాను, మరోనాడున్నూ భోజనం చెయ్యడానికి.

కాగా, ఏడోవారం కోసం అక్కడికి మూడుమైళ్ళలో వున్న మేడపాడు గ్రామం వెళ్ళేవాణ్ణి.

రానూ పోనూ ఆరుమైళ్ళు నడవాలి, మేడపాడు గ్రామంలో భోజనం అంటే.

అంచేత, ఆవేళ ఉదయం కాల్యకృత్యాలు వడిగా తీర్చుకుని నాటిపాఠమున్నూ చెప్పేసుకుని, తొమ్మిదింటికి బయలుదేరి వెళ్ళి ఆ రాత్రి కూడా అక్కడే వుండిపోయేవాణ్ణి మళ్ళీ వెళ్లలేక.

అదివరకే యెరిగివుండిన స్కూలుమాస్ట రింటో భోజనమూ మకామూను, నా కక్కడ.

ఆయన భార్య మా చిన్నక్కగారి అత్తవారి వూరిపిల్ల.

ఆమె ద్వారానే నా కాయన పరిచయం.

మొదటిమాటు చుట్టపుచూపుగా వెళ్లి వేట్లపాలెం సంగతి చెప్పగా, ఏడోవారం తన యింటికి వస్తూవుండమని నిర్బంధమున్నూ చేసిందామె, వెనకటి పరిచయంతో.

అంచేత, నా కక్కడ యెరమరిక వుండేది కాదు.

దీనికి సాయం ఆయన దగ్గిర, అరేబియన్ నైట్సు కథలూ, చార్ దర్వీష్ కథలూ, శుకసప్తతికథలూ, రేచుక్క పగటిచుక్క కథలూ – ఇలాంటి వాఙ్మయం చాలా వుండేది.

మదనకామరాజు కథల తరవాత అవే నేను చూడడం.

ఆ చూడడమున్నూ అక్కడే.

అయితే, నా కప్పుడా పుస్తకాల పరిచయం కావలసివుండే వేట్లపాలెంలో యేడోవారం దొరకలేదనుకోనా?

కథారచనే నా జీవితానికి ప్రధానం కావలసివుండడంవల్లనేనా మదనకామరాజు కథ లయితేం, అవయితేం నా కళ్ళబడడం మొదట?

ఏమయినా, మేడపాటి వారం నా జీవితానికొక చుక్కాని వంటిదయింది.

తరవాత్తరవాత కాలక్రమాన కలిగిన పరిచయాన్ని పట్టి ప్రయత్నిస్తే వేట్లపాలెంలో నా కేడోవారం దొరికే వుండును కాని, ఆ పుస్తకాలకోసం మేడపాటివారం వొదులుకోలేకపోయా న్నేను.

ఆ వూళ్ళో రెయిల్వేస్టేషనుమాష్టరుతో గూడా నాకు పరిచయం యేర్పడింది, అనుకోకుండా

రిటైరు కావడానికి తగ్గ వయస్సులో వుండేవా డాయన, కాని, సమవయస్కుడన్నట్టు కలిసిమెలిసివుండేవాడు నాతో

కన్నడ దేశస్థు డాయన, మధ్వమతస్థుడున్నూ, వచ్చీ రాని తెనుగు మాట్లాడుతూ నన్ను విడిచిపెట్టేవాడు కాడు, మధ్యాహ్నం రెయిళ్ళు వెళ్ళిపోయింది మొదలు, సాయంత్రం రెయిళ్లు వెళ్ళేదాకా – మొత్తం నాలుగయిదు గంటలు.

వద్దు వద్దంటూ వుండినా రెండు మూడుమాట్లు కాఫీ కూడా యిచ్చా డాయన ఫలహారం పెట్టి నాకు.

తరవాత మహాభారత విమర్శ చేసిన పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గా రావూరివారే, అప్పుడే వారితో నాకు పరిచయం ప్రారంభం కావడం.

అక్కడ దొరికిన ఆ కథల పుస్తకా లన్నిటిలోనూ భాష అసహ్యంగా వుండేది, అయినా, ఆ ధోరణికోసమూ ఆ యుక్తుల కోసమూ నేనవి విడిచిపెట్టలేకపోయేవాణ్ణి.

కాగా, – అక్కడికి వెళ్ళగానే భారవి వొకచోట పడెయ్యడమూ, ఆ పుస్తకా లందుకోడమూనూ నేను.

నిజంగా, శ్రీవైష్ణవులు రామాయణం పారాయణ చేసేటట్టు చదివాను, నే నవి.

ఆ చదువు నన్ను కథారచనలోకి దింపేసింది.

దాంతో, వల్లూరిలో కథలు కల్పించినవాణ్ణల్లా, వేట్లపాలెంలో కథలు రచించడమే ప్రారంభించాను.

అవన్నీ శివలీలలకు సంబంధించి వుండేవి.

**శివమహిమలతో**నున్నూ నిండివుండేవి.

స్టేషనుమాస్టరు, అవి రాసుకోడానికి రెయిల్వేఫారా లిచ్చేవాడు, కావలసినన్నీ.

**అయితే,** ఆయన యీ వారం యిచ్చిన కాగితాలన్నీ మళ్ళీ వారం నాటికి నేను నలుపు చెయ్యాలి, తప్పనిసరిగా.

ఆ రాత చూపిస్తేనే మళ్ళీ కాగితాలిచ్చేవా రాయన.

ఇదికూడా నా కథారచనకు దోహదం అయింది, అనుకోనిది.

మొత్తానికి, నేను వేట్లపాలెం వెళ్ళడం కావ్యాలు చదువుకోడానికీ, అక్కడ వుండడం కథలు రాయడానికీ అన్నట్టయింది.

లేకపోతే కాలం గడపడం యెలాగా?

గురువుగారి దగ్గిర రోజూ నాలుగేసి శ్లోకాలు చెప్పుకోడం – ఆ వరసనే ఒక్క గంటసేపు అవి బాగా వల్లించడం – మన్నాడు పొద్దున చింతన చేశాటప్పుడవి తరిచితరిచి మనస్సుకి పట్టించుకోడం – రాత్రి పడుకుని ఆ సర్గలో అయిన శ్లోకాలన్నీ దండకం లాగ మూలం మాత్రం మెల్లిగా యేకరువుపెట్టుకోడం – అంతే, మరి, పుస్తకం చేతబట్టడం లేదు.

మధ్యాహ్నం భోజనానికి వెళ్ళినచోట కొత్త శ్లోకాలు చూసుకోడం అయిపోయేది.

దీంతో, చాలామందికి నా చదువు కనపడేది కాదు, పరీక్షిస్తే తప్ప.

దీనికితోడు పక్షానికి మూడురోజు లనధ్యాయాలు.

పౌర్ణమినాడూ, అమావాస్యనాడూ పుస్తకమే ముట్టగూడదు, మరి.

సాధారణంగా, ఆటల్లో దిగితే కుర్రవాళ్ళ కెంతకాలమూ చాలదు.

నాకు కావ్యపాఠానికి కొన్ని గంటలు సరిపోయేవి, కథారచనకు మాత్రం వారాలకు వారాలే చాలేవి కావు.

ఇదిగో, యిది నిమిత్తమాత్రం అయిపోయింది, నే నక్కణ్ణుంచి వెళ్ళిపోడానికి.

## 27

నేను వెళ్ళిన కొన్నాళ్ళకి గురువుగారి చిన్నమేనమామ పిడపర్తి చిన పూర్ణయ్య సిద్ధాంతిగారి రెండో కొడుకు సుబ్రహ్మణ్య శాస్త్రిన్నీ వచ్చాడక్కడికి చదువుకోడానికి.

అతను నాకంటే కొంచెం చిన్న.

తరవాత యెప్పుడో అయిం దతనికి పెళ్ళి. మా అత్తవారి వూరే అతని అత్తవారి వూరున్ను.

అప్పటి కతను కుమారసంభవం చదువుతున్నాడు.

అయితే, అతను వారాలు చేసుకునేవాడు కాడు.

గురువుగారి తల్లి స్వయానా తనకి మేనత్త కావడంవల్ల వారింటోనే భోజనం చేసేవాడు.

అతనికీ నాకూ మనస్సులు కలియలేదు.

నేను వారాలు చేసుకోడం, తానే గురువుగారికి చుట్టంకాని, నేనెక్కణ్ణుంచో వచ్చిన వాణ్ణన్న భావం కలిగించిం దతనికి.

గురువుగారి తమ్ముడు సర్వేశ్వరచయనులూ (ఇప్పుడు సర్వేశ్వరశాస్త్రి - మహావైయాకరణి) గురువుగారి చెల్లెలి భర్త పీసపాటి రామసోమయాజులూ నేనంటే ప్రాణం యిచ్చేవారు.

అది అతని కిష్టంలేదు.

"నేను మీకు దగ్గిరవాణ్ణి. అతను బహుదూరం. కనక, నా పక్షంగా వుండాలి మీరు" అనేవా డతను; కాని వాళ్ళందు కంగీకరించలేదు.

"అందరమూ బంధువులమే" అని వాళ్ళ వాదం.

వాళ్ళని తా నాకర్షించుకోలేకపోడం - నేను మాయచేసి లోపుచేసుకున్నా ననుకోడం - దీంతో, నా యెడల యీర్ష్య వహించా డతను.

నేనూ తక్కువ చెయ్యలే దతనితో - ఢీకున్నాను.

ఘర్షణ పడలేదు, అంతే, అక్కస్సు మాత్రం పెంచుకున్నాం మేము.

మాటలు మానుకోలేదు, పులుకూ పులుకూ మాత్రం చూసుకునేవాళ్ళం.

కుటుంబాల పరంగా మాకుండుకున్న పూర్వవైమనస్యాలు దీనికి పూర్వరంగం.

దీంతో, బాహాటంగా మేము వేరయిపోయాం.

ఒక వరలో రెండు కత్తులున్నట్టు తయారయింది, మా స్థితి.

ఇటు, ఇది యిలా వుండగా, అటు, నిరాఘాటంగా సాగిపోతోంది, నా కథారచన.

గురువుగారి యింటికి చేరి, దినానికి రెండుమాట్లు అర్చకుడు మాత్రమే స్వామిదర్శనం చేసుకునే శివాలయం వుంది, చిన్నది.

దాని ఆవరణకి వీధివైపున వొక కొంజా.

ఆ కొంజాకి లోపలిభాగాన రెండు గదులు.

వాటిలో వొకటి తన స్వాధీనంలో వుంచుకుని రెండోది నా కప్పగించాడు, అర్చకుడు.

రామసోమయాజుల్ని అక్కడికి తీసుకువెళ్ళి నా కథ లతనికి వినిపించి మురిసిపోయేవాణ్ణి నేను.

వయసు మళ్ళినవాడే కాని నా కథ లంటే చెవికోసుకునేవాడు, అర్చకుడున్నూ.

ఒకనాడు, నేనూ రామసోమయాజులూ, అర్చకుడూ వొక కథలో లీనం అయివుండగా చూశాడు, సుబ్రహ్మణ్యశాస్త్రి. వెళ్ళి గురువుగారితోనూ చెప్పాడు,

చిలవలూ పలవలూ పెంచి.
దానిమీద "నిన్ను తెనుగు పుస్తకాలు ముట్టుకోవద్దంటే తెనుగులో రచనే ప్రారంభించావ్రూ?" అంటూ చాలా గట్టిగా మందలించారు గురువుగారు నన్ను.
సుబ్రహ్మణ్యశాస్త్రిమీద నాకు చాలా కోపం వచ్చింది.
మొదటిమాటు, మర్నాడు, మేమిద్దరమూ ఘర్షణపడ్డాము.
ఆ సంగతీ చెప్పాడు గురువుగారితో, అతను.
అప్పుడే అనుకున్నా న్నేను "మా యిద్దరిలో వొకరి కక్కడ వుండే యోగం లేదా?" అని.
ఆ సందర్భంలో, రామసోమయాజులూ, సర్వేశ్వరచయనులూ అతణ్ణే మందలించారు.
దానిక్కారణమున్నూ నా కాతానే జమకట్టా డతను.
అసలు పగ ప్రారంభం అయింది.
మే మిద్దరమే రకరకాలుగా సాధించుకునేవాళ్ళం, లోపాయికారీగా:
గురువుగారి యింట నాకు వారం వుండేది.
ఒకనాటి రాత్రి, భోజనాత్పూర్వం, నడవలో దీపం దగ్గిర కూచుని నేను ఆవేళ చెప్పుకున్న శ్లోకాలు చూసుకుంటున్నాను, నాలో నేను.
అక్కడికి కనపడుతూ, వసారాలో కూచుని, వంటచేస్తున్న పెద్దకోడలికి సలహోలు చెబుతోంది, గురువుగారి తల్లి.
అలాంటప్పుడు, పిల్లిలాగ వెనకనే మెల్లిగా వచ్చి "భో" అంటూ అరిచాడు సుబ్రహ్మణ్యశాస్త్రి, చెవిలో.
నే నులిక్కిపడ్డాను.
చెవిలో కూడా బాధ కలిగింది.
అయినా, వొకవిధంగా నే నదృష్టవంతుణ్ణే.
ఏమంటే?
అది గురువుగారి తల్లి చూసింది.
అతణ్ణే మందలించనూ మందలించింది, గట్టిగా.
నాకు మాత్రం వల్లమాలిన రోషం వచ్చేసింది.
బదులుతీర్చా లనుకున్నాను, యథాపూర్వంగానే.
ఒక వారం గడిచింది.
పెద్ద వాన కురిసింది, వొకనాడు.
రెండు దినాలకు నేల ఆరింది; కాని రబ్బరులాగ కాస్త మెత్తగానే వుంది, యింకా.
ఆ రాత్రి వూళ్ళో భోజనం చేసి బసకి–గురువుగారి యింటికి వస్తున్నా న్నేను. కటికిచీకటి.
నా దగ్గిర, వొకచేత పట్టుపంచా, వొకచేత కర్రా వున్నాయి.
కర్ర అంటే విశేషం యేమీ లేదు, అది వెదురుది, బొంగుదిన్ని.
బయటికి వెళ్ళి వస్తున్నా డాసమయాన సుబ్రహ్మణ్యశాస్త్రి, కాలవగట్టునుంచి.
ఏదో గొణుక్కుంటున్నట్టు మాట్లాడుతున్నాడు, దాంతో గుర్తుపట్టా నతణ్ణే.
"ఇదే సమయం" అనుకున్నాను, బదులుతీర్చడానికి.

దగ్గిరికి రానిచ్చాను.

సా—చి కొట్టాను నేలమీదే, కర్రతిరగవేసి.

ఖంగు మనడానికి బదులు, ఢామ్మంది నేల, రాముడోల్లాగ.

"బాబోయ్" అంటూ యెగిసిపడి, యేడుపు లంకించుకున్నాడు, సుబ్రహ్మణ్యశాస్త్రి.

మహా బాగా జరిగిం దనుకున్నాను.

కాని యింతలో మరో మనిషి యేడుపున్నూ వినవచ్చింది.

పరకాయించగా, సర్వేశ్వరచయనులున్నూ యేడుస్తున్నాడు.

అతనూ వస్తున్నాడు కాబోలు, వెనకాల వుండడంవల్ల నేను గమనించలేదు.

సంగతి తెలియగానే జరిగిందంతా చెప్పాను గాని; భయభ్రాంతివల్ల చయనులది వినిపించుకోలేదు.

ఆ రాత్రి గురువుగారి యింటో చాలా రభస అయింది.

సర్వేశ్వరచయను లప్పుడలా బెదిరిపోయి యేడ్చివుండిన్నీ కూడా, నేను చేసిందేమిటో వున్నదున్నట్టు చెప్పాడు.

"ఇంతమాత్రానికే యేడవాలా?" అంటూ సుబ్రహ్మణ్యశాస్త్రినే యెగతాళి చేశాడు, రామసోమయాజులు.

గురువుగారి తల్లి కూడా, అతనావేళ చేసింది చూసి వుంది కనక, నన్నేమీ అనలేక "తొందరపడ్డావురా నాయనా" అని మాత్రం అంది, తన కొడుకున్నూ భయపడ్డాడు కనక, కొద్దిపాటి అసంతృప్తితో.

ఆవిడ చెప్పింది విని, మొదట మహోగ్రు లయిపోయిన గురువుగారున్నూ తరవాత శాంతించి "వూరుకోండి, వూరుకోండి" అంటూ వీధి అరుగుమీదికి వెళ్ళిపోయి, మహిమ్నం అందుకున్నారు.

గురువుగారి తండ్రి చలమయ్యశాస్త్రిగారు మాత్రం మండిపడిపోయారు, నామీద.

"నా కొడుకుని జడిపిస్తావా?" అంటూ మండిపడితే, పడివూరుకుందున్నేను. "నా మేనల్లుణ్ణి భయపెడతావా?" అంటూ ప్రారంభించా రాయన.

భార్య యెంతయినా చెప్పింది; కాని శాంతించలేకపోయా రాయన.

తప్పు గుర్తించకపోవడం – బంధుత్వంలో దగ్గిరా, దూరమూ అంటూ అరాలు తియ్యడం – నేనిది సహించలేకపోయాను.

మర్నాటి రాత్రే నేనింటికి బయలుదేరాను, మూటాముల్లే కట్టుకుని.

ఆ రాత్రి పడవ దాటిపోయింది, అంచేత మర్నాటిదాకా ఆగవలసివచ్చింది.

పోనీ అంటే, పడవ వుండిన చోట రెయి లెక్కడం అప్పటికింకా అలవాటు కాలేదు.

పైగా, పొరుగింటనే కాదూ, భోజనం?

మర్నాడు నేను గుడిలోనే వుండిపోయాను చాలాసేపు, పాఠం సమయాన తప్ప.

చయనులూ రామసోమయాజులూ తెల్లపోయారు నా ప్రయాణం చూసి.

"స్వల్పవిషయం, పైగా, ఆయన పెద్దలూ అనతగ్గవారూను; కనక, మనస్సు సరిపెట్టుకో" అన్నారు, గురువుగారు.

"ముసలాయన మాటకేం, వుండి చదువుకోరా" అంది గురువుగారి తల్లిన్నీ.

కాని, ముసలాయన మాత్రం చూసిన్నీ వూరుకున్నారు.

ప్రతిష్ఠకోసం పాకులాడేరే గాని; వుండమనలేకపోయా రాయన.

ఆయన చేసిన థాముథూములు మరిచిపోలేక నే నుండలేకపోయాను.

గుమ్మంలోనే – అరఫర్లాంగులోనే కాలవ కనక, చయనులూ రామసోమయాజులూ పడవదాకా వచ్చి సాగనంపారు నన్ను.

తెల్లవారాటప్పటికి నే నింటికి చేరుకున్నాను.

"చిన్నపూర్ణమ్మ కోప్పడలేదుగదా?" అన్నారు, మా నాయనగారు.

"చలమయ్యశాస్త్రులుగారు అంత భేదభావం చూపించారా?" అంటూ చ్రరుమన్నారు, మా అమ్మగారు.

## 28

ఇంటికి రాగానే భారవి తరవాయి మా పెద్దఅన్నగారి దగ్గిర చదువుకోసాగాను గాని, బైరాగిశాస్త్రిగారి పాఠం తప్పిపోయినందుకు కష్టంగా వుంది, మిక్కిలీ.

ఒక్క కష్టమే కాదు, ఎంతో నష్టమున్ను.

అయితే, వారికీ మాకూ బంధుత్వమే లేకపోయి వుంటే మాకీ పట్టింపులు వచ్చివుండకపోవును.

పిడవర్తి సుబ్రహ్మణ్యశాస్త్రికీ నాకూ వైమనస్యాలున్నూ కలిగివుండకే పోవును.

తమకు, పిడవర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్న భావమరిది కొడుకూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పెత్తల్లి మనమడూను – బంధుత్వంలో వుండుకున్న యీ దగ్గిర దూరాలు పాటించారేగాని, దర్భా చలమయ్యశాస్త్రిగారు న్యాయం గుర్తించలేకపోయారు.

లోకసామాన్యధర్మం, విపరీతం కాదిది, నిజమే; అయితే, పండితుల కిలాంటిది తగునా, మరి?

పోనీ అంటే, అ చిన్నబావమరిది కొడుకయినా బాముకున్న దేదీ, మరో రెండు మాసాల కతనూ వెళ్ళిపోయాడు, చదువు చాలించుకుని.

స్వర్గాన వున్నాడు పాపం, రామసోమయాజులు రాశాడీసంగతి నాకు, మామగారు చేసినదానికి మిక్కిలీ పరితపిస్తూ.

పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రికేం, అప్పటికీ యిప్పటికిన్నీ గూడా సాహిత్యం ప్రధానం కాదతనికి, నాకే తీరని నష్టం.

ఈ నష్టం తీరడానికి, తరవాత్తరవాత, రాత్రింబగ ళ్ళేకతానంగా నిరంతరకృషి చేసుకోవలసివచ్చింది నాకు. దానివల్ల నిరంతర పఠనమూ సంతత రచనా నా కలవాట యినాయి, మంచిదే అనుకోండి.

ఏమయినా, బైరాగి శాస్త్రిగారి పాఠనం తప్పిపోడం మాత్రం యెంతచేసినా, యెప్పటికీ తీరని లోపం.

ఇది తలుచుకుంటూ నేను చాలా బాధపడ్డాను, తరవాత.

ఇప్పటికీ "అయ్యో" అనిపిస్తూనే వుంటుంది, జ్ఞాపకంవస్తే.

నేనిలా బాధపడే రోజుల్లోనే వొకమాటు బైరాగిశాస్త్రిగారు మా యింటికి వచ్చారు.

అప్పటికప్పుడే భారవి ఆరు సర్గలు పాఠ్యక్రమంగా పూర్తిచేసి, తరవాతి గ్రంథం నేను స్వయంగా చూసుకు వెడుతున్నాను.

ఇదివిని జరిగిపోయినదానికి మళ్ళీ విచారించారు, బైరాగి శాస్త్రిగారు, చాలా.

రాత్రి భోజనాల సమయాన వచ్చిం దీప్రస్తావన.

"ఇద్దరూ చదువుకోసం వచ్చినవాళ్ళే, చుట్టపుచూపుగా కాదు, యీ సంగతి గుర్తించలేకపోయారు, మీ నాయన మాత్రం" అన్నారు మా అమ్మగారు, వడ్డిస్తూ వడ్డిస్తూ.

"అవునవును. పోనీ, వాడుమాత్రం వున్న దేదీ, మరి రెండు మాసాల్లోనే వెళ్ళిపోయాడు, చదువుమీద శ్రద్ధ లేక" అన్నారు, శాస్త్రిగారు.

గభీమని అందుకున్నారు, ఆ సంభాషణ అంతటితో తుంచిన్నీ వేశారు మా నాయనగారు, వెళ్ళివెళ్ళి అసందర్భ ప్రసంగంలో దిగిపోతుందని.

ఇద్దరికీ యిద్దరూ మేనమామలే అయినా, బైరాగిశాస్త్రి గారికి చిన్నపూర్ణయ్య గారిమీదా, ఆయన పెద్ద తమ్ముడు శ్రీరామశాస్త్రికి పెద్దపూర్ణయ్యగారిమీదా అభిమానా లెక్కువ.

బైరాగిశాస్త్రిగారికి చిన్నపూర్ణయ్యగారూ, శ్రీరామశాస్త్రికి పెద్దపూర్ణయ్యగారూ తమ పిల్లల నిచ్చివున్నారు, ఆదిలో.

అయితే, దైవవశాన, ఆ యిద్దరికీ కళత్రవియోగం సంభవించి, మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకోవలసివచ్చింది గాని; వెనకటి అభిమానాలు పోలేదు.

అది పురస్కరించుకుని "చిన్నమామే గొప్పవా"డని బైరాగి శాస్త్రిగారు "కాదు పెద్దమామే గొప్పవా"డని శ్రీరామశాస్త్రీ రెండుమూడుమాట్లు వివాదపడివున్నారు.

వివాద మంటే, భిన్నాభిప్రాయాలు మాత్రమే చూపించుకోడాలు కాదు, కటుభాషల్లోకే వెళ్ళిపోడం, నిర్మొగమాటంగా.

ఇది మా చిన్నన్నగా రున్నప్పుడొక మాటూ, నేనున్నప్పుడున్నూ వొకమాటూ కూడా జరిగింది.

కాగా, చిన్నపూర్ణయ్యగారి కొడుక్కీ నాకూ వచ్చిన వివాద పురస్కరించుకునే నేనింటికి వచ్చెయ్యడం జరిగింది. కనక, చిన్నపూర్ణయ్యగా రంటే అభిమానపడే బైరాగిశాస్త్రి గారి దగ్గిర యీ ప్రస్తావన తేవడమూ, దానంతట అదే వచ్చినా పెరగనివ్వడమూ యిష్టం లేకే మా నాయనగా రది అలా తుంచేశారు.

బైరాగిశాస్త్రిగారున్నూ యిది గుర్తించకపోలేదు గాని; నిజం చెప్పవలసివస్తే, ఆయనకు నామీద వున్నంత అభిమానం మరే శిష్యునిమీదా లేదు.

సాహిత్యం సందర్భంలో స్వపరభేదాలసలే గమనించేవారు కారాయన.

ఏమయినా, నా చదువు భంగపడిపోయింది.

అందు కాయన చాలా విచారించారు.

"వాడు వెళ్ళిపోయాడు, నువ్వు మళ్ళీ రా" అని కూడా పిలిచారు, నన్ను.

నాకున్నూ వెళ్ళాలనీ అనిపించింది, యింటికి యజమాని, ముసలాయన, ప్రతిష్ఠకోసం అంత పాకులాడడం మరిచిపోడం యెలాగా అనిన్నీ అనిపించింది.

మనస్సు వురకలు వేసింది గాని; బుద్ధి నిలేసింది.

వెళ్ళలేక పోయాను.

బైరాగిశాస్త్రిగారు, తరవాత, మా యింటికి చాలా మాట్లూ వచ్చారు, వచ్చినప్పుడల్లా నా సాహిత్యకృషి తెలుసుకుని ఆనందిస్తూనూ వచ్చారు, ఎంతయినా.

అందుకో నిదర్శనం చెబుతాను.

అది, నేను వీరపూజ ప్రకటించిన కొత్తరికం.

ఆయన మా యింటికి వచ్చీరావడంతోనే – పాదప్రక్షాళనాదికం పూర్తి అయీ అవడంతోనే వీరపూజ ప్రతి వొకటి చేతిలో వుంచాను, సభక్తికంగా నేను.

"ఏమిటిదీ?" అనడిగి, అంతలో "నీ రచనేనా యిది?" అంటూ చకితులయినా రాయన, అట్టమీద నా గ్రంథకర్తృత్వం చూసి.

"ఎప్పుడు నేర్చా వీ ప్రౌఢి?" అనిన్నీ అడిగారు, గ్రంథం తెరుస్తూ.

ఆ చదవడం చదవడం పది పన్నెండు పేజీలు పూర్తిగా చదివేదాకా పుస్తకం విడిచిపెట్టలేకపోయా రాయన.

అప్పు డాయన పొందిన ఆనందం అంతా యింతా కాదు.

అలా ఆనందిస్తూ ఆనందిస్తూనే "నువ్వింకా నా దగ్గిర మరికొంతకాలం వుండి మాఘమూ నైషధమూ రెండు మూడు నాటకాలూ, కనీసం ప్రతాపరుద్రీయమూ అయినా చదివుంటే యింకా యెంతవాడ వయి వుందువో?" అన్నారు, మెప్పుగా.

"ఇప్పుడు వచ్చిన లోటుమాత్రం యేమిటిలే?" అన్నారు, తరవాత.

"ఎందుకూ తెనుగుల్లో పడిపోయావు, మరి" అన్నారు, అంతలో.

"అయితే, శాస్త్రీ! పంచకావ్యాలు పూర్తిచేశావు నువ్వు, యింత ధారాళంగా గ్రంథాలకు గ్రంథాలు రచించివేస్తున్నావు, మరి, నేను పంచకావ్యాలూ నాటకాలూ కౌముదీ కూడా పాఠం చెబుతాను గదా, వొక్క పంక్తి అయినా రాయలేనేం?" అనిన్నీ అడిగారు, చివరి కమాయికంగా.

స్వవిషయం అనుకోవద్దు, లోకసామాన్యధర్మం చెబుతాను, కొంచెం.

ఏమిటంటే?

కవిత్వం వేరూ, పాండిత్యం వేరూను.

అంటే – పంక్తి రాయడం వేరూ, పంక్తి సమన్వయించడం సర్వాత్మనా వేరున్నూ.

రెండూ భిన్నశక్తులు – ఒకవిధంగా.

"ఒకవిధంగా" అని యెందుకన్నానంటే, కవి భావుకుడూ పండితుడు శబ్దార్థవేత్తా కనక.

భావం పొటమరించని శబ్దాలు కోటానుకోట్లు.

శబ్దం లేని భావం మాత్రం వుండదు.

కవి అంతరంగంలో వుండిపోయినా, పైకి వచ్చేసినా, కాగితంమీది కెక్కినా శబ్దఘటితం అయే వుంటుంది, భావం.

లేకపోతే, వొక రూపమే యేర్పడదు, దానికి.

కనక, కవి అయినవాడు పండితుడున్నూ అయివుంటాడు, తన అంతస్థ ననుసరించి.

అయితే, కవి పాండిత్యం వేరూ, పండితుని పాండిత్యం వేరూను, మళ్ళీ.

కవి, తన భావాల కనుగుణాలైన శబ్దాలు అప్రయత్నంగా వాడేస్తాడు, పండితుడు ఒక్కొక్కప్పుడా శబ్దాలకు సరి అయిన వివరణా విశిష్టతా చెప్పలేకపోవచ్చు.

ఏమంటే?

పండితుడు, గ్రంథాలు చదివే శబ్దార్థాలు నేర్చుకుంటాడు.

వాటికి సంబంధించిన విధివిధాయకసూత్రాలూ తెలుసుకుంటాడు, అలాగే.

ఈ సందర్భంలో కవి అవలంబించే విధానం వేరు.

లోకుల సంభాషణలు వింటూ వుండడమూ, గ్రంథాలు చదువుతూ వుండడమూ, ఎడతెగకుండా రచన సాగిస్తూ వుండడమూ – ఈ విధంగా భాషాజ్ఞానం సంపాదిస్తాడు కవి.

దీనివల్ల భాషలో వుండుకున్న జాతీయత అవగాహన అవుతుం దతనికి.

అది రూపు కడుతుంది, అతని రచనల్లో.

కనక, పండితుని పాండిత్యం కంటే కవి పాండిత్యం విశిష్టమైనది.

అంచేత, పండితుడు పండితుడు మాత్రమే అయివుంటాడు. కవి పండితుడున్నూ అయివుంటాడు.

అయితే, వుభయుల పాండిత్యానికీ వినియోగం వేరు.

ఈ కారణంవల్లనే, స్థూలంగా, కవిత్వం వేరూ, పాండిత్యం వేరూనూ అనడం.

అంటే, కవి, వేత్త కాడని కాదు.

అతని వేత్తృత నిసర్గమూ, బహూ విస్తృతమూను.

పైగా, క్రాంతదర్శితలో అది అంతర్భూతమున్నూ.

నిజం చెప్పవలసివస్తే కవి అంతటి వేత్త యెప్పుడూ కాలేడు పండితుడు.

ఇంచేతనే, ఒక్కొక్క రచన చదివి యెందరు పండితులు పూనుకున్నా కవిహృదయం పూర్తిగా ఆవిష్కరించలేకపోడం.

మహామహా – మల్లినాథాదుల వ్యాఖ్యానాలున్నూ కాళిదాసు రచనలకు పర్యాప్తాలు కాకపోడం అందరూ యెరుగుదురు.

ఎందుకు చెప్పానంటే?

కవి పాండిత్యం వేరూ, పండితుని పాండిత్యం వేరూను.

కవి శక్తి వేరూ, పండితుని శక్తి వేరున్నూ.

కవి ధర్మం వేరూ, పండితుని ధర్మం వేరున్నూ.

కనక, కవి అంతస్థు వేరూ, పండితుని అంతస్థు వేరున్నూ.

అంచేత, ఎవరి పరిధిలో వారుంటేనే సొగసు.

తప్పితే రసాభాసే.

రచన చేస్తేనే గొప్ప అని పండితు డనుకోడమూ, వ్యాఖ్యానం చేస్తేనే ఘనత అని కవి అనుకోడమూ పతన హేతువులు.

ఈ కవిత్వ పాండిత్యాలలో యేదిన్నీ తక్కువ కాదు.

సాహిత్య ప్రపంచంలో కవి అగత్యమూ వుంది, పండితుని అగత్యమూ వుంది.

శబ్దార్థాలు కలిస్తేనే పార్వతీపరమేశ్వర స్ఫురణ.

అలాగే, కవీ, పండితుడూ అన్యోన్యంగా వుంటేనే సాహిత్యానికి శోభ.

ఇది కొంచెం విస్తరించా నప్పుడు.

"మీ రెంత చదివారో అంతా పాఠం చెబుతారు, అవ్యాహతంగా. మరి నేను చదివిందయినా మీలాగ చెప్పలేనేమీ?" అనిన్నీ అడిగాను.

"బాగుంది" అంటూ మిక్కిలీ ఆనందించారు, ఇది విని బైరాగిశాస్త్రిగారు.

## 29

భారవి అయిపోయింది, మాఘం ప్రారంభించాను, పాఠ్యక్రమంగా.

మొదటిమూడు సర్గలూ సక్రమంగానే అయినాయి; గాని తరవాత విఘ్నాలు రాసాగాయి.

మా పెద్దన్నగారికి తరుచు పొరుగూళ్లు వెళ్ళవలసి వచ్చేది.

ఒక్కొక్కప్పుడు నేనున్నూ వెళ్ళేవాణ్ణి, వెంట.

అలా వెళ్ళడంలో, మేమిద్దరమూ దొడ్డంపేట వెళ్ళాం ఒకమాటు.

దొడ్డంపేట అన్నది జనవ్యవహారం, లెక్కల్లో దానిపేరు వేగాయమ్మపేట.

అది వొక సంస్థానం గ్రామం, వాడ్రేవు వారిది, ఆ సంస్థానం.

తరతరాలుగా మేము సిద్ధాంతులం, ఆ సంస్థానంలో,

దివాణంలో తోరణం కట్టాలంటే మేము ముహూర్తం వుంచాలి.

ఇది యిప్పటికీ వుంది, ఆ ప్రమేయం అంతా మా చిన్నఅన్నగారు చూచుకుంటున్నా రిప్పుడు, ఆ విద్యలో అసాధారణులు కనక.

నేనూ నలుగుతూనే వుండినాను ఆ విద్యలో, అప్పటికి.

పదహారేళ్ళు నిండాటప్పటికి ముహూర్త నిర్ణయంలో, నేను సర్వస్వతంత్రుణ్ణి.

ఆ వయస్సున వొక మాటొక గట్టిపరీక్ష తగిలింది, నాకు.

కీర్తి వీరభద్రుడుగారని తాపేశ్వరం గ్రామంలో వొక నియోగి గృహస్థు.

మహేంద్రవాడ అసిస్టంటు కరణంగారి అల్లు డాయన. తద్వారా మాకూ వారికీ పరిచయం.

ఆయన కొమార్తల్లో వొకామె పెళ్ళి వచ్చింది.

కోనసీమనుంచి, మగపెళ్ళివారు, ముహూర్తం స్థిరపరచి పంపారు.

అయితే, శ్రీపాదవారు "అవు"నంటే గాని వీరభద్రుడు గారికి తృప్తిలేదు.

కాగా, దూరమున్నూ మూడు మైళ్ళలోపే కనక, ఆ ముహూర్తం పట్టుకుని మా వూరు వచ్చారాయన.

నే నొక్కణ్ణే వున్నాను గ్రామంలో, ఆవేళ.

నేనే చూశాను, ముహూర్తం దోషభూయిష్టంగా వుంది.

దారుణ దోషాలే వున్నాయి.

అవేమిటో వివరించి, వీరభద్రుడుగారు కోరగా, మరో రెండు దినాలు దాటించి, నే నొక ముహూర్తం స్థిరపరిచి పంపేశాను, వారిని.

"ఈ విషయమై చర్చ జరగవచ్చు సుమండీ" అంటూ నాకు గట్టిగా చెప్పి, మొదటి ముహూర్తం దోషాలు వివరిస్తూ, నే నుంచిన ముహూర్తం మగపెళ్ళివారికి పంపించారు, వీరభద్రుడుగారు.

అక్కడ యేమి జరిగిందో, నేను స్థిరపరిచిన ముహూర్తానికే తరలిన్నీ వచ్చారు, మగపెళ్ళివారు.

తమ సిద్ధాంతిగారినీ తీసుకువచ్చారు, వారు.

ఇక్కణ్ణుంచి పిలుపు రాగా నేనూ వెళ్ళాను.

అయితే, వీరభద్రుడుగారు మంచి యుక్తిపరులు.

చమత్కారంగానున్నూ మాట్లాడేవా రాయన.

అఘటనఘటనా సమర్థులున్ను, ఆయన.

కన్యాదానం చెయ్యడానికి తాము పీటలమీద కూచుని, నన్ను తమకు దగ్గిరగానే కూచోపెట్టుకున్నా రాయన, ముహూర్తం వుంచిన సిద్ధాంతిని నే నని మాత్రం స్ఫురణ కాకుండా.

ఉభయుల పురోహితులూ చురుకైనవారు కావడం మూలాన, లగ్నసమయాన, అరగంట పైగా వ్యవధి యేర్పడింది.

అలాంటి అవకాశం వచ్చిందా, వేదం చదువుకున్నవారు క్షణం అయినా దాటిపోనివ్వరు. అప్పుడూ అలాగే చేశారు, స్వస్తి అందుకుని, వారు.

కాని, లగ్నాష్టకాల సమయం అది, షష్ఠాష్టకాలు ప్రారంభం అయినాయి, సౌమ్యంగానే వియ్యంకులకు.

కథాక్రమం యేమిటంటే?

"ఏరండీ, మా సిద్ధాంతిగారి నాక్షేపించిన మీ సిద్ధాంతిగారు?" అనడుగుతూ పెళ్ళికొడుకు తండ్రి ముందుకి వచ్చారు.

"మీ సిద్ధాంతిగా రేరీ?" అని యెదు రడిగారు వీరభద్రుడుగారు, తొణక్కుండా.

అది చూసి, ఉభయపక్షాల పెద్దలూ, ఊరిపెద్దలూ, ఆహూతులూ, అనాహూతులు కూడా పండితులూ సావధాను లయినారు "ఏమిటి సంగతి?" అనడుగుతూ.

చూడగా, నా పక్కనే వున్నారు వారి సిద్ధాంతిగారు, పెళ్లిపెద్ద యింగితం గుర్తించి "నేనే"నన్నారు వీరభద్రుడుగారితో, తర్జనితో తమ్ము నిర్దేశించుకుంటూ.

"మేము స్థిరపరిపించిన ముహూర్తం యెందుకు మంచిది కాదో అది మేము వినా"లన్నారు వియ్యంకుడుగారు, గంభీరంగా, సభ అంతా కలయచూస్తూ.

"మీరు స్థిరపరిపించుకున్న ముహూర్తం విడిచిపెట్టి, మేము స్థిరపరిపించిన ముహూర్తానికే మీరెందుకు వచ్చారో అదే మేమున్నూ వినా"లన్నారు వీరభద్రుడుగారు అంతకంటే గంభీరంగా, "తయారుగా వుండండి" అంటూ వొక్కొక్క పండితుణ్ణే, చూపులతో ప్రబోధిస్తూ.

అందరూ చమత్కృతు లయినా రది విని.

వివరా లేమీ చెప్పకుండా, వచ్చివుండిన పండితులకు రెండు ముహూర్తాలూ ఎదటవుంచి పరిశీలించమన్నారు వియ్యంకుడుగారు వీరభద్రుడుగారి సలహామీద చివరికి.

రెండూ పెట్టుముహూర్తాలే, పంచాంగంలో వున్నవి కావు, ఉభయవర్గాల అత్రమూ పురస్కరించుకుని నిర్ణయించబడ్డాయి.

కనక, దోషబహుళం కానిదేది అనేగాని నిర్దుష్టం యేది అనికాదు విచారణ, అప్పుడు.

అంచేత సిద్ధాంతులం మేమిద్దరమూ స్వతంత్రులమే అయినాం.

పండితులు పావుగంట పరిశీలించారు, కిందా మీదా పడుతూ.

అవుననీ కాదనీ అనకుండా "యీ ముహూర్తానికి రావడం బాగానే వుంది" అన్నారు గడుసుదనం చూపిస్తూ వారిలో పెద్దలు.

వారి సిద్ధాంతిగా రేమనుకున్నారో, నా మట్టుకు నా కిది చాలా అసందర్భంగా కనపడింది.

నేను స్థిరపరిచిన ముహూర్తం మంచిదంటే చాలదు నాకు, వారి సిద్ధాంతిగారు స్థిరపరిచిన ముహూర్తం దోష భూయిష్ఠం, పొట్టి తప్పుల తడక అనాలి, ఢంకామీద దెబ్బకొట్టి.

ఏకొంచెమో సౌమ్యపడినా, యిప్పటికీ నా తత్వం యిదే.

ఇంతకీ పరీక్ష అవసరం కాగలిగినప్పుడు ఇతమిత్థం అని హొక దెబ్బా రెండు ముక్కలూగా తేల్చేస్తేయేం?

కాని మధ్యవర్తులు అయినవారు ఎవరూ కూడా అది అలా తేల్చరు, తమకు పాక్షికత్వం ఆరోపణ అవుతుందన్న భీతితో.

ఏమయితే యేం, వారి ముహూర్తం ప్రస్తావన లేకపోడమే కాదు, నా ముహూర్తం మంచిదే అని తేలింది, చాలు అనుకుని వూరుకున్నా న్నేను, లోపల్లోపల మాత్రం వుద్రిక్తుణ్ణే అవుతూ.

కాని "యీ ముహూర్తానికి రావడం బాగానేవుంది" అన్న పండితుల మాట బలపరుస్తూ "అలాగే అనుకున్నాం, మేమున్నూ" అన్నారు వియ్యంకుడుగారు కూడా.

వారి మాటలో కనపడింది కొంచెం, నాకు కావలసిన "తెగేసి చెప్పడం" చాలు అనుకున్నా న్నేను.

అని "మరి, మీ సిద్ధాంతిగా రేరీ?" అని మళ్ళీ అడిగారు వియ్యంకుడుగారు.

అప్పుడు చూపించారు వీరభద్రుడుగారు నన్ను సభవారికి కన్నుసన్నలతో.

అందరూ చకితులయినారు.

నేను పాలమూరు సిద్ధాంతిగారి కుమారుణ్ణని వీరభద్రుడు గారు వివరాలున్నూ చెప్పగా "యింకేమీ?" అనిన్నీ అన్నారు పండితులు, మా నాయనగారిని ప్రశంసిస్తూ.

మా అన్నల ప్రస్తావన కూడా వచ్చింది, అప్పుడు.

తమ కోనసీమలోనే చదువుకుని వుండడమూ, వార్షికాలున్నూ అక్కడే యెక్కువగా సంపాదించుకుంటూ వుండడమూ – ఈ కారణాలవల్ల మా పెద్ద అన్నగారిని బాగా యెరిగి వుండిన వియ్యంకుడుగారు నన్ను మిక్కిలీ ప్రశంసించారు.

తరవాత, వుభయులూ నన్నెంతో ఘనంగా సత్కరించారు, కన్యాదాన సమయాన సదస్యంలోనూ, పెద్దలను కూడా వెనక్కి పెట్టి - అది వేరే విషయం - ఇలాగ, అప్పుడు, నేనున్నూ సిద్ధాంతి నయివుండడంవల్లనే మా పెద్ద అన్నగారితో కూడా ఆవేళ దొడ్డంపేట వెళ్ళాను.

## 30

"శ్రీరాజా, వాడ్రేవు రంగనాయకమ్మ జమీందారువారు" అంటే దిశలు తెల్లవారేవి, ఆ రోజుల్లో.

మహామహా చదువుకున్న బ్రాహ్మణ, పురుష, జమీందార్ల కెవరికీ సాధ్యంకాని ఘనత సంపాదించుకున్నా రామె, సంప్రదాయ మహితమైన యింట పుట్టి, అలాంటి యిల్లే మెట్టినీ్ని వుండడంవల్ల.

సంస్థాన మర్యాదలే కాదు, దీర్ఘాయుష్యమూ అనుభవించా రామె.

అన్ని విద్యలూ ఆదరించేవా రామె.

ముఖ్యంగా దొడ్డంపేట వాడ్రేవుప్రభువుల నిరతాన్నదానం లోకప్రశస్తి కన్నది.

చెబితే, అత్యుక్తి అనుకుంటారు.

ఆ వూళ్ళో, బీదలయినా సాదలయినా, బ్రాహ్మలకు, అన్ని శాఖలవారికీ యిళ్ళల్లో వంటలు లేవు, ఎప్పుడూ, ఆబాల గోపాలమూ స్త్రీపురుషులందరూ దివాణంలో భోజనం చెయ్యవలసిందే. రెండుపూట్లా.

రాజాంగ మైన భోజనంకాని సంసారిపక్షం భోజనమున్నూ కా దది.

సరదా పుట్టి వొక్కొక్కప్పుడు, రంగనాయకమ్మగారు కూరలు తరిగి వంటయింటోకి పంపించేవారు, స్వయంగా.

సకల విద్యల్లోనూ ఆమెకు శ్రుతపాండిత్యం వుండేది.

ఏ విద్యలో విద్వాంసు లయినవారు వచ్చినా తాహతు స్వయంగా గుర్తించి సత్కరించేవా రామె.

సామాన్య పండితు లామె యెదట మాట్లాడ్డానికి జంకేవారు, తరుచు.

మా నాయనగా రంటే ఆమెకు మరీ శ్రద్ధ.

ఎప్పుడు వెళ్ళినా, మా నాయనగారు స్వయంపాకం చేసుకునేటప్పుడు స్వయంగా అందించేవా రామె, సామగ్రి.

అతి నిరాడంబరస్వభావం ఆమెది, మొగమూ, మాటా కూడా బహుప్రసన్నంగా వుండేవి గాని, ఎలాంటివారికీ గూడా ప్రభుదర్పం స్ఫురించే దావిడ పరిసరాల్లో.

ఆమెచేత వోహో అనిపించుకోడం సామాన్య మైనది కాదు.

నేను చాలామా ట్లామె దర్శనం చేసుకున్నాను, మమ్మల్ని తమ కుటుంబంలోని వ్యక్తులుగా చూసుకునేవా రామె; కాని యెప్పటికప్పుడే "అమ్మయ్యా, ఇవతల పడ్డాం మర్యాదగా" అనిపించేది, నాకు.

ప్రస్తావచాతుర్యం చూసి మా పెద్దన్నగారి నెంతో ప్రీతిగా చూసేవా రామె.

అంచేత, ముందు ఆమె దర్శనం చేసుకుని, విశ్వసుందరరావుగారి దర్శనానికి తరవాత వెళ్ళాం మేము, మేడమీదికి.

విశ్వసుందరరావుగారి, జన్మతః దౌహిత్రు లామెకు, వ్యవహారరీత్యా దత్తపుత్రులు.

వారి సౌజన్యమున్నూ ఆ సంస్థానానికి – ఆ కుటుంబానికి – ముఖ్యంగా శ్రీ రంగనాయకమ్మగారి సౌజన్యానికిన్నీ సర్వథా అనుగుణ మైనది.

రాజకళ చూడాలంటే శ్రీ విశ్వసుందరరావుగారినే చూడాలి.

మేము వెళ్ళేటప్పటికి, వారి జనకఅన్న కస్తూరి రామారావు జమీందారుగారు శ్రవణానందం చదివి వినిపిస్తున్నారు, వారికి.

రామారావుగారు బహు చిన్నతనంలోనే స్వర్గస్థులయినారు; కాని ఆ చిన్నతనంలోనే, వారు, బహు సౌమ్యులనీ, మహోదారులనీ, విజ్ఞులున్నూ అనీ మంచిపేరు తెచ్చుకున్నారు.

అప్పట్లో వారికీ మా పెద్దన్నగారికీ బహు మైత్రి.

కుశలప్రశ్నాదికం ముగిశాక, రామారావుగారు మళ్ళీ చదువు సాగించారు, విశ్వసుందరరావుగారికి విశేషాలు వివరిస్తూ.

కొంతసేపటికి "మనమా, వద్దిక నాదు మాట వినుమా మర్యాద గాపాడుమా" అన్న పద్యాలు ప్రారంభం అయినాయి.

మంచి మకుటంతో వుండడంవల్ల యెలాంటివారినీ ఆకర్షించే పద్యాలవి.

విజ్ఞులకు "నాదు మాట" అన్నచోట ఝుడితిస్ఫురణగా రచనలో కొంత అప్రౌఢిమ తోస్తుంది, దానికేం, శ్రవణానందంలో అదొక రమ్యమైన ఘట్టం, మొత్తానికి.

అదే నే నది వినడం.

వినగా వినగా నడక బాగానే వుంది; గాని పద్యాలలో బింకం తక్కువ అన్నట్టనిపించింది, నాకు.

"పులుముడు"న్నూ యెక్కువగా కనపడింది.

మా పెద్దఅన్నగారు నాకేసి చూశారు, సాకూతంగా.

అది చూడగా నాకు చిరునవ్వు వచ్చింది గాని; మొగం పక్కకి తిప్పేసుకున్నాను.

లాభం లేకపోయింది, రామారావుగారు మా ధోరణి కనిపెట్టేశారు, అప్పటికే.

"ఏం, యెందుకూ నవ్వుకుంటున్నారూ?" అనడుగుతూ పుస్తకం కూడా కింద పెట్టేశారు వారు, చర్చకు సిద్ధపడి.

కొంతసేపు నేనూ, మరికొంతసేపు మా అన్నగారూ మాట మరిపించాలని చూశాం, ప్రయోజనం లేకపోయింది.

తప్పనిసరి అయి, చివరికి "నీ అభిప్రాయం చెప్పేసెయ్యి" అన్నారు మా అన్నగారు, నేను చెప్పేశాను.

దానిమీద తర్జనభర్జన జరిగింది.

రామారావుగారు కవుల పక్షం వహించారు.

మా అన్నగారి ఆసరా చూసుకుని నే నెదిరించాను.

ఒక్క పావుగంట చూసి, అప్పు డందుకుని, వివరంగా, గుణదోషనిరూపణ చేసి రామారావుగారిని వొప్పించారు, మా అన్నగారు.

"అయితే, పుస్తకం అంతా యిలా విచారణ చేసుకుంటూనే చదవాలన్నమాట" అన్నారు రామారావుగారు, దానిమీద.

"గ్రంథకర్తలను పూజించాలన్నా చెయ్యవలసింది అదే" అన్నా న్నేను.

"ఒక్క సంగతి వుంది. వినోదార్థం యే పుస్తకమైనా స్థూలంగా చదువుకోడం వేరు. గ్రంథకర్తల విషయమై ఆనుకూల్యమూ ప్రాతికూల్యమూ కూడా అక్కరలే దక్కడ. రచన రసవంతం అయితే అనుకూల్యం దానికదే యేర్పడుతుంది; కాని విచారణలో అది నిలవాలి" అన్నారు, మా అన్నగారు.

కొంతసేపు అదీ యిదీ ప్రస్తావన జరిగాక, రామారావుగారు, నన్ను చూపించి "బాగా తయారుచెయ్యండి" అన్నారు, మా అన్నగారితో, సాదరంగా.

వెళ్ళిన పని పూర్తిచేసుకుని మేమింటికి వచ్చేశాం.

శ్రవణానందం చదవాలని అప్పుడే నాకు సంకల్పం కలిగింది; కాని మా పెద్దన్నగారు "అది కాదు, ముందు నన్నయ్య భారతం చదువు" అన్నారు.

"గుణదోషాల సంగతి అలా వుంచు. ఆ పద్యాల బంధం వదులు వదులుగా వుంది గాని; బిగువుగా లేదు. అదిలోనే అలాంటి తేలిక పుస్తకాలు చదివితే సాహిత్యంలో మంచి ప్రవేశమూ కలగదు, సరి అయిన రుచీ యేర్పడదు. కనక ముందు నన్నయ భారతం చదువు. తరవాత మొదటి మూడాశ్వాసాలూ మనుచరిత్ర చదువు. అలాగే పారిజాతాపహరణమున్నూ పూర్వార్థం చదువు. తరవాత శృంగారనైషధం తప్పకుండా చదువు. దాంతో, సరిగా అవి అర్థం అయినా కాకపోయినా, గంభీర రచనలమీద నీకు ఆదరభావం కలుగుతుంది, దృఢపడుతుంది. అప్పుడు అర్థం సాధించాలన్న దీక్ష దానంతట అదే పుడుతుంది. పద్యబంధంలో వుండే బిగువు బోధపడుతుంది. ఆ వరసనే తిక్కన్న భారతం చదవాలి. తెలుగులో నీకు మంచి అభిరుచీ, సాహిత్యమూ కలగాలంటే యిది సరి అయిన పాఠ్యక్రమం" అనిన్నీ చెప్పారు, వారు.

వా రెన్నో సంస్కృతనాటకాలు చదివారు.

వాటిలో ఉత్తర రామచరితం వారి కభిమాననాటకం.

తెనుగులో శృంగార నైషధమూ అభిమానగ్రంథమే వారికి.

భారవి చెప్పేటప్పు డప్పుడప్పుడు అందులో ఘట్టాలెన్నో వినిపిస్తూ వచ్చారు వారు నాకు.

అయితే, శ్రవణానందం చదవాలన్న ఆసక్తి నాకోపట్టాన తగ్గలేదు.

దొడ్డంపేటలో తటస్థించిన సన్నివేశంలో, అది విమర్శించాలనిన్నీ నాకు సరదా పుట్టింది.

రామారావుగారితో ప్రవర్తిల్లిన వాదం క్షణక్షణమూ నన్ను రెచ్చగొడుతూనే వుండేది; కాని "తిరుపతివేంకట కవులు ముందు సంస్కృతంలో పండితులై, తరవాత తెనుగు సాధించి కవిత్వం చేస్తున్నారు. నువ్విప్పటికి భారవి మాత్రమే పూర్తిచేశావు. తెనుగుభాష యెరగనే యెరగవు. కనక, ముందు గ్రంథాలు చదువు. ముందే విమర్శకు దిగడం మంచిది కాదు" అని మా అన్నగారు నన్ను గట్టిగా మందలించారు.

కాదని వ్యతిరేకించలేకపోయాను.

శ్రవణానందం సంగతీ మరిచిపోయాను, సప్రయత్నంగా.

## 31

మాఘం పూర్తి అయిపోయింది.

పూర్తి అంటే పాఠం చెప్పకోడం మట్టుకే, గ్రంథం అంతా మాత్రం కాదు.

నేనే కాదు ఎవరూకూడా, పంచకావ్యాలలో వొక్కటిన్నీ పూర్తిగా చదవరు, అప్పటికీ యిప్పటికీ.

కొన్నికొన్ని సర్గలే చదువుతారు.

నేను చదివిన క్రమం, –

రఘువంశం నాలుగో సర్గ ప్రారంభించాను. ఏడో సర్గ పూర్తిచేసి వెనక్కివచ్చి వొకటి, రెండు, మూళ్లు చదివాను.

కుమారసంభవంలో అయిదో సర్గ ప్రారంభించి, ఏడో సర్గ పూర్తిచేసి, మళ్ళీ మొదటికి వచ్చి వొకటి రెళ్ళు చదివాను.

రఘువంశంలో యెనిమిదో సర్గ అజవిలాపం, కుమారసంభవంలో నాలుగో సర్గ రతీవిలాపం, మళ్ళీ యెనిమిదో సర్గ జగన్మాతృ క్రీడాకలాపం – కోరినా గురువులు ఈ సర్గలు చెప్పరు.

వేట్లపాలెంలో బైరాగి శాస్త్రిగారి దగ్గిర, ఇటు ఉత్తర మేఘం చదువుతూ, అటు కుమారసంభవంలో పదకొండో సర్గ చదివాను.

కుమారస్వామి శైశవలీలలు వర్ణించబడ్డాయి అందులో, బహుచక్కగా వుంటుం దది.

తనకి తానయి గురువుగారి పెద్దతమ్ముడు శ్రీరామశాస్త్రి చెప్పాడు ప్రత్యేకంగా నాకది, చాలా ప్రోత్సహించి.

మేఘసందేశం అందరిలాగే నేనూ రెండు సర్గలూ చదివాను.

భారవి మొదటి ఆరుసర్గలూ చదివాను.

మాఘంలో మొదటి మూడూ అయినాయి, అంతే, స్వయంగా చూసుకుపోడమే గాని, మరి, పాఠం చెప్పకోడం పడలేదు, తరవాయి గ్రంథం.

ఇక పొరుగూళ్ళు వెళ్ళే వుద్దేశం లేదు.

"అగత్యమే కాని, అవకాశం యేదీ?" అన్నారు, మా నాయనగారు, బాగా ఆలోచించి.

అంతవర కయినా బైరాగిశాస్త్రిగారి దగ్గిర చదువుకుని వుంటే యెంతో బాగుండేది, ఆ యోగం లేకపోయింది.

కాకః–

మొదణ్ణుంచీ, సాహిత్యం ప్రధానం కాదు మా కుటుంబంలో.

వైదికవిద్యలు రాణించడానికే దాని అసరా.

నాకు మాత్రం అదే ప్రధానంగా కనపడుతోంది, అప్పటికే.

కనక, యేదో విధంగా మా పెద్దన్నగారి దగ్గిరే నాటకాలు ప్రారంభించవచ్చు: కాని నా దృష్టి అంతా తెనుగుమీదికి మళ్ళిపోయింది.

సంస్కృత శ్లోకం అన్వయించే శక్తి వచ్చాక కూడా తెనుగు అన్వయించలేకపోడం పరువుతక్కువగా కనపడింది, నాకు.

జాతి అంతా వ్యవహరించే మాతృభాషలో విశిష్టశక్తి సంపాదించాలనీ, రచన కూడా సాగించా లనీ నా కదివరకే వుండిన ఆశా సంకల్పమూ దీంతో బలపడిపోయాయి.

ఇది గుర్తించి, అప్పటిదాకా తెనుగు గ్రంథాలు ముట్టుకో వద్దంటూ వుండిన మా పెద్దన్నగారు, "సంయే" అన్నారు, ఇష్టపూర్తిగా.

మహోత్కంఠతో నన్నయ భారతం పుచ్చుకున్నా న్నేను, వెంటనే.

నన్నయ భారతం అంటే అంతమాత్రమే కాదు, ఆది పంచకం అంతా వుండిన సంపుటం, అది.

ఎఱ్ఱన్న తిక్కన్నల భారతాలూ వున్నాయి అందులో. మా అన్నగారి ఆజ్ఞ చొప్పన శపథం పట్టి, ఆ ప్రారంభావస్థలో కూడా, వినోదార్థం అయినా – శారదరాత్రు లన్న పద్యం తరవాత వొక్క బంతిన్నీ చదవలేదు, నేను.

ఆ చదివిం దయినా తదేకదీక్షగా చదవడం పడలేదు నాకు.

కారణాలు, –

జ్యోతిశ్శాస్త్రం స్కంధత్రయమూ సాధించుకోవలసివచ్చింది.

స్మార్తం గట్టిచేసుకోవలసివచ్చింది.

ఔద్గాత్రమున్నూ పూర్తిచేసుకోవలసివచ్చింది.

ఇన్ని వ్యాసంగాల్లో నన్నయ భారతం చదవడానికుండే అవకాశం బహు తక్కువ.

అయినా, దృష్టిమాత్రం దానిమీదే వుండేది.

నిజమే కాని, అంతా కొత్త ప్రపంచం అది.

సంస్కృతం చదవడంతో నా కలవడ్డ శబ్దార్థ జ్ఞానం భారతంలో నాకు అట్టే వుపయోగపడలేదు.

వసుచరిత్రలాగ పాషాణ పాకం కాకపోయినా భారత భాష కూడా భిన్నమే అయింది నాకు.

అందులోని ప్రయోగా లపరిచితాలు కావడంతో కుదరలేదు, మధ్యమధ్య అచ్చ తెనుగు మాటలు.

ఆ సంస్కృత మహా సముద్రంలో అవి జాతిరత్నాలుగానూ, నడకమాత్రం చూసుకుంటే బహు రమ్యంగానూ వుండేవి; కాని పణుగులు.

అయితే, వాటిలో అనేకాలు జాతికి సుపరిచితాలే చదువుకున్నవాళ్ళకి మాత్రమే అపరిచితాలు.

ఆ చదువుకున్నవాళ్ళలోనున్నూ సర్కారుజిల్లాలవారికి మరీ అపరిచితాలు.

చదువుకున్నవాళ్ళంటే, స్వయంకృషితో, లేక, గురుముఖతః తెనుగువాఙ్మయం చదివినవా ళ్ళని కాదు నా అభిప్రాయం, ఇంగ్లీషో సంస్కృతమో శిక్షాపూర్వకంగా చదివినవాళ్ళు అని.

ఎందుకు చెప్పానంటే?

సనాతనుల దృష్టిలో, సంస్కృతం నేర్చినవాళ్ళే చదువుకున్నవాళ్ళు.

అధునాతనుల దృష్టిలో ఇంగ్లీషు నేర్చినవాళ్ళే చదువుకున్నవాళ్ళు.

ఆ సనాతనులూ అధునాతనులూ కూడా అచ్చంగా తెనుగువాళ్ళే మళ్ళీ, కాని వారి కుభయులకూ గూడా, తెనుగు తమ మాతృభాష అన్న అభిమానమూ లేదు, జ్ఞానమూ లేదు, మళ్ళీ మాట్లాడితే.

ఇటీవల ఇంకో "తనులు" బయలుదేరారు "మమ్మే చూసుకో"మంటూ, హిందీ "మానసపుత్రులు." వారికి తెనుగు బతికివుండడమే పనికిరాదు.

కనక, వారి నందరినీ మాతృదూరులుగా కట్టివేస్తే, యిక మిగిలినవారు సామాన్యజనులు.

వారికి మాత్రం బాగా తెలుసు ఆ శబ్దాలలో అనేకాలు.

లక్షణంగా వాడుతూనే వుంటారు వారు, అవి తమ సంభాషణలో.

నెల్లూరు జిల్లా పల్లెటూళ్ళకి వెడితే, తిక్కయజ్వ భారతంలో వాడిన జానుతెనుగుమాటలు, యిప్పటికీ జనసామాన్యం వాడుకలో పదునుతేరి వుండడం తెలిసివస్తుంది.

నంద్యాలా, కర్నూలూ, కడపా, అనంతపురమూ – ఈ ప్రాంతాలలోనున్నూ ఉద్గ్రంథాలలో వాడుక అయివుండిన శుద్ధాంధ్ర శబ్దాలు జనసామాన్యం వాడుతూ వుండడం కనబడుతుంది, బాహాటంగా.

కాకతీయసీమ (తెలంగాణా)లో కూడా కండగల యీ జాతిరత్నాలు దండిగా దొరుకుతాయి సామాన్య జనం దగ్గిర, సరిఅయిన జాతీయతతో.

నిన్నగాక మొన్న హనుమకొండలో, బస్సు దగ్గరనుంచి సామాను బసకి చేర్చడానికి "ముబ్బేడ" యిమ్మన్నాడు కూలిమనిషి, అప్రయత్నంగా నన్ను.

నా జీవితంలో అదే "ముబ్బేడ" అన్నమాట నేను వినడం.

పఠనపాఠనాలనుంచి తప్పిపోవడంవల్ల, యిప్పుడు, మన తెనుగు స్వరూపమే మన కందకుండా పోయింది.

కనకనే అందరితోటీపాటు ఆ శబ్దాలు నాకు తెలియకపోడం.

ఇంతటితో ఆగలేదు, భారతపఠనంలో నాకింకో ఆ సందర్భమున్నూ యేర్పడింది.

నేను చదివిన సంస్కృత గ్రంథా లయిదూ, మొత్తానికి, ఏ సర్గ కాసర్గ యేకవృత్తగ్రంథితాలు.

నిర్వచనాలున్నూ.

తెనుగు గ్రంథాలు – ముఖ్యంగా మహా భారతం యిందుకు వ్యతిరిక్తం.

కానయితే, పురాణధోరణిలో రాగరంజితంగా చదవడానికి వృత్తబాహుళ్యం వొక అందమే.

మధ్యమధ్య వచనం వుండడమూ వొక సొగసే.

అయితే, యిదేమిటీ యీ వాలకం?

పే – ద్ద వచనం తరవాత వొక కందం.

గీతం – అధవా – ఆటవెలది.

తరవాత ప్రాయికంగా మళ్ళీ పే – ద్ద వచనం.

ఇది మరీ బాధ అనిపించింది.

మరి, నన్నయ్య అలా యెందుకు రచించాడూ?

అతను సంస్కృతగ్రంథాలు చదవనివాడా, పోనీ?

తాను అనువదించిన వ్యాసభారతమున్నూ అక్కడక్కడ చిన్నచిన్న వచనాలుండినా, శ్లోకాలు వచ్చాటప్పటికి ప్రాయికంగా అధ్యాయాలన్నీ యేకవృత్తగ్రథితాలే గదా, ఈమా ర్పెందుకు చేశాడూ అతను?

ఇది తెనుగుభాష సంప్రదాయమా?

ఏమోగాని, ఆ చిన్నతనంలో, భారతం ప్రారంభించినప్పుడు బండరా ళ్ళెక్కుతూ, జారిపడుతూ, మధ్యమధ్య చతికిలబడుతూ ముళ్ళడొంకల్లో నడుస్తున్న ట్టుండేది నాకు.

ఇప్పటికీ యిది నాకు తప్పని బాధా, తీరని సందేహమున్ను.

భారతంమీది విమర్శగ్రంథా లన్నవి వొకటి రెండు చూశాను తరవాత, తత్కర్తల కిది యోచించవలసిన విషయం అయినట్టు కనపడదు.

ఏమంచ, –

ఏమయినా, నేను భారతం చదవడం మానుకోదలుచుకోలేదు.

అయితే "హృత్కవిలి చేసుకోవలసిన గ్రంథం మొదటిమాటు చరచరా చదువుకు పోవాలి. రెండోమాటు విచారణ ప్రారంభం. అలా యెన్నిమాట్లు చేస్తే అంత మంచిది" – ఇది మా పెద్దన్నగారి సిద్ధాంతం, గ్రంథ పరిశీలనకు.

ఇది పురస్కరించుకుని భారతం చదివితే, యెవరికయినా నా బాధ అనుభవానికి వస్తుంది.

అయితే మాత్రం?

"నా తెనుగుబాష నేను తెలుసుకోవాలి!"

ఇది నాకు దీక్ష అయింది.

ఈ దీక్ష యేకాగ్రమున్నూ అయిపోయింది.

దాంతో, నన్నీ బాధ దిగతియ్యలేక పోయింది.

కథపట్లు చూసుకుంటూ గబగబా చదువుకు పోయాను.

"శారదరాత్రు"లన్న పద్యం మాత్రం విడిచిపెట్టలేక చాలామాట్లు చదివి, వెనక్కివచ్చేశా నప్పుడు.

ఏం?

అన్నిమాట్లు చదివితేగాని విడిచిపెట్టలేకపోడానికి, నన్నయ కవిత్వంలో అది వొక్కటేనా రసవంతం?

అది కాదు, మాట.

ధీరోదాత్తుడైన మహానాయకుడు, శాశ్వతంగా తెరలోకి పోతూపోతూ, రంగస్థలాన, కడసారంగా కనపరిచిన, జటిలాలైన హావభావాల సంపుటి వంటిది, ఆ పద్యం.

దాంతో, వొక నిండు వెలుగు కనుమరిగి పోతోంది.

దాంతో, వొక అవతారం అంతర్ధానం అయిపోతోంది.

దాంతో, వొక మహాయుగం అంతరించిన్నీ పోతోంది.

నన్నయ మరి గంటం పట్టడు.

నన్నయ మహోన్నతభావాలు మన కిక లభ్యంకావు.

నన్నయ మంజుభాషలు మన కిక వినపడవు.

భావాంబరవీధిలో మహోజ్జ్వలంగా వెలిగిన నన్నయ మూర్తిమంతమున్నూ మన కిక అందుబాటు కాదు.

ఇదిగో, యింత ఆవేదన కలిగింది ఆ పద్యంతో నాకు.

ఇలాంటి మహోద్వేగంలో పడి చదివా నది నే నన్నిమాట్లు.

విచారణ చేసుకుంటూ రెండోమాటు ప్రారంభించాను, వెంటనే.

దగ్గిర వుండి, వ్యాఖ్యానం చేస్తూ నాచేత అవతారిక చదివించి "ఇక నువ్వు స్వయంగా తంటాలుపడు. మళ్ళీ మొదటికిన్నీ వెళ్ళు" అన్నారు, మా పెద్దన్నగారు.

మొదటికీ వెళ్ళాను, మళ్ళీమళ్ళీ కూడా చదివాను.

నన్నయభారతం చేత పుచ్చుకుంటే యిప్పటికీ నా కిదే అలవాటు.

కొన్ని వందలమాట్లు చదివేవుండినా, మళ్ళీ ఎత్తుకుంటే, ఆ అవతారిక వొక్కమాటు మాత్రమే చదివి వూరుకోలే న్నేను.

ఏమంటే?

"తన కులబ్రాహ్మణు –" అన్న పద్యం చదివాటప్పటికి, ఉభయపింజలతోనూ నీరుకావి ధోవతి కట్టుకుని, అలాంటిదే వుత్తరీయం కప్పుకుని, ఎడమ బుజాన జలతారు ఆకుపచ్చ శాలువు మడతా, మొగాన స్ఫుటంగా గంధాక్షతలూ, మొలలో బంగారుగోవతాడూ, చేతులకు సింహతలాటం మురుగులూ, కుడిచేతి అనామికకు దర్భముళ్ళ రత్నాంగుళీయకమూ, చెవులకు కెంపులుపొదిగిన మకరకుండలాలూ ధరించి, రాజాధిరాజులను పాదాక్రాంతులను చేసుకునే చూపులతో బక్కపలాచని నన్నయభట్టారకుడు, రాజరాజు నిండోలగాన అగ్రాసనం అలంకరించివుండి సాక్షాత్కరిస్తాడు, నాకు.

ఓ పట్టాన నే నా భావన మరిచిపోలేను.

వేరే చిత్తవృత్తి నిరోధం వంటి ప్రక్రియ అక్కరలేదు, ఆ పద్యా లందుకుంటేనే చాలు, తాదాత్మ్యం కలిగి, దాంతో నన్నయ దివ్యమంగళ స్వరూపం గోచరిస్తుంది, నాకు.

ఈ సుఖం – ఈ ఆనందం – ఈ పారవశ్యం అనుభవించడానికే పదేపదే నే నది చదవడం.

నన్నయ భారతంలో నాకు విసుగు పుట్టించే ఘట్టాలు పర్వానుక్రమణికా, సర్వసంగ్రహమూ – ఈ రెండే.

తక్కిన దంతా చిక్కని కవిత్వం.

అమృతం.

సాధారణంగా, తెనుగు గ్రంథాల అవతారికలు అతిగానూ చాదస్తంగానూ వుంటాయి.

నన్నయ అవతారిక మాత్రం స్వయంభువు.

అద్వితీయమూ, అనన్యసాధ్యమూనూ, అది.

"హరిః ఓ"మ్మనే టప్పటికే రసానుభవం కలిగించే అవతారిక, తెనుగులో నన్నయ్యాది వాక్కటే.

దానికి సాటి అయినా, ఆదర్శమే అయినా, సంస్కృతంలోనున్నూ కాళిదాసు రఘువంశావతారిక వాక్కటే.

ఈ రెండు వాఙ్మయాలలోనూ ఆ రెండింటికీ సాటి అయినవి మరి లేవు.

అయితే, అప్పట్లో, నాది కాస్తకాస్త తెలిసిన ఆనందం.

ఇప్పుడయినా సగంసగమే తెలిసిన ఆనందం.

పారవశ్యం కలిగించే యీ సన్నివేశం విడిచిపెట్టలేక, ఆ మొదటిమాటు, అవతారిక మట్టుకే అయిదారుమాట్లు చదవడం వల్ల, నన్నయ రచనాధోరణి కసింత అవగాహన అయి, భారత వాఙ్మయంలో నేను విలాసంగా విహరించగలిగాను, యెన్నాళ్ళనుంచో యెరిగివుండినట్టు.

అయితే, నన్నయ భారతం మొదటి పరిశీలన పూర్తి కావచ్చాటప్పటికి, మరో రెండు తెనుగు గ్రంథాలు నా చేతికి వచ్చాయి.

ఒకటి, వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర – విడతీసి కుట్టిన మూడో భాగం.

రెండు, హోతా వేంకట కృష్ణయ్య (?) గారి రోహిణీ సుధాకరం నాటకం.

మా ఆనందం తెచ్చి యిచ్చాడు, నా కవి.

## 32

రోహిణీ సుధాకరం కొద్దిదినాలే వుండింది, నా దగ్గర.

తరవాత్తరవాత నేను దాని పేరు కూడా వినలేదు, యెవరినోటా.

నా కోపాటి భాషాప్రవేశమూ, గ్రంథరచనోత్కంఠా కలిగాటప్పటికి నాకు దానిమీద వెగటు పుట్టింది.

అది చదవడం దండుగ అనిపించింది.

అది దగ్గిర వుండడం బరువున్నూ అనిపించింది.

అది మొదలు, నా చేతిలో అనేక పుస్తకాల కీగతి పట్టింది.

ఆధునికులవే కాదు, పూర్వకవులవిన్నీ కొన్ని గ్రంథా లెవరెవరికో యిచ్చేస్తూ వచ్చాను.

ఇప్పటికీ యిది తప్పనిసరిగా వుంటోంది.

పూర్వకవుల పద్యాల్లో వున్న జిగిబిగువు లిప్పటివారి రచనల్లో యెక్కడో కాని కనపడవు.

పాండిత్యం, కవిత్వం, ఛందశ్శిల్పం – ఇవన్నీ పుష్కలంగా వుంటేనే పద్యం, లేకపోతే అది ముళ్ళడొంక, లేక చేపలబుట్ట.

ఆదిలో నేను సంస్కృత కావ్యాలు చదివివుండడంవల్ల అన్వయశుద్ధి వుండడం పద్యానికి మొదటి లక్షణం అన్న భావం నాలో స్థిరపడిపోయింది.

కవి ప్రయోగించిన మాటలలో - ఆ పదబంధంలో, చదువుకునేవాడికి - భావుకుడికే అనండి, ఆ కవి నిర్దేశించిన భావం కనపడాలి.

ధ్వని ప్రధానంగానైనా కనపడాలి.

ఇదేమీ లేని పద్యాలు నేను చదవలేను.

భాషా ఛందస్సూ సరిగా లేకపోయినా వేమన రచనల్లో అత్యుత్తమమైన కవిత్వం వుంది, నిబిడంగా.

అలావుంటే మరేమీ లేకపోయినా శిరసావహించవచ్చు, ఏమీ లేని గణబంధాలు దండుగా బరువూ కాక మరేమిటీ?

అయితే, వీరేశలింగంగారి కవులచరిత్ర మాత్రం నిత్య నూతనంగానే కనపడుతుంది, నా కిప్పటికీ.

చాలాకాలం నే నా మూడోభాగంతోనే కాలక్షేపం చేసుకుంటూ వచ్చాను.

నే నెంతోకాలం యెదురుచూడగా యెదురుచూడగా, సంపూర్ణ గ్రంథం వొకనాడు హఠాత్తుగా నా చేతికి వచ్చింది.

తమ దగ్గిర రెండు ప్రతులుండడంవల్లా, కవుల చరిత్రలేని ప్రబుద్ధాంధ్ర లైబ్రరీ చూసి యెంతో యిదయీ, నా కది మిత్రులు శ్రీ అంద్ర శేషగిరిరావుగా రిచ్చారు.

నా దృష్టిలో సాహిత్యవ్యవసాయి కదొక పెన్నిధి.

అయితే, అది అసమగ్రమూ, ప్రమాదభూయిష్టమూ అని కొంద రంటారు, నే నెరుగుదును.

కావచ్చు, వారితో నాకు పేచీ లేదు.

మరి, నిర్దుష్టమూ సమగ్రమూ అయినదేదీ?

నాకు తెనుగుకవుల చరిత్ర కావాలి.

అది రచించడానికి నాకు శక్తి లేదు, లేశమూ.

ఇందరు పండితు లున్నారు, గ్రంథకర్త లున్నారు, పరిశోధకులూ వున్నారు, లోటు గుర్తించినవారు కూడా వున్నారు, మంచి చరిత్ర బయలుదేరతియ్యరేం, మరీ?

కాకపోయినా, వీరేశలింగం పంతులుగారి మధుర రచన విడిచిపెట్టడం మాత్రం యెలాగా?

రమారమీ వొక్క సంవత్సరంపాటు, భారతం ఆదిపంచకమూ, కవుల చరిత్ర మూడో భాగమున్నూ మాత్రమే నాకు సర్వస్వమూను.

అయితే, మా పెద్దన్నగారు చెప్పిన గ్రంథాల జాబితా పూర్తి అయేదాకా "శారదరాత్రుల" పద్యం తరవాత భారతంలో వొక్క అక్షరమైనా చదవలేదు, నేను.

అప్పు డప్పుడు గురుముఖతః చదివిన సంస్కృత గ్రంథాలు తిరగవెయ్యడమున్నూ వుండేది; కాని తెనుగు గ్రంథాలు మాత్రం అవి రెండే ముట్టుకోడం.

వాటిలో కవుల చరిత్ర నన్నెంతో గుబగుబలాడించేది.

కానయితే, ముద్దుపళనీ, కంకంటి పాపన్నా, దిట్టకవి నారాయణకవీ, అయ్యలరాజు నారాయణకవీ మొదలయినవా రేకొద్దిమందో తప్ప ఆ భాగంలో వున్న వారందరూ బహుసామాన్యులే.

సామాన్యులే అంటే అది యిప్పటి మాట.

అప్పట్లో మాత్రం, వారందరూ నాకు నన్నయలే, శ్రీనాథులే.

కాగా, అప్పట్లో, కవి కావడం మహర్షి అయివుండడమే అనీ, రసికుడైనవాణ్ణి ప్రాపంచికమైన క్షుద్రవాతావరణంలో నుంచి ఆనందోద్యానవీధులకు చేర్చగలిగేది కవిత్వమే అనీ, కవి అనుగ్రహానికి పాత్రం అయిన దేశమూ, కాలమూ, పాత్రా కూడా శాశ్వత బ్రహ్మకల్పా లయిపోతాయనీ, కవి అంతస్థు తరిచి తరిచి తెలుసుకోవలసిన బ్రహ్మపదార్థం అనీ బోధించి మా కులవిద్యలమీద నాకు నిరాదరభావం పుట్టించేది, ఆ కవుల చరిత్ర.

"ఇంకా గ్రంథరచనకు పూనుకోవేం?" అంటూ తరిమి తరిమిన్నీ కొట్టేది నన్ను.

కొంతసేపటిదాకా నాకు బాహ్యజ్ఞానం కలిగేది కాదు.

ఈ మూడోభాగమే నన్నిలా ఆడించేస్తూ వుండగా, అది చాలదన్నట్టు, వొకనాడొక విశేషం జరిగింది.

నేనూ ఆనందమూ జీడిపిందెలకోసం వాళ్ళ మామిడితోటకి వెళ్ళికూచున్నాం.

పాలికాపు చెట్లకింద రాలివుండినవాటిలో మంచివన్నీ యేరుతున్నాడు, తోట అంతటా.

మాతోగూడా ఆనందం చుట్టమున్నూ వొకాయన వచ్చాడు తోటకి, పాతిక ముప్ఫయి సంవత్సరాలవాడు.

ఆయన వొక యింగ్లీషుగ్రంథం తెచ్చాడు.

విప్పిచూడగా, అందులో అక్షరాలు చీమతలకాయలు.

"బాబోయ్" అన్నాను, అప్రయత్నంగా నేను.

దానిమీద, ఆయన అది వొక నవల అనీ, ఆ గ్రంథకర్త అలాంటి నవల లింకా చాలా రచించాడనీ, అవి వొక్కొక్క ప్రతే పేరిస్తే మూరెడెత్తుగుట్ట అవుతుందనీ చెప్పాడు.

చకితుణ్ణయిపోయా న్నేను.

అతనెంత గొప్పవాడో అనుకున్నాను.

గొప్పతనంకంటే అతని అదృష్టం మంచి దనుకున్నాను.

ఇంతేకాదు, –

"మనం గజమెత్తు వచ్చేటన్ని పుస్తకాలు రచించా"లనిన్నీ అనుకున్నాను, వెంటనే.

ఈ నిశ్చయంతో యింటికి వచ్చేటప్పుడు నడవలేదు నేను, గాలిలో తేలిపోతూ వచ్చాను.

వచ్చి వెంటనే దీపందగ్గిర కూచున్నాను, అప్పటికి సాయంకాలం కావడంవల్ల.

ప్రత్యేకంగా వొక దీపం పెట్టుకుని వొక వివిక్తప్రదేశాన కూచోడానికి మా యింటో నా కప్పటికింకా అధికారం రాలేదు.

కాకపోయినా, బజారురకమే కాని మంచిరకం లాంతరు లేదు, మా యింటో.

హరికేన్‌లాంత ర్లప్పటి కింకా రావడం లేదు, వున్నచోట రకరకాలు కాండిల్ శ్టాండ్సు మాత్రమే వుండేవి, అరుదుగా.

అంచేత, వేట్లపాలెంలో రాసివుండిన పెద్దకథ పుచ్చుకుని, వంటచేస్తూ మా అమ్మగారు పొయ్యిదగ్గిర పెట్టుకుని వుండిన బుడ్డిదీపం దగ్గిర కూచున్నాను.

కూచున్నాను గాని, మా అమ్మగారిని ముట్టుకుంటానేమో అని నాకు భయమూ, ఆమె కనుమానమూను.

దీనికి సాయం, అదీ యిదీ కావలసిన వస్తువు లందుకుంటూ వుండడానికి, మా అమ్మగారు ఆ దీపం కాస్తా అటూ యిటూ పట్టుకువెడుతూ వుండడం.

ఈ వెలుగుచీకట్లలో మధ్యమధ్య పొగ.

అలాంటి నిరుపహతి స్థలంలో నా కవితాసాధన.

పోనీ, తెల్లవారేదాకా వుంటే మించిపోయిందేమిటీ?

నిజమే, వొప్పుకుంటాను.

తోచినభావం మరిచిపోతామేమో అని యిప్పు డయితే బెంగ.

అప్పటి బెంగ యేమిటో తెలుసా?

"మరి గజం యెత్తు పుస్తకాలు రచించడం యెప్పుడూ?"

చేసేదిలేక, ఆ బుడ్డిదీపం దగ్గిరే వొదిగివొదిగి కూచున్నాను.

తీరా, చూస్తిని గదా, రెండేళ్ళకిందట రాసిన ఆ భాష వికటంగా కనబడింది నాకు, వడ్లూ పేలాలూ కలబోసినట్లు.

ఎంత మామూలు భావమయినా, పరిచితాలయిన సంస్కృత శబ్దాలతో నిబద్ధమయి వుండడం, నా కెంతో యెబ్బెట్టుగా కనపడింది, ఆ కొద్దిపాటి ఆంధ్రగ్రంథపరిచయంతోటే.

వెంటనే అక్కడే అది చింపి పోగులుపెట్టాను.

ఆ కథలో సన్నివేశాలు కొన్ని, తరవాత్తరవాత రాసిన కథలలో పంపకాలయినాయి, విడిచిపెట్టలేదు.

మర్నాడు మరో గ్రంథం ప్రారంభించాను, తెల్లవారడం తడువుగా.

గజమెత్తు పుస్తకాలు రాసి గుట్టలు పెట్టాలన్న వుబలాటం గుంజిగుంజి విడిచిపెట్టింది, నన్ను.

దాంతో, తెల్లకాగితాలు తేవడానికి అంగడికి పరుగు.

కానికి నాలుగు టావు లిచ్చేవా రప్పుడు.

తెచ్చిన కాగితాలు చింపి, మడిచి, కుట్టడానికి తొందర.

కుట్టిన పుస్తకంలో "హరిః ఓ"మ్మంటూ కథ ప్రారంభించడాని కాత్రం.

ఈ స్థితిలో ప్రారంభించాను కొత్తగ్రంథం, నేను.

అదీ చింపేశాను, తరవాత; కాని మళ్ళీ యెప్పుడో నేనది రాయవలసే వుంది.

అప్పు డప్పుడు, అందుకు సంబంధించిన ప్రేరణకూడా కలుగుతూనే వుంది, కొంచెంకొంచెం, యిటీవల.

మహాభారత యుద్ధానికి మూలకారణం అంతా ఆ ఘట్టంలో వుంది.

తరవాతి భారతకథ అంతా ఆ సన్నివేశంమీదే అల్లుకుపోయింది.

మొదటిమాటు భారతం చదివినప్పుడే నన్నది బాగా ఆకర్షించేసింది.

చిన్ననాటి ఆటల్లో, అనేక విధాల బాధించి యేడ్పించి దుర్యోధనుణ్ణి భీముడు రెచ్చగొట్టిన గాథ అది.

ఎవరి మాట యేమయినా, ఆ చిన్నతనంలోనే నన్నది కౌరవ పక్షపాతిగా దిద్దితీర్చింది.

ఏడెనిమిది మాట్లు చదివాను భారతం, నేనిప్పటికి.

అమూలాగ్రంగా చదివాను.

పరిశీలనగానే చదివాను.

అయినా, నా కౌరవపక్షపాతం తప్పనిపించే సన్నివేశం నా కెక్కడా కనపడలేదు, భారతంలో.

ఇప్పటికీ కనపడలేదు.

తరవాత, నేను పిఠాపురంలో చదువుకునేటప్పుడు, రామకృష్ణ కవుల దగ్గిర యీ ప్రస్తావన వచ్చిందొకమాటు, అప్రయత్నంగా.

"సెబాస్" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు, వినీ వినడంతోటే.

నాకంటేనూ కౌరవపక్షపాతం వారిది.

వారు చేసిన వ్యాఖ్యానంతో "అమ్మయ్యా" అని స్థిమితపడ్డా న్నేను.

నేనే కాదు, వారి కౌరవగౌరవం చదివితే, నిష్పక్షపాత చిత్తులయినవా రెవరయినా అంతే.

## 33

ఔద్గాత్రం పూర్తి అయిపోయింది.

స్మార్తమున్నూ గట్టిపడిపోయింది.

వాటిపని, యిక, వీలయినప్పుడల్లా యేకరువు పెట్టుకుంటూ వుండడమే.

ఆ విద్యలు మరుపు రాకూడదంటే అది వొక్కటే మార్గం.

అందుకు వేళా పాళా అక్కరలేదు.

స్థల నిషేధమే గాని, స్థల నిర్దేశమున్నూ లేదు.

నడుస్తూ కూడా యేకరువు పెట్టుకోవచ్చు.

ఆ విద్యలు నేర్చినవారు నడిచేటప్పుడున్నూ కాలం వృధాగా గడపరు.

నేనూ అలాగే చేసేవాణ్ణి, చేస్తూనూ వున్నాను, ఇంకా చేస్తాను.

ఆ దినాల్లో అయితే అవి యేకరువు పెట్టుకోడం – యీ దినాల్లోనా, రచనలకు సంబంధించి ఆలోచించుకోడం – ఇంతే భేదం, నా జీవితంలో.

కాగా, యీ విధంగా కలిసివచ్చిన కాలం అంతా, తెనుగు గ్రంథాలు చదవడంలోనూ, రచన చెయ్యడంలోనూ వినియోగపరుచుకోవచ్చు ననుకున్నా న్నేను.

ఎంతో ఆశా పడ్డాను, ఎంతో మంచి ప్రణాళికా సిద్ధపరుచుకున్నాను, యెంతో యేకాగ్రంగా ప్రారంభమూ చేశాను; గాని అంతా తల్లకిందు లయిపోయింది.

నా కవితాసాధనకు పెద్ద విఘాతం తటస్థించింది.

జరిగిందేమిటంటే?

మొదట, ఆ కాలం అంతా పంచాంగరచనలో వ్యర్థపరచవలసివచ్చింది.

నరసింహరీత్యా తిథులు చెయ్యడమూ, గణకానందరీత్యా గ్రహస్ఫుటాలు చెయ్యడమూ, గ్రహలాఘవం రీత్యా గ్రహణాలు చెయ్యడమూ, సందేహాలు వచ్చినచోట

'సూర్యసిద్ధాంతం రీత్యా తీర్చుకోడమూ పంచాంగ రచనలో మా సంప్రదాయం, అప్పట్లో.

అప్పటికి, నాకు, తిథులూ గ్రహస్ఫుటాలూ మాత్రం స్వాధీనం అయినాయి.

గ్రహలాఘవం వల్లించాను, గ్రహణగణితం నేర్చుకుంటున్నాను.

సూర్యసిద్ధాంతం మూలం వల్లిస్తున్నాను.

అయినా, యెంతో కొంత వీలు చేసుకుని తెనుగు గ్రంథాలు చదువుతూనే వచ్చాను.

రచనా సాగిస్తూనే వచ్చాను.

పంచాంగ రచన మాత్రమే తప్పకపోతే అంతమాత్రాన నాకేమంత యిబ్బంది లేకేపోవును.

కాని, మా నాయనగారవి నిషేధించారు.

వల్లకా దన్నారు, పురిమి.

వల్లూరిలోనూ, వేట్లపాలెంలోనూ వచ్చిన నిషేధం యింటో కూడా సిద్ధపడింది, నాకు.

అయితే, వల్లూరి నిషేధమూ వేట్లపాలెం నిషేధమూ సంస్కృత సాహిత్యాభ్యాసం నిరాఘాటంగా సాగిపోవడానికి మాత్రమే, మొత్తానికి.

మా నాయనగారి నిషేధం మాత్రం అలాంటిది కాదు.

కులక్రమంగా వస్తున్న వైదికవిద్యలకు కొంతయినా అది అంతరాయం కలిగిస్తుం దన్న అనుమానం దాని క్కొంత కారణమే, వొప్పుకుంటాను.

కాని, ప్రధానకారణం "తెనుగులో కవిత్వం చెయ్యగూడదు" అని.

అది "అప్రతిష్ఠాకరం" అని.

"పతనమున్ను" అని.

మావాళ్ళ దృష్టిలో, –

తెనుగు వొక సభ్యభాష కాదు.

తెనుగులో సాహిత్యకృషి చెయ్యడం అంటే అకార్యకరణం.

తెనుగులో గ్రంథరచన చెయ్యడం అంటే, మరి, భ్రష్టాజే అయిపోడం.

ఈ విషయమై మా నాయనగారికి గట్టి నమ్మకమే వుండేది.

వారికి మా చిన్నన్నగారు తోడుపడ్డారు.

వారే కాదు, వైదికవిద్యలు నేర్చిన బ్రాహ్మ లెవరయినా యిదే మచ్చు, సాధారణంగా.

ఇంగ్లీషు కూడా వొక భాషే వారి దృష్టిలో, తెనుగు మాత్రం కాదు.

సంస్కృతమే భాష, ముఖ్యంగా.

అది చదివితేనే గౌరవం.

సంస్కృతం అభ్యసించి వుండకపోయినా, కర్మిష్ఠు లైన వైదికులు, అయినవాటికీ కానివాటికీగూడా సంస్కృత శబ్దాలే వాడతారు, తరుచు.

'ఆజ్యం' అంటారు గాని, నెయ్యి అనరు వారు.

పెళ్ళి అంటే నీచకం, వివాహం అనాలి.

శోభనం అనరు, గర్భాధానం అనేమాట సకృతుగా వాడతారు. తరుచు వారు వాడే శబ్దం పునస్సంధానం.

మంచినీళ్ళు అంటే పామరత్వం, మంచితీర్థం అనాలి.

వైదికవిద్య లన్నీ సంస్కృతంలో వున్నాయి కనక, అవి నేర్చుకుంటే ప్రాయికంగా సంస్కృతం నేర్చుకోడమే అవుతుంది కనక, వారి దృష్టిలో సంస్కృతం వొక్కటే పవిత్ర మైన భాష.

పవిత్రమైనది మాత్రమే కాదు, దేవతల భాషే అది.

తాము భూసురులు కనక, బ్రాహ్మ లదే నేర్చుకోవాలి.

కనక, పండితు డంటే సంస్కృతపండితుడే పండితుడు.

కవి అంటేకూడా సంస్కృతకవే కవి.

ఇది వైదికుల సిద్ధాంతం.

కనక, తెనుగులో కవిత్వం చెయ్యవద్దని నాకు ఆంక్ష

పైపెచ్చు, వైదికవిద్యలు కొంచెం నేర్చి, కొద్దో గొప్పో సంస్కృతమున్నూ అభ్యసించి వుండిన నేను తెనుగులో రచన చెయ్యడం కులం చెడ్డమే.

కాగా "నువ్వు వాణ్ణి పాడుచేస్తున్నా"వని మా పెద్దన్నగారిని గట్టిగా మందలించారు, మా నాయనగారు.

బహు సున్నితమైన మనస్తత్వం మా పెద్దన్నగారిది.

హద్దుదాటేవారు కా రాయన.

ఎదుటివారు దాటితే అంగీకరించేవారు కారు.

అది తమ సొంతానికి అపాయకర మయితే ప్రతిఘటించేవారు, లేకపోతే ఆ మనిషిని తప్పించుకుని తిరిగేవారు.

నా తత్త్వమున్నూ యిదే మొదణ్ణుంచీ.

అంచేత, మా పెద్దన్నగారికి, నా రుచి కనిపెట్టి చదువు చెప్పడమే అగత్యం అయింది; గాని నా చదువు విషయమై మా నాయనగారితో వివాదపడవలసిన అగత్యం లేకపోయింది.

దీంతో, నా విషయం పట్టించుకోడం మానేశా రాయన.

నే నేకాకి నయిపోయాను.

అయినా నేను జంకా లేదు, వెనుదియ్యా లేదు.

సరిగా యీ స్థితిలో, మా యింటో, కుటుంబ కలహాలు ప్రారంభం అయినాయి.

## 34

అప్పటికి, మా పెద్దవదినగారూ, మా చిన్నవదినగారూ మాత్రమే కాపరాలకు వచ్చి వుండినారు.

చిన్న వదినగారు వచ్చిన కొద్ది దినాలకే తోటికోడళ్ళలో పొరుపులు పుట్టాయి.

అవి పురుషుల దాకా పాకాయి.

వాటికి మా పెద్ద అక్కగారి మంత్రాంగ పుద్ధృతి కలిగించింది.

అనుకోని యీ పుట్టేమునక మా నాయనగారికి శాంతిభంగకరం అయిపోయింది. వారు సద్దుబాటు చెయ్యడానికే చూశారు; గాని అసాధ్యం అయిపోయిం దది.

తగువు లంటే దూరంగా వుండే మా పెద్దన్నగారు, ఇది సహించలేక, పొలమూరు విడిచి, మహేంద్ర వాడలో మా నాయనగారు సంపాదించి వుండిన నివేశనస్థలంలో యిల్లు కట్టుకుని పృథగ్భాండాశనం ప్రారంభించారు.

దీంతో, నా స్థితి అసలే చెడింది.

నేను తెనుగు గ్రంథాలు చదవడంలోనూ, తెనుగులో రచన చెయ్యడంలోనూ ఏర్పడిన నిషేధం, పేరుకే మా నాయనగారిది.

అదయినా వాగ్రూపం మాత్రమే.

ఈ విషయం వచ్చినప్పు డల్లా వారు నన్ను తిట్టేవారు.

మండిపడి మండిపడి, తమ అసహాయతనూ నిందించుకునేవారు.

వారి మాటమీద, అది, ఆచరణలో – పూర్తిగా పెట్టినవారు మా చిన్నన్నగారు.

నికరమైన సంస్కృత సాహిత్యం మా చిన్నన్నగారిది.

సహజంగా, ఆయనకు, మా కులవిద్య లన్నా, సనాతన ధర్మం అన్నా, నియమనిష్ఠ లన్నా ఆదరం యెక్కువ.

దీనికి సాయం, అప్పటికప్పుడే, మా యింటో వుండిన ముద్రితాముద్రితాలు ఇరవై ముప్పై ధర్మశాస్త్ర గ్రంథాలూ పరిశీలనగా చదివి వుండినా రాయన.

ఆ చదువు, వారిని, ఛాందసంలో దింపేసింది, ముఖ్యంగా.

యజ్ఞయాగాదులు చేసినవారికిన్నీ లేని ఆచార వ్యవహారాల పట్టింపు వచ్చేసిం దాయనకు.

మా పెద్దన్నగారికి వైదికాచారాల విషయమై వీరవ్రతం లేదు, కొంచెమున్ను.

నేను మరింత ముందుకే వెళ్ళిపోయాను.

అంటే, వీలయినప్పుడల్లా సంధ్యావందనమున్నూ మానేస్తున్నా నప్పటికే.

ఈ కారణాలు, మా పెద్దన్నగారి మీదా, నామీదా ద్వేషమూ మా చిన్నన్నగారిమీద ప్రీతీ పుట్టించాయి, మా నాయనగారికి.

"తప్ప పుట్టారు" అని మామీద నిరసన భావమూ "కుల దీపకుడు" అని మా చిన్నన్న గారిమీద ఆదరభావమూ కూడా పుట్టించాయి వారికి.

మా నాయనగారి నియామకంతో మా చిన్నన్నగారు నామీద పెత్తనం సాగించసాగారు.

అది రకరకాలుగా నడిచేది.

అప్పటికప్పుడే పాదుకాంతదీక్ష యిచ్చివుండినారు మా నాయనగా రాయనకు.

అంచేత, స్నానసంధ్యాద్యనుష్ఠాలైన తరవాత, పొద్దుటిపూట, దినమ్మూ హొకటిరెండు గంటలసేపు మంత్రజపం చేసుకునేవా రాయన.

ఒక్కొక్కనాడు పొద్దున్నే చేసుకునేవారు, హొక్కొక్కనాడు మధ్యాహ్నికభోజనం వేళ చేసుకునేవారు.

జపం చేసుకోడమే పెట్టుకున్నారు; గాని కాలనియమం పెట్టుకోలే దాయన.

ఆయన వీలునిబట్టి నేను మాత్రం ఆయనతో కలిసి కూచుని పంచాంగం చెయ్యాలి.

తమకు మా నాయనగారి అండ వుండబట్టిగాని, నాకూ వొక విశిష్టధర్మం నిర్వర్తించుకోవలసిన అగత్యం వుండినప్పుడు, తమ వీలునుబట్టే నన్ను నడుచుకోమనడాని కాయన కేమి అధికారం వుందీ?

మా పెద్దన్నగారికీ మా చిన్నన్నగారికీ వుండుకున్న వ్యత్యాసం యిదీ.

ఇప్పటి నా పరిస్థితులను పరిశీలించిచూస్తే, ఆయనకు సంక్రమించిన యీ నియామక సత్తావల్ల, అప్పుడు నేనెంత నష్టపడ్డానో యెవరి కయినా బోధపడుతుంది.

అయితే, నియామకులు నిర్బంధం అవలంబిస్తే, నియుక్తులు, కొన్నిచోట్ల అయినా ప్రతిఘటనకు పూనుకోకపోరు.

జపం విషయమై మా చిన్నన్నగారికి గల అవ్యవస్థను పట్టి, నా కవితావ్యాసంగం నిర్బాధంగా సాగడానికి నేమా వుపాయాలు చూసుకోసాగాను.

చీకటితోనే కాల్యాలు తీర్చుకుని, చద్దన్నమున్నూ తినేసి "మరి, పంచాంగం చేద్దాం వస్తావా, స్నానం చేసి జపం చేసుకుంటావా?" అని ఆయన్ని నిక్కచ్చిగా అడగడం ఆ వుపాయాల్లోదే, వొకటి.

దీనిమీద ఆయన కూడా వుపాయాలు వెతికారు.

నా తన్మయత్వం చెడితే చాలు, ఆయనకు.

అప్ప డప్పుడు మాత్రమే ఆయన అంచనా తప్పిపోయేది, తరుచు నేనే దెబ్బతినేవాణ్ణి.

ఇతరులకంటే అప్పటి నా బాధ రచయిత లయినవారే గ్రహించ గలరు, బాగా, ఏమంటే?

బుద్ధి రచనావ్యగ్రం అయిందా, యిక, ఆ రచయితకు నిద్ర అక్కరలేదు, ఆహారం అక్కరలేదు, డబ్బక్కరలేదు, కోరి అప్సరస వచ్చినా అక్కరలేదు.

ఆ స్థితి యెప్పుడు వస్తుందో రచయిత కూడా తెలుసుకోలేడు, వచ్చినప్పు డందులో తలమునకలు కావడమేగాని.

ఉద్దీపనం రకరకాలుగా వుంటుంది, అనేక సందర్భాలలో కలుగు తుంది, అది అలౌకికం.

నిరంతరసాధన వల్ల, కావలసినప్పు డది సిద్ధించే సత్తా సంపాదించుకోవచ్చు; గాని అది దృశ్యాదృశ్యం.

అంచేత, ఒక్కొక్కప్పుడు నాకు కలిగిన రచనోద్వేగం, మా చిన్నన్నగారి ఉపాయాలవల్ల యెగిరిచక్కాపోయేది.

ఆయన చూడనప్పుడు నాకది కలిగితే కలిగేది, లేకపోతే వుసూరుమంటూ వుండిపోయేవాణ్ణి.

పోనీ అంటే, అలాంటప్పుడు చదువు మాత్రం యేమి సాగుతుందీ?

ఏమంటే?

రచయిత చదువు వేరూ, విద్యార్థి చదువు వేరున్నూ.

విద్యార్థి, గ్రంథంలో చెప్పబడ్డ విషయమే చూసుకుంటాడు; రచయిత, చెప్పిన విధానమున్నూ చూసుకుంటాడు.

అంచేతనే రచయితకు లోకవృత్త పరిశీలనతోపాటు, గ్రంథపఠనం కూడా చాలా ముఖ్యం.

ఏమయినా, వీలు అయితే, వుద్వేగమున్నూ కలిగితే అప్పుడే నేను రచన సాగించేవాణ్ణి.

అదీ మా చిన్నన్నగారు సహించలేకపోయేవారు.

నన్ను కలుపుకుని చేసినంతసేపూ పంచాంగం చేసేవా రాయన.

జపమో మరో పనో చేసుకునేటప్పుడు మాత్రం నన్ను అమరం వల్లించమని నిర్బంధించి కూచోపెట్టేవారు.

ఇక నాకు తెనుగు అభ్యాసానికీ రచనకూ అవకాశం యేదీ?

ఇది ఆయన దిలాసా.

చెరువులో జలం, యింకా యింకా పూనగట్టితే గట్లు దొలుచుకుని గతి చూసుకుంటుంది.

పాతనీటిని కూడా తీసుకుపోతుంది.

నా స్థితీ అలాగే అయింది.

నాచేత, తెనుగు అభ్యాసరచనలు మాన్పించాలని మా నాయనగా రనుకున్న కొద్దీ, మా చిన్నన్నగారు అందుకు నిర్బంధ విధానం అవలంబించినకొద్దీ నేనున్నూ అందుకు ప్రతీకారం ప్రారంభించాను.

ఏమంటే?

అప్పటికే అవి నాకు జీవన్మరణసమస్య లయిపోయాయి.

దీంతో, మావాళ్ళమీద ప్రతీకారంగా, స్మార్తం అన్నా, శ్రౌతం అన్నా, జ్యోతిషం అన్నా నాకు నిరసన భావమూ, ప్రాతికూల్యమూ, ద్వేషమూ కూడా పెరిగిపోయాయి, గోషావల్ల స్త్రీకి పరపురుషప్రీతి పెరిగేటట్టు.

సంధ్యావందనం అన్నమాటమీదే రోత పుట్టేసింది.

మావాళ్ళకి ప్రతిక్రియ చెయ్యడానికి నాకంతకంటే మరో మార్గం కనపడలేదు.

"అవి నిన్నేం చేశా"యంటే "మరి నా తెనుగురచన మా వాళ్ళని మాత్రం యేమి చేసిందీ?"

కాక – మా నాయనగారిలాగే మా చిన్నన్నగారున్ను వాచా మాత్రమే నన్ను నియమించివుంటే, నే నలాచేసి వుండకపోదును.

వాటిని ద్వేషిస్తూ కూడా "అవి మన కేమిచేశాయి?" అనుకునేవాణ్ణి నే నప్పుడప్పుడు; కాని నాకు షష్టిపూర్తి మహోత్సవం జరిగేదాకా మాత్రం యీ సంగతి సావకాశంగా నే నాలోచించలేకపోయాను.

ఇది యిలా జరుగుతూ వుండగా వీరేశలింగంగారి ఉపన్యాసాలు వొకటిరెండు నాకళ్ళబడ్డాయి.

కులము, వేశ్యాకాంతలు – అనే ఆ రెండు ఉపన్యాసాలూ నేను బాగా చదివాను.

అవి నన్నాకర్షించాయి.

దాంతో శుద్ధ ప్రచ్ఛన్న బ్రాహ్మసామాజికుణ్ణే అయిపోసాగా న్నేను.

కాని స్వాతంత్ర్యం లేదు.

ఎదిరించే సత్తా లేదు.

లోపల్లోపలే నా ప్రతీకార భావమూ, చాటుచాటుగానే ఆచార బహిష్కారమూ జరిగిపోసాగాయి, తీవ్రంగా.

## 35

మా పెద్దన్నగారు మొదణ్ణుంచీ ఆర్జనపరులు.

మహేంద్రవాడ ప్రవేశించాటప్పటికే వారిదగ్గిర కొంచెం డబ్బు చేరి వుంది.

దాంతో, పృథగ్భోజనం వారికీ మేలే చేసింది.

ముఖ్యంగా, ఆస్తిపాస్తుల్లో కూడా విభాగాలు చేసుకోవాలన్న వుద్దేశం పుట్టించింది, వారికి.

ధర్మమే.

పంచుకోడానికిన్నీ కావలసినంత వుంది, సందేహం లేదు.

మేము బయలుదేరేటప్పటికి ఉపయోగానికి రాకుండా పోయిందే గాని మాకుండుకున్న భూవసతి తక్కువది కాదు.

అయితే, యిప్పటి నీటివసరుల్లేక, రాబడి బహు తక్కువగా వచ్చేది, వెనకటి రోజుల్లో.

కొన్ని భూములమీద, పన్ను చెల్లించడం కూడా దండుగే అన్న స్థితిలో వుండేది, రాబడి.

పొక్తుగా వాడుకుంటే కుటుంబాని కదయినా సరిపోతుంది గాని; భూములు స్వాధీనంలో లేవు.

దానిక్కారణం, మా పితామహులు శివరామసిద్ధాంతి దీక్షితులుగారు.

అంత భూమి వుండినా, ఒక విధంగా మాకు రెక్కలే ఆధారం చేశారు; మరో విధంగా మా రెక్కలకు జవసత్వాలు ప్రసాదించారు, వారు.

ఉన్నదల్లా యేమిటంటే?

వారు, మహాతపశ్శాలి పిడవర్తి చలమయ్యశాస్త్రిగారి అల్లుళ్ళు.

అల్లుళ్ళందరిలోను మామగారికి మిక్కిలీ ప్రీతిపాత్రులున్నూ.

చలమయ్యశాస్త్రిగారు, మా తాతగారికి పిల్ల నిచ్చారు, మంత్రశాస్త్రంలో పాదుకాంత దీక్ష యిచ్చారు. మా పితామహి (తమ కూతురు) రాజ్యలక్ష్మమ్మగారికి పసుపుకుంకముల నిమిత్తం యెనిమిది యకరాల అగ్రహారం భూమి దయచేశారు.

ఆ మహర్షి యిచ్చిన పాదుకాంతదీక్షను సద్వినియోగం చేసుకున్నారు, మా తాతగారు.

చలమయ్యశాస్త్రిగారిది శ్రీవిద్యోపాసన అనుకుంటూను, మా తాతగారిది, ముఖ్యంగా, మేధాదక్షిణామూర్త్యుపాసన.

సహజంగా, పుట్టుభోగి మా తాతగారు.
దీనికి సాయం, మంచి రాజసం కలవారు వారు.
ఆపైని తపోధనులు.
ఇన్ని కారణాలవల్ల వారు నప్రతిగ్రహీతలు.
సాధారణంగా పదచలనం చేసేవారు కారు.
మంత్రోపాసన చేసుకోడం, ఎక్కడెక్కడి ఉద్గ్రంథాలున్నూ తెప్పించుకుని భోజనానంతరం వాటికి ప్రతులు రాసుకోడం – ఇంతే ఆయన దినచర్య.
మా యింటో వుండిన బండెడు తాటాకు పుస్తకాల్లోనూ సగానికి పైగా వారి స్వహస్తలిఖితాలే.
ముత్యాలకోవ వారి చేతి రాత.
నిరతాన్నదానం వారి కెంతో ప్రీతిపాత్రం.
రాబడి చాలకపోతే, దానికోసం రుణాలు చెయ్యవలసి వచ్చింది.
ఈ స్థితిలో, పులిమీద పుట్రలాగ శుభకార్యాలు.
అవి హోహో అనేటట్టు చెయ్యడం.
అగ్రహారీకులు – అందులో మళ్లీ బ్రహ్మాణ్యులు అయిన చలమయ్యశాస్త్రిగారి కొమార్తె రాజ్యలక్ష్మమ్మగారు, మా తాతగారి కనుకూలంగా మసులుకుంటూ అన్నపూర్ణ తల్లి అని ప్రఖ్యాతి పొందారు.
మహాయోగి నిష్కల ప్రకాశంగారు, ఆ ప్రాంతానికి వస్తే "రాజ్యలక్ష్మమ్మా, అన్నం వడ్డించూ" అంటూ మా యింటికే వచ్చేవారుట.
మా నాయనమ్మగారు బతికివుండినంతకాలమూ మా తాతగారు రాజర్షి అయి వుండినారు.
అయితే, వారు గమనించలేదు; గాని యింటో ఉద్గ్రంథాలు పెరిగినకొద్దీ, బయట రుణాలున్నూ పెరిగిపోయాయి, శరవేగాన.
తీర్చరాని అంతస్థుకిన్నీ వెళ్ళిపోయాయి, చరచరా.
కాని, వారు చేసిన మేధాదక్షిణామూర్త్యుపాసన మాకు పెట్టనికోట అయివుంది, యిప్పటికీ.
మా దగ్గిర యే మయినా ప్రజ్ఞవున్న దంటే, అది, మా తాతగారి ప్రసాదం.
అది మాకు అగ్రహారాలపెట్టు. వారు రుణాలు చేశారని నాకే కాదు, మా చిన్నన్నగారికిన్నీ బెంగలేదు లేశమూ.
ఈ విషయమై మా నాయనగారున్నూ అసంతృప్తి కనపరచలేదు, ఎప్పుడూ. ఏమంటే?
తమ తండ్రిగారి ఉపాసనాప్రభావం మా నాయనగారికి కల్పవృక్షం అయింది.
మా నాయనగారున్నూ మేధాదక్షిణామూర్త్యుపాసకులు, వారి ఉపాసనా మాకు కామధేనువు అయింది.
అయితే, యేది యేమయినా, ప్రకృతి ప్రవర్తిల్లుతూనే వుండింది.
చిలికిచిలికి, చివరచివర, మా తాతగారికే సంతాపకరం అయిపోయింది, రుణభారం.
ఈ స్థితిలో మా పెత్తండ్రిగారు విభాగాలు చేసుకోవా లని నిశ్చయించుకున్నారు.

మా పెత్తండ్రులిద్దరు నడివయసులోనే నిస్సంతుగా చనిపోయారు.

మూడోవారు చలమయ్యశాస్త్రులుగారూ, నాలుగోవారు మా నాయనగారున్నూ మాత్రమే దీర్ఘాయుష్మంతులు.

వా రిద్దరూ విభాగాలు చేసుకోడంలో, అంత నిర్లిప్తులున్నూ మా తాతగారు మా పెత్తండ్రిగారి వైపు మొగ్గారు.

దానిక్కారణం మా పెత్తండ్రిగారి పరిస్థితులు.

అయనా కులవిద్యలన్నీ పూర్తిగా నేర్చుకున్నవారే; గాని, వొక్కటీ కంఠస్థం కాదు, వొక్కదాన్లోనూ స్వాతంత్ర్యం యేర్పడలేదు.

మాట్లాడితే పుస్తకాపేక్ష వారికి.

మా నాయనగా రేది నేర్చినా యిత్రిశ్రీగా నేర్చేవారు.

వారు సాధించిన విద్యలన్నీ, బతికి వుండినంతకాలమూ వారికి జిహ్వాగ్రాన వుండేవి, మాకు బాగా తెలుసు.

నేర్చిన ప్రతీవిద్యలోనూ స్వాతంత్ర్యం వుండేది, మా నాయనగారికి.

సభకి వెడితే మా పెత్తండ్రిగారు దిక్కులు చూడ్డమూ, సింహప్పిల్లలాగ మా నాయనగారు వీరవిహారం చెయ్యడమూ పరిపాటి.

"సంగ్రహీ నావసీదతి" అన్న తత్వం మా నాయనగారిది.

అసలు, విద్యలు నేర్చుకోడమూ, నేర్చిన విద్యల్లో స్వాతంత్ర్యం సిద్ధించడమూ – ఇది మనచేతిలోనే వుందా?

కొంద రెంత చదివినా విద్య అంటదు.

ఎంత వల్లించినా జ్ఞాపకం వుండదు.

కొందరికి, సుళువుగా కంఠస్థం అయిపోతుంది, మరిపోదు.

పూర్తిగా బోధ అయి వారికి విశిష్టతా కలిగిస్తుం దది.

ప్రతిభావంతుల్లోనే యీ భేదం కనపడుతుంది, మళ్ళీ.

సభకు వెడితే కొంద రద్భుతంగా మాట్లాడతారు, ఇంటో కూచునిన్నీ చక్కగా రాయలేరు.

చాలా గొప్పగా రాస్తారు కొందరు; విషయం యెంత తెలిసివుండినా, మనస్సుకి రంజకంగా మాట్లాడలేరు, సభల్లో.

ఇది ప్రయత్నలోపం కాదు, మరేమిటో?

ఏమిటో వ్యక్తం కాని యీ భేదమే వుండేది విద్యల్లో, మా పెత్తండ్రిగారికీ, మా నాయనగారికిన్నీ.

సాంసారికంగా కూడా, మా పెత్తండ్రిగారి యింట ప్రతీ వస్తువుకోసమూ యెప్పటి కప్పుడు బజారుకి బయలుదేరడమే.

మా నాయనగారి కది కిట్టేదికాదు.

రోజు గడవడం కాదు మరి, ప్రజ్ఞ, కాలం గడవాలి.

పురుషుడు కొన్ని రోజులు పొరుగూళ్ళలో వుండినా, యింటో స్త్రీ వాడిదుడుకులు పడగూడదు.

ఇదీ మా నాయనగారి తత్వం.

ఇలాంటి కారణాలవల్ల మా పితామహులు మా పెత్తండ్రిగారిమీద అభిమానం పెట్టుకున్నారు.

మరి ప్రయోజనం?

అది ఋణాలు తీర్చలేకపోయింది.

ఇంటో యెప్పుడు కావలసిన వస్తువు అప్పుడు సమకూర్చలేకపోయింది.

దాంతో, వేరున్న వెంటనే, మా పెదనాయనగారు ఋణాల తీరుమానానికి వొక్కొక్క భూమే అమ్మడం ప్రారంభించారు.

ఋణబాధ మా నాయనగారికీ వుంది సమంగా; గాని వారు భూములు స్వాధీనతనఖాలు పెట్టడం ప్రారంభించారు.

ముప్ఫయ్యేళ్ళకి తక్కువ తనఖా వొక్కటీ లేదు.

అరవై యేళ్ళకికిన్నీ వొక తనఖా వుంది.

పొలమూరిలో మా నాయనగారికి యకరంనర వచ్చింది.

అప్పటికే అది మాగాణి.

రత్నగర్భ.

మా పెదనాయనగారు, తమ వాటా యకరంనరా ఆరువందల రూపాయలకు తెగనమ్మేశారు. ఆరువందలే అప్పు పుచ్చుకుని అరవైయేళ్ళకి తనఖాపెట్టారు తమ వాటా, మా నాయనగారు.

అది నేను పుట్టిన సంవత్సరం జరిగింది.

కనక, నాకు షష్టిపూర్తీ ఆ భూమి విడుదలా వొక్కమాటే.

చెప్పవచ్చిందేమిటంటే?

భూములన్నీ యిలా నిలుపుకుంటూ వచ్చారు కనక, లెక్కల్లో మా నాయనగారు ఆస్తిపరులే గాని; వ్యవహారంలో రెక్కలే ఆధారం అయినాయి.

ఇటు పూర్వపు మర్యాదలకు లోటు రాకుండా సంసారం నిర్వహించుకుంటూ, భూములు తనఖాపెట్టి, తీర్చిన ఋణాలు తీర్చగా, డబ్బు సంపాదించి తీర్చవలసిన ఋణాలున్నూ కొన్ని వుండిపోయాయి, మా నాయనగారికి.

దీనికి సాయం, మగ పిల్లలం ముగ్గురమూ, ఆడపిల్లలు ముగ్గురూ – ఆరుగురు సంతానం మా నాయనగారికి.

వీరిని పెంచాలి, కార్యాలు చెయ్యాలి.

చదువులున్నూ చెప్పించాలి.

అయినా, మా నాయనగారి కెప్పుడూ యే లోటూ రాలేదు.

మాకందరికీ స్థితిపరులు చేసినట్టే శుభకార్యాలు చేశారు.

రోజులు రాజాంగంగా వెడుతున్నాయి.

ఈ స్థితిలో మా యింటో స్త్రీల మూలంగా కలతలు ప్రారంభం అయినాయి.

"వెంటనే విడిపోవలసిందే" అంటూ మా పెద్దన్నగారు ఆస్తిపంపకానికిన్నీ రాయబారాలు ప్రారంభించారు, అవ్యవధానంగా.

## 36

ఒకరి ననకుండా, వొకరిచేత అనిపించుకోకుండా సంచరించే స్వభావం మా నాయనగారిది.

అంచేత, సంసారం గుట్టు వీధిలో పడిపోకుండా వుండడానికి, వెంటనే మా పెద్దన్నగారి ప్రయత్నాల కంగీకరించారు, వారు.

మా పెద్దక్క గారి సలహా కూడా యిందుకు బాగా ప్రోద్బలపరిచింది వారిని.

తన కొడుకూ తన సంసారమూ వేరే వుండినా, యిక్కడ కూడా కొంత పెత్తనం సాగించే దావిడ.

పెత్తనం చేసినా అందర్నీ సమానంగా చూస్తే యిబ్బంది లేకపోవును.

మొదణ్ణుంచీ, మా చిన్న అన్నగారిమీద ప్రత్యేకాభిమానం ఆవిడకు.

నామీద అలాంటిది లేకపోగా, మా పెద్దన్నగారిమీద మాత్రం వల్లమాలిన ద్వేషం.

ఇది మా వదినగార్ల తగువులకు కొంత కారణమూ, కొంత ప్రోద్బలమూ కూడా అయింది.

మా పెద్దన్నగారికి విడిపోవాలన్న బుద్ధి పుట్టడానికిన్నీ యిదే కారణం.

క్షణం అయినా ఆలస్యం చెయ్యలేదు, మా నాయనగారు.

మహేంద్రవాడలో, ఏడిద వెంకటరమణయ్యగారని వొక సంపన్న నియోగి గృహస్థు.

ధర్మప్రవర్తకు లాయన.

మంచి వ్యవహర్తలు.

మా కుటుంబం అంటే, యెంతో ఆదరమూ గౌరవమూను ఆయనకు.

ఆయన మధ్యవర్తిగా మూడు వాటాలు వేసేశారు మా నాయనగారు, వున్నదంతా.

తమకు వాటా పెట్టుకోలేదు.

పోనీ అంటే మిగుల్చుకోడాని కెప్పుడూ లేదు, ఏమిన్నీ.

మేము ముగ్గురమూ, ఏటా ఇంతింత అని కొంత సొమ్ము తమకిస్తూ వుంటే చాలు నని వారి నిశ్చయం.

మా పెద్దన్నగారు డబ్బివ్వడాని కంగీకరించారు; కాని మా చిన్నన్నగారు "వల్లకా"దని ప్రతిఘటించారు, గట్టిగా.

అంత ప్రయోజకులకు కొడుకులు భరణం యివ్వడమా అని వారి కభిమానం వచ్చింది.

నా కది నచ్చింది, ఆ అజ్ఞానదశలో కూడా.

దొడ్డంపేటలో, వాడ్రేవు జమీందారు లిచ్చివుండిన పుట్టెడు భూమిలోనూ మా నాయనగారి వాటా నాలుగు యకరాలు.

తక్కిన భూములన్నీ తనఖాలో వుండగా, అదొక్కటే అప్పటికి స్వాధీనంలో వుండినది.

దానిమీద నలభై బస్తాలదాకా ధాన్యం వస్తోంది యేటా.

అది మా నాయనగారి కిచ్చెయ్యాలని మా చిన్నన్నగారి వాదం.

ఇది మా పెద్దన్నగా రంగీకరించలేదు.

వ్యవహారం స్తంభించిపోయింది.

మరి, వెంకటరమణయ్యగా రేమి చేస్తారూ?

ఇలాంటప్పుడే తెలుస్తుంది, మనిషి యోగ్యత.

ధర్మపరులన్నాను నే నాయన.

నిజంగా ధర్మపరులే అయినారు, ఆ సందర్భంలో, వారు.

మా పెద్దన్నగారిని వొప్పించారు, చివరికి.

బతికి వుండినంత కాలమూ మా అమ్మగారూ మా నాయనగారూ ఆ భూమి అనుభవించేటట్టూ, వారి వుభయుల అనంతరమూ మాకు ముగ్గురికీ అది సమభాగాలుగా స్వాధీనపడేటట్టూ, దిగ్విభాగం కూడా చేసి పథకం యేర్పాటు చేశారు మా చిన్నన్నగారు.

మంచీ చెడ్డా వుంటుంది కనక, యేభూమి కాభూమే మూడేసి ముక్కలూ చేసెయ్యవలసిందే అని మా పెద్దన్నగారు.

భూములు మరీ స్వల్పఖండాలయిపోతాయి కనక, కీడు మేళ్ళవరసన భూములు లాట్లుగానే పంచాలని మా చిన్నన్నగారు.

ఇదీ ప్రతిష్టంభనం తెచ్చింది.

కాని, మా చిన్నన్నగారి పద్ధతే స్థిరపడింది, చివరికి,

మిగిలివుండిన చిల్లర రుణాలూ, పాత్రసామానూ, మా ముఖ్యాస్తి రెండుబళ్ళ పుస్తకాలూ మాత్రమే మూడు వాటా లయినాయి, సమంగా.

పారీఖత్తు రిజిష్టరయిపోయింది.

అస్వాధీనం భూమి వొక్కొక్కళ్ళకు రెండేసిపుట్లు వచ్చింది, వేరువేరు గ్రామాల్లో.

నిజమే; కాని యేమి లాభమూ?

రెక్కలే ఆధారం.

మా పెద్దన్నగారు చాలా సంతోషించారు.

మా చిన్నన్నగా రయినా నిరుత్సాహపడలేదు. ఏదో విధంగా, సంసారం గెంటుకుపోయే శక్తీ ధైర్యమూ వున్నాయి, వారికి.

నా పనే అస్తవ్యస్తం అయిపోయింది.

నివేశనమూ తాటాకుల యిల్లూ తప్ప సెంటుభూమి స్వాధీనంలో లేదు.

వ్యవహారజ్ఞాన మయినా లేదు.

ఆర్జనశక్తి బొత్తిగా లేదు.

బువ్వ యెలా వస్తోందో తెలియనే తెలియదు.

పదిహేడో సంవత్సరం నడుస్తోంది, నా కప్పుడు.

ఇదీ అప్పటి నా స్వస్వరూపం.

ఆ వయసువాళ్ళలో నావంటివాళ్ళు మరికొందరున్నూ వుంటారు, అదో విశేషం కాదు.

మరేమిటంటే?

ఆకలయితేనే భోజనం చెయ్యాలన్న దృష్టీ, నిద్ర ముంచుకు వస్తేనే పడుకోవాలన్న జ్ఞానమూను, నా కప్పుడు.

ఇంతేకాదు.

తలలో యేమిటేమిటో మెరుపులూ, హృదయాన ఎందుకెందుకో ఆవేగమూ, అదంతా కాగితంమీది కెక్కించి వెయ్యాలని మనస్సు వురకలూ – ఇదీ నా ప్రపంచం.

సాంసారికంగా మరొకళ్ళయితే కుంగిపోయి వుందురు; కాని చీమ కుట్టినట్టున్నా లేదు నాకు.

ఈ స్థితిలో – ఆ సంవత్సరం పూర్తి కావస్తోందనగా మా సీత కాపరానికి వచ్చింది.

"మన చిన్నబ్బాయి కూడా వొక యింటివాడయినా"డని మా అమ్మగారితో చెప్పి యెంతో సంతోషించారు, మా నాయనగారు.

"మన బాధ్యత తీరిపోయింది" అనిన్నీ అనుకున్నారు.

అనుకున్నారే గాని తీరలేదు, లేశమూ.

పైపెచ్చు, నా భారమున్నూ వారిమీదే పడింది.

పడింది అంటే, గుర్తు తెలిసి నేను వెయ్యలేదు, వారే వేసుకున్నారు, కోరి.

అది కూడా నేను గమనించలేదు.

ఆ దృష్టే లేదు నాకు.

అప్పటిదాకా యెలా ప్రవర్తించానో, అప్పణ్ణుంచీ అలాగే ప్రవర్తించసాగాను, నిశ్చింతగా.

## 37

అప్పటికే కాదు, ఇప్పటికీ నా ప్రవృత్తి యిదే.

వయసు పెరిగిందే కాని, చూపు మారలేదు.

"భాష పరసీమలు చూడాలి, గజం యెత్తు పుస్తకాలు రచించాలి" ఇదీ ఆ చూపు.

"వైదిక సంప్రదాయం విడిచిపెట్టినందుకు, కుటుంబంలో కవిత్వసంప్రదాయం ప్రారంభించా"లన్న కొత్తరేఖ కూడా కలిసింది, ఆ చూపులో.

దాంతో, నా ప్రవృత్తి స్థిరపడిపోయింది.

ఇక, –

అది వొక ఉత్సాహం.

అది వొక ఉల్లాసం.

అది వొక ఉద్రేకం.

అది వొక ఆవేగం –

ఇవి నడిపించుకు పోతున్నాయి, నన్నప్పణ్ణుంచీ.

నా పురాకృతసుకృతం దీనిక్కారణం.

నా జీవితం చీలికల్లేని యీ గాడిలో పడినందుకు మిక్కిలీ గర్వపడుతున్నా న్నేను.

కాని, సంసారంమాత్రం యీడ్చియీడ్చి కొడుతోంది, చిన్నదే అయినా.
ఒక్కొక్కప్పుడు కెలికిన్నీ వేస్తోంది, మెదడంతా.
ఏమాత్రమో తెలివితేటలున్నాయి, డబ్బుసంపాదించడాని కవి చాలు.
కాస్తో కూస్తో ఐహికదృష్టీ వుంది, నలుగురితోపాటు, తక్కువలేదు.
సంపాదిస్తూనూ వున్నాను; కాని చాలడం లేదు.
ఎంచేతా అంటే, అదే పనిగా సంపాదించడం లేదు, కనక.
ఏమీ అంటే, తెలిసే అందుకు దీక్షపట్టలేకపోతున్నాను కనకాను.
రచన మీదకురికేస్తోంది చూపు, కుప్పించి కుప్పించి.
ఎంతో కొంత డబ్బు చేతికిరాగానే – అగత్యం తీరి ఆ రోజు గడిచిపోగానే – "రేపటిమాట చూసుకుందాం" అనిపిస్తుంది. ఆ వేడి తగ్గి.
కలమూ కాగితాలూ పుచ్చుకు్కూచుంటాను, అవ్యవధానంగా.
గంటలు గడుస్తాయి, జాములు గడుస్తాయి, పూటలు గడుస్తాయి, దినాలూ, వారాలూ మాసాలూ కూడా గడిచిపోతాయి, ఆ కూచోడం కూచోడం అలాగే కూచుంటాను అన్యం మరిచి.
సంసారంలో మళ్ళీ డెడ్‌లాక్ పడేదాకా మరి కదలను.
కదలాలన్న యింద్రియావబోధే కాదు.
అజ్ఞానం కాదిది, నాకు తెలుసు.
సోమరితనమున్నూ కాదిది. యెప్పుడూ యెరుగను, ఏ కొంచెమున్నూ అది.
"పోనీ, రాసి యేమి చేస్తా"వంటే, అదీ వొక తపనే అవుతోంది, నాకు.
సర్వాధికారాలతోనూ యితర్ల కిచ్చేసినవి పోగా, అచ్చుపడి వుండినవిన్నీ కాక, మొదటి కూర్పే కావలసిన వింకా డెబ్భయి దాకా వున్నాయి, నా గ్రంథాలు.
రెండోకూర్పూ మూడో కూర్పూ కావలసినవిన్నీ వున్నాయి డజను దాకా.
ఇవి చాల వన్నట్టు, ఇరవై సంపుటాలయే, పద్దెనిమిది పర్వాల సంస్కృత మహాభారతం అనువదించ బూనుకుని వున్నాను, అక్షరం అయినా విడిచిపెట్టకుండా.
మరి, వెలుగుచూడ్డం యెప్పటికివి?
గుబగుబలాడిపోతుంది మనస్సు, యీ ఆకాంక్షతో.
వెంటనే, దేశంమీద ప్రసరిస్తుంది, చూపు.
ఏం వుంది చూస్తే?
శుద్ధశూన్యం!
"ఏం, డబ్బు లేదా?" అంటే, లేకేం, మూలుగుతోంది.
ఖర్చున్నూ అవుతూనే వుంది, మంచినీళ్ళప్రాయంగా.
కాని, విచక్షణ లేదు, కసింత అయినా.
కృత్యవిభాగజ్ఞానమున్నూ లేనేలేదు.
కాలు సాగినంత దూరం తిరుగుతున్నారు, జనులు.
కడుపునిండా తింటున్నారు.
వొంటినిండా కడుతున్నారు.
కళ్లనిండా చూస్తున్నారు.

మనసారా అనుభవిస్తూనూ వున్నారు.

ఎక్కడపడితే అక్కడే – ఎందుకు పడితే అందుకే పోటీలమీద పోటీలు పడిపోతున్నారు, అహమికతో.

లోభులు కారు, నిందించడానికి.

సంస్కారం మాత్రం లేదు, అంతే.

ఎందుకు లేదూ అంటే, గ్రంథాలు చదవరు, కనక,

ఎందుకు చదవరూ అంటే, వాఙ్మయం విలవ తెలియదు కనక.

కొత్త ప్రాజెక్టులు కట్టాలి, మళ్ళీ–

అధికోత్పత్తి కావాలి.

పరిశ్రమలు వృద్ధిపొందాలి.

రాకపోకల సౌకర్యాలు పెరగాలి.

ఫిలింమీద ఫిలిమున్నూ తయారయిపోవాలి, గబా–గబా.

మరి, వాఙ్మయమో?

మనిషికి బుద్ధివికాసం కలిగించే ఉత్తమవాఙ్మయమో?

కొత్త సంగతులు తెలిపి, కొత్త రుచులు మప్పి, కొత్త చూపు అలవర్చి, కొత్త దారులు కనపరిచి, కొత్త శక్తి సంఘటించి, కొత్త ఆవేశం పురికొలిపి, కొత్త ప్రపంచంలో వురికించే కొత్త వాఙ్మయమో?

ఊంహూ!

పైపై వేషాలే గాని – కుక్షింభరత్వమున్నూ మాత్రమే కాని – అంతరికమైన యీ ఆవేదన లేదు, జనులకు.

"తనది" "పరులది" అన్న వివేచన కూడా లేశమూ లేదు.

ఈ స్థితిలో, తెనుగుదేశంలో, కవి అయినవాడికి చావుబతుకుల సంరంభమే కాని బతుకుతెరువు ఎలా కలుగుతుందీ?

## 38

ఏమయినా, ఆ స్థితిలో మా సీత కాపరానికి రావడం నాకు మేలే అయింది.

దాటిపోతుందేమో అనుకున్న నా సీత నాకు దక్కడమే కాదు, అప్పటికి నాకు సహచారిణి కూడా అయింది, అది మరో విషయం.

సీత రావడంతోనే పరాయతం చెప్పకు రమ్మని నన్ను మా నాయనగారు కానూరు అగ్రహారం పంపించారు.

స్మార్తం చెప్పకున్నవాళ్ళకి సంహిత అనావశ్యకం కాదు; గాని పరాయతం మాత్రం మిక్కిలీ అగత్యం.

సభకి వెడితే పరాయతం రాని స్మర్త నిలవ లేదు.

అదీ మా నాయనగారే చెప్పగలరు గాని; తీరిక లేదు.

అయినప్పుడే ఆయె అంటే, చాలాకాలం పడుతుంది, మరి.

అయితే మాత్రం కానూరు అగ్రహారమే యెందుకు పంపాలీ అంటే, అక్కడ అది చెప్పదగిన సమర్థులు దొరికారు కనక.

నిజాని కింకో కారణమూ వుంది, చెప్పకేం?

అక్కడికి నాలుగైదు మైళ్ళలో వుంది మా అత్తవారి వూరు, ముక్కామల.

కార్యం అయిన వెంటనే పిల్లని అత్తవారి యింటికి పంపేవారు కారప్పుడు పుట్టింటివారు.

కనక, నేను అగ్రహారంలో వుంటే, చదువూ వస్తుంది, దగ్గిర కనక, అనధ్యాయాలలో ముక్కామల వెడుతూనూ వుండవచ్చు.

అక్కడికే పంపడానికి మా నాయనగారి కివి కారణాలయితే, వెళ్ళడానికి నాకు మరో కారణాలు ఏర్పడ్డాయి.

ఒకటి:— మా చిన్నన్నగారి పర్యవేక్షణం తప్పిపోతుంది.

రెండు:— నన్నయభారతం స్వేచ్ఛగా చదువుకోవచ్చు.

మూడు:— రచన కూడా నిరాఘాటంగా సాగించుకోవచ్చు.

పొంగిపోతూ, వెళ్ళా న్నేను.

అసలు, అగ్రహారం అంటేనే గొప్ప, అందులోనూ కానూరు అగ్రహారం అది.

వెలనాటి బ్రాహ్మణ్యానికి పుట్ట అది.

వేదవిద్యకు చిరపీఠమున్ను.

అగ్రహారీకులు ఈమనివారు, తక్కిన యిళ్ళవారున్నూ చాలామంది వున్నారు, అక్కడ.

నిడదవోలికి దక్షిణంగా, యేడెనిమిది మైళ్ళలో, వసిష్ఠ గోదావరిని అనుకుని వుంది అది.

రాజమహేంద్రవరం కింద, మూడు మైళ్ళలో, ధవళేశ్వరం దగ్గిర అఖండగోదావరి రెండు పాయలయింది.

వాటిలో ఆలమూరు, కోటిపల్లి గ్రామాలమీదుగా వెళ్ళి యానాం కింద సముద్రంలో కలిసేది గౌతమి.

కానూరు అగ్రహారం ముక్కామల, నరసాపురం గ్రామాల మీదుగా వెళ్ళి, అంతరవేది దగ్గిర సముద్రంలో కలిసేది వసిష్ఠ.

ఈ రెండు పాయల్లోనే మరో అయిదు పాయలు పుట్టాయి; సముద్రంలోనూ కలిశాయి భిన్నస్థలాల్లో.

అవే సప్తసాగర సంగమాలు.

అడ్డదారిని వెడితే మా పొలమూరికి పదిహేను మైళ్ళదూరం కానూరు అగ్రహారం, అయితే, నడవాలి, రెండు గోదావరులు దాటాలి.

అప్పటికి బస్సులు పుట్టలేదు.

సొంత టూరింగు కార్లే లేని రోజులవి.

జట్కాలు మాత్రం యెక్కడయినా వుండేవి, అపురూపంగా.

ఉన్నంతవరకూ రెయిలు — తరవాత — నడక — ఇదీ అప్పటి కాఅగ్రహారం వెళ్ళడానికుండుకున్న సౌకర్యం.

నేను వెళ్ళాటప్పటికి కావూళ్ళో సుమారు మూరిళ్ళ వెలనాటివారున్నారు.

ఎనభై రెండు ప్రశ్నలూ అయినవారు కూడా పదిపదిహేనుగురు ఉన్నా రప్పటికి.

క్రమంగా క్షీణించగా క్షీణించగా అప్పటికి నిలిచివుండిన సంఖ్యలివి.

ఆదిలో ఆ వూళ్ళో రెండు వందల గడప దాకా వుండేదిట బ్రాహ్మణ్యం.

ఎనభైరెండు పన్నాలూ కత్తులమీద పరీక్ష యిచ్చేవారు యాభైమంది దాకా వుండేవారుట.

వేదం తప్ప అవూళ్లో మరో శాస్త్రమూ లేదు, కళా లేదు.

వైద్యుడున్నా లేడు, చివరికి.

సాధారణంగా వేదవిద్య ఎక్కువగా వుండేవూళ్ళ పద్ధతే అలా వుంటుంది.

పెద్దావధానులుగారు అని వేదార్థం చెప్పేవారొక రుండేవారక్కడ, ఆయన పోయిన కొద్ది సంవత్సరాలకే నేనక్కడికి వెళ్ళాను.

అవూరంతా మెట్టపంట.

పాటకజనం తప్ప, రెడ్లు, కమ్మవారు, తెలగాలు – ఇలాంటి రైతాంగం లేదు, ఆ వూళ్లో.

అంచేత, చదివినవారూ చదవనివారూ బ్రాహ్మలంతా వ్యవసాయదారులే అక్కడ.

పొరుగూళ్ళవారి కక్కడ భూములుంటే, అవిన్నీ వారే కవుళ్ళకు పుచ్చుకోడం.

ఆ వూరి మున్సబున్నూ వెలనాటివారే.

అక్కడ లక్షాధికారులూ వున్నారు, భిక్షాధికారులూ వున్నారు.

వేదం పూర్తి అయినవారూ వున్నారు, పునహాస్తతారాలు తిరిగే అంశువారీలూ వున్నారు.

వడ్డీవ్యాపారం చేసేవారూ వున్నారు, ఋణాలలో మునిగిపోయినవారూ వున్నారు.

ఇంగ్లీషులో దిగి మారినవారూ వున్నారు, ఎందులోనూ దిగకుండానే మారినవారూ వున్నారు.

"బ్రాహ్మణోత్తములు" అనిపించుకోతగ్గ సంప్రదాయాలూ వున్నాయి; "ఛా, యిదేం పని?" అనిపించుకునే దురాచారాలూ వున్నా యక్కడ.

అగ్రహారం అంటే విశిష్టంగా వుంటుందనుకుంటూ వెళ్ళాను, వేదం చెప్పుకున్నవారెక్కువమంది వుండడమూ, బ్రాహ్మణగడప యెక్కువ వుండడమూ తప్పిస్తే మరే విశేషమూ లేదక్కడ.

నేను కలలో కూడా అనుకోని దురాచారం వొకటుంది ఆ వూళ్లో.

సాధారణంగా పాలమూరు ప్రాంతాన, విఘ్నేశ్వరుని చవుతినాడు, పిల్లకాయలు రాత్రివేళ యిళ్ళమీద రాళ్లు రువ్వుతారు.

ఉండ్రాళ్లు రువ్వడం అసలు సంప్రదాయం.

ఉండ్రాళ్లు పోయి, వెలక్కాయలూ, మారేడు కాయలూ, యిటుకముక్కలూ రువ్వడం మామూలయిపోయింది చివరికి.

ఈ పని బ్రాహ్మణపిల్లకాయలు చెయ్యరు.

కానూరు అగ్రహారంలో బ్రాహ్మణయువకులే చేస్తారు ఇలాంటి పని, ఆవేళ.

యాభై అరవైమంది కుర్రవాళ్లు, రాళ్ళు పుచ్చుకుని వెళ్ళి తేలీల యింటి యెదుట కూచుంటారు, మధ్యాహ్నం, పొద్దువాలాక.

వారిని చూడగానే, ఆ యింటి యజమాని, కుంచెడు నువ్వుపప్పూ దానికి కావలసినంత బెల్లమూ కలిపి, నడివీధిలో వారి యెదటే చిమ్మిలి తొక్కి యిచ్చేస్తాడు.

అది ఆలస్యం అయితే రాళ్ళవాన ప్రారంభం అవుతుంది.

అసలే యివ్వకపోతే యిల్లు పందిరయిపోతుంది.

పెద్దలు – చదువుకున్నవారు కూడా – "యిదేం పని?" అని కేకలెయ్యరు, యువకులను.

కేకలెయ్యకపోగా "యిది యివాళటిదా?" అని యెదురువాదం కూడా ప్రారంభిస్తారు.

ఊరంతా వొక వర్ణమే యెక్కువగా వుంటే, అల్పసంఖ్యాకులమీద కొన్ని దౌర్జన్యాలు జరుగుతూనే వుంటాయి, యెక్కడా కూడా.

అయితే, బ్రాహ్మణ కుర్రవాళ్ళు – అగ్రహారం బ్రాహ్మణ కుర్రవాళ్ళు కూడా అంతేనా?

"మేము అగ్రవర్ణవాళ్ళం" అనుకునే బ్రాహ్మల దగ్గిర ఉత్తమగుణా లుండా లనుకుంటారు, తక్కినవారు.

ఈ దృష్టితోనే ప్రారంభం అవుతుంది, గౌరవభావ మైనా, నిరసనభావ మైనా, అప్రయత్నంగా.

మొత్తానికి, తక్కిన అన్నివూళ్ళతోపాటే వుంది అవూరున్నూ; విశిష్టత యేమీ లేదు.

ప్రవేశించిన మర్నాడే నాకీ విషయం తెలిసిపోయింది.

బ్రహ్మశ్రీ ప్రవా పర్వతావధానులుగారి దగ్గిర ప్రవేశించడానికి వెళ్ళాను, ఆ వూరు నేను.

అప్పటి కాయన వయస్సు యాభై పైనే; కాని నలభై పయిని మాత్రమే అన్నట్టుండేవా రాయన.

గంభీరముగమూ ఆజానుబాహూ విగ్రహమున్నూ.

మాట కొంచెం పెళుసు, అది విద్యాగర్వానికి చిహ్నం.

విద్యలో ఆ విశేషం వుంది, సందేహం లేదు.

మాటే పెళుసు గాని, హృదయం దాకా వెళ్ళగలిగితే, అది అమృతం; రెండు దినాలకే నాకిది అవగాహన అయింది.

స్థితికి లోటులేదు, అయినా అర్జించే వారాయన.

వేదం అంతా ఆయనకు జిహ్వాగ్రాన వుండేది.

ఉచ్చరిస్తే వేదమంత్రా లాయనే వుచ్చరించాలి.

వేదం అంతా అంత వాచోవిధేయంగా వుండినవారూ, అంత చక్కగా – స్ఫుటంగా మంత్రోచ్చారణ చెయ్యగలవారూ మరి లేరని ప్రతీతి, ఆ చుట్టుపట్ల.

మా నాయనగారికీ ఆయనకూ చిరపరిచయం.

ఎక్కడో వొక సభలో మా నాయనగా రుపనిషన్మంత్రా లుచ్చరించడం ఆయన విన్నారుట.

ఆ స్ఫుటోచ్చారణకు ముగ్ధులై వెంటనే మా నాయనగారితో స్నేహం చేసుకున్నారుట ఆయన, కోరి.

స్వరజ్ఞానం వున్నవారి కందరికీ కలుగుతుంది సాధారణంగా ఆ ఆనందం.

సంగీతానికి కంఠం మంచిది కావాలి. వేదానికి నోరు మంచిది కావాలి; రెండూ వొక కోవకి చెందినవే మొత్తానికి.

ఒక్కొక్కసారి పాట వుద్రూత లూగిస్తుంది, అలాంటిది మంత్రోచ్చారణమున్ను.

వేదార్థమూ, వేదమంత్రాల పవిత్రతా అలా వుండగా, ఆ మంత్రాలు వింటేనే నాకు మనోల్లాసం కలుగుతుంది.

క్రమం, జట, ఘన – ఇవి మిక్కిలీ గొప్పవే, గాని పదం చెవిని పడితే యీ మనోల్లాసం శతగుణం అవుతుంది, నాకు.

అది నా అదృష్టం, అంతకంటే మరేమీ చెప్పలేను. వేదం నేను వల్లించి వుండకపోయినా, అపస్వరం చెవిని పడితే దెబ్బకొట్టి నట్టవుతుంది, నాకు.

వైదికాచారాలమీద అప్పటికీ యిప్పటికీ నాకు కొంత అశ్రద్ధ వుంది, నిజమే; కాని వేదం వినడం మాత్రం నాకు పరమప్రీతి.

ఇది గుర్తించారా అన్నట్టు అంత వాచోవిధేయంగా వుండినా, పర్వతావధానులుగారు దినమ్మొ రెండో మూడో పన్నా లేకరువు పెట్టుకుంటూనే వుండేవారు.

సంహిత మాత్రమే కాదు, పదమూ క్రమమూ – పరాయతమూ కూడా యేకరువు పెట్టుకుంటూనే వుండేవారు.

నేను కదలకుండా కూచుని వుండిపోయేవాణ్ణి, కొంచెం అవతలగా.

అది వింటున్నంతసేపూ నాకు తెరపిమరపుల స్థితి యేర్పడేది.

పరాయతం పూర్తిచేసుకోలేకపోయానే గాని, పర్వతావధానులుగారిని సేవించుకున్న కాలం నిజంగా, నాకొక మధుర స్వప్నం వంటిది అయింది.

వారి హృదయ సౌకుమార్యం వెంటనే అవగాహన కావడం వల్ల కూడా యిది యిలా తటస్థించింది.

## 39

పరిచితుల యింట బస చేసి, వెళ్ళి, పర్వతావధానులుగారి దర్శనం చేసుకున్నా న్నేను.

"మీ నాయనగారు నిన్ను పంపుతామని సెలవిచ్చారు, జ్ఞాపకం వుంది" అంటూ ప్రీతిగా దగ్గిరకి తీసుకున్నారు, నన్నాయన.

ఆ క్షణాన, యేడెనమండుగురు అవధానులవారున్నారు, వారి సమక్షాన.

అందరూ యాభై పైబడినవారే; గాని పర్వతావధానులు గారి సన్నిధిని, గురువును పరివేష్టించివుండిన శిష్యు లన్నట్టున్నారు, వారు.

మాటవరసని నాకు స్మార్తం పూర్తి అయిందని తెలిసి వారిలో వొకాయన "యేదీ, నాలుగు వివాహ మంత్రా లేకరువు పెట్టు చూతాం" అన్నారు, స్వరపరీక్ష చెయ్యదలిచి, నన్ను.

కావాలని వెంటనే నేను "వృక్ష త్వ్కా౯ర ముదజం త్వాప" అన్న మంత్రం అందుకున్నాను, ఉచ్చైస్స్వరంతో.

వారు చకితులయినా రది విని.

అప్పుడు పర్వతావధానులుగా రందుకుని "ఏం, అలా అయినారేం? సిద్ధాంతిగారిది శ్రౌతసంప్రదాయం. శ్రౌతం నేర్చిన స్మర్తలందరూ ఆ మంత్రం అలాగే వుచ్చరిస్తారు. 'వ్యక్తత్వా౯ర మిత్యుచ్చై శ్శ్యాగ్రవయేత్' అని భట్టీయం కదూ మరీ?" అన్నారు.

పరీక్షకులు "ఏదయినా సామం చెప్ప"మన్నారు నన్ను పర్వతావధానులుగారి మాటమీద.

సాధారణంగా, వేదం వల్లించినవారికీ, స్మార్తం చెప్పుకున్నవారికీ "సౌధసం" "వామదేవ్యం" – ఇలాంటి సామాలు నాలుగైదే వచ్చి వుంటాయి.

నేనవి అన్నీ విడిచిపెట్టి రథంతరసామగానం చేశాను.

అది యజ్ఞంలో, దాక్షిణాయనహోమాల సందర్భంలో వస్తుంది.

వినడానికిన్నీ మిక్కిలీ సొంపుగా వుంటుంది.

చమత్కారంగానూ వుంటుంది.

దాంతో, నాకు ఔద్గాత్రం పూర్తి అయిందన్న సంగతిన్నీ అక్కడ వెల్లడి అయింది.

"మంచి శిష్యుణ్ణే సంపాదించా" వంటూ పర్వతావధానులుగారిని మిక్కిలీ శ్లాఘించారు, వారందరూ.

అప్పు డన్నారు పర్వతావధానులుగారు, "ఇతను పంచాంగాలు చేస్తాడు. ముహూర్తాలు స్థిరపరుస్తాడు. జాతకాలూ ప్రశ్నలూ చెబుతాడు" అని.

ఈ ప్రస్తావన, అగ్రహారంలో భోజన వసతి సులభం చేసింది, నాకు.

మా నాయనగారు స్థిరపరిచిన ముహూర్తాన ఆ మర్నాడే పాఠం ప్రారంభం అయింది.

మొదట మూడో అట్టం ప్రారంభించా రవధానులుగారు.

నక్షత్రేష్టి, రెండు పురోడాశాలూ, సున్నాలపన్నమూ, సత్యమూ – ఇది మొదటి గుంటు.

అవధానులుగారు, మంచి భోజనప్రియులూ, జఠరదీప్తి గలవారున్నూ.

అంచేత, వారెప్పుడూ వొకటి రెండు పాడిపశువులను పెంచేవారు.

ఊళ్లో వున్నప్పుడు, పొద్దుటిపూట అంతా స్నానసంధ్యాద్యనుష్ఠానాలతో సరిపోయేది, వారికి.

భోజనం కాగానే నిద్ర.

నిద్ర కాగానే పొలంలో వ్యావృత్తి.

వారు విద్యార్థులకు పాఠం చెప్పడం, సాధారణంగా ఆ సమయాన.

నలుగురిలోనూ పాఠం చెప్పుకోడం నాకు యమచెర.

ఒక్క పిఠాపురంలో మాత్రం, రామకృష్ణశాస్త్రిగారు నాకు వివిక్తంగా పాఠం చెప్పేవారు.

వల్లూరిలోనూ వేట్లపాలెంలోనూ చుట్టూ పదిమంది వుండగానే పాఠం.

ఇది చాలదన్నట్టు అగ్రహారంలో నడుస్తూనే సంత చెప్పుకోడం.

పొలం వెళ్ళాటప్పుడు చేతులూపుకుంటూనే వెళ్ళినా వచ్చేటప్పుడు నెత్తిమీద పచ్చిగడ్డి మోపు.

పొరుగూళ్ళు వెడితే, బుజాన నా మూటా గురువుగారి మూటాను.

అప్పుడూ సంత చెప్పుకోడమే.

తరవాత్తరవాత అలవాటయి మనస్సుకొంత సరిపడినా, ప్రారంభంలో నాకెంతో యిదిగా వుండేదిది.

ఈ పద్ధతి యెబ్బెట్టుగా వుండి పనసలు మెల్లిగా వుచ్చరిస్తే "నోరు లేవదేం?" అంటూ గురువుగారి గదమాయింపు.

తల తిరిగిపోయేది, వొక్కొక్కప్పుడు.

"ఎందుకు వచ్చిన చదువు?" అనిన్నీ అనిపించేది.

అయితే, యింటి దగ్గిర చిన్నన్నగారి నిర్బంధవిధానంకంటే కోటిరెట్లిది నయమేగా?

సంత అవడం అలా వుండగా, గురువుగా రేమయినా పని చెబితే అది చేసేసి వెళ్ళి స్వేచ్ఛగా భారతం చదువుకునేవాణ్ణి బసలో, యిదంతా మరిచి.

అవధానులుగా రెంత శ్రద్ధగా చదువు చెప్పేవారో అంత నిక్కచ్చిగానూ పనులు చేయించుకునేవారు.

నా కలవాటు లేని పనులున్నూ కొన్ని చెప్పేవా రాయన.

తొలినాడే హడలకొట్టగూడ దనుకున్నారో యేమో మలినాడు పొలం తీసుకువెళ్ళారు, నన్ను.

నడుస్తూ సంత చెప్పుకోడానికి కదే మొదలు.

ఊరిలో నడిచినంతసేపూ నేను మొగం యెత్తలే దావేళ.

అయినా, బిడియంగానే వుండింది.

పొలం చేరుకోగానే, సంత చెబుతూనే "గడ్డిపీకు" అన్నారు గురువుగారు, తామున్నూ ప్రారంభించి.

పొలం వెళ్ళడమూ, పచ్చిగడ్డి కొయ్యడమూ, నెత్తిని పట్టుకుని రావడమూ నా కలవాటే.

పీకడమే అలవాటు లేదు.

చేసేది లేక, సరదాగానే పీకాను నాలుగ్గుప్పెళ్లు.

అంతలో వేళ్ళు మండసాగాయి,

చూసుకోగా, రక్తం వస్తోంది.

తెల్లపోయి వూరుకున్నాను.

"ఏం, వూరుకున్నావేం?" అనీ, సంగతి చెప్పగా "యెడమచెయ్యి ఏమయిం"దనీ గదిమా రాయన.

ఏమవుతుందీ, అదీ తెగుతుంది; తెగనూ తెగింది.

అభిమానం తోచి గబగబా పీకా నేమో కుడిచేతికంటేనూ యెక్కువ తెగిం దది.

నేను మళ్ళీ వూరుకోడం చూసి "అయితే, నీకు చదువంటినట్టే" అంటూ విసుక్కుని, అటు చూసి యిటు చూసి "పోనీ, మర్రిచెట్టెక్కి ఆకులు కొయ్యి" అన్నా రవధానులుగారు.

అదీ నా కలవాటే.

సంత మానుకోవలసివచ్చిం దంతే. పక్కచేలో వున్న మర్రిచెట్టెక్కి, వారం రోజులకు సరిపోయే ఆకులు కోశాను, క్షణంలో.

పెరట్లో బాదం చెట్టుంది, మర్రి ఆకులు వారి కక్కరాలేదు అలవాటూ లేదు, అయినా, విద్యార్థికి పని చెప్పకుండా వుండలేరు గురువులు, గురుకులవాసంలో.

కొడుకులకున్నూ అలా పనులు చెబుతారు, వారు.

మధ్యతరగతి యువకులకు ఆ పద్ధతి శ్రేయస్కరమే – సందేహమూ లేదు, ఆక్షేపణా లేదు.

పనీ చెబుతారు, ఎలాగయినా వీడికి నాలుగు ముక్క లంటాలన్న ఆవేదనతో చదువూ చెబుతారు, ప్రీతిగా వారు.

విద్యార్థి అంటే వారి దృష్టిలో, కుటుంబంలో వొకడు – పుత్రతుల్యుడు, పైవాడు కాడు.

ఆ కుటుంబంలో వున్న పిల్లలున్నూ విద్యార్థులను అన్నలుగానూ తమ్ములుగానూ చూసుకుంటారు.

తమ యింటో యేమి పిండివంట చేసుకుంటే అది, తన పిల్లలతో సమంగా పెడుతుంది గురుపత్ని, విద్యార్థికి.

అక్కడ వుభయవర్గాలకూ గూడా స్వస్వరూపంతో సాక్షాత్కరిస్తుంది, ఆత్మీయత.

అంచేత, గురుకులవాసం వుసూరు మనిపించదు, వుత్సాహకరంగానే వుంటుంది.

కాని, ఆ రాత్రి భోజనం చేశాటప్పుడు కుడిచెయ్యి మండిపోయింది, నాకు.

బసకి వచ్చి పడుకున్నాక "మరి రేపు గడ్డిమాట యేమిటి?" అని బెంగ కూడా పట్టుకుంది.

అయితే, వొక్కొక్కప్పుడు, అందుకు, యేదో వొక సౌకర్యం తటస్థపడుతుంది, అనుకోనిది.

ఆ వూళ్ళో, వూరికొక చివర కమ్మరికొలిమి.

పనివాడు సరదా అయినవాడు.

లోకజ్ఞానం వున్నవాడున్నూ.

మా నాయనగారంటే అతని కతిభక్తి.

ఆ వూళ్ళోనూ, పక్కనే వున్న పుసునుమర్రు గ్రామంలోనూ మా పెద్దక్కగారికి యీనాం భూములున్నాయి.

మా బావగారు చనిపోయి వుండడంవల్లా, మా మేనల్లుడు పసివాడు కావడంవల్లా ఆ భూముల అమరకం వగైరాలు మా నాయనగారే చూసేవారు.

ఆ పనిమీద అక్కడ వుండినంతకాలమూ జాతకాలు చెప్పించుకుంటూనూ, ప్రశ్నలు చెప్పించుకుంటూనూ అతను మా నాయనగారిని కనిపెట్టుకునే వుండేవాడు.

ఇదంతా తెలియజేసి "అతను పనసకాయ కత్తి చేసి యిస్తా నన్నాడు, వచ్చేటప్పుడు పట్టుకురా" అని చెప్పి పంపారు మా నాయనగారు, నన్ను.

ఆ బెంగలో నాకిది జ్ఞాపకం వచ్చింది.

కాళ్ళూ చేతులు తీర్చుకుని, అతను కొలిమిదగ్గిర కూచునేటప్పటికి వెతుక్కుంటూ వెళ్ళి పట్టుకున్నాను, మర్నాటి పొద్దున్న నే నతణ్ణి.

చాలా ఆదరించాడు నన్నతను.

ఉత్తరక్షణంలోనే ప్రశ్న చెప్పమన్నాడు, ఎప్పు డెప్పుడని కనిపెట్టుకుని వుండినట్టు.

ప్రశ్నలు చెప్పేవాళ్ళకీ, గోచారం చెప్పేవాళ్ళకీ యెప్పుడూ గ్రహగతి జ్ఞాపకం వుంటుంది, యెప్పటికప్పుడు పంచాంగం చూసుకోవలసిన పని వుండదు.

కాగా, నేను పొద్దు కట్టుకుని, చక్రం వ్యూహించుకుని ఫలితం చెప్పాను, ప్రతికూలం అవుతుందని.

అయినా "అదీ మాట" అంటూ యెగిసిపడ్డా డతను.

"నే ననుకుంటూనే వున్నాను. ఫలితం తెలియడం తరవాయిగా అంతా విషమించే వుంది, నిజమే" అన్నాడతను, మనస్సు సరిపెట్టుకుని.

"అయితే, మీ రిప్పుడు పనసకాయకత్తి కోసమేనా వచ్చిందీ?" అనిన్నీ అడిగాడు చివరికి.

అది రెండో పని అనీ, అసలు ఫలానా అనీ చెబుతూ నా రెండు చేతులూ విప్పి చూపించా న్నేనతనికి, తిప్పితిప్పి.

జరిగిపోయినదానికి మిక్కిలీ విచారించి, వెంటనే లోపలికి వెళ్ళి, చిన్నకొడవలి తెచ్చి నా చేతిలో పెట్టా డతను, సాదరంగా.

వీలు తప్పితే యేదిపడితే అది కోసేసేదే; కాని చూపులకెంతో సొగసుగా వుం దది.

"చేవకర్ర పిడితో, యిత్తడి పొన్నుతో ముద్దుగా వున్న దీంతో గడ్డి కొయ్యనా?" అనిపించింది నాకు.

"తరుచు కనబడుతూనే వుంటాను, పది రోజుల్లో పనసకాయకత్తీ చేసి యిస్తా"నంటూ నన్ను పంపేశా డతను.

మధ్యాహ్నం మామూలుగా పొలం వెళ్ళాం.

కావలసిన గడ్డి క్షణంలో నేనే కోసేశాను. గురువుగారికి శ్రమ లేకుండా.

కొడవలి చూసీ, జరిగింది వినీ గురువుగా రెంతో వింతపడ్డారు.

ఇంటో మోపు దింపుతూ వుండగా గురుపత్ని కంటబడింది, కొడవలి.

సంగతి అడిగి, విని, పుచ్చుకుని చూసి "ఎంతో బాగుంది, పొలం వెళ్ళేటప్పు డడిగి పుచ్చుకుని, రాగానే మళ్ళీ నా కిచ్చేస్తూ వుండు" అంటూ— మాట అయినా వినిపించుకోకుండా యింటోకి వెళ్ళిపోయా రామె.

చూస్తూనే వుండినారు గురువుగారు, మాట్లాడలేదు.

అందుకూ యిందుకూ గూడా తెల్లపోయా న్నేను.

## 40

ఎంతమంది విద్యార్థుల కయినా అన్నం దొరుకుతుంది; గాని వారాల పద్ధతి మాత్రం లేదు; కానూరి అగ్రహారంలో.

పొద్దున్నే వెళ్ళి "యీ పూటకి భోజనం పెడతారా?" అని విద్యార్థి అడగడం అక్కడి ఆచారం.

ఈ పూటకి అంటే "ఈ దినానికి – రెండు పూటలానూ" అని ఆ వూరి అర్థం.

కొత్తలో నే నీరోజు అనే అనేవాణ్ణి, తరవాత అందరితోపాటే అయినాను.

వారు వీలు లేదంటే మరో యింటికి వెళ్ళాలి, విద్యార్థి.

వారూ యిష్టపడకపోతే మరొక యిల్లు–చాలు, మరి శ్రమపడనక్కరలేదు.

అసలు, మూడో గుమ్మమే యెక్క నక్కరలే దావూళ్ళో.

నే నక్కడ వుండినంతకాలానికీ వొకమాటో మరోమాటో కాబోలు రెండోగుమ్మం యెక్కాను.

ఇబ్బందీ లేదు, బాధా లేదు; గాని నాకది చాలా యెబ్బెట్టుగా కనపడింది.

నేను చూసిన వూళ్లెన్ని గాని, మరోచోటా యీ పద్ధతి వుండినట్టు వినలేదు, నేను.

అంచేత, దీక్షపట్టి ప్రయత్నించాను, మూడు వారాలూ సంపాదించాను, మరి లాభం లేకపోయింది, నెల్లాళ్లు తిరిగినా.

"ఈ వూరి పద్ధతి మార్చేద్దామనా అబ్బాయీ?" అంటూ వొక యింటి ముసలమ్మ కస్సుమంది నామీద, తన కొడుకుతో వారం ప్రస్తావన చేశాటప్పటికి.

అన్నం పెట్టడం మాత్రం యెప్పుడూ మానలే దావిడ.

"నీకు భోజనం కుదరనప్పుడల్లా మా యింటికే వస్తూవుండు, మొగమాటపడకు" అనికూడా అందా అన్నపూర్ణతల్లి.

అలాంటి తల్లులుండిన వూళ్లో సరస్వతి తాండవం చెయ్యడం యేమి వింత, విద్యార్థులయి వచ్చినవాళ్ళు విద్వాంసులయి వెళ్ళడం యేమి అబ్బరం?

నే నక్కడ వుండగా ఆ యేడు విజయదశమి వచ్చింది.

మా యింటో సరస్వతీ పూజలున్నాయి; గాని గురువుగారి సెలవు దొరకలేదు.

ఆ పండుగుల్లో, వేదం చదువుకున్నవారికి సన్మానం జరిగేది యేలూరిలో, ఆ రోజుల్లో.

కానూరు అగ్రహారంనుంచి యేలూరు వెళ్ళడం అంటే, రెయిలుమీదా కాదు, పడవమీదా కాదు, నడిచి నడిచి.

అవధానులవా రెందరు వచ్చినా, అణా, బేడా, పావలా, పక్కతుగా అర్ధా – కోటికొకచోట రూపాయీ యిచ్చేవారుంటారు చాలా వూళ్లలో, వార్షికంగా.

అవి వసూలు చేసుకుంటూ నడిచి భోజనాల వేళ కొక వూరు చేరుకుంటూ వుండడం అవధానులవారి పద్ధతి.

వారం దినాల కేలూరు చేరుకుని, యేలూరిలో అయిదారు రోజులుండి, మరో వారాని కిల్లు చేరుకోడం కానూరు అగ్రహారం అవధానులవారి ఆచారం.

ప్రతీవారూ వొక్కొక్క శిష్యుణ్ణే వెంటబెట్టుకుని వెడతారు, గురువులు.

ఊరు తగిలిందా, శిష్యుడికి సంత వుండదు, గురువుగారికి అర్ఘనే గాని.

వేదం పూర్తి కావచ్చిన శిష్యులుంటే, వారికీ యిప్పిస్తూ వుంటారు తమతో పాటు గురువులు.

పుచ్చుకోకపోతే దాతలదాకా అక్కర్లేదు, గురువులే కూకలేస్తారు – "బొడ్డున మాణిక్యం కట్టుకుని పుట్టుకు వచ్చావా, మహా?" అని.

తాడేపల్లిగూడెంలో మా గురువుగారు నన్నే అన్నమాట యిది.

ఆ ప్రయాణంలో నాకు పది పన్నెండు రూపాయలకు పైగా దొరికాయి; ఖర్చు మాత్రం అణానరో బేడో తగిలింది, కాలవలు తగిలినప్పుడు బల్లకట్టు దాటడానికి.

నాకు వేదపాఠం ప్రారంభంలోనే వుండినా, ప్రశ్నలు చెప్పడంలో గట్టివాణ్ణని చెప్పి యిప్పించేవారు నాకు, గురువుగారు.

పోతునూరిలో అని జ్ఞాపకం, గురువుగారి మాటమీద వొకాయన నాచేత ప్రశ్న చెప్పించుకుని, గురువుగారికి మామూలుగా బేడమాత్రమే యిచ్చి, నాకొక రూపాయ ఇచ్చారు, ఆదరించి.

అవధానులవా రందరూ మొగమొగాలు చూసుకున్నా, రది చూసి.

ఒకాయన "గురువుగారి కిచ్చెయ్యి" అన్నారు. జంకుతూ నేనివ్వబోయాను; కాని "తప్పుతప్పు" అంటూ నన్ను నిషేధించి ఆయన్ని మందలించారు, గురువుగారు.

ఏలూరిలో అయిదారు రోజు లుండినాము.

రెండువందల దాకా వచ్చా రవధానులవారు.

ఆ అయిదారు రోజులూ వేదఘోషతో ముఖరితం అయిపోయింది, ఏలూరు.

దాత కనబడితే – అథవా యెంతో కొంత యివ్వగలవాడని తోచిన మనిషి తటస్థపడితే, వేదమంత్రా లందుకుంటారు అవధానులవారు, మరి మాటా మంతీ లేకుండా.

కొందరు చేత్తో లేదంటారు, కొందరు నోటితోనే లేదంటారు, ప్రయాణాని కంతటికీ వొక రిద్దరయినా యీసడించేవారూ తగులుతారు.

దాతల్లో నయినా, వొకరో యిద్దరో వస్తే, యెంతో కొంత యివ్వగలవారూ, యిచ్చేవారున్నూ వుంటారు; గాని వేదం వల్లించినవారు గుంపులు గుంపులుగా వెడతారేగాని యెవరికి వారుగా వెళ్ళరు.

యిది యిచ్చేవారికీ కొందరి కిబ్బంది కలిగిస్తుంది, భోజనాల విషయంలో అవధానులవారి కీ చిక్కులే కలిగిస్తుంది, అయినా వా రా పద్ధతి మానరు.

మరో వైదికవిద్య నేర్చినవా రెవరూ అలా చెయ్యరు.

అణా బేడా చొప్పున అర్జన యేమిటనీ బాధపడరు అవధానులు; ఆమాత్రం అయినా యిచ్చేవా రుండినంతకాలమూ పదేళ్ళపాటు నిద్రాహారాలు మానుకుని వేదం వల్లిస్తారు గాని.

వేదం అంటే చెయ్యెత్తి మొక్కుతారే గాని, ప్రజలయినా వేదం వల్లించినవారిని ఘనంగా సత్కరించరు.

వేదం వల్లించినవారినే కాదు, మనవాళ్లు, ఏ విద్యలు నేర్చినవాళ్ళనైనా అంతే, నలుగురితోనూ పాటు హాయిగా బతకాలనుకుంటే ఆ విద్యలు నేర్చినవారు మరో వృత్తి యేదయినా అవలంబించాలి, తప్పనిసరిగా.

మహా కవుల క్కూడా హైస్కూళ్ళలోనూ, కాలేజీల్లోనూ మగ్గిపోతే తప్ప మరి గతి లేదు గదా? మనవారి విద్యాతృష్ణకూ, విద్యాగౌరవానికీ, విద్యాపోషణకూ మరేమి నిదర్శనం చూపించాలి?

## 41

ఏలూరిలో గొప్ప దృశ్యం వొకటి కళ్ళబడింది, నాకు.

అది యిప్పటికీ జ్ఞాపకం వస్తూనూ వుంటుంది, కళ్ళు చెమ్మగిల్లి కంఠమున్నూ గద్గదికం అవుతూనూ వుంటుంది.

ఎంత ఆశ వుండినా పరాయతం నేను సాధించుకోలేకపోయాను, సిగ్గులచేటే యిది, అయినా, అపరాయతం చెప్పకోడానికి పూనుకోడంవల్లనే నాకా దృశ్యం చూడ్డం జతపడింది.

ఏలూరిలో, వేదం నేర్చినవారిని భక్త్యావేశంతో ఆదరించే ఉదారహృదయు లొకరుండినా రప్పుడు.

ఏటా అవధానుల కందరికీ వొక్కొక్క రూపాయ చొప్పున ఇచ్చేవారుట ఆయన.

ఇల్లు తెలిసివుండినదే కనక, మా గురువుగారి నాయకత్వాన డెబ్భయి యెనభైమంది అవధానులు బయలుదేరారు, శిష్యులతోనూ, నిశ్చయబుద్ధితోనూ.

కాని, అప్పు డా యింటో యెవరో వుండినారు.

వారు "పంతులుగారు అదిగో ఆ దొడ్లో వున్నా"రని చెప్పారు, గుమ్మం యెక్కుతూ వుండగానే.

బిలబిల్లాడుతూ అవధాను లందరూ ఆ దొడ్లో ప్రవేశించారు.

విశాలమైనదే దొడ్డి, పాక మాత్రం చిన్నది వొకటుంది, అందులో.

కూలీనాలీ చేసుకునే బీదలు మాత్రమే నివసించే పాక వంటిది, ఆ పాక.

పాక బయట, కటికినేలమీద కూచునివున్నారు పంతులుగారు, ఔదార్యం మూర్తీభవించినట్టు.

చూసీచూడ్డంతోనే, వర్షించివర్షించి విశ్రమిస్తున్న మేఘంలాగా, మండిమండి నివురుగప్పిన నిప్పులాగా తోచారు మాకు, పంతులుగారు.

పంతులవారున్నూ, చాతకపక్షుల్లా వస్తున్న అవధానులవారిని చూసీచూడ్డంతోనే, కూచున్నవారు కూచున్నట్లుగానే సాష్టాంగపడి లేచి నుంచున్నారు, దోసిలి వొగ్గి.

వడిగా సమీపిస్తున్నవారల్లా అవధానులవారున్నూ మంత్రించినట్టు నిలిచిపోయారు నాలు గ్గజాల్లో, పంతులుగారి వాలకం గుర్తించి నిర్విణ్ణు లయి.

ఉండుండి, అప్పటికి కంఠం స్వాధీనమయింది కాబోలు, "ఏమే! వేదమూర్తులు దయచేశారు, వచ్చి సేవించుకో" అన్నారు పంతులుగారు, గ్రీవాభంగాభిరామంగా పాకలోకి చూస్తూ, గద్గదికతో.

వెంటనే, ముగ్గుబుట్టవంటి తలతో, మెడలో సూత్రం మాత్రమే వుండిన యిల్లాలు చక్కా వచ్చింది, వొక చీరమడత పట్టుకుని.

చాకలి వుతికిన బట్ట కాదది, స్పష్టంగా తెలుస్తూనే వుంది – ఆ యిల్లాలే వుతుక్కునీ, ఆరవేసుకునీ, మడతపెట్టుకునీ వుండినట్టు, ఆ చీర.

వెంటనే ఆ దంపతులు ఆ చీర విప్పి, పరిచి "దయచెయ్యండి దయచెయ్యండి" అని అవధానులవారిని ఆహ్వానిస్తూ, దోసిలి వొగ్గి పక్కపక్కగా మోకరించి నిలిచారు.

కొయ్య లయిపోయాం మేమందరమూ.

అవధానులవారిలో చాలామందికి కళ్ళు చెమ్మగిల్లాయి, గుండెలు పగిలి.

ఇప్పుడూ నా కళ్లు చెమ్మగిల్లుతున్నాయి, అప్పుడు నాకంఠం వొణికేపోయింది, దుఃఖంతో.

చూసిచూసి, అందరూ వెనక్కి మళ్ళా రవధానులు తలలు వంచుకుని; కాని "ఆగండి" అంటూ మా గురువుగారు ఉరిమారు, ముందు తాము ఆగిపోయి.

"ముందు జన్మలో పంతులుగారు దేవేంద్రవైభవం అనుభవించాలి, ఆశీర్వదించం డయ్యా" అంటూ పనస కూడా అందుకున్నారు.

ఒక్కమాటుగా యెనభై శంఖా లురిమాయి.

వేదమంత్రస్మరణతోనూ ఉచ్చారణతోనూ ప్రాకృత వాతావరణం దాటిపోయారు, అవధానులు అందరూ.

అది కావడంతోనే "సౌధసం అందుకో శాస్త్రీ" అని ఆజ్ఞాపించారు మా గురువుగారు నన్ను.

నే నందుకున్నాను.

మళ్ళీ యెనభై వీణలు పలికాయి, వొక్కమాటుగా.

సామగానంతో ఆకాశం ముఖరితం అయింది.

అంతే.

అందరమూ బయలుదేరాము, తృప్త హృదయాలతో.

మే మందరమూ కనబడ్డంతసేపూ దోసిళ్లు వొగ్గి, అలాగ మోకరించే వుండిపోయారు, ఆ రాజర్షి దంపతులు.

## 42

ఒకనాడు – అయిదారు గడియల పొద్దువేళ – అగ్రహారం యువకు లేడెనమండుగురూ, విద్యార్థులం నలుగురైదుగురమూ యథాపూర్వకంగా గోదావరికి వెళ్ళాం.

కత్తిరివొడ్డు దిగగానే వొక పాయ.

రమారమీ ఫర్లాంగున్నర వెడల్పున వుం దది.

వేసవిలో కూడా యేనుగీత నీరుంటుంది, ఆ పాయలో.

గాలి రేగినప్పుడు, ఆ పాయలో, గజం యెత్తున యెగిరి విరిగి పడతాయి, కెరటాలు.

మేము వెళ్ళాటప్పటికి పైరగాలి తిరిగి వుండడంవల్ల తరంగ ఘూర్ణితం అయి వుండిం దది.

వెళ్ళినవాళ్ళం అందరమూ రేవులో నీటి దగ్గిరగా కూచున్నాం, వొక వారగా.

కెరటా లెగిరి కాళ్ళమీదా, తరంగ శీకరా లెగిరి వొంటిమీదా పడుతున్నాయి, యెడతెరిపి లేకుండా.

ఏ మాటమీద వచ్చిందో జ్ఞాపకం లేదు, అందరమూ ఆ పాయ దాటి అవతలికి వెళ్లా లనుకున్నాం.

"ఇద్దరినుంచి అద్దరికి వెళ్లాలి. మళ్ళీ అద్దరినుంచి యిద్దరికిన్నీ వచ్చెయ్యాలి. వెళ్ళాటప్పుడూ వచ్చేటప్పుడూ కూడా యెవరు ముం దుంటారో వారికి మూడు రూపాయలు బహుమానం. అది తక్కినవా ళ్ళందరూ యిచ్చుకోవాలి. ఇందు కిష్టపడేవా ళ్లెవరో లేవండోహోయ్" అంటూ లేచి, వూరి యువకు డొకడు నడుము బిగించాడు.

అందరూ వుద్రిక్తు లయినారు.

నాకూ పుట్టింది, కసి.

"సంయే" అంటే "సంయే" అనుకుని యెగిసిపడ్డాం.

ఉరికాం, బారలు వేశాం.

చేతికి యిసక తగిలేదాకా నాకు వొళ్లు తెలియలేదు.

వగర్చుకుంటూ నుంచుని వెనక్కి తిరిగి చూడగా, పందెం వేసిన యువకుడు నాలుగ్గజాల్లో వున్నాడు.

ఇంకొక డంతకంటేనూ, మరొకడు వాడికంటేనూ వెనక వున్నారు.

ఉరకడం అందరమూ వురికాం; గాని తక్కినవాళ్లు, రేవులోనే నీటిలో కూచుని కొందరూ నుంచుని కొందరూ కనపడ్డారు.

మేము ముగ్గురమూ అవతలి వొడ్డు చేరుకోడం చూసి, చప్పట్లు మాత్రం కొట్టారు వాళ్ళు, ప్రేక్షకు ల్లాగ.

వచ్చినవాళ్ళం యిసకతిప్పమీద పడుకున్నాం, పావుగంటసేపు.

"సంయే" అంటే "సంయే" అనుకున్నాం, మళ్ళీ.

ఊగివూగి వురికాం.

నేను మళ్ళీ వొళ్ళు మరిచిపోయాను.

కొంతసేపటికి, రేవులో వుండినవా ళ్ళందరూ గుండెలలోతుకి వచ్చి నన్ను పట్టుకున్నారు.

వెనక్కి చూడగా, తక్కిన వారిలో వొకడు మెల్లిగా బారలు వేసుకుంటూ వస్తున్నాడు, వగర్చుకుంటూ.

వెల్లకితలా పడుకుని కెరటాల వూపుతో వొడ్డుకి తేలుకుంటూ వస్తున్నా డొకడు.

అందరమూ సాయంపట్టాం, వొడ్డుకతణ్ణి.

ఆ రాత్రి భోజనం చేసి బసకి వచ్చాటప్పటికే మూడు రూపాయలూ నా చేతికి వచ్చాయి గాని; చేసిన సాహసం తలుచుకుని నేను చాలా యిదయిపోయాను.

రాత్రి మూడో జామునగాని నాకు నిద్రపట్టలేదు.

ఇది తెలిస్తే గురువుగా రేమంటారో అని నాలు గయిదు రోజులు బెదురుగానే వున్నాను; గాని యెవరికీ తెలిసినట్టే లేకపోయింది.

ఈ సాహసాని క్కారణం వేట్లపాలెం చదువు.

గుమ్మంలోనే పడవల కాలవ, అక్కడ.

స్నానానికని వెళ్లి చామర్లకోట కాలవలో గంటల కొద్దీ యీతాలాడ్డం అక్కడ బాగా అలవా టయింది, నాకు.

ఒడ్డునుంచి వురకడం, రేవు దోనెమీదినుంచి వురకడం, యీదుకుంటూ వెళ్ళి పడవ అందుకుని చుక్కానిమీదుగా యెక్కి వురకడం, మునిగి చాలా దూరం వెళ్ళడం, యెదరికీదడం, సమరేఖ తప్పకుండా యివతలినుంచి అవతలికీ అవతలినుంచి యివతలికీ యీదడం, వొక చేత్తో యీదుతూ యేదయినా వస్తువు రెండోచేత్తో అవతలికీ యివతలికీ చేర్చడం, వెల్లకితలా పడుకుని చేతులూ కాళ్ళూ కదపకుండా ప్రవాహం తీసుకుపోయినట్టల్లా వెళ్ళడం, మధ్యకి వెళ్ళి మునిగి నుంచుని చెయ్యెత్తి కాలవ లోతు చూపించడం, మునిగివెళ్ళి సంధ్యావందనం చేసుకుంటూ కాలవలో నుంచునివుండినవాళ్ళ కాళ్లు పట్టుకు లాగడం – ఇలాగ రకరకాలుగా యీతా లాడేవా ణ్ణక్కడ.

గోదావరిలో గంటలకొద్దీ స్నానం చెయ్యడం, యీదడం, యిసక తిప్పలమీద కూచోడం, నడవడం, పరిగెత్తడం, దొర్లడం – ఇలాంటి సరదాలన్నీ కామూరు అగ్రహారంలో నిరవశేషంగా తీర్చుకున్నా న్నేను.

విరగబడి వుత్తుంగతరంగాలు కాళ్ళమీద పడుతూ వుంటే, దుబ్బుల అంచుల్లో కూచుని వుండి నే నెన్నిమాట్లు పరవశుణ్ణయి వుండిపోయానో లెక్కలేదు.

ఇంతకీ, –

ఇతర సంపర్కాలన్నీ తరంగశీకరాలతో కడిగేసుకుని, ఉరుకులతోనూ పరుగుల తోనూ వచ్చి మీద పడి, అర్ధాంగాలతో పెనవేసుకునే పిల్లగాలి సుఖం గోదావరి యిసక తెప్పలమీద దొరికినంతగా మరెక్కడ దొరుకుతుందీ మన తెనుగుదేశంలో?

నిజమే కాని, యెంద రుపయోగించుకుంటున్నారూ, మన నదీతీరాలూ, నదీజలాలూ, నదుల యిసకతిప్పలూ సరిగా?

భూముల కిచ్చే విలవ, మనలో జీవనదుల కయినా యెవ రిస్తున్నారూ?

దమ్మిడీ ఖర్చు లేకుండా, విలాలంగా విహరించడానికి యిసక తిప్పలే వాడుకోలేని మనవాళ్ళు నౌకావిహారా లేమి ప్రారంభిస్తారూ?

స్వరాజ్యం వచ్చిందంటే, యీ ప్రజలే కదా ప్రభుత్వం నడిపేవారు, ఇక్కడ లేనిది అక్కడికి వెళ్ళాక అమాంతంగా వుద్బుద్ధం అయిపోతుందా సమ్యగ్బోధ వీరికి?

ఈ సంగతులూ తెలియవు. యీ భావాలూ యెరగను, యీ ఆవేదనా లేదు నా కప్పుడు; కాని యేమాత్రం వీలయినా యిసకతిప్పలమీదికి వెళ్ళకుండా వుండలేకపోయేవాణ్ణి అగ్రహారంలో, నేను.

ఆ యిసక తిప్పలమీద విహరిస్తూ వుంటే నా మన స్సెంతో ఉల్లాసభరితం అయిపోయేది.

ఎన్నో భావాలు పుట్టేవి.

ఎన్నో కల్పనలు తోచేవి.

ఎన్నో సంకల్పాలు కలిగేవి.

ఏమిటేమిటో – ఎంతెంతో అనుకునేవాణ్ణి.

ఒకనాడు, దానంతట అదే వొక శ్లోకం వచ్చేసింది:

శ్లో॥ గోదావరీ సైకత వేదికాసు
సమీరణోజ్జృంభితవీచికాసు,
అస్తోక్మన్మఖాదిత్యగభస్తికాసు
వినా విహారో దయితాం వృథైవ – అని.

అయితే, –

అగ్రహారంలో నేనిలా హాయిగా వుండగా, మా నాయనగారి దగ్గిరనుంచి నాకో కార్డు వచ్చింది.

"పంచాంగం చెయ్యాలి, వెంటనే యింటికి రా" అని రాశారు, వారు.

జ్యోతిషం ప్రధానం మా వాళ్లకు, తక్కిన విద్యలన్నీ విజ్ఞతకు మాత్రమే.

ఇది తెలుసుకనక, ఆ కార్డు చూసి నేను బాధపడ్డాను.

అయినా, చేసేది లేక – యీ సంగతి గురువుగారికి చెప్పి, మళ్లీ వస్తానని సెలవు పుచ్చుకుని, కాళ్లీడ్చుకుంటూ బయలుదేరాను.

## 43

యజుర్వేదంలో బ్రాహ్మణభాగం పూర్తిచేసుకుంటానని వెళ్ళి పంచమవేదంలో నన్నయభాగం పూర్తిచేసుకువచ్చా న్నేను, కానూరు అగ్రహారంలో.

కానయితే, మా వాళ్ళ కీ సంగతి స్పష్టంగా తెలియదు కాని, అగ్రహారంలో యేడెనిమిది మాసా లుండినా, మొదటి గుంటు అయిదు పన్నాలు మాత్రమే కంఠతా వచ్చి వుండడమూ, రెండో గుంటు రువ్వించడం మాత్రమే జరిగివుండడమూ గుర్తించి, జరిగింది వూహించుకుని చాలా ఆగ్రహపడ్డారు, మా నాయనగారు.

దాంతో, పంచాంగరచనలో కట్టిపడేశారు నన్ను.

పొద్దు పొడిచి చద్దన్నం తిన్నది మొదలు పొద్దుగూకుతోందనే దాకా వూపిరి తీసుకోడానిక్కూడా నా కవకాశం లేకుండా చెయ్యాలని మా చిన్నన్నగారు దీక్ష పట్టారు.

పంచాంగరచనతో యిది ఆగలేదు.

రాత్రి భోజనం కాగానే మా నాయనగారు దర్శపూర్ణమాసాలు సంత చెప్పేవారు.

లేకపోతే, పరాయతం రెండోగుంటు వల్లె వేసుకోమనేవారు, తమకు వినపడేలాగ.

అదీ కాకపోతే, స్మార్తమో ఔద్గాత్రమో యేకరువు పెట్టుకోమనేవారు.

ఏ కారణం వల్లనైనా వా రూరుకుంటే "అమరం పుచ్చుకోవేం?" అంటూ గదిమేవారు, మా చిన్నన్నగారు.

వెళ్ళివెళ్ళి యిది, యెలా గయినా నన్ను లొంగతియ్యాలని మావాళ్ళకీ యేమయినా మనం లొంగకూడదని నాకూ పట్టుదలగా పరిణమించింది.

రెండు మాసాలపా టిలా సంకుల సమరం జరిగిపోయింది ఆ సందర్భాన, అవ్యాహతంగా.

నిజంగా, ఆ రెండు మాసాలూ నా క్కతిననరకంతోనే లెక్క.

కానూరు అగ్రహారంలో వుండినంతకాలమూ అతిస్వేచ్ఛ అనుభవించి వుండినా నేమో, అది నాకు మరీ దుర్భరం అయిపోయింది.

వేరుపడ్డం అయేపోయింది కనక, మా పెద్దన్నగారి లాగే నేనూ యిల్లు విడిచి సంసారం నిర్వహించుకోగలిగితే నాకీ బాధ లేకపోవును, నిజమే గాని; సారస్వత కృషితో బదుకుదామంటే, యీ విశాలాంధ్ర దేశాన మహామహావాళ్ళకిన్నీ దిక్కూ దివాణమూ లేకుండా వుంది గదా, యేవిధంగానూ రెక్కలు వచ్చి వుండని నే నేమిటీ చెయ్యడం, అప్పుడు?

ఏ వర్తకు డయినా చేరదీసి వుండును, అప్పటికి ట్రెయినింగు నిర్బంధం లేదు కనక ఎలిమెంటరీస్కూల్లో వుపాధ్యాయుడుగానైనా బతుకుదును పోనీ అంటే, మరి, ప్రయిమరీ అయినా కానివ్వలేదు గదా మావాళ్ళు?

ఈ దిక్కుమాలిన స్థితి చూసుకుంటే "ఛీ, ఎందుకు వచ్చిన బతుకూ?" అనిపించేది, వొక్కొక్కనాడు.

కన్నీరు బొటబొట కారిపోయేది, వొక్కొక్కనాడు.

కళ్ళు పొడుచుకున్నా, వొక్కొక్కనాడు, నిద్ర వచ్చేది కాదు, గతి తోచక.

అయితే, ఆ స్థితిలోకూడా రచనా వ్యగ్రత కలుగుతూనే వుండేది నాకు, తరుచు.

భంగపడిన్నీ పోయేది.

కాగా, దీంతో, దినాలు గడిచిన కొద్దీ యీ నిర్బంధంతో నాకు కసి పుట్టుకువచ్చింది.

పెరిగిపెరిగి, చివరికి, వైదికవిద్య లన్నిటిమీదా ప్రబల ద్వేషంగా పరిణమించిందది.

ఈ కసి, నాకు, తెనుగు సాహిత్యంమీద అభిరుచికి తోడు అభినివేశమున్నూ కలిగించింది.

తెనుగు రచనమీద, ఆసక్తితో పాటు ఆవేదన కూడా పెంపు చేసేసింది.

"అయ్యో, దినాలు గడిచిపోతున్నాయి, గ్రంథాలు రచించి గుట్టలు పెట్టడం యెప్పుడూ?" అంటూ తహతహలాడించేసేది, నన్నది.

ఈ స్థితిలో, రాత్రి పదిగంట లయాక మావాళ్ళ నిద్రతో నాకు విముక్తి.

అప్పుడూ పడకగదిలో ప్రవేశం.

అయితే, గాఢనిద్రలో వుండేది మా సీత, అప్పటికి.

పొంగిపోయేవాణ్ణి నే నందుకు.

వెంటనే బుడ్డిదీపం పట్టుకుని సందుకా పెట్టె దగ్గిర కూచునేవాణ్ణి.

## 44

ఆ పెట్టె అంటే, యిప్పటికీ నాకు మిక్కిలి ప్రీతి.

ఇంతవరకూ నా గ్రంథాలలో చాలాభాగం ఆ పెట్టెమీద పెట్టుకునే రాశాను.

వినతగ్గదే, ఆ పెట్టెకు పూర్వచరిత్ర కొంత వుంది.

రమారమీ యెనభైయేళ్ళనాటి చరిత్ర అది.

ఆ పద్ధతి యిప్పుడుందో లేదో గాని, ఆ రోజుల్లో, మునికొడవలి ప్రాంతాన, గోదావరి వరదలు వచ్చినప్పుడు బ్రాహ్మణ యువకులున్నూ తెప్పలమీద వెళ్ళి ప్రవాహపతితమై కొట్టుకుపోయే కలప తెచ్చుకునేవారు.

ఆ కలపతో, వంటచెరుకుగా మాత్రమే వుపయోగపడే క్షుద్రజాతి మొదలు, టేకు దూలాల దాకా వుంటాయి సమృద్ధిగా, యిప్పటికీ.

ఒకనాడు, మా నాయనగారికి పెద్ద టేకు తుంగొకటి దొరికింది.

ఊరందరూ సంతోషపడ్డారు; గాని కరణం మాత్రం అసూయపడ్డా డదిచూసి.

ఇది తగదని సన్నిహితు లెంతచెప్పినా తుండు సంగతి తాలూకా ఆఫీసుకి రాసేశా డాయన.

కొద్ది దినాల్లో మామూలుగానే తహసీలుదా రావూరు రాగా, మళ్ళీ గట్టిగా "విన్నవించుకున్నా"డాయనికి.

"సిద్ధాంతిగారి చిన్నబ్బాయికి వరకం వేయించేస్తా చూసుకోం"డంటూ, వూ రంతా అప్పటికే ప్రచారం చేసి వుండినా డాయన.

తహసీలుదారు మా యింటికి బయలుదేరగా, వూరందరూ తహసీలుదారు వెంటపడ్డారు.

కరణం పొంగిపోతున్నాడు, లోపల్లోపల.

మా తాతగారూ, మా నాయనగారూ, మా పెత్తండ్రిగారూ పంచాంగం చేసుకుంటున్నా రప్పటికి అరుగుమీద కూచుని, ఇదేమీ యెరగరు.

ఆ జనాన్ని చూసి "యేమిటిదీ?" అని వారు వింతపడుతూనే వుండగా తహసీలుదారు వెళ్ళి మా తాతగారి పాదాలు పట్టుకుని కళ్ళ కద్దుకున్నాడు.

కథ అడ్డం తిరిగింది.

పొంగిపోతున్న కరణం కుంగిపోయాడు, కుతకుతలాడిపోతున్న వూరివా రందరూ తేరుకున్నారు.

అప్పటికిన్నీ, తుండు ప్రస్తావన చేసివుంటే కొంతయినా సుఖపడును కరణం; కాని ప్రశ్న చెప్పించుకోసాగాడు తహసీలుదారు.

అప్పటికి సంగతి గ్రహించి, మా నాయనగారినే చూడమన్నారు మా తాతగారు, ప్రశ్న.

విద్వాంసులు, తమ కుమాళ్ళ విద్వత్త ప్రకటించేపద్ధతిన్నీ యిది.

మా నాయనగారున్నూ మా అన్నదమ్ములను ముగ్గురినీ యిలాగే ప్రకటపరిచారు, పొలమూరు ప్రాంతాల.

ఆవేళ, అందరిలోనూ కరణాన్ని గట్టిగా మందలించి "మీ యిష్టం వచ్చినట్టు వాడుకోండది" అని మా నాయనగారికి చెప్పి, మళ్ళీ మా తాతగారి పాదాలు స్పృశించి వెళ్ళిపోయాడు తహసీలుదారుగారు.

మా తాతగా రంటే ఎన్నాళ్ళనుంచో పరమభక్తి ఆయనకు.

పెద్దయింటివా డాయన, పెద్దవాడున్నూ.

నాయుళ్ళు వారు.

అప్పటి రాజమండ్రీ సబ్ కలెక్టరున్నూ మా తాతగారికి భక్తుడు.

ఆయన వివాహంలోనే మా తాతగారితో నాయడుగారికి పరిచయం.
దానిక్కారణం, ఆ వివాహంలో వొక వింత సంఘటన.
కలెక్టరుకి నడివయస్సున కళత్రవియోగం సంభవించింది.
మళ్ళీ వివాహం చేసుకోవలసివచ్చింది.
పెళ్ళి అయిదురోజులూ మా తాతగారికిన్నీ అక్కడ వుండవలసివచ్చింది.
పెళ్ళికొడుక్కి "నేను కలెక్టరు"నన్న భావమూ, ఆడపెళ్ళివారికి – ముఖ్యంగా స్త్రీలకు "పెళ్ళికొడుకే" అన్న భావమూను.
రెండోనాటి ఉదయం, వూరేగింపయిన తరవాత, పసుపుల నలుగులకు పిలిచారు, పెళ్ళికొడుకుని ఆడపెళ్ళివారి యింటి స్త్రీలు.
కలెక్ట రందు కంగీకరించలేకపోయాడు – "కుర్రపిల్లవాణ్ణా నేను, స్త్రీలచేత నలుగులు పెట్టించుకోడానికి?" అంటూ అభిమానపడి.
"అగ్నిహోత్రాలు కానిచ్చుకుని విడిదికి వెళ్ళిపోదాం, రండి" అంటూ పురోహితుణ్ణి తొందరపెట్టడం కూడా ప్రారంభించా డాయన, యీ బెడద తప్పించుకోడానికి.
కాని, పేరంటాళ్ళు మాత్రం ససేమిరా అన్నారు.
ఇప్పటి వివాహాలా మరి అవి, యిప్పటి చిత్తవృత్తులా అవి?
వైదికతంతు ఎంత ప్రధానమో, వేడుకలూ అంత ప్రధానమే అప్పటివారికి.
కాక:–
పెళ్ళికూతురి కెప్పుడు తీరతాయీ, ఆ ముచ్చట్లు?
అయినా, కలెక్టరు లొంగలేదు.
పెళ్ళిపెద్దలు వెళ్లి మా తాతగారిని ప్రార్థించారు "ఈ చిక్కు తొలగించవలసిం"దని, స్థితిగతులన్నీ చెప్పి.
ఎలాంటివా రయినా, పండితులంటే వినయవిధేయతలు కనపరిచేవారు, అప్పుడు, స్వధర్మతత్పరులు కనక.
మా తాతగారున్నూ యీ దిలాసాతోనే బయలుదేరారు ఆడపెళ్ళివారి యింటికి, ఉపాయం ఆలోచిస్తూ.
పెద్దలందరూ చుట్టూ మూగారు.
పండిత సంప్రదాయం అనుసరించి, కొంతసేపు ప్రస్తావన సాగించారు మా తాతగారు, ముందు.
"ఏమీ, ఇంకా వూరేగింపు కాలేదా?" అనడిగారు పెళ్ళికొడుకుని, ఏమీ యెరగనట్టు, తరవాత.
దానిమీద ఆయనే చెప్పాడు, జరిగిం దంతా.
చెప్పిచెప్పి "నేను కుర్రవాణ్ణి కానాయె, హోదాలో వుంటినాయె, ఉద్యోగస్థులున్నూ అనేకులు వచ్చి వున్నారు గదా, ఆడవాళ్ళచేత యెలాగ పసుపుల నలుగులు పెట్టించుకోనండీ" అనికూడా అడిగాడు.
"అయితే, విడిదికి వెళ్ళిపోదాం, లేవండి."
"అగ్నిహోత్రాలు కానిచ్చుకుని వెడదాం."
"మరి, స్నానం అయిందా?"

"దీక్ష గదా, నేను స్నానం చెయ్యవచ్చా?"

"అవునవును, నిజమే. దీక్ష కనక మీరు స్నానం చెయ్యగూడదు. స్నానం చెయ్యడానికి వీలులేదు గనుక, అగ్నిహోత్రాలు చేసుకోడానికి మీకు అధికారం లేదు."

చల్లచల్లగా మా తాతగారిలా అనేటప్పటికి తెల్లపోయాడు, కలెక్టరు.

"మరెలాగా?"

"ఎలాగంటే ఏమి చెయ్యగలమూ?"

"పోనీ, విశేషవిధు లేమీ లేవూ?"

"లేకేం?"

"ఏమిటవీ?"

"ఎన్నో లేవు, వొక్కటే – అది హరిద్రాస్నానం."

"అంటే?"

"హరిద్రాస్నానం అనేది సంస్కృతం మాట, దానికి తెనుగు పసుపుల నలుగులు."

"సెబాస్" అనుకున్నా రందరూ.

"అయిందా?" అన్నట్టు కోరచూపులు చూశారు, స్త్రీలు.

మళ్ళీ మాట్టాడకుండా లేచి, బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి, నీరసంగా పెళ్ళికూతురి పక్కన కూచుని, పుచ్చినట్టు చెయ్యి అందించాడు కలెక్టరు, స్త్రీలకు.

దాంతో, అక్కడ వుండిన పెద్దలందరూ మా తాతగారి యెడల విధేయు లయిపోయారు.

ఆ పెద్దలలో అధికారు లనేకులు.

ఆ అనేకుల్లో తహసీలుదా రొకడు.

ఆ తహసీలుదారే మా నాయనగారికి "మీ యిష్టం వచ్చినట్టు వాడుకోండది" అన్న అధికారి.

ఇలాగ గ్రామకరణం బాధ తప్పగా, ఆటేకుతుండు కోయించి అనేక గృహోపకరణాలు చేయించారు, మా నాయనగారు.

ఒక చెక్క మిగలగా, పనివాడే కోరి తయారుచేశాడా పెట్టె.

నేను కవిత్వం ప్రారంభించేటప్పటికి ఆ పెట్టె విడిచి, డస్కుబల్ల సంపాదించి దానిమీద రాసుకుంటున్నారు, మా నాయనగారు.

ఎప్పుడెప్పుడని చిన్నప్పణ్ణుంచీ యెదురు చూస్తున్న నేను, వెంటనే ఆ పెట్టె పుచ్చుకున్నాను.

అదే ఆ సందుకా పెట్టె.

ఎలా మరిచిపోయారో మా నాయనగారు, మా చిన్నన్నగారి సలహాతో నా రచన మాన్పించడానికి రకరకాల నిర్బంధాలు కలిపించారుగాని, ఆ పెట్టెను వూళ్ళాక్కోలేకపోయారు.

అయినా, నేను రచన మాన నను కోండి, విభాగాల సందర్భంలో కూడా ఆ పెట్టెకోసం యెవరూ తగువు పెట్టలేదు.

దాని వూసే యెత్తలేదు, ఎవరూ కూడా.

## 45

చెప్పవచ్చిం దేమిటంటే?

రాత్రి పది దాటాక - మా వాళ్ళందరూ నిద్రపోయాక పడక గదిలో ప్రవేశించి, బుడ్డిదీపం పెట్టుకుని, ఆ పెట్టెదగ్గిర కూచునేవాణ్ణి నేను.

ఆ కూచోడం కూచోడం, ఆ రెండు మాసాల్లోనూ ఆ నిశీధి వేళ రెండు పనులు పూర్తి చేశాన్నేను, నిశ్చలంగా.

ఒకటి - శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు పంతులుగారి చాటు ప్రబంధం "వారకాంత" పుచ్చుకుని క్షుణ్ణంగా చదవడం.

రెండు - అందులో కథ పుచ్చుకుని వచనంలో నాటకం రచించడం.

మా పెద్దన్నగారి గ్రంథ సంగ్రహంలోది ఆ చాటు ప్రబంధం.

భుజంగరావు పంతులుగారికి మా పెద్దన్నగారంటే మిక్కిలీ గౌరవం.

ఇప్పుడు తలుచుకుంటే, నవ్వూ వురకలు వేస్తుంది, సిగ్గూ ముంచుకువస్తుంది, నాకు.

"నాటకాంతం కవిత్వం" అన్నారు మన ఆలంకారికులు.

భాషలో ప్రావీణ్యం లేదు, సాహిత్యంలో పటిమ లేదు, భావనలో నైశిత్యం లేదు, రచనలోనున్నూ అనుభవం లేదు; వెనకా ముందూ చూసుకోకుండా "నాటకాద్యం కవిత్వం" అని సూత్రీకరించా, న్నేను.

గ్రంథాల గుట్టకి ఇలాగ ప్రారంభం జరిగించానే గాని ఛందస్సు లేశమున్నూ తెలియదు నాకు, అప్పటికి.

తెలుసుకోడానికి ప్రయత్నమూ లేదు.

ఆదిలోనే నా దృష్టి వచనరచనమీద పడ్డంవల్ల, తెలుసుకోవలసిన అగత్యమున్నూ లేకపోయింది, నాకు.

ఉంటే నష్టమే లేదు గాని కవిత్వానికి ఛందస్సు మిక్కిలీ అగత్యం కాదుగా?

అయినా, రోజులు గడిచిన కొద్దీ "మనకు ఛందస్సు తెలియక పోవడం యేమిటీ?" అన్న అభిమానం ప్రారంభం అయింది.

కార్డు వెల కానీ, కవరు వెల అర్ధణాను, అప్పుడు.

అదీ యిదీ కూడా యిప్పటి వాటికంటే చిన్నవిగా వుండేవి పరిమాణంలో.

వెంటనే వొక కార్డు రాసి మద్రాసునుంచి అప్పకవీయం తెప్పించాను, మా పెద్దన్నగారిని సలహా అడిగి.

ఆత్రంగా చూస్తును గదా, రామరామా, నాలుగో ఆశ్వాసం కీకారణ్యం.

దారి కనుక్కోలేకపోయాను.

అడుగున్నూ వెయ్యలేకపోయాను.

అయితే, నా దుడుకుతనమే గాని, కావలసినంతా సాహిత్యమే లేదుగదా, సొంతంగా చూసి వొక శాస్త్రం యేమి సాధించుకోగలుగుతానూ, అప్పట్లో నేను?

అంచేత, ఆ చిన్నతనంలోనే నాకు లక్షణం కంటే లక్ష్యం ప్రధానం అయింది.

గతిన్నీ అయిపోయింది.

అదే నన్నీ స్థితికి తెచ్చింది.

దాపరికం యెందుకూ?

గ్రంథాలు చదివే నేను భాష తెలుసుకున్నాను.

స్త్రీల నాశ్రయించిన్నీ నేర్చుకున్నా న్నేను తెనుగు భాష.

ప్రయోగవిజ్ఞానం కూడా స్త్రీలవల్లనే అలవడింది నాకు.

జరిగిందేమిటంటే?

మొత్తంమీద, అప్పటిదాకా, నేను చదువుకున్నది పద్యవాఙ్మయమూ, రచిస్తున్నది వచన వాఙ్మయమున్ను.

రెండింటికీ లంగ రందలేదు.

అందుకోసం, తప్పనిసరిగా, నేను జనుల సంభాషణలు వినవలసి వచ్చింది.

అందులోనూ స్త్రీల సంభాషణ వినవలసి వచ్చింది.

పురుషుల భాష అయినా, ఇప్పటిలా ఇంగ్లీషు మొదలైన పరభాషలతో సంకరం అయి, పలుకుబళ్లు లేనిది కాదప్పుడు.

అయినా, పురుషుల భాషలో కంటె, స్త్రీల భాషలో మాధుర్యమూ, హృదయాలను పట్టివేసే జాతీయతా కనపడింది నాకు.

వారి మాటల పొందికా, వారి హావభావ ప్రదర్శనచాతుర్యమూ తెనుగుభాషలో నాకు మాతృభిక్ష ప్రసాదించాయి.

ఈ విశేషం కనబడగానే స్త్రీల గోష్ఠి జరిగేచోట నేను పొంచి వుండడం ప్రారంభించాను.

అది నెల కిరవై రోజులు మా యింటోనే సమకూరేది.

ఏమంటే?

మా నాయనగారు, మధ్యాహ్నం భోజనం కాగానే, మహేంద్రవాడో రామవరమో వెళ్ళేవారు, నియతంగా.

భోజనాలయి, యిళ్ళు సర్దుకోడం కూడా అయాక, తటవర్తి సుబ్బమ్మ (భీమరాజుగారి భార్య) గారూ, మైలవరపు జోగమ్మగారూ, బుద్ధవరపు సీతమ్మగారూ, మా యింటికి వచ్చి మా అమ్మగారితో గోష్ఠి జరిపేవారు.

వారి దృష్టిలో, అదీ కాలక్షేపం కోసం లోకాభి రామాయణం విడెయ్యడం; కాని నా దృష్టిలో రసమహితమైన సాహిత్యగోష్ఠి.

ఆ నలుగురిలోనూ మళ్ళీ ధోరణి భేదించేది, స్పష్టంగా.

బుద్ధవరపు సీతమ్మగారు ఛలోక్తులు విసిరేవారు.

మైలవరపు జోగమ్మగారు శ్లేషలు కురిపించేవారు.

మా అమ్మగారు సామెతలూ పలుకుబళ్లూ విరజిమ్మేవారు.

తటవర్తి సుబ్బమ్మగారు నిండుకుండలాగ నిశ్చలంగా మాట్లాడేవారు.

నవరసాలూ చిప్పిలేవి ఆ గోష్ఠిలో.

సరస్వతి లాస్యం చేస్తున్నట్లుండేది, అప్పుడక్కడ.

కాళిదాసు నాలుకమీద బీజాక్షరాలు రాసిందిట కాళికాదేవి.

నా చెవిలో ఆ మాతృదేవతలు బీజాక్షరాలు కుమ్మరించారు.

ఇవాళ నేను రాస్తున్న భాష వా రనుగ్రహించినదాన్లో సహస్రాంశమయినా కాదు, యింతా చేస్తే.

ఇలాగ, నేను, వారే కాదు నలుగురు స్త్రీ లెక్కడ మాట్లాడుకుంటున్నా వింటూ వుండిపోయేవాణ్ణి.

అయితే రచన ప్రారంభించినప్పణ్ణుంచీ మాత్రమే కాదు నాకు, యీ అలవాటు.

నా చిన్నతనంలో, మా అమ్మగా రెవరి యింటి కయినా పేత్తనాలకు వెడితే, ఆమె చంకన మా చెల్లెలూ, చెయ్యి పట్టుకుని నేనూ సిద్ధం.

ఆ పసితనంలో కూడా, నాగస్వరం విన్న కోడెతాచులాగ వారి సంభాషణ వింటూ తెలియకుండానే పరవశుణ్ణయిపోయేవాణ్ణి, నేను.

అప్రయత్నంగా ప్రారంభం అయిన ఆ అలవాటూ, తెలియకుండానే అలవడిన ఆ పారవశ్యమూ రచన ప్రారంభించాటప్పటికి వరప్రసాదా లయినాయి, నాకు.

ఇక్కడ మరో సంగతి కూడా చెప్పాలి, అవశ్యమున్నూ.

బుద్ధవరపు సీతమ్మగారి యింటో కలుసుకునేవారు ఆ స్త్రీలు, అప్పుడప్పుడు.

దొడ్డిదారిని వచ్చి శ్రీ దాట్ల దివాకరరాజుగారి భార్య బుచ్చి వెంకయ్యమ్మ (?) గారున్నూ కలిసేవా రా గోష్ఠిలో.

పొడుగుకు తగిన నిండైన విగ్రహమూ, పాదాల మీద జీరాడుతూ చారల తాబొందూ, చేతులకు కంకణాలూ, పోచీలూ, మురుగులూ, చెవులకు జూకాలూ, కరిణి పువ్వులూ – వీటితో, క్షత్రియ సామాన్య స్త్రీగా కాదు – మహారాణీ లాగ కనబడేవా రామె, నాకు.

పెద్దాపురం రాజవంశానికి చెందిన కొంకుదురు శ్రీ వత్సవాయవారి ఆడబడుచు ఆమె.

ఆమె మాట కూడా రాణుల ధోరణిలోనే వుండేది.

వారి యేకపుత్రులు సూర్యనారాయణరాజుగారి కోసం వారి యింటికి వెళ్ళినప్పుడల్లా, వాత్సల్యం గుమ్మరిస్తూ నన్ను దగ్గిర కూచోబెట్టుకుని "అరగించండి బాబూ" అనేవా రామె, పూచుట్టరేకులు పళ్ళెంలో వుంచి.

ఇంతకీ, –

జాతీయమైన తెనుగు భాష కావాలంటే స్త్రీల దగ్గిరే నేర్చుకోవాలి; మర్యాద గల తెనుగుభాష కావా లంటే, మళ్ళీ, క్షత్రియ రమణుల దగ్గిరే నేర్చుకోవాలి, మరోదారి లేదు.

నాకు రాచమర్యాద లే మయినా తెలుసునంటే, అవి, ఆ చిన్నతనాన ఆ దివాకరరాజుగారి యింటో గ్రహించినవే.

రాజరాజు నాటకంలో, రత్నాంగి పాత్ర చిత్రించేటప్పుడు ఆ బుచ్చివెంకయ్యమ్మగారి మూర్తిమంతమే ప్రత్యక్షాదర్శం, నాకు.

## 46

ప్రయోగవైచిత్రీ, సంభాషణరీతులూ యిలాగ అవగాహన చేసుకుంటూ వచనం రాస్తూనే, భారత పద్యాల నడక అనుసరించి మధ్యమధ్య పద్యాలున్నూ కడుతూ వుండేవాణ్ణి.

ప్రాస సరిగా కుదిరితే కుదిరేది లేకపోతే లేదు, యతి మాత్రం కుదిరేదీ కాదు, అసలు తెలియనూ లేదు.

పైపెచ్చు,

ఒక్కొక్కప్పుడు, ఉత్పలమాలా చంపకమాలా కలిసిపోయేవి.

శార్దూలమూ మత్తేభమూ వొక్కొక్కప్పుడు కలపటం అయిపోయేవి.

అయినా, అవి చూసుకునే నేను ధన్యవాదాలు చెప్పుకునేవాణ్ణి; కాని యేదో తక్కువ అయినట్టూ, యేదో చేతకాకపోతున్నట్టూ మనస్సు పీకుతూనే వుండేది.

"మనకి పద్యాలెందుకూ?" అనిన్నీ అనిపించేది, అప్పుడప్పుడు.

రాత్రి ళ్ళిది యిలా జరుగుతూ వుండగా, పగలు, నేనూ మా చిన్నన్నగారూ కూచుంటూ పంచాంగంలో ఆ సంవత్సరం తిథులూ, గ్రహస్ఫుటాలూ, గ్రహప్రవేశాలూ పూర్తిచేశాం.

రోజు కయిదు తిథులతో ప్రారంభం అయిన గణితవేగం, పదిహేనుదాకా పెరిగింది, ఆ సంవత్సరం నాకు.

మా చిన్నన్నగారూ మా నాయనగారూ కూచుంటే ముప్ఫయి తిథులయేవి.

మా పెద్దన్నగారూ మా నాయనగారూ కూచుంటే మాత్రం రోజుకు డెబ్బయి తిథుల దాకా అయేవి.

ఆ రోజుల్లో, గణితవేగానికి పెద్దపూర్ణయ్య సిద్ధాంతిగారిది పెట్టింది పేరు.

వారి యేకపుత్రుడు వెంకట రమణబావదిన్నీ అసామాన్య వేగమే.

కర్ణాకర్ణిగా వినివుండిన పెద్దపూర్ణయ్యసిద్ధాంతిగారు, ఒకనాడు మా పెద్దన్నగారిని దగ్గిర కూచోబెట్టుకుని వొక పూటంతా తిథులు చేయించి చూసి "సెబాస్" అని వీపు తట్టి పంపించారు.

అంత వేగం వుండినందుకు, మా పెద్దన్నగారికి వొక్క అంకె అయినా తప్పు పడేదికాదు.

అలాంటి వడి లేదు; గాని మా చిన్నన్నగారి గణితంలో మరో విశేషం.

భాగహారం యిక రెండుమూడు అంకెల్లో వుందనగా, సుళువుగా లబ్ధం తేల్చి వేసేస్తా రాయన, చివరిదాకా చెయ్యనక్కరలేకుండా.

ఎప్పుడూ తప్పదది.

కాశీవెళ్ళి, శాస్త్రం అమూలాగ్రంగా చదువుకుని వచ్చాక, యీ చాతుర్యం మరీ యెక్కువయింది ఆయనకు.

నేనూ మా చిన్నన్నగారూ చేసింది చెయ్యగా, ఆ సంవత్సరం నేనూ మా నాయనగారూ ముహూర్తాలు స్థిరపరిచాం.

గ్రహణగణితంలో నేను, మా చిన్నన్నగారితో పాటు మా నాయనగారి వెనక వెనకనేవుంటూ వచ్చాను.

తక్కిన గ్రంథం అంతా మా నాయనగారూ మా చిన్నన్నగారూ పూర్తిచేశారు.

అంచేత, ఆ సమయాన "ఫలానా పని చెయ్యి" అని నిర్దేశించడానికే గాని, నన్ను కనిపెట్టుక్కూచోడానికి వారికిద్దరికీ గూడా వీలు లేకపోయింది.

వారు వీథి అరుగుమీద కూచుంటే నేను వాకిట్లోనూ, వారు వాకిట్లో కూచుంటే నేను అరుగుమీదా కూచునేవాణ్ణి.

పరాయతం వల్లించమని వారి ఆజ్ఞ; కాని పుస్తకం కింద పడేసి నేను పద్యాలు కట్టడం.

పద్యం పూర్తి కాగానే, చక్రవర్తి పదవి అబ్బినట్టు ఆనందం పట్టలేక, మా వాళ్ళమాట మరిచిపోయి, ఉత్సాహం కొద్దీ గట్టిగా చదివేవాణ్ణి విరుపులు చూసుకుంటూ, నేను.

అది మా వాళ్ళకి వినపడేది.

తాము భ్రాంతిపడ్డారే గాని, నేను కవిత్వం మానలేదని దాంతో వాళ్ళకి తెలిసిపోయేది.

మళ్ళీ మండిపడేవారు.

మళ్ళీ తిట్టిపోసేవారు.

మళ్ళీ కొట్టినంత పని చేసేవారు.

వైదికవిద్యల ఘనతా, కుటుంబ విశిష్టతా మళ్ళీమళ్ళీ యేకరువుపెట్టేవారు.

"కాదూ కూడదంటే, ఆ కవిత్వం సంస్కృతంలోనే దేవుళ్ళాడరాదా?" అంటూ రుంజుకునేవారు.

మా చిన్నన్నగారి మాటకేం, యిలాగ యేమన్నా లాభం లేకపోగా, విసిగిపోయి, నన్ను మందలించి నాచేత తెనుగుకవిత్వం మానిపించమని తటవర్తి వేంకటరాజుగారిని బతిమాలారు చివరికి, మా నాయనగారు.

## 47

తటవర్తి వేంకటరాజుగా రంటే యెవరో కాదు, మా నాయనగారిని పోలమూరిలో ప్రవేశపెట్టిన భీమరాజుగారి జ్యేష్ఠపుత్రులు.

ఇంకా వివరించా లంటే, మన అడవి బాపిరాజుగారి పెద్ద మామగారు.

ఇప్పు డాయన కైలాసవాసి.

అప్పు డాయనే తండ్రిగారి తరవాత గ్రామ మున్సబు.

బతికి వుండినంత కాలమూ మహా మంచివా రనిపించుకున్నా రాయన.

మాయా మర్మమూ యెరగరు.

అంచేత కోపం వస్తే ఆయనకు కోపమే, సంబరమున్నూ వస్తే సంబరమే.

దాపరికమే కాదు, కుత్రా యెరగ రాయన.

మా కుటుంబం అంటే ఆయనకెంతో ఆదరం.

ఒకనాడు నన్నాయన పొలం తీసుకువెళ్ళారు.

అప్పుడప్పు డున్నదే యిది.

చెరుకు గానుగుల రోజుల్లో తరుచున్నూ వుండేది.

కాగా, మామూలుగానే వెళ్ళాన్నేను, కులాసాగా మాట్లాడుతూ.

వెళ్ళివెళ్ళి వారి మామిడితోటలో కూచున్నాం మేము.

మాట్లాడుతూ మాట్లాడుతూనే "మహా తెలివయినవాడవు నువ్వు" అంటూ బాగా వుబ్బేశారు, నన్నాయన ముందు.

ఎందుకో అనుకుంటూ వుండగా, మా నాయనగారి కష్టసుఖాలు చెప్పి, గట్టిగా నన్ను మందలించారు తరవాత.

"వడ్డాది సుబ్బారాయుడుగారి కెందరు పెళ్ళాలో యెరుగుదువా? కవిత్వం చెయ్యడంవల్లనే అన్ని పెళ్ళిళ్ళు చేసుకోవలసివచ్చిం దాయన, తెలుసా?" అంటూ నిలవతీసి "కనక, కవిత్వం కట్టిపెట్టు, యిక" అంటూ ముక్తాయించారు చివరికి.

విన్నాను విన్నాను, నే నొక్కటే మాట చెప్పాను చివరికి దృఢంగా "కట్టిపెట్టను" అని.

చాలా ఆవేశంతో చెప్పాను.

"ఇంటో వుండడానికి వల్లకా దంటే యెక్కడికయినా పోతాను. కులవిద్యలు విడిచిపెడుతున్నాను కనక కుటుంబాస్తి కూడా విడిచిపెట్టెయ్యమంటే నిశ్చింతగా విడిచిపెట్టేస్తాను. మీరు 'పొలమూరు మళ్ళీ తిరిగి చూడవ'ద్దంటే జన్మలో చూడను. ప్రాణాలు విడిచిపెట్టమంటారా, ఆ మాట కచ్చితంగా చెప్పండి, డొంకతిరుగుళ్ళు చాలించి; అంతేగాని, కవిత్వం కట్టిపెట్టమన్నమాట కట్టిపెట్టండి నా దగ్గిర" అనేశాను, జంకూ కొంకూ లేకుండా.

ఉబ్బెత్తుగా లేచి నుంచున్నాను, ఇక మాటలతో పనిలేదన్నట్లు.

నా బాధ అంతా కనపరిచేశాను వారికి.

చకితు లయిపోయా రాయన.

తమ మాట కాదన్నందుకు – అంత ఖండితంగా యెదురు వాదం చేసినందుకు – నిష్ఠురాలున్నూ ఆడినందుకు మరొక రయితే చాలా కోప్పడివుందురు; కాని "కోప్పడకయ్యా!" అంటూ తామున్నూ లేచి, నా వీపు తట్టి బుజ్జగించారు నన్ను వేంకటరాజుగారు, ప్రసన్నంగా చూస్తూ.

"ఒకరు చెబితే వినే రకమా నీది? చిన్నప్పణ్ణుంచీ నువ్వు మా తమ్ముళ్లతో తిరుగుతున్నావు, నీ ప్రవృత్తి నాకు బాగా తెలుసు. నువ్వింకా తమ పెట్టుపోతల్లో వున్నావు కనక, మీ నాయనగారు నిన్నాజ్ఞ పెడతామని చూస్తున్నారు; కాని లాభం లేదు. నువ్వు మీ కుటుంబ సంప్రదాయంలో మార్పు తెస్తావు, తప్పదు. ఏ విద్య అయినా నీ కంటుతుంది, అయితే, నీ రుచులు వేరు, నీ చూపే వేరు" అనిన్నీ అన్నా రాయన.

ఆయన యిలా అనడంతోటే తెనుగుతనం నన్ను గుబ్బున పొదువుకున్న ట్టనిపించింది, నాకు.

తెనుగు సాహిత్యంమీది నా మమకారం మారాకు వేసింది.

తెనుగు రచన యెడల నాకు కొత్త ఆశలు రేకెత్తాయి.

కొత్త వుద్రేకం కలిగింది, దాంతో.

మావాళ్ళని "మీ లెక్కేమిటి?" అనడానికి నాకు కొంత ధైర్యసాహసా లంకురించాయి.

ఇలాంటి మహోల్లాసంతో నేనూ, మాటిమాటికీ ఛలోక్తులు విసిరే సహజోల్లాసంతో వేంకటరాజుగారూ ఆ మాటా యీ మాటా చెప్పకుంటూ వూళ్ళోకి వచ్చాటప్పటికి, మా అరుగుమీద మా నాయనగారూ కూచిమంచి సాంబయ్యగారూ కూచుని మాట్లాడుకుంటున్నారు.

## 48

కూచిమంచి సాంబయ్యగా రంటే, ఇప్పుడు రామచంద్రపురంలో లీడింగువకీ లయి వున్న శ్రీ బుద్ధవరపు మహాదేవుడుగారి జనక అన్న.

వారిది, పలివెల కాపురస్థలం, అసలు.

కోనసీమకు చెందినది పలివెల గ్రామం.

అయితే, మా పొలమూరికి దక్షిణంగా మైలున్నరలో వున్న రామవరం గ్రామంలో వుంటున్నారు, వా రప్పుడు.

మా నాయనగారు పొలమూరిలో స్థిరపడి సుఖపడడానికి ముఖ్యకారకులు – పొలమూరి మున్సబు తటవర్తి భీమరాజు గారూ, మహేంద్రవాడ పెద్దకాపు కర్రి సుబ్బారాయడు గారూ రామవరం కరణం బుద్ధవరపు లక్ష్మీనరసింహం గారున్నూ.

లక్ష్మీనరసింహంగారు, మంచి నడివయస్సున నిస్సంతుగా చనిపోగా, ఆయన భార్య శంకరమ్మగారు, తమ తమ్ములు మహాదేవుడుగారిని దత్తత చేసుకున్నారు.

మహాదేవుడుగారిది పెద్ద ఆస్తి కావడంవల్లా, చిన్నతనం కావడంవల్లా, వారి వ్యవహారాలన్నీ చక్కబెడుతూ వుండడానికే సాంబయ్యగారు రామవరంలో వుండేవారు.

సంస్కృతాంధ్రసాహిత్యాలు వారికి కులవిద్యలు.

వకీలువృత్తిలో తలమున్కలుగా వుండడంవల్ల కవి అనిపించుకోడాని కవకాశం లేకుండా వుంది; గాని మహాదేవుడు గారున్నూ సంస్కృతాంధ్ర పండితులూ, భారవి రచన కిరాతార్జునీయం తెనుగుచేసిన కవిన్నీ.

అప్పుడు కలకత్తాలో సురేంద్రనాథ బెనర్జీగారు సంపాదకులుగా వుండిన ఇంగ్లీషు దినపత్రి "బెంగాలీ" చాలా ప్రచారంలో వుండేది.

కాస్త యింగ్లీషు చదివాడంటే "బెంగాలీ" చదవకపోతే అప్పు డదొక న్యూనతగా భావించుకునేవాడు ప్రతీవాడూ.

దాని రచన లంత పకడుగా వుండేవి "ట."

ఆ పత్రిక రానినాడు సాంబయ్యగారికి నిద్రాహారా లుండేవి కావు.

ఇలాగ, ఇంగ్లీషులో కూడా మంచి పరిచయం వుండినందున సాంబయ్యగారి సాహిత్యసంపద విశిష్టంగా వుండేది.

మా కుటుంబం అంటే ఆ కుటుంబానికి అప్పుడే కా దిప్పటికీ పరమాదరభావం.

మా నాయనగారూ మేమూ కూడా తరుచు వారి యింటికి వెడుతూ వుండేవాళ్ళం.

వారున్నూ మా యింటికి వస్తూ వుండేవారు.

సాంబయ్యగారి చెల్లెలి నింకొక ఆమెని అనపర్తి కరణంగారి కిచ్చారు.

పొలమూరికి రామవరం దక్షిణపు సరిహద్దు అయితే, అనపర్తి ఉత్తరపు సరిహద్దు.

ఆ చెల్లెలిని చూసిరావాలంటే, మా వూరి మీదుగానే – మా గుమ్మంలోనుంచే వెళ్ళాలి కనక, కాస్తసేపు మా యింటి దగ్గిర కూచోకుండా వెళ్ళేవారు కారు వారు, స్త్రీలూ పురుషులూ కూడా.

ఆ సాంబయ్యగారూ మా నాయనగారూ కూచుని మాట్లాడుకుంటున్నారు, మే మింటికి వచ్చేటప్పటికి, మా అరుగుమీద.

అవకాశం యిలా తటస్థించింది కాబట్టి సాంబయ్యగారి చేతనున్నా నన్ను కూకలేయించవచ్చు ననుకున్నారు, మా నాయనగారు.

ఈ వూహతో, మమ్మల్ని చూసీచూడ్డంతోనే "ఏం, లొంగేడా?" అనడిగారు ఆత్రంగా, మా నాయనగారు.

వేంకటరాజుగారు అనుకూలవార్త చెబుతారనే వారి నమ్మకం; కాని "శ్రీపాదవారి అబ్బాయి లొంగుతాడూ? నేనే లొంగిపోయా"నన్నా రాయన, స్పష్టంగా.

ముందు ఇలా ముక్తాయించి "మీ అబ్బాయి చెప్పిన కారణాలు తిరస్కరించతగ్గవి కావు. అతని అభిరుచి చెడ్డది కాకపోవడమే కాదు, సహజమూ ఉదాత్తమూ కూడాను. దాదాపు రఘువంశం చదివేటప్పణ్ణుంచీ కొనలు సాగుతున్న కవితావ్యాసంగం, ఇవాళ యేవిధంగానూ మనం తుంచెయ్యాలేము, తుంచెయ్యడం మంచిదీ కాదు. ఏమో, మీ రేమనుకున్నా సరే, నా కిలా తోచింది, చివరికి" అని వివరించి ఖండితంగా చెప్పేశా రాయన.

మా నాయనగారు నిర్విణ్ణు లయిపోయారు.

అదీ యిదీ చూసి "యేమిటి సంగతి" అని ముందే అడిగారు, సాంబయ్యగారు.

డొంకంతా కదిలింది.

విన్నారు విన్నారు "మీ అబ్బాయి తెనుగులో కవితా సాధన చేసుకుంటూ వుంటే మీ కీ ఆందోళన ఎందుకో నాకు అవగాహన కావడం లేదు" అంటూ అందుకున్నారు, సాంబయ్యగా రవ్యవధానంగా.

"తెనుగు చెడ్డదా? తెనుగులో కవిత్వం చెయ్యడం అంతకంటే చెడ్డపనా? తెనుగు వాఙ్మయం అభిమానించుకోడం మీ కుటుంబ సంప్రదాయానికి విరుద్ధం అయితే, తెనుగు వారయివుండిన్నీ మీరు తెనుగును హీనంగా చూడ్డం మంచి సంప్రదాయమేనా? ఇది బాగాలేదు, సిద్ధాంతిగారూ! మీ అబ్బాయి తెనుగు కవుల్లో గొప్పవాడు కావా లని మీరు కోరుకోండి. గొప్పవా డయేటట్టు దోహదమున్నా చెయ్యండి. మీ కుమాళ్ళు ముగ్గురూ విద్వాంసులయి వోహో అనిపించుకోడమే మీరు చూచుకోవలసింది. ముగ్గురూ భిన్నవిద్యలెందుకు సాధించుకోగూడదూ?" అంటూ వారు చాలాదూరం కూడా మాట్లాడారు.

మా నాయనగారే పొరబడ్డారు గాని, వేంకటరాజుగారూ సాంబయ్యగారూ ఉన్నత నియోగికుటుంబాలకు చెందినవారు, వా రలా మాట్లాడ్డంలో వింత యేమీ లేదు.

చరిత్ర విప్పితే, తెనుగు సాహిత్యంతోనూ, తెనుగు వాఙ్మయంతోనూ నియోగులకు అవినాభావసంబంధం కనబడుతుంది.

వెనకటికి నియోగులు, సంస్కృతం అభ్యసించారు, తెనుగు వృద్ధిచేశారు.

మహర్షులు బ్రాహ్మణధర్మా లెలా నిశ్చయించినా, నియోగులు జనసామాన్యం

నిత్యవ్యవహారాలతో సంపర్కం తెంపేసుకోలేదు.

అలౌకిమార్గాల్లో ప్రవేశించి లౌకికమూ వారూ మరచిపోలేదు.

నియోగులకు "లౌక్యు"లని మారుపేరు, అందరికీ తెలుసు.

తెనుగు దేశపు లౌకికాలకు తెనుగే గతి.

ఈ విధంగా నియోగులకు, తమ మాతృభాష నిత్యం త్రికాలాలయందూ ఆరాధ్యం అయింది.

వ్యవహర్త అయినవాడు, భావుకు డయితే, నిత్యవ్యవహారంలో వున్న భాషలో సాహిత్యవేత్త అవుతాడు.

తిక్కన్న మొదలైనవారే ఇందుకు నిదర్శనం.

నన్నయ భట్టారకుడు పునాది వేశాడు, మరిచిపోలేదు; గాని అప్పణ్ణుంచీ మొన్నటిదాకా నియోగులే ఆంధ్ర వాఙ్మయస్రష్ట లయి వన్నె కెక్కారు.

వైదికులకు వైదిక విద్యలతోనే సరిపోయింది.

అవి సంస్కృతంలో వున్నాయి కనక, వారికి సంస్కృతం కావలసివచ్చింది.

సంస్కృతం కావలసివచ్చింది కనక, వారది బాగా సాధించుకున్నారు.

సాహిత్యవేత్తృతకు తోడు భావుకత్వం వుంటే, దానికి సహజమైన పరిణామం కవిత్వం కనక, వైదికులు సంస్కృత కవులయినారు.

వారు వైదికులే అయి వుండవచ్చు, వైదిక విద్యలమీద పరమాదరభావం కలవా రున్నా అయివుండవచ్చు; గాని యజ్ఞయాగాదులు చేసినవారిలాగ పరమఛాందసులు మాత్రం అయివుండరు.

మరి, నన్నయ్య యజ్ఞం చెయ్యలేదా, తిక్కన్న యజ్ఞం చెయ్యలేదా అంటే, సహజంగా వారు భావుకులు కనక, కవిత్వమే వారికి జీవిత పరమావధి అయిపోయింది.

అంచేత, వారు ఛాందసు లయివుండరు, నేనిది గట్టిగా చెప్పగలను.

ఏమంటే?

ఎక్కడ వేదవేదాంగాల్లో యెక్కువ పాండిత్యం వుంటుందో, వాటి యెడల ఆదరభావం అయినా అతిమాత్రంగా వుంటుందో, అక్కడ కవిత్వమూ గానమూ వంటి లలితకళ లుండవు.

వాటిమీద శ్రద్ధా వుండదు.

అంచేతనే వెనకటి వైదికులు తెనుగంటే పెదవి విరవడాని కలవాటు పడ్డారు.

కవిత్వం కోసం వారికి తెనుగు చదువుకోవలసిన అగత్యం లేకపోయింది కనక, తెనుగులో వారికి జాతీయతే దూరం అయిపోయింది.

మా చిన్నన్నగారయినా, అప్పట్లో, తెనుగు కవిత్వం అంటే అంత వైముఖ్యం వహించడానికి, వారికి కవితామాధుర్యం తెలియనిదనా, సంస్కృత సాహిత్యంలో వారి ప్రావీణ్యం తక్కువదా, మరి?

ఏతావతా. –

వేంకటరాజుగారూ, సాంబయ్యగారూ యింత చెప్పినా మా నాయనగారికి దృష్టి మారలేదు.

వేంకటరాజుగారిలాగ కాక, సాంబయ్యగారు పండితులు కూడా కావడంవల్ల వారి సమక్షాన మరి తెనుగును నిందించలేకపోయారు, అంతే.

నన్ను మాత్రం స్వేచ్ఛగా భాషాకృషీ కవితాసాధనా చేసుకోనివ్వదలచుకోలేదు వారు.

## 49

మధ్యకాలాన, కొన్ని సంవత్సరాలు గడిచాక, ఆ సంవత్సరమే మా పంచాంగం అచ్చువేయించడం ప్రారంభం అయింది, అనుకోనిది.

అంతకి పూర్వం అచ్చుపడుతూనే వుండిన్నీ, మా నాయనగారూ మా పెత్తండ్రిగారూ చెరో వూరిలోనూ స్థిరపడిపోవడంతో లంగరందక, ఆగిపోయి వుండింది అది.

అక్కడ మా పెత్తండ్రిగారూ. యిక్కడ మా నాయనగారూ కూడా, యెవరికి వారుగా శ్రద్ధ చెయ్యలేకపోయారు, ఆ విషయమై.

మా పెద్దన్నగారికిన్నీ ఆ సంకల్పం కలగలేదు.

మా చిన్నన్నగారే అనుకున్నారు హఠాత్తుగా, పట్టున్నూ పట్టారు, అచ్చువేయించి తీరాలని.

"మనకి సాగ"దని మా నాయనగా రెంతో నిరుత్సాహపరిచారు; కాని ఆయన వినిపించుకోలేదు.

మా నాయనగారి కా చూపే లేకపోయింది గానీ – అప్పుడు కాగితం ధర రీము రూపాయకు లోపు – అచ్చు ఖర్చున్నూ ఫారానికి రెండు రూపాయలకు పైని గదా, పది ఫారాల పంచాంగం అచ్చువేయించడం యేమంత భాగ్యం?

ఏమయినా, మా చిన్నన్నగారు అప్పు డావిషయమై వుదుంపట్టు పట్టారు.

చివరి కిద్దరూ దొడ్డంపేట వెళ్ళారు, జమీందారు శ్రీ వాడ్రేవు రంగనాయకమ్మగారితో మనవి చేసుకోడానికి.

సహజంగా ఆమెకు విద్యలయెడల ఆదరం యెక్కువ, దానికి సాయం యిది సంస్థానానికి గౌరవాస్పదం.

కనక, సన్నిధానవర్తులే కొంత అభ్యంతరం చూపించారు గాని, ఆమె మనస్ఫూర్తిగా అంగీకరించి, అచ్చుఖర్చుల నిమిత్తం డబ్బిచ్చారు.

వెయ్యి ప్రతులకు నలభై అయిదు రూపాయలు మాత్రమే అయింది, అప్పుడు అచ్చుఖర్చు, అమాంబాపతూ.

ఇంకో విశేషం యేమిటంటే?

రచనలో నేను పాలుపుచ్చుకున్న చివరి పంచాంగమూ అదే, మా పంచాంగం మళ్ళీ అచ్చుకావడానికి మొదలూ అదే.

అది కీలక సంవత్సర పంచాంగం.

రెండు మైళ్ళలో వున్న రాయవరంలో, శ్రీ భారతీ తిలక ముద్రాక్షరశాలలో అచ్చుపని ప్రారంభం అయింది.

పనివారికి పంచాంగం పనీ, అందులోనూ తెనుగంకెలతో పనీ కొత్త కావడంవల్ల ప్రూఫులు మావాళ్ళే స్వయంగా చూసుకోవలసివచ్చింది.

నాలుగైదు రోజులపాటు, మా నాయనగారో మా చిన్నన్నగారో యిద్దరూ కలిసో వెళ్ళి సవరణలు చేసి వస్తూవచ్చారు; గాని వారికది సరిపడలేదు.

నేను వెళ్ళవలసివచ్చింది.

అంటే, ఆ పని నాకు తెలుసుననీ, నాకు చేతనవుననీ, కాదు, మా వాళ్ళ దృష్టిలో నేను పనిలేనివాణ్ణీ, పూర్తిగా పనికిరానివాణ్ణీ కూడాను.

దీనికి సాయం, ప్రూఫులు దిద్దడం బండపని.

మా వాళ్ళ కది పండితులు చెయ్యతగ్గదిగానున్నూ కనపడలేదు.

కనక, అది నా పాలబడింది.

నాకిది తగిన శిక్షగా భావించారు, మావాళ్ళు.

తమ పని చెడిపోకపోడం చాలుననీ అనుకున్నారు మా నాయనగారు.

"పంచాంగరచనలో లాగే యిందులో కూడా వీడికి ఉక్కిరిబిక్కిరి అయిపోనీ, ఇందుమూలాన కూడా దినానికొక్క పూట వీడి కవితావ్యాసంగం మూలపడనీ" అనుకున్నారు, మా చిన్నన్నగారున్ను.

కాని, యావజ్జీవమూ నాకు ముద్రాశాలతోనే పని వుంటుందనీ, పొరబడీ, స్వల్పప్రయోజనం ఆశించీ అలాంటిదానితో తామే నాకు పరిచయం కలిగిస్తున్నామనీ గుర్తించుకోలేకపోయారు, మా వాళ్ళు.

ఆ భారతీ తిలక ముద్రాశాలలో నన్నుద్ధరించే పెన్నిధి వున్నదనీ, సధర్ముడైన వర్ధమానచంద్రుడొక డక్కడ నాకోసం యెదురుచూస్తూ వున్నాడనీ, తరవాత్తరవాత మా యిద్దరి జీవితాలూ దృఢతరానుబంధంతో పెనవేసుకుపోతాయనీ, మా వాళ్లు నాకు శిక్షగా భావిస్తున్న ప్రూఫుల దిద్దుబాటు పని, అంతవరకూ నన్నంటిపెట్టుకుని వున్న దౌర్భాగ్యదశ విడిచిపోడానికి చేసే శాంతిగా జమ అవుతుందనీ నేనున్నూ గుర్తించుకోలేకపోయా నప్పట్లో.

కాగా, నిరసనభావంతో మా వాళ్లు నన్ను పడగెంటారు.

మళ్ళీ యిదొక స్వేచ్ఛ అని సంబరపడుతూ నేను పరుగెత్తాను.

ఒకనాటి మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటలవేళ పొలమూరిలో పుట్టా న్నేను.

ముద్రాశాల పనిమీద, రాయవరం వెళ్ళడానికి, అలాగే మళ్ళీ మరొకనాటి మధ్యాహ్నం సరిగా పన్నెండు గంటలవేళ పొలమూరిలో బయలుదేరాను.

నిజంగా, నాకదే రెండో జన్మ.

ఉపనయనంతో కలిగింది సాంకేతికం మాత్రమే.

## 50

రాయవరంలో వెతుక్కుంటూ వెళ్ళి ముద్రాశాల చేరుకునేటప్పటికి ఖరాగా వొంటిగంట అయింది.

పనివారందరూ భోజనాలకు వెళ్ళిపోయి వుండినా రప్పటికి.

తరవాత తెలిసింది పేరు మల్లిడి సత్తిరెడ్డిగారని, పత్రిక చదువుకుంటూ వా రొక్కరే వున్నారు, ఆఫీసు గదిలో.

నా యీడే–నా వొడ్డూ పొడుగే–నా ఛాయే; కాని సంపన్నులూ వ్యవహర్తలూను రెడ్డిగారు.

తలనిండా జుట్టు – పట్టెడు ముచ్చటముడి – చేతులకు అంగుళం వెడల్పు తోడా మురుగులు – చెవులకు అర్ధ రూపాయ కాసంతలేసి అంతరాళం కమ్మలు – రెండు చేతుల అన్ని వేళ్ళకూ రకరకాల ఉంగరాలు – ఆ రోజుల్లో, మా వూళ్ళల్లో – సంపన్న రెడ్డియువకుల వేషం యిది.

వారు రెడ్లు అని దాంతోనే తెలిసింది నాకు.

ఇద్దరమూ వొక్కమాటే చూసుకున్నాం.

రెప్పవెయ్యకుండా చూసుకున్నాం.

ఏమి టేమిటో జ్ఞాపకం వస్తున్నట్లు కనబడడం, పరిశీలిస్తే యేమీ లేకపోవడం, అదే మొదటి సమావేశం అని గుర్తుకి వస్తూ వుండడం, ఏమి మాట్లాడాలో, ఏమి చెయ్యకపోవాలో గూడా తోచకపోవడం, మాటే రాకపోవడం – ఈ స్థితిలో వుండిపోయాం, వొక్కక్షణం మేమిద్దరమూ.

తరవాత "యెవరండీ?" అనడుగుతూ డస్కుబల్ల దగ్గిరనుంచి లేచి రెడ్డిగారివతలికి బయలుదేరారు, ఫలానా అని చెబుతూ నేను గదిలోకి బయలుదేరాను.

మరొక క్షణం కూడా అలాగే చూసుకున్నాం, మళ్ళీ.

వారి చూపులు నా హృదయం లోతులు పరిశీలించాయి.

నా చూపులు వారి ప్రవృత్తి పరిశోధించాయి.

ఏకకాలంలో చిరునవ్వు వచ్చింది, ఇద్దరికీ.

మరేమీ కాదు – మా యిద్దరి హృదయాలూ యేకం అయిపోగా, తళుక్కుమన్న ఆత్మజ్ఞానతేజస్సు, అది.

మరొక క్షణాని కిద్దరమూ ప్రకృతిలో పడ్డాం.

ఉత్తర క్షణాన దాహం మాట తెచ్చారు, రెడ్డిగారు.

పనిమీద యింటికి వెడితే, పాలో, పెరుగో, మజ్జిగో చివరికి బెల్లం పానకమో యిచ్చి, తరవాత మాట్లాడతారు, మా వూళ్ళల్లో రెడ్లూ కమ్మవారూను.

ఈ అలవాటు చొప్పున, రెడ్డిగారు, పది బారల్లో పక్కసందులోనే వున్న తమ యింటికి తీసుకువెళ్ళి, వాకట్లో నన్ను కవాచీబల్లమీద కూచోబెట్టి లోపలకు వెళ్ళారు.

"ఇప్పుడే పాలలో తోడు పడేశాను. మజ్జిగ బొత్తిగా పల్చగా వుంది" అని చెబుతూ వారి సోదరి బంగారుతీగల బెల్లం పానకం చేసి క్షణంలో తెచ్చి యిచ్చింది.

అదే మా మొదటి చూపు, అయినా రెడ్డిగారూ నేనూ చిరపరిచితులం లాగ ఏమిటేమిటో మాట్లాడుకోసాగాము.

గుమ్మంలోకి కాళ్లుంచుకుని వీధి అరుగుమీద కూచునివుండి, లోపలికి చూస్తూ మా యిద్దరి సంభాషణా వింటున్న రెడ్డిగారి తండ్రి రంగరాజుగారు, అప్పుడు లోపలికి వచ్చి "మీ యింటిపేరు శ్రీపాదవారా?" అనడిగారు, మొదట.

"మా అబ్బాయికి శ్రీపాదవారే గురువులు. మీరు నేర్చిందిన్నీ మా అబ్బాయికి నేర్పండి" అన్నారు వారు, తరవాత.

ఏనుగులమహాలు గ్రామ నివాసులైన శ్రీపాద సుబ్బయ్యగారు, వీధిబడి నడుపుకుంటూ అంతక్రితం ఆ వూళ్ళో వుండేవారు.

నే నెప్పుడూ ఆయనను చూడలేదు; గాని ఆయన పేరు చెబితే, ఆ వూళ్ళో, ఆ కాలపు రెడ్లు చెయ్యెత్తి మొక్కుతా రిప్పటికీ.

రెడ్లలోనూ మళ్ళీ గంగరాజుగారి కుటుంబాని కాయన ఆత్మీయులే.

సత్తిరెడ్డిగారంటే ఆయనకు అతివాత్సల్యం.

ఆయన కుమారులు సూర్యనారాయణగారినిన్నీ రాయవరం రెడ్లు ఇప్పటికీ ఆదరిస్తున్నారు, తండ్రినిలాగే.

ఆ క్షణాన నా కిదేమీ తెలియదు; కాని గంగరాజుగారలా అనగా "నేను మీ అబ్బాయికంటే చిన్నవాణ్ణే గదా?" అన్నా న్నేను.

"అయితేం? మీరు బ్రాహ్మలు కదూ? మీ కుండేది ముఖ్యంగా చదువేగా?" అన్నారు, మళ్ళీ గంగరాజుగారు.

దానిమీద మరి యెదురువాదం చెయ్యలేక "చెబుతాలెం"డన్నా న్నేను, డాబుగా.

అన్నానే గాని రెడ్డిగారి కింకా చదువు అగత్యమా?

ఆయనకు తరవా యేమిటో దాకా యెందుకూ, నాకు వచ్చివుండిన దేమిటో కూడా యెరగనైతి న్నేను.

కాక, –

నాకంటే యెక్కువే చదువుకుని వుండకపోతే ముద్రాక్షరశాల యెలా నడుపుతున్నారూ, రెడ్డిగారు?

సరే అన్న వెంటనే నాకీ గుంజాటన ప్రారంభం అయింది.

గంగరాజుగారి యెదణ్ణుంచి యెప్పుడు వెళ్ళిపోతానూ అనిపించింది, నాకు.

వెంటనే నేను లేవగా సత్తిరెడ్డిగారూ లేచారు.

ఉభయులమూ ఆఫీసుకి బయలుదేరాం.

ఉండుండి "మీ రేమయినా గ్రంథాలు చేశారా?" అనడిగారు రెడ్డిగారు నన్ను.

నేను చకితుణ్ణయిపోయాను.

నా తపనా, నా ప్రయత్నమూ రెడ్డిగారి కెలా తెలిశాయీ?

కొందరు కవుల్లాగ ప్రత్యేకవేషం వేసే అలవాటు నా కిప్పటికీ లేదు.

మరీ చిన్నప్పుడేమో తప్ప అప్పటికింకా చొక్కాలే తొడగడం లేదు, నేను.

తెగబారెడు జుట్టూ, పెద్దముడీ, ఉభయపింజెలతోనూ పంచెకట్టూ, కండువా వల్లెవాటూ – ఇదీ అప్పటి నా వేషం.

"ఏం, అలా అడిగారేం?" అనడిగా న్నేను.

"మీరు కవిలా కనబడుతున్నా"రన్నారు రెడ్డిగారు వెంటనే.

నిర్విణ్ణుణ్ణయిపోయా న్నేను.

తరవాత యెప్పుడో అడిగాను, మా వాళ్ళు నా మాటే యెత్తివుండలేదుట రెడ్డిగారితో.

ఎన్నో వ్యూహాలు తోచాయి.

నేను వినివుండిన పూర్వకవుల మూర్తులు మహోజ్వల వేషాలతో నే నప్పటికే చూడగలుగుతున్నాను; కాని వారి యెదట  నా లెక్కేమిటి, పత్రం యేమిటి?

నా సంగతి యేమయినా, రెడ్డిగారు కవులను గుర్తించగల రనుకున్నాను.

"వారే కవులేమో?" అనిపించింది నాకు.

దాంతో "మీరు గ్రంథకర్త లయివుండా"లన్నా న్నేను.

"కావాలనివుంది, మీరు చేస్తే అవుతా"నన్నారు రెడ్డిగారు అవ్యవధానంగా.

ఆఫీసు చేరుకున్నాం.

రెడ్డిగారు చిన్న బీరువాలో వుండిన తమ పుస్తకాలన్నీ తెచ్చి చూపించారు నాకు, అప్రయత్నంగా.

నలభై యాభై పైగా వున్నాయవి.

"వీటికి యెనభై రూపాయలకు పైగా అయింది" అని చెప్పారు, రెడ్డిగారు.

పుస్తకాలు కొనుక్కుందామంటే వొక్క దమ్మిడీ అయినా లేని నేను, ఆ మాట విని సిగ్గుపడిపోయాను.

"కోశవా నాచార్యః" అనేవారు మా నాయనగారు.

వారి దృష్టిలో జ్ఞానసంపాదన వొక యెత్తూ గ్రంథసంపాదన వొక యెత్తూను.

వారిని బట్టే యీ దృష్టి తరవాత్తరవాత మా చిన్నన్నగారికీ నాకూ గూడా యెక్కువగానే అబ్బింది గాని, జ్ఞానసంపాదనా పుస్తకసంపాదనా కూడా నా కప్పటికి గగనకుసుమాలుగానే వుండినాయి.

నిజంగా డబ్బులేకకాదు, చదువుకుందామంటే పుస్తకాల్లేక బాధపడ్డాన్నే నప్పుడెంతో.

అప్పటి ఈ యిబ్బందివల్ల నే నెంతో వెనకబడిపోయివున్నా నిప్పటికీ.

మా యింట్లో రెండు బళ్ళ పుస్తకాలున్నాయి, ఏం ప్రయోజనం?

అవన్నీ వైదికవిద్యలకు సంబంధించినవి.

దినమ్మూ నాకు వెగటు పెరిగిపోతూనే వుంది, వాటిమీద.

ఈ స్థితిలో చూపించారు తమ పుస్తకాలు, రెడ్డిగారు.

ఆ పుస్తకాల పోగు వరహాల గుట్టలా కనపడింది, నాకు.

కుబేరుని నవనిధుల్లోనూ వొకటీ, ఆ పుస్తకాల గుట్టా యెదట వుంచి "నీకేది కావాలో యేరుకో" అంటే, ఆబగా  ఆ పుస్తకాలే నొల్లుకునేటంత పుస్తక దారిద్ర్యం అనుభవిస్తూ వుండినా న్నేనప్పుడు.

అవి చూశాటప్పటికి నాకు కళ్ళు చెదిరిపోయాయి.

మనస్సున్నూ గుబగుబలాడిపోయింది.

## 51

ఎన్నో సైజుల్లోనూ ఎన్నో రకాల బయిండ్లతోనూ వున్నాయా పుస్తకాలు.

నవలలు, నాటకాలు, ఆనందముద్రాశాలవారి మనుచరిత్ర, యెవరో సామాన్య ప్రకటనకర్తల వసుచరిత్ర, శృంగార  నైషధం, మదనకామరాజు కథలు, యవన

యామినీ వినోద కథలు, బోజ కాళిదాస కథలు, భట్టి విక్రమార్కుల కథలు – ఈ రకంగా వున్నాయవి.

ఆ గ్రంథ సంగ్రహం వింతగా వుంది, యిప్పుడు చెప్పగల నీమాట, అప్పుడు నాకేమి తెలుసూ వాటి అంతరువులు?

అవన్నీ నూరుకుని వొక్కమాటుగా తాగేద్దామన్నంత ఆబ మాత్రం పుట్టుకు వచ్చిందంతే, నాకు.

"ఎదట రెడ్డిగారున్నారు, మాట్టాడాలి" అన్నమాటే మరిచిపోయి, యెన్నో పుస్తకాలు తెరిచి కొంచెం కొంచెం చదివి చూశాను.

అయితే, అన్ని పుస్తకాలు చదివిన రెడ్డిగారికి నే నేమిటీ చెప్పడం?

అన్ని పుస్తకాలు చదివిన రెడ్డిగారు నేను చేస్తేనే కవి కావడమున్నా యేమిటీ?

ఇవి తీరని సమస్యలయిపోయాయి, నాకు.

ఈ స్థితిలో, అప్రయత్నంగా అటూ యిటూ చూడ్డంలో, బీరువాల సందున కుక్కిన వార్తాపత్రికలు కనపడ్డాయి.

మరీ ఆత్రంగా యివతలికి లాగి చూడగా, కృష్ణాపత్రికా, బొంబాయి ఆంధ్రపత్రికానూ అవి.

అప్పటికింకా ఆ పత్రికలమీద కాంగ్రెస్సు మరకలు పడలేదు.

కాని, కృష్ణాపత్రికలో, బంగాళీజాతి అనుయాయితా, ఆంధ్రజాతిని దాని అడుగుజాడల్లో తిప్పాలన్న ప్రయత్నమూ తలమునకలుగా వుండేవి.

ఆంధ్రపత్రికలో మాత్రం, యెన్నో విషయాలమీద చక్కని వ్యాసాలుండేవి, యెన్నో.

దేశం కాని దేశంలో వుండడంవల్ల, మాతృదేశం వైలక్షణ్యం బోధపడడమూ, అది ప్రత్యేకభావం కలిగించడమూ, అక్కడి జనులతో పోల్చి చూసుకుంటే తన జాతి కొన్ని శతాబ్దుల వెనకటి స్థితిలో వుండడమూ, అందుకు పరితపిస్తూ దాని పునరున్నతికి మార్గాలు దిద్దడమూ – ఇదీ అప్పటికి ఆంధ్రపత్రిక ధోరణి.

ఆంధ్రుల్లోనూ, తక్కిన అందరు హిందువుల్లోనూ, ప్రపంచం అంతటానూ గల గొప్పగొప్పవారి చిత్రపటాలున్నూ యెన్నో వుండేవి, దాల్లో.

పాతబడిపోయిన వార్తలు విడిచిపెట్టేస్తే, నా కళ్ళ కా పత్రికలున్నూ గొప్ప పుస్తకాలుగానే కనపడ్డాయి.

అదనీ ఇదనీ నే నా పత్రికలున్నూ తిరగవేస్తూ కూచున్నాను, ఎక్కడి కక్కడే చకితుణ్ణవుతూ.

ఇంతలో పనివారందరూ వచ్చారు.

కుక్కగొడుగుల్లాగ ఊరూరా ప్రావిడెంటుకంపెనీలు వెలిసి వుండున్న రోజులవి.

ఆ వుద్ధృతం చూసి, యెక్కడికక్కడే అచ్చుపని యెక్కువ కావడం గుర్తించి, మల్లిడి సత్తిరెడ్డిగారూ, నల్లమిల్లి సత్తిరెడ్డిగారూ, కొండేపూడి సుబ్బారాయడుగారూ, మరికొందరూ వాటాలు కూడి నెలకొల్పిన ముద్రాశాల అది.

వాటాదార్లలో యీ ముగ్గురూ జీతగాళ్ళతో సరిగా పనిచేసేవారు.

లాభాలు కాక, అందుకు వేరే ముదరాలున్నూ పుచ్చుకునేవారు.

పనివారందరూ రావడంతో పంచాంగం ప్రూఫుల అగత్యం వచ్చింది.

మాతృక నన్ను చూస్తూ వుండమని రెడ్డిగారు ప్రూఫులు దిద్దారు.

ఆ దిద్దడంలో, వారు రాసే అక్షరాలూ నా కయోమయంగా కనపడ్డాయి, అచ్చు అయిన కాగితం చేతితో దిద్దడమూ నాకు వింతగా కనపడింది.

అప్పు డప్పుడు నన్ను మాతృక చూస్తూ వుండమని రెడ్డిగారు, కేసుమీది గాలీల్లో తల్లకిందులుగా వుండిన అక్షరాలూ అంకెలూ ధారాళంగా చదువుతూనూ సవరణ చేసేవారు, సులువుగా.

పని అంతా యిలాగ రెడ్డిగారే చేసుకుపోతూ వుండగా, మాతృక పుచ్చుకు్కోడం యేమి కష్టమూ?

చేతకాకపోవడమున్నా యేమిటీ?

మరి, మా వాళ్ళు తాము మానేసి నన్ను పంపారేం?

నాకీ సందేహం కలిగిందేగాని తీరలేదు.

ప్రూఫులు సవరించడానికి రెడ్డిగారటు వెళ్ళిపోగా, నేను వొంటిగా వుండడం చూసి, కొండేపూడి సుబ్బారాయడుగారు నన్నేమి టేమిటో అడగసాగారు.

అసలు, వారిది టేకి గ్రామం.

ఆ వ్వూరి కమ్మవారు తమ పిల్లలకు చదువుచెప్పడానికి తీసుకువచ్చి ఆ వ్వూళ్ళో నిలుపుకున్నా రాయన్ని.

సంస్కృతాంధ్రాలు చదువుకున్నా రాయన.

సంప్రదాయసిద్ధమైన నియోగికుటుంబం వారిది.

పురాణమున్నూ చెప్పడం వుంది, ఆయన.

అప్పటి క్కొద్దికాలం కిందటే బడి విడిచిపెట్టేశారు ఆయన, కొంచెం వైరాగ్యం అంకురించి.

పొద్దుటిపూట స్నానం చేసి విభూతీ, మధ్యాహ్నం గంధాక్షతలూ ధరించి కూచుంటే విలక్షణంగా ఆకర్షకంగా వుండేదాయన ఆకృతి.

మాట బహు సౌమ్యం.

ఆయన చూపులు కాగి చల్లారిన పాలలా స్థిమితంగా వున్నాయి, అప్పుడు.

ఆయన రుషి అని బోధపడింది, తరవాత్తరవాత, నాకు.

ఆయన మూర్తిమంతం నన్ను బాగా ఆకర్షిస్తూనే వుంది గాని, పుస్తకతృష్ణ తట్టుకోలేక ఆయన ప్రశ్నలు సరిగా వినిపించుకోలేదు, నే నావేళ.

అయినా, ఆయన అసంతృప్తులు కాలేదు; గాని ఉన్నట్టుండి చుట్ట ముట్టించారు.

దిగ్భ్రాంతుణ్ణయిపోయా న్నేనది చూసి.

ఆ మూర్తిమంతం యేమిటో ఆ చుట్టకాల్చడం యేమిటో నా కర్థంగాలేదు.

చుట్టవాసన భరించలేక నే నిటు తిరిగాను, చేసేది లేక.

నా స్థితి గుర్తించారాయన. "నాది పొరపాటే. మీరు సిద్ధాంతిగారి కొమాళ్ళు గదూ, మీ కిలాంటివి పనికిరావు" అంటూనే లేచి వెళ్ళి, మండువా అంచున కూచున్నారు.

అప్పటికి పని ముగించుకుని వచ్చి, అచ్చు పూర్తి అయిన ఫారాలు మడత పెడుతూ సంభాషణ ప్రారంభించారు, రెడ్డిగారు.

పుస్తకాలు విడిచిపెట్టలేకా, అక్కడ జరుగుతున్న రకరకాల పనులు చూసి ముగ్ధుణ్ణయీ, ముఖ్యంగా రెడ్డిగారితో సంభాషణ కట్టిపెట్టలేకా, నాటికి వచ్చిన పని అయిపోయి వుండినా నే నక్కణ్ణుంచి కదల్లేకపోయాను.

సాయంత్రం అయింది.

పనివా రందరూ వెళ్ళిపోయారు.

నేనూ రెడ్డిగారూ మిగిలాం.

నేను చదువుతూ వుండిన పుస్తకం సగం అయిందప్పటికి.

అది గుర్తించి "పట్టుకువెళ్ళి, చదివేసి, రేపు తీసుకురండి" అన్నారు రెడ్డిగారు, అయాచితంగా.

పొంగిపోతూ, యె-ఘిరిపోయా న్నేను.

## 52

రాత్రి, భోజనాలు కాగానే బడలిక పేరు చెప్పి వెళ్ళి పడుకున్నాను గదిలో.

పడుకున్నానంటే అది పడకగాదు, బుడ్డిదీపం పెట్టుకుని, పుస్తకమున్నూ పుచ్చుకుని, పెట్టె దగ్గిర కూచున్నాను.

కూచున్న రెండు గంటలకే తెచ్చిన పుస్తకం అయిపోయింది.

మరి, నిద్రపట్టలేదు.

ఏమి టేమిటో ఆలోచనలు – ఎందు కెందుకో అబ్బురపాటు – ఏదేదో వితర్కం – ఇన్నీ అయినా చివరికి అభావదశకి వెళ్ళిపోతూ వుండడం అయిపోయింది నా పని అప్పుడు.

ముప్ఫయ్యేడు సంవత్సరాల నిరంతర సాహచర్యం, ఎన్నడూ యెలాంటి సందర్భంలోనూ కూడా సంఘర్షణ లేని అనుయాయిత, నా కెప్పుడేది కావలసినా శక్తివంచన లేకుండా సమకూరుస్తూ వుండడం, మనసే యిచ్చెయ్యడం – నాటి మధ్యాహ్నం రెడ్డిగారు కనపరిచిన ఆప్యాయత వీటి కన్నిటికీ బీజప్రాయం.

అయితే, ముందుముందు ప్రసక్తం కాబోయే ఇంత అపూర్వవృత్తం అప్పుడేమి గుర్తుంచుకోగలనూ నేను?

అంచేతనే ఆ నిద్రపట్టకపోవడమూ, ఆ వితర్కాదికమున్నూ.

దీంతో, యెప్పుడు తెల్లవారుతుందా అనే తప్ప, నిద్ర రాకపోయినందుకు బెంగా లేకపోయింది నాకు, బాధా లేకపోయింది.

తెల్లవారాకయినా, భోజనా లెప్పుడవుతాయా అనే తప్ప మరో చూపున్నూ లేకపోయింది.

ఈ అవస్థలో, మా చిన్నన్నగారు నా కేమి టేమిటో చెప్పారు.

నేనున్నూ యెలాగో యెలాగో చేసేశానవి.

నా దృష్టిలో, అప్పుడు మా నాయనగారికీ నాకూ, మా చిన్నన్నగారికీ నాకున్నూ

వుండుకున్నది సేవ్యసేవ కానుబంధమే గాని, గురుశిష్యానుబంధం కాదు.

అంచేత, రాయవరం వెళ్ళవలసిన సమయం – అంటే భోజనాల వేళ సమీపించిన కొద్దీ యేమి టేమిటో వుల్లాసం పుట్టుకువచ్చింది, నాకు.

భోజనాలున్నూ అయిపోయాయి.

అయితే, భోజనం పూర్తి కావస్తున్న సమయాన "ఇవాళ కూడా రాయవరం వెళ్ళు" అనిపించుకునే వెళ్ళడమా, నేను వాళ్ళతోనూ, వాళ్లు నాతోనున్నూ చెప్పకుండానే బయలుదేరడమా అని వితర్కం ప్రారంభం అయింది నాకు.

దీనిమీద "మేమే వెడతా"మని వారే సిద్ధపడితే యేమిటి గతి? అని కంగారు పట్టుకుంది.

పోనీ, అదేదో దానికది తేలినప్పుడే చూసుకుందామంటే చివరి కేమవుతుందో అని ఆందోళన అందుకుంది.

కవిత్వంలో కూచుంటే మంచి భావాలూ, వ్యవహారంలో కూచుంటే మంచి యెత్తులూ తట్టే సన్నివేశం అది, తన్మయత్వం కలిగించుకోగల సత్తా అబ్బివుంటే.

నిజం ఆలోచిస్తే, అది ఆందోళన అనికాక, బుద్ధికి హొరపిడి అనే చెప్పుకోవాలి.

ఏమంటే?

నిమ్మకు నీరు పోసినట్టు బుద్ధి నిశ్చలంగా వుండే సందర్భంలో యెలాంటి కల్పనా వెళ్ళదు.

అల్లసాని పెద్దన్న, కవిత్వం చెయ్యడానికి నిరుపహతి స్థలం కావాలన్నాడేగాని, నైశ్చల్యం కావాలన్నాడా మరి?

నే ననేకమాట్లు గుర్తించాను, బుద్ధి స్థిమితంగా వుండినప్పుడు రాత వెళ్ళదు.

అది అభావదశ గాని, మరోటి కాదు.

కాగా, ఆందోళనవంటి ఆ అవస్థవల్ల నాకొక ఆలోచన తట్టింది, హఠాత్తుగా.

రాజా ఆలోచన అయింది, చివరికది.

అప్పుడే భోజనం ప్రారంభించి వుండిన మా అమ్మగారి దగ్గిరికి వెళ్ళాను, మెల్లిగా ముందు.

"రాయవరం వెళ్ళడం వాళ్ళో నేనో కనుక్కో"మన్నాను, చివరికి.

వాకిట్లో కూచుని యేదో పుస్తకం చూసుకుంటున్న మా చిన్నన్నగారిది విని, పిట్ట చెయ్యి దాటిపోతోందనుకుని, మాటలోనే అందుకుని "కవిత్వంలో కూచుందా మనుకున్నాడు కామోసు, వెళ్ళి పంచాంగం దిద్దిరమ్మను" అంటూ వురిమారు.

ఆ వురుము కోసమే కనిపెట్టుకుని వుండిన నేను. నెమిలిపిట్టనయి, మళ్ళీ మాట్లాడకుండా తుఱ్ఱుమన్నాను, రెడ్డిగారి పుస్తకం పుచ్చుకుని.

## 53

ఆవేళ కూడా రెడ్డిగారొక్కరే వుండినారు, ఆఫీసుగదిలో.

చూసుకున్న వేళావిశేషం కామోసు, వారున్నూ నాకోసం యెదురు తెన్నులు చూస్తూ వుండినారు, ఇంకా రాలేదేమా అని.

"చదివేశాను" అని పుస్తకం వారి కందిస్తూ కూచున్నా న్నేను.

"అదేమి టిదేమిటి?" అంటూ ఆ గ్రంథం విషయమై కొన్ని ప్రశ్నలు వేశా రాయన, తామది చదివి వుండడంవల్ల.

తమకు ఆ గ్రంథంలో ఆనందం కలిగించిన ఘట్టాలున్నూ వివరించి చెప్పారు.

అయితే, యెంతసేపూ వారు కథ విషయమే మాట్లాడారు.

చెప్పనిచ్చి చెప్పనిచ్చి నేను రచన విషయం అందుకున్నాను.

ఏమి టేమిటో విమర్శించాను.

ఏమిటేమిటో అందాలు చూపించాను.

అక్కడక్కడ కొన్ని లోపాలున్నట్టు తోచాయి, అవీ కనపరిచాను.

"ఆ సంగతులేవీ నాకు తెలియవు, మీరు నేర్పా"లన్నారు, ఆయన వెంటనే.

దాంతో, వారి అంతస్థు నాకు అవగాహన అయింది.

నాకు మహా వుందని కాదు భాషాజ్ఞానం, వారికి సుతరామూ లేదు.

లేనే లేదు, ఆ మాటకి వస్తే.

మరి, మనుచరిత్రా, వసుచరిత్రా, శృంగారనైషధమూ ఇత్యాదులెందుక్కొన్నారంటే, కొండేపూడి సుబ్బారాయడుగారి అజ్ఞ అది.

వారు, ఆ పుస్తకాలు చదివి సొగసులు చెప్పేవారుట; కాని "నాకు పద్యం తలకెక్కదండీ" అన్నారు, రెడ్డిగారు.

మా యిద్దరికీ వొక్కటే చూపు అయింది, అంతస్తూ, అవస్థా భిన్నాలయినా.

ఇదొక ఉత్సాహకారణం అయింది మాకు.

ఆ మాటమీదా యీ మాటమీదా తేలిందేమిటంటే?

వారు ప్రయిమరీ పరీక్షల్లో నెగ్గారు.

తండ్రిగారు, పెద్ద యెత్తున బెల్లం యెగుమతీ వ్యాపారం చేస్తారు, కనక, చిఠాఅవర్జాలు రాయగలరు, లెక్కలూ తేల్చగలరు.

గడగడ చదువుతారు.

ధారాళంగా రాస్తారు కూడా.

చురుగ్గా, చక్కగా కంపోజు చేస్తారు.

ఆఫీసున్నూ నడుపుతారు.

పుస్తకాలకూ పత్రికలకూ విరివిగా ఖర్చుపెడతారు.

చదువుతారవి.

పైకి వెళ్ళాలని తంటాలుపడతారు.

ఇదీ వారి స్థితి.

మా నాయనగారూ వారి తండ్రిగారూ కూడా మమ్మల్ని చదువుకోమనే అంటారు.

అయితే, వారి యిష్టం వచ్చింది వారు చదువుకోవచ్చు, నేనుమాత్రం నా యిష్టం వచ్చింది చదువుకోగూడదు.

ఇదీ మా స్థితి.

ఈ స్థితిలో మాకు పరిచయం.

పరిచయం అంటే ముఖపరిచయం కాదు, దృఢతరమైన జీవితానుబంధానికి పునాది అయిన పరిచయం అది.

దీనివల్ల అప్పటికప్పుడే మా యిద్దరిలోనూ కలిగిన మార్పేమిటంటే?

నాకు పుస్తక దారిద్ర్యం కొంచెం తీరడం.

"ఈ పుస్తకంలో వుండుకున్న విషయమూ, విశేషమూ యిది" అని వారి కేకొంచెమో తెలియడం.

"ఈ అవకాశం దాటిపోనివ్వ గూడ"దని నేనెంత అనుకున్నానో వారూ అంతే అనుకున్నారు.

ఈ సంగతి మేము కళ్ళతో చెప్పుకున్నాం.

ఈ పరిస్థితులు మమ్మిద్దర్నీ యేకం చేశాయి.

ఇద్దరమూ వుత్సాహతరంగాలమీద వూగిపోయాం.

మేమిలా వుండగా, పనివారందరూ వచ్చారు.

"నిన్నణ్ణుంచి చూస్తున్నాను వొక్కటే కబుర్లు, యెన్నాళ్ళనుంచేమిటి మీకీ స్నేహం?" అనడుగుతూ నల్లమిల్లి సత్తిరెడ్డిగారు మా దగ్గిరికి వచ్చారు, ఆఫీసులో అడుగు పెడుతూనే.

జరిగిందంతా వారికి చెప్పారు, మల్లిడి సత్తిరెడ్డిగారు.

నా శక్తి సామర్థ్యాలున్నూ వివరించారు.

కథలు రాస్తాననీ, నాటకం రాశాననీ, కవి నన్నీ చెప్పారు.

దాంతో, మల్లిడి సత్తిరెడ్డిగారిలాగే వారున్నూ నా యెడల అనురక్తులవుతా రనుకున్నా న్నేను; కాని చూసి చూసి విని విని "పద్యం కడితే తప్ప కవి అంటే యేమిటి, కవి?" అనేశారు, దురుసుగా.

మరి నుంచోకుండా కేసు దగ్గిరికన్నీ వెళ్ళిపోయా రొక్క అంగలో.

ఉలిక్కిపడ్డా న్నేను.

పేకముక్కల మేడలా కూలిపోయింది, నా వ్యక్తిత్వం.

పద్యం నే నెరగందా?

అయితే, నా చూపు రచనమీద పడ్డప్పణ్ణుంచీ వచనం అంటేనే నాకు రుచీ శ్రద్ధాను.

పద్యం అంటే ద్వేషం లేదు గాని, సాహిత్యం అయినా మరొకటి అయినా సొంతంగా పరిశ్రమించి – పుస్తకాలు చదివి జ్ఞానం సంపాదించుకోవలసివుండిన నాకు, వచనంలో వున్న సౌలభ్యం పద్యంలో కనపడలేదు.

ఈ సౌలభ్యమే వచన రచనలోనున్నూ ప్రవేశపెట్టింది నన్ను.

ఏ అంతస్థుకి ఆ అంతస్థులోనే తలలో పుట్టిన భావం కాగితం మీద పెట్టాలంటే, వచనమే అందుబాటులో వుంటుంది, యెవరికిన్నీ కూడా.

నేనే కాక, జనసామాన్యమున్నూ జ్ఞానం సంపాదించుకోవాలంటే, తెనుగులో సర్వాంగీణమైన వచన వాఙ్మయం యెప్పుడు సంపన్నం అవుతుందో అప్పుడే నెరవేరుతుంది అని నాకు దృఢవిశ్వాసమే కలిగిపోయివుం దెప్పుడో.

ఈ కారణాలవల్ల పద్యం అంటే ఔదాసీన్యం పుట్టిపోయి వుంది, నా కప్పటికే.

మా పెద్దన్నగారి వుద్దేశం యేమిటోగాని - చక్కని వచన గ్రంథం దొరక్కే ఆదిలో నేను నన్నయ్య భారతం చదివాను.

దానివల్ల నాకెంతో మేలే కలిగింది, సందేహం లేదు.

లేశమైనా నష్టమున్నూ కలగలేదు, సత్యమే.

"ఆంధ్ర భారతం చదవకపోతే, తెనుగులో భాషాజ్ఞానం కలగడం యెక్కడిదీ?" అన్న సత్యమూ బోధపడింది, తరవాత్తరవాత, నిస్సందేహమే.

కాని, ఆ రోజుల్లో, యెవరయినా, ఆంధ్ర భారతమూ చక్కని వచనగ్రంథమూ యెదట వుంచి "యేరుకో" అంటే, నేను వచన గ్రంథమే పుచ్చుకుని వుందును, నిక్కచ్చిగా.

భారతం ఆ ప్రాంరంభదినాల్లో ముట్టకపోయే వుందును.

ఏతావతా:-

నా మట్టుకి నేనిలాగ వచనమే మంచిదనీ, గొప్పదనీ నిర్ధారణ చేసుకుని వున్నాను. మరి, లోకం?

"కందం కట్టినవాడే కవీ, పందిని పొడిచినవాడే బంటూను"

"సీసం కవికీ కంచరికీ కూడా సులభమే"

ఈ సామెతలు మొదణ్నుంచీ వున్నాయి.

పోతే, కాలం మారింది గాని, దృక్పథం మారలేదు, అంతే.

పదకొండో శతాబ్దిలో యే రుచి వుందో జాతికి, యిరవయ్యో శతాబ్దిలోనూ అదే రుచి వుంది, స్థిరంగా.

అంటే, జాతికి సరి అయిన చైతన్యం లేదన్నమాట.

నీటితో స్తంభించిపోయిన చెరువుకీ జాతికీ వొక్కటే పోలిక కావడం దౌర్భాగ్యం.

అప్పటికి నూరేళ్ళకు పైగా అయింది, ఆంగ్లేయుల ప్రభుత్వం యిక్కడ స్థిరపడీ, వారి పరిస్థితులు మనకు తెలిసీన్నీ.

కాని, సత్యం అవగాహన కాలేదు, సరిగా.

సత్యం గుర్తించకపోతే ముందడుగెలా పడుతుంది, యెలా నిలుస్తుంది, యెవరికయినా?

అయినా, నల్లమిల్లి సత్తిరెడ్డిగారి మాట నన్ను కొట్టినంత పనిచేసి విడిచిపెట్టింది.

నిజం చెప్పవలసివస్తే, సాహిత్యవాసనే కాదు, గ్రంథపరిచయమున్నూ లే దాయనకు.

మల్లిడి సత్తిరెడ్డిగారిలాగే ప్రయిమరీలో నెగ్గివుండినా రాయన.

చిరాఅవర్జాలున్నూ రాయగలరు.

ముద్రాక్షరశాలలో కంపోజు చెయ్యడం ఆయనపని.

కేసుదగ్గిర నుంచుని, స్టిక్కు పుచ్చుకుని ఆయన కంపోజు ప్రారంభిస్తే, మెయిలువేగం అందదు, ఆ వేగానికి.

వడి అంత యెక్కువయినా తప్పులాట్టే వుండేవి కావు.

ఆ వడి, మాటలో వుండిన అక్షరాలు స్టిక్కులో పేర్చడంలో అలవడ్డ హస్తలాఘవమే గాని, అర్థం తెలిసి, అందువల్ల కలిగిన సౌలభ్యంతో యేర్పడ్డది కాదు.

అయినా, ఆయన మాట నా కభిమానం తెచ్చిపెట్టింది.

"పద్యరచన సాధించి తీరా"లని దీక్షా పట్టించింది.

తాను నమ్మింది విడిచి, యితరుల మాటమీద మరోదాల్లో – అనిష్టమున్నా అయినదాల్లో పడి మునిగిపోవడం శ్రేయస్కరం కాదు, నిజమే.

అయితే, యిది యిప్పటి మాట.

సహజంగా అప్పుడు బాల్యచాపలం.

పైగా, రహస్యంగా కవితాసాధన చెయ్యవలసిన దుర్గతి.

స్వయంగానున్నా చేసుకోవలసిన అవస్థ.

కవిత్వానికి అనుకూలంగా వీధిలో యెవ రేమన్నా వేదవాక్యమే అయిపోయే సందర్భం.

దీంతో, నాకది వుద్రేకమే కలిగించింది.

రక్తం అంతా వుడుకెత్తిపోయింది.

వచ్చిన పని యెలా పూర్తిచేశానో చేశాను.

ఒక పుస్తకం చదివాను, సరిగా తలకెక్కలేదు.

"అప్పుడే పొద్దు గూకుతోందే" అనిపించేదల్లా "యింకా సాయంత్రం కాదేం?" అనిపించింది, ఆవేళ.

ఇంటికి బయలుదేరాను.

నడక కాదు, వురుకు.

అప్పుడే కాదు, ఆ రోజుల్లో, రెండు మూడేళ్లపాటు రాయవరం వెళ్ళడమూ ఇంటికి రావడమూ, నే నురుకులతోనే.

ఇంటికి తెచ్చిన పుస్తకం త్వరగా చదివెయ్యడానికీ, కొత్త పుస్తకం తెచ్చుకోడానికీ ఆ వురుకులు.

రాత్రి కవితా సాధన చేసుకోవాలి, అందుకూ వురుకు లగత్యమే.

"ఇప్పటికే కాలం చాలా దాటిపోయింది, ఇంకానా?" అన్న ఆత్రంవల్ల వచ్చేవి ఆ వురుకులు.

ఆ వురుకయినా, నిర్జన ప్రదేశంలోనా, మహేంద్రవాడ నడివీధిలో, మళ్ళీ.

పొలమూరినుంచి రాయవరం వెళ్ళాలంటే, మహేంద్రవాడ పక్కగా పంటకాలవగట్టే వెళ్ళవచ్చు, కళ్ళు మూసుకుని.

అయినా, మహేంద్రవాడ వూళ్ళోనుంచే వెళ్ళేవాణ్ణి, నేనప్పుడు.

మనసుతో ఆలోచన, కళ్ళతో చూపు, చెవులతో వినికిడి, బుద్ధితో సమన్వయం – కూచున్నా నడుస్తున్నా నిత్యకృత్యాలు, నాకివి.

నిత్యకృత్యాలే కాదు, అనుక్షణకృత్యాలు.

కవితా సాధనకు నిరుపహతిస్థలం కావాలంటే, లోకవృత్త పరిశీలనకో, మరి?

అదో మాటూ యిదో మాటూ అనడానికి, ఉప్పూ చింతపండూనా యివి, కావలసినప్పుడే కలుపుకోడానికి?

లోకవృత్తం చూస్తూ వుంటే, తక్కినవన్నీ మరుపువచ్చి, భావాలు పుడతాయి, కల్పనలూ తోస్తాయి నాకు, అందుకనుగుణంగా, లోకుల మాటలు వింటూ వుంటే,

భాషలో జాతీయత కూడా గుర్తుకు వస్తుంది, ఏక కాలంలో.

వాక్యంలో, తరుచు లోకుల సంభాషణలు వింటే వచ్చేటంతటి తెనుగుతనం రాదు, గ్రంథాలు మాత్రమే చదివి వూరుకుంటే.

విశ్రాంతికనీ, చల్లగాలికనీ గోదావరి గట్టుకి బయలుదేరతారు రాజమహేంద్రవరంలో కొందరు మా యింటి దగ్గిర నుంచి గోదావరి స్టేషనుకీ అక్కణ్ణుంచి మళ్ళీ యింటికీ పెద్ద బజారుమీదుగానే వెడతా న్నేను, తరుచు సాయంసమయాల.

మదరాసు వెడితే గూడా, సాధారణంగా, బీచికి బయలుదేర న్నేను, చైనాబజారుకీ మౌంటురోడ్డుకిన్నే గాని.

బజారులో అయితే, అన్ని అంతస్థుల మనుష్యులదీ జీవనభారం కూడా కళ్ళబడుతుంది జీవననిర్వృతితోపాటు. మరి, బీచిలో అయితే, ప్రణయసల్లాపాలూ, ప్రణయప్రవృత్తీ, వో-ట్టి కాలహరణమున్నూ మాత్రమేగా?

నిజమే; గాని అంతరమైన నా ప్రవృత్తి యెవరికి తెలుస్తుందీ బాహిరమైన నా వురుకే గాని?

అంచేతనే "మాట" అంటూ గద్దించి నిలబెట్టి "వురుకే గాని నడక పనికిరాదా కవులకూ?" అనడిగాడు, గుత్తిన వెంకటరత్నంగా రనే బ్రాహ్మ డొకనాడు నన్ను, నడివీధిలో.

వైదికవృత్తిలో పొట్టపోసుకునేవా డాయన మహేంద్రవాడలో వుండి.

నా విషయమై మా నాయనగారికి గల పరితాపం యెరిగి వుండినవా డాయన.

హేళనకే గాని నా క్షేమం కోసం కాదు ఆ మాట, తెలుసు.

అయితే, బదులూ చెప్పలే దాయనకు, వురుకూ మానలేదు, నేను.

## 54

ఆ వేడిలో, ఆ రాత్రి, వెంటతీసుకువచ్చిన పుస్తకం వొకచోట పడేసి మళ్ళీ అప్పకవీయం పుచ్చుక్కూచున్నాను, బుడ్డిదీపం దగ్గిర.

గంటసేపు తంటాలుపడ్డాను, కూడా.

యతివిషయం మాత్రం కొరుకుపడలేదు.

విసిగిపోయాను.

పోయి పడుకున్నాను; కాని నిద్రపట్టలేదు.

చేసేది లేక, రెడ్డిగారి పుస్తకం పుచ్చుకుని అన్యమనస్సుతోనే పూర్తిచేసి, దాంతో ఆవలింతలు రాగా మళ్ళీ పడుకున్నాను.

తెల్లవారాక గూడా అప్పకవీయం మళ్ళీ చూశాను రహస్యంగా, రాత్రి పడివుండిన మథనతో యేమయినా స్ఫురిస్తుందేమో అని.

లాభం లేకపోయింది.

"ఇది యెలా తెలుస్తుందీ? దీనికోసం యెక్కడికీ వెళ్ళడం?" అన్న జిజ్ఞాస ప్రారంభం అయింది, అదనంగా.

మా వాళ్ళ కళ్ళు కప్పడానికి, భోజనాల వేళ దాకా జ్యోతిషగ్రంథం వల్లించాను, దృష్టిమాత్రం ఛందస్సు మీదే వుంచుకుని.

భోజనం కావడం తడువుగా మళ్ళీ రాయవరం బయలుదేరాను, మా చిన్నన్నగారిచేత ముందే అనిపించుకుని.

ఆఫీసు కంతకూ మళ్లిడి సత్తిరెడ్డిగా రొక్కరే వున్నారు, యథాపూర్వంగా.

వారి యెదట, యేవో పద్యాలు చదువుతూ, యేమి టేమిటో మాటలున్నూ అడుతూ, వృద్ధబ్రాహ్మ డొకడు కుదేసిన గుమ్మడిపండులా కూచుని వున్నాడు.

రాగం చెడకుండానూ, అర్థవత్తుగానూ పద్యం చదవడంలోనూ పొణకబుట్ట లాగ వూగిపోతున్నా డాయన.

కరణకమ్మశాఖీయు డాయన.

రాజమహేంద్రవరానికి సమీపాన గల ములకల్లంక ఆయన కాపురస్థలం.

పేరు కొత్తపల్లి సూర్యనారాయణగారని జ్ఞాపకం.

రాయవరానికి మైలులో వున్న వెదురుపాకసావరం గ్రామంలో పురోహితుడయి వుండిన అల్లుడు చనిపోగా, కూతురి పక్షంగా పౌరోహిత్యవిధులు నెరవేర్చడానికి వచ్చి వుండినా డాయన.

సత్తిరెడ్డిగారు, ఆయన సంగతులు ఇవన్నీ నాకు చెప్పి, నా సంగతి ఆయనకు చెప్పారు.

"మీ పితామహులు శివరామసిద్ధాంతి దీక్షితులుగారు – నేనెరగనూ? మునికొడవలి విడిచిపెట్టాక మీ నాయనగారిని మళ్ళీ చూడలేదు, నేను. అయితే మీ పెత్తండ్రిగారి కుటుంబం పోలవరంలోనే వుంటోంది కాదూ?" అంటూ అందుకున్నా డావృద్ధుడు, రెడ్డిగారి పరిచయవాక్యాలు ముగియడం తడువుగా.

"మీ వంశీయులు కొండయ్యగారనే ఆయన కాశీయాత్రకు వెళ్ళివుండి వొక యజ్ఞం జరుగుతూ వుండగా వెళ్ళి చూసి అక్కడి శ్రౌతులను వోడించి, కొండుశ్రౌతి అన్న బిరుదూ బహుమతులూ గడించుకు వచ్చారు. మీ తాతగారి తాత అక్కు సోమయాజులుగారు, చేతిలోవున్న ములకాటి కర్రతో వొక్కటే దెబ్బ కొట్టి, పెద్దపులిని చంపేశారు. భోజనాని కూర్చుంటే, అన్నపూర్ణతల్లి మీ నాయనమ్మ రాజ్యలక్ష్మమ్మగారు, తినగలడో లేడో చూడ్డం లేదు, తరిమి తరిమి వొకటే వడ్డించడం" అంటూ అక్క డక్కడి సంగతు లందుకుని, అవ్యాహతంగా విడిచిపెట్టాడు, వాక్ప్రవాహం ఆయన.

"శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికీ మధిర సుబ్బన్న దీక్షితులుగారికీ ఛందస్సు నేనే నేర్పాను. వారు మహామహులై వోహో అనిపించుకున్నారు, నేనే యిలా వుండిపోయాను" అంటూ ముక్తాయించాడు, వెళ్ళివెళ్ళి చివరికి.

మా వంశప్రతిష్ఠే వుగ్గడిస్తూ వుండినా, ఆయన ధోరణి అతి అయి, విసుగు పుట్టించింది; కాని యీచివరి మాట మాత్రం ఉత్సాహాభరితుణ్ణే చేసింది నన్ను.

ఛందస్సుకి సంబంధించిన నా అవస్థ ఆయనతో చెప్పాను, వెంటనే.

"ఓస్! ఇదేమంత భాగ్యమూ! సావరం రండి, నాలుగు దినాల్లో మీకు నేర్పేస్తా"నన్నా డాయన, ఔదార్యం గుమ్మరిస్తూ.

ఇలా అంటూనే గాఢమైన పొడుం పట్టొకటి పట్టి, చరాచరా బయలుదేరి వెళ్ళిపోయా రాయన, కుందేల్లాగ.

ఆయనని సాగనంపివచ్చి, గతరాత్రి నేను పూర్తిచేసిన పుస్తకం విషయం యెత్తుకున్నారు, రెడ్డిగారు.

రాణీ సంయుక్త అన్న నవల అది.

శ్రీ వేలాల సుబ్బారావుగారు రచించగా, విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారు ప్రకటించా రది.

విజ్ఞాన చంద్రికవారి పుస్తకాలకోసం అన్ని తరగతులవారూ అర్రులు చాచుకుని వుండేవారు, ఆ రోజుల్లో.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సృష్టి ఆ మండలి.

దేశం దౌర్భాగ్యంవల్ల ఆయన జీవితం అర్ధాయుష్యం అయిపోయింది.

విజ్ఞానచంద్రికా అంతరించింది.

ఆ మండలి ద్వారా లక్ష్మణరావుగారు ప్రకటించిన గ్రంథాలవంటివి ఇతర్లూ ప్రకటించగలరు.

ప్రకటించనూ ప్రకటించారు.

కాని, వాటికి లక్ష్మణరావుగారి ప్రకటనలకున్న ప్రామాణ్యం రాలేదు.

విలవా లేకపోయింది.

ఏమంటే?

తమ ప్రకటనలకు లక్ష్మణరావుగారు పీఠికలు రాసేవారు.

పీఠిక లంటే అవి.

ఆ గ్రంథాలు వేలూ లక్షలూ కేండిలుపవరు గల బల్బులు.

అయితే, ఆయన పీఠికలు వాటికి విద్యుత్ప్రవాహం.

అదీ ఆయన సంపాదకత్వం విశిష్టత.

తెనుగు యువకుల దృష్టి ఆకర్షించి వారికి కొంత చైతన్యం కలిగించినవారు లక్ష్మణరావుగారు.

ఒక కొత్త తరానికి పునాది వేశా రాయన; గాని మొదటి కీటు అయినా వెయ్యలేకపోయారు, ఆయుర్దాయం చాలక.

మరొకరున్నూ ఆ పని చేసినవారు లేరు, నేటికీ.

పోనీ అంటే, కొత్త పునాది వేసి, కొత్త గోడ తయారుచేసిన వారున్నూ లేకపోయారు, మనలో.

ఇదీ మన ప్రవృత్తి.

పోగా, నేను చదివిన మొదటి నవల ఆ రాణీ సంయుక్త.

గ్రంథం తెనుగే గానీ, ఆ పేరుమాత్రం తెనుగు కాదు, అప్పుడే తెలుసు నాకిది.

కాని, కథానిర్వహణం కొత్త వెలుగులు తోపించి, రచన నన్ను మిక్కిలీ ఉత్తేజపరిచింది.

వెతుక్కుంటూ వెళ్లి ఆ గ్రంథకర్తతో స్నేహం చేసుకోవా లనిపించింది, నాకు ఆ క్షణాన.

కాని, అందులో నాకొక పెద్ద సందేహం.

"సంయుక్తా పృథ్వీరాజూ పెళ్ళాడవచ్చా?" అని.

సంయుక్త తండ్రి జయచంద్రుడూ, పృథ్వీరాజూ అక్కాచెల్లెళ్ళ బిడ్డలు కావడం మూలంగా అన్నాతమ్ములు.

కాగా, సంయుక్త పృథ్వీరాజుకి కూతురు కాదూ, మరి?

వారు భార్యాభర్తలు కావడమా?

నే నిది చెప్పగా, రెడ్డిగారు బదులు చెప్పలేకపోయారు.

అప్పుడే కాదు, వారే కాదు, ఇప్పటికీ నాకీ సందేహం తీర్చినవారు లేకపోయారు.

తరవాత్తరవాత, లక్ష్మణరావుగారితోనే, మరో రెండు విషయాలతోపాటు ఈ ప్రస్తావమున్నూ చేశా న్నేను.

"కొత్త ప్రశ్న యిది. ఎవరూ చేసి వుండని ఆక్షేపణ. ఆలోచించి గానీ, తేల్చడానికి వీలులేనిదిన్నీ" అన్నారాయన.

ఏవంచ, –

నేనూ రెడ్డిగారూ కూడా "యిది సందేహం అవునా, కాదా" అని కూడా చర్చించుకున్నాం.

ఇద్దరమూ అలాంటి అంతస్థులోనే వున్నామాయె మరి.

ఇంతలో పనివారందరూ వచ్చారు.

మాతృక నా చేతికిచ్చి, ప్రూఫులు దిద్ది, అవి పుచ్చుకుని కేసు దగ్గిరికి వెళ్ళిపోయా రాయన.

ఇంతలో చెన్నుభొట్ల పెదసత్యనారాయణగారని వొకాయన అక్కడికి వచ్చారు.

రెడ్డిగారి జీవితంలో పరిణామదశ అంతా ఆక్రమించుకుని వుండినా రీయన.

దువ్వూరి రామిరెడ్డిగా రెంత పద్యకవో, మల్లిడి సత్తిరెడ్డిగారంత గద్యకవి కావలసినవారు.

ఈ పెదసత్యనారాయణగారి సాహచర్యం వారిని మరో దారికి లాగేసింది.

నాకున్నూ ఆయన సంపర్కం తప్పనిసరి అయిపోయింది, ఆ రోజుల్లో, రెడ్డిగారిని పట్టి.

పిట్టంతమనిషి; కాని తలతీసి, తలమార్చే రకం, ఆయన.

అప్పటి కావ్యాళ్ళో ఆయన వొక్కడే కాస్తో కూస్తో పాస్‌పీస్ అనగలిగినవాడు.

అంచేత, ఇంగ్లీషులో జాబులూ జవాబులూ రాయడానికి పనికివస్తాడని చేరదీశారు రెడ్డిగారు మొదట్లో; కాని, చూస్తూ వుండిన్నీ రవ్వారట్టూ పడుతూ వుండిన్నీ విడిపించుకోలేకపోయాను, తరవాత్తరవాత.

కాకపోయినా, శుద్ధపల్లెటూరది.

రకరకాల మనుష్యులు దొరకరు.

ఉన్నవారికి సాహచర్యమూ తప్పదు, "దూరంగా వుండు" అనలేకపోతే.

ఆయన వాలకం చాలా యెబ్బెట్టుగా కనబడింది, నాకా మొదటి చూపులోనే.

వస్తూనే, కొండేపూడి సుబ్బారాయడుగారి దగ్గిరికి వెళ్ళి కూచున్నా రాయన.

కూచుంటూనే, అగ్గిపెట్టె తీసి, సుబ్బారాయడుగారినే అడిగి పుచ్చుకుని ఆయనతోపాటు చుట్ట అంటించారు కూడా.

నేను మరీ వింతపడ్డాను.

రెడ్లిద్దరు చుట్ట ముట్టకపోడమూ, వారితోనే నిత్యసహవాసం చేసే బ్రాహ్మలిద్దరు చుట్టకాల్చడమూనా మరి?

పైగా, ఇద్దరికీ వెలుగూ చీకట్ల కున్నంత వార; కాని యిద్దరూ చనువుగా వుండడం.

ఉండుండి, నాకేసి తిరిగారు, సత్యనారాయణగారు.

ఏ వూ రన్నారు, ఏమి టేమిటో అడిగారు..

కొన్ని వినిపించుకోలేదు నేను, కొన్నిటికి బదులు చెప్పలేదు, కొన్ని తిరస్కరించాను కూడా.

అయినా, ఆయన నన్ను విడిచిపెట్టలేదు.

దూరందూరంగా తొలిగిపోతూ వుండినా, యెవరి దారిని వారిని బతకనివ్వనివారి లాంటివారు లోకంలో చాలమందే వున్నారు.

"ఆయనకు చుట్టగిట్టదు, నువ్విలారా" అని సుబ్బారాయడుగా రెంతచెప్పినా కూడా నన్ను విడిచిపెట్టలే దాయన.

చూసిచూసి నేనే మరోచోటికి వెళ్ళవలసివచ్చింది.

పరిస్థితులిలా కలుషితా లయివుండిన సమయాన, కొమరిపాలెం నుంచి అయినాపురపు సుందరరామయ్యగారు వచ్చారు.

జయచంద్ర చంద్రరేఖా విజయం, గులేబకావలి మొదలైన నాటకాలకర్త ఆయన.

ఆయనకున్నూ ఆ ముద్రాశాలలో వొక వాటా వుంది.

సుందరి అని వొక మాసపత్రిక నడుపుతూ వుండినారు, వారప్పుడు.

అందులో, నెలకొక్క ఫారం చొప్పున కొన్ని పుస్తకాలు ప్రకటించేవారు.

దాని పనిమీదే వచ్చారు వారక్కడి కప్పుడు.

మా కిద్దరికీ పరిచయం చేశారు, రెడ్డిగారు వచ్చి.

అప్పటిదాకా మే ముభయులమే చూసుకోలేదు గాని, మా వుభయకుటుంబాలకూ చిరపరిచయమే.

ఆ సంగతే మేము మాట్లాడుకుంటూ వుండగా, అక్కడికిన్నీ వచ్చారు, సత్యనారాయణగారు.

సుందర రామయ్యగారున్నూ ఆయనను అసహ్యించుకున్నారు; కాని, సత్తిరెడ్డిగారు కలగచేసుకుని చెయ్యిపట్టుకుని లాక్కుపోయేదాకా మాత్రం కదల్లే దాయన.

నా నిమిత్తమున్నూ రెడ్డిగారెన్నో మాట్లు చేశారీపని, తరవాత్తరవాత.

రాయవరం వెళ్ళడం – పనివారు రాకపూర్వమే ప్రూఫుల పని పూర్తిచేసుకోడం – వురుకులతోనూ పరుగులతోనూ సావరం చేరుకోడం – పెన్సిలు పుచ్చుకునీ అప్పకవీయం తెరుచుకునీ ఆత్రంగా కూచోడం; కాని, నాలుగు దినాలు తిరిగినా, యీ సంగతి యెన్నిమాట్లు జ్ఞాపకం చేసినా, యేమి టేమిటో కబుర్లు చెప్పాడు; గాని వొక్క అక్షరమైనా చెప్పలేదు, యతివిషయం నాకా వృద్ధుడు.

అసలు, ఛందస్సు సంగతే రానివ్వలేదా పెద్దమనిషి.

మొదటినాడు, గాఢనిద్రలో వుండగా, యెవరో వచ్చారంటూ కూతురు లేపింది.

రెండోనాడు, ఆయన స్వయంగా లేచేదాకా అరుగు మీద కూచున్నాను, క్షణాలు లెక్కపెట్టుకుంటూ నేను.

తక్కిన రెండు దినాలూ – ఆయన స్వయంగా లేచి, పెరట్లోకి వెళ్ళి పశువుల పాకలో కొంత కాలహరణం చేసి, విధి లేక అరుగుమీదికి వచ్చేదాకా పడిగాపులు పడివుండవలసి వచ్చింది; గాని యింత వోపిక పట్టినా, లోకాభిరామాయణంతో కాలం గడిపాడాయన.

తరవాత – అంటే నాలుగోనాడు, పదిమాట్లు పలకరిస్తే యేదో ఆలోచనలో వుండిపోయి వులిక్కిపడ్డట్టు నటిస్తూ మాట్లాడ్డం, ఆ మాట్లాడ్డం మాత్రం ఛందస్సుకి సంబంధించి వుండకుండా బాగా జాగ్రత్తపడి మరీ మాట్లాడ్డం – ఇలా నడిపించా డాయన బండి.

చూసి చూసి "మీరు రమ్మన్నారే, యేమిటిది?" అనడిగాను న్నేను, నాలుగు రోజులు గడిచిపోయాయన్న ఆవేదన కనపరుస్తూ.

దాని కాయన "అంత తొందరయితే యెలాగా? ఇది వొక శాస్త్రం. మాటలోనూ పూటలోనూ తెలిసేది కాదు" అని బదులు చెప్పాడు, నిశ్చలంగా.

"ప్రారంభించడాని కేమీ?" అనడిగాన్నేను.

"ఆ ధోరణి రావాలి చెప్పడానికి. తెలుసుకోడానికిన్నీ ఆ ధోరణి వుండాలి, మీరు తొందరపడుతున్నారు, అది మంచిది కాదు" అని బదులు చెప్పా డాయన.

"చెప్పకునేవాళ్ళుంటే చెప్పడానికి నాకు మహా ఆనందం. అయితే, వోపిక వుండాలి, చెప్పకునేవాళ్ళకి" అనిన్నీ అన్నా డాయన.

విసిగిపోయాను.

నిరాశ కూడా చేసుకున్నాను.

"నేను చెబుతాను ర"మ్మని పిలవడం ఆయన తప్పా, అది నిజమో డాబో తెలుసుకోకుండా ముక్కూ మొగమూ యెరగని మనిషి వెంటపడ్డం నా తప్పా?

ఏమయినా, తమకి తెలిసింది యెంతయినా, అందులో వొక్క అక్షరమయినా యితర్లకు చెప్పగూడదని వ్రతం పెట్టుకున్నవాళ్ళు లోకంలో చాలమందే వున్నారు.

తరవాత్తరవాత వొకరిద్దరు నాకు తటస్థపడ్డారు.

వారిలో మొదటివా డాయన.

అయితే, జిజ్ఞాసువుల క్కాదు నష్టం వారికే, తెలుసుకోగలిగితే.

ఓపిక పడితే, అలాంటి కుత్సితులతో విద్యలు నశించకుండా వుండడానికా అన్నట్టు "యెవడైనా నేర్చుకునేవాడు దొరుకుతాడా, మనం నేర్చుకున్నది మనతోనే పోకుండా లోకంలో నిలిచివుంటుందా?" అంటూ ఆందోళనపడేవారు – అమృత హృదయులు, ఎందరో దొరుకుతారు, మరోచోట.

నాకే తటస్థించింది అలాంటి సన్నివేశం, మరో రెండు గంటలకు.

నాలుగ్గడియల పొద్దువేళ వుసూరుమంటూ రాయవరం చేరుకున్నా నావేళ.

జరిగిందంతా సత్తిరెడ్డిగారితో చెప్పాలని ఆత్రంగా వచ్చాను.

కాని, రెడ్డిగారు పనితొందరలో వున్నారు.

సుందరి పత్రికకు టైటిలు కాగితం అంటిస్తున్నారు, తదేక దృష్టితో, వారు.

అయినా, వారితో మాట్లాడవచ్చు గాని, అటు చూడగా చెన్నుభొట్ల పెదసత్యనారాయణగారు, మహాకవి పోజులో కూచుని వున్నారు, కొండేపూడి సుబ్బారాయుడుగారికి దగ్గిరగా.

నన్ను చూడగానే యేదో ఘనకార్యం వెలగబెట్టినట్టు మొగాన చిరునవ్వునూ మొలిపించుకున్నా రాయన.

పోల్చుకోలేకపోయా న్నేను, అసలేమిటో.

నా స్థితి గుర్తించి "చూసుకోండి" అంటూ సుందరి ప్రతి వొకటి నామీదికి విసిరేశారు, రెడ్డిగారు.

చూడగా, క్రౌను సైజు సుందరిలో, డెమ్మీ సైజున చివరి వొక ఫారం.

ఆ నెలలోనే ప్రారంభం యిన వొక వచన గ్రంథం మొదటిఫారం అది.

నాకు బాగా జ్ఞాపకం – "(శ్రీ)మంతం బగు భరతఖండంబునం గల పరమపవిత్రంబగు నైమిశారణ్య భూభాగంబున నొక్క సరోవరంబు చెంగట–" ఇలా నడిచింది, కృత్యాది.

విషయసూచిక చూడగా సత్యనారాయణగారే దానికి కర్త అని తెలిసింది.

ఆశ్చర్యపడి అటు చూడగా "కాకేం?" అన్నట్టు చిరునవ్వు నవ్వుతూనే వున్నారాయన, తల పంకించుకుంటూ.

సుబ్బారాయుడుగారు మౌనముద్ర వహించారు.

ఇదంతా చూసి, ఏమిటేమిటో శ్లేషగా మాట్లాడారు కొంతసేపు, రెడ్డిగారు.

చివరికి మాత్రం కుండ బద్దలుకొట్టేశారు, వారు.

"సత్యనారాయణగారికి కవీశ్వరులు అనిపించుకోవాలని సంకల్పం కలిగింది. సరిగా యీ సమయాన, సుందరిలో వొక గ్రంథం పూర్తి అయి మరో గ్రంథం చేర్చవలసివచ్చింది. ఇది తెలిసి, సత్యనారాయణగారు, తామొక గ్రంథం రాసి వుండినట్టూ, దయతో అది ఇవ్వడానికి తాము సిద్ధంగా వుండినట్టూ, రెడ్డిగారిచేత సుందరరామయ్యగారికి చెప్పించుకున్నారు. అటు రాయబారం నడిపిస్తూనే, చిన్నగ్రంథం వొకటి రాసిపెట్టమని యిటు సుబ్బారాయుడుగారిని పట్టుకున్నారు, సత్యనారాయణగారు. గ్రంథం చివర, అది సుబ్బారాయుడుగారు పరిష్కరించినట్టు ప్రకటించడానికీ కర్తృత్వ భారం మాత్రం సత్యనారాయణగారే భరించడానికీ వొప్పన్నం. గ్రంథాలు అదనంగా తీసుకోవాలి కనక, కవిగారికి డెమ్మీసైజే కాని

క్రౌనుసైజు ఇష్టం లేదు కనక అది డెమ్మీసైజులో వెలిసింది. అంత త్వరలో మరో గ్రంథం దొరక్క, యీ సైజులభేదం అసందర్భంగా వుంటుందని తెలిసీన్నీ సుందర రామయ్యగా రంగీకరించారు, విధిలేక."

ఇదీ ఆ కుండ.

నేను చాలా సిగ్గుపడ్డా నది విని.

కవులకు సంబంధించిన ఆ మాటా యీ మాటా వచ్చాయి, దీనిమీద.

"మీరు సావరం వెడుతున్న పని యేమట్టుకి వచ్చిందీ?" అనడిగారు రెడ్డిగారు, నన్నా సందర్భంలో.

జరిగిందంతా చెప్పా న్నేను.

"అసలు, సంగతి యేమిటీ?" అనడిగారు, సుబ్బారాయడుగారు చకితులై.

నేను చెప్పాను.

విని విని "మీ కోరిక నాకు తెలిస్తే, గంటలో నే నదంతా చెప్పేసి వుండనా?" అన్నారు వారు.

అయితే, సుబ్బారాయడుగారికి ఛందస్సు తెలుసునని నాకేమి తెలుసూ?

"అదొక్కటే కాదు, వారి కింగ్లీషు తెలుసు. సంస్కృతం తెలుసు. తెనుగులో కవిత్వం చేస్తారు. కరిణీకం చెయ్యగలరు. దస్తావేజులు రాస్తారు. చాలాకాలం స్కూలు నడిపి చాలామంది కమ్మయువకులకు చదువున్నూ చెప్పారు –" అంటూ వారి శక్తులు యేకరువు పెట్టారు, రెడ్డిగారు.

ఆ విద్వత్తూ, ఆ నిరాడంబరత్వమూ చూసి విభ్రాంతుణ్ణయిపోయా న్నేను.

పిల్లవాణ్ణి చంకనపెట్టుకుని వూరంతా వెతికిన యిల్లాలి సామ్యం పట్టింది, నాకు.

కాని, అంతా మరుపు వచ్చింది, క్షణంలో.

జరిగిపోయిన దానికి పశ్చాత్తాపమూ, తెలియని దానికి సిగ్గూ, కాలం గడిచిపోతు న్నందు కాందోళనా, కావలసినదాని కాత్రమూ విన్నవించుకుని సుబ్బారాయడుగారి యెదట దోసిలి వొగ్గా న్నేను, వెంటనే.

అంతే.

"సత్తిరెడ్డీ, సంగ్రహవ్యాకరణం తీసుకురా" అన్నారు, ఉత్తరక్షణంలో వారు.

రెడ్డిగారు తెచ్చియిచ్చారు, అవ్యవధానంగా.

అది తెరిచి, ఛందస్సున్న భాగంలో యతివిషయం చూపించి చదవమన్నారు సుబ్బారాయడుగారు, నన్ను.

నేను చదివాను.

తెలిసింది చెప్పాను.

సందేహా లడిగాను.

వ్యాసఘట్టం అయిపోయి వుండినది విన్నవించాను.

ఒక్కటే మాట చెప్పారు, సుబ్బారాయడుగారు.

పీటముడి విడిపోయింది, ఆ మాటతో.

అ ఆ ఒ ఔ లకు యతి చెల్లుతుంది.

క ఖ గ ఘా లకున్నూ చెల్లుతుంది.

ఆ రెండూ కలపాలన్నది పీటముడి.

"హల్లులకు స్వతఃప్రవృత్తి లేదుగా?" అనడిగారు, సుబ్బారాయుడుగారు.

ఆ ప్రశ్న నాకు ప్రత్యుత్తరం అయింది.

వ్యాఖ్యానమున్నూ అయిపోయింది.

వ్యాసఘట్టం విడిపోయింది.

"వడ్లగింజలో బియ్యపు గింజ" అనిన్నీ అనిపించింది.

మహానుభావులు, వీరేశలింగం పంతులుగారు రాసిన గ్రంథం సంగ్రహవ్యాకరణం.

అప్పటికి సూర్యాస్తమయం కాగా, అదే నే నింటికి పట్టుకువెళ్ళాను.

ఛందస్సున్న భాగం మళ్ళీ మళ్ళీనూ, గ్రంథం అంతా వొక్కమాటూ చదివా న్నేను.

ఆ రాత్రి అంతా నా కదే పని.

ఆ కాస్త సేపట్లోనూ ఛందోవ్యాకరణాలకు సంబంధించిన అనేక విషయాలు తెలిశాయి నాకు, సులభంగా.

అది చదవడంవల్ల ఆ రాత్రి నేను గడించుకున్న జ్ఞానమూ, అనుభవించిన ఆనందమూ ఇప్పుడున్నూ పరిమితి కట్టలేను.

దీనికంతకూ కారణం అది వచనగ్రంథం కావడం.

స్వయంకృషితో అపారజ్ఞానం సంపాదించి, గ్రంథా లెలా రాయాలో శాస్త్రీయగ్రంథా లెలా రాయాలో బాగా గుర్తించి రాశారు వీరేశలింగం గారది.

దానియెదట, అప్పకవీయం నిష్ప్రయోజనం అనిపించింది, నాకు.

తరవాతి అనుభవాన్నిబట్టి, అప్పకవీయంలో ఛందస్సుకి సంబంధించిన విషయం అపారంగా వుంది, నాకు తెలుసు.

అయితే, మధుర వాక్కులైన వీరేశలింగంగారే అది రాసివుంటే; వారయినా, వచనంలో రాసి వుంటే?

ఇది అవగాహన చేసుకోగలవారికి, శాస్త్రాలు శ్లోకాల్లోనూ పద్యాల్లోనూ రాయడంవల్ల మనవారికి జ్ఞాన మెంత అందరాని దయిపోయిందో, ఇంకా అయిపోతూనూ వుందో గుర్తుకి వస్తుంది.

"వచనం జ్ఞాపకం వుండదు. పద్యం (శ్లోకం) అయితే అస్థిని పట్టుకుపోయి తికివుండినంత కాలమూ జ్ఞాపకం వుంటుంది" అన్న వాదం నాకు తెలుసు.

అయితే, గ్రంథం జ్ఞాపకం వుండడమా కావలసింది, విషయం అవగాహన కావడమా?

అవగాహన అయిన విషయం మాత్రం అస్థిని పట్టుకుని వుండిపోదూ?

ఇంతకీ, –

సాహిత్య ప్రయోజనం జ్ఞానమూ, కవిత్వ ప్రయోజనం ఆనందమూ కదా, యీ దృష్టితో చూస్తే, వాఙ్మయ నిర్మాతకు అంత ఛందఃపరిజ్ఞానం అగత్యమా?

పోనీ, అప్పకవీయానికి పూర్వం, ఆంధ్ర వాఙ్మయంలో, సాహిత్యం సంపన్నంతా, కవిత్వం అంతస్థూ తక్కువగా వున్నాయా?

తరవాతి వాఙ్మయంలో అవి ఆపాటి అయినా వున్నాయా?

పాపం, అప్పకవి, ఆ గ్రంథం రచించడంలో రక్తమాంసాలు ధారపోసేసుకున్నాడు, సందేహం లేదు.

ఆ పరిశ్రమ మనుష్యసామాన్యు డెవడూ చెయ్యలేడు.

ఆ దీక్షా యేకాగ్రతా కూడా చాలామందికి అందవు.

అప్పకవి యెడల నాకు గౌరవాదరాలు లేకపోనూ లేదు.

అయితే, అతని అపార పరిశ్రమకు సాఫల్యం?

ఇలాగ చాలాసేపు మథన పడ్డాను, చివరికి, ఆ రాత్రే లక్షణంగా పద్యాలు కట్టడం ప్రారంభించా న్నేను.

## 56

వచన రచన చరచరా సాగిపోతోం దప్పటికి.

తోచడం తరవాయిగా, తోచిన భావమున్నూ తోచినంతా కాగితం యెక్కిపోతోంది, అవ్యాహతంగా.

రచన చెయ్యడంలో కలిగే ఆనందమున్నూ అనుభూతం అవుతోంది, బాగా.

ఈ స్థితిలో పట్టుకుంది పద్యవ్యామోహం నన్ను.

మలేరియా కంటేనూ తీవ్రంగా పట్టుకుంది.

"పై మెట్టుకి వెడుతున్నాం, మనం" అనుకుంటూనే తప్పుదారిలో పడిపోయా న్నేను, పంచాంగం ప్రూఫుల పని మాత్రమే చూస్తున్నాననీ, దాంతో నా కవితా వ్యాసంగం పూర్తిగా కట్టుబడిపోతోందనీ, యింటో కూచుని మావాళ్లు అనుకుంటున్నట్టు.

మహోల్లాసంతో కూచునేవాణ్ణి నేను కలమూ కాగితాలూ పుచ్చుకుని.

కాని, మొదట యేదో కాస్త భావం తోచడం, అది పద్యంలో బిగించపోయాట ప్పటికి బండరాళ్ళలాగ గణా లడ్డు తగలడం, యతి దగ్గిరికి వచ్చాటప్పటికి మాటే తొణక్కపోవడం, ఈ రభసతో, కొత్త భావం తళుక్కుమన్న తలలో మరుపుచీకట్లు అలుముకోడం, దాంతో, అంతవరకూ గణబద్ధమయి వుండిన భావైకదేశం దారీ తెన్నూ లేని చిట్టడవిలాగ అయోమయం అయి కనపడడం, యెలాగో వొకలాగ అది ఛేదించుకుని ముందుకి వెడితే ప్రాసదగ్గిర దండపట్లు తటస్థ పడడం, చివరికి, అంతా గందరగోళం అయిపోడం – ఇలాగ అస్తవ్యస్తం అయిపోయేది, నా పని.

ఇది చాలదన్నట్టు, ఈ సాధన అంతా రహస్యంగా చేసుకోవలసి వుండడం, ఊతంవచ్చి గణబద్ధం అయి భావం ముందుకి సాగడానికి అయినకాడి క్కూనిరాగం తీసుకుంటూ చదవడంతో యీ పెరుమాళ్ళ గుట్టు మా వాళ్ళకి తెలిసిపోడం, వడగళ్ళ వానలాగ వెంటనే నామీద చీవాట్లు కురిసిపోడం, దీంతో మతిపోవడమున్నూ జరిగిపోయేవి, వొకదాని తరవాత వొకటి వచ్చే గుడ్సుబండి పెట్టెల్లాగ.

ఒక్కొక్కప్పుడు "ఛా, ఎందుకు వచ్చిన పద్యాలూ?" అంటూనూ అనిపించేది.

"కాని, చేతకాకపోడమేనా?!" అంటూ అభిమానమూ ముందుకువచ్చేది, వెంటనే.

ఇదంతా కొండేపూడి సుబ్బారాయడుగారికి చెప్పాను.

"ప్రారంభంలో, యతిప్రాసలు సరిపెట్టుకుంటూ భావం గణబద్ధం చెయ్యడం యెలాంటివాళ్ళకీ కష్టమే" అంటూ ముందు సానుభూతి కనపరిచారు, వారు.

"వచన రచనలో గడితేరుతోంది మీ చెయ్యి. ఆ పద్ధతి వేరూ యీ పద్ధతి వేరూను. ఒకదాల్లో పూర్తిగా నైపుణ్యం అబ్బకుండా మరోదాని వోనమాల్లో పడ్డారు, మీరు" అంటూ నా స్థితి యేమిటో నాకు విడమర్చి చెప్పారు, తరవాత.

పాపం, చచ్చి స్వర్గాన వున్నారు "చాదస్తం కాకపోతే మీ కిప్పుడీ పద్యరచనా వ్యామోహం యేమిటి చెప్పండీ? నాకు ఛందస్సు తెలియకే పద్యాలు కట్టడం మానుకున్నానా? దారి దొరికితే పద్యబంధం చాలా సులభం. చక్కని వచనం రాయడం కష్టానికి కష్టమూ గొప్పకి గొప్పా కూడానూ. 'గద్యం కవీనాం నికషం వదంతి' అన్న సూక్తి మీకు తెలియందా? ఒక విషయం మనం తెలుసుకోవాలన్నా, వొకరికి చెప్పాలన్నా, నికరమైన కవిత్వానందమున్నూ అనుభవించాలన్నా అనుభవింపచెయ్యాలన్నా వచనంలో వున్న సౌలభ్యమూ, ప్రయోజనమూ, వీలూచాలూ, నిండూ పద్యంలో వుండవు. అప్పకవీయంలో పడి మీరంత హైరానయిపోయారే, అప్పుడే అది మీరెలా మరిచిపోయారూ? సంస్కృతం పంచకావ్యాలూ చదువుకుని వుండి, తెనుగులోనూ యేకొంచెమో సాధన చేసివున్న మీకే పద్యాలు కొరకబడలేదే, సామాన్యులు పద్యాలు చదివి యేమి తెలుసుకోగలుగుతారు, యేమి ఆనందించగలుగుతారు? ఇంతకీ, – పద్యంవల్ల కలిగే ఆనందం కృతకమూ, వచనంవల్ల కలిగేది సహజమూను. నా మాట విని యికనైనా మీరు పద్యబంధం కట్టిపెట్టండి. పద్యబంధం సాపుకావడం ప్రారంభం అయితే కామవరపు జీడిలాగ మిమ్మల్నది విడిచిపెట్టదిక" అని హితోపదేశమున్నూ చేశారు, చివరికి నిండు మనస్సుతో.

అయినా, పద్యవ్యామోహం తగ్గలేదు నాకు సరిగదా, హెచ్చిపోయింది.

ఈ స్థితిలో వొకనాడు మా చిన్నక్కగారి యింటికి వెళ్ళాను, కొంకుదురు.

నేను వెళ్ళేటప్పటికి, మా బావగారూ ఆయన బంధు వొకాయనా తమ బంధువుల్లో వొక యువకుణ్ణి గురించి మాట్లాడుకుంటున్నారు.

"వాడు నిమిషంలో పద్యం అల్లేస్తాడు. వాణ్ణి చూసి తుర్రుమని యెగిరిపోయింది, మాలకాకి వొకనాడు. దానికంటేనూ వడిగా దానిమీద పద్యం కట్టేశాడు వాడు, తడుపుకోకుండా. అష్టావధానమే చేసేస్తున్నాడు, వాడికేమోయ్?" అన్నాడా బంధువు.

"అబ్బా, అష్టావధానమే? అయితే, వొక వెలుగు వెలిగా డన్నమాటే వాడు" అన్నారు, మా బావగారు.

నాకు కంగారు పట్టుకుంది.

"పద్యం కట్టకపోతే యెవరు చూస్తారూ?" అనిపించింది.

దాంతో, అన్నీ విడిచి, అన్నీ మరిచి పద్యబంధంలో చిక్కుకున్నా న్నేను.

ఇక నుంచుంటే పద్యం, కూచుంటే పద్యం, నడిస్తే పద్యం, మంచినీళ్ళు పుచ్చుకుంటూ పద్యం, యెప్పుడయినా నే నొక్కణ్ణే కూచుని భోజనం చెయ్యడమూ, మా సీత వడ్డించడమూ తటస్థపడితే "అది కావలె, నిది చాలదు" అంటూ పద్యం.

స్నేహితులతో మాట్లాడుతూ పద్యం.

ఒకనాడు రెడ్డిగారు మాతృక పుచ్చుకున్నారు, నేను ప్రూఫు దిద్దుతున్నాను.

అయినకాడికి పట్టుకువెళ్ళడానికి వచ్చి, నల్లమిల్లి సత్తిరెడ్డిగారు "అదేం, నువ్వు దిద్దక శాస్త్రిగారిచేత దిద్దిస్తున్నావేం? అయితే, కడతేరినట్టే యివాళ" అంటూ వెళ్ళిపోయారు, దురుసుగా.

నా కభిమానం వచ్చేసింది.

తెగేసి పద్యాలు కట్టేస్తున్నాను గదా, చచ్చు ప్రూఫులే దిద్దలేనూ నేను?

రోషం వొణికించేసింది, నన్ను.

రోషం వెనకాలే "ప్రూఫులు దిద్దే పద్ధతి సాఫైనది నాకు –" అంటూ కందపద్యమున్నూ ప్రారంభం అయిపోయింది, చ(రున.

"ఓహో, దారిలో పడుతున్నట్టున్నారే?" అంటూ మెచ్చుకున్నారు, నిరసించిన నల్లమిల్లి సత్తిరెడ్డిగారు, వెంటనే.

నాకు వొళ్ళు ఝల్లుమంది, ఆ పొగడ్తతో.

"అయితే దారుణప్రాస యెత్తుకున్నారు గదా, పూర్తిచెయ్యగలరా, నాలుగు పాదాలూ?" అనడిగారు మళ్లీడి సత్తిరెడ్డిగారు.

"అదేమంత దారుణమూ?" అంటూ టొకాయిస్తూ అందుకున్నారు, అక్కడే వుండిన సుబ్బారాయడుగారు పులుకూ పులుకూ చూస్తూ. "ఇంకా దారుణప్రాస అయినా పూర్తి చెయ్యవచ్చు, యెలాగో వొకలాగ అన్వయం సరిపుచ్చి; కాని చేసేం ప్రయోజనమూ? పద్యం కట్టడం చేతకావడం కాదు ప్రధానం, అందులో కవిత్వం వుండాలి. ఎవరిక్కోపం వచ్చినా నే నున్నమాట అనకమానను. ఛందస్సు నేనే చెప్పాను, నిజమే; కాని పద్యాలే పట్టుక్కూచుంటే మాత్రం వుభయ భ్రష్టులయిపోతారు, శాస్త్రిగారు, తప్పదు" అంటూనున్నూ ముగించా రాయన, నిష్ఠురంగా.

నే నులిక్కిపడ్డాను.

నా గుండెలు దూసుకుపోయింది, ఆ మాట.

అయినా, పద్యాల వుబలాటం మళ్ళించుకోలేకపోయాన్నే నప్పుడు.

మేమిలా మాట్లాడుకుంటూనే వుండగా, యేదో వుత్సవానికి సంబంధించిన ఆహ్వానపత్రిక అచ్చువేయించుకోడానికి వొక రెడ్డిగారు వచ్చారు, కొంకుదురునుంచి.

వారికది రాసిపెట్టవలసి వచ్చింది, అచ్చువెయ్యడానికి ముందు.

అది సుబ్బారాయడుగారే చేశారు; కాని "వొక్క పద్యం అయినా లేకపోతే యేమి బాగుంటుందండీ?" అని ఆ రెడ్డిగా రనగా అది మాత్రం నాచేత చేయించారు, వారు.

ప్రారంభంలోనే నా పద్యం వొకటి అచ్చు అయిపోతున్నందుకు బ్రహ్మానందపడిపోయా న్నేను.

మధ్యమధ్య సాయం చేసిన్నీ, మొగం చిట్లించుకున్నారు సుబ్బారాయడుగారు, నా బులపాటం చూసి.

"శుభలేఖల్లో పద్యాలు, ఆహ్వానపత్రికల్లో పద్యాలు, ఏ వుద్యోగస్థునకయినా బదిలీ అయితే పద్యాలు – తెనుగు కవిత్వం యీ స్థితికి వచ్చింది, చివరికి" అంటూ యెంతో పరితపించారు కూడా, ఆయన.

ఇవాళ చెప్పగల న్నేను, పద్యం అయిందల్లా కవిత్వం కాదని.

అయినా, నే నా ప్రయత్నం మాన లేదప్పుడు.

పైపెచ్చు, ఆ ప్రారంభావస్థలోనే – అప్పటికే వచన నాటకంగా తయారయివుండిన "వారకాంత"లో పద్యాలు చేర్చడం ప్రారంభించాను.

"మందః కవియశః ప్రార్థీ" అంటూ వినయం కనబరచుకున్నాడు, కాళిదాసు.

"మహాకవి నయిపోయా"నంటూ గర్వభూభృచ్ఛిఖరాధిరూఢు ణ్ణయిపోయా న్నేను.

ఇతర భాషల కవుల సంగతి నాకు తెలియదు; కాని, తెనుగు ప్రబంధకవుల ఉపోద్ఘాతాలవల్ల ఏర్పడ్డ చిత్తవృత్తి యిది, యిటీవలి తెనుగుకవులకు.

కవిత్వం కంటే పాండిత్యం హెచ్చు కావడంవల్ల వచ్చిన పుట్టిమునక యిది.

పోనీ అంటే, యిప్పటి కుర్రకారుకి ఆ పాండిత్యమయినా లేదు, ఆ తలతిరుగుడు మాత్రం పట్టుకుంది.

అదే కవీశ్వరుల లక్షణం అనుకుంటున్న ఆ రోజుల్లో నేనున్నూ నాలుగు పద్యాలు కట్టడంతో కవీశ్వరుణ్ణయిపోయా ననుకుంటూ పొంగిపోసాగాను.

## 57

పంచాంగం అచ్చు పని అయిపోయింది.

మరి రాయవరం కెళ్ళడాని క్కారణం లేదు.

అయితే, రెడ్డిగారిని కలుసుకోకుండా వుండడం యెలాగా?

నాకే కాదు, ఇలాంటి ఆందోళన, అక్కడ రెడ్డిగారికిన్నీ పుట్టివుంది, నా విషయమై.

అప్పటి కప్పుడే మేమిద్దరమూ వొకర్ని విడిచి వొకరుండలేని పరిస్థితుల్లో పడిపోయాం, పూర్తిగా.

అగత్యం – అంటే మా వాళ్ళకి – లేకా, ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళడానికి నాకు స్వాతంత్రం లేకా, వొక్క వారం దినాలు కనపడకపోయాటప్పటికి రెడ్డిగారి దగ్గరనుంచే వర్తమానం "కొత్త పుస్తకాలు తెచ్చాను, ర"మ్మని.

సరిగా, ఆ సమయాన, ప్రెస్సుబిల్లు శేషం చెల్లించి రమ్మని మా వాళ్ళున్నూ సెలవిచ్చారు, నాకు.

"రోగీ పాలే కోరాడు, వైద్యుడూ పాలే యిమ్మన్నా"డన్నట్టు తటస్థించిం దిది.

అచ్చు ఆఫీసులో అడుగు పెట్టాటప్పటికి ముందు పుస్తకాల కట్ట చేతికందించే మాట్టాడారు, రెడ్డిగారు.

వాటిలో, బాగవతమూ, హరిశ్చంద్రచరిత్రా పద్యగ్రంథాలు, తక్కినవి గద్యగ్రంథాలు.

ఆబతీరక అవన్నీ వొళ్ళో పెట్టుక్కూచున్నా న్నేను, చాలాసేపు.

సుబ్బారాయడుగారు చాలా జాలిపడ్డా రది చూసి.

"సత్తిరెడ్డీ, ఎక్కడి కెక్కడ సంబంధమో యెవరూ తెలుసుకోలేరు. శాస్త్రిగారికీ నీకూ యేర్పడ్డ మైత్రి చూస్తే సామాన్యంగా కనపడ్డంలేదు. నీ సాయంతో నీ కిప్పుడు తెలియని అంతరువుల్లోకి వెడుతున్నా రాయన. ఆయన సావాసంతో

నీలోనున్నూ కొత్త ఆమోదం పుట్టినట్టు కనపడుతోంది. మంచి అవకాశం యిది, జారవిడుచుకోకు. మరొకటి కూడా విను. ఆ పుస్తకా లాయన చంటిబిడ్డ నన్నట్టు వొళ్ళో పెట్టుక్కూచోడం చూస్తే, చదువుకుందామంటే - బాగుపడదామంటే కావలసిన పుస్తకాలు లేక ఆయన చాలా యిబ్బంది పడుతున్నట్టుంది. అదే నిజమైతే, నువ్వా కొరత తీరిస్తివా, ఆయన జీవితానికి కొత్తవెలుగు వస్తుంది. ఆ విశేషం మాత్రం నీది" అంటూ కళ్ళు చెమ్మగిల్లగా, గద్గదికతోనున్నూ చెప్పా రాయన, రెడ్డిగారికి.

నేను పరవశుణ్ణయినాను.

"విలపర్తి బుచ్చిరాజు"గారని రెడ్డిగారి మిత్రులొకరుండినా రప్పుడక్కడ.

వారు, సుబ్బారాయడుగారి మాటమీద "మీకూ సత్తిరెడ్డిబావకీ, శాస్త్రిగారికీ కూడా కళ్లు చెమ్మగిల్లి వున్నాయి, గొప్ప సన్నివేశం యిది. చూసి ఆనందించతగ్గదిన్నీ" అన్నారు తామున్నూ అలా అయి.

ఈ బుచ్చిరాజుగారు, జన్మతః శివార్చకులు.

తప్పనిసరి అయినప్పుడే రాజేశ్వరస్వామికి అర్చన చేసేవారు.

కొంచెం పొట్టి, మంచి దృఢగాత్రులు.

కర్రా కత్తీ బాగా చేసేవారు.

సంగీతం అంటే చెవి కోసుకునేవారు.

అయితే, కొద్దిగా నత్తి వుండేది; కాని నాటకాల బాణీలో ధారాళంగా పాడేవారు.

పద్యం ఎత్తుగడలో కనపడేది గాని, ప్రారంభం అయిందా మరి కనపడేది కాదది.

అప్పటికప్పుడే "మనం నాటకాల కంపెనీ నెలకొల్పాలి బావా" అంటూ సత్తిరెడ్డిగారిని తొందరపెడుతూ వుండినా రాయన.

తరవాత వొక గంటసేపు కూచుని, ఆమాటా యీ మాటా కానిచ్చి "మరి వెళ్ళా"లంటూ బయలుదేరా న్నేను, కొత్త పుస్తకాలు రెండు చేతబట్టి.

"ఏం, ఇవాళ, అంత తొందరే?" మనడిగారు రెడ్డిగారు.

అప్పటికి నామీద పడివుండిన సంసారబాధ్యత, కావలసినవన్నీ విస్తరాకులు తెచ్చి యింటో పడేస్తూ వుండడం.

తామరాకులో, మోదుగాకులో, మర్రిఆకులో, అరిటాకులో కట్టలకొద్దీ తెస్తూ వుండాలి, నేను.

పెరట్లో అరటిచెట్లుండేవి; గాని ఆటేవి కావు.

తెచ్చిన మోదుగాకులో యేవో కుట్టేన్నీ నేను సిద్ధం చెయ్యాలి.

ఊళ్ళో వుంటే మా నాయనగారే కుట్టేవా రెక్కువగా.

మా నాయనగారు ఆకులు కుడితే, చేత్తో కాదు, మిషను మీద కుట్టినట్టుండేది.

అంత చక్కని కుట్టు విజయనగరం పార్వతీపురం ప్రాంతం నుంచివచ్చే అడ్డాకువిస్తళ్ళలో తప్ప మరెక్కడా చూడలేదు, నేను.

దినమ్మూ పొద్దుటిపూట, రెండు పూట్లకూ సరిపడే ఆకులు కుట్టి వుంచుకోడం పల్లెల్లో వైదికకుటుంబాల్లో వొక విధి కృత్యం అప్పుడు.

ఆవేళ నేనింటి దగ్గిర బయలుదేరాటప్పుడు "రాత్రికి ఆకుల్లేవు" అని చెప్పింది, మా సీత.

చుట్టుపక్కల వూళ్ళు వెళ్ళినా, మరో పనిమీద పొలం వెళ్ళినా, మర్రి మోదుగుచెట్లు పరకాయించుకుంటూ వెళ్ళడం నా కలవాటయిపోయింది, అప్పటికే.

ఆవేళ కూడా రాయవరం దాకా అలా చూసుకుంటూ వెళ్ళాను; గాని దారిలో నా కెక్కడా కనపడలేదవి.

అంచేత, వెళ్ళిన పని తొరగా ముగించేసుకుని తిరిగి రావాలని బయలుదేరినప్పుడే నిశ్చయించుకుని వున్నా న్నేను.

నే నీ కారణం చెప్పగా "నే నరిటాకులు తెప్పించి యిస్తా నుండండి" అన్నారు, రెడ్డిగారు.

"నే నిప్పుడు మహేంద్రవాడ వెడతాను. వారి వెంట వెళ్ళి, దారిలో యెక్కడో వొకచోట నేనే కోసి యిస్తామ లే" అన్నారు, బుచ్చిరాజుగారున్నూ.

అన్నట్టే, కొడవలి పుచ్చుకుని నాతో బయలుదేరా రాయన, మరికొంత సేపున్నాక.

చాలామంది రైతులు పొలం దిమ్మలమీద అరిటిచెట్లు నాటతారు.

కాయలూ పళ్ళూ మాత్రమే వా రనుభవిస్తారు, ఆకులు, యెరిగి వుండిన బ్రాహ్మలు కోసుకువెడుతూ వుంటారు, తరుచు.

ఆ రైతులతో నాకు పరిచయమే లేదు గాని, మహేంద్రవాడ రాయవరాల మధ్య, అన్ని పొలాల్లోనూ దిమ్మలే, అన్ని దిమ్మలమీదా అరిటిచెట్లే, చాలామట్టుకి.

చాలుచా లంటూ వుండినా, అరవై డెబ్భయి ఆకులు కోశారు, ఆవేళ బుచ్చిరాజుగారు.

మహేంద్రవాడలో, తమ మేనత్తగారి యింటిదాకా మోసుకువచ్చి, అప్పుడు నా బుజాన పెట్టారు ఆ కట్ట, వారు.

మరికొంత దూరమున్నూ నా వెంట వచ్చి సాగనంపుతూ "సత్తిరెడ్డిబావని దిద్దినట్టే నన్నూ దిద్దాలి. నాకున్నూ మీరు గురువులే" అన్నా రాయన.

తరవాత యెప్పుడు పిలిచినా, యెప్పు డెవరితోనున్నూ నా మాట తెచ్చినా "గురువుగారు" అనేకాని, పేరుపెట్టి పిలిచియెరగరు, ఆయన నన్ను.

"ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యః"

మనిషికి, రావలసింది రానేవస్తుంది, అప్రయత్నంగా.

ఒక్కొక్కప్పుడు, ప్రయత్నమూ ప్రాప్తవ్యతా యేక కాలాన సమకూరుతాయి, సత్యం గ్రహించలేక "నా ప్రజ్ఞ" అనుకుంటాడు, మనిషి.

అయితే, ప్రయత్నం లేకుండా ప్రాప్తవ్య మయినా అన్నప్పుడూ లభిస్తుందా, అంటే, దృఢంగా చెప్పడం కష్టం.

ఇక్కడ వూహకి కంటే, శాస్త్రానికే బలం యివ్వడం మంచిది.

ఏమంటే?

ఊహ ఒక్కడికి మాత్రమే సంబంధించినది.

శాస్త్రం, అనేకుల వూహలకూ, పరిశీలనలకూ, చర్చలకున్నూ పరిణామం.

అది కొంత అయినా సంస్కారం వుంటే గాని, చదువుకున్నా అవగాహన కాదు.

చెప్పవచ్చిం దేమిటంటే?

దీనివల్ల, విస్తరాకులు కావలసినప్పుడల్లా రాయవరం వెళ్ళడానికి నా కవకాశం యేర్పడింది.

రాయవరం వెడుతున్నానంటే అరిటాకులకోసం అనీ, అరిటాకులకోసం అంటే రాయవరం వెడుతున్నాననీ మా వాళ్ళకి నిశ్చయజ్ఞానం యేర్పడిపోయింది.

ఏమయితే యేం, అరిటాకులో భోజనం చేసే సుఖమూ, విస్తళ్ళు కుట్టవలసిన అగత్యం తప్పిపోవడమూ సంభవించగా, నేను రాయవరం బయలుదేరితే నిషేధించకుండా వూరుకుంటూ వచ్చారు, మా నాయనగారు, అసలు సంగతి తెలియదు కనక.

"ఇందుకోసమున్నూ వచ్చా"నంటే చాలు, పాలికాపునో ప్రెస్సులో మనిషినో పంపి అరిటాకులు తెప్పించి యిచ్చేవారు, రెడ్డిగారు.

బుచ్చిరాజుగారున్నూ కొడవలి పుచ్చుకుని బయలుదేరేవారు, తరుచు నా వెంట.

ఇలా కొన్ని వారాలు గడిచాటప్పటికి, మహేంద్రవాడ రాయవరాల మధ్య, అరిటాకులు కోసుకోడానికి నాకే స్వాతంత్ర్యం యిచ్చేశారు, చాలామంది రైతులు.

నేను సిద్ధాంతిగారి కుమారుణ్ణని తెలియడమే యిందుక్కారణం, నా ప్రజ్ఞ యేమీ లేదిందులో.

## 58

సరిగా యీ సమయాన, మహేంద్రవాడ గ్రామకరణం ముంజులూరి వేంకట రామయ్యగారు, నిత్యమూ పురాణం చెప్పించుకోదలిచి తమ గ్రామంలో ప్రవేశపెట్టుకున్నారు, మా చిన్నన్నగారిని.

అప్పటికే మా పెద్దన్నగా రావూళ్ళో వుంటున్నారు, స్వగృహాన.

అయితే, పురాణధోరణీ లేదు, ఆ రుచిన్నీ లేదు ఆయనకు, బొత్తిగా.

జాతకాలు చెప్పీ, రాసీ, తమ ప్రాస్తావిక చాతుర్యం కనపరిచీ పెద్దపెద్దలను మెప్పిస్తూ వార్షికాలు సంపాదించుకునేవా రాయన.

తమ వూళ్ళోనే వుండినా, మా పెద్దన్నగారు పురాణం చెప్పడం పెట్టుకోకపోడంవల్లనే వేంకటరామయ్యగారు మా చిన్నన్నగారిని తీసుకువెళ్ళారు.

దీంతో నాకు కొంత స్వేచ్ఛ దొరికింది, ఇంట్లో.

మా చిన్నన్నగారు సద్దుబాటు చేస్తూ వుండిన సాంసారిక విధులున్నూ నామీద పడ్డాయి మరికొన్ని, అంతే.

ఇందుకు నేను చాలా సంతోషించాను.

మిక్కిలీ వుల్లాసంతో రచనావ్యాసంగం యెక్కువ చేసుకున్నాను; కాని యెప్పుడూ అనుకోని విఘాతం వచ్చిపడింది నామీద, అకస్మికంగా.

నేను, మా నాయనగారు నా విషయమై అట్టే పట్టించుకోడం లేదనుకోడం నాదే పొరపాటయిపోయింది.

ఉండుండి, వైదిక మార్గనిష్ఠతో నామీద చర్రుమనడం మానలే దాయన.

మొత్తానికి నా పాట్లు నాకు తప్పలేదు.

ఎక్కడికో పొరుగూరు వెళ్ళారు, మా నాయనగా రొకమాటు.

నేను పద్యాలు కట్టడంలోనే మునిగిపోయాను, ఆ షష్టి గడియలున్నూ.

"మీ నాయనతో నీకు ప్రతివాదం యెందుకూ? కుల విద్యలు నీ కంటుతూనే వున్నాయి గదా, అవంటే నీకంత ద్వేషం యేమీ?" అనడిగారు మా అమ్మగారది చూసి.

"విద్య లంటడం వేరూ, రుచి వేరూను. తెనుగు కవిత్వం అంటే వారి కంత ద్వేషం యేమీ? తమకు ఆ రుచి లేకపోతే నా కీరుచి లేదని యెందుకు సరిపెట్టుకోరూ? పంచాంగాలు చెయ్యడమూ, జాతకాలు చెప్పడమూ, తన్మూలంగా వార్షికాలు సంపాదించుకోడమూ నా కిష్టంలేదు. తెనుగు కవిత్వం చేసిన్నీ నే నామాత్రం సంపాదించుకోగలను" అని బదులుచెప్పా న్నేను.

మా అమ్మగారది మా నాయనగారితో చెప్పారు.

"కులవిద్యలే నేర్చుకోవాలంటే, అసలు చదువే అంటకపోతే, యేమిటీ చెయ్యడం? ఆదిలో, వాణ్ణి యింగ్లీషులో ప్రవేశపెట్టి వుంటే మీకీ బాధ లేకపోవును గాదూ?" అనిన్నీ అడిగా రామె.

పెద్ద వ్యవసాయదారు కూతు రామె.

కంభంపాటి మీనయ్యగారి వ్యవసాయం, ఆ ప్రాంతం కమ్మవారికిన్నీ ఆదర్శం.

ఆయన జొన్నచేలో వడిసెల చేతబుచ్చుకుని మంచెమీద వుంటే, ఇరుగుపొరుగు కమ్మవారున్నూ నిశ్చింతగా వుండేవారు, తమచేలమీద కూడా పిట్టలు వాలబోవని.

ఆయన తండ్రి పట్టాభిరామశాస్త్రిగారు మంచి శాస్త్రవేత్త.

తమ కుమారుణ్ణి – అంటే మీనయ్యగారిని వేదవిద్యలో ప్రవేశపెట్టారు, పట్టాభిరామశాస్త్రిగారు.

కాని, వేదం మీద రుచిలేక వ్యవసాయంలో ప్రవేశించారు, మీనయ్యగారు, స్వాతంత్ర్యం వచ్చాక.

అంచేతే "యే విద్య అయితేనేం" అన్న నా తపన అర్థం చేసుకోగలిగారు, మా అమ్మగారు.

మా నాయనగారు మాత్రం సరిపెట్టుకోలేకపోయారు.

తరతరాలుగా, అవిచ్ఛిన్నంగా వస్తోంది మా యింటో వైదికవిద్యల ప్రావీణ్యం.

అవి తప్పించుకోవడం యెలాగో మా నాయనగారికి అర్థం కాలేదు.

అంచేతనే "ససేమిరా" అనడం వారు.

మా అమ్మవారి సలహా ఆగ్రహకారణమే అయింది వారికి.

"కులవిద్యలు పనికిరాకపోతే, వీడిచేత, ప్లీడరుగుమాస్తా పని చేయిస్తాను; గాని తెనుగు కవిత్వం చెయ్య"నివ్వనని నన్ను పోలవరం పంపేశారు, చివరికి పట్టుపట్టి.

**59**

మా నాయనగారికి ముగ్గురన్న లుండేవారు.

వారున్నూ విద్వాంసులు.

కులవిద్యలన్నీ నేర్చినవారు.

వారిలో పెద్దలిద్దరూ నిస్సంతుగా చనిపోయారు.

మూడో ఆయన – అంటే, మా నాయనగారికి సన్నిహిత జ్యేష్ఠులయిన చలమయ్య శాస్త్రిగారు, మా నాయనగారు పొలమూరిలో ప్రవేశించినట్టే వెళ్ళి పోలవరంలో ప్రవేశించారు.

పోలవరా లీ ప్రాంతాన చాలా వున్నాయి, వొక్కొక్క వుపసర్గతో వ్యవహరించబడుతూ.

మా పెత్తండ్రిగారు ప్రవేశించినది రెడ్డిపోలవరం.

మొన్న మొన్నటిదాకా అదొక రెడ్డిసంస్థానం రాజధాని.

పెద్దకొడుకులు పెద్దలయి, వైదిక విద్యల్లోనున్నూ పెద్దలయి – దైవవశాన అకాలమరణం వాతబడగా, విరక్తి పుట్టి మా పెదనాయనగారు, కడసారపు కొడుకు సోమప్పని ఇంగ్లీషులో ప్రవేశపెట్టారు.

అది చూసి "తోటికోడలి కొడుకింగ్లీషు చదువుతున్నాడే, మనవాళ్ళలో వొక్కడికిన్నీ అది లేకపోయిందే" అంటూ మా అమ్మగారు కొన్నాళ్ళు బాధపడ్డం నాకున్నూ తెలుసు.

అయితే, మా సోమప్ప చదువు థర్డుఫారంతో ముగిసింది.

అయితేం, అతనే నయం, నా చదువు మూడో తరగతితోనే ముగిసిపోయింది, మరి.

కులవిద్యలు నేర్చుకోకా, పెద్ద వుద్యోగాలు దొరకడాని కగత్యమైన పెద్దచదువు అంటకా, చివరికి ప్లీడరు గుమాస్తాగా చేరాడు మా సోమప్ప.

అప్పటి ఆ వూరి పెద్దప్లీడర్లలో ఆచంట వేంకటరావుగారొకరు.

మంచి సరసు లాయన.

మా సోమప్ప వారి దగ్గిరే గుమాస్తా.

మా నాయనగారు, వేంకటరావుగారికి ఉత్తరం రాసి నన్ను మా సోమప్ప దగ్గిరికి పంపించారు.

అప్పటికి మా పెద్దక్కగారి కొడుకు మల్లాది బుచ్చివేంకటరావు ఆ వూరి మిడిల్‌స్కూల్లో యింగ్లీషు చదువుతున్నాడు.

నన్ను వాళ్ళ యింటో వుండమన్నారు, మా నాయనగారు.

ఖర్చులకోసం మా నాయనగారిచ్చిన డబ్బులో కొంత ఖర్చుపెట్టి రాజమహేంద్రవరంలో వొక కమీజు కుట్టించుకుమరీ వెళ్ళాను, పోలవరం నేను.

ఇప్పటి షర్టులనే అప్పుడు కమీజు లనేవారు.

అక్కడ నే నుండినవి పదిహేను దినాలు.

మా సోమప్ప అవసరమైన కాగితాల కన్నిటికీ నా చేత నకళ్లు రాయించేవాడు.

వడ్డీలు కట్టించేవాడు.

చీట్లు రాసి యిచ్చి వకీళ్ళతాలూకు లా పుస్తకాలు తెప్పించేవాడు, ఇప్పించేవాడు.

రికార్డుకట్ట తప్పకుండా మోయించేవాడు, కోర్టుకి.

కులవిద్యలకంటే లక్షరెట్లు వెగటనిపించింది, నాకది.

సహజంగా, వొక రుచి వున్నవాడికి మరో రుచి గల పని అప్పగిస్తే యేదీ అలాగే వుంటుంది, లోకంలో.

అదే తప్పనిసరి అవుతూనూ వుంటుంది, వొక్కొక్కడికి.

స్వతంత్రులకే యిది తప్పదు గదా, అస్వతంత్రుణ్ణి నా మాట చెప్పే దేమిటీ యింక?

అయినా, పగటిపూట ప్లీడరుగుమస్తా పని చేస్తూ రాత్రిపూట పంచాంగం చెయ్యమని ఆజ్ఞాపించలేదుగా మా నాయనగారు? అందుకే సంతోషించా న్నేను.

కాని, కొత్తబాధ వొకటి పట్టుకుంది.

మా పెద్దక్కగారికి, మా చిన్నన్నగారిమీద వల్లమాలిన అభిమానం మొదణ్ణుంచీ.

ఏమాత్రం సందర్భం వచ్చినా ఆయన్ని మిక్కిలీ భూషిస్తూ వుండే దావిడ.

అంతటితో వూరుకోక, ఆ భూషణ పూర్తికాగానే, నన్ను దూషించడమూ, యీసడించడమూ ప్రారంభించేది.

విస్తరిలో అన్నం పెట్టి, పరిషేచన చేశాక ప్రారంభించే దది.

బ్రాహ్మణస్త్రీలకు తమ కిష్టంలేనివారిని పీడించడానికి అదొక గొప్పతరుణం.

వొట్టప్పుడయితే, సాధింపు మొదలయేటప్పటికే అవతలి కుడాయిస్తాడు మరి, అవతలివాడు.

అయితే, నా యీ బాధ మరో విధంగా పరిష్కారం అయేది.

మా సోమప్పకి, మా పెద్దన్నగారంటే మిక్కిలీ యిష్టం.

మా చిన్నన్నగారిమీద బహుద్వేషమున్ను.

ఇంకేం?

మా చిన్నన్నగారిని, ఇంటో మా పెద్దక్కగారు ఆకాశాని కెత్తివేయడమూ, బయట మా సోమప్ప పాతాళానికి తొక్కెయ్యడమూ అవ్యాహతంగా జరిగిపోయేది.

అదొక వింతగా వుండి, నాకు క్లేశం తప్పించేది.

కాని, తూకం సరిపోతే మాత్రం నాకేమి లాభమూ, నా కవితావ్యాసంగాని కెలాగా విఘాతం తప్పనప్పుడు?

మొత్తానికి "పురాకృతం" అనుకోడం వొక్కటే వుపశమనం నాకా రోజుల్లో.

తెల్లవారింది. మరో వ్యాపృత్తికి వీలులేదు కనక, వెళ్ళి ఆఫీసులో కూచున్నా నొకనాడు నేను.

ఒక కక్షిదారు వచ్చాడు.

పెద్ద స్థితిపరు డాయన.

స్థితికంటే పట్టుదల యెక్కువ, ఆయనకు.

నూరు రూపాయల కాగితం ఆయనకొక చిళ్ళపెంకు.

తన మాట నెగ్గాలి, అందుకోసం సంచులు గుమ్మరిస్తా డాయన.

ఒక దావాలో వసూలయిన డబ్బు పట్టుకువెళ్ళడానికీ, వొక ప్రోనోటుమీద దావా పడేయించడానికీ వచ్చా డాయన, ఆవేళ.

ప్లీడరుగారు జపంలో వున్నారు, అప్పటికింకా.

మా సోమప్ప కూడా రాలేదింకా.

"చాలా పనుంది, నేను బజారుకీ వెళ్ళాలి. సరాసరీ కోర్టుకి వచ్చేస్తాను, భోజనం చేసి. నేటితో యీ నోటు కాలదోషం పట్టిపోతుంది, కనక యివాళ కోర్టులో పడిపోవాలి, వాడి యిల్లున్నూ టమటమా (ఈ మాట అన్నప్పుడాయన డప్పు వాయించడం అభినయించాడు) అయిపోవాలి. అయితే, బాకీదారు మన ప్లీడరుగారికి స్నేహితుడు. అయినా సరే, దావా పడిపోవలసిందే అని చెప్పండి" అంటూ కాగితాలు నాచేతికిచ్చి తొందరగా వెళ్ళిపోయా డాయన.

తరవాత వ్యవహారం నడిపించడం కష్టంగాని, ప్రోనోటు మీద ప్లెయింటు రాయడం బహుతేలిక.

ప్రోనోటు దావాల్లో ప్లెయింట్లకు నకళ్ళు రాసి వుండడం వల్ల నాకు బాగా పట్టుబడింది, ముందది.

"సదరు" వగైరాలు దండిగా చేర్చి నేనే రాసేశాను. వెంటనే ప్లెయింటు.

అది నోటుకి గుచ్చి, కూచున్న వెంటనే అదే ప్లీడరుగారి కళ్ళబడేటట్టున్నూ బల్లమీద పెట్టాను.

అది వారు చూసేదాకా మా సోమప్పని ఆఫీసుకి రాకుండా చెయ్యమని పట్టిసం భద్రకాళీ అమ్మవారికి మొక్కుకుంటూనూ కూచున్నా నేమీ యెరగనట్టు.

నే నాశించినట్టే అయింది.

ప్లీడరుగారే ముందు ఆఫీసులోకి వచ్చారు, హరిఃఓమ్మంటూ అదే మొదట చూశారు కూడా.

చూసి, ఏమిటిదీ అంటూ నిర్విణ్ణులయినా రాయన.

నేను, జరిగిందంతా చెప్పాను.

ఆయన మొగాన విచారం అలుముకుంది.

"ఇది కోర్టులో పడెయ్యకపోతే పెద్ద కాతా మరొకడికి పోతుంది" అనుకుంటూ ఆ కాగితాలు బల్లకి వేసి కొట్టి, దిగాలుపడిపోయి కూచున్నా రాయన.

మా సోమప్ప వచ్చాడు.

అతనూ కక్షిదారూ బజారులో తారసపడ్డారుట.

నన్నతను కాగితాలడగ్గా ప్లీడరుగారిబల్ల చూపించా న్నేను.

"ప్లెయింటు రాసేవుంచాడు మీవాడు, రండి" అంటూ సోమప్పని పిలిచా రాయన.

ఇద్దరూ ఏకాంతంగా మాట్లాడుకున్నారు.

ప్లీడరుగారు మొగం కొంచెం వికసించింది.

భోజనానంతరం కోర్టుకి వెళ్ళాం.

"ప్లెయింటిదిగో, సిద్ధం. తప్పదంటే మీ యెదటే పడేస్తాను; కాని మనం తొందరపడ్డమే కనపడుతుంది, కసి తీరదు. ఏమంటే? బాకీదారు, మరోచోట సొమ్ము మాట్లాడుకుని మనం దావా పడేసిన ఉత్తరక్షణంలో కోర్టులో కట్టెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. ఇంతకీ, – అతను మీ గుప్పిట్లో వుండడం మంచిదో, తప్పించుకుని

నిర్లక్ష్యం చెయ్యడం మంచిదో ఆలోచించుకోండి" అన్నారు ప్లీడరుగారు, కక్షిదారుతో.

ఆ కక్షిదారు ముఖకవళిక యిప్పటికీ నాకు బాగా జ్ఞాపకం.

"అయినాసరే, పడేసెయ్యండి" అన్నా డాయన, ముందు.

పక్క_కి చూస్తూ ఆలోచించాడు, తరవాత.

"మీ సలహో యేమిటి?" అనడిగాడు, ఇటు తిరిగి.

"ఖర్చులు దండుగ, కసి తీరదు. ఆయన నాకు స్నేహితుడు, నిజమే. నేను వృత్తిధర్మం పాటించుకోవాలి, మీకు ద్రోహం చెయ్యను" అని వూరుకున్నారు, ప్లీడరుగారు.

ప్లెయింటు చేతపట్టుకు నుంచున్నాడు మా సోమప్ప, బెల్లించి చూస్తూ.

క్రోధం విసుగయింది, విసుగు కంగారయింది, కంగారు గొణుగుడయింది, గొణుకుడున్నూ "పది రూపాయలు పుచ్చుకుని చెల్లు రాయించండి పోనీ" అన్నమాట అయిపోయింది కక్షిదారుకి, చివరికి.

ఊరుకున్నవాళ్ళనే కోర్టుకి పడలాగుతారు ప్లీడర్లు.

పైని న్యాయాధికారి వుంటాడు, అయితే, ఆయనా మనుష్యమాత్రుడేగా?

కాగా, కోర్టుకి వెళ్ళేది న్యాయమూ కాదు, అన్యాయమూ కాదు – రాగమూ ద్వేషమూను.

కోర్టునుంచి మళ్ళీ బయటికి వచ్చేవిన్నీ ధర్మమూ కాదు అధర్మమూ కాదు, దుఃఖమూ దారిద్ర్యమూను.

కాని, వేంకటరావుగారు ఆ రకం ప్లీడరు కారు.

కాకుండానే బాగా ఆర్జించేవా రాయన.

ఉండుండీ, వెనకటి దావా బాపతు సొమ్ము పుచ్చుకుని, మా సోమప్ప కిరవయ్యో నా కయిదూ రూపాయలు బహుమతీ చేసి, వెళ్లిపోయాడా కక్షిదారు.

ప్లీడరు గుమస్తాగా అదే నా మొదటి ఆర్జనా, చివరి ఆర్జనాను.

కాని, అది నా చేతిలో పడ్డం కొండ విరిగి మీద పడ్డట్టుంది నాకు.

"ఇలాగ నాలుగు డబ్బులు చేతిలో పడుతూ వుంటే కవితావ్యాసంగం చచ్చిపోదూ, వొక్క దెబ్బని?" అంటూ ఆ రాత్రి కలం పుచ్చుకున్నప్పుడు తల తిరిగి చెయ్యి వొణికిపోయింది, నాకు.

ఆ రాత్రి నాకు నిద్రే పట్టలేదు.

"చులాగ్గా అయిదు రూపాయలు కొట్టేశావ్" అన్నాడు మర్నాడు పొద్దున్న మా సోమప్ప.

పైకి నవ్వునటించి కుపిల్లిపోయాను, లోపల్లోపల నేను.

ఇక్క_డ యిది యిలా వుండగా "పని మానేసి వెంటనే యింటికి రా" అని మా నాయనగారి కార్డు.

"వెళ్ళండీ" అన్నారు ప్లీడరుగారు, తమకున్నూ కార్డు వచ్చిందని చెబుతూ.

నాకేమీ అర్థం కాలేదు.

"పంచాంగం ప్రారంభించాలి కామోసు" అనుకున్నాను.

ఆ రాత్రే పడవ యెక్కాను.

అనపర్తి దగ్గిర నల్లకాలవ బల్లకట్టు ఎక్కాటప్పటికి తటవర్తి వేంకటరాజుగారు కలుసుకున్నారు.

ఎందుకో మందహాసం చేశా రాయన.

"ఏం, వచ్చేస్తున్నావేం?" అనిన్నీ అడిగారు.

జరిగింది చెప్పా న్నేను.

"వెర్రిబ్రాహ్మడు" అంటూ వొకమాటు నవ్వేసి "తెనుగు కవిత్వం మీ కుటుంబ సంప్రదాయానికి మచ్చ అయితే, ప్లీడరు గుమాస్తా పని భూషణమా అనడిగా న్నేను. గుక్క తిప్పుకోలేకపోయారు మీ నాయనగారు. 'ఇది మీరు ద్వేషించడం కిందే లెక్క అవుతుంది. అవతలివైపున కూడా ద్వేషం పుడుతుంది చివరికి, తెలుసా?' అనిన్నీ అడిగాను. అప్పుడే నా యెదటే నీకూ ప్లీడరుగారికీ కార్డులు రాశారు, మీ నాయన. గ్రామనౌకరుచేత నేనే పోష్టుకి పంపించానవి" అని వివరాలు చెప్పారు వేంకటరాజుగారు.

"నిరాఘాటంగా యిక నేను కవితాసాధన చేసుకోవచ్చునటునా?" అనడిగాను, దీనిమీద నేను.

"నా వుద్దేశం, మీ నాయనగారు, ఇక చూసీ చూడనట్టుంటూ వుంటారని. నువ్వయినా, మోతాదు తప్పకుండా మసులుకోడం మంచిది" అని బదులు చెప్పా రాయన.

"గొప్పవాడి వయిపోవాలి నువ్వు, సగంసగం అయితే వొప్పుకోను, తెలుసా?" అంటూ ముందు ముక్తాయించి, దారి పొడూగునా నా కుల్లాసం కలిగిస్తూనే వుండినారు కూడా ఆయన.

## 60

నా కవితావ్యాసంగాని కెక్కువ అవకాశమే దొరికింది, పోలవరంనుంచి వచ్చాక.

ఎంత నిషేధించినా నే నది మానకపోడమూ, మా చిన్నన్నగారి పితూరీలు తప్పిపోడమూ, కొత్త పంచాంగాలతో మా నాయనగారికి వార్షికాలకోసం తరుచు సంచారం చెయ్యవలసిరావడమూ యిందుక్కారణాలు.

పద్యం తప్ప వొక్క బంతి అయినా వచనం రాయలేదీ అవకాశంలో నేను.

ఆ పద్యాల విషయంలో వొక వింత సంగతి.

నాకా దినాలలో, వొక్క అయినాపురపు సుందర రామయ్యగారితో మాత్రమే కవితావ్యాసంగం.

అదయినా, రాయవరంలో కలుసుకున్నప్పుడే.

అయితే, ఆ కొద్దిపాటి సాహచర్యంలోనూ కవిత్వం విషయమ్మై యేమి టేమిటో సలహాలు చెప్పారు, నా కాయన.

వాటిలోదే పద్యాల విషయం.

ఏదో పూర్వవృత్తం వొకటి పుచ్చుకుని, వేంకటరమణ వృత్తం అంటూ పేరు మార్చి, తమ గ్రంథాలలో ధారాళంగా వాడుకునేవా రాయన.

"ఇలాంటివి నేనింకా చాలా కల్పించా"నంటూ మరికొన్ని పేర్లు చెప్పా రొకనాడు, నాకు.

1. హిందూమాత వృత్తం.
2. విక్టోరియా వృత్తం.
3. లాలా లజపతిరాయి వృత్తం.
4. సురేంద్రనాథ బెనర్జీ వృత్తం –

ఇత్యాదిగా అవి పన్నెండు.

ఇవే నాకియ్యగా "వారకాంత" నాటకంలో చొప్పించేశా న్నేను.

పాతది సరిగా తెలియకపోడమే యీ ప్రవృత్తికి కారణం.

అయితే, యీ వ్యామోహం నాకా వొక్క నాటకంతోనే చెల్లిపోయింది.

ఆయన చెప్పిన రెండోసలహా, నాటకం అచ్చువేయించమని.

"కాగితాల వెల తెచ్చి యిస్తే, తక్కిన బిల్లు నింపాదిగా తీర్చుకునే పద్ధతిని, పుస్తకం అచ్చువేసి యిస్తా"మన్నారు సత్తిరెడ్డిగారు.

ఆ ప్రారంభావస్థలో నాకంతా పొంగే, అంతా వుత్సాహమే.

సరదా పుట్టింది.

అది తలమునక లయింది.

"కవీశ్వరుణ్ణయిపోయాక యింకా మూలపడి వుండడం యేమిటీ?" అంటూ ఆత్రం ప్రారంభం అయింది.

అప్పు డప్పుడు జాతకాలూ అవీ చెప్పి నేను సంపాదించింది మొత్తం నా సొంత డబ్బు మా అమ్మగారి దగ్గిర యాభై రూపాయల దాకా వుండింది, ఖర్చు అయింది పోగా.

చిన్నదో పెద్దదో వొక మొత్తం నా దగ్గిర అంతకాలం నిలవ వుండడం అప్పుడే – నేటివరకూ మరి తటస్థించలేదు.

లేదని విచారమూ లేదు.

కవిత్వం ప్రారంభించాను, అంతే, కవితావ్యాసంగానికి భంగం రాకుండా దినాలు గడిచిపోతే చాలునన్న దృష్టి యేర్పడిపోయింది, స్థిరంగా నాకు.

"ఒక్క పద్యం కడితే చాలదూ, వంద రూపాయ లెందుకూ" అని అప్పుడూ "వొక్క వాక్యం చాలదూ, వెయ్యి రూపాయ లెందుకూ?" అని యిప్పుడూ నా తృప్తి.

ఇది అన్నం పెట్టదు నిజమే; మరి, యిది కలిగించే ఆనందం యెన్ని కోట్లయినా డబ్బు కలిగించగలదా?

అసలు, డబ్బుకీ ఆనందానికీ సంబంధం యేమిటీ?

డబ్బు భౌతికం.

ఆనందమేమో ఆధ్యాత్మికం.

ధనికు లనుభవించేది ఆనందం కాదు, సుఖమైనా కాదు, లాలసత అది.

డబ్బు అంతస్థుని బట్టే అది హెచ్చుతూ వుంటుంది, తగ్గుతూనూ వుంటుంది, గాలి విసురులాగ.

ఆనందం అలాకాదు, అందుకోగలిగితే దానికొకటే స్థాయి.

కవిత్వంలో అధికార తారతమ్యాలూ, కవులను లోకులు చూసే చూపులోనున్నూ హెచ్చు తక్కువలూ వుండవచ్చుగాని, కవులయినవా రనుభవించే ఆనందం మాత్రం అందరిదీ వొక్కటే, రాశిలో.

ఉపనిషద్వేత్తలకూ, యోగులకూ యే ఆనందం కలుగుతుందో ఆ ఆనందానికి సబ్రహ్మచారి అది.

ఆ ఆనందం గుర్తించుకోగలవారికీ అనుభవించగలవారికీ సాంసారికదృష్టి తక్కువ అవుతుంది.

అంటీఅంటని స్థితి అది.

కవి అయినవాడి అంతస్థు, అదిగో, అది.

అంటే, భౌతిక జగత్తుకి అతీతుడు కావడానికి వీలులేదు కనక, కవికి లిప్తతా వుంటుంది, క్రాంతదర్శి కనక నిర్లిప్తతా వుంటుంది.

కాగా, కవి అయినవాడు, పంచభక్ష్యపరమాన్నాలూ ఆరగించగలడు, పచ్చిపులుసు మెతుకులూ తినగలడు సమంగా; కాని క్రాంతదర్శితకు సంబంధించిన అంతరదృష్టి ఉద్బుద్ధం అయిందా, ఆ రెండింటిమీదా కూడా ఆస్థ నిలవ దతనికి.

ఆ అవస్థ అవగాహన చేసుకోలేక, వ్యసనం అనుకుంటారు కవిత్వం, కొందరు.

అది శుద్ధ భౌతికదృష్టి కలిగిస్తుందనిన్నీ అనుకుంటారు, కొందరు.

మానవ శక్తులను అది అణచివేస్తుందని అనుకునేవారున్నూ వున్నారు, కొందరు.

అజ్ఞానం అది పూర్తిగా.

విషయం తెలియక అనే మాట అది.

కవిత్వం అనుభవించలేనివారు చెయ్యవలసిన ఆరోపణ అది.

కవి అయినవాడి జీవన సరణి పరిశీలించి అవగాహన చేసుకోలేనివారున్నూ పడవలసిన భ్రాంతి అది.

"దిగిరాను, దిగిరాను, దిగిరాను భువికి" అన్నారు, కృష్ణశాస్త్రి అన్నగారు.

అర్థం కాలేదు చాలమందికి, అది.

"ఎంత పొగరూ?" అనుకున్నారు, కొందరు "పెద్దలు."

"రియాలిటీకి దూరమైన ప్రవృత్తి" అనుకున్నారు, ఎందరో "విమర్శకులు."

అన్నగారి ఔన్నత్యం అందుకోలేని మాటలవి.

"కృష్ణశాస్త్రి" అన్నది, వ్యవహారం.

కవి ఆయన.

మహాకవి.

కనకనే ఆ మాట అనగలిగారు, అన్నగారు.

మరి, కవి అంటే?

"నా నృషిః కురుతే కావ్యమ్"

ఋషి కానివాడు కవి కాడు.

ఋషి అంటే ముక్కుమూసుక్కూచునేవా డనుకుంటారు, జనులు.

ఋషే కవి అంటే, కవినీ అలాగే అనుకుంటారు.

అనుకుంటా రేమిటి, అంటున్నారు.
కవిని "సోమరి" అనడందాకా వెళ్ళిపోయారు, వారు.
ముక్కు కాదు, ఋషి మూసుకునేది, కళ్ళు.
కళ్లు అంటే చర్మచక్షువులు.
ఋషికే కాదు, అందరికీ వుంటాయవి, వాటినిబట్టి కాదు, వ్యవహారం.
శుద్ధ భౌతికాలు, అవి.
కనక, భౌతిక జగత్తే కనపడుతుంది, వాటికి.
భౌతిక వాసనలే రేపెడతా యవి.
ఋషికి – అంటే కవికి – అంతరదృష్టి వుంటుంది, బహూ నిశితం అది.
చర్మచక్షువులు మూసుకుని ఆ అంతరదృష్టితో చూస్తాడు కవి.
అదే క్రాంతదర్శనం.
లోకాలోకాలన్నీ దాని పరిధిలోనే.
అవి చూడగలిగినవాడికి – అంటే – సత్యం శివం సుందర మున్నూ అయినవి చూడగలవాడికి, ఇక్కడ యేం వుందీ ఆకర్షించగలిగేదీ?
అన్నగారు "దిగిరా" నన్నది ఆ పరిధిలోనుంచి.
వారు గ్లాస్కో పంచెలు కట్టడమే కనిపిస్తుంది, జనులకు.
పరిసరాలు చూస్తున్నట్టే వుంటాయి, వారి చర్మచక్షువులు.
వారి ఆంతర్యం మాత్రం ఆ దిగిరాని స్థితిలోనే వుంటుంది.
"సంవత్సరాని కారువేల రూపాయ లిచ్చుకుంటాం, కావాలంటే అడ్వాన్సుగా యిచ్చుకుంటాం" అంటూ వచ్చి రైతులు నన్ను తొందరపెడుతున్నారు: గాని, ఆ మహానుభావుడు మద్రాసునుంచి దిగిరాడు, భూములు అమరకం చేసుకోడానికి" అన్నారు వారి బంధువుల్లో వొకాయన, ఉత్తరాలు రాసిరాసి, విసిగివిసిగి.
ఏం, డబ్బు చేదా అన్నగారికి?
కవితా సమాధిలో వుండినప్పుడు చేదే కాదు, అదిక విషమున్నూ.
అన్నగారిదాకా వెళ్ళనక్కరలేదు, ఏమాత్రం కవి అయిన వాడికిన్నీ వుంటుంది, మొత్తానికి డబ్బంటే యిలాంటి వెగటు.
పోనీ, మద్రాసులోనైనా సరిగా చూసుకుంటారా అన్నగారు వ్యవహారాలు, ఈ రైతులు అక్కడికే వెడితే?
అదిన్నీ వొట్టిదే.
ఇక్కడ వుండినవారికి మద్రాసులో వుండినట్టు కనపడతారు గాని, అక్కడా దిగిరాని స్థితే అన్నగారిది, మరి.
చెప్పవచ్చిం దేమిటంటే?
నా నాటకరచన అప్పుడే పూర్తి అయింది.
ఆ వుండిన డబ్బేమో యెన్నాళ్ళనుంచో వుంది.
అంటే డబ్బు పొంగు చల్లారింది; నాటకం పొంగు వుద్ధృతిలో వుంది, అప్పుడు.
అంచేత నాటకం బయటికి రావాలనిపించింది; గాని మళ్ళీ ఆ డబ్బు కూడుతుందో కూడదో అనిపించలేదు, నాకు.

మా నాయనగా రూళ్ళో లేని సమయాన, మా అమ్మగారితో చెప్పా నీసంగతి.

నా పరోక్షంలో యేమి జరిగిందో, మా నాయనగా రింటికి వచ్చిన మలీనాడే ఆ డబ్బు నా చేతిలో పెట్టేశారు, మా అమ్మగారు.

అది పుచ్చుకున్నాను, నడవలేదు, వురకా లేదు, పరుగెత్తేశాను, రాయవరం నేను.

వారం తిరక్కుండా మద్రాసునుంచి కాగితాలు వచ్చాయి.

మరో రెండు వారాల్లో అచ్చుపని పూర్తి అయిపోయింది.

మళ్లిడి సత్తిరెడ్డిగారు మొదటి ప్రతి ఆదరంగా నా చేతిలో పెట్టేటప్పుడు, దగ్గిరికి వచ్చి "మీరు కవీశ్వరులు – మీరు కవీశ్వరులు – మీరు కవీశ్వరులు–" అంటూ మూడుమూట్లు గొంతెత్తి అన్నారు నల్లమిల్లి సత్తిరెడ్డిగారు, మరిచిపోకుండా.

ఓః!

## 61

కవీశ్వరుణ్ణి కావడమే కాదు, నా పుస్తకం అచ్చుపని పూర్తి అయేటప్పటికి అచ్చుపనులున్నా కొంతకొంత నేర్చుకున్నా న్నేను.

అదంతా అనుకోకుండా జరిగింది, మొదట.

"హరిఃఓ"మ్మంటూ నల్లమిల్లి సత్తిరెడ్డిగారు నా నాటకం కంపోజు ప్రారంభించిననాడు, ఆయనతోపాటు సాయంత్రందాకా కేసు దగ్గిర తారట్లాడా న్నేను.

ఒక్కొక్క అక్షరమే సరదాగా తీశాను.

అది కంపోజు నేర్చుకోవాలన్న బుద్ధి పుట్టించింది.

శ్రద్ధపట్టి కేసంతా అర్థం చేసుకున్నాను, మర్నాడు.

నాటకం పూర్తి అయేటప్పటికి, అక్కడా అక్కడా వొక్కొక్క పేజీ చొప్పున, యే డెనిమిది పేజీలకు పేజీలే కూర్చి యిచ్చా న్నేను.

టైపు కలిపాను.

అక్కడి మెషీను చిలక ప్రెస్సు, నాలుగైదు మాట్లు సిరాకూడా వేస్తూవచ్చాను, పావుగంటా అరగంటాను.

ఫారాలు మడిచాను.

అవిన్నీ కంపోజు చేశాను.

నా వుబలాటం చూసి పనివా రివన్నీ నేర్పారు.

ఇది చూశారు చెన్నుభొట్ల పెద్దసత్యనారాయణమూర్తి గారు, సహించలేకపోయారు.

"కవీశ్వరులు పనివాళ్ళతో కలిసి అలాంటి పనులు చెయ్యడం మర్యాద కాదు. మాకున్నా తలవంపుల పని అది" అంటూ గిజగిజలాడిపోయా రాయన, చాటుకి తీసుకువెళ్ళి వొకనాడు నన్ను.

మరొక రెవరయినా అలా అంటే ఆలోచించివుందును, ఆయన అనడం నవ్వు తెప్పించింది, నాకు.

ఫక్కుమని వచ్చేసింది కూడా, నవ్వు.

"గ్రంథరచనే మరొకరిచేత చేయించుకున్న మీకు, ఇది అపకీర్తికరమే. మీ అంతస్థు వేరు, నా అంతస్థు వేరూను. మీ అంతస్థు అందుకోడం ఈ

నాకు సాధ్యంకాని పని; కనక, నావల్ల మీకు అపకీర్తి రాదు, బెంగ పెట్టుకోకండి" అని బదులున్నూ చెప్పా నాయనకు.

వెకిలినవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయా రాయన.

దానికేం, పుస్తకాలు చేతికి వచ్చీరావడంతోనే అయిదారు పత్రికలకు "రెవ్యూ" నిమిత్తం పంపాను.

ఆంధ్రపత్రిక వొక్కటి మాత్రం రెవ్యూ చేసినట్టు జ్ఞాపకం.

"ఇతివృత్తం మంచిది. అచ్చు బాగుంది. కాగితాలు గ్లేజువి. సంఘసంస్కర్త లాదరించతగ్గ గ్రంథం —" ఇదీ ఆ రెవ్యూ ధోరణి.

రచనను గురించిన మంచిచెడ్డ లొక్క అక్షరమున్నూ లేదు, అందులో,

అయినా "బొంబాయి పత్రిక నా కవిత్వం గుర్తించింది, చాలు" అనుకున్నాన్నేను.

అది యెలా వుండినా ఆ రెవ్యూ మూలాన పాతిక ముప్ఫయి ఆర్డర్లు వచ్చాయి.

వీ. పీ. ల విషయమున్నూ నాకు రెడ్డిగారే నేర్పారు.

రాజమహేంద్రవరం పట్టుకువెళ్లి చూపించగా రెండు మూడువందలు పుచ్చుకున్నారు, వర్తకులు.

దానా దీనా అచ్చు బిల్లు చాలామట్టుకి చెల్లింది.

నాటకం ప్రతులు చాలామంది కిచ్చాను.

లేకపోతే, నేను కవీశ్వరుణ్ణని నలుగురికీ తెలియడం యెలాగా ఆ "శుద్ధ" పల్లెల్లో?

నూటికి తొంభయిమంది నన్ను పొగిడారు.

"ఓహో, కవీశ్వరుడయినా"వని వీపున్నూ తట్టారు కొందరు, ఆశించినట్టు.

అయిదారుగురు ముభావంగా మాట్లాడారు.

"ఎవరికీ చూపించకుండా సాహసించి ప్రథమరచన యిలా ప్రకటించవచ్చా?" అంటూ మెత్తమెత్తగా మందలించారు, కూచిమంచి సాంబయ్యగారు.

"తప్పు లందరికీ వుంటాయి. అసలే చిన్నతనం, దానికి సాయం, కవిత్వంలో శిక్షణ యేదీ నీకూ; అనుభవం వచ్చిన కొద్దీ బాగుపడుతుంది, రచన మాత్రం మానకు" అంటూ బాగా ప్రోత్సహించారు, తటవర్తి వేంకటరాజుగారు.

విచిత్రం యేమిటంటే?

ఆ ప్రారంభావస్థలో కూడా, నేను కవి ననిపించుకోడం సహించలేక యెంతో యీర్ష్య కనపరిచారు, ఇద్దరు ముగ్గురు.

## 62

ఏమయితే యేం, ఆదిలో వుండిన పొంగు చల్లారింది నాకు, అయిదారు మాసాలు గడిచాప్పటికి.

రకరకాల తప్పులకే నా నాటకం వుదాహరణ అని తేలింది.

ఇద్దరు ముగ్గురు గట్టిగా ఆక్షేపించారు, హేళన కూడా చేస్తూ.

చాలా పౌరుషం వచ్చింది, నాకు.

ఇప్పుడు చూస్తున్నాను, కొంతమంది, తమ రచనలు కొందరికి చదివి వినిపించి తప్పులు దిద్దించుకుంటారు.

నేనూ అందుకే అచ్చు వేయించా నన్నట్టయింది, నా పని.

మరి, విశేషం యేమిటంటే?

"ఈ తప్పులు పట్టినవాళ్ళకే మనం తప్పులు పట్టా"లని అభిమానం పుట్టుకువచ్చింది నాకు.

రచన మానలేదు, పరిశ్రమ యెక్కువ చేశాను.

సొంతానికే కొన్ని తప్పులు తెలిశాయి.

సహృదయులు కొందరు చాలా సంగతులు చెబుతూ వచ్చారు.

ఈ స్థితిలో వొక విశేషం జరిగింది.

సాయంత్రం దీపాలు పెట్టేవేళకి రాయవరంనుంచి నే నింటికి వచ్చాను.

గుమ్మం సమీపించాటప్పటికి అరుగుమీద కూచుని వుండిన వృద్ధు డొకడు అమాంతంగా దిగి వచ్చి; గుచ్చి కౌగలించుకున్నాడు నన్ను – "కవిత కల్గిన రాజ్యాధికారమేల?" అంటూ.

చూస్తునుకదా, చిరపరిచితుడే ఆయన.

పామర్రు కాపురస్థలం ఆయనది, కమ్మదొరగారు.

చుట్టాల యింటికి తరుచూ పొలమూరు వచ్చేవా రాయన, ఆ రోజుల్లో.

తెనుగులో చెప్పకోతగ్గ సాహిత్యజ్ఞానం లేదు; గాని మంచి పురాణధోరణి మాత్రం వుండేది.

పద్యం యెత్తుకుంటే యెంతో పొంకంగా చదివేవారు.

వక్తృత్వమున్నూ చాలా మంచిది, ఆయనది.

ఎదటివాడికి మాట తొణకనిచ్చే రకం కా దాయన.

జాతకాల పిచ్చి మహా వుండే దాయనకు.

పొలమూరు వస్తే, భోజనభాజనాలు మాత్రం చుట్టాల యింటా, నిరంతరగోష్ఠి మా యింటాను.

వాచాటులంటే మహా మంట మా నాయనగారికి; కాని ఆయనతో మాత్రం గంటలకొద్దీ కూచునేవారు.

ప్రశ్న లడిగి మా అన్నలతోపాటు నన్నూ పరీక్షించి వుండినా రాయన, చాలామాట్లు.

తరవాత మా అమ్మగారు చెప్పారు, నేను రాకపూర్వం జరిగిన సంగతి.

నా ప్రస్తావన రాగా "వాడు కవిత్వం వెర్రిలో పడ్డాడు" అన్నారుట మా నాయనగారు, నిరుత్సాహంగా.

"ఏమిటీ?" అంటూ యెగిసి గంతువేశారుట ఆయన, ఆ మాట విని.

"చాలా చల్లని కభురు విన్నా"నంటూ సంబరపడ్డారుట.

"కవి కావడం పూర్వజన్మలో మహర్షి అయివుంటేనే" అంటూ నిర్వచించారుట.

"కననే, కవి మూడు లోకాలూ చూడగలడు" అంటూ నిర్ధారణ చేశారుట.

"ఏదీ, మీ అబ్బాయి వూహించినట్టు మీ రూహించండి, చూతాం" అంటూ పందెం వేశారుట.

"సిద్ధాంతిగారూ, నేటికి మీ పూర్వుల తపస్సంతా ఫలించింది. మీ కడుపున వంశోద్ధారకుడు పుట్టాడు" అంటూ మెచ్చుకున్నారుట వెళ్ళివెళ్ళి.

"ఇవాళ చిన్నతనం, ప్రౌఢవయస్సు రానివ్వండి, మీవాడు వోహో అనిపించుకుంటూ డెక్కడికి వెళ్ళినా. అతని పేరు శాశ్వతం అయిపోతుంది. అతని సూక్తులు వేదవాక్కులుగా మననం చేసుకుంటూ వుంటుంది లోకం" అన్నారుట.

నన్నయ్య, తిక్కన్న, యెర్రన్న, పోతన్న – మొదలైన మహాకవుల గోష్ఠి ఆయనకు తరుచు.

కవిత్వం అంటే యేమిటో ఆయనకు తెలుసు.

అలాంటి రసికు లాయన, నిండు కుండాను, వోటిమాటలు రావలాంటివారికి; కాని వాటిలో వొక్కమాటా నాకు చెల్లదు.

అయితే, దాంతో డంగయిపోయారుట మా నాయనగారు మాత్రం.

"నాకూ వెర్రి సంబరం పుట్టుకువచ్చిందిరా అబ్బాయీ" అన్నారు మా అమ్మగారున్నూ, ఇదంతా చెప్పి.

నే నొకందుకు సంతోషించాను.

చౌదరిగారి ప్రస్తావన, మా నాయనగారికి నా యెడల సద్భావం కలిగిస్తుందని నమ్మా న్నేను.

సరిగా అలాగే జరిగింది కూడా.

"కులవిద్య లెలాగా విడిచిపెట్టావు, ఆ కవిత్వం సంగతులన్నా కూలంకషంగా తెలుసుకో, నలుగురూ మెచ్చుకునేటట్టు చెయ్యి రచనలు" అంటూ ప్రోత్సహించసాగారు, మా నాయనగారు తరవాత్తరవాత, నన్ను.

## 63

మరోనా డింకో విశేషం జరిగింది, మా నాయనగారి ఆశీర్వచన బలంతో.

నే నింటో కూచుని పద్యాలు కట్టుకుంటున్నాను, బహిరంగంగా.

"నాన్నగారు పిలుస్తున్నా"రంది మా చెల్లెలు వచ్చి.

ఉదయం యెనిమిదిన్నర దాటి వుంటుంది, అరుగుమీద కూచుని యెవరితోనో మాట్లాడుతున్నారు, మా నాయనగారు.

చూడగా, ఆ మాట్లాడుతున్నవారు, అనపర్తి రెయిల్వే స్టేషన్ మాష్టరు పిళ్ళైగారు.

జాతకాలు చెప్పించుకోడం అన్నా, ప్రశ్నలు చూపించుకోడం అన్నా మహా యిష్టం, వారికి.

అందుకోసం, వారానికి రెండుమూడుమాట్లయినా పొలమూరు వచ్చేవా రాయన, మా నాయనగారి దగ్గిరికి.

అది ఫ్లాగ్ స్టేషను కనక, వుదయం యేడున్నర బండివెళ్ళిపోతే, మళ్ళీ పదకొండున్నర దాకా యెప్పుడూ తీరికే ఆయనకు.

నల్లగా, బొద్దుగా, కుదిమట్టంగా వుండేవా రాయన.

ఆయన వుద్దేశాలు గొప్పవీ, హృదయం బహువిశాలమున్నూ.

సితారు చక్కగా వాయించేవా రాయన.

అనపర్తిలో వైష్ణవయువకు డొకాయన, నోటితో మద్దెల ధ్వనులు బహుచక్కగా పలికించేవా డారోజుల్లో.

చాటున వుండి వింటే మద్దెలు వాయిస్తున్నట్టే వుండేది, అచ్చంగా.

రెయిలు ప్రయాణం తగిలితే కొన్నిగంటలు ముందుగా వెళ్ళి కూచునేవాణ్ణి నే నాస్టేషనులో, అనేకులతోపాటు వింటూ.

ఏ క్షణంలో చూసినా పిళ్ళెగారూ, ఆ యువకుడూ కలిసే వుండేవారు.

నందనారుకి సంబంధించిన అరవపాటలు పాడుతూ సితారు వాయించేవారు పిళ్ళెగారు, నందానందా అంటూ శరపరంపరగా.

అర్థం తెలియకపోయినా, సితారు వాయిద్యంలో కలిసి యెంతో శ్రావ్యంగా వుండేవి, ఆ పాటలు.

మా నాయనగారు కనపడితే, పాదాలు పట్టుకుని కళ్ళకద్దుకుని మరీ మాట్లాడేవా రాయన.

మా నాయనగారినిపట్టి నేనూ పరిచితుణ్ణే ఆయనకు.

వెళ్ళీ వెళ్ళగానే "ఉపయోగించండి" అంటూ పెద్ద పుస్తకం వొకటీ, వొకవైపునే అచ్చయిన రెయిల్వేఫారాల పుస్తకం వొకటీ, పెరుమాళ్ళుశెట్టి పెన్సిలు వొకటీ నా చేతిలో వుంచి నమస్కరించారు, పిళ్ళెగారు.

చూడగా "లక్ష్మీనారాయణీయం" అనే శుద్ధాంధ్ర పర్యాయపద నిఘంటువు ఆ పుస్తకం.

"ఒకనాడు స్టేషనులో రెయి లాగింది. దిగేవారు దిగిపోయారు, ఎక్కేవారు ఎక్కేశారు. ఒక కంపార్టుమెంటు తలుపు బయటికి తెరుచుకుని వుంది. లోపల యెవరూ లేరు. తలుపు వేదామని దగ్గిరికి వెళ్ళగా, పడిచెక్కమీద పడివుంది, యీ పుస్తకం. తీసి 'యెవరిదిది?' అంటూ రెయిలు పొడూగునా అడిగాను. నా అన్నవారు కనపడలేదు నాకు. స్టేషనులో వుంచి, వచ్చినవారి నందరినీ అడుగుతున్నాను; గాని యెవరూ ముందుకి రావడంలేదు. ఇది మంచి పుస్తకమనీ, పండితులకూ కవులకూ బాగా వుపకరిస్తుందనీ తెలిసినవారు చెప్పారు. మీరు కవీశ్వరులని మీ నాయనగారు చెప్పారు. అంచేతే మీ కిచ్చానిది. ఆ ఫారాల పుస్తకమూ ఆ పెన్సిలూ, మీరు పద్యాలు రాసుకోడానికి" అంటూ వివరాలున్నూ చెప్పారు, పిళ్ళెగారు.

ఫారాల పుస్తకమూ, పెన్సిలూ యివ్వడంలో ఆయన యెలాంటి ఆలోచనాపరులో బాగా బోధపడుతుంది, సులభంగా.

జరిగిందాని కంతటికీ చాలా వింతపడ్డా న్నేను.

అవి లభించినందు కెంతో సంబరపడ్డాను.

అంతకంటేనూ యెక్కువగా పిళ్ళెగారికి రుణపడ్డా న్నేను.

# 64

వృత్తాలలో గణాలు నియతంగా వుంటాయి, కనక, అక్కడి కక్కడ యిమిడే యిష్టార్థక శబ్దాలు పర్యాప్తమాత్రలతో చిన్నవీ పెద్దవీ కూడా స్ఫురించక ప్రతీకవీ అవస్థపడుతూనే వుంటాడు, ప్రారంభావస్థలో.

భావం సరసంగా మలచలేకపోవడం కంటే, గణాలకు పొదిగేమాట లేరుకోలేకపోడమే పద్యాలలో చిత్తజల్లుగా పడికట్టురాళ్లు పడ్డానిక్కారణం, ఆ అవస్థలో.

ప్రారంభావస్థలోనేకాదు, ఇటు భావనాబలమూ, అటు పాండిత్యబలమూ కూడా తక్కువగా వుండిన కవులకు అంత్యావస్థలో కూడా తప్పనిదే యీ దౌర్భాగ్యం.

ఏమయినా, పద్యం కట్టడమే కవిత్వం అనుకునేవారికి పద్యం పూర్తికావడమే ప్రధానం.

అప్పుడు నేనూ యీ స్థితిలోనే వుండినాను కనక, పర్యాయ పద నిఘంటువు కావడం కారణంగా, లక్ష్మీనారాయణీయం నాకెంతో వుపకరించింది.

ఏ గణాని క్కావలసిన మాట అయినా, సుళువుగా అందించేది నాకది.

పాతబడిపోయిన దయినా, మారుమూల దయినా, మళ్ళీ ఆ నిఘంటువే చూసుకుంటే గాని నాకే అర్థం కానిదయినా, ముందూ వెనకా వుండిన మాటలతో పొత్తు కలియక యెగుడు దిగుడుగా వుండినా, – మొత్తానికి పద్యం అతుకుల బొంతగానే తయారయినా, పూర్తి చెయ్యడానికి మాత్రం నాకు బాగా వుపయోగించే దామాట.

కవితాసాధనలో క్షేమేంద్రుడు చెప్పిన పాధకావస్థల్లో యిదొకటి.

"అర్థమూ అన్వయమూ చూసుకోవద్దు, మృదువైన శబ్దాలు సుళువుగా గణబద్ధం చెయ్యడం సాధన చేసుకో" మన్నాడు క్షేమేంద్రుడు.

అప్పటికి నే నీ సూత్రమూ యెరగను, అతని పేరూ వినివుండలేదు; కాని అతణ్ణే అనుసరించినట్టే అయింది, నా పని.

అర్థమూ అన్వయమూ కూడా చూసుకుంటూనే వెళ్ళేవాణ్ణి నేను ముందుకి, అతని సూత్రానికీ నేను చేసినదానికీ ఇదీ భేదం.

పదాలు గణబద్ధం చెయ్యడంలో అర్థమూ అన్వయమూ కూడా సరిదిద్దుకుంటూ వెళ్ళమని రెండో సూత్రం నిబంధించినట్టున్నా డతను, బాగా జ్ఞాపకం లేదిప్పుడు, నాకు.

ఏమయినా, పద్యాలు కట్టడంలో లక్ష్మీనారాయణీయం నాకు చేసిన మేలింతా అంతా కాదు.

ఒక సంవత్సరంపాటు రాత్రీ పగలూ కూడా నా చేతిలో బాగా నలిగిపోయిం దది.

అందులోవున్న మాట లనేకాలు నా కప్పుడు జిహ్వాగ్రాన వుండేవి, కళ్ళయెదట పేజీల సంఖ్యలతో.

అగత్యమైనప్పుడు, సంస్కృత శబ్దానికి సరి అయిన అచ్చిక పదమూ, అచ్చికపదానికి సరి అయిన సంస్కృత శబ్దమూ స్ఫురించడమున్నూ దానివల్లనే పట్టుబడింది నాకు, చాలామట్టుకి.

పోనుపోను, దానంతట అదీ నాకు దాని ఆగత్యం తగ్గిపోయింది, దాన్ని చేరదియ్యడం బుద్ధిపూర్వకంగా నేనూ మానుకున్నాను, నిజమే కాని, యెంతోకొంత అచ్చ తెనుగు నాకు పరిచితం కావడాని కదే మూలం.

దాని అగత్యం నాకు తీరిపోయేటప్పటికి, అనపర్తినుంచి బదిలీ అయి, యెక్కడికో వెళ్ళిపోయారు, పిళ్ళెగారు.

"పిళ్ళెగారు, పిళ్ళెగారు" అనేకాని పూర్తిగా అయన పేరు యెవరూ యెరగరు, నాకు తప్ప ఆ అగత్యమున్నా యెవరికీ అక్కర్లేపోయిం దప్పుడు.

లక్ష్మీనారాయణీయం రూపంగా అయన శుభాకాంక్షా, అయన దయా నాకెలాంటి పరిణతి కలిగించాయో ఆయనతో చెప్పుకుని కృతజ్ఞత తెలుపుకుందామంటే అవకాశం లేకపోయిందే అని నేను చాలా కాలం బాధపడ్డాను.

ఆ పుస్తకం కంటబడ్డప్పుడల్లా అయన జ్ఞాపకం వస్తారు, అయన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకీబాధ రెట్టిస్తుంది తప్పనిసరిగా, ఇప్పటికీ.

ఉండగా వుండగా, పని చేస్తూనే వున్నారో రిటైరే అయినారో తెలియని స్థితిలో, ప్రబుద్ధాంధ్ర పనిమీద తిరుగుతూ వుండినప్పుడు, ఒకనాటి రాత్రి నెల్లూరి స్టేషనులో కనపడ్డా రాయన హఠాత్తుగా.

అప్పు డక్కడ అసిస్టంటుగా వుండినా రాయన.

నాకు లక్ష్మీనారాయణీయం యిచ్చినప్పటికంటే ఉచ్ఛస్థితిలోనే వుండినాం, వుభయులమూ కూడా అప్పటికి.

చూసీచూడ్డంతోనే గుర్తించా న్నేను.

శరీరంలో స్థౌల్యమూ, శిరోజాలలో పాలిత్యమూ, మొగాన వాలిత్యమూ ప్రవేశించి వుండినా కంఠస్వరాన మార్పులేక అనపర్తిలో వుండినప్పటిలాగే వుండినా రాయన అచ్చంగా.

ఎదురుగా వెళ్ళి నుంచున్నా న్నేను, పిళ్ళెగారూ అని పిలుస్తూ.

ఎగాదిగా చూశా రాయన, గుర్తుపట్టే వుద్దేశంతో నన్ను.

"మీరు అనపర్తి మరిచిపోలే దనుకుంటాను" అన్నా న్నేను, అయన అవస్థ గ్రహించి.

"లేదు" అన్నా రాయన, ఆ ప్రదేశాలు జ్ఞాపకం చేసుకుంటూ.

"పాలమూరో?" అనడిగాను, మళ్ళీ నేను.

"అయ్యో, పాలమూ రెలా మరిచిపోతానూ? సిద్ధాంతిగారి దర్శనాని కెన్నిమాట్లు వెళ్ళాను కాదూ ఆ వూరూ?" అన్నారాయన, కుర్చీలో నిటాగ్గా కూచుంటూ.

"నన్నానవాలు పట్టలేకపోయారేం మరి?" అనడిగాను మళ్ళీ బెల్లించి చూస్తూ, నేను చొక్కా తొడుక్కుని వుండడమూ క్రాపింగు పెంచుకుని వుండడమూ మొదలైన కారణాలవల్ల అది ధర్మమే అనుకుంటున్నా కూడా.

మళ్ళీ యెగా దిగా చూశా రాయన, వులిక్కిపడి.

"ముందు చెప్పండి – మీరు సిద్ధాంతిగారి కుమాళ్ళా?" అంటూ ఆత్రంగా అడుగుతూ లేచిన్నీ నుంచున్నారు, వెంటనే.

ఆ సౌహార్దం గుర్తించాను, మాటరాక చూస్తూ నుంచుని వుండిపోయా న్నేను.

నా మౌనం భరించలేక "చెప్పండీ – చెప్పండీ – ఆ పుస్తకం – ఆ పుస్తకం – మీకేనా నే నిచ్చిందీ?" అనడుగుతూ వూగిపోయా రాయన, యెవరో కదుపుతున్నట్టు.

"అవు"నన్నా న్నేను, గద్గదికతో.

అంతే.

మరి, మాట లేదు, అమాంతంగా కౌగిలించుకుని నలిపేశా రాయన నన్ను, చంటిపిల్లవాణ్ణిలాగ.

ఇద్దరమూ కరిగిపోయాం.

ఒక్కక్షణానికి అలాగే వెళ్లి బెంచీమీద కూచున్నాం.

మా నాయనగారి నడిగి, వారు పరమపదించారంటే "మహానుభావులు" అంటూ చెయ్యెత్తి మొక్కి చాలా విచారించి, నేను వారిచ్చిన పుస్తకం వల్ల నాకు కలిగిన అభ్యుదయం వివరించి చెబుతూ వుంటే ఆనందోద్రేకంతో, గుచ్చికౌగిలించుకుని దగ్గిరికి లాక్కుంటూ పరవశులయిపోయా రాయన.

గంటసేపు చెప్పా న్నేను, ఏమిటేమిటో.

తామున్నా ఏమి టేమిటో చెబుతూ వుండిన్నీ, నేను కవిని కావడమూ, గ్రంథకర్త నయివుండడమూ, పత్రికా సంపాదకుణ్ణి కూడా అయి వుండడమూ రెట్టిస్తూ యెన్నోమాట్లు నన్ను దగ్గిరికి తీసుకున్నా రాయన.

కలరు తెప్పించి యిచ్చారు.

కొండరిటిపళ్ళున్నూ యిచ్చారు.

బుక్కింగు క్లార్కును కాదని, తమ పర్సు తీసి, టిక్కెట్టు స్వయంగా యిచ్చారు, మద్రాసుకి.

కూడా వచ్చి, దగ్గిరవుండి రెయిలెక్కించి, వెళ్లి వుద్యోగ ధర్మం నిర్వహించుకుని, బండి కదులుతుందనగా మళ్ళీ వచ్చి, "కవిగారూ" అని పిలుస్తూ రెండు చేతులూ పట్టుకుని, హృదయం ద్రవించి కంఠం రుద్ధమయిపోగా మాట రాక, బండి కూడా నాలుగడుగులు నడిచి, ఆగి, చెయ్యెత్తి మొక్కి "సెలవ్" అన్నా రాయన, సప్రయత్నంగా అప్పటికి మాట తెచ్చుకుని.

బలవంతాన మమ్మల్నిద్దరినీ వేరుచేసింది, రెయిలు.

స్పష్టంగా, మసకగా, మనిషిగా, స్థాణువుగా కనపడ్డంతసేపూ కిటికీలోనుంచి చూస్తూనే వుండిపోయా న్నేను.

అందరిలాగా రెయిలు కుదుపుతో కాక, ఆనంద డోలికల్లో వూగిన్నీపోయా న్నేను, తరవాత.

అలాంటి హృదయాలు ఏ కోటికో వొకటి.

అలాంటి వ్యక్తులున్నూ యే పదికోట్లకో వొకరు.

వారి హృదయం నా యెడల అంత స్నిగ్ధం కావడానికి, సన్నికృష్టకారణం నా అదృష్టమూ, విప్రకృష్టకారణం యీశ్వరేచ్ఛాను.

నెల్లూరి స్టేషనులో కనపడి ఆయన చూపించిన ఆ అనురాగం – ఆ స్నేహం – ఆ మమత – అదేదో అది జ్ఞాపకం వచ్చి పారవశ్యం కలుగుతూనే వుంటుం దిప్పటికీ నాకు.

అయితే, అంత ఆనందంలోనూ కసింత విచారం పొటమరిస్తూ వుంటుంది నాకు, రాసుకుంటూ రాసుకుంటూ వుండగా, నిద్రవచ్చి అలుముకునేటట్టు రాత్రివేళ.

ఏమిటంటే?

అప్పుడయినా, అయన పే రడగలేకపోయా న్నేను.

యుష్మదస్మత్పదాలు శ్రవణశ్రావణ యోగ్యాలు కావడంతోపాటు, ఆనంద పారవశ్యమున్నూ కమ్ముకుని వుండడంవల్ల ఆ మాటే స్ఫురించలేదు, నా కప్పుడు.

రెయిలు గూడూరు స్టేషను సమీపిస్తోందనగా, జ్ఞాపకం వచ్చిందీ సంగతి.

"అయ్యో" అనుకున్నాను, పైకి, పరిసరాలు మరిచి.

ఎదట కూచుని వుండిన వృద్ధాంగన, తా నులిక్కిపడి "ఏమి నాయనా?" అనడిగింది, నిద్రతో బరువెక్కిపోయి వుండిన కనురెప్ప లల్లార్చుకుంటూ.

## 65

పద్యరచన జిగితేలుతోంది.

ఆత్మప్రత్యయమున్నూ బలపడుతోంది, బాగా.

నలుగురూ "కవి" అనడం ప్రారంభించారు, నన్ను.

నాటకం ప్రతుల అమ్మకంతో, అప్పుడప్పుడు డబ్బున్నూ అందుతోంది చేతికి కొంచెం కొంచెం.

బిల్లుశేషం విషయమై రెడ్డిగారి నిర్బంధం లేకపోడంవల్ల సొంతానికి ఖర్చుపెట్టు కోవాలన్న అభిలాషతోపాటు, అవకాశమున్నూ యేర్పడుతోంది, కాస్తకాస్త.

దాంతో, అంతవరకూ అణగారిపోయి వుండిన వేషాభిలాష వొక్కమాటుగా వుబికేసింది, నాకు.

వశమున్నూ తప్పిపోయింది.

రెండు షర్టులూ వొక కోటూ కుట్టించాను, వెంటనే.

కండవాలు మంచివి రెండూ, యెనిమిది గజాల పంచెల చాపాకటీ కొన్నాను.

ఒక్క నెల పుస్తకాల అమ్మకంతో వచ్చిన వస్తువులివి.

అయితే, చొక్కాలు తొడగడం కొంచెం రహస్యంగా వుంచవలసి వచ్చింది, కొన్నాళ్ళపాటు.

కుట్టించిన నాలుగైదు మాసాలదాకా నే నొదిగివొదిగే వున్నాను; కాని వొకనాడు, షర్టూ షర్టుమీద కోటూతో మా నాయనగారి కంటపడ్డాను, హఠాత్తుగా.

మా అమ్మగారి వుద్దేశం "తొడుక్కో"మనే.

"చొక్కా తొడుక్కుంటేనే బాగుంటుంది నువ్వు" అనేవా రామె.

నేను షర్టు తొడుక్కుని నుంచుంటే, వెనక్కి వచ్చి కోటు తొడిగేది, మా సీత కూడా, యిష్టాపూర్తిగా.

మా నాయనగారే యిష్టపడేవారు కారు.

నే నూరికి వెళ్ళవలసివచ్చింది, అంతకితం వొకనాటి మధ్యాహ్నం.

మా అమ్మగారూ నేనూ కూడా మా నాయనగారింటో పడుకుని నిద్రపోతున్నా రనుకున్నాం.

ఈ ధైర్యంతో నేనవి తొడుక్కుని బయలుదేరాను.

ఏమిటో చెబుతూ వీధిగుమ్మందాకా వచ్చారు, మా అమ్మగారు.

ద్వారం దాటాను, చూడగా, పెద్దపులిలాగ అరుగుమీద మా నాయనగారు.

ఎఘురిపోయా న్నేను.

"చొక్కాలు కూడా తొడుగుతున్నాడూ, అప్రాచ్యుడూ?" అంటూ మా నాయనగారు పళ్లు కొరకడమూ, "ఈ కాలపు వాళ్ళ సరదాలవి, పోనిస్తురూ" అంటూ మా అమ్మగా రందుకోడమూ విన్నాను, అంతే.

అంప్పటి కప్పుడే మళుపు తిరిగేశా న్నేను.

మర్నాడింటికి వచ్చాటప్పటికి మా నాయనగారు జపం చేసుకుంటున్నారు, బాధ లేకపోయింది.

తొలినాడు నే నిల్లుదాటి వెళ్లాక మా నాయనగారూ మా అమ్మగారూ అక్కడే కొంచెం వాగ్వాదం చేసుకున్నారుట.

అయితే "ఇంటో వున్నప్పుడు మాత్రం తొడుక్కోకు" అని సలహా చెప్పారు నాకు, మా అమ్మగారు.

అలాగే చేశాన్నేను.

అప్పటికీ యిప్పటికీ కూడా యింటో వున్నప్పుడు నేను చొక్కాలు తొడగను, అలవాటయిపోయింది, బాగా.

అయిదారు మాసాలు గడిచాటప్పటి కీవిషయమై నేను కొంచెం తాదుబారాను గాని; యీలోపున నొకనాడు చాలా రభస జరిగింది.

రాయవరం వెళ్ళి వస్తూ మా చిన్నన్నగారి యింటికి చొక్కాతో వెళ్ళాను, మహేంద్రవాడలో.

అప్పు డక్కడ వుండిన మా పెద్దక్కగారు "నీ కిదేం పని?" అంటూ నన్ను మందలించవచ్చారు.

"మరి, నీ కొడుకు తొడగడం లేదూ?" అని ముదలకించా న్నేను.

"నా కొడు కింగ్లీషు చదివాడు, నీకేం వుందీ?" అందామె, మహా గర్వంగా.

"నీ కొడుకు చదువే చెప్పాలి" అంటూ నే నీసడించాను, అంతకంటే హేళనగా,

థర్డుఫారం చదివి ఫెయిలున్నూ అయి, నిర్వ్యాపారంగా కూచునివున్నా డామె కొడుకు.

ఏ కళని వున్నారో, మా చిన్నన్నగారున్నూ "నీ కొడుకు చదువూ నొక చదువేనా?" అన్నా రావిణ్లే.

అది కొట్టినంత పని అయిం దావిడికి.

మర్నాడు పాలమూరు వచ్చి, రాత్రి భోజనాల సమయాన నా చొక్కాల ప్రస్తావన తెచ్చి "చూస్తూ వూరుకుంటున్నారా?" అనడిగిం దామె, మా నాయనగారిని.

తప్పు జరుగుతూ వుండినందుకు బాధపడేవారికి మరొకళ్ళు వచ్చి, ఆ తప్పు ఉటంకరిస్తే అగ్గిమీద గుగ్గిలం వేసినట్లవుతారు అసలువాళ్లు.

దీంతో, అభిమానం ముంచుకువచ్చింది మా నాయనగారికి, చ(రుమన్నారు నామీద.

మా నాయనగారికి వచ్చిన అభిమానమే మా అమ్మగారికీ వచ్చింది, అంతకంటే యెక్కువగా.

అయితే, రకం మాత్రం వేరు.

కారణమూ వేరే.

మాటపడే స్వభావం కా దామెది, సహజంగా.

దీనికి సాయం, నచ్చ జెప్పవలసిన మా అక్కగారే మా నాయనగారికి ఆగ్రహం రేపెట్టడం.

అది మా అమ్మగారికి మరీ బాధ అనిపించింది.

"మరి, నీ కొడుకు తొడగడం లేదూ?" అంటూ మా అక్కగారి మీద కస్సుమన్నా రామె, వెంటనే.

"మనమణ్ణి ముద్దుపెట్టుకుంటారేం, మరీ?" అంటూ మా నాయనగారినీ యెదురడిగారు.

"ఇద్దరూ యిద్దరే, వొక్కడికయినా బుద్ధి వుంటేనా కాస్త అయినా?" అంటూ రుంజుకున్నారు, మా నాయనగారు.

"నా కొడు కింగ్లీషువాడు, ఎరుగుదువా?" అంటూ నిలవతీశారు, మా అక్కగారు, దానిమీద.

"నా కొడుకు కవీశ్వరుడు, తెలుసా?" అంటూ డీకున్నారు, మా అమ్మగారు, దురుసుగా.

ముగ్గురూ కొంచెం కీచులాడుకున్నారు.

నేనుమాత్రం వింటూ చూస్తూ వూరుకున్నాను.

తరవాత రెండు రోజుల దాకా నామీద కొరకొరలాడుతూనే వున్నారు మా పెద్దక్కగారు, మా నాయనగారు మాత్రం ఆ మాటే యెత్తలేదు, మళ్ళీ.

అది గ్రహించి బెదురుతీరి, ధారాళంగా చొక్కాలు తొడుక్కోసాగాను, తరవాత నేను.

మా చిన్నన్నగారికీ వుంది, చొక్కాలమీద తీవ్రప్రాతికూల్యం యిప్పటికీ; కాని, అంతక్రితం బంధువుల యింటో శుభకార్యా లయినప్పుడు తొడుక్కోవచ్చునని వొక కోటు కుట్టించుకున్నా రాయన, ఆ చిన్నతనాన.

అమరం వల్లించడం లేదని గట్టిగా కొట్టా రొకనాడు, న న్నాయన.

నవారుబద్దీతో కొంతసేపు వసారా స్తంభానికి కట్టివేశారు.

అప్పటికీ ఆగ్రహం తీరక, గదిలో పెట్టి బయట గొళ్లెం వేశారు కొంతసేపు.

నా కిష్టం లేని చదువుకోసం నిర్బంధించడం – సాటివాడు కట్టివెయ్యడం, చెరబెట్టడం – ఎవరికయినా బోధపడుతుంది, దుర్బలుని పరిస్థితి.

నా కభిమానం వచ్చింది.

ముంచుకునే వచ్చేసింది బాగా.

అశ్రుపూరితనేత్రుణ్ణల్లా రోషకషాయితనేత్రుణ్ణయిపోయాను, గదిలో.

ప్రతీకారం చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

మానసిక బాధ యెలా వుంటుందో ఆయనకు రుచి చూపించాలని నిరుకుచేసుకున్నాను.

ఆ గదిలో చిలకకొయ్యని వేలాడుతోంది, ఆయన కోటు.

వీరభద్రావతారం తాల్చేశాను, వెంటనే.

మా అమ్మగారి పెట్టెలో వున్న కత్తెరతీసి జానెడుపైగా ఆ కోటు వీపు కత్తిరించేశాను, నిలువుగా.

నాకు మళ్ళీ దెబ్బలు తగిలాయనుకోండి.

మా అమ్మగారున్నూ కోప్పడ్డారనుకోండి, చాలా.

నాకుమాత్రం కొంత తృప్తి అయింది.

విద్యలు నేర్చినా, నేర్చకపోయినా, వైదికుల కందరికీ చొక్కాలంటే మహా మంటగా వుండే దప్పుడు.

అయితే, పాలమూరిలో, నియోగులయిన మున్సబుగారి తమ్ములతో సాహచర్యం నాకు చిన్నప్పుడు.

వా రెప్పుడూ చొక్కాలు తొడుక్కునే వుండేవారు.

చిత్తవృత్తి మారడం – వైదికవిద్యలంటే ప్రాతికూల్యం యేర్పడ్డం – ఇలాంటి సాహచర్యం – దీంతో చొక్కాల వ్యామోహం ప్రారంభం అయిపోయింది, అప్రయత్నంగా నాకు.

పెద్దపెరిగి, ఒక నాటకం రచించి, అచ్చున్నూ వేయించి, స్వార్జితం కొంత డబ్బు చేతికి రావడం ప్రారంభం కావడంతో అది దుర్భరమే అయిపోయింది.

## 66

వెనకటిమాట అలా వుంచుదాం.

వైదికుల సంగతి కూడా అలా వుంచేద్దాం.

షర్టన్నా కోటన్నా, మనలో కొందరి కిప్పుడు వల్లమాలిన ద్వేషం, లౌక్యుల్లోనే.

అవి తొడగడం యింగ్లీషువాళ్ళ ననుకరించడం అనీ, అచ్చంగా భావదాస్యం అనీ వారి భావన.

సొంతానికి ధర్మనిర్ణయశక్తి లేకపోడంవల్ల అనుకరణ పరాయణులకు కలిగే భ్రాంతి యిది.

క్రాపింగులు పెంచుకుంటారు, సిగరెట్టుమీద సిగరెట్టు వూదేస్తారు, తమలోతా మింగ్లీషులోనే మాట్లాడుకుంటారు మళ్లీ, షర్టూ కోటూ అంటేనే విజాతీయత జ్ఞాపకం వస్తూంది, వారికి చట్టున.

వారి ఆభిజాత్యమున్నూ దెబ్బ తింటుంది, గాఢంగా.

పెద్దలు నలుగురూ చేరి "జాతీయమైన వేషం యిదీ" అంటూ సరసమైన నిర్ణయం చేసేదాకా యెవళ్ళ రుచి వాళ్ళదీ అనయినా అనుకోరు వారు.

ఊరూకోరు.

తంబుచెట్టివీథే వెడుతున్నా వొకనాడు నేను మద్రాసులో.

ఆంధ్రపత్రిక ఆఫీసు దాటి, ఆనందవాణి ఆఫీసు దగ్గిర నడుస్తున్నాను.

మిత్రులు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారూ, కప్పగంతుల సత్యనారాయణగారూ తారసిల్లారు, ఎదురుగా వస్తూ.

కుశలప్రశ్నాదికం అయింది.

"ఏం వచ్చారు?" అనడిగారు, సత్యనారాయణగారు.

నే నింకా బదులు చెప్పలేదు "రేడియోకి అయివుంటుంది" అన్నారు, వేంకటేశ్వరరావుగారు.

ధర్మమే వారలా అనుకోడం, ఆ ప్రారంభదినాల్లో మద్రాసు రేడియోలో తరుచు ప్రసంగించేవారు, వారేమి టేమిటో.

కొందరు రచయితలకున్నూ మద్రాసు వెళ్ళడాని కప్పుడదే కారణం.

"విన్నకంఠాలే మళ్ళీ మళ్ళీ వింటున్నాం, మారుపేర్లతో" అంది ఆంధ్రభూమి పత్రిక, అంతకితమే, కొందరిని మనస్సులో వుంచుకుని.

నాకున్నూ అడపాతడపా ఆహ్వానాలు వస్తున్నా యప్పుడప్పుడే, వెళ్ళడానికిమాత్రం మనస్కరించడంలేదు.

వెళ్ళకూడదనిన్నీ అనుకున్నా నొకవిధంగా.

సత్యనారాయణగారు తమ ధోరణి సాగిస్తూనే వున్నారు. నేనూ మాట్లాడుతూనే వున్నాను వారితో.

ఏమి తోచిందో మరి "మీ కెన్నికోట్లున్నా యండీ?" అనడిగారు వేంకటేశ్వరరావుగారు, నన్ను, మా సంభాషణకి అడ్డంవచ్చి హేళనగా.

"తెనుగువాళ్ళలో కోటీశ్వరులయినవాళ్ళున్నట్టులే దెవరూ, నాకు మాత్రం బహువచనం మీదే వున్నాయి కోట్లు," అని బదులు చెప్పాను దానికి, సాదరంగా.

అప్పటికింకా వోపెనుకోట్లే తొడుగుతున్నాను, అవంటే వారికి మరీ వెగటులా కనబడింది.

పూర్వావస్థ మాటకేం, అప్పటికి కద్దరు లాల్చీధారులు, వారు.

ఒక పెదవిలో కొత్తసిగరెట్టు అంటించి పెట్టుకునే రెండో పెదవిలో వున్న పాతసిగరెట్టు తీసిపారేసేవా రున్నారు మనలో, నే నెరుగుదును.

"చెయిన్‌స్మోకింగు" అంటారుట దీన్ని ఇంగ్లీషులో, మిత్రులు పురిపండా అప్పలస్వామిగారు చెప్పారు మొన్నమొన్ననే, దీని అముద్రితప్రతి వింటూ.

కానైతే, వెంకటేశ్వరరావుగారిదీ ఆ పద్ధతే, నే నెరుగుదును.

కాల్తూ కాల్తూ వున్న సిగరెట్టుతోనే ఫొటోదిగుతారు కూడా, వేంకటేశ్వరరావుగారు.

ఇవాళ చూస్తేకూడా వేంకటేశ్వరరావుగారి యింటో వున్నన్ని యింగ్లీషు (నాటక వాఙ్మయం) పుస్తకాలు, ఏ యింపీరియల్ లైబ్రరీవంటిదాల్లోనో తప్ప కనబడవుట, వారే చెప్పారు, నన్ను తీసుకువెళ్ళి చూపిస్తూ వొకనాడు.

ఇంతకీ, –

తరవాత – కోట్ల ప్రస్తావన జరిగిన కొన్నాళ్ళకి – గోఖేలు హాల్లో తారసపడ్డా రొకనాడు, వేంకటేశ్వరరావుగారు నాకు.

ఆంధ్ర విద్యార్థి విజ్ఞానవారోత్సవాల సందర్భం అది.

ఆవేళ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా రధ్యక్షత వహించవలసివుండింది.

కారణాంతరాలవల్ల వారు రాలేకపోగా, భారతి ఆఫీసులో శ్రీ రంగాచారిగారితో మాట్లాతూ కూచుని వుండిన నన్ను, అందుకొప్పించి తీసుకువెళ్లారు, శక్రటరీ నరసయ్య (?) గారు.

అయితే "అయిదేళ్ళపాటు ఏ సభలోనూ వుపన్యసించగూడ"దని వొక నియమం పెట్టుకుని వున్నాన్నే నప్పటికి.

మొదటా చివరా కూడా నే నేమీ ఉపన్యసించకుండా వుండే పద్ధతి మీదే తీసుకువెళ్ళారు, శక్రటరీగారు నన్ను.

కాగా, నేను ముందు పొడిమాటలతో కార్యనిర్వాహకులకు కృతజ్ఞత చెప్పి, తరవాత, వక్తలయిన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారిన్ని, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారినీ టూకీగా సభకు పరిచయం చేసి, చివర మళ్ళీ క్లుప్తంగా వందనాలు చెప్పి వూరుకున్నా నావేళ.

ఆ సభలో తారసపడ్డారు, వేంకటేశ్వరరావుగారు.

పార్శీకాలరు – ఇంగ్లీషుకలరు – కోటు తొడుక్కుని మరీ వచ్చారు, వా రాసభకు.

వారూ గుర్తించుకునే వుంటారు, ఆ కోటుతో వారి కొక నిండూ, వొక ఔజ్జ్వల్యమూ వచ్చివున్నాయి.

నిజమే; కాని కోటు తొడుక్కుని వుండినందుకే, నన్నొకనాడు హేళన చేసినవారే కోటు తొడుక్కోడం వింత కాదూ?

అయితే, గుజరాతీల ఆఫీసులో పనిచేస్తూ వుండినందున కోటు తొడుక్కోవలసిన అగత్యం యేర్పడి వుంటుంది వారికి, ఎంత యిష్టం లేకపోయినా.

కాలం – కాలచక్రం గిర్రున తిరిగిపోతుందిగాని నిలకడగా వుండదు, మరి.

జాతికి జాతినే మార్చేస్తుందది, వొక్క వ్యక్తి లెక్కేమిటి దానికి, సాధారణంగా?

గుర్తించుకోగలిగితే – సత్యం అంగీకరించగలిగితే – ఉద్రిక్తులం కాకుండానూ వుండగలిగితే – మనం అందరమూ మారాం.

చాలా చాలా మారాం.

తలొక మోస్తరూను, అంతే భేదం.

ఈ మార్పు మాత్రం యేకత్వానికే, భిన్నత్వాని క్కాదు.

హలం విడిచి కలం చేతబట్టారు, వేంకటేశ్వరరావుగారు.

స్రుక్స్రువాలు విడిచి కలం చేతపట్టా న్నేను.

ఒక్క తాటిమీద లేమూ, నేనూ వారూను, ఇప్పుడు?

ఆంధ్రత్వానికి సమగ్రత సాధించి, దాల్లో భారతీయత రూపొందించడాని క్కాదూ, భుజమూ భుజమూ రాసుకుంటూ పనిచేస్తున్నది, నేనూ వారూను ఇప్పుడు?

నిరంతర సాధనతో నాలో పరిణతి యేర్పడ్డది మొదలు, ఇదీ నా ధోరణి.

ఉపాధి భేదంతో తప్పనిసరిగా భిన్నభిన్నం అయిన వ్యష్టిరుచితో సమష్టిప్రాప్యం భగ్నం చేసుకోడం నా పద్ధతి కాదు.

సభ పూర్తిచేసి నేను వేదిక దిగి వస్తూవుంటే, ఎవరితోనో మాట్లాడుతూ ఆ దారిలో నుంచుని వుండి, వేంకటేశ్వరరావుగారే పలకరించారు, నన్నావేళ.

ఆనవాలు పట్టలేకపోయాను, మొదట.

అందుక్కారణం ఆ కోటే. అది చెప్పుకున్నాను, తరవాత.

ఇద్దరమూ నవ్వుకున్నాం, కుశలప్రశ్నాదికం చేసుకున్నాం, యెవళ్ళదారిని వాళ్లం వెళ్ళిపోయాం, చివరికి.

ఇంతకీ, –

చెప్పవచ్చిందేమిటంటే?

షర్టూ కోటూ అంటే, అది యింగ్లీషువారి డ్రెస్సు అని అపోహ, మనలో కొందరికి.

సొంతానికి లాల్చీ వేసుకుంటారు వారు, అది జాతీయం వారిదృష్టిలో.

అది ముస్లిములది అంటే వారు తృప్తిపడరు.

ఇంగ్లీషువారు షర్టూ కోటూ తొడుగుతారు కనక, మొన్నటిదాకా వారు మనల్ని బానిసలుగా తొక్కేసి వుంచారు కనక, వారి యెడల గల నిరసనభావంవల్ల షర్టన్నా కోటన్నా నిరసిస్తారు గాని, వారు, అవి యింగ్లీషువారివి మాత్రమే కావనీ, పరాసులూ, జర్మనులూ, రష్యనులూ, అమెరికనులూ, ఇటాలియనులూ – మొదలైన పాశ్చాత్యజాతుల వారికందరికీ నియాతాలనీ గుర్తించరు వారు.

సర్వతంత్రస్వతంత్రులైన జపానీయులూ, చైనీయులూ, ఈజిప్షియనులూ – ఇలాంటి ప్రాచ్యజాతులవారున్నూ బాహాటంగా వాడుకోవడంతో అవి విశ్వజనీనాలయిపోయాయని గూడా వారు గ్రహించలేరు.

సంపూర్ణ స్వాతంత్ర్యం చేజిక్కిన వెంటనే, తామే మెచ్చుకుంటున్న కెమాల్ పాషా, తన టర్కీ జాతి అంతా – స్త్రీ పురుషులు యావన్మందీ యురపియను డ్రెస్సే వాడాలనీ అంతవరకూ తమకు జాతీయమై వుండినది వాడకూడదనీ కఠినంగా శాసించివున్నాడే, అదేమిటోకూడా వారు యోచించరు.

మంత్రిపదవులు వచ్చాక మన గిరిగారూ, గోపాలరెడ్డిగారూ ముస్లిముల షేర్వాణీలు ధరించడం ప్రారంభించారు, అదీ తప్పుగా కనపడదు, వారికి.

షర్టూ కోటూ అంటేనే వారికెక్కడలేని వెగటున్ను.

"ఆంధ్ర నెహ్రూ" అనిపించుకోవాలన్నవారు మనలో యెందరో.

అసలు నెహ్రూగారే, యురపు వెడితే, షర్టూ కోటున్నూ మాత్రమే కాక, పంట్లామున్నూ తొడిగి, హేటూ బూటూ కూడా ధరించి అచ్చంగా దొరగా రయిపోతారే, మన ఆంధ్ర నెహ్రూల గతి యేమిటి యిక?

కాక, –

ఒక మహాజాతికి నాయకులైన నెహ్రూగారి కలాంటి అనుకరణ పరాయణత్వం తగునా?

ఇదీ ఆలోచించరు వారు.

ఎండలెంత మండిపోతూ వుండినా, వుక్కిపోయి చావడానికయినా వొప్పుకుంటాడు గాని; యురపియను, తన జాతీయవేషం విడిచి మన బట్టలు కడతాడా,

యిక్కడ వుండినంత కాలం అయినా?

ఇదీ గమనించరు వారు.

పోనీ, గుజరాతీలూ, బెంగాలీలూ, షేర్వాణీల సొంతదారులైన ముస్లిములూ తమ జాతీయవేషం విడిచి షర్టూ కోటూ పంట్లామూ తొడుగుతారేం యెందరో?

తాము వారి ఉచ్ఛిష్టం స్వీకరించి, సర్వజనీనమైన డ్రెస్సు, శీతవాతాతపాల కనుగుణం అయినంతవరకూ అవలంబించినవారిని కాదనడం యేమి ప్రాజ్ఞత?

## 67

అంతకితం యేడెనిమిది సంవత్సరాలనాడు, కోలంక వీరవరం వగైరా యెస్టేట్ల జమీందారు శ్రీ రావు చెల్లాయమ్మారావుగారి ఆదరాభిమానాలతో, కొందరు నటులు శ్రీ సత్యనారాయణ నాటక కంపెనీ అన్నపేరితో వచ్చి వారానికి రెండు చొప్పున ఆరు మాసాలపాటు ఏమి టేమిటో నాటకాలాడి వెళ్లిపోయారు, మండపేటలో.

ఆ నటుల్లో, చిరకాలం – అవసానం దాకా ఆంధ్రపత్రిక సంపాదకీయవర్గంలో వొకరయివుండిన శ్రీ వెదురుమూడి శేషగిరిరావుపంతులుగారు, ముఖ్యుల్లో ముఖ్యులు.

అప్పటికి రఘువంశం చదువుతున్నాను మా పెద్దన్నగారి దగ్గిర నేనింటోనే.

బుధవారమూ శనివారమూ తెల్లవారడం భయం, తొమ్మిదీ – పదిగంటలమధ్య, టముకువేసే మనిషికోసం వీధి అరుగు అంటిపెట్టుకుని వుండేవాణ్ణి.

కార్లూ లేవు జట్కాలూ లేవు, చెవులు బద్దలుకొట్టే బాండువాద్యం అసలే లేదు, పంచము డొకడు డప్పు వాయించుకుంటూ వచ్చి కాగితాలు పంచిపెట్టేవా డారోజుల్లో.

తన కేవ్వూాళ్ళు నిర్ణీతాలో, ఆ వూాళ్ళలో తాను టముకు వేసినట్టు పెద్దమనుష్యులచేత సంతకాలు చేయించుకునేవా డామనిషి.

పాలమూరికల్లా పెద్దమనిషి న్నేను, నాలుగైదు వారాలు గడిచే టప్పటికే కనిపెట్టేశా డామనిషి, నా శ్రద్ధాసక్తులు.

ఆ ఆరు మాసాలూ, వారానికి రెండు చొప్పున అన్ని నాటకాల నోటీసులూ సంగ్రహించా న్నేను.

డెమ్మీ షీటు మూడుముక్కల సైజులో, కథాసంగ్రహం అంతా, అంకాలవారీగా ముద్రింపించేవా రానోటీసుల్లో, ఆ కంపెనీవారు.

అవన్నీ సుందరకాండ అన్నట్టు పారాయణ చేసేవాణ్ణి నేను, దినమ్మూ.

కానయితే, వొక్క నాటకమూ నేను వెళ్లి చూడలేదు, అయినా, జిహ్వాగ్రాన వుండేవి ఆ కథలన్నీ నాకు.

పుస్తకం పుస్తకంగా ఆడేసేవా రాకంపెనీవారు, నాందీ ప్రస్తావనలు కూడా విడిచిపెట్టకుండా.

వీధి భాగవతాలూ, తోలుబొమ్మలాటలూ, గొల్లభామ కలాపాలూ మాత్రమే యెరిగి వుండిన ఆ చుట్టుపట్ల యాభై అరవై గ్రామాలవారికీ, ఆ ఆరుమాసాలూ ఆ నాటకాల విషయమే శ్రీరామమయం అయిపోయింది.

దేవతలే దిగివచ్చి మండపేటలో నాటకా లాడిపోతున్నారన్నట్టు చెప్పుకునేవారు, లోకు లప్పుడు.

పండితులూ వేదం చదువుకున్నవారూ కూడా వెళ్ళి చూశారు చాలామంది ఆ నాటకాలు, నాకు బాగా తెలుసు.

అందుకు పర్యవసానంగా, లక్షరూపాయలకు పైగా కొల్లగొట్టుకుపోయా రక్కణ్ణుంచి, ఖర్చులు పోను ఆ కంపెనీవారు.

అయితే, డబ్బెంత పట్టుకుపోయినా, ఆ గ్రామాలవారికి మంచి నాటకాభిరుచి కలిగించే పట్టుకుపోయారు, పాపం వారు.

అతిశయోక్తికాదు, ఆ నాటకాలు చూడ్డంతో, ఆ గ్రామాలవారిలో చాలామంది సాహిత్యప్రియులయినారు.

నాటకాల ఆంతర్యమే కాదు, స్థాయీ తెలుసుకున్నారు.

వారిలో చాలామంది మంచి విమర్శకులయినారు.

తరవాత కొంతకాలం దాకా మండపేట గ్రామం నాటకాల పీఠంగా చెలామణీ అయిపోయింది.

జిల్లాలో యెక్కడ నయినా నాటక సమాజం వెలిసిందా, అది ఆ నాటకాల ప్రసాదమే.

ఇంతేకాదు, –

ఆ కొత్త కంపెనీలవారు, మొట్టమొదట మండపేటలో నాటకా లాడవలసిందే, లేకపోతే వుప్పు పుట్టేది కాదు.

ఆ ఖ్యాతిలో యెంద రెందరో వచ్చి అక్కడ నాటకా లాడేవారు; కాని ద్రష్టల విమర్శలు తట్టుకోలేక వొకటిరెండు నాటకాలతోనే స్వస్తిచెప్పుకుని వెళ్ళిపోయేవారు.

అవీ యివీ కూడా అన్ని నాటకాలూ చూసిన రాయవరం గ్రామస్తుల్లో మల్లిడి సత్తిరెడ్డిగారూ, విలపర్తి బుచ్చిరాజుగారూ ముఖ్యులు.

అవి అంత ఆబగా చూడ్డంవల్లనే, మొదటమొదట నాటకాలూ, వాటినిపట్టి సాహిత్యాభిరుచి కలిగి, దృఢపడి, తరవాత నవలలూ, కథలూ, ప్రబంధాలూ మొదలైనవి చదవడం అలవాటయింది, రెడ్డిగారికి.

బుచ్చిరాజుగారికి మాత్రం లేశమూ సాహిత్యవాసన తగల్లేదు, గానాభిరుచీ ప్రవేశమూ మాత్రం పెరిగిపోయాయి.

దాంతో, ఆయన శాస్త్రీయసంగీతంలో కూడా అడుగు పెట్టారు, కొంచెం.

ఫిడేలు గోకారు.

అంచేత, రెడ్డిగారికి, నాటకాలు చూడ్డం వ్యామోహమే గాని, బుచ్చిరాజుగారికి నాటకాలాడ్డం వ్యామోహమే పట్టుకుంది, ముమ్మరంగా.

ముదిరిన్నీపోయింది.

మండపేట నాటకాలు చూడలేదు; గాని, కీలకసంవత్సర పుష్కరాల సందర్భంలో, రాజమహేంద్రవరంలో, పన్నెండు రోజులూ నేను నాటకాలు చూశాను.

అక్కడ – అంటే ఈ రాజమహేంద్రవరంలో, ధరణీప్రగడ సూరయ్యగారి మానేపల్లి కంపెనీ ప్రభ బాగా వెలుగుతోంది, ఆ రోజుల్లో.

వారి నాటకాల్లో కాళ్ళకూరి సాంబశివరావుగారి రంగారాయ కదనసమవాకారం (బొబ్బిలియుద్ధం) రోజు విడిచి రోజు తప్పకుండా వుండేది.

చిత్రనళీయమున్నూ అంత తరుచుగానూ వుండేది.

అసలు, చిత్రనళీయం ఆడగలిగితేనే అది నాటకసమాజం, లేకపోతే కుర్రకుంకల జట్టే, ఆ రోజుల్లో.

ఆ మానేపల్లి కంపెనీలో, ముప్పిడి జగ్గరాజుగారూ, అంబటిపూడి కోటయ్యగారూ ముఖ్యనటులు.

కోటయ్యగారికి అభినయచాతుర్యం చాలా తక్కువ, కర్ణాటకం బహుశ్రావ్యంగా పాడేవా రాయన.

ఆయనకు రెండు మూడు వందల కృతులు వచ్చునని బాగా ప్రతీతి.

ఫిడేలు బహు నాజూకుగా వాయించేవా రాయన.

మాంచి నడివయస్సు కనక, జగ్గరాజుగారిది, అప్పటి రూపమే రూపమూ, అప్పటి అభినయమే అభినయమున్నూ.

మల్లమ్మగా, దయమంతిగా, చంద్రమతిగా, యేదో వొక ప్రహసనంలో రంగేళీ విటకత్తెగా చూశాను ఆ సందర్భంలో నే నాయన్ని. అక్కడి కక్కడే అందుకోసమే పుట్టినట్టు మారిపోయేవా రాయన.

పుష్కరాలు సగం గడిచాయి, నేను కవినని జగ్గరాజుగారికీ, జగ్గరాజుగారు నటులని నాకూ అరవ ఆదినారాయణమూర్తిగారు పరిచయం చేశారు తమ షాపులో వొకనాడు.

అది మూలంగా, జగ్గరాజుగారు నాకు బాగా పరిచితులయినారు, తరవాత.

ఆ పన్నెండు దినాలూ నాటకాలు చూడ్డంలో, నటనకు మాత్రమేకాక, రచనకున్నూ సంబంధించిన రంగస్థల విషయాలు కొన్ని తెలుసుకున్నా న్నేను, జగ్గరాజుగారి సాయంతో.

ఆ మండపేట నాటకాల కథాసంగ్రహాలు చదివివుండడమూ, యీ మానేపల్లికంపెనీ నాటకాలు చూసివుండడమూ – ఈ రెండు కలిశాటప్పటికి, నాకున్నూ నాటకాల వ్యామోహం పట్టుకుంది, దిట్టంగా.

అయితే, ఆ వ్యామోహం, బుచ్చిరాజుగారికి నాటకాలాడాలన్న అభిలాష కలిగించగా, నాటకాలు రచించాలన్న ఉత్సాహం కలిగించింది, నాకు.

ఈ స్థితిలో కలుసుకున్నాం నేనూ, బుచ్చిరాజుగారూనూ.

బుచ్చిరాజుగారికి కానడరాగం అభిమానం.

చాలా బాగా పాడేవా రది ఆయన.

ఒకనా డది విడిగా పాడుతూనే అరిటాకులు కోశా రాయన, నాకోసం.

ఆ మాధుర్యం గుర్తించి నేను కోరగా, ఆ పని అయాక కూచునిన్నీ మళ్ళీ పాడారది.

ఒక కందం, వొక గీతం, వొక ఆటవెలది, వొక మత్తకోకిల, వొక ఉత్పలమాల, వొక శార్దూలం, వొక సీసం – ఇన్ని పద్యాలమీద ప్రస్తరించా రాయన, నేను కోరగా అది.

అసలే సాయంసమయం, దానికి తగ్గట్టు పండబారివున్న చెరుకుతోట – అందులో నిండుగా అరిటిచెట్లున్న దిమ్మ. – వీటికన్నిటికీ తోడు పద్యం తరవాత పద్యం మారుస్తూ నేను కొసరడం – వొళ్ళు మరిచిపోయి పాడా రాయన, కూచున్నవారల్లా లేచి, నాటకంలో నటిస్తున్నట్టు హావభావాలు చూపిస్తూ

మిక్కిలీ ముగ్ధుణ్ణయిపోయా న్నేను.

అది గుర్తించా రాయన.

అంతే, పట్టుకున్నారు – "ఏమండీ, గురువుగారూ! మనం వొక కంపెనీ నెలకొల్పి నాటకాలాడాలండీ" అంటూ కనపడ్డప్పుడల్లా.

"సత్తిరెడ్డిబావతో చాలా కాలంగా చెబుతున్నాను, అతనికి ధైర్యం చాలడంలేదు. మీరు చెబితే అతను ఘూనుకుంటాడు. అతను ఘూనుకున్నాడా, రాయవరంలో నాటకాల కంపెనీ వెలిసిందన్నమాటే" అంటూ వొకటే పోరు మొదలుపెట్టా రాయన, అంతకంతకి.

ఆ ముహూర్తం యెలాంటిదో మరి, నాకూ పట్టుకుంది ఆ వ్యామోహం, అంకాపొంకాలమీద.

## 68

"ఏమిటి బుచ్చిరాజుగారి వుబలాటం మాట?" అనడిగా నొకనాడు, రెడ్డిగారి న్నేను.

అది వారికీ వుంది; కాని "మనం నిర్వహించగలమా" అని సందేహించారు వారు.

"నేనున్నాను, ఘూనుకోండి" అనేశాను ఆవేశంతో నేను.

"సరే" అనేశారు, రెడ్డిగారున్నూ.

అన్నారు, ప్రయత్నాలు సాగించారు, ఉత్తరక్షణాన.

డబ్బున్నవారు కనక, బలగం వున్నవారున్నూ కనక, అప్పటికే వొక మానేజిమెంటుకి అలవాటుపడి వుండినవారు కూడా కనక, రెడ్డిగారు సాహసించడం బాగానే వుంది, మరి, "నేనున్నాను, ఘూనుకోండి" అనెయ్యడానికి నాకుండిన సత్తా ఏమిటీ?

జబ్బా గుణమూ, నా సాహసం?

అదీ యిదీ కూడాను, నా అనుభవాన్ని పట్టి.

పని మంచిదయితే చాలు, అది నా రుచికనుగుణం అయిందా నాకు స్థాయీభావం కలిగిపోతుంది, ప్రారంభమూ చేసేస్తాను, వెంటనే.

ఈ వొక్కదానికే కాదు అన్నిటికీ – అప్పుడే కాదు ఇప్పటికిన్నీ నా ప్రారంభాలకిదే సూత్రం.

విజయాలూ గడించాను అపజయాలూ అనుభవించాను, వాటిక్కారణం పరిసరాలూ పరిస్థితులున్నూగాని నా ప్రజ్ఞా కాదు, నా దౌర్బల్యమూ కాదు.

కాక, –

పౌరుషానిక్కంటే పురాకృతాని కెక్కువ ప్రాముఖ్యం యిచ్చే స్వభావం నాది ఫలితం విషయమ్మై, మొదణ్ణుంచీ కూడా.

తరవాత్తరవాత విన్నాను, ప్రయత్నం పౌరుషమనీ పర్యవసానం దైవికమనీ – పూర్వమీమాంసకులు చెప్పగా.

ఇందుకు నిదర్శనంగా, విజయం లభిస్తే నేను పొంగిపోకపోడమూ, అపజయం తటస్థిస్తే కుంగిపోకపోవడమూ నా మిత్రు లనేకు లెరుగుదురు.

ఆ స్వల్ప పరిచయంతో సత్తిరెడ్డిగారి కిదేమీ తెలియదు; గాని కేవలమూ విశ్వాసంతో నా ప్రోత్సాహం అంగీకరించారు.

నష్టం వస్తుందని – అథవా – దానికాళ్ళమీద అది నిలవబడగలుగుతుందని – కనక, పెట్టిన సొమ్ము వమ్మే అనుకోమని నచ్చజెప్పి కొందరు యువకులను వాటాదారులుగా చేర్చారు, రెడ్డిగారు.

చిన్న వాటా నాది, యాభై రూపాయలది.

అదయినా, రెడ్డిగారే పెట్టుబడి పెట్టారు.

నటనిర్ణయం నామీద పెట్టారు, వారు.

నాటకాలున్నూ నేనే నిర్ధారణ చెయ్యాలి, అవసరమైతే సంస్కరించి.

ఈ స్థితి వచ్చాటప్పటికి బుచ్చిరాజుగారు నిద్రాహారాలు మరిచిపోయారు.

ఎవరినో యువకుల నేరి తీసుకువచ్చారు వారు, వేషాలు వెయ్యడానికి.

అభిలాషా అర్హతా కల వాటాదారులనూ కలిపి బాగా పరీక్షించాను వారి న్నేను.

మెరికల్లాంటి యువకులు వారు.

కాని, వర్ణక్రమం నడవలేదు, కొందరికి.

ఎవరికీ భాష తెలియదు.

వాచకం వున్నవారికయినా ఆపులూ విరుపులూ తెలియవు, వచనంలోకూడా.

ఇంత కిందామీదా పడిపోయే బుచ్చిరాజుగారికే తెలియలేదు, కామాకీ ఫుల్‌స్టాపుకీ వున్న భేదం, కాస్తయినా.

ఏం చేస్తాం, వారందరూ "పాటకులు" మాత్రమే.

ఒక్క బుచ్చిరాజుగారికి తప్ప తక్కినవారిలో యెవరికీ సరళీస్వరాల జ్ఞానమైనా లేదు, అందరూ మాత్రం "పాటకులు"ట.

నాటకం అడ్డం అంటే పాడడమే అన్న అభిప్రాయం బాగా బలపడిపోయింది, అప్పటికే.

ఇది వొక్కటీ చాలు, నాటకంలో సంగీతం లేశమూ వుండగూడదనడానికి.

పోతే, వారిలో కొందరు రూపవంతులు.

వేషం వేస్తే ఉజ్జ్వలంగా కనపడతారు.

వారి స్థితి చూసి నేను నిరుత్సాహపడ్డాను, నా నిరుత్సాహం చూసి బుచ్చిరాజుగారు నిర్విణ్ణులయిపోయారు.

అంతటితో కుదరలేదు, వచ్చినవారికి చాలా అసంతృప్తి యేర్పడింది నామీద.

దానిక్కారణం చెన్నుభొట్ల, పెదసత్యనారాయణగారు.

నాటకాల సందర్భంలో, తనకి తప్ప మాలో యెవరికీ యేమీ తెలియదని ఆయన వాదం.

విశాఖపట్నంలో తాము చదువుకునేటప్పుడు, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఆడించిన కొన్ని నాటకాలు చూసి వుండినారుట ఆయన.

నేనుకూడా కొన్ని నాటకాలు చూసి వుండినా, వొక నాటకమున్నూ రచించేవుండినా లాభం లేదుట – కారణం నా కింగ్లీషు రాకపోడంట.

ఈ యింగ్లీషు చదువుకున్నవాళ్ళ కందరికీ యిదొక బడాయి, ఇప్పటికీ చూస్తూనే వున్నా న్నేను.

అది యేమయినా, వారికందరికీ రెడ్డిగారిమాట వేదవాక్యం.

మరి, రెడ్డిగారికి?

నా మాట వొక్కటే మాట.

కిక్కురుమనలేకపోయారు, సత్యనారాయణగారు.

వచ్చిన అవకాశం జారవిడుచుకోడం మంచిది కాదని నా వడపోత కంగీకరించారు, నటులున్నూ, చివరికి.

నటు లన్నాను, నిజమే, ఆ మాట వారిలో యే యిద్దరికో ముగ్గురికో మాత్రమే చెల్లుతుంది.

నాటకానికి పాటకుడు పనికిరాడంటే అందరికీ వింతే.

అప్పటికీ యిప్పటికీ యిది యింతే.

తక్కిన హిందూ ప్రాంతాలమాట నాకు తెలియదు, మన తెనుగుదేశంలో మాత్రం ఆదినుంచీ సంగీత నాటకాలే వెలిశాయి.

వచనం కవిత్వానికే పనికిరాకపోయింది మనవారికి, నాటకాల కెలా పనికివస్తుందీ యిక?

ఇంగ్లీషు సంపర్కం బలిశాక రచించబడుతున్న నాటకాల్లో గూడా సంగీతానికే ప్రాధాన్యం.

భరత శాస్త్రాని కనుగుణాలయిన దరువులూ కందార్థాలూ పోయి, హిందూస్థానీమట్లు వెలిశాయి, అంతే భేదం.

నాకూ పట్టింది యీ పిచ్చి వారకాంత రచనలో; కాని తరవాత కొద్ది దినాలకే నా అభిప్రాయం మారిపోయింది.

ఇప్పటికీ మన నాటక కర్తలకు పద్యవ్యామోహం తగ్గలేదు.

నాటకం అంటే, కవితా గాన చిత్రకళల సమ్మేళనం"ట" మరి.

కథా సంభాషణా నటనా వారి కప్రధానాలు.

అలాంటివారు రచించిన నాటకాలకు సమగ్రసౌష్ఠవం యెలా వస్తుందీ?

అయినా, చూడ్డానికి జనులకూ, ఆడ్డానికి నటులకూ నాటకా లనబడేవి కావాలి.

ఇలాంటి అగత్యమే వచ్చింది, నాకూ రెడ్డిగారికిన్నీ.

అయితే, వస్తుతః, మాకు తెలిసిందే తక్కువ.

తెలిసిందయినా ఆచరణలో పెట్టే శక్తిన్నీ తక్కువే.

అయినా, మేము ముందుకే వెళ్ళిపోయాం, సాహసించి.

ఊరి కరమైలు దూరాన, యకరంనర కొబ్బరితోట కవులుకి పుచ్చుకుని, పెద్ద నాటకశాల కట్టించాం మేము.

కాకినాడ వెళ్ళి, సింగితం అబ్బాయిగారి తాలూకు తెరలూ దుస్తులూ కొనుక్కువచ్చాం.

శేషారెడ్డి అనే మంచి పెయింటర్ని స్థిరంగా పెట్టుకుని, కొన్ని తెరలు బాగుచేయించి, కొత్త తెరలు కొన్నీ సీనరీ కొంతా తయారుచేయించాం.

వారాని కొక్కటి చొప్పున నాటక ప్రదర్శనమున్నూ ప్రారంభించాం.

ఉనికి పల్లెటూరయినా, రాజమండ్రీ కాకినాడల వంటి పెద్ద పట్నాల నాటక శాలలనూ, నాటక సమాజాలనూ మించి వుండేవి మా యేర్పాట్లు.

డబ్బున్నూ బాగా వచ్చేది.

కొందరు ప్రశంసించేవారు.

కొంద రీసడించేవారు.

కొందరు దుష్ప్రచారం చేసేవారు.

కొందరు వంకలు పన్నేవారు.

అనేకులు వచ్చి చూసిపోడమే పెట్టుకున్నారు.

పొరుగూరి రౌడీలు కొందరు అల్లరి చెయ్యబోయారు; గాని మొదటినాడే అది సద్దణిగిపోయింది.

కాని నటుల అల్లరిమాత్రం సాగింది, కొన్నాళ్ళు.

నాటకాల్లో, సగానికిపైగా నేను పద్యాలు తగ్గించేశానని వారి అల్లరి.

పది పాటలు కావాలంటే రెండో మూడో మాత్రమే చేరుస్తున్నాననిన్నీ వారి గోల.

రంగస్థలం అంతా సంగీతంతో నింపెయ్యడం యెప్పు డెప్పుడని యెదురుచూస్తూ వుండిన బుచ్చిరాజుగారున్నూ యిందుకు చాలా నిరుత్సాహపడ్డారు.

అసలు, ఎనిమిది నాటకాలే మే మెంచుకున్నాం.

వాటిలో, కాళ్ళకూరి సాంబశివరావుగారి రంగారాయ కదనసమవాకారం ప్రధానం.

అనుకున్న ప్రకారం వరాసగా అవి ఆడించేశాం.

సాధారణంగా నాటక సమాజాలవా రేమి చేస్తారో చూడాలేదు, వినాలేదు; కాని నేను మాత్రం నటుల కందరికీ నాటక కథ బాగా బోధపరిచేవాణ్ణి ముందు.

పుస్తకం సావకాశంగా చదివి వినిపించేవాణ్ణి, తరవాత.

ఎక్కడ వూది పలకాలో, ఎక్కడ తేల్చాలో, ఎక్కడ చటుక్కున అందుకోవాలో, ఎక్కడ నాన్చెయ్యాలో, ఎక్కడ దురితంగా పలకాలో, ఎక్కడ విశేషం స్ఫురింపచెయ్యాలో – ఇలాంటివి సూచిస్తూ చదవడంవల్ల పాత్రలు బాగా బోధపడేవి, నటులకు.

అదంతా బాగా పఠికించడంతో కథ వంటబట్టేది, వారికి.

తెరపి మరపుల స్థితిన్నీ అప్రయత్నంగా యేర్పడేది.

అయితే, పద్యమో పాటో యెత్తుకుంటేమాత్రం ఆ స్థాయి పోయేది.

వన్నుమోరులు తగిలాయా, అసలే చెడేది.

నటులకు ఇది గుర్తుకు వచ్చాటప్పటికి జనప్రశంసలున్నూ వారికందసాగాయి.

వారందరూ పల్లెటూళ్ళవారు, యే వొకరిద్దరో తప్పించి.

చాలామంది రెడ్డియువకులు.

కాగా, వారందరూ గంగిగోవులు.

గురి కుదిరిందా, ప్రాణాలయినా యిచ్చేరకం వారు.

దీనికి సాయం, అర్థం తెలిసీ, కొంత సంస్కారం అబ్బీ నా యేర్పాటుకు తృప్తిపడసాగారు వారు.

ఇంతేకాదు.

రెడ్డిగారూ, వారి తమ్ముడు గంగిరెడ్డీ, వుచ్చారణ క్రమం సూచిస్తూ, ఏ దిక్కున చూసినా తామే అయి చక్కగా ప్రాంప్టింగు చేసేవారు.

తాదాత్మ్యంలో మరుపు కలిగితే జ్ఞాపకం చెయ్యడానికేగాని, యెలాగో వొకలాగ నాటకం "యీడ్చెయ్యడాని" క్కాదది, నటులకు.

ఎవరి గ్రంథం వారు కచ్చితంగా అప్పగిస్తేనే – రిహార్సల్సు సరిగా జరిగాకే మేము ప్రదర్శించేవాళ్ళం, ఆ నాటకం.

ఇది యిలా జరుగుతూ వుంటే, కాగితమూ పెన్సిలూ పుచ్చుకుని, ప్రేక్షకుల్లో, మొదటివరస మధ్యకుర్చీలో కూచునేవాణ్ణి నేను.

ఎవరెక్కడ పాడుచేశారో, యెవరెక్కడ బాగుచేశారో నోటు చేసుకోడాని కిది.

నాటకం అయిపోడంతోనే – ఆ వేషాలతోనే, నటులందరూ నా చుట్టూ కూచునేవారు, రంగస్థలాన.

నేను రాసుకున్నది చదివి వినిపించి మంచిచెడ్డలు వివరించేవాణ్ణి నేను.

అది చాలా మంచి ఫలితా లిచ్చింది.

అయితే, మధ్యమధ్య నేనున్నూ వేషం వెయ్యవలసి వచ్చేది, తప్పనిసరిగా.

మొదటి నాటకంలోనే తటస్థించిం దిది.

తల్లీతండ్రీ వచ్చి, గోలచేసి, సుమిత్ర వేషధారిని లాక్కుపోయా రావేళ, వేషాలు వేసుకుంటున్న స్థితిలో.

మొదటి నాటకం శ్రీరామజననం.

జయకరం అని రెడ్డిగా రేర్పాటుచేశారేగాని మా యెనిమిది నాటకాల్లోది కాదది.

శుభకరం అవుతుందన్నదే చెడే స్థితి వచ్చింది.

ఇది సభలో వున్న పెద్దకాపులకు తెలిసిపోయింది.

"ఏమిటేమి"టంటూ ఆత్రపడసాగారు వారు.

వారందరూ మాకు పెట్టని కోటలు, అంచేతే వారి కా ఆత్రం, అంతగా.

వారిని సద్దుబాటుచేసి "ఏమిటి దారి" అని నాతో ఆలోచించడానికి లోపలికి వచ్చారు రెడ్డిగారు, సుమిత్రగా వారికి నే నెదురయినాను.

దాంతో, మనసు కుదుటపడ్డమే కాదు, వెయ్యి యేనుగుల బలం వచ్చింది, రెడ్డిగారికి.

రసాభాసం అయిపోతుం దనుకున్నది రసమహితం అయి, ప్రేక్షకుల మన్ననలున్నూ అందుకుంది, ఆ నాటకం.

నటులను దిద్దడంలోనూ, రిహార్సల్సు నడిపించడంలోనూ ప్రతీనాటకంలోనూ గ్రంథం అంతా నాకు క్షుణ్ణంగా వచ్చి వుండేది.

అంచేత, యే వేషం తక్కువయినా, నేను సద్దుకుంటూ పోయేవాణ్ణి.

ఇలా సద్దుబాటు చెయ్యడంలో, నేను, బొబ్బిలియుద్ధంలో వొకసూటు తాండ్ర పాపయ్యగానూ, వొకమాటు విజయరామరాజు మంత్రిగానూ. విజయరామరాజుగా రెండుమూడు మాట్లూ, సారంగధర చరిత్రలో రాజరాజుగా వొకమాటూ నటించవలసి వచ్చింది.

తరవాత్తరవాత, అగత్యం రాకపోయినా, రెడ్డిగా రుబలాటపడగా మరోమాటుకూడా విజయరామరాజుగా నటించా న్నేను.

మానేపల్లి కంపెనీలో, అంబటిపూడి కోటయ్యగారు చెమ్కీ యిజారూ, చెమ్కీ కోటూ, చెమ్కీ కిరీటమూ పెట్టుకుని విజయరామరాజుగా తయారయేవారు.

నల హరిశ్చంద్రాదులకూ అదే వేషం వారికి.

నా సొంతానికి నేనవి మార్చేశాను.

విజయనగరం రాజులది చుక్కబొట్టు.

కోటయ్యగారు నామాలు పెట్టుకునేవారు.

నే నదీ మార్చేశాను.

పంచె విరిచికట్టి, క్షత్రియపాగా చుట్టుకుని, దానికి తురాయి పెట్టుకుంటే చూసిన క్షత్రియులూ వోహో అనేవారు.

నా విజయరామరాజు వేషంలో, ఆ నాటకానికొక కొత్త గాంభీర్యం వచ్చిం దెవరూ అనుకోనిది.

## 70

మా నాటక సమాజం రమారమీ మూడేళ్ళు పనిచేసింది.

ఎన్నో నాటక ప్రదర్శనాలు జరిగించాం, ఎంతో హైరానాపడ్డాం.

బాగా డబ్బు వచ్చింది, అంతా ఖర్చయిపోయింది.

మనుష్యులం మిగిలాం, సరదా తీరింది.

కార్యనిర్వహణలో, సాహిత్యపరమైన అనుభవం నాకూ ఆర్థికమైన అనుభవం సత్తిరెడ్డిగారికీ చాలా యెక్కువగా కలిగాయి.

అది యింకా కొంతకాలం పనిచేసి వుండును; గాని మొత్తానికి, సత్యనారాయణ గారి మడత పేచీలే మాకు విసుగు పుట్టించి విరమింపజేశాయి.

సమాజంలో యీ పేచీ లిలా వుండగా, నటుల యిళ్ళల్లో మరో రకమైన అల్లరి రేగింది.

బ్రాహ్మణ నటుల యిళ్ళల్లోనే పుట్టిందది.

తమ కుఱ్ఱవాళ్ళు నాటకాల్లో తిరగడంవల్ల, తమ కుటుంబ మర్యాద గంగలో కలిసిపోతోందని పెద్దలు సాగించిన అల్లరి అది.

తారస్థాయికే వెళ్ళిపోయిందది, మా యింటో.

నేను తెనుగులో కవిత్వం ప్రారంభించినందుకే ఘర్షణ పెంచిన మా నాయనగారు, అందుకెంత బాధపడ్డారో వేరే చెప్పాలా?

దానికి మా చిన్నన్నగారున్నూ యెంత దోహదం చేశారో వివరించాలా?

ఇంటోనే యీ పోరిలా వుండగా, మేమంటే కిట్టని వొక యిల్లాలు "కొడుకు నాటకాలాడి సంపాదిస్తూ వుంటే, యింటో కూచుని కమ్మగా తింటున్నాడు, ముసలాయన" అంటూ ప్రచారం సాగించింది, యింటింటికి వెళ్ళి.

నిజానికి, కులంలో వెలిపెట్టవలసిన యిల్లా లావిడ.

అంతతో పోలేదు "మీ చిన్నబ్బాయి నాటకాల్లో తిరుగుతున్నాడుట ఏమిటండీ?" అంటూ కొందరు పెద్దమనుష్యులున్నూ మా నాయనగారిని రెచ్చగొట్టారు.

క్షత్రియప్రముఖు డొకాయన "మీ అబ్బాయిట, మొన్న బొబ్బిలియుద్ధం నాటకంలో విజయరామరాజుగారి వేషం వేసి, ఓః – మా రాచఠీవి అంతా కనపరిచేశారండీ, సెబాస్" అంటూ తాను మెచ్చుకుంటున్నట్టే అనుకుని మా నాయనగారిని గాభరా పెట్టేశాడు.

దీంతో, మరీ మండిపడ్డారు మా నాయనగారు.

కాని, నేను జంకలేదు.

క్రమాంతరాలమీద ధైర్యం చిక్కబట్టుకుంటూ వస్తున్నా న్నేనప్పటికి, అయినా, వొదిగివొదిగే వుంటూ వచ్చాను.

చివరికి, రాజుగారు నన్ను మెచ్చుకున్ననాడు మాత్రం యెదురుతిరిగాను.

విడిపోతే బతకలేమేమో అన్న భయం పోయిం దప్పటికి.

"మా పిల్లలకు తెనుగూ సంస్కృతమూ చెప్పండి, యిల్లిచ్చి రాయవరంలో నిలుపుకుంటాం, మిమ్మల్ని" అన్నారు రాయవరం రెడ్లు, నన్ను.

సత్తిరెడ్డిగా రిందుకు బాగా ప్రోత్సహించారు.

ఇదీ నా ధైర్యం.

మా అమ్మగారితో చెప్పానిది, వొకనాడు.

"అబ్బాయి, డబ్బుకోసం కాదు, సరదాకోసం నాటకాలాడుతున్నాడు. ఈ కాలపు కుఱ్ఱవా ళ్ళందరూ యిలాగే వుంటున్నారు. మీ అన్నగారి కొడుకు మడి కట్టు క్కూచున్నాడా, మహా? మీ కిష్టం లేకపోతే విడిపోతా నంటున్నాడు, అబ్బాయి. రాయవరం రెడ్లు తమ. వూళ్ళో వుండమంటున్నారుట తమ పిల్లలకు కావ్యాలు చెప్పడానికి. పెద్దవా ళ్ళిద్దరూ పొరుగూళ్ళలో వున్నారు గదా, చిన్నబ్బాయిని కూడా విడిచి వొక్కళ్ళమూ బతగ్గలమా మనము?" అని మా నాయనగారి నడిగేశారు, మా అమ్మగారు.

చూసీచూడన ట్టూరుకోసాగారు, మా నాయనగారు, దీంతో.

ఈ వుసులుబాటు చూసుకుని, మరో పని ప్రారంభించా న్నేను, మా నాయనగారి కిష్టం లేనిది.

☆ ☆ ☆

రెండవ
సంపుటం
2

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
## అనుభవాలూ - జ్ఞాపకాలూను



శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి తండ్రి
శ్రీపాద లక్ష్మీపతి సోమయాజులు గారు



శ్రీపాద శివరామ సిద్ధాంతి
దీక్షితులు గారు
(శ్రీపాద పెద్దన్న గారు)



శ్రీపాద వేంకటరమణ
దైవజ్ఞశర్మ గారు
(శ్రీపాద చిన్నన్న గారు)

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ - జ్ఞాపకాలూను

☆ ☆ ☆

## రెండో సంపుటం

★ ★ ★

కులవిద్యలు నేర్చుకుని కూడాకూడా వుంటూ మా చిన్నన్నగారు మా నాయనగారికి మిక్కిలీ ప్రీతిపాత్రులయి వుండగా, వారికి తా మలా కాలేకపోయినా మా పెద్దన్నగారున్నూ కుల విద్యలతోనే సంతుష్టిపడి వుండగా, సన్నిహితులూ వ్యవహితులూ బంధువులున్నూ అందరూ వైదికవిద్యాప్రవీణులే అయివుండగా నాకొక్కడికే యెందుకు పట్టుకుందో మరి, ఇతరవిద్యల యెడల సుముఖతా తన్మూలంగా కులవిద్యల యెడల విముఖతా – ఇది ఇప్పటికీ తీరని సమస్యే నాకు.

ఆ యితర విద్యలున్నూ మా నాయనగారి కన్నీ ప్రతికూలాలే కావడమున్నూ అలాగ సమస్యే అయింది.

కాని, స్వాతంత్ర్యం ప్రారంభం అయినకొద్దీ – అది దృఢమున్నూ కాసాగినకొద్దీ – కులవిద్య లొక్కొక్కటే అశ్రద్ధ చెయ్యడంతోపాటు కొత్తవిద్య లొక్కొక్కటే సాధన చేసుకోడమున్నూ ప్రారంభించా న్నేను, అప్పటప్పటికే కాలాతీతం అయిపోయిందన్న కటకటతో.

నేనలా ప్రారంభించిన యితరవిద్యల్లో సంగీతం వొకటి.

సాధన చేసుకుంటున్న కవిత్వం యెంత యిష్టమో, అచుంబిత ప్రక్రియ అయిన సంగీతమన్నా అంత యిష్టమే నాకు.

గాత్రం కాస్తయినా మంచిదయితే చాలు, యేమాత్రం పాటవినపడ్డా యెంతో హాయిగా వుంటుంది నాకు.

అయితే, ఆ చిన్నతనంలో కూడా వొక్కొక్కపాట చెవిని బడితే యెంతో బాధ అనిపించేది నాకు.

దానిక్కారణం మాత్రం బోధపడేదికాదు.

ఈ స్థితిలో, గోదావరీపుష్కరాల సందర్భంలో రాజమహేంద్రవరంలో మానేపల్లి

నాటకాలు చూశాటప్పుడు నేనొక హరిదాసు పక్కగా కూచోడం తటస్థించిం దొకనాడు.

నేను కటువుగా వుందనుకున్న రాగం విని ఆయనా చిమచిమ లాడసాగాడు.

అది గుర్తించి "ఆ రాగం యేమి"టనీ – "అది వింటే నాకు చీమలూ జెర్రెలూ పాకుతున్నట్టనిపిస్తోందెంచేతా?" అనీ అడిగా నాయన్ని.

"నాకు సాయం నువ్వొకడవున్నావా నాయనా?" అంటూ నా వీపు తట్టాడా హరిదాసు, ఇది విని ముందు.

నా వెగటు సహజ మైనదని గుర్తించి "సంస్కారవిశేషం గుర్తించావా?" అంటూ తనపక్కని కూచున్న పెద్దమనిషిని ప్రబోధించాడు, తరవాత.

ఈ "సంస్కారం" అన్నది ప్రాక్తనం.

బహుజన్మల్లో చేసుకున్న విద్యాపరిశ్రమకు పరిణామమున్నూ యిది.

ఇది గుర్తించడం కష్టం.

అనుసరించడమున్నూ అసాధ్యమే, సాధారణంగా.

మనిషయినవాడికల్లా వుంటుందిది.

అయితే, గుర్తుకి రాక యెందరివో జన్మలు ప్రాకృతాలయిపోతూ వుంటాయి.

మరి, గుర్తించడం యెలాగా అంటే, పరిసరాల పరిశీలనా, సంతత పరిశ్రమా అందుకు సాధనాలు, కొంతవరకూ.

అవి సత్తా ననుసరించి వుంటాయి.

సన్నివేశాలున్నూ సమకూరా లందుకు, అదనులో.

అయినా, వున్న సంస్కారాలన్నీ పరిపుష్టాలు కావెవరికీ.

ఏమంటే?

వాటిలో, జీవస్మరణ సమస్యలను బట్టి యేర్పడేవి కొన్నీ, వినోదప్రాయాల ననుసరించి యేర్పడేవి కొన్నినీ.

అవి తెలుసుకోడానికి మాత్రం అదృష్టం వొక్కటే ఆధారం.

సాధన ప్రసక్తి అయినా, దీక్ష ఏకాగ్రతల ప్రసక్తి అయినా తరవాత.

ఆవేళ, ఆ హరిదాసు, ఈ వివరాల జోలికి పోనేలేదు.

"అది బేహాగ్ రాగం. కర్ణాటకం కాదు, హిందూస్థానీ రాగం అది. పైగా, హిందూస్థానీకత్తుగా పాడుతున్నా డా నటుడు. ఈ కంపెనీ నాటకాలు వచ్చాక మన కర్ణాటకం చెడ్డంత చెడుతోంది, వెనకపడ్డంత వెనకాపడుతోంది, పాలించే నాథుడు లేడు" అంటూ మాత్రం మిక్కిలీ పరితపించా డాయన.

అయితే, సంగీతంలో కర్ణాటకం అనీ, హిందూస్థానీ అనీ రెండు విభాగా లున్న సంగతి నాకు తెలియదంతవరకూ.

"మరి, హిందూస్థానీరాగం హిందూస్థానీ కత్తుగా కాక, మరెలా పాడాలీ?"

ఇదొక కొత్త జిజ్ఞాస అయింది నాకు.

ఈ సంగతి చెప్పగా "యిప్పుడు కాదు, రేపు నా బసకి రా చెబుతా"నన్నా డాయన.

మర్నాడు మధ్యాహ్నమే వెళ్ళి పట్టుకున్నా నాయన్ని.

ఆ సాయంత్రం ఆయన హరికథా కాలక్షేపమూ విన్నాను.

బిలహరీ, ఆరభీ, శ్రీరాగమూ అభిమానా లాయనకు.

తగినంత సాహిత్యవాసన లేక కథనమే వోమోస్తరుగా వుంది; కాని ఆయన పాట మాత్రం బహా కమ్మగా వుంది, వెళ్ళినకొద్దీ.

కథ చెప్పడానికిముందు "ఎందరో మహానుభావు"లన్న శ్రీరాగం కీర్తన పాడేవా డాయన, కూచుని, ముందు.

అదే మొదటిమాటు నేనా కీర్తన వినడం.

భోజనం కావడం తడువుగా ఆయన వెంట తిరిగాన్నే నా శేషపుష్కరదినాలు.

కర్ణాటకం విషయమూ హిందూస్థానీ విషయమూ చాలా చెప్పా డాసందర్భంలో ఆయన; కాని సంగీతంలో లేశమూ ప్రవేశం లేకపోడంవల్ల దాల్లో చాలాభాగం నాకవగాహన కాలేదు.

కర్ణాటకసంగీతం విశుద్ధభారతీయ మనీ, హిందూస్థానీ సంగీతం పార్శీసంగీతంతో సంకరం అనీ, కర్ణాటకానికి గమకమూ, హిందూస్థానీకి "ఈడ్పూ" ముఖ్యలక్షణా లనీ – ఈ భావం మాత్రం అస్థిని పట్టుకుపోయింది నాకు.

"బేహోగ్డా, కాఫీ మొదలైన కొన్ని మన త్యాగరాజాదులు స్వీకరించారు. స్వరసంపుటినిబట్టి మధురంగా వున్నాయన్న దృష్టితోనే వారవి స్వీకరించారు. అయితే, వారు మన గమకం చేర్చడంతో విలక్షణంగా తయారయినా యవి. వాటిలో యెన్నో కృతులు రచించారు వారు. ఆ కృతులు పాడేటప్పుడు గమకం విడిచి 'యీడ్పు' అందుకుంటే మాత్రం సాహిత్యం దెబ్బతినడమే కాదు 'వినసొంపు'న్నూ కోల్పోతాయవి" అని చాలా వివరంగా చెప్పా డాయన.

దాంతో, తెలిసిన వెగటయిపోయింది, నాది.

## 2

ఆ దినాల్లోనే రాజా శ్రీ వాద్రేవు విశ్వసుందరరావు బహద్దరు వారి వివాహం జరిగింది, బందరులో.

మా నాయనగారికి వీలుకాకపోగా, మా పెద్దన్నగారూ వారివెంట నేనూ వెళ్ళాం, మేము సంస్థానసిద్ధాంతులం కనక.

ఒకనాడు కవిసమ్మేళనం జరిగింది. సదస్యమున్నూ గొప్పగా జరిగింది, మూడోనాడు.

మరోనాడు శ్రీమతి బెంగుళూరి నాగరత్నం గానంచేసింది, రాళ్ళుకరిగేలాగ.

ఇంకోనాడు శ్రీ తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు వీణ వాయించారు, మోళ్ళు చిగిరించేలాగ.

ఇక రేపు వెళ్ళిపోడమే అనగా, బందరు పేటలు చూడ్డానికి బయలుదేరా నొకపూట.

తిరగ్గా తిరగ్గా వొకచోట పాటకచేరీ తగిలింది.

ఎలాగో లోపలికి వెళ్ళగలిగాను; కాని కూచోలేకపోయూ నరగంట అయినా.

అచ్చంగా హిందూస్థానీసంగీతం అది.

మహారాజు వేషంలో వున్నాడు గాయకుడు, కూలికివచ్చి పాడుతున్నాడు గాని.

దానికి సాయం తబలా వొకటి, కరువులో అధికమాసం అన్నట్టు.

వరసగా రెండుదినాలు మహోజ్జ్వలమైన కర్ణాటక గానం విని వున్నానేమో, నాటిపాట దానికి భిన్నంగానే కాదు, వెక్కిరింతగానున్నూ కనపడింది నామట్టుకి.

అప్పుడొకటీ అప్పుడొకటీ కాక పాడినవన్నీ హిందూస్థానీ పాటలే కనక, కర్ణాటకానికీ దానికీ వుండుకున్న భేదమూ, అంతరువూ స్పష్టంగా తెలిసిపోయాయి.

ఇది కర్ణాటకంమీద మమకారం దృఢపరిచింది నాకు.

రుచి పెంపుచేసింది.

అభిమానం వృద్ధిచేసింది.

హిందూస్థానీ అంటే వెగటున్నూ వందరెట్లు చేసింది.

"అలాంటి విజాతీయగానం తెనుగువా ళ్ళెందుకు పాడాలి?" అనిన్నీ అనిపించింది.

కార్యకారణ సంబంధాలు తరవాత మరికొన్నిన్నీ యేర్పడి అది, కర్ణాటకానికి ప్రతిబంధకం అన్న నమ్మకం కలిగించింది నాకు.

మరికొన్నాళ్ళకి, ఆంధ్రచంద్రిక అన్న వారపత్రిక బయలుదేరింది, కడపజిల్లా పొద్దుటూరినుంచి.

దాని యజమాని, పేరిప్పుడు జ్ఞాపకం లేదు, ఆయన ముస్లిం.

సంపాదకులు బి.ఎన్. స్వామిగారు నా రచనల కెంతో ప్రాముఖ్యం యిచ్చేవారు.

గోపాలకృష్ణగోఖలేగారు పరమపదించిన సంవత్సరం అది.

"ఇది యిప్పు డావశ్యకం" అన్న శీర్షికతో, ఆంధ్రజాతి బాగుపడ్డాని కనువైన మార్గాలు నిష్కర్షగా చర్చించి కొన్ని చూపించా నందులో నేను.

అంతకితం పునహానుంచి, అప్పాశర్మగారు సంపాదకులుగా "సూనృతవాదిని" అన్న సంస్కృత వారపత్రిక వచ్చేదొకటి.

దర్భా కృష్ణబ్రహ్మం యిచ్చాడు కొన్ని సంచికలు నాకు.

బైరాగిశాస్త్రిగారికి పెత్తండ్రి కుమారు డతను.

కాశీలో వ్యాకరణం చదువుకుని వచ్చాడు.

మంచి వాగ్ధాటి అతనిది, పద్యమున్నూ ఎంతో చక్కగా చదివేవాడు రాగరంజితంగా.

బైరాగిశాస్త్రిగారి పాఠనం విడిచిపెట్టుకుని నేను తమ వూరినుంచి యెందుకు వెళ్ళిపోయానో యెరిగినవా డతను.

తరవాత, నేను, తదేకదృష్టితో సంస్కృతాంధ్రాలు సాధన చేసుకోడం చూసి "నీకీ పత్రిక చాలా మేలు చేస్తుం"దని చెబుతూ మిక్కిలీ ప్రీతిగా యిచ్చా డతను, అప్పటికి తన దగ్గిర నిలిచి వుండిన సంచికలు.

చాలా మంచిపత్రిక అది, మిక్కిలీ గొప్పదిన్నీ.

"ఇద మిదానీ మావశ్యకమ్" అని అందులో వొక శీర్షిక.

కొన్ని వ్యాసాల కది సమష్టిశీర్షిక.

ఆంధ్రచంద్రికలో నేనుంచిన శీర్షిక దానికే అనువాదం.

విషయాలు మాత్రం వారివి వేరూ నావి వేరున్నూ.

తరవాత్తరవాత, నా "ప్రబుద్ధాంధ్ర" పత్రిక సంస్కృత విభాగంలోనూ కొన్ని వ్యాసాలు ప్రకటించా న్నేనా శీర్షికతో, అది మరోమాటు.

పోతే, మన జాతి బాగుపడాలంటే, ఆంధ్రచంద్రికలో, నేను నిర్దేశించిన మార్గాల్లో, మన కర్ణాటకం బాగా పోషించుకోడం వొకటి.

దానికి ప్రతిబంధకం అవుతుంది కనక, తెనుగువాడైనవా డెవ్వడూ కూడా యే విధంగానూ హిందూస్థానీ సంగీతం చేరనివ్వగూడదని సకారణంగా స్పష్టపరిచా నందులో నేను.

అప్పటికే కా దిప్పటికీ మిక్కిలీ స్థిరనిశ్చయం నాకిది.

ఈ నిశ్చయంతోనే, మా నాటకసమాజంలో హిందూస్థానీ పాడగూడదని గట్టిగా కట్టడి చేసివున్నా న్నేను.

రంగస్థలాన నటులు కర్ణాటకమున్నూ పాడగూడ దనీ – అసలు నాటకాల్లో సంగీతమే వుండగూడదనీ – అంచేత, పాటలే కాదు నాటకాల్లో పద్యాలున్నూ వుండకూడదనీ యిటీవలి నా నిశ్చయం, దీనిసంగతిన్నీ పర్యాయత్వేనా చూసుకుందాం.

మా నటులు అసంతృప్తిగానే అయినా నా కట్టడి మన్నించసాగారు; గాని, ఉన్నట్టుండి, అభ్యాసవశాన, వారిపాటలో హిందూస్థానీకళ పడేది, మనస్సు చివుక్కుమనేసేది నాకు.

దీంతో, శుద్ధకర్ణాటకం విని ఆనందించాలంటే స్వయంగా నేర్చుకోడం వొక్కటే దారి అయింది నాకు.

నేర్చుకోవాలన్న సంకల్పమూ పుట్టింది, అవ్యవధానంగా.

అయితే, యెక్కడో సక్రుతుగా వుండే సహృదయుల దగ్గిర గురుకులవాసం అయినా చెయ్యాలి, డబ్బయినా యివ్వాలి గురువులకు, సంగీతం నేర్చుకోవాలంటే మరి మూడో మార్గం లేదు.

వాటిలో గురుకులవాసం నాకు చాలా యిష్టమే; గాని యిల్లు విడిచే అవకాశాలు తప్పిపోయాయి నా కప్పటికే.

డబ్బున్నూ లేకపోయింది.

"జీర్ణం జీర్ణం" అయిపోయింది నాసంగీతప్రీతి, చివరికి.

అయితే, నాటకసమాజనిర్వహణతో నా అభిలాష మారాకుతొడిగినట్టే, కాలం గడవడంతో, అందుకొక అవకాశమున్నూ తటస్థపడింది, ఎన్నడూ అనుకోనిది నాకు.

## 3

వారణాసి వేంకటరామయ్యగారూ, సర్వదేవుడుగారూ అని మండపేటలో యిద్దరన్నదమ్ములు.

ఇద్దరూ వైణికులు.

వారిలో సర్వదేవుడుగారు, మావూరి మైలవరపు విశ్వనాథంవారి పెద్దల్లుడు.

విశ్వనాథంగారి యింటికీ మాయింటికీ మధ్య రెండు నివేశనాలే అడ్డు, అప్పటికి.

సర్వదేవుడుగారు మనుగుడుపులకు వచ్చినప్పుడే మాకిద్దరికీ పరిచయం యేర్పడి బాగా స్థిరపడింది.

అత్తవారి యింట వారందినా లుండవలసివస్తే వీణకూడా తెచ్చుకునేవా డాయన, వాయించకుండా వుండలేక.

ఆవూళ్ళో కల్లా నేనొక్కణ్ణే శ్రోత నాయనకు.

రాత్రి పదిగంటలదాకా నాతోనే కాలక్షేపం ఆయనకు.

ఆయనవల్లనే "రామ నీ సమాన మెవ?"రన్న ఖరహర ప్రియ కృతి అంటే మిక్కిలీ మమకారం యేర్పడింది నాకు.

విశేషం యేమిటంటే, ఆయనకూ మంటే హిందూస్థానీ సంగీతం అంటే.

హిందూస్థానీసంగీతం పేరు చెబితేనే చాలు, చాలా నిరసన కనపరిచేవా రాయన.

"ధార్వార్ నాటకసంఘాల రాకతో, యక్షగానాలు మట్టుకే యెరిగివున్న మనకు నాటకాల పరిచయం యేర్పడ్డదని సంతోషించడమా, వాటితోనే వచ్చి హిందూస్థానీ సంగీతం కర్ణాటకంమీద దెబ్బకొడుతోం దని విచారించడమా?" అనేవా రాయన, చాలా బాధపడుతూ.

మేము స్నేహితులం కావడాని కీతుల్యాభిరుచి దోహదం అయింది.

సంగీతం నేర్చుకోవాలన్న అభిలాష నాకు మళ్ళీ రేకెత్తాటప్పటికి, కుతుకులూరి రెడ్డియువకులు సంగీతం నేర్చుకుంటున్నా రాయన్ని తమవూళ్లో నిలుపుకుని.

ఆ రెడ్డియువకుల్లో, తరవాత్తరవాత తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసు యోధులూ, చాలాకాలం రామచంద్రాపురం తాలూకా బోర్డు వైస్‌ప్రెసిడెంటూ అయివుండిన మల్లిడి సత్యనారాయణరెడ్డిగారున్నూ వొకరు.

వారు, తమ బంధువులయిన మల్లిడి సత్తిరెడ్డిగారి ద్వారా అదివరకే నాకు చిరమిత్రులు.

మా నాటకసమాజం నటుల్లో వొకరున్నూ.

"నేను మీకు దగ్గిరగా వచ్చాను, కనక, మీకు సంగీతం నేర్పుతాను వీలయితే రండి" అన్నారు, నా అభిలాష యెరిగి వుండిన సర్వదేవుడుగారు.

సర్వదేవుడుగారు చెప్పగా, సత్యనారాయణరెడ్డిగారున్నూ నాకు వర్తమానం పంపారు, తప్పకుండా రమ్మని.

కుతుకులూరు గ్రామం మా పొలమూరికి మూడుమైళ్లదూరాన వుంది.

కాగా, కానడరాగ యోధులు బుచ్చిరాజుగారి దగ్గిర ఫిడేలుండగా పుచ్చుకుని వెళ్లి సరళీస్వరాలు ప్రారంభించాను.

రెడ్డియువకు లొక్కొక్క రయిదేసి రూపాయ లిచ్చేవారు సర్వదేవుడుగారికి.

నాకు మాత్రం స్నేహమే ప్రధానంగా చెప్పసాగారు.

కాని, యీసంగీతమూ మా నాయనగారి కిష్టం లేనిదే.

వారి అనిష్టతకు కారణం - సంగీతమూ, కవిత్వమూ, చిత్రలేఖనమూ - ఇలాంటి లలితకళలు వేదశాస్త్రాలవంటి మహావిద్యలూ సభ్యవిద్యలూ కావని.

నటవిటకవిగాయకుకు లొకటే వర్గం వారి దృష్టిలో.

వారందరూ పంక్తిబాహ్యులు.

మా నాయనగారి దొక్కరిదే కాదు, వేదశాస్త్రాలు నేర్చినవారి దందరిదీ యిదే నిశ్చయం.

అన్ని కళలనూ గూడా ఇంత హీనంగా చూసేవర్గం యీ వేదశాస్త్రజ్ఞులవర్గం తప్ప మరొకటి లేదు, మనదేశంలో.

మనదేశంలోనే కాదు – భరతఖండం అంతటా మాత్రమన్నేకాదు – ప్రపంచమంతటా తమతమ వేదవేదాంగాలు పట్టుకు పాకులాడేవారిదిన్నీ అందరిదీ యిదే నిశ్చయం.

అయితే, జనుల చిత్తవృత్తులు సంస్కరించి, జీవితాలు సరళరేఖమీద నడిపిస్తూ రసబంధురాలున్నూ చేసే ఉత్తమోత్తమకళల నిలాగ నిరసించడం వివేకమా?

కాదు, కనకనే యెక్కడ చూసినా, వేదశాస్త్రాలకే తప్పనిసరి అవుతోంది పతనం.

కాక, –

మా నాయనగారి యీ ప్రాతికూల్యానికింకో కారణం కూడా వుంది.

సర్కారు ఉద్యోగస్థు లెందరో మా నాయనగారి నాదరించేవారు, జ్యోతిశ్శాస్త్రం పరంగా.

స్వహస్తపరహస్తాలతో బాగా సత్కరించేవారు కూడా.

దీంతో, ఆఫీసర్లంటే దేవలోకంనుంచి వూడిపడ్డవాళ్ళన్న వెర్రినమ్మకం పట్టుకుంది మా నాయనగారికి.

తాము వెడితే, ఆ వుద్యోగస్థులు, తమకు కుర్చీ యిచ్చి జాతకాలూ ప్రశ్నలూ చెప్పించుకుంటారుట, సభక్తికంగా.

సంగీతం పాడతానంటూ నేను వెడితే మాత్రం, వారు, తామేమో కుర్చీలమీద కూచుని, కావాలని కిందకూచుని పాడమంటారుట నన్ను, సదర్పంగా.

ఇది నాకే కాదుట, తమకూ అవమానకరమేట, నేను తమ కుమారుణ్ణయినందుకు.

ఇది చాలా అసందర్భంగా కనపడింది నాకు.

మానావమానాల సంగతి అలా వుంచుదాం, ఆఫీసర్లందరూ అలాంటి దుష్టులే అనగలమా?

కాక, –

కళావేత్తలకు ఉద్యోగస్థులేనా గతి?

ఇంతకీ, –

నా సంగీత శ్రద్ధకు ముఖ్యకారణం, అప్పటికీ యిప్పటికీ గూడా ద్రవ్యార్జనాభిలాష కాదు.

నాకు సంగీతవిద్య స్వాధీనం అయితే, వొక్క వుద్యోగస్థుల దగ్గిరికే కాదు, మరెవరి దగ్గిరికి వెళ్ళిన్నీ అది ప్రదర్శించడం నా సంకల్పం కా దెంత మాత్రమూ.

మరేమిటంటే?

ఆత్మోద్దీపనం కలిగించే గొప్పకళ అదిన్నీ.

దానివల్ల నా హృదయం స్పందిస్తుంది.

కవిత్వంవల్లనే నాకు కలుగుతున్న ఆనందానుభూతి కీస్పందనం శతగుణకం అవుతుంది.

సొంతంగా సంగీతం నేర్చుకుంటేనే కలిగే ఫలితం యిది.

అపిచ.

ముఖ్యంగా ముందుజన్మలో, చిన్నతనంలోనే నాకు సంగీతాభిరుచి కలగడానికీ, ప్రావీణ్యం అలవడ్డానికీ యిదొక బీజావాపనమున్నూ కావచ్చు.

## 4

విచిత్రోదంతం వొకటి చెబుతా నిక్కడ.

మా అత్తవారి వూళ్లో వొక పండితుడు.

ప్రస్థానత్రయం చదివినవా డాయన.

స్థితిపరుడు.

అయినా, సంసారం పెరిగేటప్పటికి రుణాలూ పెరిగాయి.

ఈ స్థితిలో ఆడపిల్లలకు పెళ్లిళ్లు ప్రారంభం అయినాయి.

ఒకటిరెండు కన్యాదానాలు చేసినవాడే ఆయన; కాని కొన్నాళ్ళకి, ఒక పిల్ల నమ్ముకోవలసివచ్చింది.

అమ్ముకోవలసివచ్చిందంటే, ఆ పరిస్థితులే ఆయనవి, కాని ఆ వూహా, ఆ సంకల్పమూ, ఆ ప్రయత్నమూ, ఆ నిర్వహణమూ మాత్రం ఆయనవి కావు.

శ్రేయస్సంధాత లయిన బంధువు లీవుపాయం చెప్పి, మెడలువంచి, నిరుత్తరుణ్ణి కూడా చేసి కూచోపెట్టా రాయన్ని.

పెళ్లయిపోయింది, కాపరానికీ వెళ్లింది పిల్ల.

గర్భవతి అయింది, పిల్లలను కన్నది, నలభైయేళ్లున్నూ గడిపింది; గాని మళ్లీ పుట్టిల్లెరగ దామె.

ఆమెని తన యింటికి తీసుకురాకపోడమే కాదు, తానయినా ఆమె యింటికి వెళ్లలే దాయన.

అది పిల్లమీద కోపం కాదు, అశాస్త్రీయంగానూ, కుటుంబసంప్రదాయానికి పూర్తిగా విరుద్ధంగానూ పెళ్లి జరిగించవలసివచ్చిందన్న తపన మాత్రమే.

కనక, ఆమె మొగం చూడలేని వ్యథాను.

కాలక్రమాన వార్ధకం ముసురుకుం దాయన్ని.

వయస్సు పండడంతోపాటు, శాస్త్రచింతనమననాలతో కొంత నిర్లిప్తతా అలుముకుం దాయన్ని.

కొడుకు పెత్తనం ప్రారంభించాడు.

నిశ్చింతగా తిని కూచోడమే పెట్టుకున్నా డాయన.

సహజంగా మితభాషి ఆయన.

అతిమిత భాషి.

పదచలనమున్నూ యెరగ డెప్పుడూ.

ఎప్పుడూ యెందుకూ చెయ్యి చాపి యెరగని చెయ్యన్నీ.

ఆహారనిద్రలకోసమే యింటో ప్రవేశం, తరవాత వీధి అరుగుమీద కూచుని వుండేవా డేకాకిగా.

ఎప్పు డయినా నే నాయనదగ్గిర కూచోడమూ మాట్లాడ్డమూ వుండేది; గాని నేను వందమాటలు మాట్లాడితే, వొక్క మాటే అడేవా డాయన, మందహాసం చేస్తూ.

చూసినవాళ్ళకి, నేనేదో గోష్ఠి చేస్తున్నట్టూ అయన వూకొడుతున్నట్టూ వుండేది.

ఇంతలో కడసారపు పిల్ల పెళ్లివచ్చింది.

"ఈమాటు దాన్ని (క్రీతురాలిని) తీసుకురావా"లంటూ కూచుంది తల్లి.

"తీసుకు వచ్చితీరతా"నంటూ నడుమే బిగించాడు కొడుకు.

"నాకు వ్రతభంగం చెయ్యకం"డన్నాడు ముసలాయన, లాభం లేకపోయింది.

ఇక విశేషం యేమి టంటే?

తక్కినదంతా తాను సమకూర్చుకుంటూ "రాజమహేంద్రవరం వెళ్ళి బట్టలు కొనుక్కురా" అంటూ రెండుమూడు వందలు చేతిలో పోశాడు కొడుకు.

కీకారణ్యంలోనుంచి తీసుకువచ్చి సిమెంటు రోడ్డుమీద దిగవిడిచిన ట్టయిం దాయనకు దాంతో.

నిడదవోలు వచ్చాడు, పాసెంజ రెక్కడం మానేసి మెయిలెక్కాడు.

"హరోం హర" అంటూ వెళ్లి కాశీలో దిగా డాయన, అయెక్కడం యెక్కడం.

బట్టలమూటతో మనిషికి బదులుగా "నే నిక రా"నన్న మాటలతో టెలిగ్రాం వచ్చిం దింటికి.

"రా"నంటే రాకపోలే దనుకోండి చివరికి, చాలాకాలం పట్టిందందుకు – అంతే.

"మరి, యింటిదగ్గిర యేమి జరిగిందీ?" అంటే, లోక సామాన్యధర్మం ప్రవర్తిల్లుతుంది, కాలమూ గడచిపోతుంది, మన కక్కర్లేదది.

కాశీలో వొక్కటే కార్యక్రమం అయనకు.

చక్రనేమిక్రమానికయినా తప్పడం వుండవచ్చు; గాని దానికిలేదు.

చీకటితోనే గంగాస్నానం.

స్నానం అన్నమాట సంధ్యావందన మంత్రజపాదుల కేకదేశం.

తరవాత యేసత్రంలోనో యేకభుక్తం.

అది ముగియడం తడువుగా, గంగ వొడ్డున వొక సన్యాసి దగ్గిర కూచుని వేదాంతవిచారణ.

గంగవొడ్డున యెందరో సన్యాసులుట, కాశీలో.

వారిలో, నిరక్షరకుక్షి మొదలు మహావేత్త దాకా యెన్నో రకాలూనుట.

ఆ మహావేత్తల్లో వొక సర్వోత్తముణ్ణాశ్రయించా డాయన.

అలాంటి సన్యాసి మరి లే డాపట్నంలో.

అలాంటి జిజ్ఞాసువూ మరి లే డాసన్యాసికి.

ఇక వొకటే పఠనం, వొకటే విచారణ, వొకటే చర్చ, వొకటే వాగ్వాదం, శాస్త్రం అంతా వొకటే వొలకబోసి వొకటే యెత్తడమున్నూ.

సన్యాసి కీ శ్రోత దొరకడం వేత్తృతాసాఫల్యానికయితే, శాస్త్రిగారి కా సన్యాసి దొరకడం తత్త్వావబోధ కయింది.

ఇది యిలా వుండగా:—

డెబ్భయ్యేనభై యేళ్లవాడు మరో బ్రాహ్మడున్నూ వచ్చి ఆశ్రయించా డాసన్యాసిని.

ఆ ప్రాంతంవాడే ఆయన, ఆవూరివాడున్నూ.

జీవితం అంతా పొట్టపోసుకోడంలో గడిచిం దాయనకు.

వ్యాకరణశాస్త్రం భాష్యాంతం సాధించాలన్న సంకల్పం కలిగింది చివరికి.

దీక్ష పట్టాడు.

అందుకోసం ఆశ్రయించా డాయన, ఆ సన్యాసిని.

కాని సంస్కృతం ముక్కూ మొగమూ కూడా యెరగడప్పటి కాయన.

మరి, యిదేమిటీ అంటే, దేశాచారం.

మన దేశంలో కాళిదాసత్రయం అయినా అయితే గాని సిద్ధాంతకౌముది చేతబట్టరు.

కాశీలో — ఆ ప్రాంతాన కూడా శబ్దాలయినా కాకుండానే కౌముది ప్రారంభిస్తారుట.

భాష్యాంతం అయాక కూడా కావ్యాలు ముట్టనివా రుంటారుట, వారిలో.

భాష్యాంతం చదవడంతోనే అందు క్కావలసిన సంస్కృతం పట్టుబడుతుంది వారికి.

రసాస్వాదలోలుపులే కావ్యాలు చదువుతా రక్కడ.

సంస్కృత భాషాప్రవేశమూ, రసానందానుభవమూ, కావ్యపాఠంతోనే కలుగుతాయి మనకి ముందు.

అయితే "వారి పద్ధతి మంచిదా, మన పద్ధతి మంచిదా?" అంటే, —

తెనుగువా డైనవా డెవడూ వారి పద్ధతి అంగీకరించడు, చిరసంచిత మైన వొక సంప్రదాయం తన కుంది కనక.

వారున్నూ అంతే.

పోతే —

"అయితే, యీ వృద్ధునకు భాష్యాంతం కావడమూ, ఈ జీవితంలో అది వినియోగపడ్డమూ వుంటుందా?" అని మన శాస్త్రిగారికి సందేహం.

సాహసించి సన్యాసి నడిగా రొకనా డాయన.

"అతణ్ణే అడగ"మన్నాడు సన్యాసి.

ధర్మమే; కాని ఆ యిద్దరూ మాటలు రానివారే.

మన శాస్త్రిగారు తెనుగూ సంస్కృతమూ మాత్రమే తెలిసినవా రయితే, వొక హిందీమాత్రమే తెలిసినవాడా వృద్ధుడు.

సన్యాసికే మాధ్యస్థ్యం తప్పనిదయింది.

వినివిని "ఆత్మకి నాశం లేదన్న సిద్ధాంతం యెరగడా ఆయన?" అని యెదు రడి గా డావృద్ధుడు.

"పునర్జన్మ సిద్ధాంతమున్నూ తెలియదా?" అనిన్నీ అడిగాడు.

పర్యవసానం యేమి టంటే?

"వ్యాకరణం భాష్యాంతం చదివి, మహామహోపాధ్యాయుణ్ణి కావాలని చిన్నప్పణ్ణుంచీ నా ఆశ; కాని బువ్వకోసం తంటాలుపడ్డంతోనే నా బతుకు తెల్లవారింది. ఈ లోకంలో నే నెంతో కాలం వుండ నిక. కనక, ఇప్పుడయినా నేను వ్యాకరణపఠనం ప్రారంభిస్తే - ఈ వ్యాకరణం నింతన చేస్తూ, మననమున్నూ చేసుకుంటూనే నే నీశరీరం విడిచిపెడితే, నా కెలాగా ఉత్తరజన్మ తప్పదు కనక, అది మనుష్యజన్మే అయితే పూర్వ వాసనతో బాల్యంలోనే వ్యాకరణశాస్త్రం అవగాహన అయి నా కోరిక సిద్ధించదూ?" అంటూ ముగించా డావృద్ధుడు.

చకితు లయిపోయారు మన శాస్త్రిగారు.

ఆయన కిది తెలియందా?

గుర్తుకిరాలే దంతే.

నిజంగా, వృద్ధుని వాదాని కిక తిరుగు లేదు.

సందేహా మేమీ?

ఆచార్యశంకరులు గురుశుశ్రూషతోనే అంతటి వేత్త అయినారా, ఆ చిన్నతనాన?

మన బెల్లంకొండ రామారావుగారున్నూ పాఠాలు వల్లించే అంతటి వేత్త అయినారా ఆ స్వల్పజీవితంలో?

ప్రాక్తనసంస్కారవిశేషం తప్ప మరేమీ కా దది.

ఆ సంస్కారానికి ఆ జన్మల్లో జరగవలసిన వినియోగం ఈ జన్మల్లో జరిగిం దామహానుభావులకు.

ఇది సమన్వయించుకోవా లంటే, పునర్జన్మ సిద్ధాంతమూ, ప్రాక్తనసంస్కార సిద్ధాంతమూ అంగీకరించడం తప్ప మరి గతిలేదు.

కనక?

ముందు జన్మలో, సంగీతంలో నాకు ప్రావీణ్యం అలవడ్డాని కిది బీజావాపన కావచ్చు.

కావచ్చేమిటి మళ్ళీ, అవుతుంది.

అయే తీరుతుంది.

మరి, నా కిలాంటి నమ్మకమూ ఆశా వుండడం యేమిటి వుద్యోగస్థుల చుట్టూ నేను తిరగడం యెక్కడ, ఆ వుద్యోగస్థులు నాకు గౌరవం చెయ్యకపోవడమున్నూ యేమిటి?

## 5

మధ్యాహ్నం భోజనం కావడం తడువుగా కుతుకులూరు వెళ్ళడమూ, పాఠం చెప్పకుని, ఫిడేలుసాధకం కూడా చేసుకుని దీపాలు పెట్టేవేళ కింటికి రావడమూ ప్రారంభించేశాను వెంటనే నేను.

మధ్యాహ్నం పూట అంతా - ఏప్రిల్ - మెయి - జూన్ నెలల్లో నా కిదొక్కటే వ్యాసంగం మొత్తానికి.

అమావాస్యనాడున్నూ మానలేదు నే నక్కడికి వెళ్ళడం.

ఆవేళ గురువులు పాఠం చెప్పరు.

పాతపాఠాలున్నూ పరీక్ష చెయ్యరు.

అయినా కుతుకులూరు వెళ్ళడం మానలేదు నేను.

తదేకదృష్టి దాని కొక కారణం.

నా కొక్కటే ఫిడేలుండడం రెండో కారణం.

దానికి పెట్టె లేదు, గుడ్డ సంచీలో వుంచేవాణ్ణి.

ఎప్పటికప్పుడు చంకని పెట్టుకురావడాని కదిన్నీ వొక ఆటంకమే.

వేసవి కావడంవల్ల రానూపోనూ ఆరుమైళ్లు నడవడంలో చెమట పట్టి తడిసిపోతుందది.

పైగా, కులవిద్య కూడా కాదాయె.

ఆ ప్రాంతం ప్రజలు, ఫిడేలు, బోగంమేళాల్లో వుండడం మాత్రమే యెరుగుదు రప్పటికి.

నే నది చంకనపెట్టుకుని బయలుదేరితే, సిద్ధాంతిగారి కుమారుడు నాటకా లాడుతున్నాడు కనక, భోగంమేళాల్లో హంగుదారుగానున్నూ వుంటున్నాడని భావిస్తారు వారు.

అంచేత, పదికృతు లయినా ధారాళంగా వాయించడం చేతనయేదాకా ఫిడేలు కదపగూడ దనుకున్నా నక్కణ్ణుంచి.

కాగా, – అది సాధకం చేసుకోడాని కయినా నే నక్కడికి వెళ్ళవలసే వుండింది.

అయితే, అమావాస్యనాడు సాధకమూ నిషిద్ధమే.

కాని, "తీరికూచుని ఆరుగంటల సాధకం మానుకోడమేనా?" అనిపించింది.

పోనీ, రాకపోక లేమయినా వుల్లాసజనకా లేమో అంటే ఆ చెవిగాడ్పు ఈ చెవికి కొట్టే మండుటెండలో నడక.

అయినా, యింటా బయటా కూడా నన్నెవరూ ఆపలేకపోయారు.

కాని, వెళ్ళగా వెళ్ళగా సర్వదేవుడుగారే చేశా రాపని.

అసలు, ఆ వయస్సున, కొత్త విద్యకు ఓనమాలు ప్రారంభించడమే యెలాగో వుంటుంది.

పైగా, సరళీస్వరాలు ప్రారంభించడం.

"సగం చచ్చి సంగీతమూ, అంతా చచ్చి హాస్యమూనూ" మరి.

ఆ స్వరాలు జంత్రాన పలికించడం వొక యమచెర.

అయినా, నా కిష్టమయిన విద్య లన్నిటా నాకీ దుర్గతి తప్పనిదే అయింది.

కాక:–

సంగీతం వొక శాస్త్రం.

శాస్త్రం మాత్రం కాదు, గొప్ప కళాను.

పోనీ అంటే, మహావిద్య లేవీ కూడా వోపట్టాన స్వాధీనం కావు.

నా ప్రయత్నం గాలిపాట కోసమూ, ఆషామోషీ వాద్యం కోసమూ కూడా కాదాయె.

ఏమయినా యిది సాధించాలి.

సాధించి కమ్మగా ఫిడేలు వాయించాలి.

వాయించి, నాదానందం అనుభవించాలి.

నాకిది దీక్ష.

నాటకాల్లో శ్రుతి కలపడం చేతనయి వుండడంవల్లా, సర్వదేవుడుగారు వీణ పలికిస్తూ చెప్పడంవల్లా స్వరస్థానాలు మొదట్లోనే సులభంగా పట్టుకోగలిగా న్నేను.

చరచరా పదిరోజుల్లో పది సరళీస్వరా లయిపోయాయి.

తాళయుక్తంగా త్రికాలసాధన కూడా జరిగిపోయింది.

అప్పుడు ప్రారంభించాను ఫిడేలు.

కమాను లాగడం మొదటినాడే పట్టుబడింది.

షడ్జరిషభస్థానాల్లోనూ, గాంధారమధ్యమస్థానాల్లోనూ నాలుగు తీగలకూ వుప యోగించేటట్టు బోర్డుమీద కాగితం పీలిక లంటించారు సర్వదేవుడుగారు.

శ్రుతిన్నీ వారే సరిచేసి చేతికిచ్చేవారు.

కాని గాత్రాన పలికినంతవర కయినా జంత్రాన గమకం పలికేది గాదు.

పిల్లారిగీతాలు వాయించేటప్పుడు కలిగింది నాకీ సందేహం "యేమిటిదీ?" అని.

ఘనరాగగీతాల్లో స్థిరపడిపోడంతోపాటు అనుమానమున్నూ కలిగింది.

సాహసించి వొకనా డడగ్గా "రాగభావం తెలిసేదాకా అది చెప్పడంవల్ల లాభంలేదు, గ్రంథం కావా"లన్నారు సర్వదేవుడుగారు.

నాకు తృప్తికాలేదు.

తామే పిలిచి నాకు విద్య చెప్పడానికి పూనుకున్నా రాయన, కుచ్చితం కనపరచవలసిన అగత్యం లేశమూ లేదు; గాని యిదేమిటి?

## 6

ఒక యువకుణ్ణి ఫిడేలువాద్యానికి పెట్టుకున్నాం మా నాటకాలకు మేము.

అప్పటి నాటక ప్రదర్శనాల్లో శ్రుతిమట్టుకే హార్మోనియం.

నటుడు పాడుతూ వుంటే, ఇప్పుడు హార్మోనియం అనుసరిస్తున్న ట్టప్పుడు ఫిడే లనుసరించేది.

తబలా నాకు పనికిరాదు.

కనక, హిందూస్థానీరాగాలతోపాటు నే నదీ నిషేధించాను.

పరిపూర్ణమూ జాతీయమూ అయిన మద్దెల వుండగా, అసమగ్రమూ విజాతీయమూ అయిన తబలా యెందుకు స్వీకరించాలీ మనం?

సంపూర్ణమూ, అచ్చంగా జాతీయమూ అయిన కర్ణాటక సంగీతం వుండగా, కొంత విజాతీయమూ కొంత సంకరమూ అయిన హిందూస్థానీ సంగీతమున్నూ మన మెందుకు స్వీకరించాలీ?

మనవాళ్ళు బాగా విమర్శించుకోవలసిన విషయం యిది.

కనక, యీ చర్చ మరోమాటు.

పోతే, – ఆ దినాల్లో, నటుడు రంగస్థలాన పద్యం "పాడి" విడిచిపెడితే తెరలో మరొక డందుకుని రాగం విసిరే పద్ధతి వుండేది.

ఈ యేర్పాటు లేని నాటకసమాజాలు తాటాబూటం సమాజా లనిన్నీ నిరసనభావం వుండే దప్పుడు.

ఉత్సాహం కొద్దీ వొక్కొక్కప్పు డిద్దరేసి ముగ్గురేసీ అందుకునేవా రది, వొకరి సంగతి వొకరికి తెలియక.

రసాభాసగా వుండడమే కాక, ఒకటిరెండు నాటకా లయేటప్పటికి, రంగస్థలాన వున్న నటుల అభినయాని కది అడ్డంకిగానున్నూ వుండడం చూసి నే నాపద్ధతి పూర్తిగా కట్టిపెట్టించేశాను.

మేము తెచ్చుకున్న యువకుని ఫిడేలువాద్యం మిక్కిలీ మధురంగా కూడా వుండేది.

హిందూస్థానీసంగీతం అంటే అతనికీ మంటే.

మా నాటకాల్లో నే నది నిషేధించివుండడం చూసి మొదటే నన్నభినందించా డత నందుకు.

అయితే, నా కెనిమిది ఘనరాగగీతా లయేదాకా నా ఫిడేలు సాధకం సంగతి తెలియలే దతనికి.

తెలిసిన్నా డత ణ్ణొకమూలకు తీసుకువెళ్లి మోహనగీతం వాయించమన్నాను.

చక్కగా వాయించా డతను.

"నేను పాడతాను, కలిపివాయించ" మన్నాను.

వాయించాడు; గాని "మీ గాత్రం సంగీతానికి వొదగ"దనేశా డవ్యవధానంగా.

అది నాకే తెలుసు, కనకనే, నేను ఫిడేలు సాధకం ప్రారంభించడం.

దానిమీద నా సంగీత ప్రయత్నం బయటపడింది.

వెంటనే తన ఫిడేలు నాచేతికిచ్చి ఆ మోహనగీతమే వాయించమన్నా డతను.

వాయించగా "గమకం యేదీ?" అనడిగాడు.

డొంకంతా కదిలింది.

"మీ గురువుగారు చెప్పింది తప్పు, అలంకారాలు కాగానే గమకం సాధనచెయ్యాలి. గమకం పట్టుపడకుండా గీతాలు వాయించకూడ"దన్నా డతను.

పిల్లారిగీతాల్లో కూడా వొకటి వాయించ మని "దానికీ దీనికీ వొకటే రిషభమా?" అనిన్నీ అడిగాడు.

కడుపులో రాయిపడింది నాకు.

ప్రారంభంలో గురువు చెప్పింది సగమైనా పట్టుపడదు శిష్యుడికి, మరి, గురువు చెప్పిందే తప్పయితే?

జూన్ నెల పూర్తికావచ్చేటప్పటికి, గాత్రానా జంత్రానా కూడా పది సరళీస్వరాలూ, యెనిమిది జంటస్వరాలూ, ఏడలంకారాలూ, అయిదు పిల్లారిగీతాలూ, యెనిమిది ఘనరాగ గీతాలూ అయినాయి నాకు, ఇదంతా నిష్ప్రయోజనమేనా?

తల తిరిగిపోయింది నాకు.

ఇలాంటి స్థితిలో, మర్నాడు, శంకరాభరణం తానవర్ణం ప్రారంభించారు నాకు సర్వదేవుడుగారు.

వెనకటి స్థితి అయితే "మనం మేడ యెక్కేస్తున్నాం" అనుకుని పొంగిపోయి వుందును; గాని, అప్పుడు మరి దాచుకోలేక జరిగిందంతా చెప్పేశా నాయనకు.

దాంతో నిర్విణ్ణు లయినా రాయన.

మాట కూడా అడలేదు.

అంతేకాదు, మర్నాడు పాఠమున్నూ చెప్పలేదు.

భోజనానంతరం నిద్రపోయి లేచి సోల్లాసంగానే వున్నారు కానయితే.

మధ్యాహ్నం మొదటిపాఠం నాది; కాని "తలనొప్పిగా వుంది, ఇవాళ పాఠం చెప్పలే"నన్నారు నాతో.

ఒక మాటింటోకి వెళ్ళి, పావుగంటలో యివతలికి వచ్చి పది నిమిషాలు వీధి అరుగుమీద పచారుచేసి, చివరికి వసారాలోకి వెళ్ళి రెడ్డియువకులకు పాఠాలు ప్రారంభించేశారు కూడా ధీమాగానే.

స్తబ్ధుణ్ణయిపోయా న్నేను.

పోనీ అంటే, ఆ మర్నాడూ యింతే చేశారు.

సిగ్గూ, విసుగూ, రోషమూ, క్రోధమూ, విచారమూ, ఉడుకుమోత్తనమూ పొంగుకువచ్చాయి నాకు.

నే నిదంతా చెప్పగా "కారణం అడిగెయ్యండి" అన్నారు సత్యనారాయణరెడ్డిగారు.

అడగ్గా "మొదట మీకెంత వుత్సాహంతో పాఠం ప్రారంభించానో అంతా నిరుత్సాహం యెదురయింది నాకిప్పు" డంటూ ప్రారంభించా రాయన.

"రెడ్డి యువకుల కారు మాసాల్లో పట్టిన విద్యకు మూడు మాసాలే యెక్కువయింది మీకు. ఇందుకు వారు నన్ననుమానిస్తున్నారు. దీనివల్ల నాకు వృత్తిభంగం కలిగేటట్టయింది చివరికి" అని విశదంగానూ చెప్పేశారు, తుదకు.

"అయితే, గమకం మాట యేమి?"టన్నాను.

"గ్రంథం కావా"లన్నా రప్పుడున్నూ ఆయన.

"నాకు తెలిసినంతవరకూ మావాళ్ళ కెవరికీ అటువంటి అనుమానాల్లేవు. కాక, – పాఠం పూర్తికావడం తడువుగా మేము వేరే పనుల్లో మునిగిపోతాం. మీకు మాత్రం మధ్యాహ్నం వొంటిగంట మొదలదే వ్యాసంగం మరి. కనక, గ్రంథం మీకెక్కువా అవుతుంది, త్వరగానూ అవుతుంది. పోనీ, గమకం మాట యేమిటి? కనక, ఇక మీరిక్కడ చాలించుకోడం మంచిది" అన్నారు సత్యనారాయణరెడ్డిగారిదంతా చెప్పగా.

ఫిడేలు పుచ్చుకుని వుత్తరక్షణాన యింటికి వచ్చేశా న్నేను, కోపతాపాలతో.

## 7

ఎన్నాళ్ళుగానో కలలుగంటున్న సంగీతవిద్యాభ్యాసం యిలా పర్యవసించినందుకు చాలా పరితపించాను కొన్నాళ్ళు నేను.

కొత్తపల్లి సూర్యనారాయణగారు కుచ్చితంగా ప్రవర్తిస్తే నిమిషంలో తీర్చేశారు కొండేపూడి సుబ్బారాయుడుగారు ఛందస్సందేహాలు.

సావకాశంగా నయినా, సంగీతం చెప్పడాని కెవరున్నారూ అందుబాట్లో?

కర్ణాటకం పెంచిపోషించిన త్యాగరాజూ క్షేత్రయ్యా మనవాళ్ళే అయినా, సంగీతం మనదేశంలో వికసించలేదు.

ఏ బొబ్బిలి సంస్థానంలోనో, యే విజయనగరం సంస్థానంలోనో చెదురువాటుగా వుండేవారు గాయకులప్పుడు.

దేశంలో సంగీతకచేరీలు జరిగే అలవాటు లేకో, తమ ప్రభువుల ఆజ్ఞ లేకో వున్నవూరు విడిచేవారు కారు వారు.

అంచేత, జనులకు సంగీతమూ, ఆ గాయకులకు కొత్తపోకడలూ అందేవి కావు.

త్యాగరాజు శ్యామశాస్త్రి దీక్షితులుగార్ల కృతుల్లో గూడా యేవేవి పఠనపాఠనాల్లోకి వస్తున్నాయో వా రెరగరుట.

ఇందుకు నిదర్శనంగా, నా మిత్రులు వైణికులు శ్రీ బెహతా రాజారావుగా రొక విచిత్రోదంతం చెప్పా రొకమాటు.

వీణ ధనం విజయనగరం రాజసభలో వీణ వాయిస్తోం దొకనాడు.

ఆస్థానగాయకులే కాదు, ప్రభువూ బాగా సమర్థు డావిద్యలో.

అందరూ పరవశులవుతున్నా రామె వాద్యవిశేషానికి.

కాని వొక రాగమూ, ఆ రాగంలో పాడిన కీర్తనా యెవరూ గుర్తించలేకపోయారు.

పట్టలేక కొంతసేపటికి రాజే అడిగా డపవారించి "గురూజీ! ఆ రాగం యేమిటి?" అని.

వెంటనే బదులు చెప్పా డాగురూజీ "మహాప్రభూ, ఏదో పాడిచేస్తారని యెరగనివాళ్లని పైనుంచి తీసుకురావడమే గాని అక్కడి సత్తా లిలా వున్నాయి మరి. 'రాజసభ, విద్వాంసులున్నా'రున్న జంకయినా లేకుండా, ధైవతానికి బదులు నిషాదం వేసి నిక్షేపం వంటి మోహనరాగం ధ్వంసం చేసేస్తోం దామనిషి" అని.

అంత దుస్సాహసం వుంటుందా?

గురూజీ సమాధానం నచ్చక ఆమెనే అడిగాడు మహారాజు ఆ ప్రశ్నే.

ఇలాంటి రాజులనూ, యిలాంటి గురూజీలనూ యెందరినో చూసిన వైణికురా లామె.

విద్యలో లాగే లోకానుభవంలోనూ మంచి ప్రౌఢిమ సంపాదించిన దిట్టకూడానూ ఆమె.

గురూజీ ధోరణికి నిరసనగా చిరునవ్వు నవ్వి "మహాప్రభూ, హంసధ్వని రాగం యిది. నే నిప్పుడు వాయించింది దీక్షితులవారి కృతి 'వాతాపిగణపతిం భజే' అన్నది" అని రాజుకి బదులుచెప్పిం దామె, వినయం తప్పని అహమికతో.

అంతా తెల్లపోయారు.

ఆ రాగం అప్పటికిక్కడ వాడుకలో లే దింకా.

ఎరగనే యెరగరది, హంసధ్వని అన్న పేరూ, అది శంకరాభరణజన్యం అన్న విషయమూ తప్ప.

దక్షిణాది నయినా అప్పుడప్పుడే బయటికి వస్తోం దది సాధకులదగ్గిరనుంచి మెలిగా.

అంచేతనే, గాయకు లదే పాడేవారు, జంత్రనిపుణు లదే వాయించేవారు మొదట.

ఇప్పుడది బాగా పాతబడిపోయింది.

కర్ణాటకానికి విలాసవిహారభూమి అయిన ఆ దక్షిణాదిని కూడా త్యాగరాజు పాడిన రాగాలూ, రచించిన కీర్తనలూ అనేకా లెరగ రిప్పటికీ మహామహాగాయకులున్నా.

చెప్పవచ్చిం దేమి టంటే?

ఏది యేమయినా, అప్పటికీ యిప్పటికీ గూడా అరవలదే వరవడీ, ప్రామాణిక త్వమూను, మనవాళ్లే రూపురేఖలు దిద్దిన కర్ణాటకంలో.

స్వత్వం కూడా వారి భుక్తంలోనే వుంది చెన్నపట్నం విషయంలో లాగే.

ఇలాగ సర్వవిషయాల్లోనూ మనవాళ్ళు తీసికట్టే, తమలో తాము గోతులు తవ్వుకోడంలో తప్పించి.

కాగా, గాయకులే తక్కువ, సంగీతవిద్యాగురువు లసలే తక్కువ, అప్పట్లో మన దేశంలో.

ఉన్నవారిలో నయినా మనసు విప్పిచెప్పేవారూ తక్కువే.

అంతటి మహావైణికులు సంగమేశ్వర శాస్త్రిగారికే తప్పింది కా దీ అపకీర్తి.

వేదవేదాంగాలూ తక్కిన కళలూ నేర్పే గురువులు కనబరిచే ఔదార్యం లేశమూ కనబడదు, మన సంగీత విద్యాగురువుల దగ్గిర.

అది, పాఠాలు చెప్పడంలో కూడా డబ్బు దొరికే విద్య కావడమే యిందుకో కారణం అయివుంటుంది.

కాక, – ఏ విద్యల్లో నయినా, గురువుల ఔదార్యం కంటే శిష్యుల యేకాగ్రతా పరిశ్రమా యెక్కువగా వుండాలి కా దనను; గాని గురువులు ప్రారంభావస్థలో ప్రాతిపదిక లయినా సరిగా చెప్పకపోతే యెలాగా?

పరకాయిస్తే, మన తెనుగుదేశంలో మనదే – కనీసం మనదిన్నీ – అయిన యీ విద్య వ్యాపించకపోడానికీ, దేశీయుల కీవిద్య అంటే అభిరుచి యేర్పడకపోడానికీ, గానసభలు బహుళంగా జరక్కపోడానికీ బాధ్యత అంతా మన సంగీత విద్వాంసులదే, ముమ్మాటికీ.

విద్య అన్నది యేదీ కూడా గహనంగా వుంటుంది; గాని విశదంగా వుండదు.

ప్రతీవిద్యకూ లక్ష్యలక్షణా లుంటాయి.

లక్షణం విద్వాంసులకూ, లక్ష్యం జనానీకానికీ వినియోగం.

శంకరాభరణంలో శుద్ధమధ్యమానికి బదులు ప్రతిమధ్యమం వేస్తే కల్యాణి అయిపోతుం దన్న సంగతి రసికులకు తెలియకపోవచ్చు, తెలియనూ అక్కర్లేదు కొంతమట్టుకి, అది యథాతథంగా వుంచీ మార్చీ పాడితే మాత్రం రెండు రాగాల మాధుర్యమూ చక్కగా అనుభవిస్తారు వారు.

కనక, దేశంలో యే విద్య వ్యాపించాలన్నా, ఆ విద్యకు సంబంధించిన కళాత్మకభాగం జనులకు పరిచితం అయివుండాలి.

అది జరగాలంటే, అందుకా విద్యలో ప్రవీణులయినవారు బాగా పూనుకోవాలి.

కళ ఆత్మానందానికీ ఆత్మోపలబ్ధికీ మాత్రమే – జీవికకు కాదు.

ఈ జ్ఞానం లేనిచోట అది వికసించనే వికసించదు.

జనసామాన్యానికి జీవికమీదే శ్రద్ధ, కళలు వారికి విలాస వస్తువులు.

ఏ దేశంలోనూ యిది యిలాగే వుంటుంది.

అయితే, వారిని కళలవైపు మళ్ళించవలసినవారూ, ఆనందించడం మప్పవలసినవారూ కళావేత్తలు.

మన తెనుగుదేశంలో కవులు తమ బాధ్యత నిర్వహించుకున్నారు, గాయకు లాపని చెయ్యలేదు.

కవి, సంపన్నులనూ సదస్యులనూ వెతుక్కుంటూ వెళ్లి, తన ప్రజ్ఞ కనబరచి, అంటే, వారికి తన కవితామాధుర్యం రుచి చూపగా – అంటే వారికి రసికత కలిగించగా, గాయకుడు తన బాధ్యత తప్పించుకోడమే కాదు "వింటాము. ఆనందిస్తాము పాడండి" అని జనులే ప్రార్థిస్తే "ఏమిస్తావ్?" అనడగడం పెట్టుకున్నాడు, నిర్మొగమాటంగా.

అంచేత, మనదేశంలో, కవితాభిరుచి యేర్పడింది, గానాభిరుచి యేర్పడలేదు, కొంచెమున్నా.

అంచేత అరవలకున్నంత సంగీతరాసిక్యం మనకు లేకపోయింది.

కర్ణాటకం కొత్తపుంతలు తొక్కినప్పు డిక్కడి ప్రభువులకూ లేకపోయింది రాసిక్యం.

త్యాగరా జిక్కడ పుట్టి వుండకపోవచ్చు, పుట్టి, పెరిగిన్నీ వుండిన క్షేత్రయ్య నాయకరాజులను వెతుక్కుంటూ దక్షిణాదికి వలసపోవలసివచ్చింది.

అంచేత, కర్ణాటకం రూపు దిద్దినవారు మన ఆంధ్రులూ, పోషించి యిప్పటికీ బాగా అనుభవిస్తున్నవారు అరవలూ అయిపోయారు.

"చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవు" కావడం అంటే యింతకంటే మరేం వుందీ?

కనక, యెప్పటి కయినా మన తెనుగుదేశంలో గానాభిరుచి బలపడాలంటే, అందుకు, గాయకులూ జంత్రనిపుణులూ తమ రక్తమాంసాలు ధారపొయ్యాలి.

జనులకు కర్ణాటకపరిచితీ అభిరుచీ లేకపోడంవల్ల నూరుమైళ్ళ వేగంతో వచ్చి హిందూస్థానీ సంగీతం ఆక్రమించుకుంటోంది ఈ దేశం.

ఈ దౌర్భాగ్యం తప్పాలన్నా వారీ పని చెయ్యాలి, మరి గత్యంతరం లేదు.

## 8

ప్రొఫెసరు శ్రీ ద్వారం వేంకటస్వామినాయనింగారు, వూళ్ళో వున్నప్పుడు, దినమ్మూ నాలుగ్గంటలసేపు ఫిడేలు వాయిస్తారు, తీరికూచుని.

మహామహులు బలిసివుండిన సభలో వాయిస్తున్నట్టే గంభీరంగా వాయిస్తారు, ఆవేశంతో.

నిరాటంకంగా వెళ్ళి, సావకాశంగా కూచుని, సావధానంగా విని ఆనందిస్తా రనేకులు.

వినేవా రెవరూ లేకపోయినా నాయనింగా రలా వాయిస్తూనే వుంటారు.
తరవాతే వారికి మజ్జనభోజనాలు రాత్రిళ్లు.
"ట!"
ఏం, నిత్యసాధనా అది?
కాదు కాదు, సాధకావస్థ వా రెప్పుడో దాటేసివున్నారు.
"మరి, ఆ వాయించడం యెందుకూ శ్రమపడి?"
సామాన్యులు వేసే ప్రశ్న యిది; కాని మూడు పరమార్థా లున్నా యిందులో
ఒకటి:– అలా వాయిస్తారు కనకనే వారికి మంచి ప్రచారం జరిగింది.
రెండు:– అలా వాయిస్తారు కనకనే పూజ్యులయినారు రసికులకు వారు.
మూడు:– నాదానందానుభూతి పూర్తిగా పొందగలుగుతున్నారు, కనక, అలా వాయించకుండా వుండనేలేరు వారు.
తెలుసుకోగలిగితే వారి ఆ వాయింపు తపస్సమాధి వంటిది.
నాయనింగారిది సిద్ధుల అవస్థ.
గాయకులైనవారికి గానకళే జాగృతం అవుతూ వుంటుం దెప్పుడూ.
తక్కిన కళలు నేర్చినవారి స్థితీ అదే.
దాంతో, చిత్తవృత్తి నిరోధం యేర్పడిపోతూవుంటుంది వారికి, దాని కదే.
అదే యేకాగ్రత.
యోగీశ్వరుడి తన్మయావస్థ అది.
అదే ఆనందావస్థాను.
"ఆనందో బ్రహ్మ."
ఏకళావేత్తల్లోనూ కూడా ఉత్తీర్ణు లలాంటి ఆనందమే అనుభవిస్తారు.
కళకు ప్రాప్యం అన్నా, పరమావధి అన్నా, ఫలితం అన్నా అదే.
అందులోనూ నాదానందం అనుభవించగలగడం మనిషయిన వాడికి మొదటి మహాభాగ్యం.
"శిశు ర్వేత్తి, పశు ర్వేత్తి, వేత్తి గానరసం ఫణీ."
పాట చెవినిబడితే, గుక్కపట్టి యేడ్చే పిల్లవాడు మురిసిపోతాడు, కాళ్ళూ చేతులూ వూపుకుంటూ.
పాట చెవినిబడితే, ఆహారనిద్రలు విడిచి సొక్కిపోతుంది పశువు.
పాట చెవినిబడితే, పడగవిప్పి జోగిపోతుంది కాటువేసే తాచుపామున్నూ.
మరి, ఆ పాట పాడేవాడే అలా కాలేకపోతే యింకేం బతుకూ?
కనక, గాయకుడైనవాడి కదొక్కటే వుండవలసిన గొప్ప యోగ్యత.
కృతులు పాడడమూ వీణా వేణువూ ఫిడేలూ వాయించడమూ చేతకావడంకాదు ప్రధానం, వాటివల్ల తా నానందానుభూతి పొందగలిగి వుండాలి.
కరిగి కరిగించగలిగినప్పుడే యే కళావేత్తకయినా సిద్ధి.
అప్పుడే ఆ జన్మకు సాఫల్యం.

గానకళవల్ల పునరావృత్తి రాహిత్యమూ, సాయుజ్యమూ లభిస్తాయంటే, అదిగో, ఆ అంతస్థు అందుకుంటేనే.

కొందరు గాయకులు డబ్బిస్తే కూచుని పాడతారు.

జంత్రగాత్ర నిపుణులున్నూ డబ్బిస్తేనే కొందరు కూచుని వాయిస్తారు.

కీయిస్తేనే తిరుగుతుంది గడియారం.

వారూ అంతే.

ఆ కళవల్ల వారాశించేది డబ్బూ, ఆ డబ్బుతో సాధ్యపడే ఆహారనిద్రాదికమూ మాత్రమే.

అదే కుక్షింభరత్వం అంటే, మరేమీ కాదు.

"కూటికోసమే కోటివిద్యలున్నూ" అన్న సామెతకు జనకమున్నూ అదే.

రసికులను వా రేమి ఆనందపెట్టగలరూ?

విద్యార్థులను మాత్రం వా రేమి వుద్ధరించగలరూ?

ద్వంద్వభూయిష్ఠ మైన భౌతిక జగత్తులో, సచ్చిదానందానుభూతి పొందగలగడానికీ, పొందించగలగడానికీ వారికి సంస్కారం యెక్కడిదీ?

మమతా వాత్సల్యమూ ఉద్బుద్ధా లయి విద్యార్థిని పుత్రవతుగా చూసుకోగలగడాని కక్కడ హృదయమున్నూ వుంటేగా?

ప్రవచనంలో కూడా డబ్బుమీదే రంధి వారికి.

విద్యార్థి అయినవాడు పదికాలాలపాటు తమ దగ్గిర పడివుండాలి, అంతే వారి దృష్టి.

అయినా మర్మం విడిచి విద్య చెప్పరు కొందరు.

అది వారి జన్మ క్రమం.

ఇతర విద్యల్లో గూడా తమకు తెలిసిన మర్మా లితరులకు తెలియగూడ దనీ, తమకు సిద్ధించిన పారమ్యం యితరుల కందగూడ దనీ భావించుకునేవారు లేకపోలేదు, లోకంలో.

కాని వారి సంఖ్య బహూ తక్కువ.

ఆ భావం వొక్క సంగీతవేత్తల్లోనే యెక్కువగా కనపడుతుంది, మన దేశంలో.

## 9

ఇతర విద్యల్లోనూ మత్సరగ్రస్తులు లేకపోలే దన్నాను.

ఒక నిదర్శనం చూపిస్తున్నాను.

వాజపేయయాజుల పాపయ్యసోమయాజులుగా రని మా నాయనగారికి మేనత్త కుమారులు.

శ్రౌతంలో ఆయనకు రానిదీ తెలియనిదీ లేదు.

అయితే, పిల్లికిన్నీ భిక్షం పెట్టని రకం ఆయన.

శ్రౌతంలో తనంతవాడు మరొక డుండగూడదు — ఇదీ ఆయన పరాకాష్ఠ.

అంచేత యెందరు వచ్చి ప్రాధేయపడ్డా "చెప్పను, పో" అనడమే పెట్టుకున్నా రాయన.

విద్యదగ్గిర తనవాడూ పైవాడూ ఒక్కటే ఆయనకు.

ఒకప్పుడు మా నాయనగారికి "ఆశ్వినం" అగత్యం అయింది.

కృష్ణాగోదావర్యోర్మధ్యదేశంలో వొక్క పాపయ్య సోమయాజులుగారు తప్ప, అది అంతగట్టిగా వచ్చినవాడు మరొకడు లేడు.

మా నాయనగారికైనా అనుకోకుండా వచ్చిందా అగత్యం.

సూచన కూడా లేకుండా వచ్చింది.

అసలేమిటంటే?

ఏలూరిపాటి నరసింహయాజులుగారని వేగేశ్వరపురంలో వొక సంపన్నగృహస్థు.

వేదశ్రౌతాల్లో చాలా గట్టివా రాయన.

గట్టి సాహిత్యవేత్తాను.

వీటికి సాయం, పట్టుదల మహాయెక్కువ ఆయనకు.

ప్రత్యర్థి అయినాడా, యిక వా డెంత వాడయినా ఆయన దృష్టిలో వొక గడ్డిపరక.

యజ్ఞం చేసిన కర్మిష్టి కూడానూ ఆయన.

నిరతాన్నదాత.

అలాంటి యాజులు గారికీ శంకరాచార్యపీఠాధిపతికీ మాట పట్టింపులు వచ్చా యొకమాటు.

నువ్వా నేనా అన్నంతవరకున్నూ వెళ్ళిపోయా యవి.

ఎవరు సద్దుకున్నా పోయిందేమీ లేదు; కాని పట్టింపే పెట్టుకున్నా రిద్దరూ.

ప్రతిష్ఠకోసమే పాకులాడా రిద్దరూ.

సమానంగానే తూగారు పోరాటంలో, మరి ఫలితం?

అదొక ప్రళయం వంటి దయిపోయింది బ్రాహ్మ్యంలో.

విద్వాంసులేకాదు, ఆస్తికులూ దద్దరిల్లిపోయారు, దాంతో.

సీమకి సీమ అంతా అట్టుడికిన ట్టుడికిపోయింది, కొన్నాళ్ళు.

జరిగిం దేమిటంటే?

నరసింహయాజులుగారు, అటు, అరుణోదయాత్పూర్వం గోదావరిస్నానం చేసుకుని యింటికి వెళ్లారు, ఇటు స్వాముల వారి పడవ వచ్చి రేవులో లంగరువేసింది.

సూర్యోదయం కావడంతోనే వూళ్లోకి వెళ్ళి స్వాములవారి శిష్యులు బ్రాహ్మల కందరికీ యీ వార్త అందించారు.

సంధ్యావందనాదికం ముగించుకుని యాజులుగా రప్పటికప్పుడే ప్రాతరగ్నిదీక్షితు లయివుండినారు.

కదలడానికి వీల్లేని స్థితి అది.

అంచేత, వారు, తమ స్థితి తెలియబరుచుకుంటూ "వూళ్లోకి దయుచెయ్య వలసిం"దనీ "ఇవాళ మా యింట భిక్ష స్వీకరించవలసిం"దనీ విన్నవింపించుకున్నారు, తమవారిని పంపి.

ఎవరయినా ఆదరించవలసిన సన్నివేశం అది.

కాని "యాజులు మనకి ప్రత్యుత్థానం చెయ్యకపోడం యేమీ?" అనుకున్నారు స్వాములవారు.

అలా జరక్కపోడం తమకు తిరస్కారంగానున్నూ భావించుకున్నారు వారు.

ఇందులో కొంత విశేషం లేకపోలేదు.

అదేమిటంటే?

సమర్థు లెప్పుడూ సమర్థుల ఆదరగౌరవాలే ఆశిస్తారు.

ఘనతవహించినవా రెప్పుడూ ఘనత వహించినవారినే - కనీసం, ఘనత వహించతగ్గ వారినే తమ చుట్టూ తిప్పుకుంటారు.

అంచేత, తక్కిన వూరివారందరూ చేతులు కట్టుకువచ్చి వుండినా తృప్తిపడక "వచ్చితీరవలసిందే" అంటూ మళ్ళీ వర్తమానించారు స్వాములవారు.

ఆలస్యం కావడానికి వీల్లేదు, అనుష్ఠానా లన్నీ యథాకాలాన జరగాలి పీఠాధిపతులకు.

నిజమే, మరి, ఆహితాగ్నికి మాత్రం?

ఇది యోచించుకోలేదు స్వాములు.

వారికి పట్టుదల యెక్కువయింది.

యాజులుగారున్నూ స్వాములవారి యీ నిర్బంధం తమ కగౌరవంగా భావించుకున్నారు.

వారూ పట్టుదల పెంచుకున్నారు.

రాయబారాలు జరుగుతూనే వున్నాయి; కాని స్వాములవారు "పీఠాధిపతియెదట అగ్నిహోత్రా లొక లెక్కా?" అనుకోగా "వైదిక కర్మానుష్ఠానం యెదట పీఠాధిపతి రాక వొక లెక్కా?" అనుకున్నారు యాజులుగారు.

ఎవరి కెవ రేమి చెప్పినా లాభం లేకపోయింది.

ఈ స్థితిలో యాజులుగారి అగ్నిహోత్ర దీక్ష దానికదే ముగిసింది కొంతసేపటికి.

కాని అప్పుడున్నూ వారు వెళ్ళే స్థితిలో లేరు, యాజులు గారు వెళ్ళినా స్వాములవారున్నూ తృప్తిపడే స్థితిలో లేరు.

"తిరస్కారం" "అమర్యాద" అన్నవి అదివరకే జరిగిపోయివున్నాయి, మరి.

దాంతో, స్వాములవారు రాజసమున్నూ విడిచి తామసంలోకి వెళ్ళిపోయారు, పూర్తిగా.

యాజులుగారున్నూ స్వాములవారియెడల పూజ్యభావం అవతలపెట్టి తిరస్కార భావం పెంచేసుకున్నారు, తక్కువ కాకుండా.

ఈసందుబాట్లో, యాజులుగారి మన్నకు పాత్రంకాలేకపోయిన వూరి సన్నకారు విద్వాంసులు స్వాములవారికి పక్కతాళం వేశారు, యెలాగూ తాము యాజులుగారిని పోలలేని యీసుతో.

స్వాములవారికి "యాజి లేకాకి" అన్న తేలికభావం పుట్టించిం దిది.

తమ సంస్కారానికీ, తమ ప్రామాణికతకూ, తమ ఉదాత్తతకూ, తమ పదవికీ యిది పతనం అని గుర్తించుకోలేకపోయారు స్వాములవారు.

ఈసూ, చూపోపమీ, ఓర్చలేకపోవడమూ, ఉడుకు మోత్తనమూ, కడుపుమంటా, అక్కసూ్సా - ఇలాంటి మనోవికారాలు పెంచుకుని సమర్థులనూ పూజ్యులనూ చులకనచేసి మాట్లాడతారు చాలామంది, చాటునా మాటునా.

తమ ప్రతిపక్షుల యెడల యిలా ప్రవర్తించేవారిని చేరదీస్తే యెవరికీ తప్పనిదే యీ పతనం.

అయితే, స్వాములవా రిదేమీ గుర్తించుకోలేదు.

పైపెచ్చు, తమ ముద్రాధికారం చెలాయించడానికి పూనుకున్నారు వారు.

"యాజులికి వెలి" అంటూ శ్రీముఖాలున్నూ పంపేశారు, అవసరం అయినవారి కందరికీ.

"ఇప్పుడేం చేస్తాడు యాజులు?" అంటూ వెన్ను విరుచుకున్నారు కూడా వారు.

నిజమే.

బ్రాహ్మడయినవాడి కింతకంటే కఠినశిక్ష మరి లే దా రోజుల్లో.

ఎవరూ గుమ్మం యెక్కరు, ఎవరూ చూరుకింది కయినా రానివ్వరు, నిప్పూ నీరూ కూడా పుట్టవు, వెలి అయినవాడికి.

మంగళ్ళు క్షౌరం చెయ్యరు, చాకళ్ళు బట్ట లుతకరు.

చండాలురకున్నూ లేని నికృష్టస్థితి యిది.

మరొకరయితే నిలువునా నీరయిపోయివుందు రప్పుడు.

కాని అందుకు మారుగా యాజులుగారున్నూ వుద్రిక్తులయిపోయారు.

వీరభద్రావతారమే తాల్చేశారు చివరికి.

అప్పుడు, వారు, స్వాములవారికి చేసిన మొదటి ప్రతిక్రియ, వారు పంపిన ఆంక్షపత్రిక చింపి పోగులు పెట్టడం.

రెండో ప్రతిక్రియ, వెంటనే చయనానికి సంకల్పం చెయ్యడం.

వేలమీద అన్నదానం జరగాలి దానికి.

అదిన్నీ బ్రాహ్మలకు జరగాలి, ముఖ్యంగా.

ఎందరో ఋత్విక్కులు కావాలి.

వేదశ్రౌతాలతో ముఖరితం కావాలి యాగశాల.

ఎవణ్ణి తమ గుమ్మం యెక్కనివ్వరో వాడి యింట నోరు విప్పతారా పండితులు?

విస్తరిన్నీ వేస్తారా బ్రాహ్మలు?

చెయ్యకపోతే యాజులుగారికి మరి పుట్టగతులుండవు.

బతకడానికే అవకాశం వుండదు.

గత్యాగత్యా యాజులుగారే జయిస్తే?

ఈ దెబ్బే ఆచార్యపీఠానికి తగులుతుంది.

అది చులకన అయిపోతుంది దేశంలో.

పాదపూజలు వెనకబడతాయి.

ఆజ్ఞలు హాస్యాస్పదా లయిపోతాయి.

జాతికిది శ్రేయస్కరమా?

పతనానికే దారితియ్యదూ యిదీ?

ఇది యోచించుకోకపోలేదు యాజులుగారు.

జాతిమొత్తంమీద యాజులగారిదా ప్రాజాపత్యం ఆచార్య పీఠానిదా అంటే, ఆచార్యపీఠాన్ని కాదనలే రెవరూ.

మరి అంత ఆధిక్యం వుంటే ఆచార్య పీఠానికి, బాధ్యత మాత్రం యెంత వుండదూ?

అది గుర్తించుకోవాలి పీఠాధిపతి.

మాట్లాడితే వ్రాతం వుండాలి పదస్థులకు.

పనిచేస్తే న్యాయం, సత్యం, ధర్మం, శాస్త్రం, – ఇన్ని వుండాలి.

ఇన్నింటికీ పైని హృదయమున్నూ వుండాలి.

తామసచ్ఛాయలు చేరనిచ్చుకోగూడదు వారు.

వీరుడికి బ్రహ్మాస్త్రం యెలాంటిదో పీఠాధిపతికి "వెలి" అలాంటిది.

ఈ స్వల్పానికి యాజులుగా రంతటివాడికి వెలి వెయ్యవలసిందేనా?

ఆచార్యపీఠం తన యేల్బడిలో వున్న పండితులను సత్కరించాలి.

కర్మిష్ఠులను ఆరాధించాలి.

ఆ పండితుల్లోనూ, ఆ కర్మిష్ఠుల్లోనూ యాజులుగా రగ్రేసరులు.

వారిని కూడగట్టుకోడం పోయి వెలి వెయ్యడం దుస్సాహసం.

పీఠాధికారం దేశవ్యాప్తమే.

యాజులుగారి పలుకుబడి స్థానికమే.

అయితే, ఐచ్ఛికాలైన జనుల ఆదరగౌరవాలే గాని రాజావలంబం లేదు పీఠానికి.

గాలిలో దీపం అప్పటికే అది.

నాలుగు మూలలా యాజులుగారి వంటివారు తిరగబడితే?

స్వాములవా రీపరిస్థితులు గుర్తించుకోలేదు.

అవునుమరి, సామ్రాజ్య నిర్మాతల జాగ్రత్తలు వారసుల కెక్కణ్ణుంచి వస్తాయీ?

పుత్రపౌత్రపారంపరికంగా అనుభవించడానికి అధికారమే సొత్తుగాని శక్తియుక్తులు అలాంటివి కావుగా?

దీంతో, బ్రాహ్మణ్యం చీలిపోయిం దప్పుడు.

అంటే, స్వాములవారు చేసింది ఏకగ్రీవంగా అంగీకరించలేకపోయింది.

సగానికి సగం యాజులుగారి కేసి మొగ్గేసింది.

ఇందులో విశేషం యేమిటంటే?

యాజులుగారి కేసి మొగ్గిన సగమూ "ఎప్పటి కెయ్యది ప్రస్తుతం" రకం గాదు.

అది ధర్మాధర్మవిచక్షణ చెయ్యగలది.

ధర్మానికి అండగా వుండగలది.

ధర్మంకోసం ప్రాణాలయినా వొడ్డగలది.

ఇది గుర్తించుకున్నారు యాజులుగారు.

ఈ ధైర్యంతోనే వారు చయనసంకల్పం చేశారు.

బాగానే వుంది, అయితే, త్రిశంకుమహారాజు బొందితో స్వర్గానికి వెళ్ళడానికి యజ్ఞసంకల్పం చెయ్యడంవంటి దిది, అచ్చంగా.

కాని యాజులుగారికీ స్వాములవారికీ జీవన్మరణసమస్య అయిపోయింది.

అది యేమయినా, శ్రౌతులకు మాత్రం ముందు నుయ్యీ వెనక గొయ్యీ అన్నట్టు తయారయిం దిది.

## 10

ఆ కాలంలో, గోదావరి కిద్దరిని మునికొడవలీ యెదురుగా అద్దరిని వేగేశ్వరపురమూ విద్యాపీఠాలు.

బ్రాహ్మ డైనవా డల్లా అప్పు డావూళ్ళల్లో పుంభావ సరస్వతే.

సాధారణంగా అవిచ్ఛిన్నాగ్నిహోత్రిన్నీ.

సాధారణంగా అనెందుకన్నానంటే విద్య నేర్చుకోడం వేరూ, కర్మిష్ఠి కావడం వేరూ కనక.

సాంగవేదవేత్తల కారెండూళ్ళూ నికషాలు.

అక్కడి విద్వాంసులకూ కర్మిష్ఠులకూ, తపోధనులకూ దేశం పాదపూజలు చెల్లించేది.

జగత్పండితులు శ్రీపాద రామశాస్త్రిగారు కోరి చూసి వచ్చిన వూళ్ళవి.

మొన్నమొన్ననే భౌతిక లీలలు చాలించిన మహావైయాకరణులు నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారిది మా మునికొడవలే.

మునికొడవలికీ వేగేశ్వరపురానికీ విద్యలే కాదు లంకె వియ్యాలున్నూ.

పేరుపడ్డ యితర గ్రామాల శ్రౌతులు, తమ కావూళ్ళల్లో ఆర్త్విజం లభించడం మహాప్రసాదంగా భావించుకునేవారు.

విశేషించి నరసింహయాజులుగారి క్రతువంటే ధర్మరాజు రాజసూయంకంటేనూ విశిష్టం.

కాగా, పెద్దపెద్ద శ్రౌతులు యాజులుగారి ఆహ్వానం అంగీకరించి పొంగిపోయారు; గాని యిది తెలిసి, స్వాములవారు "జాగ్రత్త" అని తమకున్నూ శ్రీముఖాలు పంపగా కుంగిపోయారు.

లోకసామాన్యమే అది.

శ్రౌతుల దయినా, వేదవేత్తల దయినా, పండితుల దయినా, లౌకికులదే అయినా సాధారణంగా వైయష్టికప్రవృత్తి.

అటా యిటా అన్న సందర్భాలు తటస్థపడితే, స్వవిషయంలోనే జంకిపోతారు చాలామంది, యితరుల విషయమై అయితే యిక చెప్పడాని కేమి వుందీ?

వారి మాట యేమయినా, –

అ కార్యకరణం చేసినవాడికి భయం.

అగమ్యగమనమూ, అభక్ష్యభక్షణమూ చేసినవాడికి జంకు.

పీఠాధిపతి అయేది, బ్రహ్మదేవుడే అయేది నికరమైన సత్తా గల వేదవేత్తకు - ధార్మికుడికి - సత్యనిరతుడికి - కర్మిష్ఠికి భయమేమీ?

అగత్యం అయితే, ప్రాణాలయినా వొడ్డగల నరసింహ యాజులుగారా చల్లబడిపోడం?

"యశో వా మృత్యు ర్వా" అని నిశ్చయించుకున్నారు వారు.

తమ సంకల్పం నిర్వహించుకోడానికే పూనుకున్నారు.

అది చూసి విద్వాంసులున్నూ యెందరో ధైర్యం తెచ్చుకున్నారు.

"మేమున్నాం" అంటూ యాజులుగారికి భరవసా కూడా యిచ్చారు.

అయితే, వారు శ్రౌతులు కారు.

శ్రౌతం వల్లించివుండినా ఆర్త్విజం నిర్వహించే అలవాటున్నవారున్నూ కారు.

ధర్మనిర్ణయం చెయ్యగల వేత్తలు వారు.

పరిషత్తులకు భూషణాలున్నూ వారు.

కాగా, ఆ పండితులూ యాజులుగారూ కూడా అందుకు తగ్గవారికోసం అన్వేషణ ప్రారంభించారు.

పరకాయించగా, వర్ధమానచంద్రులైన యువకులవల్లనే యీ కార్యం నెరవేరుతుందని గుర్తించుకున్నారు వారు.

ధర్మమే, సత్తా సంపూర్ణం కాకపోవచ్చు, అనుభవం చాలకపోవచ్చు, ప్రామాణికత్వమూ పట్టకపోవచ్చు; గాని సాహసం మాత్రం యువకులదే యెప్పుడూ.

ఏ వుద్యమానికయినా జయం సంపాదించుకోవాలంటే యువకులనే కూర్చుకోవాలి.

విజయకీలకమైన రహస్యం యిది.

అయితే, ఆ యువకులను నడిపేవారికి నిండుహృదయం వుండాలి.

ఆ హృదయం మృదులమూ కావాలి, కఠోరమూ కావాలి.

స్వార్థచింత లేశమూ వుండగూడదు దానికి, ఔదార్యం రాసి అయి వుండా లది.

అలాంటివారు నడిపినప్పుడే పూనికకు సాఫల్యమూ, యువకులకు ధన్యతానూ.

ఈ దృష్టితో చూస్తే యాజులుగా రాదర్శపురుషులు.

కనక, వందలాది యువకులు యాజులుగారికి అండగా నిలిచారు.

వారిలో మా నాయనగా రొకరు.

యుక్తసమయాన మునికొడవలి వచ్చి "బావా, నీకాశ్వినం యిచ్చా"నంటూ మా నాయనగారిని వీపుతట్టి వెళ్లారు యాజులుగారు, ప్రత్యేక శ్రద్ధతో.

ఇదిగో, యీ విధంగా వచ్చింది మా నాయనగారి కాశ్వినం అగత్యం.

## 11

ఆశ్వినం అంటే ఋగ్వేదంలో వొక రమ్యమైన ఘట్టం.

పద్దెనిమిదివేల రుక్కుల గ్రంథం అది.

చయనంలో దానికి వినియోగం.

ఒకనాటి తెల్లవారుజామున కదలకుండా కూచుని గుక్కతిప్పకోకుండా యేకరువు పెట్టా లది, ఆర్త్విజం పుచ్చుకున్న శ్రౌతి.

మొదలుపెడితే పక్కాజాముపడుతుం దది ముగియడానికి.

శ్రౌతంలో గట్టివా డనిపించుకోగలగా లంటే, అది నిక్కచ్చిగా నిర్వహించగలగడం వొక యోగ్యత.

ఒక్క తప్పయినా వచ్చిందా చెడిందన్నమాటే; మళ్లీ మొదటికి రావాలి.

పైగా, చప్పరించేస్తారు నలుగురూ.

అంచేత, అది వల్లించడానికీ, వల్లించే వుండినా ఆర్త్విజ్యం పుచ్చుకోడానికీ జంకుతారు చాలామంది.

ఒకరిద్దరు పుస్తకాలు పట్టుక్కూచుని వుండగా, కొందరు సాయంపడుతూ వుండగా, అయిం దనిపించుకుంటారు సాధారణంగా చాలామంది.

వల్లించేవా రయినా శ్రౌతంలో తక్కిన గ్రంథం అంతా పూర్తిచేసుకుని అప్పు డందుకు పూనుకుంటారు.

అంతవరకూ దాని అగత్యం రాక, జ్యౌతిషం గట్టిచేసుకోడం పూనికలో దానివిషయం వెనక్కిపెట్టి వుంచుకున్నారు మా నాయనగారు.

కాని, వారికి, జ్యౌతిషమే వెనక్కి పెట్టుకోవలసి వచ్చింది, దీంతో.

ఈ కారణంవల్ల, యెప్పుడూ అనుకోనిది పాపయ్యసోమయాజులుగారి అగత్యమున్నూ వచ్చింది మా నాయనగారికి.

ఇటు బంధుత్వం – అటు సాహచర్యం – అన్నిటికీ పైని చదువు – ఇన్ని సందర్భాలు పురస్కరించుకుని వెళ్లారు మా నాయనగారు; కాని దాపరికం లేని పాపయ్యసోమయాజులుగారు, మాట ముగియడం తడువుగా "నాకు తప్ప మరి వొకడి కది రావడం యిష్టంలేదు బావా" అనేశారు, ఖండితంగా.

ఒకవిధంగా మెచ్చుకోతగ్గ ధోరణి అది.

కొత్తపల్లి సూర్యనారాయణగారూ, వారణాసి సర్వదేవుడుగారూ చేసినదానికంటే వెయ్యి – లక్ష – కోటిరెట్లు స్తుతిపాత్రం అది.

అలాంటివా రలా అనడంవల్ల వచ్చే కోపతాపాదికం నిగ్రహించుకోగలిగితే, దీనివల్ల యువతలివారికి లేశమూ నష్టం లేదు సరికదా, లాభమే వుంటుంది కావలసినంత.

మనం గుర్తించవలసిందల్లా యిక వొక్కటే.

"బోద్ధారో మత్సరగ్రస్తాః."

సార్వకాలికంగాని తాత్కాలికం కాదన్నమాట యిది.

అయినా విద్యలు మూలపడిపోడం లేదు.

మత్సరగ్రస్తుల తల తన్నుతూనే వున్నారు, తిరస్కృతులు.

ప్రతిభా, ప్రావీణ్యమూ వొక్కరి సొమ్మే కావుగా?

కాక, – విద్యార్థి అయినవాడి కాత్మవిశ్వాసం వుంటే – దీక్ష వుంటే – అభిమానమూ పౌరుషమూ వుంటే యెంతో వుపకారం చేస్తుం దీప్రవృత్తి.

ఆ మనిషికి వచ్చిన విద్య తన కెందుకు రాదూ?

ఆ విద్య సాధించడంలో ఆ మనిషి చూపించిన పరాకాష్ఠ తా నెందుకు చూపించగూడదూ?

ఇలాంటి వూహా లందరికీ వుండవు, నిజమే.

ఇలాంటి కసీ అందరికీ వుండదు, సత్యమే.

ఉండినా, చివరిదాకా నిలవనూ నిలవవు కొందరికి.

నిలిచాయా, కోటలో పాగా వేశాడన్నమాటే యువతలి మనిషి.

అయితే, బుద్ధి గ్రహణసమర్థమే గాని – ప్రతిభ కూడా నవనవోన్మిషితమే గాని ప్రవృత్తి జాడ్యజుష్టం అవుతూ వుంటుం దప్పు డప్పుడు.

కాగా, – గురువుకి పరమానుగ్రహం వుండడం చాలదు, తన దీక్షా యేమాత్రం అయినా సడలకుండా వుండదు, యేమిటేమిటో విప్రతిపత్తులూ యేర్పడకుండా వుండవు – అయినా, విద్యార్థి అయినవాడు, ఎక్కడో వొకక్కడ, ఎవరిచేతనో వొకరిచేత యిలాంటి దెబ్బతిన్నాడా – చాలు, పుంభావసరస్వతి అయిపోతాడు.

## 12

అనుకోకేపోవాలి గాని, దీక్షా యేకాగ్రతా నిత్యప్రసన్నాలు మా నాయనగారికి.

దీనికి సాయం, అటు, నరసింహయాజులుగారికి మాట యిచ్చిన బాధ్యతా, యిటు, పాపయ్య సోమయాజులుగారిని "నీ లెక్కేమిటి బావా?" అని డెకారించాలన్న కసీని.

నిద్రాహారాలు మరిచిపోయారు మా నాయనగారు.

కథాక్రమం యెలాగంటే?

సంసారం మీదపడిం దప్పటికి, కనక, యింటోనే వుండి సాధించుకోవా లది.

ఇంతే కాదు, మునికొడవలిలో అది చెప్పగల గురువు లేడు, సొంతంగానే సాధించుకోవాలి.

మా తాతగారు రాసిన తాటాకుగ్రంథాల్లో ఆ పుస్తకం దొరికింది; గాని రుక్కుల ఆద్యంతాలు మాత్రమే సమగ్రంగానూ సక్రమంగానూ వుండి, మధ్యభాగాలు క్లుప్తులుపెట్టి పూర్తిచేసిం దది.

సంతలూ వల్లెలూ పూర్తిచేసుకుని యేకరువు పెట్టుకునేవారికి మాత్రమే వుపయోగిస్తుం దది.

కాగా, వొకవిధంగా అది వుండినా లేనిదే అయింది.

మరొకవిధంగా అదయినా దొరికింది, అందుకే సంతోషించారు మా నాయనగారు.

ధర్మమే.

తపనా దీక్షా వున్నచోట సాధనం యేపాటిదయినా పని గడిచిపోతుంది.

నేను పోలవరంలో ప్లీడరుగుమాస్తాపని నేర్చుకునే రోజుల్లో, యూరపియను ఏజెన్సీ కలెక్టరు, వేటకు బయలుదేరి, మాటు చేరుకోకపూర్వమే పులి యెదురు కాగా, నౌకర్ని తన కడ్డంగా నుంచోబెట్టుకుని, వాడి బుజంమీదుగా తుపాకీ పెట్టి కాల్చి చంపాడు దాన్ని.

తుపాకీతో గాదు, విల్లమ్ములతో గాదు, బల్లెంతో గాదు, కత్తితో కాదు, కైజారుతో నయినా కానేకాదు – చేతిలో వున్న ములకాటికర్ర తిరగవేసి తల పగిలేట ట్టొక్కటే దెబ్బ కొట్టి పెద్దపులిని చంపారు, మా పితామహుల పితామహులు

అక్కసోమయాజులుగారు.

"క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే."

కనక, ఆ అసమగ్ర గ్రంథంతోనే ఆశ్వినం సాధించారు, మా నాయనగారు.

యనమండ్ర సుబ్బావధానులుగా రని ముక్కామల గ్రామంలో మరో బ్రాహ్మణ్యులు. ఋగ్వేదులు వారు.

తమ వేదం అంతా క్షుణ్ణంగా వచ్చినవారున్నూ.

అత్తవారింటికి ముక్కామల వెడుతూ వస్తూ వుండడంలో మా నాయనగారికీ ఆయనకూ చిరమైత్రి.

ఆయనచేత చెప్పించుకుని మా నాయనగారు, ఆ వరసన రుక్కులన్నీ పూర్తిగా రాసుకున్నారు.

తరవాత పగలని లేదు, రాత్రని లేదు వొకటే వల్లన.

ఆశ్వినం ఋగ్వేదంలోదే అయినా – ఉదాత్తానుదాత్త స్వరితాలతో దానికి నియతమైన వొక స్వరం వుండినా – చయనంలో ఉచ్చైస్వరంతోనే దానికి వినియోగం.

శ్రౌతం వచ్చివుండినవారి కది సుపరిచితమే, దానికోసం సంతలు చెప్పకోనక్కరలేదు.

కాగా, – సకృదావృత్తిగా కాక పారాయణ ప్రారంభించారు ముం దది.

నలిగాక వల్లెలున్నూ ప్రారంభించారు.

ఇక కూచుని వల్లె, నడుస్తూ వల్లె, చివరికి పడుకునిన్నీ వల్లె.

ఆ వల్లనలో ఒక విశేషం.

ఇంటోకల్లా పిన్నలు కావడంవల్ల, విస్తరాకులూ కూరలూ వగైరా సమకూర్చవలసిన విధి మా నాయనగారిది.

మునికోడవలి ప్రాంతంవారు ఉప్పతో తొమ్మిదిరసాలూ రాజమహేంద్రవరం వెళ్లే కొనుక్కోడం ఆరోజుల్లో.

బీదలదీ సాదలదీ కూడా అప్ప డందరిదీ వొకటే అంతస్థు ఇలాంటి సందర్భాల్లో.

ఎక్కడికి బయలుదేరినా, వెళ్ళాటప్పుడూ వచ్చాటప్పుడూ కూడా యేదోవొకటి వల్లించుకుంటూ వుండడం మా నాయనగారి కలవాటు.

వేదశ్రౌతాలు నేర్చేవారందరూ యింతే, అప్పటికీ యిప్పటికీ యెప్పటికీ.

ఈ అలవాటుతో, అది వల్లించేటప్పుడు రాజమహేంద్రవరం ప్రయాణం తగిలితే, తెల్లవారగట్ల బయలుదేరడమూ, చీకటి వుండినంతసేపూ వచ్చివుండిన గ్రంథం యేకరువు పెట్టుకోడమూ, తూర్పు తెల్లవారుతోందనగా కోటిలింగాలు చేరుకుని అక్కడ దంతధావనాదికం కానిచ్చుకోడమూ, అప్పుడు బజారుకి వెళ్లి కావలసిన సామగ్రి కొనుక్కుని గుమ్మడిమూట కట్టి నెత్తిన పెట్టుకునీ పుస్తకం విప్పి వొకచేత పట్టుకునీ కొత్త గ్రంథం వల్లెవేసుకుంటూ వెనక్కి బయలుదేరడమూ – రమారమీ పాతికమైళ్లు నడిచి భోజనాలవేళ కిల్లు చేరుకోడమూ – ఇలాగ వల్లించా రది మా నాయనగారు.

విద్యాపిపాస అంటూ వున్నచోట దీక్షకూ యేకాగ్రతకూ ఇంతకంటే పారమ్యం యేమి వుంటుందీ?

ఇలా సాధన చేస్తే విద్యలు రాకపోడమున్నూ యేమిటి?

మా నాయనగారిలాగే తక్కిన యువకులూ అసాధారణ సాధన చేశారు.

వారికీ స్వాములవారిమీద కసే యాజులుగారిని వెలిపెట్టినందుకు.

ముహూర్తం సమీపించింది.

స్వాము లెప్పటికప్ప డంతా తెలుసుకుంటూనే వున్నారు.

ఎత్తులమీద యెత్తులున్నూ వేసుకుంటూనే వున్నారు.

ఆ సీమవారి చూపులన్నీ వేగేశ్వరపురంమీదే వున్నాయి.

ఇరుగుపొరుగు జిల్లాల పండితులున్నూ వేగేశ్వరపురం వార్తలకోసమే యెదురు చూస్తున్నారు వచ్చి వాలడానికి.

ముహూర్తం రానేవచ్చింది.

నరసింహరాజులుగారి పట్టుదలా, యువకుల దక్షతా, యాగవిశేషాలూ చూడ్డానికి అనుకోనివారున్నూ వందలూ వేలూ వచ్చి వాలారు వేగేశ్వరపురంలో బ్రాహ్మలు.

అన్నదానం భరద్వాజవిందును కాదనిపించింది.

ఋత్విక్కులు తాండవంచేశారు, ఉత్సాహోద్రేకాలతో.

యుక్తసమయాన, పండితులూ ఋత్విక్కులూ చుట్టాలూ వందలకొద్దీ అనిమిషులై ఆత్రంగా చూస్తూ వుండగా, అఖండ గోదావరీ ప్రవాహంవతుగా – గుక్కతిప్పుకోకుండా వీణ పలుకుతున్న ట్టాశ్విసం కానిచ్చి అప్పుడు కళ్ళుతెరిచారు మా నాయనగారు.

ఆనంద ధ్వానాలతో యాగశాల ముఖరితం అయింది.

కొంత గ్రంథం అయాటప్పటికి మా నాయనగారికి నడ్డి నీలగ్గా, "నేనున్నాను బావా" అంటూ వెనక్కి వచ్చి తమ మోకాలు వీపు ఆనించి పొదువుకుని వుండిన యాజులుగారు "బావా" అని మాత్రమే మాట్టాడగలిగి గుచ్చికౌగిలించుకుని, ఆనందాతిరేకంతో మూర్ధాఘ్రాణమున్నూ చేసి, ఎవరో వొక జమీందారు తమ కాసందర్భంలోనే బహూకరించిన పసుపుపచ్చని జలతారు కాశ్మీరుశాలువు విప్పికప్పి బ్రహ్మానంద పరవశులయిపోయారు.

ఆ శాలువు ముక్కలు మొన్నమొన్నటిదాకా వుండేవి మా యింటో.

ఇప్పటి పురావస్తుసేకరణపద్ధతి మాకప్పుడేమీ తెలియదు, తెలిసేవుంటే ఆ ముక్కలే పంచుకుని సాలగ్రామాలన్నట్టు చూసుకుంటూ వుందుం మేము.

అది యేమయినా, చయనం దేవదుందుభులు మోగేటట్టిలా పూర్తి కాగా, యీ కోలాహలం గుండెలు బద్దలు కొట్టగా, స్వాములవారు, ఏనుగులూ లొట్టిపిట్టలూ గుర్రాలూ యెడ్ల బళ్ళూ తోలించుకుని రాత్రికిరాత్రే బయలుదేరి మరోసీమకి తరలిపోయారు, అంధకారావకుంఠనంతో.

తరవాత, ఆ విజయానందంతో అంతకంటే యెక్కువగా దీక్షపట్టి, డెబ్బయ్యి ద్దరు ఋత్విక్కులనూ స్వయంగా తయారుచేసుకుని అంతకంటేనూ ఘనంగా సర్వతోముఖయాగమున్నూ చేసి చయనులుగా రయివుండిన నరసింహయాజులుగారు, ఏలూరుపాటి నరసింహ సర్వతోముఖయాజులుగారున్నూ అయినా రచిరకాలంలోనే.

చెప్పవచ్చిందేమిటంటే?

విద్యార్థికే కనక పట్టుదల వుంటే, వొక పండితుడు కుచ్చితంగా ప్రవర్తించినంత మాత్రాన యేమీ దిగడిపోదు, ఆ పండితుని నైచ్యమే వెల్లడి అవుతుంది గాని.

కొత్తపల్లి సూర్యనారాయణగారు చేసిందీ, వారణాసి సర్వదేవుడుగారు చేసిందీ రాశిలో వొకటే, రకంలోనే భిన్నం.

అయితే, ఛందస్సు విషయమై నాకడ్డలేదు, మరి సంగీతం విషయమై?

"దేశో విశాలః ప్రభవో హ్యనంతాః."

ఒక్క సర్వదేవుడుగారి నొసటనే పొద్దుపొడవలేదు.

"మీ లెక్కేమిటి?" అనగలన్నేను.

అని దీక్షా పట్టగలను.

పడితే వూరువిడిచిపెట్టాలి.

దానివల్ల కొన్ని చిక్కులు కలుగుతాయి.

అయినా వెళ్ళాగలను.

వెడితే అందులో మునిగిపోవాలి.

అంతవరకూ వచ్చాక మునిగిపోగలను.

పోతే కవిత్వం చెడుతుంది,

"ఏం, చెడితే?" అనిమాత్రం అనుకోలేకపోయాను.

భావం అంటూ వొకటి తోస్తే తోచినంతా ఛందోబద్ధం చెయ్యగలుగుతున్నా నప్పటికి ధారాళంగా.

పద్యాల నడకా బాగుంటోంది.

వచనరచన కూడా వొక దారిలో పడివుంది.

మరి, సంగీతం అంటే మిక్కిలీ రుచీ వల్లమాలిన అభిమానమున్నే గాని వోనమాల స్థితిలోనే వుంటినాయె.

ఆలోచించవలసివచ్చింది.

కొన్ని మాసాలు కష్టపడితే కొన్నిలోట్లు తీరి, యేదో వొక యెత్తున జీవితపరమావధి కాగల కళ విడిచిపెట్టి, సంవత్సరాలు కష్టపడినా స్వాధీనం అవుతుందో కాదో అనుమానాస్పదంగా వున్న మరో కళ సాధించాలని దీక్షపట్టడం తప్పనిపించింది.

పోతే "సంగీతం నేర్చుకోడం రసాభా సయిపోయిందే" అన్న పరితాపం పట్టుకుంది బాగా.

"క్షణశః కణశ శ్చ" అన్న సూక్తి యెంత విలవయిందో అప్పుడే నాకు బాగా అవగతం అయింది.

వొణికిపోయాను.

కూడిక వేస్తే లెక్కకి వచ్చే ఆ నెలా పదిహేనురోజుల్లోనూ నూరుపద్యాలయినా కట్టేవుందు నాడుతూ పాడుతూ.

వసుచరిత్రా, ఆముక్తమాల్యదా – వంటి ఉద్గ్రంథం కొంతయినా చదివి యెన్నో విషయాలు తెలుసుకుని వుందును, చులాగ్గా.

వచనగ్రంథ మయినా వొకటి రాసేసి వుందును.

అంత విలవయిన కాలం వ్యర్థం అయింది.

సర్వదేవుడుగారి చెలగాటంవల్ల దుర్వినియోగం అయిపోయిం దది.

"బూడిదలో చేసిన హోమం" అన్న సామెతకు సరి అయిన సన్నివేశం అది.

చేతులారా జారవిడుచుకున్న ట్టయింది అందిన ఫలం.

లక్ష రూపాయలు పోయినా అంత బాధగా వుండదు.

కనక, సంతతపరిశ్రమ చేసి ఆ కాలం విలవ అయినా కూడదీసుకోవాలని నిశ్చయించుకున్నాను.

సంగీతం విషయం యిలా పర్యవసించినా అందుకోసం ప్రయత్నించడంలో కవితా సాధన చేసుకోడంలో మా నాయనగారు చూపించే ప్రాతికూల్యం పూర్తిగా తొలగిపోడం స్పష్టం అయింది నాకు.

ఎస్టేటు స్వాధీనం అయిన పిల్లజమీందారు స్థితి అది.

ఈ సావకాశం చూసుకుని రాత్రీ పగలూ కూడా కవితా సాధనలో మునిగిపోయాన్నేను.

యమ సాధనే చేశాను.

అయితే, పద్యబంధం సాపుతేరినకొద్దీ యేదో లోటుంటున్నట్టూ, యేదో వెలితి యేర్పడుతున్నట్టూ మనస్సు పీకేది.

నేలవిడిచిన సాముగానున్నూ కనపడేది.

పరకాయించుకోగా, నా కవిత్వం పెద్దలకున్నూ ఆదరపాత్రం కావాలంటే, నేను చదువుకోవలసిన గ్రంథం మరికొంత వుందనీ, గ్రహించవలసిన కవిసమయాలూ, తెలుసుకోవలసిన సంప్రదాయాలూ కూడా చాలా వున్నాయనీ తట్టింది నాకు.

ఉపదేశం లేనిదే – సొంత పరిశ్రమతో అవి స్వాధీనపడేవి కావనిన్నీ అవగాహన అయింది.

కొన్ని సాధ్యపడతాయి, సందేహం లేదు.

కాని, అవి నిష్కృష్టా లవునో కాదో అన్న సంశయం వొకటి ప్రారంభం అవుతుంది, దాంతో.

ఎవరి నయినా అడిగి ఆ సందేహాలు తీర్చుకుంటూ వుండవచ్చు; కాని ఆ ఝుడితిశ్రవణం బాగా మనస్సుకి పట్టకపోవచ్చు.

అంతా కలతగొట్టుపాండిత్యం అయిపోతుంది చివరికి.

ఆ స్థితి పగవాడికిన్నీ వద్దనిపించింది.

కనక, ఆ లోట్లు తీర్చుకోవాలంటే, గొప్ప పండితుడూ మహాకవీ అయిన యే మహానుభావుణ్ణో ఆశ్రయించాలి.

కవిత్వమే నాకు జీవితపరమావధి అయిపోయింది కనక ఆశ్రయించవలసిందే; అయితే, యెవ రామహానుభావుడు?

ఇదొక సమస్య అయింది నాకు.

## 14

తెలిసినవారి నడిగా నెందరినో; కాని వారు ప్రశంసించినవారిని వీరూ, వీరు గొప్పచేసినవారిని వారూ తీసిపారెయ్యసాగారు.

"ఎక్కడో వొకచోట ప్రవేశించు. అక్కడ ప్రయోజనం కనపడకపోతే మరోచోటికి వెళ్ళు. కూపకూర్మంగా పొలమూరిలో కూచుంటే తేలేవిషయం కా దిది" అని సలహా చెప్పారు, మంగిపూడి వేంకటశర్మగారు.

నాకు తృప్తికాలేదు.

వేదం వేంకటరాయశాస్త్రిగారి దగ్గిరికి వెళ్ళమన్నాడు, నత్తి సుబ్బారాయడనే వొక రెడ్డి.

మా వూరే అతనిది.

అప్పుడు, వేంకటరాయశాస్త్రిగారు పరిష్కరించి లఘుటీక కూడా రాసి ప్రకటించిన విజయవిలాసం చదువుతున్నా డతను.

మద్రాసే వెడితే కొత్త దృక్పథం యేర్పడి కొత్తదారిలో ప్రవేశం కలుగుతుంది; కాని "మద్రాసే వెళ్ళడం?"

అది చంద్రలోకంవంటి అసాధ్యం అని అప్పుడు జనుల నమ్మకం.

సాహసించలేకపోయాను.

ఇంతకీ:—

"సుపరీక్షితశిష్యాయ దేయం వత్సరవాసినే" అన్నాడు, సూర్యసిద్ధాంతకారుడు.

"ఒక్క సంవత్సరంపాటు ప్రవృత్తి పరీక్షించిగాని యెవరికీ యీ శాస్త్రం ఉపదేశించవద్దు" అని అతని ముదల.

ఇది జ్యోతిశ్శాస్త్రం విషయం.

వికటబుద్ధుల కాశాస్త్రం తెలియకుండా వుండడాని కీజాగ్రత్త.

పండితులను బట్టి విద్యలకు గౌరవమూ వస్తుంది, అగౌరవమూ చుట్టబెట్టుతుంది, మరి.

ఇతరవిద్యల విషయమయ్యేన్నీ గురువు లిలా పరీక్షించే సంప్రదాయం లేకపోలేదు.

మరి గురువుల విషయం?

ఇదీ చూసుకోవలసిందే శిష్యుడు.

గురుత్వం చేస్తున్నవారిలోనూ అప్రామాణికు లున్నారెందరో.

ఆకతాయిలూ వున్నారు.

మర్మం విడిచి చెప్పనివారుండనే వున్నారు.

కాని లోకం నాకేమి తెలుసూ, యేగురు వెలాంటివాడో గుర్తించగలగడానికీ?

మరేమిటీ చెయ్యడం?

దీంతో గూడా నిద్రాహారాలు కరువయిపోయాయి నాకు.

పూర్తిగా అయోమయావస్థలో పడిపోయాను.

ఈ స్థితిలో వచ్చింది ఆంధ్రపత్రిక మొదటి సంవత్సరాది సంచిక, ఆంధ్రవాఙ్మయాని కొక కొత్త భూష అయి.

అది చూసుకుని "కొత్త ప్రపంచంలో పడ్డా"మని సంబరపడ్డారు చాలామంది ఆంధ్రసాహిత్యపరులు.

నిజంగా, నాకే కాదు, జాతి మొత్తానికే యెంతో మేలు చేసిం దారోజుల్లో అది.

అప్పుడే కాదు, మొన్నటిదాకా "ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక" కోసం అర్రులు చాచుకుని వుండేది ఆంధ్రలోకం.

ఆంధ్రపత్రికలోనే వుంది, అస లావిశేషం.

ఇప్పటికిన్నీ ఆంధ్రపత్రికలో ప్రతిబింబించినంతగా మరే తెనుగు పత్రికలోనూ ప్రతిబింబించడంలే దాంధ్రదేశం.

నాగేశ్వరరావుపంతులుగారి దృక్పథానికి ధ్రువతార అది.

నాగేశ్వరరావుపంతులుగారి నిష్కామసేవకు జయపతాక అది.

ఆ మొదటి సంవత్సరాదిసంచికలో యెందరివో ఫొటోలున్నా యాంధ్ర మహాకవులవి.

ఆ ఫొటోలకు సంబంధించిన వివరాలూ వున్నాయి.

చూడగా చూడగా, మథనపడగా మథనపడగా, "మంచికవి" అనిపించుకోవాలని వున్న సాధకునకు, వారందరిలోనూ, అటు తిరుపతివేంకటకవులో యిటు రామకృష్ణకవులో మాత్రమే ఆశ్రయించతగ్గవారన్న నిశ్చయం కలిగింది నాకు.

అయితే, ఆ వుభయుల మధ్యా పచ్చిగడ్డి వేస్తే భగ్గుమనేస్తోం దప్పటికే.

కాగా, వారిలో యెవరి దగ్గిర ప్రవేశించినా ఆ యుద్ధంలో వురకడమే అవుతుంది.

నా కది శ్రేయస్కరమా?

"అయితే అయింది లేకుంటే లే"దనుకుందా మంటే, మరి, తిరుపతి వేంకటకవుల దగ్గిరికి వెళ్ళడమా రామకృష్ణకవుల దగ్గిరికి వెళ్ళడమా?

మళ్ళీ యి దొక గడ్డుసమస్య అయిపోయింది నాకు.

ఇది తేల్చుకోడానికి పదిపదిహేను దినాలు కవితా సాధన కూడా అశ్రద్ధ చేసుకోవలసివచ్చింది.

"సహసా విదధీత న క్రియాం" మరి.

## 15

అప్పటికి కొన్ని దశాబ్దులుగా తిరుపతివేంకటకవుల ప్రభ వెలుగుతోంది, అవిచ్ఛిన్నంగా.

అప్పు డప్పుడే ప్రారంభం అయినా, రామకృష్ణకవుల ప్రభ ఆ యెత్తునే వెలిగిపోతోంది, కొత్తవిన్నాణంతో.

చిరప్రతిష్ఠ దాని విశిష్టత అయితే, నవనవోన్మేషం దీని విశిష్టత.

బాగానే వుంది మరి, యెవరిని కాదని యెవరినీ నే నాశ్రయించడం?

ప్రాజ్ఞత రాకపూర్వం అయితే నాకీ గుంజాటన కలక్కపోవును.

వారుభయులూ కజ్జాపెంచుకుని వుండకపోయినా నా కీతటపటాయింపు లేకపోవును.

పోనీ అంటే, మహాసంగ్రామం కాని కీచులాట మాత్రమే కాదది.

జాతికి వికాసం కలిగించేదే అయింది; గాని సంహారం చేసేది మాత్రం కా లేదది.

ఇప్పటి యువకులు దాని పరిమితీ వ్యాప్తీ జటిలతా తెలుసుకోవాలంటే, యిటీవలి ప్రపంచ సంగ్రామం యెత్తున ఆంధ్ర మహాసంగ్రామం అయిపోయిం దది, ఆ రోజుల్లో.

స్థూలదృష్టికి వైయక్తికం, సూక్ష్మదృష్టికి మాత్రం జాతి స్తబ్ధతమీద బాగా సంఘటితమైన దండయాత్ర అది.

అందులో వురికినవా రప్పటివారిలో ధన్యులుగా చెలామణీ అయిపోయేవారు.

ముఖ్యరంగాలు బందరూ పిఠాపురమూనే అయినా, యావదాంధ్రమూ – రాష్ట్రేతరాంధ్రమూ కూడా అలుముకుపోయిం దది.

ఎక్కడెక్కడి తెనుగువాళ్ళూ కూడా దానికి సంబంధించిన కొత్త వ్యూహాల వివరాలకోసం యెదురుతెన్నులు చూస్తూ వుండేవారు.

అది చల్లారిపోతుందేమో అనిన్నీ ఆత్రపడిపోయేవారు కొందరు.

"కవులకీ కీచులాట లేమిటండీ" అనేవారు కొందరు, తమకే సభ్యత వుండినట్టు, మహా.

"ఇది బాగాలేదు" అని పత్రికలకున్నూ రాసేవారు, ప్రపంచం మునిగిపోతున్నట్టు.

ఇక వింత యేమిటంటే?

ఆ వుభయుల్లోనూ యెవరినో వొకరిని సమర్థిస్తూనే వుండేవారు, వారు.

మళ్లీ వారిలో కొందరు, తమ అభిమానకవులను సమర్థించుకుంటూ తమలోతాము డీకొనేవారు.

కోడిపందేలలో పైపందేలు కాసేవారి ధోరణిగా వుండేది వారిది.

అయితే, ఆ మహాయుద్ధాని గ్గల కారణం వుభయులకూ గూడా ప్రశంసావహం కాకపోయినా, వ్యక్తిపరా లయిన హేళనలూ, దూషణలూ పరిహరించుకోగలిగితే ఉభయుల వాదసరణీ బహూ చమత్కారంగా వుండేది.

మీదుమిక్కిలి మిక్కిలీ ప్రబోధకంగానూ వుండేది.

నామట్టుకి నేను, వివాదరూపంగా వుండిన ఆ వుభయుల రచనలూ కొన్ని కొన్ని చదివి, భాషకూ, సాహిత్యానికీ, కవిత్వానికీ సంబంధించిన అనేక విషయాలు తెలుసుకుని వున్నా నప్పటికే, సుళువుగా.

"అందాక, ఇందాక, ఎందాక" ఈ శబ్దాలు నిర్బిందుకంగా వాడారు, తిరుపతివేంకటకవు లంతటా.

"ఈ దాకలో అరసున్న వేయింపు"డని రామకృష్ణ కవుల విమర్శ.

"బ్రతిమాలు" అని తిరుపతివేంకట కవుల వాడకం.

"ద్రేవాంగు లన్న ట్టుందీ మాట" అని రామకృష్ణ కవుల విమర్శ.

'అందాఁక, ఇందాఁక, ఎందాఁక' అని సబిందుకంగా వాడాలనీ 'బతిమాలు' అనాలనీ నాకింతవరకూ తెలియనే తెలియ"దన్నా డొక కవి, ఇది చదివి.

"ఇది హేళనే, సందేహంలేదు; కాని యిందులో చమత్కారం వుంది. అంచేత నన్ను బాగా ఆకర్షించింది. ఈ జన్మలో నేనీ శబ్దాలు తప్పుగా వాడనిక" అనిన్నీ అన్నా డతను.

ఇలాంటి ప్రయోజనాలు పొందినవారప్పుడెందరో వున్నా రావాఙ్మయం చదివి.

ఈ మహాయుద్ధం మూలంగా వేంకటశాస్త్రిగారి శిష్యులకున్నూ కొందరికీ మంచి పేరూ ప్రఖ్యాతీ వచ్చాయి.

ముట్నూరి కృష్ణారావుగారు ఆ శిష్యుల్లోనో శాస్త్రిగారి ఆంతరంగికుల్లోనో ముఖ్యులు.

వారి కృష్ణాపత్రిక వేంకటశాస్త్రిగారిని బాగా పూసుకు వచ్చేది.

వారిని మిక్కిలీ కవ్వించేది కూడా.

రామకృష్ణకవులకు సొంతపత్రిక "కవిత" వుండేది.

తక్కిన పెద్దపత్రిక లుభయులకూ అవకాశం యిచ్చేవి, సమంగా.

రచనకు–ఉద్గ్రంథ రచనకు వినియోగపడవలసిన శక్తి యుక్తు లుభయులవీ కూడా చాలాభాగం ఆ వివాదంలో చెల్లిపోయినా, అదిమాత్రం, పూనుకుని యెందరున్నూ చెయ్యలేనంత సాహిత్యప్రచారం చేసింది, దేశంలో.

దానిమూలంగా, పామరులుగా మాత్రమే వుండిపోవలసిన వారెందరో మంచి సాహిత్య ప్రియులయినారు.

ఆ సాహిత్యప్రియుల్లో యెందరో సాహిత్యవేత్తలయినారు, తరవాత.

ఆ సాహిత్యవేత్తల్లోనూ మళ్ళీ కొందరు, కవులూ రచయితలూ అయిపోయారు, చివరికి.

ఆ రోజుల్లో, ఆంధ్ర సాహిత్య వాతావరణం, చందనీ అత్తరూ గులాబీ అత్తరూ చిలకరించుకుంటున్నట్టూ, మధ్యమధ్య వట్టివేళ్ళ అత్తరువున్నూ పులుముకుంటున్నట్టూ – కమ్మకమ్మగానూ, మధురమధురంగానూ, కటువుకటువుగానూ గుబాళించేది గు–మ్–మని.

మరి, దేశంలో, అంత కదలికా అంత పరిణతీ కలిగించిందంటే ఆ వుభయులదీ సత్తా యెంతటి దయివుండనూ?

కనక, వారిలో యెవరిని కాదని యెవరినీ ఆశ్రయించడం?

పదిపదిహేనురోజులపా టిలా సతమత మయిపోయా న్నేను.

"అయ్యో, ఆలోచనలతోనే కాలం గడిచిపోతోం"దని నాలుగైదు మాట్లు మహా ఆవేగపడిపోయానుకూడా నేను.

దాంతో, ఆ నాలుగైదుమాట్లూ "ఫలానావారి నాశ్రయిద్దాం" అంటూ నిర్ధారణ కూడా చేసుకుంటూ వచ్చాను.

కాని "తొందరపడిపోతున్నా నేమో?" అంటూ మొదటికిన్నీ వచ్చేస్తూవచ్చాను, వెంటవెంటనే.

ఒక ఆధిక్యం గుర్తించి వొకరి నెన్నుకోడం – వెంటనే మరో ఆధిక్యం కనబడగా మనస్సు రెండోవారివై పురకలు వెయ్యడం – ఇలా నడిచింది నా ప్రవృత్తి కొన్నాళ్ళు.

మొత్తానికి "ఎవరి దగ్గిరికీ వెళ్ళడం?" అన్న జిజ్ఞాస మాత్రం తప్పలేదు, లేశమూ నాకు.

అప్పటికి వేంకటశాస్త్రిగారి నొక్కమాటే చూసివున్నాను, బందరులో.

వేంకటశాస్త్రిగారి మాటే యెందుకు చెప్పానంటే, ఆ కలహంలో వారిదే ప్రాముఖ్యం.

తారతమ్యాలు తరవాత బాగా అవగాహన అయినా యనుకోండి, తిరుపతిశాస్త్రిగారి కంటే వేంకటశాస్త్రిగారికే శిష్యవర్గం అధికం.

లోకుల చూపున్నూ వేంకటశాస్త్రిగారిమీదే యెక్కువ.

రాజా శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరువారి వివాహం సందర్భంలో బందరులోనే చూశా న్నేను, వేంకటశాస్త్రిగారిని.

చూశానే గాని మాట్లాళ్ళేదు, వారితో.
దగ్గిరికీ వెళ్ళలేదు.
అంతమాత్రాన వారి ప్రవృత్తి నాకేమి తెలుస్తుందీ?
పోనీ అంటే, ఆ మాత్రమున్నూ చూసియెరగను రామకృష్ణ కవులను.
మొత్తాని కుభయుల సంగతీ నాకు తెలియదు.
ఇట్నుంచి చూస్తే, నా పేరయినా వినివుండరా వుభయులూ కూడా.
ఇదిలా వుండగా, – వారి కుభయులకూ గూడా యేవేవో పనులు.
ఆ సందట్లోనే గ్రంథరచన.
ఇరవైనాలుగ్గంటలూ కలహవ్యావృత్తి.
క్షణం తీరిక లేని యీ స్థితిలో, కొత్తవాడికి చదువు చెప్పడానికి వారిలో యెవరి కయినా తీరిక వుంటుందా?
వారు నన్ను చేరదీస్తారా?
వారు చేరదీసినా నాకు చదువు సాగుతుందా?
కాక:–
అప్పటికి నేను గృహమేధినయి వున్నాను.
మాసాలకొద్దీ యిల్లేకాదు, వూరున్నూ విడిచివుండడానికి వీల్లేదు.
పోనీ అక్కడే కాపరం పెట్టుకుందా మంటే శక్తి లేదు.
ఇక వస్తూపోతూ మాత్రమే వుండాలి.
ఇది శిష్యుడి పఠనానికే కాదు, గురువు పఠనానికీ చిరాకు కారణమే.
ఈ ప్రయత్నం, అసలు, కొనసాగుతుందా మరి?
ఆ మీమాంసకు తోడు ఈ సందేహమున్నూ గజిబిజిపెట్టేసింది నన్ను.
సాహసించలేకపోయాను.
విసిగిపోయాను.
కాని విరమించుకోలేకపోయాను.
వారి కుభయులకూ గూడా దీప్తో దీప్తిహానో కలిగించేదే అయినా, జిజ్ఞాసువులకు వారి కలహమే యింత లాభకరంగా వుందే, మరి, వారి ప్రత్యక్షబోధ యెంత జ్ఞానం కలిగించనూ?
కనక, నిరాశ చేసుకోగూడ దనుకున్నాను.

## 16

"ఇది కాదు పద్ధతి" అని సంవత్సరాదిసంచిక పుచ్చుకున్నూ_చున్నా నొకనాడు సావకాశంగా నేను.

శక్తియుక్తులు ప్రత్యక్షంగానే కనపడుతూనే వుండినా, వారి మనస్తత్వా లెలాంటివో గుర్తిద్దామనుకుని, ఆకార విశేషాలను బట్టి అవి గ్రహించవచ్చు కనక, వొకరిది విడిచి వొకరిదిగా ఫోటోలు పరకాయిస్తూ కూచున్నా నాకూచోడం.

"అది నీకు సాధ్యమా" అంటే, యెవరికయినా యేదశలో నయినా వొకదాని కొకటి అనురూపాలే అయి వుంటాయికదా జిజ్ఞాసా యింగితజ్ఞానమూను?

ఏమయినా, నాకది మంచి వుపాయమే అయిందప్పుడు.

ఏమంటే?

ఫోటోలు ఈ వుద్దేశంతో చూడ్డం ప్రారంభించడంతోటే "మనం రామకృష్ణకవుల దగ్గిరికే వెళ్ళడం" అన్న స్థిరనిశ్చయం కలిగిపోయింది నాకు.

ఎంచేతనంటే?

తిరుపతి వేంకటకవులు చొక్కాలు తొడుక్కోలేదు.

కాళ్ళకి బందరు ఆకుచెప్పులే తొడుక్కునివున్నారు.

గంధాక్షతలూ రుద్రాక్షమాలలూ కూడా ధరించివున్నారు.

కాగా, వారి దగ్గిరికి వెడితే కవితాసాధన చేయించడం మాట దేవు డెరుగును, ముందు మూడుపూట్లా సంధ్యావందనం చేస్తేగాని నిలవనివ్వరేమో అనిపించింది.

అయితే, శిక్షాపూర్వకంగా వైదికవిద్యలే నేర్చుకుని వుండినవాడికి – అనూచానసంపత్తి గల కుటుంబంలో పుట్టిన వాడికి – సంధ్యావందనం అంటే అంత వెగటూ ద్వేషమూ పుట్టివుండడం వింతే.

కాని, ఆ వెగటుపుట్టే దాకా మాత్రం చాలా శ్రద్ధగానే చేశాను సంధ్యావందనం నేను.

కంఠస్నానమూ, కనీసం అష్టోత్తరశతం అయినా గాయత్రీ చెయ్యకుండా పచ్చిమంచినీళ్ళయినా పుచ్చుకుని యెరగన్నేను వల్లూరిలో ప్రవేశించినప్పణ్ణుంచీ.

కవిత్వం కట్టిపెట్టమన్న మావాళ్ళ నిర్బంధం ప్రారంభం అయేదాకా నేనలా చేస్తూనే వున్నాను.

మధ్యాహ్నం భోజనాల వేళదాకా గోళ్ళు గిల్లుకుంటూ కూచుని, ప్రాతస్సంధ్యావందనం కూడా మధ్యాహ్నికంతో పాటే "అయిం"దనిపించుకునే వాళ్ళని చూస్తే మహామంట నాకప్పణ్ణుంచీ.

ఈ విషయం బైరాగిశాస్త్రిగారి దగ్గిర కూడా వచ్చిం దొకనాడు.

వారు సంపన్నులు, కూచున్నా రాజాంగంగా నడిచిపోయే సంసారం వారిది.

ఒకచోట కూచోడం – ఇంటోనే అటూ ఇటూ తిరగడం తప్పిస్తే ఏ వ్యావృత్తీ వుండేదికాదు వారికి.

పోనీ అంటే, వల్లమాలిన ఆచారానికి తోడు ఛాందసంకూడాను.

అయినప్పుడు తెల్లవారాటప్పటికే స్నానంచేసి ప్రాతస్సంధ్యావందనం ప్రాతఃకాలంలోనే యెందుకు చేసుకోరూ?

ఆపద్ధర్మాలున్నాయి కావాలంటే, ఆపదలు వస్తే కదా వాటిమాట?

ఉన్నదల్లా యేమిటంటే?

కాస్తయినా నియమనిష్ఠలున్న వైదికులు స్నానం చేసి కాని భోజనం చెయ్యరు.

పొద్దున్నే, స్నానం చేస్తే, సంసారి అయినవాడికి వూరికే కూచుంటే సాగదు కనక, వీధిలో తిరగడంలో, అనేక కారణాలవల్ల, అనేకవిధాల "మైలపడ్డం" తప్పదు కనక, భోజనాల వేళ మళ్ళీ స్నానం చెయ్యవలసిన ధర్మం వుంది.

గోష్పాదమాత్రంగానే వుండడంవల్ల స్నానం చేస్తే జుట్టు ఆరదేమో అన్న భయం వుండదు కనక, చెయ్యనేవచ్చు.

మరి, చేస్తే యేం?

ఇది నావంటివాడి క్కలిగే సందేహం?

నావంటివాడికి తోచే ప్రశ్నాను.

కాని "పొద్దున్నే చెయ్యకపోతే యేం?" అనుకుంటారు, చాలామంది, కర్మిష్ఠులు కూడా.

"మరి, భోజనం చెయ్యకపోతే యేం?"

ఇదీ వొక ప్రశ్నే.

ఎవరికయినా తోచేదే యిది.

కాని కొంటె ప్రశ్నకింద కట్టేస్తారు వారిది.

కనక, వైదికుల్లో కూడా చాలామంది మాధ్యాహ్నిక భోజనాలవేళే స్నానం చేస్తారు.

తీరికూచుని యుక్తసమయాన ప్రాతస్సంధ్యావందనం యొగవేస్తారు.

సనాతన ధర్మప్రచారకుల్లో కూడా బలంగా వుందీ జబ్బిప్పటికీ.

ఇరవయ్యోశతాబ్ది గాలి సోకిన బ్రాహ్మణకుర్రవాడి కిది స్వధర్మప్రీతి కలగనిస్తుందా?

ఉన్నదయినా నిలవనిస్తుందా?

తెనుగులో కవిత్వం చెయ్యరాదన్న నిర్బంధంతో వేగిపోతున్న నేను తిరుగుబాటు చెయ్యకుండా వుండగలనా?

ఇలాగ అనివార్యంగా వైదికాచారవైముఖ్యం యేర్పడి వుండడంవల్ల తిరపతివేంకటకవుల దగ్గిరికి వెళ్ళడం అంటే భయం పట్టుకుంది నాకు.

దీనికి సాయం, వేంకటరామకృష్ణకవుల స్థితి, తిరుపతివేంకట కవుల స్థితికి సర్వాత్మనా భిన్నంగా వుంది.

వారు కోట్లు తొడుక్కుని వున్నారు.

అకు చెప్పులు కాక, కాళ్ళకి స్లిప్పర్లు వేసుకుని వున్నారు.

మొగాన చుక్కబొట్టయినా లేదు, వారికి.

పైగా, బ్రహ్మసమాజ ధర్మదీక్షితులయిన పిఠాపురం మహారాజులుంగారి ఆస్థానకవులు వారు.

"రాజానుమతో ధర్మః."

"అయితే, ఆ మహారాజులుంగారి ఆస్థానంలో, బ్రహ్మశ్రీలు, దెందుకూరి నరసింహశాస్త్రిగారూ, శ్రీపాద లక్ష్మీ నరసింహశాస్త్రిగారూ, వడలి లక్ష్మీనారాయణగారూ – ఇలాంటి వైదికాచార పరతంత్రులుండేవారు కారా?" అంటే వారితో నాకు ప్రసక్తి లేదుగా?

కనక, రామకృష్ణకవుల దగ్గిరికి వెడితే ఆచారవ్యవహారాల బాధ లేశమూ వుండదు.

ఆ బాధ వుండకపోడమే కాదు, వొక విధంగా సంస్కార దృష్టి సుపరిష్కృతమున్నూ అవుతుంది.

ఇదీ నా ధీమా.

ఈ దిలాసాతో నే నలా స్థిరపరుచుకున్నాను.

క్షణం యుగం అయిపోసాగింది, వెంటనే.

ఆవెంటనే "విద్యాభిక్ష పెట్టవలసిం"దని వారికి జాబు రాసేశాను, నా స్థితి తెలుపుతూనూ, నా పూర్వానిక వివరిస్తూనూ.

పద్యాలతో రాశా నా వుత్తరం.

లోపలి విషయమే కాదు, కవరు మీది అడ్రస్సున్నూ పద్యమే, ఉత్పలమాల అది.

అది మాత్రమే జ్ఞాపకం వుందిప్పుడు, ఆ పద్యాని దయినా నాలుగోపాదమే జ్ఞాపకం వుంది.

"వేంకట రామకృష్ణకవి వీరవరేణ్యులకున్
పిఠాపురం" అని.

ఇదే ప్రధానం ఆ పద్యానికి, మొదట స్ఫురించిందిన్నీ యిదే, మొదటి మూడు పాదాలూ వారికి విశేషణాలు వేసి పూర్తిచేశాను.

వెంటనే ప్రత్యుత్తరం రాశారు వారు, టెలిగ్రాం లాగ వొక్కటే వాక్యం "నిరభ్యంతరంగా రావచ్చు, రండి" అని.

## 17

మా అమ్మగారూ మా నాయనగారూ కాశీ వెళ్ళివున్నారు.

మా సీతా, మా పెద్దక్కగారూ, బాలెంతరాలు మా చెల్లెలూ మాత్రమే వున్నా రింటో.

"పదిహేనురోజుల కోమాటు వస్తూవుంటా"నని చెప్పి పిఠాపురం బయలుదేరా న్నేను.

తెల్లవారుజామున అనపర్తిలో రెయి లెక్కాటప్పటికి "ఎక్కడికోయ్?" అంటూ పలకరించాడు, కూచునే కునికిపాట్లు పడుతున్న యువకు డొకడు.

చూడగా, మల్లాది సత్యనారాయణశాస్త్రి అతను.

దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి శిష్యుడు:

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారికి సన్నిహితుడు.

ఇంకా చెప్పాలంటే, దువ్వూరి సుబ్బమ్మగారి తమ్ముడున్నూ.

సాహిత్య జ్ఞానం బాగా వున్నవాడే, కవిమాత్రం కాదు.

త్యాగరాజు కృతులెన్నో పాడేవాడు, బహూ శ్రావ్యంగా.

ఉజ్జ్వలమైన రూపమూ, గంభీరమైన గొంతుగాత్రమున్నూ అతనిది.

పిడపర్తి శివపూర్ణయ్య సిద్ధాంతి మామగారి జ్యేష్ఠపుత్రుడు కల్యాణవీరభద్రశాస్త్రిబావ వివాహానికి నా గురువులు దర్భా బైరాగిశాస్త్రిగారితో నేనూ, తన గురువులు తిరుపతిశాస్త్రిగారితో అతనూ మాముడూరు గ్రామం వెళ్ళినప్పుడు మా కిద్దరికీ మొదటి సమావేశమూ, పరిచయమూను.

తరవాత చాలాచోట్ల కలుసుకుంటూవచ్చాం, చాలామాట్లు; దాంతో స్నేహంగా పరిణమించిందా పరిచయం.

అంచేతనే నన్ను గుర్తించగలిగా డతను, కుమకుతూ వుండిన్నీ.

అప్పటికింకా రెయిళ్ళలో కార్బైడు దీపాలే వుండేవి, ఆ మసకవెలుగులో నేనూ గుర్తించా నతణ్ణి, తరవాత.

ఇద్దరమూ వొక్కచోటికి చేరుకున్నాం.

నా ప్రయాణం సంగతి అత నడగ్గా, నా పూనిక చెప్పా న్నేను.

వింటూనే "మనం యిద్దరమూ విరోధులం అయిపోతాం కామోసు" అన్నాడతను, బెల్లించిచూస్తూ.

"తప్పదా?" అనడిగాన్నేను.

"అవసరం లేదు, అలా జరగదు. నేను కవిని కానుగా?" అన్నా డతను.

తరవాత్తరవాత నేను తిరుపతి వేంకటకవులమీదే ధ్వజమెత్తినా నాతో మామూలుగానే వుంటూవచ్చా డతను.

పైగా, రామకృష్ణకవులకూ తిరుపతివేంకటకవులకూ జరుగుతూ వుండిన కలహవ్యాపారంలో తిరుపతిశాస్త్రిగారికి ప్రమేయం లేదనిన్నీ చెప్పా డతను.

కాలక్రమాన నాకు మరీ సన్నిహితుడయినాడు కూడా.

నేను, అష్టావధానాలు చేశాటప్పుడు నాతో కలిసిన్నీ తిరిగా డతను, కొన్నాళ్ళు.

మే మలా తిరగడానికి నన్ను ప్రోత్సహించినవాడే అతను.

నా అష్టావధానప్రక్రియలో నేత్రావధానం వొకటి.

నేత్రావధానాని కతనే నాకు సహచరుడు.

అతనే నేర్పాడుకూడా, నా కది.

ఆవేళ అలా కలుసుకోడంలో నా గురువరణవిధానం చెప్పా నతనికి.

విని విని "నీది భ్రమ కాని సత్యం కాదు" అంటూ ప్రారంభించి "తిరుపతిశాస్త్రి గారూ, వేంకటశాస్త్రిగార్తూ కూడా కవితాతపస్వులు కాని వైదిక విద్యావేత్తలూ, వైదికాచార పరతంత్రులూ కారు. సొంతానికి వారు సంధ్యావందనం చేసుకుంటే చేసుకోవచ్చు, శిష్యులను నిర్బంధించే వారు మాత్రం కారు" అని బదులు చెప్పా డతను.

వా రొక పద్ధతిలో స్థిరపడ్డాకే దేశంలో వేషాలు ముదిరాయి, కనక, వారు చొక్కాలు తొడుక్కోకపోడంలో వింత యేమీ లేదు; గాని అత నీమాట చెప్పేదాకా మాత్రం సమన్వయం కుదరలేదు నాకు.

కాగా, – కావా లంటే మించిపోయింది లేదు, పిఠాపురానికి బదులు కాకినాడ వెళ్ళావచ్చు, అతనిచేత చెప్పించుకుని తిరుపతిశాస్త్రిగారి నాశ్రయించావచ్చు, బాధ లేదు.

పిఠాపురం బొత్తిగా కొత్త, కాకినాడ చిరపరిచితం కూడాను.

అయినా, నా చూపు మారలేదు.

కాక, – అనుకోకేపోవాలే; గాని తరవాత మనస్సు మార్చుకోడం నా పద్ధతి కాదెప్పుడూ.

"ఇంకెందుకూ? నువ్వేదో వొక నిశ్చయం చేసుకునే వున్నావుగా?" అన్నా డతనున్నూ.

రెయిలు సామర్లకోట చేరుకుం దింతలో.

"మహాకవి నాశ్రయించివుండినా నాకే లేకపోయింది యోగం, నీకేం, నువ్విప్పటికే కవిత్వం చేస్తున్నావు, కవీశ్వరుడవే అయిపోతా వికా" అంటూ బండిదిగి కాకినాడ డూప్లికేటుకి మారాడతను.

పిఠాపురంలో రామకృష్ణకవులు న న్నెలాచూస్తారో, అక్కడ నా సత్తా యేమాత్రం పెరుగుతుందో – వూహాలకున్నూ అందలేదు; గాని మిత్రుని శుభచింతన నా కుత్సాహం రేకెత్తించింది.

అప్పటికి బాగా వెలుగు రావడంతో, నాకు నిద్రబద్ధకం అంతకిముందే పోయింది.

మరో అరగంటకు – ఉదయం ఆరున్నర – ఏడు – ఆ ప్రాంతాన, పిఠాపురంలో రామకృష్ణకవుల సన్నిధి చేరుకున్నా న్నేను.

## 18

కలమూ కాగితాలూ పుచ్చుకుని రామకృష్ణశాస్త్రిగా రప్పుడే అరుగుమీద కూచున్నారు, నేను బండి దిగాను, గుమ్మాన.

ఫోటోలు చూసిన కళ్ళతో నేను వారిని సరిగానే గుర్తించాను, నా పేరు చెబుతూ మోడ్పుకేలితో యెదటికి వెళ్ళేటప్పటికి వారే చకితులయినారు.

నా ఉత్తరాన్ని బట్టి నేను, వారు రూపించుకున్న ట్టుండకపోడమే అందు క్కారణం.

కాళ్ళకి దొరలజోడూ, వొంటిమీద షర్టూ, షర్టుమీద కోటూ, కోటు జేబులో వాచీ, వాచీగొలుసు కొక బంగారపు మెడలూ – ఇదీ అప్పటి నా వేషం.

కుశలవ నాటక రచనకు మెచ్చి మొదటి ప్రదర్శన సమయాన నాకు మల్లిడి సత్తిరెడ్డిగారు బహూకరించిన మెడలది.

దర్జాగా అది వేసుకుతిరగడానికే వాచీ.

వాచీగొలుసు రోల్డుగోల్డుది కావడంవల్ల అప్పుడప్పుడు కగ్గిపోయేది.

దాని కదేదో పొడ్రుద్ది తరుచు మెరుగున్నూ పెట్టుకోవలసివచ్చేది, శ్రమపడి.

అయినా మెడలో వేసుకుతిరగడంలో నా కదేమీ బాధ అనిపించలే దెప్పుడూ.

అంతకష్టపడుతున్నందుకు, రామకృష్ణశాస్త్రిగారు, మొదట నా మెడలే చూశారు, ధన్యుణ్ణనుకున్నా న్నేను.

ఇంతలో నా పెట్టె తెచ్చి బండివా డరుగుమీద పెట్టడమూ, లోపలినుంచి వచ్చి వేంకటశాస్త్రిగా రరుగుమీద కాలు పెట్టడమూ, వొక్కమాటే జరిగాయి.

రామకృష్ణశాస్త్రిగారు చెప్పగా నన్ను చూసి వారూ చకితులయినారు.

"మనతో సమాను లయివుండినవారికి మనం చదువు చెప్పడం యేమిటీ?" అనిన్నీ అడిగారు వారు, రామకృష్ణ శాస్త్రిగారిని.

నా వయస్సు గుర్తించి, నా వేషం డాబున్నూ చూసి వా రప్పుడలా అన్నారే గాని, నేను తమకు రాసిన కవరుమీది అడ్రెస్సు ఉత్పలమాల అయి వుండినందుకు చమత్కృతులయి "మన దగ్గిర వుండతగ్గవాడే, రమ్మను" అని చెప్పి, రామకృష్ణశాస్త్రి గారిచేత నాకు బదులు రాయించినవారే వారుట, తరవా తెలిసింది.

సంభాషణ సందర్భంలో నా పూర్వస్థితి కొంత చెప్పాను వారికి.

నే నందుకు జంకి తిరుపతి వేంకటకవుల దగ్గిరికి వెళ్ళలేకపోయానో, యెలాంటి ధైర్యంతో పిఠాపురం చేరుకున్నానో అదిన్నీ చెప్పాను, వివరంగా.

"సరస్వత్యుపాసన గాయత్ర్యుపాసనలో అంతర్భాగమే కనక, సంధ్యావందనం మానివేసినందుకు మీరు భయపడనక్కరలే" దన్నారిది విని వేంకటరామశాస్త్రిగారు.

వెళ్ళివెళ్ళి, దీంతో, వారికీ తిరుపతివేంకటకవులకూ జరుగుతున్న జగడం వృత్తాంతంలో లీనం అయిపోయింది, నా సంధ్యా వందనప్రసక్తి.

"ఇదిగో, యిప్పుడు రాస్తున్న దాబాపతే" అంటూ కలమూ కాగితాలూ కిందవుంచి జరిగిందీ, జరుగుతున్నదీ అంతా వివరించి చెప్పారు రామకృష్ణశాస్త్రిగారు.

నిశితమైన పాండిత్యమూ, అనర్గళమైన కవితాధారా, దూరదృష్టీ – అవి ఆ వుభయులకూ సమానమే; గాని రామకృష్ణశాస్త్రిగారి దగ్గిర చురుకుపా లెక్కువ.

వయస్సు చిన్న దయినా, వేంకటరామశాస్త్రిగారు, కాకలుతీరి నివురుగప్పిన నిప్పు అనీ, రామకృష్ణశాస్త్రిగారు అప్పుడే చికిలీ చేసిన చంద్రహాసం అనీ ఆ ప్రథమ ప్రసంగంలోనే అవగాహన అయింది నాకు, పూర్తిగా.

ఎదటివాడు మేరమీరాడా "వాడి కర్మం" అంటూ తప్పించుకుపోతారు వేంకటరామశాస్త్రిగారు, రామకృష్ణశాస్త్రిగారు మాత్రం కళ్ళెర్రజేస్తారు, హుంకరిస్తారు, అణిచిన్నీ వేస్తారు చివరికి, నిర్దాక్షిణ్యంగా.

ఇవతలివాడు మంచి ఉక్కుతునక అయితే, వా రుభయులూ కూడా బహుశక్తివంతాలయిన అయస్కాంతాలు.

వారిలో మళ్ళీ భేదాలు లేవా అంటే, –

వేంకటరామశాస్త్రిగారి సన్నిధి, ఆతపతప్తునకు శరత్పూర్ణిమా కౌముది వంటిదీ, రామకృష్ణశాస్త్రిగారి సన్నిధి, శీతార్తునకు వసంతబాలాతపం వంటిదీనీ.

కవిత్వం విషయమై, నేను, అటు ఆతపతప్తుణ్ణీ, యిటు శీతార్తుణ్ణీ కూడా అయివుండడంవల్ల వారిద్దరి సన్నిధీ నా కుత్తేజకమే అయింది.

దాంతో, ఆ ప్రసంగవశాన, నాకు వారూ, వారికి నేనూ చిరపరిచితులం అన్న ట్టనిపించింది నాకు.

ఒక్క గంట అయేటప్పటికి రామకృష్ణశాస్త్రిగారూ నేనూ "మమేకమే" అయిపోయాం.

వేంకటరామశాస్త్రిగారు, అంతా వింటూ, అంతా చూస్తూ కర్మసాక్షిలాగ సర్వానికీ పర్యవేక్షకులై వుండినట్టనిపించింది నాకు.

## 19

మాటమీద మాటగా, రామకృష్ణశాస్త్రిగారు కాకరపర్తి ప్రసంగం తెచ్చారు.

వారి స్వగ్రామం అది.

వారి మాట కనుబంధంగా, ముక్కామల ప్రస్తావన చేశా న్నేను.

నాకు, మాతామహస్థలమూ అత్తవారి వూరూనూ అది.

రెండూ పక్కపక్క వూళ్ళు.

దేని కేదీ తీసిపోదు, వొకటి రత్నమూ వొకటి కెంపూను.

కాని, వారి దృష్టిలో కాకరపర్తివారు కర్మదూరులూ, వీరి దృష్టిలో ముక్త్యాలవారు బహూ ఛాందసులూనూ.

ఏమంటే?

ముక్త్యాల వేదశ్రౌతాలకు పుట్టినిల్లయితే, కాకరపర్తి తర్క వ్యాకరణాలంకార శాస్త్రాలకు ఆదిపీఠం.

ఇంకో భేదమున్నూ వుంది.

కాకరపర్తి అంతా ఆరామద్రావిడబృందమూ, ముక్త్యాల అంతా వెలనాటి బ్రాహ్మణపుట్టాను.

బాల్యంలో నేను తరుచుగానూ ముక్త్యాల వెళ్ళేవాణ్ణి, వెళ్ళినప్పుడల్లా చాలా దినాలూ వుండేవాణ్ణి.

అయితే, ముక్త్యాల గ్రామంలో, పీసపాటి సోమసూరీడూ, పీసపాటి వేంకటేశ్వర్లూ, పీసపాటి వేంకప్ప యాజులూ మొదలైనవారందరూ నాలాగే వైదికవిద్యలు నేర్చుకుంటున్నవారు.

నా కక్కడ వారితోనే సరిపోయేది.

అంచేత, ముక్త్యాల వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ గూడా కాకపర్తి పక్కగా వెళ్ళడమే గాని, వూళ్ళోకి వెళ్ళడం పడలే దొక్కమాటున్నూ.

ఆ పక్కగా వెళ్ళడంలో మాత్రం వొకప్పు డొక చిత్రం జరిగిం దెప్పుడూ లేనిది.

అప్పటికప్పుడే నేను తెనుగులో రచనా చేస్తున్నాను, మా చుట్టుపట్ల కవి అనీ అనిపించుకుంటున్నాను, ధారాళంగా.

అయితే, వేషంలో మాత్రం మార్పు ప్రారంభం కాలేదు, వైదిక విద్యలూ సంస్కృత సాహిత్యమూ నేర్చుకునే విద్యార్థిలాగే వున్నాను.

ఆవేళ, తీపర్తిలో మెయిలుబోటు దిగి, అక్కడి సత్రంలో భోజనం చేసి, యెఱ్ఱవంతెనదగ్గిర మళుపు తిరిగి, కాకరపర్తి పక్కగా కోడూరి కాలవగట్టే వెడుతున్నాను, నాలుగ్గంటలు దాటాక, ముక్త్యాల.

కాకరపర్తికీ ముక్త్యాలకీ మధ్యగా – అవతలిగట్టున – అంటే పోతగట్టున, కాకరపర్తి బ్రాహ్మణయువకు లయిదారుగురు కూచుని వున్నారు.

వారిలో వొకడు "మీదే వూ?"రనడిగాడు మొదట నన్ను.

నేను చెప్పాను.

వెంటనే యేకవచనంలోకి దిగిపోయి "యెక్కడికి వెడుతున్నా?"వనడిగాడా యువకుడే మళ్ళీ.

అదీ చెప్పాను.

"ఏమి చదువుతున్నా?"వన్నాడు మరో యువకుడు.

"ఏమీ చదవడం లే"దన్నాను.

"పోనీ యింతకుముందేమి చదివా?"వనడిగాడు దీనిమీద.

"ఏమీ చదవలే"దన్నాను.

ఏదో చదువుతున్నానన్నా, చదివానన్నా వంద ప్రశ్నలు వస్తాయి, చొప్పదంటువి, మరి.

"చదవడం లే"దన్నా అసందర్భమే అయిందప్పుడు.

"చదువుసంధ్య లేమీ లేనివాడవు, మావూరిమీదుగా యెందుకు వెడుతున్నా"వ నడిగాడా యువకుడే, తిట్టుతో సంబోధించి.

మాటమీద మాట పెరిగింది.

కాని, నేను కాలవ కివతలా ఆ యువకు డవతలా వుండడం వల్ల మాటలు మాత్రం ముదిరి వూరుకున్నా యప్పుడు.

నే నీ సంగతి చెప్పగా రామకృష్ణశాస్త్రిగారు కొంచెం విచారించారు.

"అటు పేరూరికీ యిటు కాకరపర్తికీ యిలాంటి పేరుండడం నిజమే; కాని కాకరపర్తి యిప్పుడు పూర్తిగా మారిపోయింది లెండి" అన్నారు, వేంకటరామశాస్త్రిగారు.

నిజమే, అగ్రహారా లిప్పుడు మారినట్టే వున్నాయి.

కొన్ని అగ్రహారా "లవేనా యివి" అన్నంతగా మారిపోయాయి, నాకు బాగా తెలుసు.

అప్పటికింకా అగ్రహారాల్లో విద్వత్తు వుండేది.

చిలిపితనమూ వుండేది.

ఈ చిలిపితనం గాంభీర్యం లేనిచోట విద్వద్గర్వానికి బాహ్యరూపం, సాధారణంగా.

చదువుకున్న వారిని చూసి చదువుకోనివారూ చూపించేవా రిది హద్దూ పద్దూ, వావీ వరసా కూడా లేకుండా.

మరో అగ్రహారం చిలిపితనం చెబుతా నిక్కడ.

ఆ వూళ్ళో వందల మీద వుంది బ్రాహ్మణ గడప.

సాధారణంగా అగ్రహారా లొక శాఖకే సంబంధించి వుంటాయి, రుణాలు పెరిగి భూముల అమ్మకాలు ప్రారంభం అయేదాకా.

పొరుగూరి బ్రాహ్మడొకడు ఆ అగ్రహారం మీదుగా వెడుతున్నా డొకనాడు మరోవూరు.

తన అరుగుమీద కూచుని వుండిన అగ్రహారీకు డొకడు పలకరించి "మీదే వూ"రనీ "అది యిక్కడి కెంత దూర"మనీ అడిగాడు, గంభీరంగానే.

బాటసారి చెప్పి సాగిపోయాడు.

కాని, రెండుమూడిళ్ళు దాటగానే మరో అగ్రహారీకుడున్నూ యివే ప్రశ్నలడిగా డాప్యాయత కనపరుస్తూ.

మళ్ళీ ఆ బదుళ్ళే చెప్పాడు బాటసారి, మర్యాదగా.

చిలిపితనమే లేకపోతే అల్లరికి ప్రసక్తి యేదీ యిక్కడ?

కాని, బూతులు తిడుతూ అరుగు దిగి, కచ్చబిగిస్తూ మీదికి వెళ్ళి "ఆ యింటిదగ్గిరికీ ఈ యింటిదగ్గిరికీ పొకటే దూరమా నీ వూరు? వొళ్ళు తెలిసే మాట్లాడుతున్నావా?" అంటూ కలియబడ్డాడు రెండో అగ్రహారీకుడు.

అప్పటికి మొదటి అగ్రహారీకుడున్నూ వెళ్ళి బాటసారి మీదపడ్డాడు.

వారూ వీరూ చేరారు; గాని అదేమని మాత్రం అనలే దెవరూ.

పైపెచ్చు "అసందర్భంగా యెందుకు చెప్పావు మరీ?" అంటూ బాటసారినే దుయ్యబట్టుకున్నారు, తామున్నూ కచ్చబిగిస్తూనే,

అయితే, వొక్కొక్క అగ్రహారాని కొక్కొక్క రకం, మినహాయింపులు మాత్రం లేవు దేనికీ.

అగ్రహారం కాకపోయినా, బ్రాహ్మణేతర ప్రాబల్యం వున్న వూళ్ళల్లో వొకటి రెండింటికీ వున్నా యిలాంటి చరిత్రలు.

సాధారణంగా గౌరవమర్యాదలకు సంబంధించిన పట్టుదల లెక్కువగా వుంటాయి, బ్రాహ్మణాగ్రహారాల్లో.

పెద్దలూ, విద్వాంసులూ వాటికోసం పాకులాడతారు; కాని ఆ యెత్తు అందుకోలేని యువకులు చాలామంది యిలాగ చిలిపితనం పెంచుకుంటారు.

ఆ యువకుల్లో, వయసు పెరిగినకొద్దీ కొందరు సౌమ్యులవుతారు, కొందరు మాత్రం ఘటికులవుతా రింగితజ్ఞానం లేక.

అయిపోతూనూ వుంటారు, చివరిదాకా.

## 20

ఈ గౌరవమర్యాదల సందర్భంలోదే మరో వుదాహరణ.

అదిన్నీ వొక అగ్రహారం.

వంతలమీద వుంది బ్రాహ్మణగడప అక్కడాను.

వేదవేదాంగాలు నేర్చినవారూ యజ్ఞయాగాలు చేసినవారూ డజన్లక్కడ.

కలతగొట్టు విద్వాంసులు మాత్రం గ్రోసులు.

ఏమి వచ్చినా అక్కడ పెద్దలమాట పిన్నలు శిరసావహిస్తారు, పిన్నలచిలిపితనం పెద్దలుసహిస్తారు చూడనట్టు నటిస్తూ.

వివాహాల సందర్భంలో పెళ్ళికొడుకులకూ పెళ్ళికూతుళ్ళకూ తప్ప ఆ వూరివీధుల్లో పాలకీలూ ఇతర వాహనాలూ యెక్కి తిరగడానికి వీల్లేదు మరెవరికీ.

పండితులూ యజ్వలూ ఏయింటివా రాయింటి అరుగుల మీద కూచుని విద్యావ్యాసంగాలు చేసుకుంటూ వుంటారు కనక, వారియెడల వినయవిధేయతలు కనబరచడానికే యీ కట్టుబాటు.

ఇప్పుడంటే దేశం తెనుగుమీరిపోయింది; గాని, నాకు బాగా వయసు వచ్చాక గూడా పండితులంటే భయభక్తులు చూపిస్తూనే వుండేవారు జనులు.

ఆ అగ్రహారంలో కూడా అన్ని కులాలవారూ ఈ కట్టుబాటు మన్నించేవా రిష్టాపూర్తిగా.

తహసీలుదార్లేకాదు, కలెక్టర్లున్నూ పాలకీలూ గుర్రాలూ దిగి పండితులకు దండాలుపెడుతూ కాలినడకను వెళ్ళడమే ఆ వూరి సంప్రదాయం.

హిందువులుకాని అధికార్లున్నూ ఈ కట్టుబాటు మన్నించేవారు.

ఒకప్పుడు కొత్తగా వచ్చిన తహసీలుదారు మాత్రం "నాన్సె"న్సన్నా డిదంతా. కులానికి బ్రాహ్మడే మళ్ళీ ఆయన.

అజమాయిషీ పేరుచెప్పి "యీ పెంకితనం వదలగొడదా"మనే వచ్చిన ఆ "వున్నతాధికారి"తో పొలిమేర దగ్గిరే విన్నవించుకున్నారు మున్సబుకరణా లీ సంగతి; కాని "షటప్" అన్నా డాయన.

ఊరిదగ్గిరికి వచ్చేటప్పటికి, తమకీ సంగతి తెలుసు కనక, యెవరూ చెప్పకుండా బోయీలే దింపేశారు పాలకీ; కాని "జాగ్రత్త" అంటూ కళ్ళెర్రజేశా డాయన.

మళ్ళీ మళ్ళీ యిటు విన్నపాలూ అటు తిరస్కారాలూ జరిగిపోయాయి.

ఈ సంగతి అంచెనోళ్ళమీద వ్యాపించింది, అగ్రహారం అంతటా.

ఈలోపున బోయీలు పాలకీ యెత్తుకున్నారు, "మమ్మేల్నేం చెయ్యమంటా"రన్నట్టు చూస్తూ.

కూడాకూడా నడుస్తూనూ వున్నారు మున్సబుకరణాలు; "ఏమి దారి?" అని ఆలోచిస్తూనూ వున్నారు.

ఇంతలో వొక బ్రాహ్మణయువకుడు వచ్చి "యెప్పుడూ రాని ప్రభువులు దయచేశా"రని వంగి దండాలున్నూ పెట్టి, లేతకొబ్బరిబొండం వొకటి నజరుపెట్టాడు.

అది చూసి "అగ్రహారం పాదాక్రాంతం" అవుతోందనుకున్నాడా "వున్నతాధికారి."

అనుకుని, అతిదర్జాగా ఆబొండం అందుకుని, పక్కనిన్నీ పెట్టుకుని "ఇప్పు డేమంటారు?" అన్నట్టు సగర్వంగా చూశాడు మున్సబుకరణాలకేసి.

చూశాడు - చూస్తూనే వున్నాడింకా - మరో యువకుడున్నూ వచ్చి లేత కొబ్బరిబొండం నజరుపెట్టాడు, "ఎప్పుడూ రాని ప్రభువులు దయచేశా"రంటూనే.

పదిమంది - పాతికమంది - యాభైమంది - వందమందిన్నీ తెచ్చారు, నజరుపెట్టారు లేతకొబ్బరిబొండాలే.

తెచ్చేవారు తెస్తూవుండగా, తెచ్చినవారు తామే పాలకీలో పేర్చసాగారు బొండాలు "ఉన్నతాధికారికి" దండాలు పెడుతూనూ, "ఎప్పుడూ రాని ప్రభువులు దయచేశా"రంటూనూ.

లోపల చోటు చాలకపోగా, రెండేసిబొండాలు గుదిగుచ్చి తెచ్చినవారే పాలకీదండెలకూ వూచలకూ వేళ్ళాడ వెయ్యసాగారు, నినాదం రెట్టిస్తూ.

తహసీలుదారు తెల్లబోయాడు.

"బాబోయ్, మొయ్యలే"మన్నారు బోయీలు.

అంటూనే ఆగిపోయారు.

ఆగి, పాలకీగూడా దింపెయ్యబోయారు; గాని ఫెళ్ళుమంటూ వొక దండె విరిగిపోయిం దీలోపునే.

రెండోదండె బోయీల చేతుల్లో వుండడంవల్ల యేటవాలు స్థితి యేర్పడి ముందుకి బేకారించి కొబ్బరిబొండాల్లో వుండ్రముక్క అయిపోయాడు "వున్నతాధికారి."

ఆయనమీదే సవారిచేశాయి బొండాలు.

ఇది చాలదన్నట్టు ఎలాగో తప్పించుకుని లేవబోతున్న వున్నతాధికారి కడ్డంగా పేర్చసాగారు యువకులు బొండంగుదులు.

ఉడికిపోయాడు తహసీలుదారు.

మండిపోయాడు, స్వగతంగా.

చల్లబడిపోయాడు, చివరికి.

"మరి, తరవాత యేమిచేశాడ"ని కాదు, ప్రశ్న, బ్రాహ్మణజాతికి గౌరవావహ మేనా యిది?

## 21

ప్రసంగం కొంతసేపిలా జరిగేటప్పటికి, వేంకటరామశాస్త్రిగారూ రామకృష్ణ శాస్త్రిగారూ కూడా నన్ను "మీ"రని మన్నిస్తూవుండడం గుర్తించాను.

"ధర్మమా?" అనిన్నీ అడిగాను.

"చాలామంది గురువులు శిష్యుణ్ణి 'హొరే' అంటారు, మాకు తెలుసు. మృదువరులు కొంద 'రేమోయ్' అనడమూ వుంది; కాని మిమ్మల్ని మేమలా కూడా అనం" అన్నారు వేంకటరామశాస్త్రిగారు.

"మీరంటే వచ్చే విప్రతిపత్తి యేమిటీ?" అనడిగారు రామకృష్ణశాస్త్రిగారు.

విద్యార్థికి గురువు పితృతుల్యుడూ, గురువుకి విద్యార్థి పుత్రసమానుడున్నూ.

ఇది మన సంప్రదాయం.

ఇందులో ఆత్మీయతే గాని, యెక్కువ తక్కువలూ సేవ్యసేవకతలూ, మానహానిమర్యాదలూ లేవు.

ఇటు పూజ్యభావమూ, అటు ఆత్మీయతా కలగడానికే యీ భావన.

ఈ ధర్మాలు నాకంటే యెక్కువే తెలిసినవారు రామకృష్ణకవులు.

అయినా, వా రామాట మాననున్నారు.

"వయస్సులో యెక్కువ తేడా లేదు. ఇప్పటికే మీరు కవి అయి వున్నారు. గ్రంథాలు రచించారు. అచ్చు వేయించారు. కొన్ని విషయాలు తెలుసుకోడానికి వచ్చారు మాదగ్గిరికి. కనక, స్నేహభావానికే యిక్కడ ఔచిత్యం" అని చెప్పి "యిక ఆ ప్రసంగం కట్టిపెట్టండి" అని ఆదేశించారు రామకృష్ణశాస్త్రిగారు.

పోతే, ఆ పూటే – తొమ్మిది దాటాక పాఠం ప్రారంభించడానికి సుముహూర్తం.

కాశీ వెడుతూ మా నాయనగారే స్థిరపరిచిన ముహూర్తం అది.

నే నీసంగతి చెప్పగా, క్షణంలో ప్రణాళిక నిర్ణయించి, తమదే ప్రతాపరుద్రీయం తెచ్చి నాచేతి కిచ్చి పాఠం చెప్పారు రామకృష్ణశాస్త్రిగారు.

ఆరంభశూరత్వం కూడదు కనక, బహు టూకీగా చెప్పారు నాటికి.

ఆ పద్ధతి విలక్షణంగా కనపడింది.

నన్ను బాగా ఆకర్షించిందది.

నాకెప్పుడూ రామకృష్ణశాస్త్రిగారే పాఠం చెప్పేవారు.

ప్రతాపరుద్రీయంపాఠం వొక నిర్దేశం మాత్రమే.

వారు లోకాభిరామాయణం యెత్తుకుంటే అదీ వొక పాఠమే అయిపోయేది నాకు.

గురుకులవాసంలో జరిగే పఠనపాఠనాల విశిష్టతే యిది.

గురుశిష్యుల సహజీవనంలో వుందీ విశేషం.

తల్లీకొడుకుల మధ్యకూడా విరోధం రగిలించే డబ్బుతో ప్రసక్తి వుండదు కనక, యిక గురుశిష్యుల కాత్మీయత యేర్పడ్డం వొక్కటే సమస్య అక్కడ.

అది యేర్పడిందా, సరస్వతి అక్కడ లాస్యం చేసిందన్నమాటే.

అంటే, గురుకులవాసంలో, శిష్యుడి ప్రతీకదలికలోనూ గురువుకి జిజ్ఞాసే కనపడుతుంది, గురువు ప్రతీకదలికలోనూ శిష్యుడి కుపదేశమే వినపడుతుంది.

దీనివల్ల చదువొక్కటే కాదు, సంప్రదాయపరిజ్ఞానమున్నూ కలుగుతుంది, విద్యార్థి కప్రయత్నంగా.

క్రమప్రవర్తనా అలవడుతుంది, తప్పనిసరిగా.

అయితే, రామకృష్ణకవులున్నది మిక్కిలీ చిన్నయిల్లు.

ఇద్దరి కుటుంబాలూ అయింటోనే వుండడంవల్ల వారికే యిరకాటకంగా వుండేది.

అయినా, అందులోనే సర్దుకోమన్నారు వారు నన్ను.

కాని, చదువుతోపాటు రచన కూడా సాగించుకోవాలి, కనక, ఎదటి గుమ్మంగా వున్న మల్యాల పేర్రాజుగారి వీధి అరుగుమీది గది అద్దెకు పుచ్చుకున్నా న్నేను.

ఇంతా చేస్తే రాత్రి పడుకోడానికి మాత్రమే వుపయోగించేది నా కా గది.

షష్టి గడియలూ రామకృష్ణశాస్త్రిగారితోనే సరిపోయేది నాకు.

వారు లోపలవుంటే నేను వెళ్ళి పిలిచేవాణ్ణి, నేను క్షణం ఆలస్యం చేస్తే వారే పిలిచేవారు నన్ను.

సాధారణంగా వారిని కనిపెట్టుకుని వుండడమే పనిగా పెట్టుకున్నా న్నేను.

శక్తిసామర్థ్యాలకు సాయం అలాంటి ఆకర్షణ వుండేది వారిదగ్గిర.

సర్వతోముఖమైన పాండిత్యమూ, అఖండమైన కవితాధారా అలావుండగా, కరువున పోసిన బంగారువిగ్రహం అన్నట్టుండేవారు రామకృష్ణశాస్త్రిగారు.

విశాల ఫాలతలమూ, సన్నని మీసకట్టూ, యెర్రని పెదవులూ – వీటితో వారి ముఖం మిక్కిలీ సౌమ్యమూ ఆకర్షకమూ అయి వుండేది.

ఆ వర్చస్సుకి ముగ్ధుడై, ఆ ధోరణికిన్నీ అలవాటుపడి, హైస్కూలు ఉపాధ్యాయు డొకాయన (పేరు సూర్య ప్రకాశంగారని జ్ఞాపకం) పాఠశాల విడిచిపెట్టడం తడువుగా వచ్చి రామకృష్ణశాస్త్రిగారిని కనిపెట్టుక్కూచునేవాడు నాతోబాటు.

వారు పద్యమైనా శ్లోకమయినా శ్రీరాగంతో యెత్తుకుంటే, వీధే వెళ్ళేవారున్నూ ఆగిపోయేవారు స్నిగ్ధహృదయులయితే.

వారు, సాంసారికమైన బాదరబందీ పెట్టుకునేవారు కారు.

ఆ మేనత్త మేనమామబిడ్డల కిద్దరికీ వొకటే ప్రాణం.

నాకు పాఠం చెప్పడమూ, యేదో వొక సాహిత్యవిషయం ప్రవచిస్తూ వుండడమూ, కలహానికి సంబంధించిన గ్రంథాలూ చిల్లర వాఙ్మయమూ చూడ్డమూ – లేక – ఆ విషయమై రాయడమూ, ఎవరయినా సాహిత్యప్రియులు వస్తే గోష్ఠి సాగించడమూ – ఇదీ రామకృష్ణశాస్త్రిగారి కార్యక్రమం.

కవితాపత్రిక నిర్వహణ బాధ్యత వేంకటరామశాస్త్రిగారిది.

ఉత్తర రామచరిత్ర ఆంధ్రీకరణమున్నూ ప్రత్యేకంగా వారిదే.

కలహానికి సంబంధించిన గ్రంథంమాత్రం రామకృష్ణశాస్త్రిగారే నడిపేవారు సాధారణంగా.

గతచరిత్రా, లోపాయికారీ వ్యవహారాలూ నాకు వివరించి చెబుతూ తత్సంబంధమైన రచన సాగించేవారు వారు.

అది తిరుపతివేంకటకవుల గ్రంథాలమీదా రాతలమీదా ఖండనలూ, ఖండనలమీద మండనలూ, యెత్తులమీద పై యెత్తులూ, కుయుక్తులమీద ముఖపిథానాలూ, బుకాయింపులమీద దబాయింపులూ – ఇలా నడిచేది కనక, భాషా మర్యాదలూ, కవిసమయాలూ, ప్రయోగవైచిత్రీ, కథా నిర్వహణంలో మెళుకువలూ, విషయ వివరణలో సొగసులూ, భావప్రకటనలో లాలిత్యమూ, ఔచిత్య విచారణా – ఇలాంటి కవితా సామగ్రి అంతా అనుకున్నంతకంటే త్వరితంగానూ ఆశించినంతకంటే యెక్కువగానూ లభించేది నాకు.

తాము విమర్శించదలచిన గ్రంథభాగం చదివి నన్ను విమర్శించమనేవారు, ముందు వారు.

క్రాసుపరీక్ష ముగిశాక లాయర్లు ఆర్గ్యుమెంటు చేసేటట్టు, దానిమీద రామకృష్ణశాస్త్రిగా రొక ఉపన్యాసం సాగించేవారు.

అప్పుడప్పుడీ చర్చలో వేంకటరామశాస్త్రిగారున్నూ కలవడం వుండేది.

ఇవాళ చర్చించిన విషయానికి, తరుచు రామకృష్ణశాస్త్రిగారూ, ఎప్పుడయినా వారిద్దరూ కలిసీ రేపు గ్రంథరూపం యిచ్చేవారు.

వెంటనే పత్రికలకో ముద్రాశాలకో వెళ్ళిపోయేదది.

వారిద్దరిలో వొక్కరికిన్నీ యింగ్లీషుభాషా వాసన లేశమూ లే దప్పటికి.

అయినా, మన ఆలంకారికుల్లాగ ఏకదేశంగా కాక, ఇంగ్లీషు విమర్శకుల్లాగ గ్రంథం అంతా సర్వాంగీణంగా విమర్శించేవారు రామకృష్ణశాస్త్రిగారు.

అది నాకూ పట్టుబడిందే కాస్తో.

అప్పుడే – ఆ విధంగా నా విమర్శధోరణికి నైశిత్యం అలవడింద ప్రయత్నంగా.

ఇంతకీ, – యథార్థం చెప్పుకోవలసివస్తే, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి పద్యబంధంలో బిగి తక్కువ.

నన్నయ రచన అతివేలంగా చదివివుండిన నాకది మరీ వొదులువొదులుగా కనపడేది.

నాకే కాదు, నన్నయరచన చదివినవారికిన్నీ మాత్రమే కాదు – తిక్కన్న, యెర్రన్న, శ్రీనాథుడు, సోమన్న, తిమ్మన్న, సూరన్న, భట్టుమూర్తి, రామకృష్ణుడు – మొదలైన, పూర్వకవుల రచనలేవి చదివినవారి కయినా యిలాగే తోస్తుంది.

## 22

నేనక్కడ ఆముక్తమాల్యద చదవడమున్నూ తటస్థించిందనుకోనిది.

పరిశీలించుకుంటూ నేనది స్వయంగా చదువుకోవడం కాదు, రామకృష్ణశాస్త్రిగారి దగ్గిర పాఠం చెప్పుకోడమే సంభవించింది.

దాల్లో వొక విశేషం కనపడింది నాకు.

అది వారు విద్వత్కవులు కావడం.

కేవలం పండితుడు పాఠం చెప్పడంలోనూ, పండితకవి పాఠం చెప్పడంలోనూ యెంతో వ్యత్యాసం వుంది.

రచయిత అయినవాడికే అనుభూతం కాగల విశేషం అది.

నేనక్కడికి వెళ్లేటప్పటికి మహారాజులుంగారు పాఠం చెప్పకుంటున్నా రది.

అందుకోసం దినమ్మా మూడయాక కోటకి వెళ్లి, దీపాలు పెడతారనగా యింటికి వస్తూవుండేవారు రామకృష్ణకవులు.

మహారాజులుంగా రొక ప్రతి చేతబుచ్చుకుని చూస్తూనూ వింటూనూ కూచుంటే గురువులే చదివి, అర్థంచెప్పి, విశేషాలు వివరించడమూ – సందేహాలు కలిగితే మహారాజులుంగారు ప్రశ్నిస్తూ వుండడమూ – దానిమీద ముగ్గురూ చర్చ చెయ్యడమూ – ఇదీ ఆ పాఠ ప్రవచనాల పద్ధతి.

ఒక్కొక్కనాడు మిక్కిలీ రసవంతమయిన ఘట్టం ప్రసక్తం అయి, ఆ చర్చ, ఎంతో పైస్థాయిలో జరిగేదిట.

ఆవేళ యెంతో తృప్తిగానూ, యెంతో వుల్లాసంగానూ యింటికి వచ్చేవారు గురువులు.

రాగానే పుస్తకం నాచేతికిచ్చి, కోటలో వ్యాఖ్యాతం అయిన ఘట్టం చదువుకురమ్మని, భోజనానంతరం ఆ చర్చ అంతా నాకు వినిపించేవారు రామకృష్ణశాస్త్రిగారు, రాత్రి.

మొదటమొదట విని వూరుకుంటూవచ్చా న్నేను.

కొన్నాళ్ళు గడిచాక వారి ప్రోత్సాహంతో నేనూ వాదన సాగించడం ప్రారంభించాను.

ఈ విధంగా, ఆ పద్యాలమీదే, మధ్యాహ్నం కోటలో లాగే, రాత్రి యింటోనూ చర్చ జరిగేది.

ఈ కారణంవల్ల నేను గ్రంథం సక్రమంగా చదవ్వలసివచ్చింది.

ఇంకెందు కని రాత్రి నాకది పాఠం చెప్పడమే ప్రారంభించారు రామకృష్ణశాస్త్రిగారు, తరవాత.

ఈ విధానం నాకెంతో వుపకరించింది.

భాషకూ కవిత్వానికీ సంబంధించిన అనేక విషయాలతోబాటు ఆముక్తమాల్యద ఘనతా తెలిసివచ్చింది నాకు.

నా నమ్మకం యేమి టంటే?

ఆముక్తమాల్యదా, వసుచరిత్రా, శృంగార నైషధమూ, పాండురంగ మాహాత్మ్యమూ చదివి, అవగతం చేసుకుని, తన్మూలంగా ఆనందించగలగడం తెనుగువాడికి చెప్పకోతగ్గ అదృష్టం.

అయితే, యిప్పటి యువకులు కీమాట హాస్యాస్పదంగా కనపడుతుంది.

ఇప్పుడు, తెనుగుకవిత్వం చదివి ఆనందించతలిచినవారిలో ఆముక్తమాల్యదను నల్లరాయని నిరసించేవా రెందరో వున్నారు.

వారిలో చాలామంది పట్టభద్రులు.

లేక "ఇంగ్లీషులో పట్టభద్రుల క్కంటే యెక్కువ ప్రావీణ్యం వుంది మా"కను కునేవారున్నూ.

తమ స్థితి మాత్రం గుర్తించుకోరు వారు.

ఆముక్తమాల్యద నల్లరాయయితే, ఆంధ్రసాహిత్యం యెదట తాము క్షీరకంఠులు కారూ?

పట్టభద్రత సిద్ధించే దాకా తాము చదివిన ఇంగ్లీషు కావ్యాలన్నీ సులభమైన వేనా?

సమర్థులయిన గురువులు నూరిపొయ్యకుండా తమకవి బోధపడ్డాయా?

తెనుగులో తమ కలాంటి శిక్షణ వుండిందా మరి?

తెనుగూ వొక సలక్షణభాషే కదా, ప్రత్యేకశ్రద్ధతో బాగా పరిశ్రమ చెయ్యకుండా దాని గాంభీర్యం యేమి అవగాహన అవుతుందీ యెవరి కయినా?

ఈ విచారణ కొంచెమూ చేసుకోకుండా ఆముక్తమాల్యదా – అలాంటివీ నల్లరాళ్ళనడం వివేకమా?

సంస్కృతాంధ్రాలు నేర్చినవారున్నూ కొందరు యువకులిప్పు డిలా అనడం నాకు బాగా తెలుసు.

వారిది మరీ దయనీయమైన అవస్థ.

విద్యలే కాదు, భాషలూ నిరవధికాలని గుర్తించగల పరిణతి లేకపోడమే అందు క్కారణం.

ప్రౌఢభావాలు తెలుసుకోడానికీ, భావాలు ప్రౌఢంగా ప్రకటించడానికీ, భాషలో ప్రౌఢిమ అబ్బివుండాలన్న సత్యం అవగాహన అయివుండకపోడమున్నూ మరొక కారణం.

ఏతావతా:–

**ఆ**ముక్తమాల్యదా, వసుచరిత్రా – ఇత్యాదులు నారికేళ పాకానికి పెట్టింది పేరే, **కాదనను.**

**అ**యితే, సాహిత్య పాటవమూ ఆనందలోలుపతా వుండినవా రవి చదవకుండా **వుండ**లేరు.

వాటిలో అలాంటి సాహిత్యసంపద వుంది, అనంతంగా.

భాషకూ కవిత్వానికీ సంబంధించిన యెన్నో కిటుకులూ మెళుకువలూ వున్నాయి వాటిలో

లోకానుభవమూ, గంభీరశీలసంపదా యెంతెంతో రాశీకృతాలై వున్నాయి, వాటిలో.

మధుర భావాలవల్ల హృదయం స్పందిస్తే, భాషకి సంబంధించిన కూర్పులవల్లా, విరుపులవల్లా బుద్ధి చమత్కృతం అవుతుంది బాగా, అదీ వొక ఆనందహేతువే రసికులకు.

ఇంతకీ, –

కావ్యం వొక జగత్తు.

భౌతిక జగత్తులో లాగే కావ్యజగత్తులోనూ మిట్టపల్లాలుంటా, యనివార్యం అది.

అవి రెండూ అన్యోన్యాశ్రయాలు, మరి.

భౌతికజగత్తు లేనిదే కావ్యజగత్తు లేదు.

కావ్యజగత్తు లేనిదే భౌతికజగత్తుకి వెలుగూ లేదు.

కాక, – గుత్తినుంచి తెంపి ద్రాక్షపండి ట్టేనోట వేసుకోవచ్చు.

అరటిపండు దొరగించాలంటే, గెలనుంచి చేసుకోడమే కాక, వొలుచుకోడంవంటి ప్రయత్నం కొంత కావాలి.

కొబ్బరికాయ దగ్గిరికి వచ్చేటప్పటి కాప్రయత్నమే మరింత యెక్కువ కావాలి.

కవితాపాకాల క్రమమూ యింతే.

లోకంలో ద్రాక్షపండుతో మాత్రమే తృప్తిపడి వూరుకుంటున్నారా అందరూ?

ప్రయత్నపరిమితి యెంతో ప్రయత్న సాఫల్యమూ అంతే అవుతుంది, తెలుసుకోగలిగితే.

సుఖంలో లేదూ ఈ దశాక్రమం?

ఆనందంలో లేదూ ఈ తారతమ్యం?

దానికి మూలమైన రసికతలో మాత్రం లేదూ ఈ అంతురువు?

*"భోజనం దేహి రాజేంద్ర! ఘృతసూపసమన్వితమ్*
*మాహిషం చ శరచ్చంద్రచంద్రికా ధవళం దధి"*

అన్నశ్లోకంలో పూర్వార్ధం అర్థం అయితే చాలదు, ఉత్తరార్ధంలో వున్న గాంభీర్యమూ అవగాహన చేసుకోగలగాలి, సాహిత్యవేత్త అయినవాడు.

కనక, కవిత్వంలో ద్రాక్షాపాకంతో మాత్రం తృప్తిపడగలవారి రసికత వొక రసికతే కాదు.

అంతస్థు లేని దది.

అదయినా లేనివాడికి కవిత్వమే అక్కరలేకపోతుంది, మరి.

కదలీపాకం చదివి ఆనందించగలిగితేనే రసికతకు పరిగణన.

ఇంతేకాదు.

నారికేళపాకం చదివి ఆనందించగలవారి రసికతకే అగ్రతాంబూలం.

ఏమంటే?

ఆ అంతస్థు అందుకోగలవారికే గాని శబ్దశక్తే అవగాహన కాదు, రసనిష్ఠ యెలా యేర్పడుతుందీ?

ఇక్కడ మరో సంగతి కూడా వుంది.

శబ్దార్థపరిజ్ఞానం అతిమాత్రంగా వుండినా చాలదు.

పంక్తి సమన్వయించుకోగల శక్తి వుండాలి.

రసస్వరూపం గుర్తించగల ప్రతిభ వుండాలి.

అది అనుభవించగల యోగ్యత వుండాలి.

విశిష్టభాగ్యాలివి.

సాధన కందేవి కావివి, ప్రాక్తనసంస్కారం వుండాలి, వీటికి.

ఇవన్నీ సంపన్నాలయితేనే పండిత శబ్దవాచ్యతా, రసిక పదలాంఛనప్రాప్తిన్నీ.

అవి లేకపోతేనే వస్తాయి కఠినపాకం అనీ, చీరపీచుక్రమమనిన్నీ చిలకపలుకులు.

## 23

దగ్గిర కూచుని పద్యాలు కట్టమనేవారు రామకృష్ణశాస్త్రిగార ప్పుడప్పుడు, నన్ను.

ఇది వారికి సరదా, నాకు మాత్రం వరదా.

ఛందస్సు తెలిస్తే కవే అయివుండనక్కరలేదే దెవరయినా కట్టెయ్యవచ్చు పద్యాలు.

అయితే, అవి కమ్మెచ్చున లాగినట్టు నడిపించడం వొక విశేషం.

కొలతలు తప్పకుండా సమపాళాల్లో బొమ్మ గియ్యడం యెలాంటిదో, వ్యాకరణ దోషాలు దొర్లకుండా రచన చెయ్యడం యెలాంటిదో, నడక చెడకుండా పద్యం కట్టడమూ అలాంటిదే.

పద్యాని కుండవలసిన యోగ్యతల్లో మొదటి దిది.

నడక అంటే యెగుడు ల్లేకపోడం మాత్రమే కాదు, రెయిలు పెట్టెలకు లాగ అనుస్యూతత యేర్పడాలి.

ఏమంటే?

ఎంత నేర్పుండినా యిటుకలు పేర్చినంతమాత్రాన గోడ కాదు, బెందడీ – సున్నమూ – లేక సిమెంటూ వంటి బంధకాలుండాలి, యథోచితంగా.

అలాగే, గణయతిప్రాసలు సరిపుచ్చి మాటలు బిగించినంతమాత్రానా పద్యం కాదు, ఆ మాటలకు పొందికా, బిగువూ ఏర్పడాలి, విశిష్ట సంధానంతో.

అలా చెయ్యగలగడానికి చాలా సాధన చెయ్యాలి, ప్రత్యేక శ్రద్ధతో.

ప్రౌఢకవుల రచనలు చదవడమూ, శతకాలు – లేక – ఖండకావ్యాలు రచించడమూ, ఆ సాధనాప్రణాళికలో యేక దేశాలు.

దీనికి స్వయంకృషి మిక్కిలీ అగత్యమే, మెళుకువలు తెలియాలంటేనూ, సమయాలు తెలియాలంటేనూ గురూపదేశం వుండాలి, కొంచెమయినా.

ఈ పద్యబంధం సాధించే పద్ధతులు క్షేమేంద్రు డెంతో వివరంగా చెప్పివున్నాడు, సంస్కృతంలో.

నిజంగా మన అప్పకవి కంటే క్షేమేంద్రు డెంతో ధన్యుడు, కవితాసాధన చేసేవాడి కెన్నో మంచిమార్గాలు చూపించా డతను.

అయితే, అతను చెప్పిన పద్ధతులే అవలంబించినా ఎవరికి వీలయిన పద్ధతే వారవలంబించినా పద్యబంధం శ్రద్ధచెయ్యవలసింది; కాని అషామోషీగా అబ్బేది కాదు.

అది పట్టుబడిందా, కవి కాదగిన మనిషి వొక పెద్దమెట్టెక్కేశా డన్నమాటే.

నిజాని కామనిషి యెక్కవలసిన మెట్లింకా వున్నాయెన్నో, వాటి కన్నింటికీ మాత్రం అది పునాది.

అదృష్టవశాన చాలామందే వున్నారిప్పటి యువకుల్లో యీ మెట్టెక్కినవారు; కాని అదే కవిత్వం అనుకుంటున్నారు వారిలోనూ చాలామంది.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి పద్యాల ప్రాచుర్యంవల్ల కలిగిన భ్రమ యిది.

దానివల్ల కలిగే లాభనష్టాలు వారే అనుభవిస్తారనుకోండి. మరి, చెప్పవచ్చిందేమిటంటే?

దగ్గిరవుండి పద్యాలు కట్టమనేవారు రామకృష్ణశాస్త్రిగా రప్పుడప్పుడు, నన్ను.

"నిత్య సాధనతో క్షేమేంద్రుడు చెప్పిన కొన్ని పద్ధతులు దాటేవున్నారు మీరు. కనక, నేనొకటి చెబుతాను. అంటే, భావం నేను చెబుతాను. మొదటి రెండు

చరణాలూ కూడా నేనే కడతాను. తక్కిన రెండు పాదాలూ మీరు కట్టండి" అంటూ కొత్త సాధనలో ప్రవేశపెట్టా రొకనాడు వారు.

తాము క్షేమేంద్రుని గ్రంథా లనువదించేటప్పు డిది తరుచుగా చేయించారు.

చిన్నచిన్న పాదాలు గల వృత్తాల్లో గంభీరభావా లిమడవు, కనక, అలాంటిచోట పెద్దవృత్తాలే వాడాలన్నా డొకచోట క్షేమేంద్రుడు.

ఆ శ్లోకం అనువదిస్తూ ఉత్పలమాల అందుకుని, –

*"అరును నేదు పాదమున క్షక్షరముల్ గల వృత్తమందు న*
*వ్వారిజసంభవాస్యముల వాస మొనర్చెడి వాణి నిల్వగా*
*నేరదు"* – అని రామకృష్ణశాస్త్రిగారు రూరుకోగా, –

*"....ఫుల్లపంకజవని న్విహరించెడి తేఁటి మల్లికా*
*కోరకకోటిపైఁ బదముఁ గూర్పఁగఁ జాలునొకో యొకప్పుడున్"*

అని పద్యం పూర్తిచేశా న్నేను.

నా అనుయాయితకు తృప్తిపడ్డమే కాదు, రామకృష్ణశాస్త్రిగారు, ఈ పద్యం యథాతథంగానే వుంచేశారు, తమ గ్రంథంలో.

ఇలాంటి కారణాలవల్లా, ఇలాంటి పద్ధతులవల్లా పిఠాపురంలో వుండినంతకాలమూ నేను రచన చేస్తూనే వున్నానంటే, అది పద్యరచనే అయిపోయింది ప్రధానంగా.

ఇవాళటి స్థితి చూసుకుంటే, ఆ కాలం అంతా వ్యర్థంగా గడిచిపోయినట్టే అనిపిస్తోంది నాకు; కాని తరవాత్తరవాత, యీ సాధన, అష్టావధానాలు చేశాటప్పుడు నాకెంతో వుపయోగించింది.

నిజమే; కాని నేనష్టావధానాలు చెయ్యడమే వొక వింత.

## 24

అష్టావధాన మన్నా, శతావధాన మన్నా, ఆశుకవిత్వమన్నా నాకెప్పుడూ ప్రీతిలే దేకొంచెమున్నూ.

యతివిషయమే బోధపడలేదు. గాని అప్పకవీయం చదివినప్పుడే – "నిలుకడ వలయుఁ గృతికి" అన్నవాక్యం చూసినప్పుడే నాకీ వైముఖ్యం యేర్పడిపోయింది, వాటిమీద.

నన్నడిగితే కవి అయినవాడికి అవధానప్రక్రియ పతనహేతువు.

అయినా, అంత యిష్టం లేని అష్టావధానమే చెయ్యవలసి వచ్చింది, చాలామాట్లు నాకు.

అది యెలాంటి అగత్యమో తరవాత చెబుతాను, పిఠాపురంలో యిలా వచ్చింది దాని ప్రసక్తి.

ఒకనాడు రామకృష్ణశాస్త్రిగారూ నేనూ చిత్రాడరోడ్డుకి దగ్గిరగా, రెయిలుకట్టకున్నూ పక్కగా పచ్చిక బయట కూచుని వున్నాం.

ఆ చుట్టుపక్కల చెదురువాటుగా బ్రహ్మచెముడు డొంకలున్నాయి.

అది సాయంత్రం, నాలుగు–అయిదు గంటల మధ్యకాలం.

కలకత్తా మెయిలు వచ్చేవేళ ఆరోజుల్లో అది.

అంతకితమున్నూ మే మెన్నోమాట్లక్కడ కూచునేవున్నాం; గాని యెన్నడూ లేనిది, ఆవేళ, వొక డొంకనుంచి బయలుదేరి తెల్లతాచొకటి మాకు నాలుగైదు గజాల దూరాన రయ్యిమని వెళ్లిపోయింది రెయిలుకట్ట దాటి.

నా జబ్బల లావున రమారమీ రెండు గజాల పొడుగుందది.

సుమారు యాభైఅరవై గజాల దూరం అది నడిచిన నడక మనస్సున్నూ నడవలేదు.

దాన్ని చూసి నేను కంగారుపడ్డాను; గాని "మనకి దుశ్చింత లేకపోతే అదీ యేమీ చెయ్యదు మనల్ని" అంటూ నన్నదిమిపెట్టి, శాస్త్రిగారు నిశ్చలంగా కూచున్నారు, నిర్నిమేషంగా దానికేసే చూస్తూ.

ఆ రాత్రి ఆ విషయమయ్యే మాట్లాడుకున్నాం చాలాసేపు మేము.

ఉండుండి "మీ రిప్పు డష్టావధానం చేస్తున్నారనుకోండి. నేనొక పృచ్ఛకుణ్ణనీ అనుకోండి. ఆ తాచుమీద వొక గీతం చెప్పం"డన్నారు శాస్త్రిగారు, సోల్లాసంగా.

నే నప్పుడు చెప్పిందే యీ పద్యం –

*గీ.* **కనులఁబడి యిట్టె యెగిరిపోయినది పాము**
**మింటఁ గికురించి పోయెడి మెరుపువోలె;**
**పాముఁ జూచుట తథ్యము, భ్రాంతి వొడమె**
**రజ్జువా యని తుద కహో రయము పెంపు.**

పద్యం పూర్తికావడం తడువుగా – రామకృష్ణశాస్త్రి గారున్నూ ఆ ఆశుధార మెచ్చుకోడం తడువుగా, నాకో సంగతి జ్ఞాపకం వచ్చింది.

"ఆదిమధ్యం భావనారాయణస్వామిగా"రని పోలవరంలో వొక వకీలు.

వయసులో నాకంటే బాగా పెద్ద ఆయన.

ఒకనాటి సాయంకాలం రాజమహేంద్రవరంలో గోదావరి వొడ్డున కలుసుకున్నాం మేము.

జాతకాలు బాగా చెప్పేవా రాయన, ఆ ప్రసంగంమీదే మా యిద్దరి హృదయాలూ స్నిగ్ధాలయినాయి.

ఆయన బతికివుండినంతకాలమూ మేము దగ్గిరి స్నేహితులంగానే వుండినాము.

నే నెప్పుడు పోలవరం వెళ్ళినా ఆయనతోనే కాలక్షేపం.

ఆయన పద్యాలు కట్టేవారు.

అష్టావధానం అంటే మహాయిష్టం ఆయనకు.

ఉండుండి, వొకనాడు తమ సరదా అంతా నామీదికి మళ్ళించి "కవి నంటావు. అష్టావధానం చెయ్యలేనివాడ వేమి కవివయ్యా నువ్వు?" అంటూ కవ్వించారు నన్నాయన.

కొట్టినంత పనయింది దాంతో నాకు.

అష్టావధానమున్నూ చేస్తేనే "కవి" అన్నమాట.

అప్పటివారి నమ్మకం అది.

ఇంగ్లీషు చదివినవారున్నూ అలా నమ్మేటప్పుడు నేను "కామోసు" ననుకోడం యేమి వింత?

పద్యం కట్టి నల్లమిల్లి సత్తిరెడ్డిగారిచేత "కవి" అనిపించుకున్నందుకు, అష్టావధానం చేసి భావనారాయణస్వామిగారిచేత అది రూఢిపరిపించుకోవద్దూ?

స్వామిగారి మాట నన్నిలా రెచ్చగొట్టింది.

అంతవరకూ సరదా కైనా ఆశువుగా పద్యం చెప్పలేదు; గాని వడిగానే కట్టగలుగుతున్నా నెలాంటి పద్యమైనా.

ఈ దిలాసాతో "ఈమాటు పోలవరం వచ్చినప్పుడు తప్పకుండా అష్టావధానం చేస్తాను, చూసుకోం"డన్నా నావేశంతో.

ఇదంతా జ్ఞాపకం వచ్చింది నా కప్పుడు.

ఇది చెప్పి "ఏమిటి దారి?" అనడిగాను శాస్త్రిగారిని.

అప్పటికప్పుడు కొన్ని పద్ధతులూ సుళువులూ చెప్పి "దసరాలో మేము కోటలో అష్టావధానం చేస్తాం, చూస్తారుగా?" అన్నారు వారు.

ఇక అదే దృష్టి అయిపోయింది నాకు.

మొదణ్ణుంచీ వున్నదే నాకీ భావోద్వేగం.

ఒకప్పు డిది తప్పనీ అనిపిస్తుంది, మరొకప్పుడు వొప్పనీ అనిపిస్తుంది, నాకే.

విషయం మంచిదని నమ్మకం కలగడం – అది నా కగత్యం అని తట్టడం – సాధ్యం అన్న ధైర్యమున్నూ కలగడం – చాలు,

దీంతో నాకు స్థాయీభావం యేర్పడిపోతుంది.

ఇక అదే పనిన్నీ అయిపోతుంది.

అయితే, తమకు సంబంధం లేనివాటికే అడ్డుతగులుతారు కొందరు.

మంచివాటినే హేళనచేస్తారు మరికొందరు.

నాలుక బుజాన వేసుకుని వూళ్లోనే పడతారు, ఇంకో కొందరు.

ఇది లోకస్వభావం.

నే నిది గమనిస్తాను; కాని గణుతించను.

నడుము బిగించి యేటి కడ్డుపడతాను.

నిద్రాహారాలు మరచిపోతాను.

అష్టావధానం విషయ మయిన్నీ యిలాగే చేశాను.

పాఠం మానుకోలేదు.

గురువులతో గోష్ఠి విడిచిపెట్టలేదు.

కాని, ఆ సందర్భాల్లో, అనంతరంగా అష్టావధానం సంగతి జాగ్రతం అవుతూనే వుంది, నా మెదటిలో.

కాలం నిలవదు.

భాద్రపదం తరవాత ఆశ్వయుజం వచ్చితీరుతుంది.

ఎప్పటిలాగే వస్తుంది కూడా.

ఆ సంవత్సరం మాత్రం మరీ పెళ్లివారి నడకలుగా వచ్చింది దసరా.

## 25

ఆ పదిరోజులూ కోటలో వుత్సవాలు జరిగాయి.

వాటిలో నేను చెప్పకోతగ్గవి – గురువుల అష్టావధానమూ, తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారి వీణావాదనమూ, బులుసు రామజోగారావుగారి బలప్రదర్శనమున్నూ.

రామకృష్ణశాస్త్రిగారు చేశా రష్టావధానం.

నా వుబలాటం జ్ఞాపకం వుంచుకుని తమకు దగ్గిరగా కూచోబెట్టుకున్నారు వారు నన్ను.

పేరి పేరయ్యశాస్త్రిగారూ, పురాణపండా మల్లయ్యశాస్త్రిగారూ, దివాన్ మొక్కపాటి సుబ్బరాయడుగారూ, అదిపూడి సోమనాథరావుగారూ, కూచి నరసింహంగారూ పృచ్ఛకుల్లో ప్రముఖులు.

శాస్త్రిగారు చెప్పిన సూత్రం మననం చేసుకుంటూ, బహూ పరిశీలనగా చూశాను, మొదణ్ణుంచీ నేను.

ఎనిమిది పనుల్లోనూ నన్ను బాగా ఆకట్టింది నిషిద్ధాక్షరి.

భయసంభ్రమాలూ కలిగించింది నా కది.

అక్షర నిషేధానికి మల్లయ్యశాస్త్రిగారు పూనుకున్నారు.

వీరూ వారూ కూడా సంస్కృతాంధ్రాల్లో అఖండులు.

విశేషించి మల్లయ్యశాస్త్రిగారు వయోవృద్ధులున్నూ.

ఎత్తుకున్నది కందపద్యం.

రామకృష్ణశాస్త్రిగారు చురుగ్గా మొదలుపెట్టగా మల్లయ్యశాస్త్రిగారు కరుగ్గా యెదురుకున్నారు.

'నిషిద్ధాక్షరి' అంటే, అష్టావధాని ఒక పదంతో ప్రారంభించి పద్యం యెత్తుకుని ఆ పదంలో మొదటి అక్షరం పలుకుతాడు.

ఆ పదంలో రెండో అక్షరం ఫలానా అయివుంటుందని వూహించుకుని అది వెయ్యగూడదంటాడు పృచ్ఛకుడు.

ఇదీ నిషేధం అంటే.

అవధాని మరో అక్షరం వేసుకుని ఆ పదం పూర్తిచేసుకోవాలి.

ప్రతీ అక్షరం దగ్గిరా వుంటుందీ నిషేధం.

ఒక్క అక్షరమున్నూ చెడగూడదు.

చెడితే, నిషిద్ధాక్షరి వొక్కటే కాదు, అష్టావధానమే చెడిందన్నమాట.

అంచేత ప్రతీ అక్షరం దగ్గిరా సంకులసమరమే సాగించుకుంటూ నిరాఘాటంగా ముందుకి చొరుచుకుపోసాగారు రామకృష్ణశాస్త్రిగారు.

ఇది మల్లయ్యశాస్త్రిగారి నుద్రిక్తులను చేసింది.

అది రామకృష్ణశాస్త్రిగారిని సావధానులను చేసింది.

చూస్తూనే వుండగా "యశో వా మృత్యు ర్వా" అన్న అవస్థలో పడ్డారు వా రిద్దరూ.

రెండో చరణంలో యతిదగ్గిరికి వచ్చేటప్పటికి మరీ వుద్రిక్తులయిపోయా రిద్దరూ.

ఒక్క ఆయుధాలే పుచ్చుకోలేదు; గాని వొకరి నొకరు సంహారించుకోడానికి తలపడ్డ మహాయోధు లన్న ట్టయిపోయారు వా రిద్దరూ.

యోధు లయితే ప్రాణా లొడ్డుకుంటారు, పండితులు కనక మానా లొడ్డుకున్నారు, శాస్త్రులవా రిద్దరూ, ఇదే భేదం.

తహతహ లాడిపోయారు సభ్యులందరూ.

ఈ స్థితిలో రామకృష్ణశాస్త్రిగారు "పు" అన్నారు, నిర్లక్ష్యంగా.

వెంటనే "ణ్య" నిషేధించారు మల్లయ్యశాస్త్రిగారు నిర్దాక్షిణ్యంగా.

"పుణ్యము" అనబోయి "ణ్య" నిషిద్ధం కాగా, "న్నె" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు.

అది గుర్తించి "ము" వెయ్యరా దన్నారు మల్లయ్యశాస్త్రిగా రవ్యవధానంగా.

ఆటకట్టిపోయివుండును సామాన్యులయితే.

అందరమూ కట్టిపోయిందనే అనుకున్నాము కూడా.

మల్లయ్యశాస్త్రిగారి మొగాన గర్వరేఖ మెరిసింది, దాంతో.

వేంకటరామశాస్త్రిగారు బహు ఆదుర్దా పడిపోతున్నారటు చూస్తే.

కాని, ఇటు చూస్తినిగదా, దరహాసభాసమానం అయివుంది రామకృష్ణశాస్త్రిగారి ముఖం.

బెల్లించి చూస్తున్నాయి, వారి కళ్లు.

నేను చకితుణ్ణయినా నది చూసి.

ఇంతలో "పు" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు, విలాసగా.

"పున్నెపు" అయిందక్కడికి.

సంతోషమే; కాని మాట పూర్తయిందనుకుంటే మొదలే అయింది మళ్లీ.

ఆ కావడం విషమంగా అయింది, విశేషించి.

అసలు, మూడక్షరాల మాట అందుకోడమే చిక్కులకు కారణం, నిషిద్ధాక్షరిలో.

ఆ మూడో అక్షరం కర్మధారయలోకి దిగిపోడం మరీచిక్కు.

అది పులివాత పడ్డమే నిజంగా.

అయినా, వొక్కొక్కప్పు డది తప్పనూ తప్పదు, సమర్థులయి వారందుకు జంకనూ జంకరు.

కాక, – అష్టావధాని సమర్థుడయితే యిలాంటి ఘట్టాలే పేరుతెచ్చేవి.

వొట్టి సమర్థులు కారు రామకృష్ణశాస్త్రిగా రతిసమర్థులు.

అంచేతనే అలాంటి రాకడ రాగలిగారు వారు.

అయితే, అవధానికి కర్మధారయలోనికి దిగిపోడం చిక్కయితే, పృచ్ఛకుడికి ఉత్తరపదాద్యక్షరం గుర్తించడమున్నూ చిక్కే.

యోగదృష్టి వుంటే తప్ప యెవరూ యేమీ చెయ్యలే రక్కడ.

కాగా, వొక్క క్షణం ఆలోచించి కానిమ్మన్నారు, మల్లయ్యశాస్త్రిగారు, ధోరణి అందక.

దాంతో, రామకృష్ణశాస్త్రిగారి మందహాసంలో ప్రగల్భత పాటమరించింది.

"బ" అన్నారు వెంటనే, బెల్లించి చూస్తూ వారు.

ఎవరికీ అందలేదు ధోరణి.

మల్లయ్యశాస్త్రిగారు చాలా ఆలోచించారు; కాని లాభం లేకపోయింది.

దాంతో "ఎత్తుకున్న మాట యేమిటి?" అన్న ఆకాంక్ష – "కనిపెట్టలేకపోవడమేనా?" అన్న శౌర్యం – "వయస్సూ అనుభవమూ వ్యర్థాలేనా?" అన్న అభిమానం – "సభ్యులేమనుకుంటున్నారో?" అన్న దిగులు – "పడగొట్టితిరా"లన్న కసి – ఇన్ని మానసిక వికారాలు స్పష్టంగా అంకితం అయినాయి వారి మొగాన, ఆ క్షణాన.

ఏమయినా, అలాంటి సందర్భంలో దీర్ఘాలోచనలో మునిగిపోయి వుండడమున్నూ గౌరవాస్పదం కాదు.

కనక "కాని"మ్మన్నట్టు చెయ్యూపేశారు వారు, విధిలేక.

"స" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు కొదమసింహంలాగ, యెగిరిగంతువేసి.

"పున్నెపు బస" అయిందిక్కడికి.

వేంకటరామశాస్త్రిగారి మొగం వికసించింది.

అందరూ ఊపిరి తీసుకున్నారు.

కాని అపాయం దాటలే దింకా.

ఇంకొక గురువుతో గాని ఆ పాదం పూర్తి కాదు.

మూడోపాదం మొదటిమాట మొదటి అక్షరమున్నూ అక్కడ ప్రారంభించవచ్చు.

ఇది మరీ అపాయకరం అవధానికి.

కావచ్చు; కాని వంతు మల్లయ్యశాస్త్రిగారిది.

వారు మళ్ళీ ఆలోచించారు.

"గౌరవం దెబ్బతింటోం"దన్న వుడుకుతో మరీ ఆలోచించారు.

అయినా, ఫలితం అంతే అయింది.

ధోరణి అందలేదు.

కారణం వెనకటిదే – అది పదాది.

తప్పితే పాదాంతపూరణాక్షరం కావడమున్నూ.

అది వొకటే కాదు, లక్షరకాలు.

అయితే, ప్రతీ అక్షరమూ నిషేధించడం గొప్పే; కాని నిషేధించకపోడం మాత్రం తప్పుకాదు.

ఒక్కొక్క చోట నిషేధించడం కూడా చాపలం క్రింద లెక్క అవుతుంది.

కనక, నిషేధిస్తే మాత్రం పకడుగా వుండాలి.

అవధాని పిల్లిమంతరాలు వెయ్యాలి, దాంతో.

ధర్మం యిది కనకా, చేసేదిన్నీ లేదు కనకా, మల్లయ్య శాస్త్రిగారు మళ్ళీ చెయ్యూపేశారు "కాని"మ్మన్నట్టు.

"యా" అనేశారు రామశాస్త్రిగారు, వెంటనే.

"పున్నెపుఁబసయా" అంటూ రెండో చరణం పూర్తి అయిపోయింది.

సభ్యులందరూ దీర్ఘనిశ్వాసాలు విడిచారు, ప్రాణాలు కూడదీసుకుంటున్నట్టు.

ఆందోళనపడుతున్న వేంకటరామశాస్త్రిగారు నిటాగ్గాకూచున్నారు, రామకృష్ణ శాస్త్రిగారిని చూపులతో పొదువుకుంటూ.

ఆ ఘట్టం యిలా జేగీయమానంగా ముగిసినందుకు సభలో వున్నవారందరూ కరతాళధ్వనులు చేశా రెడతెరిపిలేకుండా.

అది, రామకృష్ణశాస్త్రిగారిని ప్రోత్సాహపరచడానికే గాని మల్లయ్యశాస్త్రిగారిని కించపరచడాని క్కాదు.

కాని మల్లయ్యశాస్త్రిగారు తోకతొక్కిన తాచులా అయిపోయారు.

ఉగ్రనరసింహస్వరూపులున్నూ అయిపోయారు.

అయినా, ఏమాత్రపు లోటూ లేకుండా రామకృష్ణశాస్త్రిగారు పద్యం పూర్తిచేసేశారు, ఆడుతూ పాడుతూ.

తక్కిన అంశాలున్నూ అలాగే పూర్తయినాయి, ప్రశంసాపాత్రంగా.

ఆనందం తాండవంచేసింది సభలో.

మరి, విశేషం యేమిటంటే?

పట్టుదలతో మిక్కిలీ ఘూర్ణితం అయిపోయివుండిన మల్లయ్యశాస్త్రిగారి మొగం బహూ ప్రసన్నం అయిపోయిందంతలో.

ఆనందోత్సుల్లమూ అయింది.

"మానవుడు పుంభావసరస్వతి. అతని కెందునా అడ్డులే"దంటూ చిత్తశుద్ధిగా రామకృష్ణశాస్త్రిగారి నభినందించి, సర్వాత్మనా తమ పెద్దతనం ప్రకటించుకున్నారు వారు వెంటనే.

అందుకున్నూ సభ్యులు తమ హార్షం ప్రకటించారు.

అష్టావధానప్రక్రియలో కొన్ని సుళువులు అవగాహన అయినాయి నాకు.

"విలాసగా చేసెయ్యవచ్చు"ననిన్నీ ధీమా కలిగింది.

ఆ రాత్రి, అష్టావధానానికి సంబంధించిన మరికొన్ని వుపాయాలున్నూ చెప్పారు రామకృష్ణశాస్త్రిగారు, నాటి తమ అనుభవాలు వివరిస్తూ.

ఆ వుపాయాలతో బాటు వొక సలహా కూడా చెప్పారు మంచిది "ఎలాంటి సందర్భంలోనూ కూడా మీరు నిషిద్ధాక్షరి చెయ్యడం పెట్టుకోవద్దు" అని.

## 26

నా అష్టావధాన ప్రయత్నాలిలా వుండగా, స్వధర్మప్రకాశినీ పత్రికలో "సతీర్థ్యసంప్రార్థనము" అన్న శీర్షికతో కొన్ని పద్యాలు ప్రకటితా లయినాయి.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పేరితో వచ్చాయవి.

రామకృష్ణ కవులకూ తిరుపతి వేంకటకవులకూ జరుగుతున్న సంకులసమరంలో కొత్తయోధుని సింహనాదం అది.

అయితే, అంతకి ముందూ, దానికి తరవాతా గూడా ఆ కలహంలో ప్రభాకరశాస్త్రిగారి పేరు మరి వినిపించలేదు.

అది యెలా జరిగిందో గాని ఆ పద్యాలు వారి పేరితో రావడం చూసి చాలామంది ఆశ్చర్యపడ్డారు.

అనేకులకు లాగే రామకృష్ణకవులకూ కలిగిందీ విచికిత్స.

మొదట వింతపడ్డారు; గాని, వెంటనే ప్రకృతిస్థులయి, రామకృష్ణశాస్త్రిగారు, వేంకటశాస్త్రిగారి పక్షంగా వారి శిష్యుడు వ్రాసుకువచ్చినట్టే తమ పక్షంగానున్నూ తమ శిష్యుడొకడు వ్రాసుకురావడం అగత్య మనుకున్నారు.

వాటికి బదులు రాయమని నన్ను నియమించారు కూడా.

నా పద్యాలు కవితలో పడ్డాయి "ప్రభాకర పరామర్శము" అని వాటికి శీర్షిక.

ఏకకాలంలో వొక గురువు దగ్గిర చదువుకున్నవారు సహాధ్యాయులు.

ఒక గురువుదగ్గిరే భిన్నకాలాల్లో చదువుకున్నవారు సతీర్థ్యులు.

ప్రభాకరశాస్త్రిగారూ వేంకటరామశాస్త్రిగారూ అలాంటి సతీర్థ్యులు, వేంకట శాస్త్రిగారి దగ్గిర యెవరెంత చదువుకున్నా.

ఈ సందర్భం పురస్కరించుకుని "గురువుగారితో తగువు పడవద్దు" అని వేంకటరామశాస్త్రిగారిని కోరుతూ ప్రభాకరశాస్త్రిగారి పేరిట వచ్చిన పద్యాలవి.

"మా వేంకట రామశాస్త్రిగారికి, మీ వేంకటశాస్త్రిగారు బహుకొద్దికాలం చదువు చెప్పిన గురువుల్లో వొకరు. ప్రధాన గురువులు మాత్రం కారు. కనక, గురు వెవరన్నప్పుడు వేంకటశాస్త్రిగారి పేరు రాదు. కాదంటే, మరి మీ వేంకటశాస్త్రిగారు మా శ్రీపాదవారి దగ్గిరే చదువుకున్నారు గదా, సాహిత్యజ్ఞానం మాత్రమే కాదు, అష్టావధానం చెయ్యడమూ, ముఖ్యంగా చదరంగం అడ్డమూ కూడా మీ గురువుగారికి మా శ్రీపాదవారే నేర్పారు గదా, మరి మీ వేంకటశాస్త్రిగారు మా శ్రీపాదవారిని కాక చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారిని గురువని చెప్పుకుంటారేం?" అని నా పద్యాల సారాంశం.

అయితే, నే నవి రాయడం వేంకటరామశాస్త్రిగారి కిష్టంలేదు.

కవితలో ప్రకటించడం అంతకంటే యిష్టంలేదు.

నేను, తమకూ తమకూ జరుగుతున్న కలహంలో కలగజేసుకోడమే వారికిష్టం లేదు.

అయితే, వారి కీసంగతి తెలిశాటప్పటికే నా పద్యాలు తయారయిపోయాయి.

"నేను రాయమన్నాను" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు.

అంతే.

నా పద్యాలు కవితలో పడ్డాయి.

ప్రభాకరశాస్త్రిగారి పేరుతోనూ మరి జవాబు లేదు, వేంకటరామశాస్త్రిగారూ మరి మాట్లాడలేదు, రామకృష్ణశాస్త్రిగారున్నూ మరి నన్ను దేనికీ ప్రోత్సహించలేదు, కలహం సందర్భంలో.

ఇక్కడ వొక సంగతి చెప్పాలి.

ప్రభాకరశాస్త్రిగారి ప్రతిభాప్రాగల్భ్యాలు జగద్విదితాలు.

వారి యౌగికశక్తిన్నీ బహు విఖ్యాతం అయింది.

వారి యెడల అప్పుడూ మరెప్పుడూ నాకు నిరాదరభావం లేదు.

ప్రతికూలభావం అసలే లేదు.

సర్వతోముఖమైన వారి సాహిత్యప్రజ్ఞచూసి యెంతో సంతోషించినవాణ్ణి నేను.

తరవాత్తరవాత మద్రాసులో వొకమాటు వారి దర్శనం చేశాను.

నేనెంత విశుద్ధహృదయంతో వారి దర్శనం చేశానో, అంత విశుద్ధహృదయంతోనూ – విశేషించి అంత ప్రీతిగానూ నాతో మాట్లాడారు వారు.

ఇటీవల నేను నిర్వహిస్తున్న శ్రీనాథజయంతికి మొదటి సంవత్సరమే వారిని వక్తగా ఆహ్వానించాన్నేను.

ఆ సందర్భములో, సభవారికి వారిని పరిచయం చేస్తూ నా పద్యాలసంగతిన్నీ స్మరించాను.

కాని, ఆ కలహం వూసెత్తడమే వారి కిష్టంలేకపోయింది.

నేను వారి కప్పుడు చేసిన సేవ మిక్కిలీ స్వల్పం.

అదే మహామేరు వన్నట్టు సంతోషించారు వారు.

ఉదారచరితులకు మనలో ప్రభాకరశాస్త్రిగారు మంచి వరవడి.

మన దురదృష్టం, మన జాతికి పుష్టి కలిగించే ప్రయత్నంలోనే వా రకాలమరణం పొందారు.

వారు ఆంధ్రులు కాక మరేజాతివారయినా అయివుంటే, బతికివుండినప్పుడూ, పరమపదించాకా గూడా వారి నాజాతీయులు బహువిధాల పూజించుకుని వుందురు.

## 27

వేంకటరామశాస్త్రిగారు నాకంటే యెనమిదేళ్ళ పెద్దలు.

రామకృష్ణశాస్త్రిగారు రెండేళ్ళ పెద్దలు.

పిఠాపురం సంస్థానంలో ప్రవేశించేటప్పటికి రామకృష్ణశాస్త్రిగారి వయస్సు పందొమ్మిదేళ్ళు.

వారి దగ్గిరికి వెళ్ళేటప్పటికి పందొమ్మిదో యేడు నడుస్తోంది నాకు.

వారిద్దరూ మేనత్త మేనమామబిడ్డలు.

వారిద్దరూ రామడుగు వీరేశ్వరశాస్త్రిగారి దగ్గిర భాష్యాంతం వ్యాకరణం చదివారు.

చామర్తి విశ్వపతిశాస్త్రిగారి దగ్గిర తర్కం చదివారు.

చర్ల నారాయణశాస్త్రిగారి దగ్గిర కావ్యాలంకారాలు చదివారు.

తెనుగువాఙ్మయం బాగా అవలోడన చేశారు.

మహాపండితు లైనారు.

పండితకవు లయినారు.

జంటకవులున్నూ అయినారు.

జైత్రయాత్రకు బయలుదేరారు.

అపారమైన తమ శేముషీధౌరంధర్యం కనబరిచి మొదటి అడుగులోనే పిఠాపురం ఆస్థానకవులయినారు.

ఉత్తరక్షణంలో వారి విఖ్యాతి తెనుగుదేశం అంతటా విస్తరించింది.

అది అదృష్టమే.

మిక్కిలీ ప్రశంసాపాత్రమే.

అయితే, అడుగు కదపడానికి వీల్లేని స్థితి యేర్పడింది.

బంగారంతోనే చేసినా. నవరత్నాలున్నూ పొదిగినా పంజరం అన్నది రామచిలకకు బంధకమే.

వారి పనీ అలాగే అయింది, రాజాస్థాన ప్రవేశంతో.

ఏమంటే?

పండితులకూ కవులకూ దేశాటనం అనివార్యమైన విహితధర్మం.

మానరాని దది.

కీర్తీ, ధనమూ మాత్రమే కాదు, అనేకాలు చూడ్డమూ, అనేకాలు వినడమూ, జ్ఞానం పరిణతం కావడమూ, ప్రతిభ మిక్కిలీ నిశితం కావడమూ వంటి అనుభవాలు కలిగి, ప్రౌఢిమ అబ్బుతుంది వారికి దానివల్ల.

అయితే, మహారాజులుంగారితో నిత్యసాహిత్యగోష్ఠి తప్పనిసరి కావడంవల్ల రామకృష్ణకవుల కది అందరాని పండయిపోయింది.

దీంతో, వారి పాండిత్యమూ కవిత్వమూ స్థానికాలయిపోయాయి.

పత్రిక లున్నాయి, నిజమే.

వారినవి చెయ్యెత్తి దేశానికి చూపించనూ చూపించాయి, లోటు చెయ్యలేదు.

ప్రారంభావస్థలో తిరుపతివేంకట కవులకు లేని అవకాశం అది.

కాని వారికది చాలింది కాదు.

మరేమిటీ చెయ్యడం?

ఉన్నదల్లా యేమిటంటే?

దేశాలు తిరగడం కవులకు ప్రతిష్ఠాకారణం అయితే, తమ సంస్థానకవులు దేశాలుపట్టిపోడం సంస్థానాధీశ్వరులకు అప్రతిష్ఠాకారణం.

దీంతో, పాండిత్యకవిత్వ ప్రకర్షలతోబాటు బాల్యచాపలమున్నూ యెంత వుండినా రామకృష్ణకవులకు అడుగు కదపడానికి వీల్లేకపోయింది.

ఈ స్థితిలో ప్రారంభం అయింది వారికి తిరుపతివేంకట కవులతో రగడ.

ఎంత పెరగాలో అంతా పెరిగిపోయింది.

అయితే, పండితకవిధర్మంగా, వయసుమళ్ళిన తిరుపతివేంకట కవులకే అంత వ్యగ్రోత్సాహం అయితే, నూనూగు మీసాల రామకృష్ణకవుల కెంత వుండనూ?

నిజమే; కాని తిరుపతివేంకటకవులతో మరొకరికీ, రామకృష్ణకవులతోనున్నూ ఇంకొకరికీ యీ కలహం సంభవించి వుంటేనా?

అది కొండా తగరూ ఢీకున్నట్టుండేది.

ఏనుగూ దోమా కుమ్ముకున్నట్టున్నూ వుండేది.

మరి యిది, సింహమూ సింహమూ కలియబడ్డట్టయింది.

సముద్రమూ సముద్రమూ కలపటం అయినట్టయింది.

పర్వతమూ పర్వతమూ కిందామీదా పడ్డట్టున్నూ అయింది.

బాగానే వుంది; కాని అంతకలహానికి కారణం వుందా?

ఉందంటే వుంది, లేదంటే లేదు.

ఇదీ దాని స్థితి.

అయితే, వనదాహం చేసే కార్చిచ్చు ఆదిమస్వరూపం యెంత వుంటుందీ?

అలాంటిదే యిదీనీ.

అది స్వల్పం అనడం పామరుల దృష్టి.

పండితుల దృష్టి వేరు.

పండితకవుల దృష్టి మరీ వేరు.

వారిలోనూ వ్యగ్రోత్సాహుల దృష్టి అంతా వేరే.

వారికి, ధర్మోల్లంఘన మయినా, దురాక్రమణ మయినా నిర్వృద్ధమే చాలు.

మరి ప్రయోజనం?

దానికేం?

తిరుపతివేంకట కవులకు కావలసినంత.

రామకృష్ణకవుల కంతకంటే యెక్కువ.

సాహిత్య ప్రియు లయినవారికి వారి కిద్దరికీ కంటే అధికం.

ఏమంటే?

దాంతోనే తిరుపతివేంకటకవుల ప్రతిభ పామరులకున్నూ బాగా తెలిసివచ్చింది.

రామకృష్ణకవుల ప్రాభవం పండితులకూ పామరులకూ గూడా ఏకకాలంలోనే అవగాహన అయింది, బాగా.

కావచ్చు, అయితే, కవులు జాతీయనిర్మాతలు గదా, మరి ఆంధ్రజాతికి కలిగినదేమిటీ అంటే?

తిరుపతివేంకట కవుల నిరంతర సంచారంతో అదివర కెంత జరిగివుందో, రామకృష్ణకవులు డీకున్న యీ కలహంవల్ల దానికి పదిరెట్లు – వందరెట్లు – వెయ్యిరెట్లు సాహిత్య ప్రచారం జరిగింది, దేశంలో.

చరిత్రకారులు నిర్ధారణచేస్తా రీసంగతి, విపులంగా.

ఇక చెప్పవలసిందేమిటంటే?

ఈ పరిస్థితుల్లో రామకృష్ణకవుల దగ్గిర ప్రవేశించడం నాకెంతో శ్రేయస్కరం అయింది.

తిరుపతివేంకటకవుల దగ్గిర ప్రవేశించినా భంగ్యంతరంగా నాకీమేలు కలిగేదే, సందేహంలేదు.

కాని, రామకృష్ణకవులతో సవయస్కతా వారి నవ్యధోరణీ నాకు విశేషాలయినాయి.

మరి పర్యవసానం?

నా సాహిత్యతృష్ణా, సాహిత్యజ్ఞానమూ హెచ్చడంతోపాటు, నా కవితా ధోరణికి సానపట్టినట్టయింది.

నా దృక్పథం సుపరిష్కృతం కావడంతోపాటు నా జీవితమున్నూ సరి అయినదారిన పడింది.

జీవిత సాఫల్యాని క్కావలసిన అవకాశాలున్నూ పూర్తిగా అమరాయి.

కార్యక్షేత్రం బహూ విశాలం అయింది.

ఆదిలో వచనరచనే యిష్టం అయినా, నల్లమిల్లి సత్తిరెడ్డిగారు యాదాలాభంగా అన్నమాటతో పద్యబంధంలో పడి, స్వయంకృషితో కొంత సాధించి, రామకృష్ణకవుల బోధతో వోహో అనిపించుకోగల స్థితికి వచ్చాను.

కాని, వుండుండి, పద్యబంధం కాదు, వచనరచనే ప్రధానం అన్న భావం స్థిరపడిపోయింది, చివరికి.

దాని క్కారణం, మొదట వేంకటరామశాస్త్రిగారూ, తరవాత యెక్కువగా రామకృష్ణశాస్త్రిగారూనూ.

అదొక వింతసంగతి.

## 28

రామకృష్ణశాస్త్రిగారితో షష్టిగడియలూ కవితావ్యాసంగంలో మునిగివుంటూ వుండిన్నీ, వీలయినప్పుడల్లా, బసలో సవిమర్శంగా విజయవిలాసం చదువుతూ దానిమీద సమీక్ష రాస్తూ వుండినా న్నేను.

విజయవిలాసం అన్నా నిద్రాహారాలు మరిచిపోయే టంతటి ప్రీతే నాకు.

ఆంధ్ర వాఙ్మయంలో వొక ధ్రువతార అది.

శ్రీకృష్ణుడు సత్య కాళ్లమీద పడ్డతరవాత పారిజాతాపహరణం చదవకపోయినా బాధలేదు.

మాయాప్రవరుడు వరూధినిని లోపుచేసుకున్న తరవాత మనుచరిత్ర చదవకపోయినా యిబ్బందిలేదు.

విజయవిలాసం మాత్రం ఆదినుంచి అంతందాకా చదివి తీరవలసిన గ్రంథం.

ఆమూలాగ్రంగా చదవ్వలసిన ఆంధ్ర గ్రంథాల్లో మహా భారతమూ, శృంగార నైషధమూ, ఆముక్తమాల్యదా, వసుచరిత్రా, పాండురంగ మాహాత్మ్యమూ, ప్రభావతీ ప్రద్యుమ్నమూ – ఈ శ్రేణిలో దది.

నాయకరాజుల కాలాన బయలుదేరిన ఆంధ్ర వాఙ్మయానికంతకీ మెరుపుపూస అది.

రసమహితమైన పూర్వ వాఙ్మయానికి పరసీమాను అది.

చదువుకుందా మంటే కొత్త గ్రంథాలు లేనిరోజుల్లో, పంచకావ్యాలే మళ్ళీ మళ్లీ తిరగవేసుకుంటూ వుండిన సందర్భంలో హఠాత్తుగా నా చేతికి వచ్చిందది.

సత్తి సుబ్బారాయడని మా పాలమూరిలో వొక రెడ్డి.

ఆంధ్రసాహిత్యం చవిచూసినవాడూ, రుచిమరిగినవాడూను అతను.

మను వసుచరిత్రలు తరచు తిరగవేస్తూనూ వుండేవా డతను.

పెద్దబ్బాయిగారి శిష్యుడున్నూ.

ఆర్థికంగా అసందర్భస్థితిలో వుండిన్నీ చదవకుండా వుండలేక కొన్నాడత నాగ్రంథం.

వేదం వేంకటరాయశాస్త్రిగారి ప్రచురణ అది.

"సంస్కృత గ్రంథాలే గాని మీరు తెనుగు గ్రంథాలు చూడరా?" అనడుగుతూ నాకు చూపించా డొకనా డతనది.

అదే మొదటిమాటు నేనది చూడడం.

తెలిసినంత తెలిసేది, లేనంతలేదు; కాని రచన చాలా మధురంగా కనపడేది.

మాటలు విరవడం నేర్పు నా కందులోనే కనపడింది, మొదట.

కొన్నాళ్ళపాటు నా కదే నిద్రహారాలయింది.

నా చేతిలోనే నలిగిపోయింది కూడా అది.

ఆ స్థితిలోనే సంభవించింది నేను పిఠాపురంలో చదువుకోడం.

అంతకి ముందే విజయవిలాసంమీద సమీక్ష రాయడం ప్రారంభించివున్నా న్నేను.

అప్పటికే నూరుపావుటావులు మించివుం దది.

ఒకనా డేదో పనిమీద నా గదికి వచ్చిన వేంకటరామశాస్త్రిగారి కళ్ళబడిందది హఠాత్తుగా.

చూస్తూనే చేతబుచ్చుకుని, పని అవుతూనే వెళ్ళిపోయారు వారది "చూసి యిస్తా"నంటూ.

వారి తరవాత రామకృష్ణశాస్త్రిగారు చదివారు.

మరికొన్నాళ్ళకి దాని ప్రస్తావన వచ్చింది మేము ముగ్గురమూ కూచుని వుండగా.

వేంకటరామశాస్త్రిగారే తెచ్చా రాప్రస్తావన.

"ఇలాంటి రచనలు వాఙ్మయాని కెన్నో కావాలి. మీ రచన విలవగల దవుతుంది. కనక, మీరిక పద్యరచన కట్టిపెట్టి, కనీసం తగ్గించి వచనరచన చెయ్యండి" – ఇదీ దాని పండితార్థం.

"మా బావ చెప్పింది బాగుంది" అంటూ రామకృష్ణశాస్త్రిగా రందుకున్నారు, వెంటనే.

"కార్యకారణవిచారణ వద్దిప్పుడు. గద్యరచన అంటే మనవాళ్ళ కిప్పటికీ తృణీకార భావమే వుంది, మాకూ తెలుసు. ప్రారంభంలో మాకున్నూ రచన అంటే పద్యరచనే అన్నభావం వుండేది; కాని యీ కలహం ప్రారంభం అయాక వచనం విలవ మాకు తెలిసివచ్చింది. పద్యబంధం చాలా సుళువు. రసవంతమైన వచనం రాయడం మాటలు కాదు. మీ వచనరచన విలక్షణంగా వుంది. మీకదే తగిందనిపిస్తోంది, మా బావ మాట విన్నమీదట. కనక, పద్యాలకంటే మీరు వచనమే ప్రధానం చేసుకోడం మంచిది" అన్నారు వారు.

రమారమీ పావుగంటసేపు ఈ విషయం నలిగింది.

"మేము కవితాపత్రిక నడుపుతున్నాం గదా? మీరున్నూ సాధ్యమైనంత త్వరలో వొక పత్రిక ప్రారంభించండి. అందులో విమర్శలకే ప్రాధాన్యం యివ్వండి" అనివీ చెప్పారు, రామకృష్ణశాస్త్రిగారు, చివరిమాటగా.

నేను నడపవలసిన పత్రిక పేరున్నూ వా రప్పుడే నిర్దేశించారు.

అయితే, అప్పటికే ప్రబుద్ధాంధ్ర అన్నపేరితో పత్రిక నడపాలని అనుకునివున్నా న్నేను.

రామకృష్ణశాస్త్రిగారు నిర్దేశించిన పేరున్నూ చాలా గొప్పదే.

కాని ప్రబుద్ధాంధ్ర ప్రాప్యం వేరూ, దాని ప్రాప్యం వేరున్ను.

రామకృష్ణశాస్త్రిగారు నిర్దేశించిన పత్రిక నడపడమున్నూ నా వుద్దేశమే కనక, స్వత్వం పోకుండావుండడానికి గోప్యంగానే వుంచుతా నా పేరు నేనిప్పటికి.

పోతే, – రామకృష్ణకవుల మహోపదేశం యుక్తసమయాన అందింది నాకు.

వీరేశలింగంగారి రచనలు కొన్ని చదవడంతో నా కలవడ్డ సంస్కారదృష్టి లోకులకున్నూ కలిగించాలంటే, అందుకు తగ్గది వచనమే.

అంచేత, గురువుల ఆనతి శిరసావహించా న్నేను.

అయితే, పోలవరం వకీలు ఆదిమధ్యం భావనారాయణ స్వామిగారి కిచ్చినమాట నిలుపుకోవలసివుంది కనక, వెంటనే మాత్రం పద్యరచన కట్టిపెట్టలేకపోయాను.

## 29

రామకృష్ణకవుల దగ్గిర నేను చదువుకున్న కాలం మొత్తాని కొక్క సంవత్సరం పైని మాత్రమే.

చదివిన గ్రంథాలున్నూ, – విద్యానాథుని ప్రతాపరుద్రీయం పూర్తిగానూ, వామనుని కావ్యాలంకారసూత్రాలు సగమూ, ఉత్తర రామచరిత్రా శాకుంతలమూ సమగ్రంగానూ ఆముక్త మాల్యద కూడా పూర్తిగానూ, విశ్వగుణాదర్శం మూడువంతులూ మాత్రమే.

లెక్కలు కట్టి చూస్తే మనిషి జీవితంలో కొంచెం తక్కువ రెండు సంవత్సరాలు అంటే సముద్రంలో నీటిబొట్టు వంటిది.

పాండిత్యదృష్ట్యా చూస్తే ఆ చదివిన గ్రంథాలున్నూ బహు తక్కువ.

అయితే, పదిపదిహేను సంవత్సరాలపాటు నిద్రాహారాలు విడిచి నూరుగ్రంథాలు చదివినా లభించనంత పరిజ్ఞానం లభించింది రామకృష్ణకవుల దగ్గిర నాకు.

చదువుల సందర్భంలో "నూరిపొయ్యడం" అనేమాట అక్కడే అవగాహన అయి, అనుభూతమున్నూ అయింది నాకు.

వారు నాయెడల కనబరిచిన ఆత్మీయతను బట్టిన్నీ నేనా కాలం మరచిపోలేను.

పద్యవ్యామోహంలో పడి కొట్టుకుపోతున్న నన్ను వచన రచనకు మళ్ళించడం రూపంగా వారు నాకు చేసిన మహోపకారం ఈ జన్మలోనే కాదు, మరెన్ని జన్మల్లోనూ మరిచిపోలే న్నేను.

ఏమంటే?

వచనరచనతోనే నా జీవితానికి సాఫల్యం.

పద్యాలు కట్టడం నాకు నడమంత్రపు సిరివంటిది.

అంటే, పద్యాలంటే నాకు ద్వేషం అనుకోవద్దు.

భావంతోనే కాక, భాషతో గూడా వీణానిస్వనం లాగ అవ్యక్తానందం కలిగించే పద్యాలు ద్వేషించడం నాకు చేతకాని పని.

ఛందోబద్ధాలయిన సంస్కృతాంధ్రగ్రంథాలు చదివే యీ స్థితికి వచ్చిన నేను, అసలే ద్వేషించలేను పద్యాలు.

నా దృష్టిలో పద్యానికీ గద్యకూ గూడా సాహిత్యపు విలవలు సమానమే.

దురదృష్టంవల్ల తెనుగు గ్రంథాలన్నీ పద్యబంధాలయిపోయాయి.

అన్నీ అంటే, యేకొద్దిగానో వచనరచనలు లేకపోలేదు.

కాని, వాటికి ప్రచారం రాలేదు.

పండితులు వాటికేసి చూడలేదు.

పండితులమీదే దృష్టి పెట్టుకున్న ప్రకటనకర్తలున్నూ వాటిని స్మరించలేదు.

బహూ రసవంతాలయిన ద్విపదరచనలనే యీసడించారు మన పండితులు, వచన రచనల నాదరిస్తారా మరి?

గతానుగతికమైన లోకం, తనకు తానయి పండితుల మార్గం విడిచి సరి అయిన దారి తొక్కగలదా?

కనక, నవ్యదృక్పథంతో సమర్థులయినవా రందుకు పూనుకోవాలి.

అప్పుడు మారుతుంది ప్రజాభిరుచిన్నీ, నదీమార్గం లాగ.

గతానికి ఆగతానికీ కూడా వీరేశలింగంగా రొక్కరే ఆ పని చేశారు.

పంతులుగారి పూనికవల్లనే గద్యవాఙ్మయం విలవలు మనకు తెలిసివచ్చాయి.

పంతులుగారి మధురరచనలతోనే మనకు గద్యప్రీతిన్నీ కలిగింది, బలాపడింది.

జనసామాన్యమున్నూ బాగా కళ్లు తెరచింది.

పంతులుగారు కటిబద్ధులు కాకపూర్వమూ పంతులుగారి వరవడితో గద్య వాఙ్మయమూ పత్రికావాఙ్మయమూ పెద్దయెత్తున ప్రారంభం అయిన తరవాతా, జనసామాన్యం అంతస్థు పెరగడం గుర్తించగలవారి కిది చెప్పనక్కరలేదు.

నిన్నటిదాకా మెయిలువేగంలో వుండిన పద్యవాఙ్మయ ప్రచారం ఇవాళ వొంటెద్దుబండి నడకలో వుండడం చూస్తే, ఆంధ్రజాతి పురోగమనమున్నూ విశదంగా తెలుస్తుంది.

గొప్ప పూర్వకవులకు లేని ఆదరగౌరవాలు ఆధునిక పద్యబంధనిపుణు లనేకు లిప్పుడు పొందుతున్నారు, నాకు తెలుసు.

జనులకు, శిక్షాపూర్వకంగా తెనుగు భాష అభ్యసించవలసిన రాజశాసనాలు లేకపోవడం దానికి మూలకారణం.

సమకాలికత్వం వొక ముఖ్యకారణం.

సంగీతమున్నూ మరో ప్రబలకారణం.

సభల్లో కావ్యపఠనం చేసే పద్ధతి ఇంకో కారణం.

విమర్శకులు ముందుకి రాకపోడం పెద్దకారణం.

పాతదీ కొత్తదీ కూడా మన యూనివర్సిటీలు పద్దెనిమిదో శతాబ్దం నడకలు నడుస్తూవుండడం మరో దురదృష్టం.

అయితే, యిప్పటి పద్యబంధ నిపుణుల్లో మహాకవులు కొందరు లేకపోలేదు.

మహాకవులు కాగలవారున్నూ లేకపోలేదు.

కాని వచనరచన చేసే మహాకవుల సంఖ్య దగ్గిర, పద్యబంధం చేసే మహాకవుల సంఖ్య చాలా స్వల్పం.

ఆంధ్రజాతి అచిరకాలంలోనే సర్వతోముఖంగా వికసిస్తుందనడాని కిదొక సూచన.

దీనికి పునాది వీరేశలింగం పంతులుగారి గద్యరచన.

ఇంచేతనే పంతులుగారి వాఙ్మయసేవ కంత గౌరవం.

అంత ప్రఖ్యాతిన్నీ.

ఆధునికుల్లో మొదట ఈ కొత్తదారి తొక్కినవారు చిన్నయసూరిగారు.

కాని వారి ప్రతిభ సర్వతోముఖం కాదు.

గద్యరచనను ముళ్ళడొంకల్లోకి మళ్ళించిన దోషమున్నూ వారిని కిందికి లాగేసింది.

కాక, – సహజంగా పండితుడే గాని కవి కా డాయన.

అంచేతనే వారికి చెందవలసిన గద్యతిక్కనబిరుదు వీరేశలింగం పంతులుగారికి తక్కింది.

పోగా, – నా శక్తి సంగతి తరవాత చూసుకుందాం, వీరేశలింగంగారి గద్యప్రీతికేదో నా గద్యప్రీతికీ అదే కారణం.

అయితే, పద్యబంధనిపుణులు కొందరు నన్ను పద్యశత్రువుగా భావించడం నాకు తెలుసు.

ఇందుకు నేను సిగ్గుపడ్డంలేదు.

ఎంచేతనంటే?

నాకు కవిత్వం కావాలి.

అది పద్యంలో అనుగ్రహించినా ఆనందిస్తాను, గద్యంలో ప్రసాదించినా ఆనందిస్తాను.

నేనే కాదు, ఏ రచనా చెయ్యలేని సాహిత్యవేత్తలూ, రసానందం మరిగిన సాహిత్యప్రియులూ కూడా ఇంతే చేస్తారు.

నన్నయ్యా, తిక్కన్నా, ఎర్రన్నా, శ్రీనాథుడూ, పోతన్నా, సోమన్నా, తిమ్మన్నా, వెంకన్నా మొదలైన మహాకవుల అసాధారణ రచన లాదరిస్తున్నది వారు, పద్యాలు కట్టే ఈ నవీనులు కారు.

నా పద్య ప్రీతిన్నీ అలాంటిదే.

అయితే, అప్పుడూ యిప్పుడూ వచన రచనలో అనుభూతం అవుతున్న ఆనందం పద్యరచనలో నా కెప్పుడూ కలగలేదు.

వచన రచన, ఆదిలో గ్రాంథికంలో చేసినప్పుడూ, వ్యావహారికంలో చేస్తున్న యిప్పుడూ కూడా నాకు సమానంగానే వుం దీఅనుభూతి.

## 30

కాలక్రమాన, నేను, వ్యావహారికంలో రచనలు చేస్తానని రామకృష్ణశాస్త్రిగారనుకుని వుండరు.

వేంకటరామశాస్త్రిగారున్నూ అప్పు డనుకుని వుండరు.

తరవాత మాత్రం నా వ్యావహారిక రచనలు చాలా చూశారు వారు.

చూడ్డమే కాదు, చదివారు.

చదవడమున్నూ కాదు, నా వీరపూజ చదివి యెంత ఆనందించారో నా వడ్లగింజలు చదివిన్నీ అంతా ఆనందించారు.

తెచ్చిపెట్టుకున్న సాహిత్యప్రీతి కాక స్వయంభువు అయినవా రెవరైనా యింతే చేస్తారు.

సాహిత్య ప్రియులకు కావలసింది రసం.

రసం అన్నది వాక్యనిర్మాణంలో పొటమరిస్తుంది గాని శబ్దరూపాల్లోనూ, క్రియారూపాల్లోనూ కాదు మరి.

వ్యావహారికంలో అయితే రచన నీరసం అవుతుందనుకోడమూ, గ్రాంథికం అయితే చాలు రసమహితం అయిపోతుందనుకోడమూ అవివేకానికి రెండు నిదర్శనాలు.

గ్రాంథికమే వ్యాకరణయుక్తం అయివుంటుందనీ, వ్యావహారికం వ్యాకరణదూరం అనీ అనుకోడం అవివేకానికి మూడో నిదర్శనం.

అసలు, వ్యాకరణం అన్నది వొక్క శబ్దరూపాల్లో మాత్రమేనా వుంటుంది?

సంధి వ్యాకరణసంబంధం కాదూ?

కర్తకర్మక్రియలు వ్యాకరణసంబంధాలు కావూ?

అకాంక్షా, అన్వయమూ వ్యాకరణసంబంధాలు కావూ?

కారకాలు వ్యాకరణసంబంధాలు కావూ?

సమాసాలూ, అవ్యయాలూ, ధాతువులూ, ప్రయోగాలూ వ్యాకరణబంధాలు కావూ?

వ్యావహారికరచనల నీసడించేవారికి నిజంగా అవి అర్థంకాకుండానే వున్నాయా?

ప్రయోగమూలం కదా వ్యాకరణం?

కర్రచేత కొట్టాడనీ, నిన్న వస్తాననీ, రెండు మనుషులనీ, రాము డరణ్యావాసం చేసిందనీ, తాటక మహాబలవంతుడనీ యే వ్యవహారిక రచయిత అయినా రాస్తున్నాడా?

వ్యాకరణం అంటే యేమిటో యెరగని – వ్యాకరణం అంటూ వొకటుందనికూడా యెరగని పామరుడయినా అంటున్నాడా పోనీ?

ఒక్క శబ్దరూపాల్లో తప్ప – ధాతురూపాల్లోనూ తప్ప, గ్రాంథికవాదులు తమ వని చెప్పకుంటున్న శబ్దచింతామణీ, ప్రౌఢవ్యాకరణమూ, బాలవ్యాకరణమూ యే గ్రాంథికవాది వ్యావహారిక వాదికంటే బాగా అనుసరిస్తున్నాడూ?

ఇడియమ్సు అంటారే యింగ్లీషులో, అవీ పలుకుబళ్లూ మా రచనల్లోకంటే యే గ్రాంథికవాది రచనల్లో సరిగా వుంటున్నాయీ?

ఒక్క టడుగుతున్నాను గ్రాంథికవాదులను.

ఏ కారణంవల్ల మీకిష్టం లేకపోయినా వ్యావహారికం మీరు స్వీకరించవద్దు.

ఆత్మద్రోహమూ చేసుకోవద్దు.

ఉన్నదున్నట్టు చెప్పండి.

వ్యావహారికరచనలు చదివినప్పుడు మీకు రసానుభూతి కలగడంలేదూ?

పోనీ, గ్రాంథికం అయిన ప్రతీరచనలోనూ మీకది సిద్ధిస్తోందా?

"ఆ సిగ్గుకు సిగ్గు లేద"న్నాడే, చేమకూర వెంకన్న, అక్కడ నుగాగమా చూసుకోవలసింది రసస్ఫూర్తా?

రసం ప్రధానంగా చూసుకుంటే కూచిమంచి తిమ్మన్న వంటి కవిసార్వభౌముల రచనలకు లెక్కా జమా?

ఏతావతా:–

వ్యావహారికరచనలో రసం వుందో లేదో అది స్పందనశీలమైన హృదయం చెబుతుంది, మనోవికారా లధిగమించలేని బుద్ధి కాదు.

రచన వ్యావహారిక మయినా గ్రాంథికమయినా మహా కావ్యం అవునో కాదో అది ప్రగమనశీలమైన కాలం చెబుతుంది, ఆ కాలం అధిగమించలేని పండితుడు కాదు.

భావాలకు రూపకల్పన చెయ్యడంలో శబ్దాలకు అర్థనిర్ణయం చేస్తాడు కవి.

ఆ అర్థం స్వీకరించే పండితుడు నిఘంటువులు రాసుకోవాలి.

లోకసిద్ధమైన శబ్దానికి సభ్యత కలగడానికి సంస్కారమున్నూ చేస్తాడు, అవసరమైతే కవి.

ఆ సంస్కారం ఆధారంగా వ్యాకరణసూత్రా లల్లుకోవాలి వైయాకరణి.

జీవద్భాషకు నియామకుడు కవే గాని పండితుడూ వైయకరణీ కాదు.

కవి అంతస్థు పండితుని అంతస్థుకంటేనూ, వైయాకరణి అంతస్థుకంటేనూ చాలా పైది.

కవి అడుగుజాడలే శరణ్యం పండితుడికీ వైయాకరణికీని.

రసికుల కానందానుభూతి కలిగించడానికి రచన చేస్తాడు కవి.

జనులకు శీలసంపద అలవర్చడానికి ధర్మనిర్ణయం చేస్తాడు కవి.

జాతిని సన్మార్గాన నడిపించడానికి శాసనం చేస్తాడు కవి.

కవి స్రష్ట.

కవి స్వతంత్రుడు.

కవి నియంత.

కవి భాషాసాహిత్యాలకు సమ్రాట్టు.

ఈ సత్యం అవగాహన కాని మనిషికీ, ఆ మనిషిని అదుపాజ్ఞల్లో పెట్టలేని జాతికీ అభ్యుదయం లేదు.

వ్యావహారికం విషయమై మా వేంకటరామశాస్త్రిగారూ నేనూ చాలా మాట్లాడుకున్నాం చాలామాట్లు.

వారి గ్రాంథికాభిమానమూ, గ్రాంధికవాదమూ మహోదారాలు, సంకుచితాలు కావు.

పిఠాపురం యువరాజులుంగారి వ్యావహారికరచనలకు వారి ఆమోదముద్ర వుందని తెలుసుకోగలవారికి భాష విషయమై వారి సిద్ధాంతం యెలాంటిదో వేరే చెప్పనక్కరలేదు.

జయపురాధీశులు శ్రీ విక్రమ దేవవర్మగారు గ్రాంధికవాదులన్న సంగతి సర్వజనవిదితం.

ఉత్తరాలలో కూడా బండిఱాలూ, అరసున్నలూ వాడేవారు, వారు.

నా వడ్లగింజలు మొదటిమాటు అచ్చువేయించుకోడానికి పద్దంతా డబ్బిచ్చారు, నా రాజరాజుకృతిన్నీ స్వీకరించి నన్ను సత్కరించారు, మరి యిదేమిటీ?

ఒ–క్క–టే మాట.

రసానందపారవశ్యం అనుభవించగల యోగ్యత వుండాలి, మనిషికి.

సాహిత్య ప్రస్తావనలో ఆ మనిషికే పరిగణన.

కాక:—

అభిప్రాయాలు భేదించవచ్చు, తమ అభిప్రాయాలే తా ననుసరించనూ వచ్చు; కాని భిన్నాభిప్రాయా లుండగూడదనడమూ, భిన్నాభిప్రాయాలు గమనించకపోడమూ మౌర్ఖ్యం.

నా నమ్మకం యేమిటంటే?

ఇప్పటిదాకా బతికేవుంటే, మా రామకృష్ణశాస్త్రిగారు, అగత్యం అయితే పిఠాపురం మహారాజులుంగారి ఆస్థానం అయినా నిర్లక్ష్యంగా విడిచిపెట్టి వ్యావహారికంలో రచనలు సాగించివుందురు లక్షణంగా.

అలాంటి ప్రగమనశీలం వారిది.

అది యేమయినా, నాకు వచనరచనాదీక్ష యిచ్చి వా రూరుకోలేదు, తామున్నూ ప్రారంభించా రది.

వచనరచనమీదలాగే యింగ్లీషుమీదా పడింది వారిదృష్టి.

నే నక్కడ వుండిన చివరి రోజుల్లో, వారు గడించిన యింగ్లీషు భాషాపరిజ్ఞానం చూసి, పట్టభద్రులున్నూ అనేకులు చకితు లయిపోయారు.

చిన్నప్పణ్ణుంచీ యింగ్లీషుమీద నాకూ వుందలాంటిదృష్టి; కాని ఆత్మనేపది కాక పరస్మైపది అయిపోయింది, నా కది.

నే నక్కడ వుండినప్పుడే కాకరపర్తి పక్కవూరు పెరవలి గ్రామంనుంచి విద్యాభిక్ష కోరి రామకృష్ణకవుల దగ్గిర కొక యువకుడు వచ్చాడు.

పేరు వేమూరి వేంకటనారాయణ, మాఘం చదువుతూ వచ్చా డక్కడికి.

నాకంటే చిన్న అతను.

రామకృష్ణశాస్త్రిగారు చెప్పగా నా గదిలో చోటిచ్చా నతనికి.

తెలివైనవాడు, చురుకైనవాడు, సౌమ్యుడు, స్నేహపాత్రుడున్నూ అతను.

అయితే, మాఘం చదవడం అంటే గురువుగారి దగ్గిర కూచుని కొత్తశ్లోకం చదివి, సంస్కృతంలో అన్వయించి, వ్యాఖ్యానపంక్తులు చర్చించడం.

చురుకైనవాళ్ళకు కుమారసంభవంలోనూ, సామాన్యులకు మేఘసందేశంలోనూ ప్రారంభం కావలసిన స్థితి అది.

భారవీ మాఘమూ చదివే విద్యార్థికి గురువు చెప్పవలసినవి విశేషార్థాలూ, ధ్వనులూ, శాస్త్రమర్యాదలూ – ఇత్యాదిగా సమగ్రబోధ కాని, తెనుగులో ప్రతిపదార్థం చెప్పడమూ, ఆకాంక్ష అందిస్తూ అన్వయం నడిపించడమూ, శబ్దాలూ సమాసాలూ – ఇలాంటివి చెప్పడమున్నూ కాదు.

కొత్తపాఠం స్వయంగా సమన్వయించుకునే గురువుదగ్గిర కూచోవాలి విద్యార్థి.

మాఘం చదివే విద్యార్థి అంటే తన గురువు దగ్గిర ప్రారంభకావ్యాలు చదివే విద్యార్థికి "చిన్న మేష్టారు."

కాని చూస్తిని గదా, అన్వయం దాకా యెందుకూ, పదక్రమం – ఏమాట తరవాత యేమాట అందుకోవాలో కూడా తెలియదు వేంకటనారాయణకు.

రఘువంశంలో ప్రారంభం కావలసిన స్థితి యెవరి కయినా అది.

అదిన్నీ లేకపోడం చూసి తెల్లపోయా న్నేను.

దీనికి సాయం, కొత్తశ్లోకం చూసుకోడంలో తనకి కొంచెం సాయం చెయ్యమని కోరాడు నన్నతను.

అంటే, మొదట నేను స్థూలంగా పాఠం చెబితే, తరవాత, గురువుగారి దగ్గిర సూక్ష్మంగా పాఠం చెప్పేకుంటా డన్నమాట అతను.

కష్టమూ లేదు, నష్టమూ లేదు, చెప్పనేవచ్చు.

అయితే, మాఘం చదివే వాటి కలాంటి సాయం అగత్యం అయితే ఆ మనిషి యిక తేలడం అంటూ వుంటుందా?

చూసిచూసి "నీ కర్థజ్ఞానం కలగడం యెప్పుడు, సత్యనారాయణవ్రతకథ అయినా చెప్పగలడానికి శక్తి రావడం యెప్పుడు, సంస్కృతజ్ఞానంతో ఏదోవిధంగా పొట్టపోసుకో గలగడమున్నా యెప్పు" డని అతణ్ణే అడిగాను సాహసించి నే నొకనాడు.

అమాయికు డతను "నా తపనా అదే" అన్నాడు, దాపరికం లేకుండా.

గుండెల్లో కలుక్కుమంది నాకు.

పోనీ అతను సోమరి యేమో అంటే యెంతమాత్రమూ కాడు.

ఇక వున్నదల్లా యేమిటంటే?

అతనికీ సంస్కృతసాహిత్యానికీ చుక్కెదురు.

అంటే దానిమీద రుచిలే దతనికి.

రుచి లేదు కనక అతని కంటడంలే దది.

అంటడం లేదు కనక గుంటపువ్వులు పూస్తున్నా డతను.

నే నది గుర్తించాను.

నాక్కావలసిన విద్య నన్ను మావాళ్ళు సాధించుకోనివ్వలేదు, అతనివాళ్ళు అతనేమి చదువుకున్నా అడ్డుపెట్టరు; కాని తనకి కావలసిన విద్య యేదో అత నెరగడు – ఇదీ నాకు అతనికీ భేదం.

దీంతో అతని స్థితి గుర్తించి "సాయపడగలమా?" అని బాగా ఆలోచించాను.

ఒకదారి కనపడింది.

రామవరం అని దక్షిణంగా మావూరి కొక సమీప గ్రామం.

ఆ గ్రామానికి చెందిన బుద్ధవరపు రామరాజు వెంకటరాజుగార్ల కుటుంబం కొంత, పిల్లల చదువుకోసం ఆ వూళ్ళో ప్రవేశించి వుం దప్పుడు.

మాకూ ఆ కుటుంబీకులకూ చిరపరిచయం.

ఆ పిల్లల్లో కొందరు మా పొలమూరికే చెందిన తటపర్తి నరసింహంగారి దౌహిత్రులు.

వారిలో పెద్ద – అంటే రామరాజుగారి కుమారుడు థర్డుఫారం చదువుతున్నా డప్పుడు.

పొలమూరి సిద్ధాంతిగారి అబ్బాయిని కనక ఆ కుటుంబానికీ, అప్పటికే నేను కవిని కనక ఆ పిల్లలకూ నేనంటే యెంతో ఆదరభావం.

ఈ చనువు పురస్కరించుకుని, ఆ పిల్లల దగ్గిర వున్న వెనకటి తరగతి పుస్తకా లడిగి పుచ్చుకుని, ఆ థర్డుఫారం విద్యార్థిచేతనే వేంకటనారాయణకు చెప్పించా నింగ్లీషు.

ఒక్క గంటలో ఏ.బి.సి.డీలు గుర్తుపట్టేశా డతను.

ఒక్క నెల తిరిగేటప్పటికి గురువుతో అతని అంతస్థున మాట్టాడసాగా డింగ్లీషు. దీంతో అతనికోసం మరో గురువుని చూడవలసివచ్చింది నేను.

శ్రీపాద సూర్యప్రకాశంగా రని ఆ వీధిలోనే నే నెరిగిన వొక పట్టభద్రులు. జగత్ప్రసిద్ధతార్కికులు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారి పెద్ద కుమారు లాయన. బహూ సౌమ్యులు.

తరుచు లక్ష్మీ నరసింహశాస్త్రిగారి దర్శనం చేసుకుంటూ వుండడంతో వారితోనూ పరిచయం యేర్పడివుంది నాకు.

వేంకట నారాయణను చూపించి పరిస్థితులన్నీ చెప్పి అనుగ్రహించవలసిందని కోరా న్నేను వారిని.

వా రంగీకరించా రందుకు.

దీనికి సాయం, ఆ యింగ్లీషుపరిచయంతో ఇంగ్లీషు చదివే ఆ వీధి కుర్రవా ళ్ళందరితోనూ సాహచర్యం అబ్బిం దతనికి.

ఒక విధంగా వారిని కూడా అందరినీ గురువులుగానే భావించుకున్నా డతను. వారు లెక్కలు చేసుకుంటూ వుంటే అతనూ చేశాడక్కడ కూచుని.

ఇంగ్లీషు నేర్చుకుంటూవుంటే, అతనూ వల్లించాడు వారితోపాటు.

వా రాటల్లో దిగితే తాను మాత్రం అందుకు సిద్ధపడక ఆడుతూపాడుతూ సర్వ విషయాలూ ఆకళించుకున్నాడు, పువ్వుపువ్వునా తుమ్మెద మకరందం సేకరించుకునే టట్టు.

తరవాత వొకటిరెండు మాసాల్లోనే హైస్కూల్లో క్లాసు పరీక్షలు జరిగాయి. సూర్యప్రకాశంగారి ప్రోత్సాహంతో అందుకు సిద్ధపడ్డాడు వేంకటనారాయణ.

అప్పు డక్కడి హైస్కూలు హెడ్మాష్టరు కూచి నరసింహం పంతులుగారు.

మూడు మాసాల పరిశ్రమతో, అంతవరకూ ఇంగ్లీషు ముక్కూమొగమూ యెరగని వేంకటనారాయణ ఆ పరీక్షల్లో కూచుని థర్డుఫారం పాసైనాడు.

"ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః."

ఇలాంటి సందర్భాలు చూసే కాళిదా సీసూక్తి వెలయించి వుంటాడు.

అయితే, గత సంవత్సరం తాలూకు జీతం అంతా చెల్లిస్తే అతణ్ణి పై తరగతిలో చేర్చుకుంటా మన్నారు నరసింహం పంతులుగారు.

పాఠశాల నిబంధనల ననుసరించి అది అంతే అయివుండవచ్చు; కాని ఆసక్తే గాని ఆ శక్తి యేదీ వేంకట నారాయణకు?

పుస్తకాలే పాతవి సంపాదించుకోవలసినవా డతను, ఏ నెల కానెలదే కట్టలేడే, సంవత్సరం జీతమూ వొక్కమాటు గుమ్మరించాలంటే అతని తరమా, పోనీ అంటే, నా వశమా?

దిగ్భ్రాంతులం అయిపోయాం మేమిది విని.

రుచి లేక ఆ చదువు దూరం కాగా, డబ్బు లేక యీ చదువు దూరం అయిపోయే స్థితి వచ్చింది.

ఒక్క వేంకటనారాయణే కాదు, ఎంతెంతలేసి పరీక్షల్లోనూ మిక్కిలీ సుళువుగా నెగ్గెయ్యగల యువకు లింకా వేలూ లక్షలూ వున్నారు దేశంలో; వారి ప్రతిభ అంతా దేశానికీ జాతికీ సంచితం చేసిపెట్టగల ధర్మసంస్థలే లేవు, మనకిప్పుడు.

నిజమే; కాని మనజాతి కిది కొత్తసంగతి.

విద్యాదానం వుందే గాని పాఠశాలదానం లేదు మనలో యెప్పుడూ కూడా.

విద్యాదానం పండితకర్తృకం; సంపన్నులు చెయ్యవలసిందీ, చెయ్యగలిగిందీ కానేకాదు.

పండితులు విద్యార్థులకు విద్యాదానం చెయ్యడమూ, సంపన్నులు అన్నదానం చెయ్యడమూ – ఇదీ మన సంప్రదాయం.

మన దేశంలో, విద్య, యేయుగంలోనూ కూడా ప్రభుత్వపరంగా లేదు.

గురుకులవాసమే మన విద్యాసంస్థ.

కానీఖర్చులేకుండా సకలశాస్త్రాలూ సాధించుకునేవారు మనవాళ్ళు.

గురుకులవాసం చదువుతోనే మనవాళ్ళు మహాపండితు లయినారు, శాస్త్రకారు లయినారు, చక్రవర్తు లయినారు, మహామంత్రు లయినారు, ద్వీపద్వీపాంతరాల్లోనున్నూ మన సంస్కారం వ్యాపింపజేశారు.

మనదేశంలో, ప్రతీపట్నంలోనూ – పెద్ద పెద్ద పల్లెల్లో కూడా అన్నసత్రాలు వెలిశాయి గాని, పాఠశాలా భవనాలు వెలియలేదు, పరకాయించి చూస్తే.

పండితులు తమకి తామే విద్య చెప్పేవారు విద్యార్థులకు.

అగ్రహారాలూ, వృత్తులూ, మాన్యాలూ, వార్షికాలూ యిచ్చి ప్రభువులూ, సంపన్నులూ ఆ పండితులను పోషించేవారు, సేవ్యసేవక సంబంధం మాత్రం పెట్టుకోకుండా.

విశ్వవిద్యాలయాలూ వుండేవి; కాని అవీ పండితుల స్వత్వాలే ప్రభుత్వానివి కావు.

ఆ విశ్వవిద్యాలయాలున్నూ ప్రభువులూ, సంపన్నులూ పోషించేవారు.

విద్యార్థులకు అన్నం పెట్టి, బట్ట లిచ్చి విద్య చెప్పేవవి.

వాటి నిర్వహణవిధీ, బాధ్యతా ప్రధానాచార్యునివి.

ఆయనకే కులపతి అని బిరుదు.

పదివేలమందికి అన్నవస్త్రాలిచ్చి విద్య చెప్పేవాడే కులపతి అని మనవారి నిర్వచనం.

ఆ కులపతుల యెదట రాజులూ, మహారాజులూ, చక్రవర్తులూ చేతులు కట్టుకుని మసిలేవారు, ఏలోటూ లేకుండా మాత్రం చూస్తూ.

ఓనమాల దగ్గిర్నుంచీ విద్యార్థులు నెలనెలా ముడుపు చెల్లించి నేర్చుకోడమూ, ఉపాధ్యాయుల జీవితాలు దొరతనంవారు తమ గుప్పిట్లో యిరికించుకుని వుండడమూ, పరీక్షల యేర్పాటూ, చివరకి విద్యార్థుల్లోనూ, ఉపాధ్యాయుల్లోనూ, పైవారిలోనూ రకరకాల లుకలుకలూ – ఇదంతా మన కాంగ్లేయులు ప్రసాదించిన నవనాగరికత.

పోనీ, ఆ ఆంగ్లేయులు వెళ్ళిపోయారు గదా – ప్రభుత్వయంత్రం మన చేతుల్లోకే వచ్చింది కదా, విద్యావిధానంలో మళ్ళీ మన సంప్రదాయం ప్రవేశపెడతారా మనవాళ్ళు?

# 31

చూసిచూసి నే నొకనాడు దివాన్ మొక్కపాటి సుబ్బారాయడుగారి దగ్గిరికి తీసుకువెళ్ళా నతణ్ణి.

ఆర్ద్ర హృదయులు వారు.

విద్యార్థుల చదువుల నిమిత్తం ఆ విద్యార్థులకంటే యెక్కువగా ఆత్రపడిపోయేవారు వారు.

కనక, జీతం దమ్మిడీ అయినా యివ్వనక్కరలేకుండా అక్కడి హైస్కూలు చదువంతా పూర్తిచేసుకోడాని కవకాశం కలిగించారు, వెంటనే వా రతనికి.

అది ముత్యపుచిప్పలో పడ్డ స్వాతిచిను కయింది.

పరీక్ష తప్పడం అన్నది లేకుండా చరచరా పైకివెళ్ళి స్కూల్ ఫైనల్ పరీక్షలో నెగ్గేశాడత నేకబిగిని.

తుప్పుపట్టిపోయిన కత్తిని సానపెట్టిన ట్టయింది దాంతో అతని పని.

అయితే, సామాన్య మర్యాదలకు భంగం లేకుండా యేదో విధంగా పొట్టపోసుకోడాని కాచదువు చాలు; కాని విద్యాతృష్ణ తీరలే దతనికి.

తీరకపోడమే కాదు, హెచ్చిన్నీ పోయింది.

ఏమంటే?

"హరిః ఓ"మ్మనడానికే ఆలస్యం అయిందే గాని "ఇతి శ్రీ" అనడాని కింకా సమయం రా లేదతనికి.

"ఎందుకు వచ్చిన కావ్యాలురా బాబూ?" అంటూ కుసిల్లిపోయేవాడల్లా "బి.ఏ. కాలేకపోతే అదేం బతుకూ?" అంటూ తహతహ లాడిపోసాగా డతను.

ఏమి చెయ్యడానికీ తోచక చివరికి మావూరున్నూ వచ్చాడు వెతుక్కుంటూ.

నే నేమయినా ఉపాయం చెబుతా నని అతని ఆశ.

అయితే, అంతకాలం పిఠాపురంలో వుండి చదివినవాడికి, తాను చదివిన హైస్కూలులాగే కాకినాడ కాలేజీకూడా పిఠాపురం మహారాజులుంగారిదే అని తెలియకుండా వుంటుందా?

అది తెలిసినవాడికి అదిన్నీ సుబ్బారాయడుగారి చేతిలోదే అని వేరే చెప్పాలా?

నిజమే; కాని వేంకటనారాయణ తెలివితేటలు శంకించడం కా దిక్కడ మన ధర్మం.

లోకంలో, చాలామందికి, చాలా సందర్భాల్లో తటస్థిస్తూనే వుంటుం దిలాంటి స్థితి.

అజ్ఞానం కా దిది, ఏకాగ్రత.

ఒక్క యేకాగ్రతా కాదు, వ్యగ్రతాను.

ఈ అవస్థలో మనస్సొకచోటా నిలవదు.

ఆలోచన చెయ్యబోతుంది; కాని రూపుకట్ట దది.

చివరి క్కావలసిన పని జరగదు.

"చంకల్లో పిల్లవాణ్ణి పెట్టుకుని వూరంతా వెతికిందటో యిల్లా"లన్న సామెత కిదే మూలం.

కాక; – దుర్యోధనుడి తొడలు విరగ్గొడతా నని తన శపథమా?

ద్వైపాయనహ్రదం దగ్గిర జరుగుతున్నది అటో యిటో తేల్చివేసే చివరి యుద్ధమా?

మరి, కృష్ణుడు సన్నచేస్తేగాని భీముడు గదతో దుర్యోధనుడి తొడలమీద బాదలేకపోయాడేం?

అలాంటిదే యిదీని.

ఆ అవస్థలో పడే మా వూరు వచ్చాడు వేంకటనారాయణ.

వచ్చిన ఉత్తరక్షణంలోనే ఉపాయం చెప్పి నే నతణ్ణి పంపేశాను.

కాకినాడ కాలేజీ సంగతి జ్ఞాపకంచేసి మళ్ళీ సుబ్బారాయుడుగారి నాశ్రయించమనే ఆ వుపాయం.

పిఠాపురం అంటే, సుబ్బారాయడుగారి పేరే తట్టే దెవరికైనా.

సుబ్బారాయడుగారిని నమ్ముకునే వచ్చేవారా రోజుల్లో పిఠాపురం యెవరు వచ్చినా.

సూటిగా మహారాజులుంగారి దర్శనమే కావాలంటే సాధ్యంకాదు, మరి.

"అగ్నిముఖా వై దేవాః."

ఇదే సూత్రం యిక్కడాను – "మంత్రిముఖా వై రాజానః."

చక్రవర్తి – లేక మహారాజు – లేక – రాజు – లేక జమీందారు అయిన ప్రతీమనిషి దగ్గిరా వుంటాడు ఏదో వొక యెత్తున, దివా ననిపించుకునే మనిషి.

అయితే, తెనుగుదేశంలో, "దివాను" అని చెప్పదగినవా రిద్దరే – వొకరు కొమర్రాజు లక్ష్మణరావుగారూ, మరొకరు మొక్కపాటి సుబ్బారాయడుగారున్నూ.

జీతం లేకుండా కాకినాడ కాలేజీ చదువుకూడా పూర్తి చేసుకోడానికి వేంకటనారాయణ కవకాశం కల్పించారు సుబ్బారాయడుగారు, ప్రార్థించడం తడవుగా.

అప్పటి కది సెకండుగ్రేడు కాలేజీ.

అయినా హైస్కూలుకి పైమెట్టు కావడంవల్ల అందుకే మిక్కిలీ సంతోషించాడు వేంకటనారాయణ.

అపజయమన్నది లేకుండా అక్కడి చదువున్నూ రెండేళ్లల్లో పూర్తిచేసేశా డతను.

తృష్ణమాత్రం తీరలే దతనికి.

అయితే, సుబ్బారాయడుగారి చేతిలోనా ఫస్టుగ్రేడు కాలేజీ లేకపోయె, అలాంటి కాలేజీ చేతిలో వున్న దివా నాసుబ్బారాయడుగారివంటివా రవునో కాదో తెలియదాయె.

కాని యేనుగుకుంభస్థం బద్దలుకొట్టేదాకా వూరుకోదు సింహం.

బి.ఏ. కాకుండా వుండలేకపోయాడు వేంకటనారాయణ.

ఏటి కడ్డపడ్డా డప్పుడు.

విజయనగరం ప్రవేశించా డాకసితోనే.

జీతమే కడుతూ వచ్చాడో, అక్కడా దివాన్‌గా రనుగ్రహించారో మరి, రెండేళ్ళలోనే బి.ఏ. అయిపోయా డతను.

మరో రెండేళ్ళకి ఎల్.టి. కూడా అయిపోయాడు రాజమహేంద్రవరంలో.

అనన్యసాధారణమైన ఆ అభ్యుదయపరంపర చూసి శ్రీపాద లక్ష్మీనరసింహ శాస్త్రిగారు తమ కొమార్తె నిచ్చి అంతకి ముందే వివాహం జరిగించా రతనికి.

చివరి కిప్పుడు, పశ్చిమ గోదావరిజిల్లా బోర్డు హైస్కూళ్ళలో ప్రముఖోపాధ్యాయులై వోహో అనిపించుకుంటున్నారు, మిత్రులు, మ.రా. శ్రీ వేమూరి వేంకట నారాయణపంతులు బి.ఏ.ఎల్.టి.గారు, సిరిసంపదలతో తులతూగుతూ.

మరి అప్పుడు మాఘమే చదువుతూ కూచుని వుంటే?

"మాఘే మేఘే గతః వయః."

మల్లినాథ మహామహోపాధ్యాయుడన్న మాట యిది.

మాఘానికీ మేఘసందేశానికీ వ్యాఖ్యానం చేశాటప్పటికి చాలా బడలిపోయా డతను.

సాహిత్య యాత్రీకుల కవి రెండూ చాలా గడ్డుమజిలీలు.

మేఘసందేశం చదివాటప్పుడు తెలిసీ తెలియని అవస్థలో వుంటాడు విద్యార్థి.

పెద్దపెద్ద సాహిత్యపరులకే నికషాయమానం, మరి అది.

కొంత తెలియడంతో వెలుగూ, మరికొంత తెలియకపోడంతో అంధకారమూ ముసురుకుని వుంటుంది ముందుదారి.

ఓర్చుకోలేక చాలామంది వెనక్కి మళ్ళేస్తా రక్కడ.

ముందుకి వెళ్ళగలిగాడా, భారవి తరవాత మాఘం.

అప్పటికి యుక్తవయస్కు డయివుంటాడు విద్యార్థి.

లోకంపోకడ అవగాహన అవుతూ వుంటుంది.

సంస్కృతభాషలో స్వేచ్ఛాసంచారమూ ప్రారంభం అయివుంటుంది.

కనక, మాఘం సుళువుగా నడిస్తే జీవితమూ నడుస్తుంది, లక్షణంగా.

అలాంటి చోట కాలు స్తంభించిపోయింది వేంకట నారాయణకు.

అయినా, అదృష్టవంతు డతను.

కనకనే పిఠాపురం ప్రవేశం తటస్థించిం దతనికి.

ఇటు రామకృష్ణకవుల ఆశీర్వచనమూ, అటు దివాన్ సుబ్బారాయడుగారి అనుగ్రహమూ లభించా యతని కక్కడ.

అతని జీవయాత్ర సిమెంటురోడ్డు చేరుకుంది దాంతో.

అయితే, మాఘం నడవలే దంటే వేంకటనారాయణ కప్రతిష్ఠ యేమీ లేదు.

ఏమంటే?

ప్రతిభ వేరూ, రుచి వేరూను.

రుచి వేరూ, అవకాశం వేరూను.

అవకాశం వేరూ, స్వాతంత్ర్యం వేరూను.

స్వాతంత్ర్యం వేరూ, దీక్ష వేరూను.

దీక్ష వేరూ, ఏకాగ్రత వేరూను.

ఏకాగ్రత వేరూ, సాహసం వేరూను.

ఇన్నీ కలిస్తే అప్పుడూ "సాహసే లక్ష్మీః."

తేలిం దేమి టంటే?

విద్యలు రానివాడు లేడు.

రాని విద్యలు మాత్రం వున్నాయి.

ఇంతకీ:—

ఒకరికంత ధారాళంగా వుపాయం చెప్పానే, ఎంతో కొంత ప్రయత్నమూ చేశానే, మరి, నేను కూడా అలా తంటాలుపడి యింగ్లీషు సాధించుకుని వుండగూడదూ?

యోగం లేకపోయిందనను, కాపురుషుల మాట అది.

డాబులు చెప్పుకోడం కాదు, పూనుకుంటే యిప్పుడున్నూ ఎం.ఏ. కూడా అయిపోగల న్నేను అవలీలగా.

మరి, నా తెనుగుమాట?

ఈ దీక్ష విడిచిపెట్టుకోలేకపోయాను.

కవిని కావాలనీ, గుట్టలుగుట్టలుగా గ్రంథాలు రచించాలనీ వొక ప్రాప్యమూ, వొక ప్రణాళికా సిద్ధం చేసుకుని వుండినాను కనక, ఆ సాధకావస్థలో పక్కపక్కలకు తప్పుకోలేకపోతూ వచ్చా న్నేను.

అంచేతనే యిప్పటికీ నే నిలాగ నేలబారుగానే వుండిపోయాను, లేకపోతేనా?

## 32

నిన్నటిదీ మొన్నటిదీ కాదు రామకృష్ణకవుల దగ్గిర నేను చదువుకోడం, నలభై అయిదేళ్ళ కిందటిమాట అది; కాని ఆ సన్నివేశాలు జ్ఞాపకంవస్తే శరీరం పులకరిస్తూనే వుంటుంది నా కిప్పటికీ.

నిజాని కది మిక్కిలీ స్వల్పకాలమే.

అయినా, మాసానికి పున్నమి యెలాంటిదో, సంవత్సరానికి వసంతం యెలాంటిదో నా జీవితాని కలాంటి దయిం దది.

గురువు శిష్యుణ్ణి సర్వవిధాలా తనంతవాణ్ణి చెయ్యడానికి పడే తాపత్రయం యెలా వుంటుందో అక్షరాలా అది నా విషయమయ్యే రామకృష్ణకవుల దగ్గిర చూశా న్నేను; కాని తమ అనుగ్రహానికి ఫలితంగా నే నేస్థితికి వచ్చానో వేంకటరామశాస్త్రిగారే కాని రామకృష్ణశాస్త్రిగారు చూడలేదు.

మరిన్నీ రామకృష్ణశాస్త్రిగారు నా వడ్లగింజలు చూడలేదు, నా రాజరాజు చూడలేదు, నా కలంపోటూ, నా మార్గదర్శీ చూడలేదు, నా ప్రబుద్ధాంధ్ర వ్యాఖ్యానాలూ, భారతిలో పడిన నా మీగడతరకలూ చూడలేదు.

నా వీరపూజ వొక్కటి మాత్రమే చూశారు వారు.

చూడ్డంలోనూ బహూ పరిశీలనగా చూశారు.

"ఇలాంటి గ్రంథం తెనుగుభాషలోనే కాదు, మరేభాషలోనూ వుండివుండ" దన్నారు, వారు చివరికి.

"బావా, పద్యాలు మానేసి వచనరచనే సాగించవలసిందని మనం చేసిన వుపదేశం సఫలం అయిం" దనిన్నీ ఆనందించారు వారు, వేంకటరామశాస్త్రిగారితో చెప్పి.

వారి దగ్గిర విద్యాభ్యాసం ముగించుకున్న రెండు సంవత్సరాలకు జరిగిం దిది.

మిథునానురాగరచనే వారిని తృప్తిపరిచిం దసలు, వీరపూజ వారి మన్ననలే పొందింది.

అప్పటికీ యిప్పటికీ నాకూ వుంది వీరపూజ విషయమ్మై అలాంటి తృప్తి.

అయితే, రాశానే కాని ప్రకటించడానికి శక్తి లేకపోయింది నా కది.

సంపన్నులను కొందరిని చూశాను, ప్రయోజనం లేకపోయింది.

అంతా కాకపోతే, కొంతవర కయినా సాహాయ్యం చేసిన సంపన్నులు మాత్రం కొంద రున్నారు, వారిలో అనపర్తి కాపురస్థులు ద్వారంపూడి రామారెడ్డిగారు ముఖ్యులు.

పెద్దరెడ్డిగా రని వారికి వ్యవహారం.

మహానుభావులు వారు, కైలాసవాసు లిప్పుడు, బతికివుండినంతకాలమూ ఔదార్యమూ సౌజన్యమూ మూర్తీభవించినవారని ప్రఖ్యాతి వారికి.

వారి తండ్రి గంగిరెడ్డిగారినిన్నీ బాగా యెరుగుదు న్నేను, గంగిగోవు అన్నమాట వారికే చెల్లుతుంది.

గంగిరెడ్డిగారు మా నాయనగారికి వార్షికం యిచ్చేవారు, అందుకోసం రెండు మూడుమాట్లు వెళ్ళా న్నేను, అంచేత, చిన్నప్పణ్ణుంచీ నాకు బాగా పరిచయం వుంది రామారెడ్డిగారితో.

వారి ఔదార్యాన్ని కెందరో యెన్నో వుదంతాలు చెప్పగా ఆశపడి, నమ్మి, పనికట్టుకునివెళ్ళి "యిది అచ్చువేయించి పెట్టం"డని కోరా నొకనాడు, రాత ప్రతి చూపించి.

వినివిని "నే నొక్క వందరూపాయ లిస్తాను, పైగా పడేది మరోచోట చూసుకోండి, వొక్క వారందినాల్లో రండి" అన్నారు వా రవ్యవధానంగా.

ఆ పుస్తకాని కిది చాలదు.

అయినా నూరురూపాయల మొత్తం చేదు కాదు కనక, సరిగా వారందినాలకే వెళ్ళాను; గాని "యింకో వారం" అన్నారు రెడ్డిగారు నన్ను చూస్తూనే.

ఆ బుధవారమే వారం వారం వెళ్ళాను, వ్రాళ్ళోవుంటే.

అంత పెద్ద మొత్తం అంతకితం యెప్పుడూ వొక్కమాటుగా నా చేతికి రాలేదు, కనక, మాసం కాదు – రెండు మాసాలు కాదు – ఆరుమాసాలు వెళ్ళా నలాగ వారంవారమూ.

పన్నెండు గంటలకు భోజనం చేసి చుట్టకాలుస్తూ రెడ్డిగారు హాల్లో పచారుచేసే సమయమూ, నేను వారి గుమ్మం యెక్కే సమయమూ వొక్కటిగా వుండేది, తరుచు.

"మళ్ళీ వారం"

"మళ్ళీ వారం"

"మళ్ళీ వారం"

ఈ వొక్కమాటే పెట్టుకున్నారు నాతో మాట్టాడ్డానికి రెడ్డిగారు.

ఈ ఆరుమాసాల్లోనూ వారి ఔదార్యం ఇంకా యింకా తెలిసింది.

ఆ మాట అనడానికి వారికీ, ఆ మాటమీద వెళ్ళడానికి నాకూ గూడా విసుగన్నది లేకుండా పోయింది.

కాని "ఏమిటిదీ?" అనిపించిం దొకనాడు, హఠాత్తుగా.

గుమ్మం దిగి వెనక్కి మళ్ళాను, ఆలోచనలో పడ్డాను.

"పశ్చా చ్ఛబ్దో నాస్తిపర్యాయః"

"మళ్ళీ రమ్మంటే లేదు" అన్నమాట.

ఈరకం లౌక్యులు లోకంలో చాలామందే వున్నారు.

కాని సందుదాటి ధ్వజస్తంభం దగ్గిరికి వెళ్ళేటప్పటికి వెనకనే వచ్చి, పిలిచి "మీరు నిరాశ చేసుకో నక్కరలేదు. మా అన్నగారిని అపార్థమూ చేసుకోవద్దు. మీ సొంత రూపాయలు, నూరు, రెడ్డిగారి దగ్గిర వున్నాయి, తిరుగులేని మాట యిది. అయితే, ఫలానా పెద్దమనిషి రెడ్డిగారి సన్నిధానంలో లేకపోడమూ రెడ్డిగారిని మీరు కలుసుకోడమూ యెప్పుడు జరుగుతుందో – జరుగుతుందో జరగదో – ఇదిమాత్రం చెప్పలేను; గాని జరిగిందా, మీ వందరూపాయలూ మీ చేతిలో పడతాయి గళ్ళున" అని చెవిలో వూది వెళ్ళారు వారి తమ్ములు వేంకట రెడ్డిగారు, నా యింగితం యెలా గుర్తించారో మరి.

"కల్పవృక్షం" అని పేరు రామారెడ్డిగారికి.

దానిచుట్టూ ముళ్ళకంచె వున్నదని నే నదే వినడం, మొదటిమాటు.

లోకంలో అనేకచోట్ల వుం దది, నాకు తెలుసు.

కంచెపని కంచె చేసుకుంటుంది, కల్పవృక్షం పని కల్పవృక్షం చేసుకుంటుంది, వాటిలోనూ చాలాచోట్ల, నాకు బాగా తెలుసు.

కనక, వేంకటరెడ్డిగారి సలహా కాదనలేకపోయాను.

వెళ్ళడమూ మానలేకపోయాను, వారంవారమూ.

రెడ్డిగారున్నూ మానలేకపోయారు "మళ్ళీవారం" అన్నమాట.

ఇటు వందరూపాయల మొత్తం, అటు వేంకటరెడ్డిగారి సలహా – చూస్తే, రామారెడ్డిగారి ముఖం సౌమ్యంగానే వుండడం – వింటే, వారి ఔదార్యోదంతాలు క్రొత్తక్రొత్తవి వారూ వీరూ చెబుతూ వుండడం – దీంతో నిశ్చలంగా వెళ్ళాను, అన్నకొద్దీ.

వెడుతూనే వుండిపోయాను, దీక్షగా.

ఈలోపున కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగా రది అచ్చువేసి యిచ్చారు, అది మరోచోట.

ఆ అచ్చుప్రతిన్నీ అందుకున్నారు రెడ్డిగారు "మళ్ళీ వారం" అనిమాత్రం అంటూ.

అయితే, నేను నిర్వికల్పంగానే వుండినా, నే నలా తిరగడంమాత్రం కొందరి కసందర్భంగా కనపడింది.

"ఇక చాలించుకో" అన్నారు మా నాయనగారు.

"లాభం లేదండీ" అన్నారు శ్రీ దాట్ల సూర్యనారాయణ రాజుగారు.

"ఆశ వదులుకోవలసించే" అన్నారు మల్లిడి సత్తిరెడ్డిగారు.

"ఇంగితజ్ఞానం వుండవద్దా?" అంటూ కసురుకున్నారు, మిత్రులు కొందరు.

అయినా వెళ్ళడం మానలేకపోయా న్నేను.

నా సంగతికేం, రమ్మని తామే చెప్పిన్నీ, మళ్ళీమళ్ళీ వెడితే మాత్రం చాలా బాధపడతారు కొందరు.

వెళ్ళకపోతే బాధపడతారు మరికొందరు.

వారూ వీరూ పదిమాట్లు తమచుట్టూ తిరుగుతూవుండడం తమకొక ఘనత అని భావించుకునేవా రుంటూ రాకొందరిలో కొందరు, తెలుసు.

కాని తతిమ్మా కొందరూ మాత్రం మహానుభావులు.

నిష్కామంగా యిస్తారు వారు.

ఇవ్వడం తమ విధి అని భావించి యిస్తారు వారు.

తమకుంది కనక, ఒకరి కివ్వకపోడం ఈశ్వరద్రోహం అని భయపడుతూ యిస్తారు వారు.

"తమకుండినట్టు వారికిన్నీ లేకపోయినందు కెంత చిక్కు పడుతున్నారో" అంటూ పరితపిస్తూ యిస్తారు వారు.

"మన మే మివ్వగలిగామూ?" అంటూ సిగ్గుపడుతూ యిస్తారు వారు.

'దేహి' అన్నమాటతో తమ గుండెలు కరిగిపోయిస్తారు వారు. మళ్ళీమళ్ళీ వెడితే, అప్పుడున్నూ తా మివ్వలేకపోయినా, అవతలివారికి తమయెడల అసంతృప్తి – నిరసన – అపనమ్మకం – ఇలాంటివి కలగలేదని గుర్తించుకుని అందుకు బ్రహ్మానందం పడతారు వారు.

కాని అది నిలవదు.

అంతలో సిగ్గు ముంచుకువస్తుంది.

రోషం కెళ్ళిస్తుంది.

"అప్పయినా చేసి యివ్వా" లనుకుంటారు.

ఒక్కొక్కప్పు డలా యిస్తారు కూడా.

ఇవ్వరూ?

అయినా, తిరిగేవాడికి విసుగు కలగదు.

అలాంటివారిని మళ్ళీమళ్ళీ చూడ్డం పడ్డందుకు తిరిగేవాడికి సంతృప్తే కలుగుతుంది, మిక్కిలీ.

డబ్బున్నవారున్నూ స్నేహభావంతో మళ్ళీమళ్ళీ చూడతగ్గవారు రామారెడ్డిగారు.

అంచేత వెళ్ళడమే పెట్టుకున్నా న్నేను.

పోనీ, వేంకటరెడ్డిగారు చెప్పిన ఆ సన్నిధానవర్తి నాకు విరోధి యేమో అంటే – నా యెడల కోపంగా వున్నాడేమో అంటే, రామరామా, మే మెప్పుడూ ఏమీ అనుకోలేదు.

కనపడితే వోహో అంటే వోహో అనుకుంటా మెప్పుడూ.

రామారెడ్డిగారు "మళ్లీవారం" అంటూనే వుండినా – తన యెదటే అంటూ వుండినా, ఆ సన్నిధానవర్తి, ఆప్యాయనంగానే మాట్లాడేవా డెక్కడ కనపడ్డా నాతో, రెడ్డిగారి ఆ మాటకు మాత్రం సంబంధం లేకుండా.

మరి యిదేమిటీ అంటే యేమో?

ఇంతాచేసి ఆ సన్నిధానవర్తి యెప్పుడయినా సఫలు డయినాడా అంటే – రెడ్డిగారు వందలూ వేలూ యిస్తూనే వున్నా రనేకులకు, ధారాళంగా.

కాదంటే నాకు లాగే అందరికీ వారాలో, పక్షాలో, మాసాలో వాయిదాలు – అంతే.

ఓపిక పట్టినవా రెవరూ విఫలులు కాలేదు, నాకు తెలుసు.

## 33

అంచేత "సన్నిధానవర్తి ఈ సమయాన రెడ్డిగారి దగ్గిర వుండకపోవచ్చు" నన్న ఆశతో, తెల్లవారేటప్పటికి వెళ్లాను, ఎనిమిదింటికి వెళ్లాను, పదింటికి వెళ్లాను, రెండింటికి వెళ్లాను, నాలుగింటికి వెళ్లాను, దీపాలు పెడతా రనగా వెళ్లాను, మామూలుగా పన్నెండు గంటలకు వెడుతూనే వచ్చాను; గాని ఆ "ముఖారవిందమే" కళ్లబడుతూవచ్చింది నాకు, రెడ్డిగారి ప్రసన్నగంభీరముఖం కంటేనూ ముందు.

నా విషయమై సన్నిధానవర్తి దీక్ష యేమిటో ఇదమిత్థంగా నాకు తెలియదు; గాని నేనుమాత్రం "నిన్ను జయించితీరతా" ననుకునేవాణ్ణి, రెడ్డిగారి దగ్గిర అతను కనపడగానే.

ఎప్పటికప్పుడే "యిది చివరిమాటు. మరి వాయిదా పడ". దనుకునేవాణ్ణి రెండేళ్ళదాకా, తరవాత మాత్రం యేమనుకోడమూ మానేశాను.

రానూపోనూ యెనిమిది మైళ్ళయినా, నడకశ్రమ తప్ప దమ్మిడీ అయినా ఖర్చులేదు కనక, అలా వెడుతూనే వచ్చా నదో అలవాటుగా.

బుధవారం వచ్చిందంటే, చెప్పకుండానే మా సీత పెందలాడే వంట చేసేసేది, భోజనం కానిచ్చి నే ననపర్తి బయలుదేరేవాణ్ణి, అనుకోకుండానే.

ఖరాగా మూడేళ్ళు తిరిగా నిలాగ నే ననపర్తి.

"అనగననగ రాగ మతిశయిల్లుచునుండు" నన్నాడు వేమన్న.

"తిరుగఁ దిరుగ ఫలము దొరకి తీరు" ననుకున్నా న్నే నొకనాడు.

జరిగిందే మిటంటే?

ఎప్పటిలాగే బయలుదేరా నావేళ.

అనపర్తి దగ్గిర నల్లకాలవ యివతలి గట్టున నేను బల్లకట్టు రేవు చేరుకునేటప్పటికి అప్పుడే వచ్చిన బల్లకట్టు (రేవుదోనె) దిగి దక్షిణపుటొడ్డున నుంచునివున్నాడు, సన్నిధానవర్తి యిద్దరుముగ్గురు రెడ్లతో.

చూస్తూచూస్తూనే నేను బల్లకట్టెక్కేశాను, త్వరగా నడిపించ మని కళాసుని తొందరపెడుతున్నట్టు చిటికెలువేస్తూ.

"ఎక్కడి" కనడిగాడు సన్నిధానవర్తి, హఠాత్తుగా చూసి, కంగారుపడుతూ.

"తరవాత చెబుతాను, ముందు టయి మెంతయిందో చూడం" డన్నా న్నేను, వెనక్కి వచ్చి నే నెక్కిన బల్లకట్టే యెక్కుతాడేమో అని అదుర్దాపడుతూనే.

ఆ చుట్టుపక్కల వూళ్ళవాళ్ళు రాజమండ్రీ వెళ్ళాలంటే సరిగా ఆ సమయాన వొక రెయిలుంది.

నే నా బండికి వెడతాననుకుని వుంటాడు సన్నిధానవర్తి, జేబులోనుంచి వాచీ తీసి "నడిస్తే లాభం లే"దన్నాడు, టైము చూస్తూనూ, వొత్తి పలుకుతూనూ.

అప్పటికీ వొకళ్ళ యింగితం వొకళ్ళం కనిపెట్టుకోవాలని చురుకుచూపులు చూసుకుంటూనే వున్నాం మేము, బల్లకట్టు కదిలింది, వెనక్కి తిరిగింది, బయలుదేరింది. రంయి మంటూ అవతలిగట్టు చేరేసింది.

పొద్దింకా సగం దూరాన వుండగానే నా మన స్సురికేసింది, గజం దూరాన వుండగా నా శరీరం వురికేసింది, రెండూ చెట్టాపట్టాలు వేసుకుని వూళ్ళోకి బయలుదేరాయి వెంటనే.

సన్నిధానవర్తి అప్పు డనుమానించినా భయం లే దిక.

ఏమంటే?

ఇవతలినుంచి బల్లకట్టవతలికి వెళ్ళాలి, అంతదూరాన వుండగానే దూకేసి ఆయన యెక్కినా, వెళ్ళి పొద్దు కది గుద్దుకోవాలి, వెనక్కి తిరగాలి, బయలుదేరాలి, నడవాలి, మళ్ళీ యివతలిగట్టు చేరుకోవాలి, రెడ్డిగారి యింటికి నాలుగు ఫర్లాంగులమేర వురుకులూ పరుగులూ పెట్టా లాయన.

రెడ్డిగారు కనపడ్డారా, సన్నిధానవర్తి బల్లకట్టు దిగకుండా నే నక్కడికే చేరుకుంటాను మళ్ళీ, పచ్చకాగితంతో.

తలుచుకుంటే యిప్పటికీ నవ్వు వస్తోంది.

నిజంగా, కంగా రక్కర్లేకపోయినా, నే నప్పుడు పరుగెత్తుతున్నట్టే నడిచాను, సన్నిధానవర్తి చూపానినంతమేరా.

## 34

యథాప్రకారం హాల్లో పచారుచేస్తున్నారు రెడ్డిగారు.

కాలవగట్టున చూసే వుండినా – మాట్లాడిన్నీ వుండినా నమ్మలేక కనపడ్డంతమేరా పరకాయించాను, రెడ్డిగారొక్కరే వున్నారు, సన్నిధానవర్తి లేడు సన్నిధిని.

వెంకటరెడ్డిగారు "వెళ్ళండి, వెళ్ళండి" అంటూ లోపలికి దారి చూపిస్తున్నట్టు మాత్రం అనిపించింది, అరుగుమీద నుంచుని, ఆత్రంగా.

చీడీలమీదే వుండగా నన్ను చూశారు పెద్దరెడ్డిగారు.

లోపలకు రమ్మనలేదు, వాయిదా వేసి పొమ్మనా లేదు, నాతో మాటే ఆడలేదు, ద్వారాన వున్న నౌకర్ని పిలిచి, తర్జనితో నిర్దేశిస్తూ యెవరో రెడ్డిగారి పేరు చెప్పి "నే నిమ్మన్నానని పచ్చకాగితం పట్టుకురా" అన్నారు, యెగిరి రావాలన్నట్టు చిటికెలు వేస్తూ.

అప్పు డన్నారు నన్ను వచ్చి కూచోమని.

నేనున్నూ మాట్లాడకుండా కూచున్నాను, భావోద్వేగం అణిచిపెట్టుకుంటూ.

వగర్చుకుంటూ వచ్చా డంతలో నౌకరు.

పచ్చకాగితం నా చేతిలో వుంచి "క్షమించండి" అన్నారు దోసిలి వొగ్గి, రెడ్డిగారు, వెంటనే.

మెరుపు మెరిసినంతలో అయిపోయిం దిదంతా.

నేను తిరిగిన మూడు సంవత్సరాలూ మూడు క్షణా లన్నట్టనిపించింది, దాంతో.

పెద్దనిట్టూర్పు మాత్రం వచ్చింది, మాట రాలేదు నాకు.

కొండంత భారం దింపుకున్నట్టు ఫీలయినారు రెడ్డిగారున్నూ.

"ఇవ్వలేకపోయా" నన్న తపన – "ఏమనుకున్నారో శాస్త్రిగారు?" అన్న

బిడియం - "వెనక్కి వచ్చేస్తాడేమో?" అన్న అనుమానం - "నౌకరింకా రాడేం?" అన్న ఆత్రం - "అమ్మయ్యా" అనుకుంటున్న ధోరణి - మూడు సంవత్సరాల యిన్ని మనోవికారాలు కనపడ్డాయి, రెడ్డిగారి ముఖాన నా కా సమయాన.

అప్పుడు మాట్టాడారు ఇష్టాగోష్టిగా వా రొక అరగంటసేపు.

వీరపూజ సంగతి - అప్పుడు రాస్తున్న రచన సంగతి - ప్రచారం యెలా వుందన్న విషయం - ఇత్యాదిగా చాలా సంగతులు వచ్చా యాసంభాషణలో.

ఇచ్చి రెడ్డిగారూ, పుచ్చుకుని నేనూ చాలా సంతోషించాం.

అయితే, ఏకకాలాన అంతవరకూ నే నెరగని మొత్తం వందరూపాయలు చేతిలో పడ్డాయన్న సంబరంతో నే నంటున్నవి కావు, వారం వారమూ మూడేళ్ళు తిరిగినా కష్టం అనిపించని తృప్తితో అంటున్న మాట లివి.

ఏమంటే?

తృప్తి పోర్దికం.

డబ్బుకీ దానికీ లేశమూ సంబంధం లేదు.

కడుపు కనకలాడుతున్నప్పుడు - పేగులు మాడిస్నీపోతున్న సమయాన కూడా చారూ అన్నమూ అయినా పెట్టనక్కరలేదు, ఆదరంగా వొక్క మాటాడితే చాలు, జాలిగా వొక్క చూపు చూసినా చాలు, కడుపునిండినంత తృప్తి కలుగుతుం దెవళ్ళకయినా.

కోరి, ప్రార్థించి కూడా వొక్కొక్కరి దగ్గిర డబ్బు పుచ్చుకుంటాం అగత్యం అయి, కాని తరవాత చాలా బాధ పడతాం, నాలుకలు చాపి కీలుకీలునా మంటలు తాకుతున్నట్టు.

"ఛీ, ఎందుకువచ్చిన బతుకు?" అనిన్నీ అనుకుంటాం దౌర్భాగ్యం తిట్టుకుంటూ.

డబ్బు స్వరూపం వొక్కటే - స్వభావం మాత్రం వేరు వేరు, చేతుల మార్పు ననుసరించి.

ఎన్ని రకాల చేతుల్లో నుంచో కాస్తోకూస్తో వస్తూవచ్చింది నా చేతికి డబ్బు.

రెడ్డిగారి చెయ్యి వంటి చేతులు బహు కొద్దిగా తగిలాయి నాకు.

ఎలాంటి నప్రతిగ్రహీతకూ కూడా ఉద్వేగానికి బదు లుత్తేజాన్ని కలిగించే యోగ్యత వుంది రెడ్డిగారి చేతికి.

ఇతరులవల్ల డబ్బు పుచ్చుకోడం యెలాగా తప్పనివాడికి రెడ్డిగారి ద్రవ్యం సంపాదించుకోలేకపోడం వొక అయోగ్యత.

అఖండైశ్వర్యంతోపాటు మహౌదార్యమున్నూ యెప్పుడు ప్రారంభం అయిందో ఆ కుటుంబంలో మరి, తమ తండ్రి గంగిరెడ్డిగారి దగ్గిరనుంచి పుణికిపుచ్చుకున్నారు, రామారెడ్డిగారూ, వారి తమ్ములు వేంకటరెడ్డిగారున్నూ, సమవాటాలుగా.

దురదృష్టవశాన రామారెడ్డిగారి చుట్టూ ముళ్ళకంచె యేర్పడింది, అదృష్టవశాన వేంకటరెడ్డిగారి చుట్టూ యేర్పడలేకపోయింది, ఆ యేకోదరుల దగ్గిర కనపడే వ్యత్యాసం యీ కాస్తమాత్రమే.

సాహసౌదార్యాలలో మాత్రం యిద్దరి కిద్దరే వొకరికొకరు తీసిపోరు.

ఇంతేకాదు:-

ఇద్దరూ మితభాషులే, యిద్దరూ సులభదర్శనులే, యిద్దరూ దాపరికం లేకుండా మాట్లాడేవారే; కాని యిద్దరూ కూడా యెప్పుడో కాని బయటికి రానివారే, ప్రభుసమ్మితంగా.

అయితే, రామారెడ్డిగారు బయటికి వచ్చారంటే, టెన్నిస్ అడ్డానికో వేటకి బయలుదేరడానికో.

రెడ్డిగారితో సమంగా టెన్నిస్ ఆడగలవారు జిల్లాలో బహూకొద్దిమంది మాత్రమే.

వారితో వేటకి వెళ్ళడానికి యెక్కడెక్కణ్ణుంచో వచ్చి చుట్టుకుని వుండేవారలాంటి సంపన్నులే చాలామంది.

వారి సన్నిధి రాజయోగ్యంగా వుండేది.

ఒక్కమాటలో చెప్పాలంటే, –

రెడ్డిగారి విగ్రహం ఆజానుబాహువ్రూ, పరాక్రమం సింహసంహననమూ, రూపం మదనమోహనమూ, చూపు ప్రసన్నగంభీరమూ, వేషం రాజయోగ్యమూ, ప్రవృత్తి మాత్రం సాత్వికమున్నూ.

వారి రాబడీ సాత్వికమే, వ్యవసాయం వారి ప్రధానవృత్తి.

అంచేతే వారి విరాళం సంపాదించుకోడాని కంత ఆత్రపడిపోయా న్నేను.

## 35

ఎవరి గ్రంథం వారే అచ్చువేయించుకోవలసిరావడం కంటే మరి దౌర్భాగ్యంలేదు కవులకు.

వనితలకు తమంత తామయి వలచివెళ్ళవలసిరావడం వంటిది కవుల కిది.

"తన రచన తన డబ్బుతో అచ్చువేయించుకోడమే కవికి దౌర్భాగ్యం అయితే, యాచించి తెచ్చిన యితరుల డబ్బుతో అచ్చువేయించుకోడం మరీ దౌర్భాగ్యం కాదూ?" అంటే కాదనే చెబుతాను.

ఏమంటే?

అచ్చువేయించుకోవలసిన బాధ్యత కవిమీద పడ్డమే అసలు, దౌర్భాగ్యం.

కాక, – ప్రచురణకర్తలు ముందుకి రానప్పుడు తానయినా తన గ్రంథం, అచ్చువేయించుకోకపోతే, అదీ దౌర్భాగ్యమే అవుతుంది కవికి.

అది తప్పనప్పుడు ద్రవ్యం యెవరిదైనా వొకటే, యెలా వచ్చినా వొకటే.

కాగా, – అందుకోసం యాచించి అయినా యితరుల డబ్బు సంపాదించడం అంటే, ఇల్లు కట్టుకోడానికి యాచించడమూ, రుణాలు తీర్చుకోడానికి యాచించడమూ, బిడ్డలకు చదువు చెప్పించుకోడానికీ శుభకార్యాలు నిర్వహించుకోడానికీ యాచించడమూ వంటిది కానేకాదు.

అవి జానెడు పొట్టకోసం చెయ్యవలసినవి.

ఇది, అచ్చంగా, ఇతరుల నానందపెట్టడానికి చేసే మంగళకార్యం.

ఇతరుల చిత్తవృత్తులను సంస్కరించడానికీ, పరిణతి కలిగించడానికీ చేసే దోహదక్రియ.

సభ్యత అలవరిచి జాతి ఏకతాటిమీద నడిపించడానికి చెయ్యవలసిన విధికృత్యమున్నూ.

మొత్తానికి కవి బాధ్యత యిది.

కవి ప్రాప్యమున్నూ యిదీ.

నలుగురూ చదవడమూ, పాఠకుని హృదయం స్పందించి మొగం ఆనందోత్ఫుల్లం కావడమూ, ఆ మనిషికెంతో కొంత సంస్కారమున్నూ అబ్బడమూ, ఆవిధంగా తన జీవితం ధన్యం కావడమూ – ఇదీ తన రచనవల్ల కవి సాధించుకోవలసినవి.

నలుగురూ తన ప్రతిభ గుర్తించడమూ, కొంచెమయినా తనని మెచ్చుకోడమూ కూడా ఈ పద్దులోవే, సందేహం లేదు.

అయితే, గౌణా లివి.

ఆనుషంగికాలున్నూ.

అవి సిద్ధిస్తేనే సిద్ధించేవిన్నీ యివి.

నిజమే; కాని "అచ్చుపడే ప్రతీగ్రంథానికీ యీ శక్తి వుంటుందా?" అంటే, పోనీ, వుండేదాని మాట?

అది నిర్ధారణ కావడం మాత్రం యెలాగా?

చెట్టున పుట్టే ప్రతీపిందే సారవంతం కాదు.

నిలవనూ నిలవదు.

మరి, నిలిచే దేదో యెలాగా చెప్పడం?

అలాంటిదే కవుల గ్రంథాల విషయమున్నూ.

కాక, – పూర్వకవులు రాసిన గ్రంథాలు కొంచెమే వున్నాయి, మన కిప్పుడు.

ఆ రోజుల్లో యివి మాత్రమే పుట్టాయా?

కవులున్నూ వీరు మాత్రమే వుండినారా అప్పుడు?

నన్నయ్య భారతాది మాత్రమే రచించాడా?

తిక్కన్న భారతోత్తరభాగం మాత్రమే రచించాడా?

ఎర్రన్నా, శ్రీనాథుడూ, పెద్దన్నా, తిమ్మన్నా, రామరాజ భూషణుడూ – మొదలైనవారు ఇప్పుడు మనకు లభ్యాలయి వున్న పెన్నిధులు మాత్రమే రచించారా?

కాదు కాదు, అలాంటి నికరమైన శక్తీ నేర్పూ అలవడ్డానికి, వారు, ఎన్నో శతకాలూ, పద్యాలూ, మరింకా యెన్నో గ్రంథాలూ రచించివుంటారు, సాధకావస్థలో.

అయితే, యిప్పటి అనేకుల్లా కాక, వా రపరిమితమైన సంస్కారం గలవారు కనక, వారి ఆ ప్రాథమిక రచనలున్నూ జను లాదరించే వుంటారు.

కాని తపస్సిద్ధి కాక పూర్వం రచించినవి కనక, అవి కాలం సుడిగుండాలు తప్పించుకోలేక నశించిపోయి వుంటాయి.

అలా పోయినవి పోగా రత్నాలే మనకి మిగిలాయి.

ఎప్పు డయినా గట్టిగింజలే మిగులుతాయి; కాని పొల్లు గింజలకున్నూ పని తప్పనిదే.

కనక, గ్రంథం తయారయిందా అచ్చుపడవలసిందే, ఇప్పుడు.

దానివల్ల యితరులకు ఆనందాదిప్రయోజనం కలిగినా కలక్కపోయినా, అవి అచ్చు పడ్డంవల్ల మరో గ్రంథం రచించాలన్న ప్రేరణ కలుగుతుంది కవికి.

కవి అయినవాడికి ప్రాణాలకంటేనూ విలవయిం దీప్రేరణ.

కవి అయినవాడికి నిద్రాహారాలకంటేనూ యెక్కువ అవశ్యకమయిందీ ప్రేరణ.
ఈ ప్రేరణ తన్మయీభావం కలిగిస్తుంది కవికి.
ఈ ప్రేరణ దీక్ష పుట్టిస్తుంది కవికి.
ఈ ప్రేరణ ఆ దీక్షకు ఏకాగ్రత సంఘటిస్తుంది కవికి.
దాంతో రాత కూర్చుంటాడు కవి.
రాయగా రాయగా భాష స్వాధీనం అవుతుంది కవికి.
రాయగా రాయగా రచనావిధానం సుపరిష్కృతం అవుతుంది కవికి.
రాయగా రాయగా క్రాంతదర్శిత నిశితం అవుతుంది కవికి.
రాయగా రాయగా తపస్సు సిద్ధించి మహర్షి అవుతాడు కవి.
"నానృషిః కురుతే కావ్యమ్"
మహర్షి కానివాడు కావ్యం రచించలేడు.
మహర్షి కానివాడు రచించినది కావ్యమూ కాలేదు.
మరి వొక్క రోజులో మహర్షి కాగలడా యెవ డయినా?
సోపానక్రమంగా ఎంతో సాధన కావాలి దానికి.

రాతప్రతి అయినా అచ్చుప్రతి అయినా గ్రంథం నలుగురి చేతుల్లోనూ పడ్డం ఆ సోపానాల్లో వొకటి.

అలాగ వొకటితరవాత వొకటిగా యెన్నో సోపానాలెక్కితే గాని తత్కర్తకు తన భంగపాటేదో తెలియదు.

తనకి సాధ్యం – సాధించుకోవలసింది – ఏమిటో తెలియదు.
అది తెలిస్తే గాని అడుగు ముందుకి పడదు.
పడితే తప్ప సిద్ధి యెక్కడిదీ?

తన గ్రంథం తానే అచ్చువేయించుకోవలసివస్తే మాత్రం ప్రేరణ దుర్బలమూ, సిద్ధి దుర్లభమూ అయిపోతాయి, కవికి.

ఈ విషయమై కొందరి కపవాద (మినహాయింపు) లుండవని కాదు; కాని మొత్తాని కిది కవులకు దౌర్భాగ్యం.

ఏమంటే?

తన గ్రంథం తానే అచ్చువేయించుకుంటే, పెట్టిన డబ్బు తిరిగీ రాబట్టుకోడమూ, తన సంసారం నిర్వహించుకోడానికీ మరో గ్రంథం అచ్చువేయించుకోడానికీ తగినంత లాభం లాగడమూ – ఇలాంటి ధోరణిలో పడిపోతాడు కవి.

దీనివల్ల అతని కవితాతపస్సు భంగపడిపోతుంది.
కవికి కాదు, తెలుసుకోగలిగితే జాతికే తీరని నష్టం అది.
అయితే, కవి అయినవాడల్లా దరిద్రుడయి వుండాలని కాదు.
కవి అయినవాడల్లా ధనికుడయి వుండకూడ దనిన్నీ కాదు.
ధనికత్వమూ నిర్ధనికత్వమూ లోకసామాన్యాలు.
మరి కవి?
లోకాతీతుడు.
కనక?

ధనసంపాదన కవికి ధ్యేయం కాగూడదు.

కవికే కాదు, ధనసంపాదన యే కళావేత్తకూ ధ్యేయం కాగూడదు.

నిశ్చింతగా – చిన్న యెత్తున అయినా అతనికి కాలక్షేపం జరిగిపోవాలి – అంతే.

పంచభక్ష్యపరమాన్నాలే అక్కర్లేదు, చారునీళ్ళతో కాలక్షేపం చేసినీ్న ఉద్గ్రంథాలు రచించగలడు కవి.

దారిద్ర్యమూ ఐశ్వర్యమూ కూడా ప్రేరకాలూ కాలేవు, భంజకాలూ కాలేవు కవిత్వానికి.

టాగూరు జమీందారు కనకనే – సాంసారికా లైన వడిదుడుకు లెరగనివాడు కాబట్టే అలాంటి ఉద్గ్రంథాలు రచించగలిగాడనీ, నోబిలుబహూమానమున్నూ గడించుకోగలిగాడనీ అనుకుంటూ డనుకర్త.

కవితాసమాధిలో కూచున్నాడా – సరి అయిన తాదాత్మ్యం సిద్ధించిందా, ఇక అతనికి భోగాలమీదికీ దృష్టి పోదు, కష్టాలూ కనపడవు.

నీరసం వచ్చి చెయ్యి ముడుచుకుపోగూడదు, పేగులు మాడి దృష్టి చెదిరిపోగూడదు, ఈ ప్రతిబంధకాలు కలక్కుండా వుండడానికే కవి కాహారం.

ధనికు డైనవాడి కయినా కవితావేశం కలిగినప్పు డిదే ప్రవృత్తి.

పర్సులో (బహూమితంగానే) డబ్బుండినా, దృష్టి రచనావ్యగ్రమై కదలలేక – కలమూ కాగితాలూ కిందబెట్టలేక, కూరల కోసం బజారుకి వెళ్ళాలన్న స్పురణే కలక్క, "కూరగాయలేవీ లేవు మరి" అంటూ వంటింటోనుంచి కేక వినవచ్చినా ప్రకృతిలో పడలేక, వేళకి మాత్రం పీటమీదికి వెళ్ళి – ఆ పూటకు వూరుగాయలతోనూ చారు మజ్జిగలతోనూ భోజనం అయిందనిపించుకుని చెయ్యి ఆరడం తడువుగా మళ్ళీ కలంపట్టి, దాంతో, ప్రపంచం మరిచిపోయిన సందర్భా లెన్నో వున్నాయి, నా జీవితంలో.

"ఏదో" రాయకుండా వుండలేని నా స్థితే యిలా వుండగా, పద్యబంధం చేసినా వచనరచనే చేసినా మహాకవులే అయివుండినవారి స్థితి యెలా వుండనూ?

తెలుసుకోగలిగితే, ఈ భౌతిక దేహం నిలుపుకోగలగడానికి ఫలానా మాత్రమే అగత్యం అన్న నిర్ధారణ లేదు.

వేషం విషయమై కూడా అంతే.

ఉజ్వలవేషంతో వీధిలోకి వస్తాడు కవి, ఒక్కొక్కప్పుడు.

ఎంత డాబురా అనుకుంటూ డల్పబుద్ధి.

చింకిపాతలతో కనపడతాడు కవి, మరొక్కొక్కప్పుడు.

"వో–ట్టి దరిద్రుడు" అనుకుంటుంది మాయలోకం.

పరిశీలిస్తే, ఆ భావనా యీ ఘోషణా కూడా అవివేకజన్యాలే.

ఏమంటే?

అతను మహర్షి అనడానికి నిదర్శనం అది.

ఆ చీనిచీనాంబరాలూ ఆ చింకి పాతలూ కూడా అతని ఇచ్ఛాపూర్వకాలు కావు.

లోకంలో శరీరధర్మాలు కొన్ని వున్నాయి.

సంసారంలో వున్నప్పుడు అవి తప్పవు.

కాని, కవి అయినవాడికి అవి గడిచిపోవడమే ప్రధానం.

కవితావేగాని కవి అడ్డంకులు కాలేవు.

భిల్లాంగనతో మన్మథతంత్రంలో మునిగిపోయివుండిన వాల్మీకే రామాయణం రచించాడు.

గాథారణ్యాల్లో తపోనిష్ఠుడయివుండిన కృష్ణద్వైపాయనుడే మహాభారత గాథలో ప్రముఖపాత్ర అయినాడు.

అంటే అంటని మహాకవుల యీ అవస్థ, లోకం బోధపరుచుకోనూ లేదు, అనుసరించా లేదు.

"ఆయన దరిద్రుడే; కాని సకలసంపదలకూ కారణభూతుడు. వల్లకాటిలోనే తిరుగుతూ వుంటాడు; కాని త్రిలోకాలకూ నాథు డాయన. భయంకరంగా కనబడతాడు; కాని శుద్ధసౌమ్యుడు" అంటూ నిర్వచించి "మహేశ్వరుడి యాథార్థ్యం తెలిసినవారు లే" రంది తపోనిష్ఠురాలయిన పార్వతి.

కవి యాథార్థ్యమూ అలాంటిదే.

మహామహావ్యాఖ్యాతలున్నూ నిర్ధారణ చెయ్యలేకుండా వున్నా రది.

మనిషి యెంత నిర్లిప్తుడు కావచ్చునో అంత నిర్లిప్తుడూ కాగలడు, ఎంత లిప్తుడు కావచ్చునో అంత లిప్తుడూ కాగలడు కవి.

ఇచ్ఛామాత్రా లతనికా అవస్థలు.

అతని చూపుమాత్రం యే అవస్థలోనూ వొకటే.

అది క్రాంతదర్శిత.

కనకనే ఆకాశసౌధాల్లో విహరించే అగర్భ శ్రీమంతుల భోగభాగ్యాలూ వర్ణించ గలడు, ఎలకల కలుగులవంటి చుట్టుగుడిసెల్లో తల దాచుకునే కటికిదరిద్రుల యమయాతనలూ చిత్రించగలడు, కవి.

సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా మరి దేనిమీదికీ దృష్టి పోదు, మనిషికి.

రకంలో భిన్నమే గాని రాశిలో అలాంటి మనోధర్మమే కవిదిన్నీ.

అయితే, జీవయాత్రలో భంగపాటు తటస్థపడితే, ప్రపంచం మనిగిపోయినట్టు గోలపెట్టేస్తాడు మామూలు మనిషి.

కాయికంగా బాధపడుతూ, మానసికంగా నిర్వికల్పు డయిపోతాడా స్థితిలో కూడా, కవి.

అతని తాదాత్మ్యతకు నిదర్శనం అది.

రసలోలుపత అలాంటి విశిష్టత కలిగిస్తుం దతనికి.

"రసో వై సః"

నిజమే; కాని రసనిష్ఠ రసికునకూ కలుగుతుంది, కవి యెక్కువ ఏమిటీ? అంటే, అంతానూ.

ఒకమాటలో చెప్పాలంటే రసికుని రసనిష్ఠ యేకదేశం.

రసికుడైనవానికి, కవి రచనలో, వొకప్పుడొక వాక్యంతో – లేదా వొక పద్యంతో బుద్ధి చమత్కృతం అవుతుంది.

హృదయం స్పందిస్తుంది.

ఆనందమున్నూ అనుభూతం అవుతుంది, దాంతో.

మరి, మరొకప్పుడు?

తక్కిన వాక్యాల - లేక - పద్యాల మాట?

ఏ రసికుడూ కూడా "ఈ కావ్యంలో యిక్కడే వుంది, ఇంతే వుంది రసం" అంటూ నిర్ధారణా చెయ్యలేడు, దానికి పరిమితీ కట్టలేడు.

ఏమంటే?

ఈశ్వరసృష్టివంటిది కవి సృష్టి.

కాళిదాసు రచనల కెందరో వ్యాఖ్యానాలు చేశారు.

ఎందరో యెన్నో సారస్యాలు తీశారు.

పూర్తి చెయ్యగలిగారా?

ఇంకా యింకా యెందరో కొత్త అందాలు చూపగలుగుతూనే వున్నారేం?

అయినా, యింకా యేదో నిగూఢంగా వుండిపోయినట్టే అనిపిస్తోందేం?

కవికీ రసికునకూ వుండే అంతరం అదిగో, అది.

రసికుని సత్తా సావధికం.

కవి సత్తా నిరవధికం.

ఇంతేకాదు.

అతనిది భౌతికం.

ఇతనిది ఆధ్యాత్మికం.

ఇంతమాత్రమున్నూ కాదు.

అఖండ గోదావరిలో జలపానం చేసే చలిచీమదీ, కవి రచనలో రసం ఆస్వాదించే రసికుడిదీ వొక్కటే అంతస్థు.

ఎంచేతనంటే?

రసికుడు రసపిపాసి మాత్రమే.

కవి రసస్రష్ట.

కాని ధనలోభం పుట్టిందా, కవి యీ శక్తి సన్నగిల్లిపోతుంది.

అటు దౌర్బల్యమూ ఇటు పతనమూను దీంతో, కవికి.

ఇలాంటిది తటస్థించకుండా వుండాలంటే, రసికు లైనవారు కవిని కనిపెట్టుకుని వుండాలి, సర్వకాలసర్వావస్థల్లోనూ.

కవికి, తన గ్రంథాలు స్వయంగా అచ్చువేయించుకునే దౌర్భాగ్యం పట్టకుండా చూడాలి.

చూడాలి కాదు, చూసుకోవాలి.

అంతమాత్రమే చాలదు.

కవిని ఆరాధించాలి.

కవిని అందలా లెక్కించాలి.

కవికి కనకాభిషేకం చెయ్యాలి.

ఇంతా చేస్తే కవి కిది "పత్రం పుష్పం ఫలం తోయ"మున్నూ మాత్రమే.

ఇక రసికులకా, ఇదే పరాయణం.

## 36

ఇదంతా మునుపు రాజులు చూసుకునేవారు.

ఇప్పుడు ప్రజలమీద పడింది.

"ఈ రాజాశ్రయం, అప్పుడు, కవుల సమ్యగ్దర్శనసత్తా భంగపరచలేదా" అంటే లేదనే చెబుతాను.

ఏమంటే?

అప్పటి ప్రజల కిలాంటి భావాలున్నాయా?

వారి దృక్పథం వేరు.

వారి అభిరుచులు వేరు.

వారి ఆశయాలు వేరు.

వారి విశ్వాసాలు వేరు.

వారి జీవనసరణే వేరు.

ఆ రాజులకూ ఆ కవులకూ ఆ జనులకూ సరిపోయింది.

ఆ రోజులే నయం, ఏ రాజో, యే మంత్రో, ఏ దండనాథుడో, యే రాజబంధువో, అవచి తిప్పయ్య వంటి యే రాజవణిక్కో కవిదీ తనదీ సత్తా ననుసరించి – సంస్కారమున్నూ అనుసరించి, అగ్రహారమో, వృత్తో, మాన్యమో, ద్రవ్యమో యిచ్చి కవి నాదరించేవాడు.

కవికి కాలం గడిచిపోయేది.

రాజాస్థానంలోనో, దేశాటనం చేస్తూ రసికుల సన్నిధినో తన రచన వినిపించి తన విశిష్టత ప్రకటించుకునేవాడు కవి.

తన అంతస్థు నిలుపుకునేవాడు కవి.

గ్రంథం రసవంతం – గొప్పది అన్నమాట పుట్టిందా, యెంత దూరమైనా నడిచివెళ్ళి, పచ్చిపులుసూ అత్తెసరు మెతుకులూ తింటూ రసికులు దానికి ప్రతులు రాసుకునేవారు, అన్ని పనులూ విడిచి.

ఈ విధంగా కవికీర్తి దిగంతవ్యాప్తం అయేది.

ఈ కారణంగా కవి కుత్సాహం పేటెత్తుతూ వుండేది.

వెనకటి అలాంటి రసికులే నిలుపుకుంటూ వచ్చా రుద్గ్రంథాలు, తత్కర్తలు కారు.

మరి యిప్పుడు?

ప్రజాసత్తాకం వచ్చింది, జనులకు నిరంకుశప్రభుత్వ పిశాచబాధ వొదిలిపోయింది.

అచ్చు వచ్చింది, రసికులకు ప్రతులు రాసుకోవలసిన అవస్థా తొలిగిపోయింది.

మరి కవికి?

అధికారం చేతికి వచ్చిందన్న వుబలాటమే గాని కవులను ఆదరించవలసిన బాధ్యత మీదపడిందన్న జ్ఞానం లేదు, మన ప్రజాసత్తాకానికి.

"మరి, ఆస్థానకవి పదవి ఏర్పాటు చెయ్యలేదూ?" అంటే, –

వాఙ్మయనిర్మాణం చెయ్యడాని కగత్యమైన ఆజ్ఞా అవకాశమూ వుందా ఆ యేర్పాటులో?

సాహిత్యానికీ, కవిత్వానికీ, కవిలోకానికీ దానివల్ల పొరిగిందేమిటి?

కాక:—

కవిత్వం అన్నా, కవి అన్నా సరి అయిన నిర్వచనం తెలిసినట్టుందా దాన్నిబట్టి చూస్తే?

పోనీ అంటే, — నా చిన్నప్పటికే కాదిప్పటికీ, కవికి — గ్రంథకర్తకు తగిన ప్రతిఫలం యిచ్చి కాపీరైటు హక్కులు కొనుక్కునే ప్రచురణకర్తలు బయలుదేరలేదు, మన తెనుగు గడ్డమీద.

ఇది ప్రచురణకర్తల తప్పన్నా కాదు, మన తెనుగు వారి వాఙ్మయప్రీతి అలా వుంది మరి.

ఏమంటే?

కవిసంగతి అలా వుండగా, —

కవి కిచ్చిన క్రియాధనమూ, అచ్చుపనులకూ ప్రకటన కార్యాలకూ పెట్టిన పెట్టుబడీ వచ్చి, తాను లక్షణంగా తినడానికీ, ఎప్పటికప్పుడు పెట్టుబడి పెడుతూనే వుండడానికీ తగినంత లాభమున్నూ రావాలి ప్రచురణకర్తకు.

వచ్చిన లాభం కాస్తా వడ్డీ మింగెయ్యకుండా వెంటవెంటనే పుస్తకా లమ్ముడుపోవాలి, ఎలాంటి ఉద్గ్రంథాలున్నా అచ్చువేయించడానికి ప్రచురణకర్త సిద్ధపడాలంటే.

మరి, యిలాంటి పరిస్థితులు కల్పిస్తున్నారా మనవాళ్ళు?

ఇది జనుల తప్పూ కాదు.

బ్రిటిషువాళ్ళు మనవాళ్ళని ఆ స్థితికి తెచ్చివెళ్ళిపోయారు.

అయితే అయిందంటే, ఆ జనులకు లోకజ్ఞానమూ, రసానందానుభూతీ కలగడానికి మన ప్రజాసత్తాకం చేస్తున్న దోహదం కూడా యేమీ లేదు.

ఈ విషయమై ఆవేదన వున్నట్టయినా చిహ్నాలు లేవు, మన ప్రజాసత్తాకంలో.

ఉన్న లోటంతా యిది.

మరో పెద్దలోటు మనకు నాయకుడు లేకపోడం.

రాజ్యాలకు రాజులో ప్రెసిడెంట్లో యెంత అగత్యమో ప్రజాసత్తాకాలకు నాయకు లంత అగత్యం.

నాయకులు పరంపరగా వెలుస్తూ, ఎప్పటికప్పుడు సరి అయిన దారిలో వెడుతూ వుంటే గాని ఏ జాతీ నిలకడగా వొక అంతస్థులో వుండదు.

ఏ జాతికి నాయకుడు లేడో ఆ జాతివారు, చదవ్వలసినవి చదవరు, చూడవలసినవి చూడరు, చెయ్యవలసినవి చెయ్యరు, మానవలసినవి మానరు.

వారు తమవారు చెబితే లక్ష్యపెట్టరు, అసలు వినవేవినరు.

పోనీ అంటే, ఇతరులు చెబితే దాసోహం అనకామానరు.

కప్పలతక్కెడకూ ఆ జాతికీ మాత్రమే పోలిక.

అచ్చంగా, యిప్పటికీ మన జాతి స్థితి యిది.

కాగా, — మన కవులకు ఎవరి గ్రంథం వారే అచ్చువేయించుకోడం తప్పనిసరి అవుతోంది.

మరి డబ్బు?

బువ్వే లేదు కడుపునిండా, డబ్బెక్కడిదీ కవులకు?

నోటు రాస్తే యెవరో వొక రప్పిచ్చేవారు దొరక్కపోరు.

డబ్బు చేతిలో పోస్తే పుస్తకం అచ్చువేసియిచ్చే ముద్రాపకులూ లేకపోలేదు, దేశంలో.

మరి, అచ్చుపని ముగిశాక?

అచ్చువెయ్యడం యెందుకో అది అచ్చుపడ్డాకే ప్రారంభం అవుతుంది.

దానిపేరు వ్యాపారం.

దాని దారి వేరు.

దానిక్కావలసిన ప్రవృత్తిన్నీ వేరు.

అది కవులకు దూరం.

అంటరానిదిన్నీ.

కాని, తన గ్రంథం తానే అచ్చువేయించుకోవలసిన కవి అలవర్చుకోక తప్పదది.

నిజమే; గాని సరిగా బోధపడదది.

రసవంతం కాదు కనక.

నడవనూ నడవదు కవి కది.

ప్రతిభ చాలక కాదు, ప్రకృతి కాక.

అంచేత, పెట్టిన డబ్బు తిరిగి రాదు.

రాదంటే రాకాపోదు మళ్ళీ.

కాస్తకాస్త వస్తుంది.

అది పులుసులోనే పడిపోతూ వుంటుం దెప్పటికప్పుడు.

ఇక అప్పులవాడు మిగులుతాడు.

అప్పులవాడిదీ వొక ధర్మమే, ఎవరి వస్తువు వారు భద్రపరుచుకోడం తప్పు కాదు కనక.

అప్పులబాధ అలా వుండగా, గ్రంథాలయాలవారు కొందరూ, పరిచితులూ స్నేహితులూ, బంధువులూ గ్రంథకర్త మీద పడతారు.

గ్రంథా లూరికే యిమ్మంటారు.

పోస్టేజీ పెట్టుకునిన్నీ పంపమంటారు, కొందరు.

దానాదీనా దృష్టి చెడిపోయి మరో గ్రంథం రాయడం – రసవత్తరంగా రాయడం కష్టం అవుతుంది కవికి.

కనీసం, దుర్బలం అయినా అవుతుంది, ధోరణి.

తెలుసుకోగలిగితే, జాతికే చుట్టుకుంటుందీ దౌర్భాగ్యం అటు తిరిగి, యిటున్నూ తిరిగి.

ఇలాకాక:–

ఏదోవిధంగా తన గ్రంథం అచ్చుకాకపోయినా కవికి అఘాతమే.

అదీ అతను మరో గ్రంథం రాయలేకపోడాని క్కారణమే అవుతుంది.

ఇక్కడ ప్రేరణకే గాని సత్తాకు ప్రసక్తి లేదు.

మంచిదయినా చెడ్డదయినా తన గ్రంథం జనుల కందుబాటులో వుండడమే కవి ప్రయత్నం.

అంచేత ఎలాగయినా నా వీరపూజ అచ్చు వేయించుకోవాలని వ్రతంపట్టా న్నేను.

## 37

భావనకేసి తిప్పవలసిన చూపు ధనికులకేసి తిప్పా నొకనాడు.

పిఠాపురం మహారాజులుంగారిని ఆశ్రయిద్దామని తోచింది వెంటనే.

కళావేత్తల కిలాంటి ఆశలు రేకెత్తించే దారోజుల్లో, ముక్కపాటి సుబ్బారాయడుగారి దివాన్గిరీ.

దీనికి సాయం, గురువులు వాక్సహాయం చేస్తారని ధీమా.

వెంటనే పిఠాపురం వెళ్ళాను.

"సాఫల్యం నిశ్చయమే" అన్నారు వేంకటరామశాస్త్రిగారు.

వీరపూజ విషయమై నా పరోక్షంలో సుబ్బారాయడు గారితో మాట్టాడివచ్చి, వెళ్ళి వారికి గ్రంథం చూపించి – అగత్యం అయితే వినిపించి రమ్మని పంపారు రామకృష్ణశాస్త్రిగారు నన్ను.

సంగతి చెప్పగా "వింటాను చదవండి" అన్నారు సుబ్బారాయడుగారు, సావధానత కనబరచి.

మొదట రెండు చరిత్రలు మాత్రమే వింటామన్నారు.

ఆ రెండూ విన్నాక అన్నీ వినిపించమన్నారు.

విని ప్రశ్నిస్తూ వచ్చారు, ప్రశ్నించి చర్చిస్తూనూ వచ్చారు.

పృథ్వీరాజు, గోరీని ఆరుమాట్లు విడిచిపెట్టడం దగ్గిర గంభీరంగానే జరిగిందీ చర్చ.

అనుకున్నదే నే నది.

ఎవరయినా అది చదివి – కనీసం విని అది గుర్తించకపోతే నాకేమి తృప్తి?

ఇంతవర కెవరూ చెయ్యని ఆక్షేపణ చేశా నక్కడ నేను.

కనక, చాలామంది నాతో భేదిస్తా రక్కడ.

మరి, భేదిస్తే?

ఏమవుతుందో చూడ్డమే నా నిశ్చయం, అటయినా యిటయినా.

ఈ నిశ్చయంతో నా వాదం విస్తరించా నావేళ.

సావధానంగా విన్నారు సుబ్బారాయడుగారు.

మూడోనాడు గ్రంథం పూర్తవుతుంది.

ఆవేళా వస్తుంది నా ఆక్షేపణ మరొకటి.

అక్కడా అభిప్రాయాలు భేదిస్తాయి, తప్పదు.

గురువుగారితో ముందే చెప్పా నీసంగతి.

"హఠవాదం మాత్రం చెయ్యవ" ద్దన్నారు వారు.

"సిద్ధాంతం సిద్ధాంతమే అని మాత్రం స్పష్టంగా చెప్ప" మనిన్నీ అన్నారు వారు.

గత రెండుదినాలూ జరిగిన పద్ధతే అది.

ఆవేళ పానుగంటి నరసింహారావుపంతులుగారు కూచుని వున్నారు, నేను వెళ్ళేటప్పటి కక్కడ.

పరిచయం లేదు; గాని పిఠాపురంలోనే రెండుమూడుమాట్లు చూసివున్నాను వారి న్నేను, దూరంగా.

సుబ్బారాయడుగారు నా సంగతి చెప్పగా విని, కీగంట మాత్రం చూసివూరుకున్నారు పంతులుగారు.

నే నది గుర్తించకపోలేదు.

వా రలా చెయ్యడాని క్కారణమూ లేకపోలేదు.

రామకృష్ణకవులంటే యిష్టం లేదు పంతులుగారికి.

కోటలో జరిగిన మొదటి శతావధానంలో కాబోలు రామకృష్ణకవులు "వాసింగన్న కవీశ్వరుండు" అన్న మీసాలపద్యం తమ్ముద్దేశించి చెప్పిందే అని అప్పణ్ణుంచీ పంతులుగారికి, వారంటే వులుకు.

ఇదంతా నా కప్పటికే తెలుసు.

ఆ రామకృష్ణకవుల శిష్యుణ్ణి నేను.

ఈ స్థితిలో సంభవించింది నా రచన వారున్నూ వినడం.

భీమసింహుని చరిత్ర మొదట చదివా నావేళ.

రాజపుత్రులు – వారిలో మిక్కిలీ శిష్టులని పేరుపొందిన మేవాడు రాణాలు, అల్లాఉద్దీనుకు పద్మినీదేవి నద్దంలో చూపించి, అతణ్ణి గౌరవంగా సాగనంపడమూ – ఆ సందర్భంలో అల్లాఉద్దీను భీమసింహుణ్ణి చెరపట్టడమూ – దీనిమీద నేను ఆక్షేపణ చేశాను.

అది విని చకితులయినారు పంతులుగారు.

అది గుర్తించి సుబ్బారాయడుగారు పృథ్వీరాజు సంగతి కూడా వినమన్నారు పంతులుగారిని.

నేను చదివాను.

వినివిని "శతాబ్దులు గడిచాయి. ప్రపంచంలో చారిత్రిక విమర్శకు లెందరో ఆ ఘట్టాలు చదివే వున్నారు; కాని వారెవరూ చెయ్యని ఆక్షేపణ లివి" అన్నారు పంతులుగారు, కళ్ళుచికిలించి చూస్తూ వ్యంగ్యంగా.

అది భరించలేకపోయా న్నేను.

"సుబ్రహ్మణ్యశాస్త్రి వొక్కడే చెయ్యగల పని అది" అన్నానుకూడా, పెంకిగా.

పంతులుగారు మరి మాట్లాడలేదు.

ఎదటివాణ్ణి, యిట్టే మాట అనేస్తారు కొందరు; తమకున్నూ అలాంటి మాట వచ్చి తగులుతుందన్న యింగితజ్ఞత లేకుండా.

సుబ్బారాయడుగారివంటి గంభీరులు మిక్కిలీ తక్కువగానూ వుంటారు లోకంలో.

ఆ చదవడం చదవడం భీమసింహుని చరిత్ర పూర్తిచేసి ప్రతాపసింగు రాణా చరిత్ర కూడా చదివాను, తరవాత.

పంతులుగా రది సూటిగా వినలేదు.

ఉండనూ లేదు, చివరికి.

సుబ్బారాయడుగారికీ పంతులుగారికీ వుండిన పరిచయం సంగతి నాకు తెలుసు.

మహారాజులుంగారికీ పంతులుగారికీ వుండిన దోస్తీ సంగతి కూడా వినేవున్నా న్నేను.

కనక, నా ప్రయత్నం విఫలం అయితే కావచ్చు.

ఇది నిశ్చయమున్నూ చేసుకున్నాను.

ఏమయినా, భిన్నాభిప్రాయం కనబరిచినవారిని గౌరవించగలనుగాని – విమర్శలు వచ్చినా సావధానత కనబరచగలను గాని – వెక్కిరింతలు సహించలే న్నేను.

ఇదంతా విని గురువు లిద్దరూ చకితులయినారు.

ఇలాంటి సందర్భాలు చాలా చూసీ, వినీ వున్నారు వారు.

"ఇది అపశకున" మన్నారు వేంకటరామశాస్త్రిగారు.

"కావచ్చు" నన్నారు రామకృష్ణశాస్త్రిగారు.

ఇందు కనుగుణంగా, మర్నాడు నేను వెళ్ళీ వెళ్ళడంతోనే "మీ గ్రంథం విషయం ప్రభువే ముందు ప్రస్తావించా" రన్నారు సుబ్బారాయడుగారు.

"రాకపోకల ఖర్చుల నిమిత్తం మీకందచెయ్యమని గురువుల దగ్గిరికి యాభైరూపాయలు పంపించారుకూడా" అనిన్నీ చెప్పారు వారు.

ప్రభువే ముందు ప్రస్తావించడంలో అర్థం వుంది.

"కారణం స్పష్టమే" అంటూ గురువులూ వొప్పుకున్నా రది.

యాభైరూపాయలు పంపడంలో మాత్రం సమన్వయం కుదరలేదు నాకు.

"మరి ఆ ద్రవ్యం పుచ్చుకోడమూ మానడమా?"

"నా ధోరణి గుర్తించి యిప్పటికి పుచ్చుకోండి" అన్నారు సుబ్బారాయడుగారు.

బసకి వచ్చాక గురువులూ ఆ మాటే అన్నారు.

ప్రయత్నం వొకటీ పర్యవసానం వొకటీనీ.

ఎక్కడా కూడా సన్నిధానవర్తుల ధోరణి వొక్కలాగే వుంటుంది.

నా సిద్ధాంతాలు నచ్చకపోతే కోరిక తిరస్కరించాలి, లేకపోతే కారణాంతరా లేమిటో చెప్పి వీలులేదనాలి, చివరికి దర్శనమే యివ్వకపోవాలి; గాని యిదేమిటీ యాభైరూపాయ లివ్వడం?

రాకపోకల ఖర్చు లివ్వడమే అయితే అయిదు చాలు, యాభై యెందుకూ?

ప్రభువులైన వారంత తక్కువ యివ్వ రంటే యెటూ కాకుండా యివ్వడం యేమనాలి?

ఇప్పించేవా రొకరు – ఇచ్చేవా రొకరు – ఇవ్వకుండా చేసేవా రొకరు – స్పష్టంగా ముగ్గురు కనపడుతున్నా రిక్కడ.

దర్శనం చేసి నేను వాచా కోరకుండా – నేను కాగితం రాసి పంపుకోకుండా – సుబ్బారాయడుగారున్నూ యేమీ చెప్పకుండా నా గ్రంథం విషయమూ, నా ఆక్షేపణల సంగతీ ప్రభువు కెలా తెలిసిందీ లేకపోతే?

ఏమయినా, నేనా డబ్బు పుచ్చుకోకపోతే, నా విషయమై సుబ్బారాయడుగారి దగ్గిర అలాంటి ప్రయత్నం చేసిన గురువులు బాధ్యు లవుతారు మహారాజులుంగారి యెదట.

నేను బాగానే వుంటాను, చిక్కు గురువుల కవుతుంది.

ఇది నాకు శ్రేయస్కరమా?

పోనీ, ధర్మమా?

ఆ డబ్బు పుచ్చుకోడం అనివార్యం అయిపోయింది నాకు.

ఒక్క తృప్తిమాత్రం మిగిలింది.

"లోకం గతానుగతికం. వేత్తల మనుకునేవారున్నూ శుద్ధసత్వాలు వొప్పక్కో లేరు, సాధారణంగా" అన్నారు, స్టేషనుదాకా వచ్చి రెయిలు కదులుతుందనగా రామకృష్ణశాస్త్రిగారు.

"చాలు" అనుకుని నిర్వికారంగా యింటికి వచ్చేశా న్నేను.

## 38

పిఠాపురం వెళ్ళేటప్పటికి హోటల్ భోజనం చెయ్యగూడదన్న నియమం విడిచిపెట్టేశా న్నేను.

అయితే, దినమ్మూ హోటల్లో భోజనం చేస్తే ఆరోగ్యం చెడుతుందన్న భయం అటూ, విద్యార్థి అయినవాడికి వారాల భోజనమే శ్రేయస్కరం అన్న నమ్మకం యిటూ బలంగా వుండడంవల్ల నే నక్కడ కూడా వారాలే చేసుకున్నాను, కొన్నాళ్ళు.

కాని, వల్లూరిలోనూ, వేట్లపాలెంలోనూ, కానూరగ్రహారంలోనూ అడిగినంత చురుగ్గా యెవరినీ నే నక్కడ వారా లడగలేకపోయాను.

హోటలున్న వూరుగదా, గృహస్థులను మొగమాటపెట్టమా అన్న సంశయం పీడిస్తూనే వుండింది నన్ను.

వేదశాస్త్రాలు చదువుకునే విద్యార్థుల్లా కాక, నేను లౌక్యవేషంతో వుండడం కూడా నా వెనకతీతకు కొంత కారణం అయింది, చెప్పకేం?

ఆ వేషం నాకో వింత అనుభవం కూడా కలిగించిం దొకనాడు.

ఆవేళ మా అత్తవారి యింటికి ముక్కామల వెడదామని బయలుదేరాను.

అప్పటికి నేను పంచాంగం చెయ్యడం మానుకుని వున్నాను, జాతకాలూ ప్రశ్నలూ మాత్రం చెబుతున్నా నింకా.

అనుకోకుండా, అప్పుడప్పుడు కొంచెంకొంచెం డబ్బు దొరుకుతూ వుండడం అందు క్కారణం.

రెండు గోదావరులు దాటి అడ్డదారిన నడిచివెళ్ళడమున్నూ అప్పటికి మాను కునివుండడంవల్ల ఉదయం యేడున్నరకి అనపర్తిలో రెయిలెక్కి తొమ్మిదిన్నరకి నిడదవోలు చేరుకున్నాను.

ఆ సమయానికి, నరసాపురం వెళ్ళే మెయిలు బోటుండేది; కాని ఆవేళ దాటిపోయింది.

దాటిపోయిందంటే దానికది కాదు, డెల్టాకుసంబంధించిన వుద్యోగి వొకాయన సకుటుంబంగా బయలుదేరి, నిర్ణీత సమయానికి గంటకి ముందే గెంటించుకుపోయాట్ట, తన బిళ్ళబంట్రోతుచేత కళాసులనూ, కళాసులచేత బోటున్నూ.

అక్కడికి పదిహేనుమైళ్ళకి పైన వుంది ముక్కామల.

రహదారీ పడవమీద వెళ్ళవచ్చు; కాని రాత్రి తొమ్మిదింటి దాకా నిడదవోల్లో పడివుండాలి, వుసూరుమంటూ.

అయినా సరే అంటే, తెల్లవారుజాము నాలుగించిగ్గాని, ముక్కామల వెళ్ళలేము.

రోడ్డుంది గాని బస్సుల "ఐడియా"యే లే దప్పటికి.

టూరింగుకార్లే బహూ తక్కువ ఆరోజుల్లో.

అంచెజట్కాల పద్ధతిన్నీ యేర్పడలే దప్పటికి.

కాగా, నడిచివెళ్ళడమే గతి అయిం దావేళ.

అడ్డదారిని వెడితే పాలమూరినుంచి యెంత దూరం నడవాలో నిడదవోలినుంచిన్నీ అంతదూరమూ నడిచివెళ్ళవలసి వచ్చింది.

అయితే పది కావస్తోందప్పటికే, యెంత వురుకులూ పరుగులూ పెట్టినా మూడయినా అవుతుంది ముక్కామల వెళ్ళేటప్పటికి.

అప్పుడూ భోజనం.

ఇది బాగాలేదని వూళ్ళోకి బయలుదేరాను, బ్రాహ్మల యిళ్ళు వెతుక్కుంటూ.

ఒక బ్రాహ్మ డెదురై "ఇక్కడ కాదు. దారే కనక అట్లపాడు వెళ్ళండి, మీ కక్కడ యెవరయినా పెడతారు భోజనం" అన్నాడు.

కాలవ దాటితే, కాలవపక్కనే అట్లపా డక్కడికి మైలు.

రేవులో స్నానసంధ్యాద్యనుష్ఠానాలు నిర్వర్తించుకుంటున్న ఆ వూరి బ్రాహ్మలు "డి.పి.డబ్ల్యూ. మానేజరుగారి యింటికి వెడితే యెందరికయినా భోజనం పెడతా"రని చెప్పా రడగ్గా.

వెతుక్కుంటూ వెళ్ళాను.

మండువా హాల్లో పదిపదిహేనుగురు కూచుని వున్నారు, దర్జాగా కొందరూ, కొంచెం వొదిగివొదిగి కొందరూను.

వార్రిలో యెవరు ఎవరో తెలియదు, ఉద్యోగస్థు లన్నట్టు మాత్రం వున్నా రందరూ.

"మానేజరుగా రెవ" రని నే నడగడమూ, వొకాయన వారిని చూపించడమూ "యేమి పనిమీద వచ్చా" రని మానేజరుగారు నన్నడగడమూ వెంటవెంటనే జరిగిపోయాయి.

"నా కీపూట భోజనం కావాలి. ఎవరి కయినా మీరు పెడతారని విని వెతుక్కుంటూ వచ్చా" నని బదులు చెప్పాను, క్లుప్తంగా నేను.

మిక్కిలీ సూటి అయిన మాట యిది.

వైదికులయినవారి కిందులో అసందర్భం కనపడకపోడమే కాదు, మంచి సంప్రదాయమున్నూ కనపడుతుంది.

కాని, అక్కడివారిలో చకితులై కొందరు నాకేసి వింతగా చూశారు, పకాలుమని నవ్వేశారు మరికొందరు.

మానేజరుగారు నిశ్చలంగానే వున్నారు మొదట; కాని కొంచెం చురుగ్గా చూశారు, తరవాత అటు.

ఆ నవ్వులూ ఆ చూపులూ వికటంగా కనపడ్డాయి నాకు.

"ఏం, నవ్వుతారేం?" అనడిగా న్నేను, అసంతృప్తి కనపరుస్తూ.

అప్పుడు తటాలున లేచి నా దగ్గిరికి వచ్చి మా యింటి పేరడిగారు మానేజరుగారు.

నేను చెప్పాను.

"అంటే, వైదికులా?" అని మళ్ళీ అడిగారు.

"అవు"నన్నా న్నేను.

వెంటనే నా చెయ్యిపట్టుకుని దయచెయ్యండంటూ లోపలికి తీసుకువెళ్ళి పక్కని కూచోబెట్టుకుని "ఇక్కడ వున్నవాళ్ళం మేమందరమూ నియోగులం. ఒకరిద్ద రితరులూ వున్నారనుకోండి, అయితే, అన్నదాతలచేత 'ఈపూట భోజనం చేసి వెళ్ళండి' అనిపించుకుంటాం మేము యుక్తిచేసి. ఆ యెత్తు సాగకపోతే, ఆ పూటకి పస్తుంటాం, గాంభీర్యం చెడకుండా. 'అన్నం పెట్టండి' అని మాత్రం యెవరినీ అడగం. ఇది మంచిదా చెడ్డదా అన్న విచారణ వద్దు. ఏమంటే? ఒక విధంగా మంచిదీ మరొక విధంగా చెడ్డదీని. అడిగించుకోడం మా పద్ధతీ, అడగడం మీ సంప్రదాయమూను మరి. రెండూ సమర్థనీయాలే శాఖామర్యాదలనుబట్టి; కాని మీ విషయమై కొత్త సమస్య వచ్చింది మావాళ్ళకి. మీ వేషం లౌక్యంగానూ, మీ ప్రకృతి వైదికంగానూ వుండడమే అందు క్కారణం. ఇప్పు డిక్కడ, మీ మాటమీద కొందరు చకితులయినా రన్నా, కొందరు నవ్వనే నవ్వా రన్నా మీ వేషమూ మీ ప్రవృత్తీ సమన్వయపరుచుకోలేకపోడమే కారణం. ఎవరికీ హేళన భావం లేదు, నమ్మండి. మీ కిక్కడ భోజనానికిన్నీ లోటులేదు, కూచోండి వేళ అవుతోంది" అన్నారు సాదరంగా.

మావూళ్ళో నియోగులు – సంపన్న నియోగులే వున్నారు కనక, నాకు బాగా తెలుసు ఇది.

కొన్ని వైదికసంప్రదాయా లిప్పటికీ విడిచిపెట్టలేకుండానే వున్నాను; కాని అప్పటికే నా వేషం మారివుంది, నిజమే.

కాగా, మానేజరుగారు చెప్పినదాంతో తృప్తిపడ్డాను.

తరవాత, నేను నేర్చిన విద్యలసంగతి వచ్చింది.

ప్రశ్న చెప్పమన్నారు మానేజరుగా రవ్యధానంగా.

ఫలితం చెప్పా నాలోచించి నేను.

ఆ విద్యలో తమకూ ప్రవేశం వున్నట్టు తేల్చి, నేను ఆలోచించిన విధానం చెప్పమన్నారు వారు.

చెప్పాను.

కొంచెం చర్చ సాగింది.

ఎదురువాదం చేశారు మొదట; కాని వారు గుర్తించని క్రూరగ్రహవిశేషదృష్టి నేను సూచించగా, నా నిశ్చయం అంగీకరించా రిష్టపూర్తిగా.

అతిథి అన్నది మాత్రమే కాక, పండితు డన్నదిన్నీ ఆదరభావం కలిగించింది నా యెడల వారికి, దాంతో.

ప్రశ్న చెప్పినందుకు నాలుగు రూపాయలు సత్కారమున్నూ చేశారు వారు.

మృష్టాన్నభోజనం చేసి, విశ్రమించి, బయలుదేరి వెళ్ళిపోయా నక్కణ్ణుంచి రెండయాక.

## 39

ఇలాగ చాలా విశేషం వుంది వేషంలో.

మనకంటే యెక్కువ శ్రద్ధగా వుంటారీ వేషం విషయమై యితర మతాలవారూ యితర ఖండాలవారున్నూ, స్త్రీలూ పురుషులూ కూడా.

మనలోనయినా వేషభాషలనే నానుడి.

వీధిలోకి వెళ్ళేవారి కవి రెండూ యెంత బాగా వుంటే అంత మన్నన.

"బాగా వుండడం" అంటే, డాబుగా వుండడం అని కాదు, నీటుగా వుండడం.

అయితే, వేషం విలవా తెస్తుంది, విలవా చెరుపుతుంది, మనిషికి.

జనసామాన్యం భాషదాకా వెళ్ళలేదు, వేషం చూసే ప్రవృత్తి నిర్ణయించేస్తుంది, తరవాత మార్చుకోవలసివచ్చినా.

డబ్బు కాదు, చదువూ కాదు, సామాజిక ధర్మానికి లోబడ్డ చిత్తవృత్తి కారణం వేషానికి.

సామాజికధర్మం అనెందు కన్నానంటే, వొక్కొక్క దేశం – వొక్కొక్క మతం – వొక్కొక్క ప్రాంతంవారి వేషం వొక్కొక్కవిధంగా వుంటోంది లోకంలో.

వేషం చూసి మనిషిని అర్థం చేసుకోవచ్చు, చాలామట్టుకి.

వేషమూ భాషా – అంటే మాటతీరూ వీటివల్ల తమ అంతరప్రవృత్తి పైకి పొక్కకుండా గుప్తపరుచుకోగలవారి సంఖ్య బహూ తక్కువ, లోకంలో.

అయితే, వారు పక్కావ్యవహర్తలో, శుద్ధవంచకులో అయివుంటారు.

కాని జీవితానికింత ప్రాధాన్యం వహించే వేషం విషయమై మన తెనుగువారి కిప్పుడు శ్రద్ధా లేదు, సంప్రదాయ గౌరవమూ లేదు, అనుకరణ పరాయణత్వం తప్పించి.

ఇక తెనుగుతనం యెలా నిలుస్తుందీ వారికి?

మంచి యెక్కడ వుంటే అక్కణ్ణుంచి అది గ్రహిస్తా మంటారు మనలో కొందరు, మన సంప్రదాయం మంచిచెడ్డలు మాత్రం లేశమూ యెరగరు.

ఇదిగాక, – "భారత జాతీయత" అంటూ పెద్దపెద్ద మాటలు వాడేస్తారు కొందరు, అదెక్కడుందో మరి.

భారతదేశానికి ప్రత్యేకభాష యేదీ, ప్రత్యేకవేషం యేదీ, ప్రత్యేక సంప్రదాయమున్నూ యేదీ భారతజాతీయత రూపొందడానికీ?

ఈ విషయమై మనవారికి సరి అయిన పరిజ్ఞానం వున్నట్టు లేదు, పరప్రత్యయనేయత తప్ప.

సేతువు మొదలు శీతాచలం దాకా తరుచు తిరుగుతూ వుండిన్నీ యీ విషయం గ్రహించనివారే వున్నారు, మనలో చాలామంది.

గుజరాతీలూ, మహారాష్ట్రులూ, అరవలూ, మలయాళీలూ, కన్నడులూ, ఓఢ్రులూ, బెంగాలీలూ, పంజాబీలూ – వీరి ప్రత్యేక భాషలూ, ప్రత్యేక వాఙ్మయాలూ, ప్రత్యేక సంస్కారాలూ, ప్రత్యేక సంప్రదాయాలూ, ప్రత్యేక వాంఛలూ, ప్రత్యేక ప్రాప్యాలూ, ప్రత్యేక ప్రయత్నాలూ, ప్రత్యేక దృక్పథాలూ చూస్తూవుండిన్నీ భారతజాతీయత అంటూ మనవారిలో కొంద రెలా మాట్లాడతారో అది వారికే తెలియాలి.

పోనీ, పైని చూపినవారిలో యెవరిది భారతజాతీయతో చెప్పగలరా ఆ మాట్లాడేవారు?

ఈ అసందర్భపు చిత్రవృత్తికి తోడు ఉత్తరదేశపు రాజకీయాల పక్షాల వ్యామోహం వొకటీ మనవాళ్లకి.

ఆంధ్రులందరూ – ముఖ్యంగా ఆంధ్రనాయకు లందరూ యేకం కావాలిట నుంచున్నపాళంగా, యెలా అవుతారు మరి, తమ కాత్మీయసంస్కారం అబ్బందే?

అయితే, యీ చర్చ మరొకప్పుడు.

పిఠాపురంలో నా వారాల భోజనం సంగతి ప్రకృతం.

ఎలా అయితేం, నెలదినాలు గడిచేటప్పటికి స్టువర్టుపేటలోనే ఆరువారాలు కుదిరాయి నాకు.

మూడు మాసాలు గడిచినా – వూళ్ళో కూడా ప్రయత్నించినా ఏడోవారం శనివారం మాత్రం కుదరలేదు.

గురువులు తమయింట భోజనం చెయ్యమన్నారు; గాని మొగమాటపడిపోయాను.

ఒక శనివారం రాజావారి సత్రానికి వెళ్లాను, మధ్యాహ్నిక భోజనం మాత్రం పెట్టిపొమ్మన్నారు.

మరో శనివారం బాదం (?) వారి సత్రానికి వెళ్లాను, పదకొండు కొట్టేదాకా అదిగో యిదిగో అంటూ జరిపి "ఇంతవరకూ వంటబ్రాహ్మడు రాలేదు, భోజనం దొరక" దనేశాడు గుమాస్తా.

ఇంకో శనివారం మరో అసందర్భం జరిగింది.

శుక్రవారంనాడు, రాజా శ్రీ రావు చెల్లాయమ్మారావు జమీందారుగారి దివాను ఆకొండి వేంకటరత్నం పంతులుగారి యింట వారం నాకు.

వారి యింటికి చేరే మహారాజులుంగారి భావమరిది శ్రీ సోములుదొరగారి యిల్లూ, నేదునూరి శంకరంగారి యిల్లూను.

శుక్రవారం సాయంత్రం, నేనూ వేంకటరత్నంగారి పెద్ద కుమారులు కామరాజు గారూ, సోములుదొరగారి తండ్రిగారూ దొరగారి అరుగుమీద కూచుని యేదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నాము.

ఇంతలో నేదునూరి శంకరంగారు వచ్చి మాటలో మాట కలిపి "రేపు మా

యింటికి భోజనానికి రండి" అని పిలిచారు నన్ను.

అదెందుకో నా కవగాహన కాలేదు గాని పెద్దమనిషి రమ్మంటే తిరస్కరించడం ధర్మం కాదు కనకా, నా కది వారం లేని రోజుకూడా కనకా, "సరే" అన్నా నిష్టాపూర్తిగానే.

ఇది ప్రభాకరశాస్త్రిగారికి ప్రత్యుత్తరం రాసి కవితలో ప్రకటించిన మలీవారం జరిగింది.

ఆ పద్యాలు కామరాజుగారు చదివారు.

కామరాజుగారూ, రామకృష్ణకవులూ, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారూ దగ్గిరో దూరమో బంధువర్గానికి చెందినవారు.

కాగా, – కామరాజుగారు, తిరుపతివేంకటకవులనూ కాదనలేరు, రామకృష్ణ కవులనూ కాదనలేరు.

అయితే, వొకవ్వూళ్ళో కాపరాలు కనకా, తాము సాహిత్య ప్రియులు కనకా, తరుచు రామకృష్ణకవుల దగ్గిర కూచుని సాహిత్య చర్చలు వింటూ ఆనందించేవారు.

శంకరంగారు తిరుపతి వేంకటకవుల పక్షం.

రామకృష్ణ కవులంటే ద్వేషం కూడానుట.

ఈ సంగతి, తమ యింటోనే నేను మడికట్టుకుని వారి యింటికి భోజనానికి వెళ్ళేటప్పుడు పనికట్టుకుని కామరాజుగారే చెప్పారు, మరి యే మనుమానించారో?

దీనిమీద, శంకరంగారు ఆ వుభయుల ప్రస్తావనా చెయ్యక మానరనుకుంటూనే వెళ్ళా న్నేను.

అనుకున్నట్టే జరిగింది.

ప్రస్తావన చెయ్యడమే కాదు, చాలా అసభ్యంగా కూడా ప్రవర్తించారు శంకరంగారు, తీరా భోజనం ప్రారంభించాక.

సగం భోజనం అయేదాకా నాయెడల ఆయన కనబరిచిన దయ అంతా యింతా కాదు, ఇప్పటికీ కళ్ళకు కట్టినట్టుంది నాకు.

అది నే ననుకున్న ప్రస్తావనకు నాంది అని మొదటే నాకు స్పష్టం అయిపోయింది.

అది యెలా కొనసాగుతుందో మాత్రం వూహించలేకపోయాను, కాస్తా కూడా.

అదృష్టవశాన శంకరంగారి బంధువున్నూ వొక వృద్ధులున్నారు బంతిలో.

దొడ్డంపేట సంస్థానసిద్ధాంతు లయిన మా నాయనగా రంటే మిక్కిలీ ఆదరాభిమానాలున్నవా రాయన.

మా యింటిపేరూ నా పేరూ తెలుసుకుని, మా నాయనగారి పేరు జ్ఞాపకం రాగా "ఏమవుతారు మీ"కనడిగి, సంగతంతా విని నేను కనపడ్డందుకు చాలా సంతోషమున్నూ కనపరిచా రాయన.

శంకరంగారున్నూ రాజా శ్రీ వాడ్రేవు రంగనాయకమ్మ జమీందారుగారిని చూసయినా నా విషయమై సభ్యంగానే ప్రవర్తించవలసినవారు.

కాని, కొంతసేపటికి వంటలక్క అలా చారు వడ్డించి వెళ్లింది, ఆయన యిలా సోరంటాలు మొదలుపెట్టారు.

ఆ పద్యాలు న న్నుపసంహరించుకో మని ఆ సోరంటా లయినా.

తిరుపతివేంకట కవులు మహానుభావులుట.

రామకృష్ణకవుల లెక్కేమిటట.

ఆ పద్యా లుపసంహరించుకోడమే కాదుట, రామకృష్ణ కవులను విడిచిపెట్టేసి, వెళ్ళి వేంకటశాస్త్రిగారి నాశ్రయించాలిట నేను.

"ఏమిటి మీరు చెప్పే" దనడిగా న్నేను, భోజనం ఆపుచేసి.

మళ్లీ చెప్పా రాయన, మరికాస్త విస్తరించి.

నాకు చాలా కోపం వచ్చింది.

అనిష్టుల విషయమై భోజనాని క్కూచోపెట్టి బ్రాహ్మణ స్త్రీలు మాత్రమే చేసే పద్ధతి యిది.

నన్నుద్ధరిద్దామనే అనుకున్నారు; గాని శంకరంగారీ అనుపపత్తి చూసుకోలేదు.

"పిలిచి భోజనం పెట్టినవార"న్న ఆదరభావం విడిచిపెట్టేశా న్నేనున్నూ.

"తిరుపతి వేంకటకవులు మహానుభావులో రామకృష్ణకవులు మహానుభావులో, వారూ వారూ కూడా మహానుభావులేనో – వారూ వారూ వున్నారు, చదువుకున్న సరసులూ వున్నారు, మీరు దిగవద్దా ప్రసక్తిలో" అన్నాను, వెంటనే నేను.

"మీకు తిరుపతి వేంకట కవులమీద భక్తి వుంటే కావలసినంతా – మీకు చేతనైనంతా కూడా చూపించుకోండి, వారి యెడల. రామకృష్ణ కవులమీద యిష్టం లేకపోతే అదీ చూపించుకోండి, చేతనయినంతా; కాని నా విషయమై మీరేమీ కలగజేసుకోవద్దు" అని దృఢంగా చెప్పాను.

మాటమీద మాట పెరిగింది.

దురుసుమాటలు ప్రారంభం అయినాయి.

"ఆ, ఆ, ఏమి చేస్తున్నావు శంకరం? పిలిచి భోజనానికూచోపెట్టా తగువులాడ్డం?" అంటూనే వున్నారు వృద్ధులు.

శంకరంగారు వినిపించుకోలేదు.

నేనూ వెనక్కి తగ్గలేదు.

"నువ్వెంత" అంటే "నువ్వెంత" దాకా వెళ్ళిపోయింది.

"నే నా పద్యాలు పసంహరించుకోను సరిగదా, మీ యీ లౌక్యానికి నిరసనగా, మీ తిరుపతివేంకట కవులమీదే రాస్తాను పద్యాలు, తెలుసా? ఇంతకీ, – ఇంత దుశ్చింతతో భోజనానికి రమ్మన్నారు మీరు, మీ యింటో నేను భోజనం చెయ్యడం చాలా పొరపాటు" అనేశాను.

అంటూనే ఉత్తరాపోశనం పట్టేసి చఱ్ఱున బయటికి చక్కా పోయాను.

కామరాజుగారూ, సోములు దొరగారి తండ్రిగారూ దొరగారి అరుగుమీద కూచునివున్నారు.

నా వాలకం చూసి "యేమయిందేమిటి?" అనడిగా రిద్దరూ, ఆత్రంగా.

అంతా విని చాలా నొచ్చుకున్నారు.

"తరవాయి మా యింటో భోజనం చెయ్యండి" అన్నారు కామరాజుగారు; కాని నే నంగీకరించలేదు.

"అయితే వుండండి" అంటూ మజ్జిగ తెప్పించి, పుచ్చుకునేదాకా బలవంతపెట్టారు దొరగారు.

ఆ సాయంత్రం గోష్ఠిలో కామరాజుగారే తెచ్చారు గురువుల దగ్గిర యీ ప్రసంగం.

వేంకటరామశాస్త్రిగారు చకితులు కాగా, ఉగ్రులయి పోయారు రామకృష్ణశాస్త్రిగారు.

ఏమయినా, దీంతో "పిఠాపురంలో శనివారం మనకి శనిగొట్టుదినం అయిపోయిం"దని స్థిరపరుచుకున్నా న్నేను.

తరవాతి శనివారంనాడే హోటల్ భోజనం ప్రారంభించా నావేళమట్టుకి, మరి వారం ప్రయత్నం చెయ్యలేదు.

## 40

"మరి, ప్రయత్నం చెయ్యలే" దన్నాను.

అంటే, నాకు నేనయి ప్రయత్నించలేదు.

అయినా, శనివారంనాడున్నూ వారం భోజనం తటస్థించింది నాకు.

అప్రయత్నమే కా దది, అనుకోనిదిన్నీ.

ప్రతీ మనిషికీ తటస్థిస్తూనేవుంటా యప్పుడప్పుడిలాంటి వెన్నో.

వాటికి కార్యకారణసంబంధాలు కనపడ వొక్కొక్కప్పుడు.

ప్రబుద్ధాంధ్రకు రెండో సంవత్సరం నడుస్తోంది.

మానేజిమెంటు సరిపడక నష్టం రాగా సొంత ముద్రాక్షరశాల అమ్మేసి, కాకినాడ స్కేపు అండుకోలో అచ్చు వేయిస్తున్నా నప్పుడు.

ఒక నెల అరువిస్తారు వారు.

అంటే, వెనుకటి నెల బిల్లు చెల్లిస్తే వచ్చేనెల సంచిక అచ్చు వేసి యిస్తారు వా రరువుగా.

ఉదయం పనివాళ్లు స్టిక్కు పట్టేలోపున రచనలిస్తే సాయంత్రానికి సంచికలు బైండున్నూ చేసి యిచ్చేవారు వారు.

తమ వాగ్దానం ప్రకారం గతమాసం బిల్లు కొవ్వూరి బసివిరెడ్డిగారి రెండో కుమారులు శ్రీ సూర్యనారాయణరెడ్డిగారు చెల్లించేసి వుంటారు, కనక, కాకినాడ వెడితే చాలు, పన్నెండుగంటల పని.

దీపాలు పెట్టాక తొస్సిపూడిలాకు దగ్గిర పడవ యెక్కితే తెల్లవారేటప్పటికి కాకినాడ – మళ్ళీ దీపాలు పెట్టాక భోజనమున్నూ సావకాశంగా కానిచ్చుకుని కాకినాడలో పడవ యెక్కితే తెల్లవారేటప్పటికి తొస్సిపూడిలాకు – రానూపోనూ పడవకేవు రెండణాలు.

కాకినాడలో రెండుపూటలా పెరుగుతో భోజనం అర్థ రూపాయి, వెరశి పదణాలు కావాలి; గాని పదికాసుల్లేవు చేతిలో.

ఇరుగు పొరుగువారిలో చేబదు ల్లివ్వగలవారా సమయాన ఇళ్ళల్లో లేరు, వంట మాత్రం అయిపోతోంది ఇంటో సాయంత్రం అయిదుగంటల వేళ.

వెళ్ళాలి.

లేకపోతే నిశ్చితదినాన పోష్టు చెయ్యడం పడదు, పడకపోతే అదో పేచీ పోస్టల్ డిపార్టుమెంటుతో.

కనక, వెళ్ళి తీరాలి.

కొత్తగా పోసిన కంకరరోడ్డు, కళ్లు మూసుకుని తొస్సిపూడి వెళ్ళవచ్చు; కాని దారి కనపడలేదు.

నాకు డబ్బువిలవ తెలియపరిచే ఘట్టాలిలాంటి వెన్నో వచ్చాయి జీవితంలో; కాని వొక్కటీ నిలిచిపోలేదు, కాగా, డబ్బంటే యెప్పుడూ శ్రద్ధలేదు.

కాని, అప్పటి మాట యేమిటీ?

ఆందోళన బయలుదేరింది.

బుర్ర చించుకున్నాను.

ఏమయినా; రాత్రంతా పడవ ప్రయాణం కనక శంకానివృత్తి చేసుకుంటే మంచిదని పుంతకి బయలుదేరాను.

ఒక అడ్డబోది దాటాను, యథాపూర్వంగా.

రెండోబోది దాటబోయేటప్పటికి, రెండు రెండున్నరనోట్లు కనపడ్డాయి, నీటివార పిల్లిగాలికి వూగీసలాడుతూ.

తీశాను, అటూ యిటూ చూశాను, పిట్ట కూడా కనపడలేదు, చూపుమేరలో.

తిరిగివస్తూ రోడ్డుమీద అరగంట నుంచున్నాను "మావి" అన్నవారు కనపడలేదెందరి నడిగినా.

"కాకినాడ వెడుతున్నాను. ఎల్లుండి వస్తాను. ఎవరివో నా దగ్గిర అయిదు రూపాయలున్నాయి, వూళ్ళో చెప్పండి" అంటూ అక్కడ – రోడ్డుమీద నడిచే రాయవరం మహేంద్రవాడ రైతులతో చెప్పాను, వెళ్ళిపోయాను.

కాకినాడ నుంచి వచ్చాక టముకువేయించినంత పని చేశాను, నేటికీ "మావి" అన్నవారు కనపడలేదు.

ఏం, దేవుడే పడేశాడా నాకోసం అవి అక్కడ?

ఎంతమాత్రమూ కాదు, నిజమే, మరి యిదేమిటి?

రాజమహేంద్రవరంలో ప్రవేశించాక నెలకు మూడువేల వ్యాప్తి వచ్చింది ప్రబుద్ధాంధ్రకు.

కాకినాడలో స్కేపు అందుకోవారిలాగే రాజమహేంద్రవరంలో సరస్వతీ పవరు ప్రెస్సువారున్నూ వొక సంచిక అచ్చువేసి యివ్వడానికి పెట్టుకున్నా, రరువుగా.

కాని నలభైఆరురూపాయలు కావాలి కానిబిళ్ళలు నెలకి పోస్టుచెయ్యాలంటే.

ముప్పయ్యేనిమిది రూపాయల పై చిలుకు చేతిలో వుండగా తొలినాడే కొన్నాను బిళ్ళలు.

తెల్లవారడం తడువుగా పాకింగుపనిలో కూచున్నాను "స్వయం రాజా, స్వయం మంత్రీ" కనక.

పది అయింది, వున్న బిళ్ళ లంటించడమున్నూ అయిపోయింది.

పదకొండయింది, భోజనం చేశాను.

పన్నెండు కొడితే పోస్టాఫీసు తెరుస్తారు, వొంటిగంట లోపున పోస్టు చెయ్యాలి.

కాని, అక్షరాలా యెనిమిది రూపాయలు కావాలి, మరి.

చేసేది లేక డస్కుబల్ల దగ్గిర చతికిలబడ్డాను.

అయితే, రాద్దామంటే కలమూ నడవదు, చదువుదామంటే బంతీ గడవదు, మనస్సు మనస్సులో లేక.

ఉసూరు మనిపోయింది ప్రాణం.

డబ్బు విలవ మళ్లీ తెలిసివచ్చింది, కొట్టవచ్చినట్టు.

కాని, యేమిటీ చెయ్యడం ఆ క్షణాన?

మార్గా లాలోచించాను.

బల్లమీదికి మోచేతు లానుకుని, కళ్లున్నూ బాగా గుచ్చేసుకుని మరీ తీవ్రంగా ఆలోచించాను, మళ్లీ.

ఉండగా వుండగా బల్లమీద యేదో చప్పుడయింది.

చూడగా ఎదట పోస్టుమేనూ, బల్లమీద పత్రికలూ ఉత్తరాలూ దొంతిన్నీ.

తియ్యగా అందులో వొక మణియార్డరు.

చదవగా "ఎనిమిది రూపాయలు మాత్రమే" అని వుంది, అక్షరాలా అంకెలా కూడాను.

సంతకం చేశాను, తెలిసికాదు.

రూపాయలు పుచ్చుకున్నాను, లెక్కచూసి కాదు.

బండి పిలిచాను, పోస్టాఫీసుకు వెళ్ళాను, బిళ్లలు కొన్నాను, అంటించాను, పోస్టుమాస్టరు కప్పగించిన్నీ వేశాను, పాకెట్లు.

నెత్తిమీది కొండ దింపుకున్నంత తేలిగ్గా వచ్చా నింటికి.

అప్పుడు విప్పా నుత్తరాలు.

"తెనుగు పత్రికల్లో ప్రబుద్ధాంధ్ర వొకటే నాకు నచ్చింది; కాని వొక్కరూపాయి చందాతో మీరెలా నడుపుతున్నారో నా కర్థం కావడంలేదు. ఏమయినా విరాళం పంపుదామంటే, నావల్ల కాదు, శుద్ధబీదవాణ్ణి నేను. అంచేత, పత్రిక ఆగిపోతుందేమో అన్న భయంతో ప్రయత్నించి యేడుగురు చందాదారులను చేర్చి నా చందా కూడా కలిపి, కమీషను నేనే భరించి అది మీ కివాళ మనియార్డరు చేశాను. సంవత్సరం పొడుగునా మాకు పత్రిక పంపం" డని వొక జాబు.

అందుతోబాటు వొక జాబితా.

తెనాలినుంచి వచ్చిం దది.

ఇది యేమనుకోవాలీ?

లోకంలో యేదీ ఆగదు, గడిచిపోతూనే వుంటుంది.

అంచేత, ప్రతీ మనిషి జీవితంలోనూ సంభవిస్తూనే వుంటాయి, విచారణ కందని వెన్నో.

దొరక్క దొరక్క నాకు పిఠాపురంలో యేడోవారం దొరకడమున్నూ యిలాంటిదే, అచ్చంగా.

# 41

"పద్యాలు కట్టాలని వుంది నాకు, ఛందస్సు నేర్పండి" అంటూ గురువుల నాశ్రయించా డొక యెస్టేటు గుమస్తా.

తమకు తీరిక లేక నా కప్పగించారు గురువులు, వెంటనే సులక్షణసారం ప్రారంభించా న్నేను.

ఆ మర్నాడే శనివారం.

భోజనం చేసి నేను హోటల్ గుమ్మం దిగుతూ వుండగా, భోజనం చేసి కోటకి వెడుతూ శిష్యుడు తారసిల్లాడు.

"ఇదేమి" టనడిగా డతను.

శనివారం సంగతే తెలియదు; గాని నేను వారాలు చేసుకుంటూ వుండడం తెలుసు నతనికి.

సంగతి విని "ఇక ప్రతీ శనివారమూ మా యింటికి రండి, హోటల్లో భోజనం చెయ్యడానికి వల్లకా" దన్నాడతను ప్రీతిగా.

"ఈ రాత్రే మొద" లనిన్నీ చెప్పి కోటకి వెళ్ళిపోయాడు.

చాలా వింతపడ్డాను.

ఎంత ప్రయత్నించినా వారం దొరక్కపోడం – కోరి వొక గృహస్థు వారం యివ్వడం – ఇప్పటికీ నా కిది అవగాహన కావడం లేదు.

మనకర్థం కావు, జరుగుతూనే వుంటా యెన్నో.

శనివారంనాడు పిఠాపురంలో గొప్ప పశువుల సంత.

అవులూ యెడ్లూ – గేదెలూ దున్నపోతులూ – ఎక్కడెక్కణ్ణించో వస్తాయి వందలూ వేలూను, శుక్రవారం రాత్రికి – శనివారం తెల్లవారేటప్పటికీని.

ఆదివారం తెల్లవారాక చూద్దామన్నా వొక్కటీ కనపడదు, మళ్ళీ.

ఉదయం వెలుగు వచ్చింది మొదలు పశువుల వ్యాపారం అయితే, సాయంత్రం పొద్దుగూకింది మొదలు పాలవ్యాపారం, అక్కడే అవేళ.

పాలేమో పొదుగు దగ్గిరివి.

ఒక్క చుక్క అయినా నీరు కలియనివి.

ధర చూస్తామా బహు కొద్ది.

ఏమంటే?

పశువులు తెచ్చినవాళ్లకవి అనవసరం.

శేరు కర్ధణా వచ్చినా రాబడే.

జాగ్రత్త చేసుకోరాదా అంటే అప్పుడే ప్రయాణం, నాలుగు మెతుకులు తిని.

అంచేత, అప్పటిదాకా పూనగట్టిన పాలా సాయంత్రం పితికేసి అయినకాడి కమ్ముకుంటారు.

సోమవారం ద్రాక్షారామలో అలాంటిదే పశువుల సంత.

మళ్ళీ పూనగట్టి పిఠాపురంలో అమ్మకం కాని పశువులను ఆదివారం రాత్రి కక్కడికి తోలుకుపోతారు వర్తకులు.

గుమ్మపాలతో పాటు, కావలసినవారికి, ఈనమోపై వున్న పశువులు ఆ సంతసావళ్లలోనే యీనేస్తాయి కనక, జున్ను పాలున్నూ దొరుకుతాయి, పిఠాపురంలో.

ఆ పాలు తెచ్చుకోడమూ అరాత్రి పరమాన్నం చేయించుకోడమూ శిష్యుడి కలవాటు.

దొరక్క దొరక్క నాకు దొరికినవారం యిలాంటిదయింది.

ఇంటోవున్నవారు – శిష్యుడూ, అతని భార్యా, తల్లీని.

ఆ రాత్రి నేను చారూ అన్నమూ పుచ్చుకుంటున్నాను, అట్నుంచి మొదలు కనక, భర్తకు పరమాన్నం వడ్డిస్తోందా అమ్మాయి.

జీడిపలుకులూ, కిసిమిసిపళ్ళూ, పచ్చకర్పూరమూ, కుంకమపువ్వూ – వీటితో తయారయిందేమో, ఘుమఘుమలాడిపోతోంది పరమాన్నం.

ఆ పరిమళానికి ముగ్ధుణ్ణయి "చారు తక్కువగా వడ్డించుకుని వుండవలసిం" దనుకుంటున్నాను, మనసులో నేను.

శిష్యుడున్నూ తనకి చాలుచా లంటున్నాడు.

ఇక నాకు వడ్డించాలి ఆ అమ్మాయి.

అలాంటప్పుడు – ద్వారంలో గడపమీద కూచునివున్న శిష్యుడి తల్లి, పేరుపెట్టి కోడల్ని పిలిచి "పరమాన్నం సయించదేమో పాపం, బలవంతపెట్ట కా అబ్బాయిని" అంది, తర్జనితో నన్ను నిర్దేశిస్తూ.

తెల్లబోయా న్నేను.

శిష్యుడున్నూ స్తబ్ధుడయిపోయాడు.

నుంచున్నపాళంగా శిలాప్రతిమే అయిపోయిందా అమ్మాయి.

వారా లిచ్చినచోట, బంతిలో బాలపక్షం చేస్తారు కొంద రిల్లాళ్ళు, నా కనుభవమే. కాని యింత బరితెగేవారిని చూడలేదు నే నప్పటికి.

"ముఖే ముఖే సరస్వతీ" అన్నారు పెద్దలు, దానికిది నిదర్శనం కామోసు.

మామూలు మనుష్యులమాట యేమయినా, రచయిత అయినవాడిలాంటి సందర్భాలు గుర్తించుకోడం చాలా అగత్యం.

శబ్దసిద్ధి వొక్కటే కాదు, ఇలాంటిదిన్నీ లోకజ్ఞానంలోనే చేరుతుంది, మరి.

అయితే, శిష్యు డేమయినా కలగజేసుకోడమా వూరుకోడమా?

ఆ పిల్లకూడా అత్తగారి మాట వినడమా వినకపోడమా?

నేను మాత్రం వూరుకోలేకపోయాను.

బంతికి తెచ్చాక, తెచ్చినవి వున్నవారి కందరికీ సమంగా వడ్డించకపోడం యింటివారి దోషం.

ధారాళంగా వడ్డన జరుగుతున్నప్పుడు, మొగమాటపడి కడుపునిండా తినకపోతే ఆ దోషం అతిథులది.

ఇవి రెండూ వొకరాశిలోవే ఘోరపాపాలు.

అప్పుడే కాదిప్పటికీ వుంది నాకీ నమ్మకం

దీనికి తోడు, పోతూపోతూ వుండిన బాల్య చాపలమూ, ముమ్మరంగానే వుండిన జిహ్వాచాపలమూను నాకు.

నిగ్రహించుకోలేకపోయా న్నేనవి.

వెంటనే "పరమాన్నం నాకు చాలా యిష్టమండీ" అనేశాను, ముసలమ్మతో.

అనేశాను, వెంటనే సిగ్గుపడిపోయాను.

చూడగా, కత్తివేస్తే నెత్తురుచుక్క లేకుండా స్తబ్ధులయిపోయి వున్నారు, భార్యాభర్త లిద్దరూ.

పుండుమీద కారం చల్లినట్టయింది నా మాటతో వారికి.

అలా అనడం ముసలమ్మ తప్పే, మరి యిలా అనడం?

ఈ ఝుడితిస్ఫురణతో చాలా బాధపడిపోయా న్నేను.

ఈ స్థితిలో, ఎప్పుడు తేరుకుందో, పదిగరిటెల పరమాన్నం నా విస్తరిలో గుమ్మరించి పొయ్యి దగ్గిరికి వెళ్లిపోయిందా అమ్మాయి.

అది చూసి రుసరుసలాడుకుంటూ చివాలున లేచి చక్కాపోయింది, ముసలమ్మ.

## 42

వారాల భోజనంలో నాకిలాంటి అవస్థలే కలుగుతూ వచ్చాయని కాదు చెప్పడం.

ఒక్కొక్క తల్లి యెంతో మమత కనపరిచేది.

విరియాల రామయ్య పంతులుగారని వేట్లపాలెంలో వొక సంపన్న గృహస్థు.

గోల్కొండ వ్యాపారులు వారు.

స్థితిపరు లాయన, మంచి భోగిస్నీ.

అప్పటికి షష్టిపూర్తి కటో యిటో వున్నా రాయన, భార్య చనిపోయింది పాపం.

ఇద్దరు కూతు ళ్లాయనకు, కొడుకు ల్లేరు.

పెద్దల్లుడు లక్ష్మీపతిగా రిల్లరికం వుండేవారు.

వంటా వడ్డనా, యింటి యాజమాన్యమూ పంతులుగారి చెల్లెలు సీతమ్మగారు నిర్వహించేవారు.

ఆమె జ్ఞాపకంవస్తే నాకు భక్త్యావేశం కలుగుతుందిప్పటికీ.

శుచీ శుభ్రమూ ఆమె సొమ్ములు.

దయా దాక్షిణ్యమూ ఆమె ఆభరణాలు.

పంతులుగారిని నేను వారం అడగ్గా రమ్మన్నవా రామే.

మొదటిపూట భోజనాని క్కూచున్నాం.

వడ్డన పూర్తి కాగా పరిషేచన చేశాం.

వంటింటి గుమ్మాన నుంచుని వుండిపోయా రామె.

"నెయ్యి పట్టుకురారేం?" అనుకున్నా న్నేను.

చూడగా, మామా అల్లుడూ స్వయంగా వడ్డించుకుంటున్నారు నెయ్యి.

చిత్రం యేమిటంటే?

బంతిలో యెందరుంటే అందరి దగ్గిరా నేతిగిన్నెలుంచేవా రామె.

ప్రతీ గిన్నెలోనూ గరిటె కూడా వుండేది.

పప్పు, కూర, పచ్చడి, పులుసు – ఇన్నిటికీ సరిపోయే నెయ్యి అది.

ఒరకంట చూశాను, నాదగ్గిరా వుందొక గిన్నె; కాని స్వయంగా వడ్డించుకోడానికి ముక్కాటపడిపోయాను.

అంచేత, పప్పు కలిపి పొట్టి అన్నమే తినసాగాను.

అది చూశారామె. "అయ్యో, నాయనా, పొట్టి అన్నం తింటున్నావా?" అంటూ వూచలా వచ్చి గిన్నె నా విస్తరిలో వంచేశారు.

పప్పూ అన్నంలో పులుసు కలుపుకున్నట్టయింది నాకు.

అప్పుడు చెప్పారు పంతులుగారు "ఇది మాయింటి పద్ధతి" అన్నీ "నెయ్యి అయిపోతే అడక్కుండానే మళ్ళీ వడ్డిస్తా"రనీ "మొగమాటపడవ"ద్దనీని.

దాంతో పుత్రవాత్సల్యం కలిగిపోయింది సీతమ్మగారికి నేనంటే.

"నాయనా" అనేగాని నన్నెప్పుడూ పేరుపెట్టి పిలిచి యెరగ రామె.

అప్పుడప్పుడు నాకు ఫలహారమున్నూ పెట్టేవారామె.

లక్ష్మీపతిగారి కంటించినప్పుడల్లా సాధారణంగా నాకూ తల అంటించేవారు.

నిజంగా, రాజర్షి రామయ్యపంతులుగారు, నాతో యెప్పుడు మాట్లాడినా విద్యాభ్యాసం విషయమే మాట్లాడేవారు.

ఎందుకు చెప్పానంటే?

వారాల భోజనం కష్టసుఖాలతో పెనవేసుకుని వుంటుం దిలాగ.

పాలపొంగు తగ్గించి, విద్యార్థిని మంచిదారికి మళ్ళిస్తుందది.

## 43

గురుకులవాసమూ వారాలభోజనమూ పిఠాపురంతోనే అఖరు నాకు.

అయితే, చదువెంత తృప్తికరంగా సాగిందో వారాల పద్ధతి అంత తృప్తికరంగా సాగలేదు నాకక్కడ.

అది, అటు పల్లెటూరూ యిటు పట్నమూ కూడా కాకపోడమే అందుక్కారణం.

గొప్ప పండితులున్న పల్లెటూళ్ళలో, ఆ పండితుల ఘనతా, ఆ పండితులుండడంవల్ల తమ గ్రామాలకు వచ్చే ఘనతా గుర్తించుకుని, వారి శిష్యులకు తామే తల్లిదండ్రులయి సాదరంగా భోజనం పెడతా రావూళ్ళవారు.

పట్నాల్లో అలాంటి భావాలుండవు సాధారణంగా.

ఇంతకీ, – పట్నాల్లో చలవమడతలు పట్టుకుని తిరిగేవా రందరూ సంపన్నులనీ – అథవా – లోటులేనివా రనీ అనుకోడానికి వీల్లేదు.

మదరాసువంటి నగరాల్లో యిది మరీ స్పష్టంగా తెలుస్తుంది.

నాగరక జీవితానికీ జానపద జీవితానికీ దృక్పథమే వేరు.

దాని కనుగుణమే యీ వ్యత్యయం.

పల్లెటూళ్లల్లో వొకరి సంగతి వొకరికి తెలియం దుండదు.

అడిగితే, అక్కడ, యెవరి వర్గత్రయమైనా చెప్పగల రెవరయినా.

కనక, అక్కడి పరిశీలన యెంతసేపూ మానసిక వ్యవస్థకు.

పట్నాల్లో వొకరి సంగతి వొకరికి తెలియదు.

ఒక్కయింటో – పక్కవాటాలో వున్నవాళ్ల సంగతే అక్కర్లే దెవరికీ.

కనక, వేష భాషలను బట్టే మనుష్యుల కిక్కడ పరిగణన.

వేషం హుందాగా లేకపోతే – కనీసం పరిశుభ్రంగా నయినా లేకపోతే, యెంత సజ్జనుడి కయినా లోపల అడుగు పెట్టడానికే అవకాశం వుండదు, పట్నాల్లో.

అంచేత, పట్నాల్లో అలా తిరక్కపోతే చిక్కూ, పల్లెల్లో అలా తిరిగితేనే చిక్కున్నూ.

పోతే, వేషానికి సంపన్నతే అక్కర్లేదు, చాకళ్లు చల్లగా వుంటే చాలు, చాలామందికి.

పిఠాపురంలో నీటుగా తిరిగేవారిలో చాలామంది చాలీ చాలని జీతాలతో నానా అవస్థలూ అనుభవిస్తూ వుండే ఎస్టేటు గుమాస్తాలు.

అంచేత, ఎంతో వాకబుచేసుకుని గాని అక్కడ నే నెవరినీ వారా లడగలేకపోతూ వచ్చాను.

నెలకు ఏడెనిమిది రూపాయలిస్తే, హోటల్లో, అప్పుడు రెండుపూట్లా పెరుగుతో భోజనం.

ఆమాత్రం ఖర్చుపెట్టలేక కాదు, హోటలుభోజనం అంటే అప్పుడే కా దిప్పటికీ నాకు వెగటే.

ఇక మావాళ్ల నమ్మకమూ, హోటల్లో భోజనం చెయ్యడం అంటే కులం చెడ్డమే.

ఈ భావం రక్తగతమూ శల్యగతమూ కావడంవల్ల నేమో నాకీ వైముఖ్యం.

కాక, – హోటల్ భోజనం అంటే ఆచారానికే కాదు, శుచికీ రుచికీ గూడా ఆశవొదులుకోవలసిందే.

హోటల్ నిర్వహణం మనకొక వృత్తి కాకపోడం యిందు క్కారణం.

పొట్టగడిచిపోతే చాలు హోటల్ యజమానికి.

ఆ పూట గడిచిపోతే చాలు హోటల్లో తినేవాడికి.

ఇక వొక అంతస్థు యేర్పడ్డాని కవకాశం యేదీ అక్కడ?

అయినా వొక దారే అయివుండును, అనుకోని అశనిపాతం వచ్చిపడిం దొకటి మనకి.

అది హోటల్ నిర్వహణంలో మన తెనుగువాళ్ళకి నైచ్యం కనపడితే, అరవలకు మంచి వ్యాపారసరళి కనపడ్డం.

మనవాళ్ల యీ రాజసం అరవలకు కొంగుబంగారం అయింది.

తెనుగువాడికి తెనుగుదేశంలోనే అరవభోజనం గతి కావడానికి దారితీసిం దిది.

లక్షలకొద్దీ అరవయువకులకు వడ్డనవాళ్లుగానూ, వేలకొద్దీ అరవయువకులకు వంట బ్రాహ్మలుగానూ, వందలకొద్దీ అరవ యువకులకు హోటల్ యజమానులుగానూ జీవనసరణి సుగమం కావడమే కాదు, అరవలు నాన్ కో అపరేటు చేస్తే, తెనుగు దేశంలో, తెనుగువాడికే యివాళ అన్నం దొరకని స్థితి యేర్పడింది దీనివల్ల.

ఏతావతా:–

ఈ విషయమై నేను చెప్పవలసిందీ, మనవాళ్లు ఎవరికివారు సొంతంగానే ఆలోచించుకోవలసిందీ చాలా వుంది.

అది ప్రత్యేక వ్యాఖ్యానం కావలసిన విషయం.

ఏమయినా, అది తెనుగు హోటలయినా అరవ హోటలయినా, అక్కడ భోజనం చెయ్యడం తప్పనిసరయిపోయింది, తరవా త్తరవాత నాకు.

పట్నం వెడితే, యెక్క డెక్కడి చుట్టరికాలూ సన్నిహితపరుచుకుంటూ బంధువుల యింటికి వెళ్లి భోజనం చెయ్యడమూ, అది సాధ్యం కానిచోట సత్రాల్లో భోజనం చెయ్యడమూ ఆ కాలంలో శిష్టకుటుంబాల సంప్రదాయం.

మా నాయనగారూ మా అమ్మగారూ – ఇలాంటివారు మాత్రం ఎక్కడికి వెళ్ళినా స్వయంపాక నియమమే.

చిన్నవాళ్ళూ, నియమనిష్ఠలు లేని పెద్దవాళ్ళూ మాత్రమే సత్రాల భోజనం చెయ్యడం అప్పుడు.

ఆ రోజుల్లో, సత్రాలు వేసేవారిలో వర్ణాశ్రమాచార నిష్ఠ యెక్కువగా వుండేది కనకనూ, అన్నదానమే వారి ముఖ్యోద్దేశం కనకనూనే, నావంటివాళ్ళ కయినా సత్రాల్లో భోజనం చెయ్యడాని కప్పు డనుజ్ఞ.

హోటలు భోజనమే నిషిద్ధం.

క్రీతాన్నానికే నింద.

నిజం చెప్పవలసివస్తే, అన్నం అమ్ముకుని బతకడంకంటే దౌర్భాగ్యం మరి లేదు.

ఇది మన దృక్పథం.

పాశ్చాత్యుల దయినా, మరొకళ్ళ దయినా సర్వాత్మనా యిందుకు భిన్నంగా వుంది దృక్పథం.

అన్నదానం చాలా పుణ్యప్రదం కాకపోడమే కాదు, ఒకరి అన్నం ఉచితంగా తినడం ఆత్మగౌరవానికి భంగకరం అన్న భావన అందుకు హేతువు.

సంప్రదాయాలు మారుతూ, జాతికి జాతి అంతా కొత్తదారులు తొక్కుతున్న యీ దినాల్లో కొంతవరకయినా మన దృక్పథంలో కొన్ని సవరణలు చేసుకోవలసేవుంది.

కాని, నేనేకా దప్పుడు మరెవరైనా యీ మాట అనగలిగారా?

వాదం దాకా అక్కర్లేదు, అప్పుడు మాటా మంతీ లేకుండా – గప్చిప్పుగా – హోటల్లో భోజనం చెయ్యడానికే యెందరో సాహసించవలసి వచ్చింది.

సత్రాలు విడిచి హోటల్ భోజనం చెయ్యవలసిన అగత్యమున్నూ యేర్పడిందా రోజుల్లో.

అయితే, అది వొక్కొక్కరి కొక్కొక్క విధం.

నా సంగతే చూసుకుందాం.

## 44

రాజమహేంద్రవరంలో వెతుక్కుంటూ మేము భోజనానికి వెళ్ళే బంధువులయిళ్లు రెండు.

ఇంకా వున్నారు బంధువులు చాలామంది; కాని ఆ రెండిళ్ళవారూ మిక్కిలీ సన్నిహితులు.

శిష్టు లయినవా రెవరు వచ్చినా ఆదరించి భోజనం పెట్టడం ఆ రెండిళ్ళవారికీ వ్రతం కూడానూ.

ఒకమా టీయింటికి వెడితే, మరోమా టాయింటికి వెళ్ళడం మా పద్ధతి.

అందులో వొక యింటి యజమానురాలు మా పెత్తండ్రి గారి కూతురు.

రెండో యింటి యజమానులు మా సన్నిహితజ్ఞాతుల యింటి ఆడబడుచు.

మేనకోడలే ఆ యింటి యజమానురాలి క్కోడలు.

ఆవేళ కోడలు వడ్డిస్తోంది, నేను భోజనం చేస్తున్నాను.

చుట్టరికాని కేవిధంగానూ ప్రాతికూల్యాలు కనపడ్డంలేదు, వాతావరణం మిక్కిలీ ఆత్మీయంగానే వుంది.

ఇంతలో ఆమె అన్న వచ్చాడు.

"లే, మడికట్టుకో" అంది చెల్లెలు.

"భోజనం చేసే వచ్చా"నన్నా డన్న.

ఎవరికయినా యెక్కడయినా సంభవిస్తూనే వుంటుం దిలాంటి వింతలేదు.

కాని, బంధువులు అగౌరవంగా భావించుకునేవారప్పు డది.

"ఏం, మా యింటో భోజనం చెయ్యడం తప్పా?.....మా తాహ తెక్కడ, మీ తాహ తెక్కడ, నిజమే; గానీ –" అంటూ నిష్ఠురాలున్నూ మొదలుపెడతారు కనపడ్డప్పుడు.

సంసారం సాగరం అయితే, అందులో మిక్కిలీ సొగసైన దీవి వంటి దాసన్నివేశం.

మమతా, అభిమానమూ, ప్రేమా, ఆప్యాయతా, నిరీక్షా, ఉత్తేజనమూ – ఇలాంటి వెన్నో స్ఫురిస్తా యామాటల్లో.

పేరికే నిష్ఠురాలు, నిజానికి యిష్టాలాపా లవి.

అయితే, అలాంటి రాజమార్గం విడిచిపెట్టి "అదేమిటన్నయ్యా అలా చేశావ్రూ? అయినవాళ్ళూ కానివాళ్ళూ వచ్చి తినిపోతూనే వున్నారు గదా, నువ్వు బరువా మాకు?" అనడిగిందన్నగారి నామె.

గతుక్కుమని నాలుక కరుచుకుంటూ మొగం పక్కకి తిప్పుకుంది, అది విని అత్తగారు.

కొయ్యయిపోయా న్నేను.

ఆమె వుద్దేశం అది కాకేపోవచ్చు; కాని నన్ను మనసులో వుంచుకునే ఆమె అలా అందని గట్టి నమ్మకం కలిగిపోయింది నాకు.

మరి, ముద్ద నోటికి పోలేదు నాకు.

అప్పటికి చారూ అన్నమూ పుచ్చుకోడం అయింది.

వెంటనే ఉత్తరాపోశనం పట్టేసి "మజ్జిగ అక్కరలే"దంటూ లేచి చక్కా పోయాన్నేను.

అందుకామెమీద కోపం రాలేదు నాకు.

ఏమంటే?

భోజనాలకోసం మాత్రమే వచ్చి బొల్లికబుర్లు చెబుతూ తిష్ఠవేసేవారిని చూస్తే యెప్పటికయినా బరువు తోచక మానదెవరి కయినా.

ఒక యుగం గడిచి మరో యుగం ప్రారంభం అయిన దినా లవి మరి.

తిట్టేవారు తిడుతూనే వుండినా, తినేవారు వందలకొద్దీ హోటళ్లలో స్వేచ్ఛగా తింటూనే వున్నదినా లవి.

ధరలు "మండిపోడమున్నూ" ప్రారంభం అవుతున్న దినా లవి.

కనక, నాదే తప్పని నిర్ధారణ చేసుకున్నా న్నేను.

నియమ నిష్ఠ లవలంబించి వుండలేదు కనక "యిక భోజనం కోసం చుట్టాల యింటికి వెళ్ళకూడ" దనిన్నీ స్థిరపరుచుకున్నానప్పటి కప్పుడు.

సత్రాలకు వెళ్ళడం ప్రారంభించేశాను, వెంటనే.

అన్నదానం చెయ్యడానికే కంకణం కట్టుకున్న గొప్ప సంస్థలవి.

మన భాషలో "అన్నపూర్ణ" అనే మాట పుట్టడానికి, దేశం సుభిక్షంగా వుంటూవుండడమూ, అన్నసత్రా లెక్కడ పడితే అక్కడ అనేకా లేర్పడి వుండడమున్నే కారణం అనుకుంటా న్నేను.

ఈ నిశ్చయం వల్ల "యెవరి యింటికీ వెళ్ళడం? మాట కలపడం యెలాగా?" అన్న బెంగ పోయింది నాకు.

మమత నటించక్కరలేదు. "ఏమనుకుంటున్నారో?" అంటూ పిసుక్కోనక్కర లేదు, వేళకి వెడితే గుమాస్తా పద్దు రాసుకుంటాడు, మడి కట్టుక్కూచుంటే కడుపునిండా భోజనం పెట్టేస్తాడు వంటబ్రాహ్మడు.

బద్ధకంగా వుంటే అక్కడే కాస్సేపు నడుం వాల్చుకోవచ్చు, ఎవరితోనూ చెప్పనక్కర లేకుండా.

నిజమే; కాని కాలం మారుతోంది, భావాలు మారుతున్నాయి, సత్రాల్లోనూ వైపరీత్యాలు ప్రారంభం అవుతున్నా యప్పటికి.

ఇవాళ చూస్తే, సత్రాల్లో భోజనం చేస్తున్నవారిలో, అన్నదానం పరిగ్రహించడానికి లేశమూ అర్హత లేనివారే చాలామంది.

ఒకనాడు ఏలూరిదరి కన్నాపురంనుంచి వస్తూ సాయంత్రం యెనిమిది కావచ్చే సమయాన రెయిలు దిగాను, రాజమహేంద్రవరంలో అప్పుడు.

నాళంవారి సత్రానికిన్నీ వెళ్ళిపోయాను, వాయువేగమనో వేగాలతో.

పద్దులు రాసి అన్నార్థుల సంఖ్య తేల్చుకోడమూ, కావలసిన సామగ్రి వంటబ్రాహ్మడి కిచ్చెయ్యడమూ అప్పటికే అయిపోయి వుంటుంది కనక, గుమాస్తా భోజనం పెట్టడాని కంగీకరిస్తాడా అంగీకరించడా అన్న ఆత్రంతో వెళ్ళాను, గబాగబా.

అడగ్గా, "గుమాస్తాగారు భోజనాల హాల్లో వున్నా" రన్నాడు నౌకరు, అక్కడికే వెళ్ళాను.

విస్తళ్ళు పరిచివున్నాయి, వడ్డన ప్రారంభమే కా లేదప్పటి కింకా.

పట్టుపంచెలు కట్టుకుని కొందరూ, తడి అంగవస్త్రాలు కట్టుకుని కొందరూ సంధ్యావందనాలు చేసుకుంటున్నా రన్నార్థులు విస్తళ్ళముందే కూచుని.

గుమాస్తా యెవరో నాకు తెలియదు, పోనీ అంటే, మడి కట్టుకుని విస్తళ్ళ దగ్గిర కూచున్నవారు తప్ప మరెవరూ లేరక్కడ.

ఈ స్థితిలో "యెందుకు వచ్చావ్?" అనడిగాడు బంతిలో మొదట కూచునివుండిన వొక బ్రాహ్మడు.

అతణ్ణి నే నెరుగుదును, పేరు రామయ్య కామోసు బాగా జ్ఞాపకం లేదు – ఇంటిపేరు మాత్రం వాజపేయయాజులవారు.

వాజపేయయాజులువారంటే ఋగ్వేదులూ, వెలనాటి శాఖలో మంచి శిష్ట కుటుంబీకుల్లో వొకరూను; కాని ఆ సంప్రదాయాలూ, ఆ లక్షణాలూ కూడా వొక్కటీ లేవతని దగ్గిర.

రాజమహేంద్రవరంలో సంభావనలకు తిరిగే అంశువారీల్లో వొక డతను, నప్రతిగ్రహీత నన్నట్టు మాత్రం నటించేవాడు.

పొట్టచింపితే అక్షరంముక్క లేదు, సంస్కారి నంటూ డాబులు కొట్టేవాడు.

నోరువిప్పితే "వైదికి" అనడానికే వీలులేని ధోరణి అతనిది.

అత నంటే యెప్పుడూ వెగటే నాకు, అతనే నన్నలా అడగడంవల్లా చిరాకే వచ్చింది నాకు.

"మీరంతా యెందుకు వచ్చారో అందుకే వచ్చా న్నే"నన్నాను విసుగ్గా దాంతో.

కోపం వచ్చిం దతనికి.

అందుకు నాకూ వచ్చింది కోపం.

గందరగోళం పెరగడం యెందు కనుకున్నాడు కామోసు "అబ్బాయీ, ఆయనే యిప్పు డిక్కడ గుమాస్తా. నువ్వు భోజనానికి వచ్చా వాసంగతి ఆయనతో చెప్పు" అన్నాడు బంతిలో వున్న వృద్ధుడొకడు.

చకితుణ్ణయిపోయా న్నేను.

ఎంతో మంచిపేరుంది నాళంవారి సత్రానికి.

"ఇక ఇది నిలుస్తుందా?" అనిపించింది నాకు.

"గుమాస్తా అయినవాడు సత్రంలోనే భోజనం చెయ్యడమా?" అని వింతా పట్టుకుంది నాకు.

వెనకటికి, అన్నపత్రాలు వేసేవారు, తా మేవర్ణానికి చెందినవారయినా, తమ సత్రాల్లో బ్రాహ్మలనే గుమాస్తాలుగా వేసుకునేవారు.

అయితే "యిలాంటి బ్రాహ్మడా దొరికాడు నాళంవారికి?" అనిపించింది నాకు.

కాని, నా కప్పుడక్కడ భోజనం కావాలంటే అతనే అనుగ్రహించా లది.

"అడగడమేనా?" అనుకున్నాను.

కడుపు నకనకలాడిపోతోంది.

పొద్దున్న తొమ్మిదింటికి ఆదరా బాదరాగా తిన్న మెతుకులు మరి, కన్నాపురంలో.

రెయిల్లో ఏదిపడితే అది కొనుక్కుని తినే అలవాటు కూడా లేదు.

తప్పనిసరి అయి "నాకు భోజనం కావాలి. ఇప్పుడే రెయిలు దిగాను. ఆలస్యంగా రావడాని క్కారణం అదీ" అన్నా నతనికేసి తిరిగి.

చేతికి అంగా(స్త్రం ముసుగువేసుకుని గాయ(త్రీ జపం నటిస్తున్నాడు గుమాస్తా, మాట్లాడలేదు.

అది గుర్తించి "భోజనా లయాక ఆయన పద్దు రాసుకుంటారు, ముందు మీరు మడికట్టుకోం" డన్నాడు వంట (బ్రాహ్మడు, నాకోసం మరో విస్తరి పరుస్తూ.

కాళ్ళూ చేతులూ మొగమూ కడుక్కుని పట్టుపంచె కట్టుక్కూచున్నాను. "నాక్కో గ్లాసు కావా" లని వంట (బ్రాహ్మణ్ణడుగుతూ.

వంట (బ్రాహ్మ డివ్వనూ యిచ్చాడు మంచినీళ్లతో; గాని గాయ(త్రీజపం నిలుపుచేసి, గభీమని "ఉద్యోగ"దర్పం వొడిసి తెచ్చుకుని "శ్రీపాదవారి కుర్రవాడి వయ్యుండిన్నీ చెంబు తెచ్చుకోకుండా 'చేతు'లూపుకుంటూ వచ్చావా?" అనడిగాడు గుమాస్తా, చేతులన్నమాట స్థానంలో – బూతుమాట వాడుతూ.

నాకు మండుకుపోయింది.

"వాజపేయయాజులవారి కుర్రవాడి వయ్యుండి గాయ(త్రి జపిస్తున్న నోటికి బూతెందుకు తెచ్చుకుంటావూ?" అంటూ టొకాయించా న్నేను, అంతకంటే దర్పం తెచ్చుకుని.

పాకం ముదరబోయింది; కాని బంతిలో వున్న నలుగురూ గుమాస్తాని దిగ్గుంజేశారు "విస్తరి ముందు సంధ్యావందనం చేసుకుంటూ (బ్రాహ్మ డనవలసిన మాటేనా అది?" అని నిలవతీస్తూ.

గుమాస్తా మరి నోరెత్తలేదు; కాని చాలా వెగటు పుట్టేసింది నాకు.

(ప్రతీ స(త్రంలోనూ (ప్రతీ గుమాస్తా యిలాగే వుంటాడని కాదు; గాని మొత్తానికి స(త్రం గుమాస్తాల్లో సంస్కారం వున్నవాళ్లు బహు అరుదుగా వుంటారు.

వచ్చినవారిని ఆదరించి అన్నం పెట్టమని స(త్రాలు వేసిన వారి ఆజ్ఞ అయితే, ఎవరూ రాకుండా వుండా లన్నట్టుంటుంది చాలామంది గుమాస్తాల నడవడి.

ఇలాంటివన్నీ చూసి వైదికుల్లో చాందసులైనవారు తప్ప తక్కినవా రందరూ హోటల్లోనే భోజనాలు (ప్రారంభించి వున్నా రప్పటికే.

అంచేత, అక్కడే – అప్పుడే – ఆ భోజనం ముగిసే లోపునే అనుకున్నా న్నేను "ఏమయినా, యిక స్వేచ్ఛగా హోటల్ భోజనమే చెయ్యా"లని.

అనుకోడంతో వూరుకోలేదు, మళ్లీ రాజమహేం(ద్రవరం వెళ్ళినప్పుడే చేశానా పని.

మన జీవనసరణి అప్పటికే కొత్తదారులు తొక్కసాగిం దిలాగ.

పోనీ అంటే, స(త్రాలు శిథిలాలయిపోలేదు, కొత్తస(త్రాలున్నూ వెలుస్తూనే వున్నాయి, స(త్రాల్లో భోజనం చేసేవారున్నూ యెక్కువగానే వుంటున్నారు.

కాని, ఆత్మగౌరవం యెరిగివుండినవాడు మా(త్రం స(త్రం గుమ్మం తొక్కిచూడ్డం లే దివాళ.

## 45

రాజమహేం(ద్రవరంలో వరదాచారి హోట లొక్కటే పేరుపొందివుం దప్పట్లో.

కాస్త మంచిభోజనం కావాలనుకునేవా రందరూ అక్కడే భోజనం చేసేవారు, వెతుక్కుంటూ వెళ్ళి.

నేను చూశాటప్పటికే వరదాచారి వయస్సు యాభై పైని; కాని రంగడికుచ్చులా వుండేవాడు, బెండకాయ ముద్రలతో అతను.

అతని విలాసాలు వర్ణించేవా రెందరో వున్నా రిప్పటికీ రాజమహేంద్రవరంలో.

అతని హోటలుకే వెళ్ళాను మొదటిమాటు నేను, వాకబు చేసుకుని.

"ఏం, తెనుగు హోటళ్లు లేవా?" అంటే లేకేం?

వొక్కటీ కూడా అడుగుపెట్టడానికి వీలుండదు, అంతే.

అయినాసరే అని వెడితే, సరిగా మాటే ఆడడు యజమాని.

రావలసినవాళ్లని ఆకర్షించలేకపోడమే గాదు, వచ్చినవాళ్ళ నయినా ఆదరించలేడు తెనుగు యజమాని.

సాధారణంగా యజమాని కనపడనే కనపడడు తెనుగు హోటల్లో.

ఇప్పటికీ యిదే పద్ధతి మనవాళ్లది.

లేకపోతే, తెనుగుదేశం అంతా అరవ కన్నడహోటళ్లతో నిండిపోవలసిన కర్మం యేమీ?

ఎవరెంత నీచంగా చూసినా, హోటల్ వృత్తి యివాళ పెద్దవృత్తుల్లో వొకటి.

జాతి మనుగడకు అత్యవసర మయిం దది, సామాన్యం కాదు.

వ్యక్తికే ఐచ్ఛికం గాని జాతికి అత్యావశ్యకం అది.

కాని తెలుగువాడికి దాని విలవ తెలిసిరాలే దింకా.

ఏ నాయకుడూ ఆలోచించ డిది.

ఏ పత్రికా సూచనచెయ్య దీవిషయమై.

జాతికి అంగాలూ, తద్వికాసానికి ఆవశ్యకాలూ అనేకాలన్న సమ్యగ్బోధ లేకపోడమే యిందుక్కారణం.

ఇలాంటిదే తెనుగుదేశం కొల్లగొడుతున్న మరోటి హిందీ ఫిల్ముల దండయాత్ర.

తెనుగులో మాత్రం ఫిలిముల్లేవా అంటే, మరి ఉత్తరాది వాళ్లవి చూడరేం?

బట్టలకోసం ఖండాంతరాలకు ప్రవహించిన ధనప్రవాహంకంటే పెద్దదీ అపాయకరమూ కాదూ హిందీ ఫిలిములు కారణంగా ఉత్తరాదికి ప్రవహిస్తున్న ధనప్రవాహం?

ఖండాంతరాలు పత్తికొనడం రూపంగా అయినా కొంత డబ్బిచ్చేవారు మనకి, హిందీ ఫిలిములు దమ్మిడీ కూడా ఇవ్వడంలేదు.

ఈ విపత్తు గుర్తించిన నాయకుడూ కనపడ్డంలేదు మనలో.

కొన్నా ళ్ళింగ్లీషు ఫిలిములూ కొట్టుకుపోయాయి మన డబ్బు, ఇప్పటికీ కాస్తో కూస్తో కొట్టుకుపోతూనే వున్నాయి, నాకు బాగా తెలుసు.

అయితే, ఆ ఫిలిములు చూస్తే అపారమైన ప్రపంచ జ్ఞానమూ, ఫిలిముల నిర్దోషితకు కావలసిన పరిజ్ఞానమూ అయినా కలుగుతాయి బాగా.

హిందీ ఫిలిములు డబ్బు నొల్లుకుపోడమే కాదు, యువయువతుల జీవితాలున్నూ తప్పుదారికి మళ్లిస్తున్నాయి.

వింతయేమి టంటే?

ఫిలిములు జాతిమొత్తంమీదే చాలా అపాయం కలిగిస్తున్నా యన్న సంగతి తెలిసినవా రున్నారు మనలో; కాని ఆ అపాయం హిందీ ఫిలిములవల్లనే కలుగుతోందని వా రెరగరు.

ఇదంతా మరొకప్పుడు మాట్లాడుకుందాం. అంచేత, ఆవేళ, వరదాచారి హోటలుకే వెళ్ళా న్నేను శివా అంటూ.

నిజమే; కాని యెవరయినా చూస్తే యేమయినా వుందా?

"కాస్మాపాలిటన్" భోజనాలే బాహాటంగా జరిగిపోతున్న యీ దినాల్లో, నావంటివాళ్ళ అప్పటి – ఆ జంకు చూడనే అక్కర్లేదు, వింటేనే నవ్వువస్తుం దెవరి కయినా; కాని నావంటివా ళ్ళప్పు డెంద రెంత రణసాహసం చేస్తే యిప్పటి పరిస్థితు లేర్పడ్డాయో యిప్పటి యువకులు గుర్తించలేరు.

బ్రాహ్మడైనవాడు హోటల్లో కూడా పట్టుపంచో తడిబట్టో కట్టుకునే భోజనం చేసే దినా లవి.

ఇంగ్లీషు చదివే విద్యార్థులకున్నూ తప్పేది కాదిది.

లేకపోతే, హోటల్‌వాళ్లే బంతిలో కూచోనిచ్చేవారు కారు.

విశేషం యేమిటంటే?

మనవాళ్ళు ధారాళంగా హోటళ్ళలో భోజనం చెయ్యడం ప్రారంభం అయింది, అరవలహోటళ్ళిక్కడ అల్లుకుపోయాయి.

అరవల హోటళ్ళలో భోజనం చెయ్యవలసిన అగత్యం యేర్పడింది, ఆ బట్టతో భోజనం చెయ్యడం అలవాటయింది మనవాళ్ళకి.

ఆ కారణంవల్ల కూడా హోటల్లో భోజనం చెయ్యడం వొక సాహసమే ఆ రోజుల్లో.

అయితే, అసహాయశూరులు తప్ప అరవహోటళ్ళలో కూడా మడికట్టుకునే భోజనం చేసేవారు మనవాళ్ళు.

ఈ పద్ధతి యిప్పటికీ వుంది, పూర్తిగా పోలేదు.

ఈ రక్షణ వుంది కనక, నేనూ ఆంధ్రేతర్ల హోటలుకే వెళ్ళాను, హరిః ఓమ్మంటూ.

వెళ్ళానంటే ఆకలి ప్రారంభం కాగానే కాదు, ఖరాగా పన్నెండయాక.

పెందరాడే వెడితే చాలామంది భోజనం చేస్తూ వుంటారు కనక, వారి ద్వారా మావాళ్లకి తెలిసిపోతుందన్న భయం.

అంచేత, యిక వొక్క క్షణం ఆలస్యంచేసినా అన్నం దొరకదన్నంతవరకూ ఆగి అప్పుడు ప్రవేశించాను, హోటల్లో.

ప్రవేశించడం అంటే – వొక్క దూకుదూకి నడివీధిలో నుంచి హోటల్లో పడ్డం అన్నమాట.

నేను హోటల్లోకి వెళ్లడం యెవరయినా చూసినా చిక్కేమరి.

ఏమంటే?

శిష్టుల దృష్టిలో హోటలూ కల్లుపాకా వొక్కరాశిలోవే, అప్పట్లో.

అయినా, తప్పనిసరిగా యీ సంఘసంస్కారం చేసి తీరాలనుకున్నాను కనక, పట్టుపంచె కట్టుకుని విస్తరిముందు కూచున్నాను.

తెగబారెడు జుట్టు దువ్వుకుని, చక్కగా జారుముడిన్నీ వేసుకునివున్న తరుణ వితంతువు వడ్డన చేసి, నేతిగిన్నె పుచ్చుకుని యెదట నుంచుంది; కాని వోపట్టాన పరిషేచన చెయ్యలేకపోయా న్నేను.

చేసిన్నీ ప్రాణాహుతులు పుచ్చుకోలేక పోయాను, ధైర్యంగా.

చివరి కెలాగో భోజనం ప్రారంభించాను; కాని ముద్ద ముద్దకీ అదటే అభక్ష్యభక్షణం చేస్తున్నా మని.

అంతా అయాక, ఒకమూల, వొక అకార్యకరణం చేశామన్న కించతోనూ, మరోమూల వొక ఘనకార్యం నిర్వహించా మన్న దిలాసాతోనూ బయలుదేరాను.

బయలుదేరానంటే, తేనుస్తూనూ బొజ్జ నిరుముకుంటూనూ కాదు, ప్రవేశించి నప్పటిలాగే నిష్క్రమించినప్పుడున్నూ అంగలే వేశాను.

నాకు పదిహేడో సంవత్సరం నడుస్తోందప్పుడు.

అంటే, అక్షరాలా నలభైయెనిమిది సంవత్సరాల కిందటి మాట అది.

ఆ మొదటి భోజనం నా కిప్పటికీ కళ్ళకట్టిన ట్టుంది.

ఆ చివరి సత్రం భోజనమున్నూ అలాగే వుంది, కళ్ళల్లో మెదుల్తూ.

అయితే, నాకే కాదు, సత్రం భోజనం అంటే ఇప్పు డందరికీ వెగటే.

హోటల్ భోజనం మాత్రం దర్జా, ఈ స్థితి కారోజుల్లో పడింది పునాది.

అది వేసినవారు మాత్రం యెవరికి వారే, మినిష్టర్లు కారు.

## 46

రామకృష్ణ కవుల దగ్గిర ప్రవేశించిన ఆరుమాసాలకే నాలో యేదో కొత్తదనం జాగృతం అయిన ట్టనిపించింది.

భాషలోనూ, భావనలోనూ, రచనలోనూ, కూడా కనపడిం దది.

దాంతో, నా సాహిత్యజీవితం సుపరిష్కృతం అయి "ఇక నిరాఘాటంగా వీరవిహారం చెయ్యగల"మన్న ఆత్మప్రత్యయం బలపడింది.

వీధిలోకి వెడితే "ఫలానా" అన్న వ్యక్తిత్వమున్నూ ప్రారంభం అయింది.

"స్వతంత్రంగా బతగ్గలం" అన్న ధీమా యెక్కువయింది దీంతో.

వెంటనే గుబగుబలాడించేసింది నన్నొక సరదా.

కానయితే కొత్తది కాదు, చిన్నప్పణ్ణుంచీ వున్నదే.

ఏదినాని కాదినం – వీక్షణాని కాక్షణమున్నూ బలపడిపోతూనూ వున్నదే అది.

"మరి, యింకెప్పుడూ?" అని ఆత్రపడిపోయాను.

మరేమీ కాదు – దర్జాగా క్రాపింగు పెట్టించుకుని, చక్కగా పక్కపాపిడి దిద్దుకోవాలన్న సరదా అది.

పిఠాపురంలోనే వొక ప్రౌఢ డెకారించిం దొకనాడు "చక్కగా క్రాపింగు పెట్టించుకోక నీకా జుట్టేమి" టని.

ఇది మరీ ఉద్రిక్తపరిచింది నన్ను.

అయితే, సీమంతం స్త్రైణమే వొప్పుకుంటాను.

మరి, తెగబారెడు జుట్టుండడం మాట?

అది మాత్రం శాస్త్రాతిక్రమణం కాదూ, యిదయితే?

ఏమయినా, మా నాయనగారి ఆగ్రహం పరమావధి అందుకుంటుంది నే నీపని చేస్తే.

విడిపోడం దాకా వెళ్ళిపోవచ్చు కూడా, వ్యవహారం.

"అయితే యేం?" అంటే, మరి బువ్వ?

ఈ భయం పోయింది నాటికి.

డాబుగా వచ్చి తమమీద నాలుగు పద్యాలల్లి ఝుమాయించి పాడితే అయిదులూ పదులూ రూపాయలిచ్చే సంపన్నులు వేలూ లక్షలూనూ, దేశంలో.

ఇప్పటికీ యిదే అంతస్థు మనదేశంలో, మినిష్టర్లకున్నూ.

గ్రంథ రచనకంటే ధనార్జనే ప్రధానం అనుకోగలిగితే, అంతవరకూ పిఠాపురంలో చేసివుండిన పద్యసాధన "వోహో, సుబ్రహ్మణ్యశాస్త్రిగారు" అనిపించుకోడానికి చాలు, నాకు.

నాయనగారి అనుగ్రహానికే గాని దానికడ్డురాదు క్రాపింగు.

అయితే "పంచాంగాలు పట్టుకుని బయలుదేరమా?" అనుకుని వున్నానే, మరి, నాలుగు డబ్బు లిచ్చేవారందరిమీదా పద్యాలు కడుతూ బయలుదేరనా?

కవి అయివుండినవాడికి — కనీసం కవితాసాధన చేస్తున్నవాడి కింతకంటే పతనం యేమివుందీ?

కాక, — కవిగానూ, గ్రంథకర్తగానూ చెలామణీ కావడానికి క్రాపింగు అగత్యం కాకపోవచ్చు, అభ్యంతరం మాత్రం కాదు.

వెంటనే మంగలిని పిలిచా నీధైర్యంతో.

వాడు వచ్చి కత్తి నూరసాగాడు క్షౌరం అనుకుని.

"కాదు, కత్తెర తియ్యి"మన్నాను.

అన్నాను — వొక ఆలోచన తట్టింది.

మార్పులన్నీ అంతవరకూ క్రమాంతరాలమీద నడిపించుకు వచ్చాను.

ఇదీ అలాగే చేద్దాం అనిపించింది.

జుట్టు తీయించేశాను, ముందీ వ్యూహతో.

మొదటిమాటు కనక గచ్చకాయ నునుపు తెచ్చాడు తలకి మంగలి.

పిలకమాత్రం వుంచాడు, కండిబొట్టంత ముడివచ్చేటట్టు.

ఒకమాటు ఝాడించా నది; కాని గుప్పెడు జుట్టు తగిలే చేతికది వున్నట్టే అనిపించలేదు.

ముడితో కింద పడివున్నజుట్టు చూశాటప్పటికి "అయ్యో" అనిపించింది.

ఆశ్చర్యమేమీ, స్త్రీ లసూయపడే జుట్టు నాది.

పొడుగుకు పొడుగు — చిక్కనకు చిక్కన — మెత్తనకు మెత్తన — నలుపు చెప్పనే అక్కర్లేదు — వీటికి సాయం దీర్ఘానుబంధం.

నిజాని కంత జుట్టున్నందుకు ముడివేసుకుంటే బాగానే వుండేది; కాని దువ్వుకోడం దగ్గిరికి వచ్చేటప్పటికి విసుగు.

తలంటుకోడం ఆలస్యం అయితే పేలు బయలుదేరేవి కులకుల్లాడుతూ, అదొక పీడ.

స్నానం చేస్తే, ఆరేదాకా నెమిలిపింఛంలాగ విప్పుకుని వేళ్ళతో చిక్కుతీసుకోవాలి, అదో బాధ.

వేసవి వస్తే జుట్టంతా చెమటతో తడిసి ముద్దయిపోడమే కాదు, సూదులతో పొడుస్తున్నట్టు తల అంతా చిటచిట్లాడ్డం – నిజంగా అది యమబాధే.

అయితే, జుట్టే వుంచుకోవాలనుకునేవారి కివి స్వల్పాలే; కాని క్రాపింగు వ్యామోహం నాకివి అసహ్యా లనిపించింది.

కాక, – కాలం పరుగెత్తుతుంది, స్థిరంగా వుండదు.

దాంతో, కొత్తరుచులు కలుగుతాయి, కొత్త వూహాలూ పుడతాయి, ప్రయత్నం అక్కరలేదు.

ప్రభుత్వమే మారిపోయింది మనకి, తప్పనిసరి మార్పులు ముంచుకునీ వచ్చాయి, పెద్ద యెత్తునా వచ్చాయి.

దీనికి సాయం – మారినవాళ్ల కెందునా అభ్యంతరాలు లేకపోతున్నాయి, చేతకాని నిందలు తప్ప.

ఇక పూర్వాచారపరాయణు లయినవా రేమంటే యేమి నిలిచిపోతుందీ?

అయితే, షట్కర్మపరాయణమైన వంశాన పుట్టివుండడం వల్లా, ఎంతో కొంత వైదికవిద్యలే నేర్చుకుని వుండడంవల్లా చిన్నప్పణ్నుంచీ అలవాటయి పూర్వాచార పరాయణత్వమే పాటించేవాణ్ణి నే నెక్కువగా.

అప్పటి నా దృక్పథం అవగాహన కావడాని కొక చిన్న వుదంతం.

ద్వారకాతిరుపతి వెళ్లాం మే మొకమాటు.

కొండమీద మా మేనల్లుడికి వొడుగు.

తొలీనాటి సాయంత్రాని కావూరు చేరుకున్నాం.

సత్రంలో బస.

పిల్లా మేకా యాభయిమందికి మించివున్నాం.

తెల్లవారితే ముహూర్తం.

రాత్రివంట లయినాయి.

మా నాయనగారూ, మా పింతల్లుల భర్తలూ పురోహితుడూ మొదలైన శిష్టులు స్నానాలు చేద్దామనుకుంటూ వుండగా పరివారంతో వచ్చి వొక నాయడుగారు బసచేశా రాసత్రంలోనే.

వారి వంటవాడు పొయిలో నిప్పున్నూ వేశాడు.

అది చూడగా ముందు నాకు పట్టుకుంది కంగారు, వంటలు మైలపడిపోయాయని.

పెద్దలు మాట్టాడారు; కాని "సబ్ కలెక్టరుదొరగా రండీ, పొమ్మనడానికి వీలా?" అన్నాడు గుమాస్తా.

మా అవస్థ చూసి వొక బ్రాహ్మణయింట అయనే మాకు బస కుదిర్చిపెట్టా డప్పటికప్పుడు.

వెడితిమిగదా, మా నాయనగారికి పరోక్షభక్తు డాయింటి యజమాని.

సొంత యిల్లయిపోయింది మా కది.

కాని, అప్పటికే రాత్రి తొమ్మిది దాటివుండడంవల్ల కూర వగైరా సాధనాలు చెయ్యడానికి వీలులేక, పచ్చడీ చారుతోనే భోజనం చెయ్యవలసివచ్చింది పెద్దలకు.

నేనూ వారితోపాటే భోజనం చేశాను, బ్రాహ్మణ్యం చెడిపోకుండా.

అలాంటిదల్లా పోయి, యిప్పటికీ మా అన్నలకు లేనిది, రుచీ దృక్పథమూ చాలా మారాయి నాకు.

దాని క్కారణం కవిత్వమున్నూ అయివుండాలి.

అయితే మాత్రం కవులందరూ క్రాపింగులు పెట్టించుకుంటున్నారా?

లేదు కాని, మొత్తానికి, కవిత్వానికీ వైదికాచారాలకూ చుక్కెదురు – ఇది మాత్రం ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగల న్నేను.

ఉదాహరణలూ చూపించగలను, వందలు.

వైదిక విద్యావేత్తల కిది తెలుసు.

ఇంచేతనే కవిత్వం అంటే వారు చులకనగా చూడ్డం.

శాస్త్రకారులకీ తెలుసు, కవులయినవారు, రసలోలుపత వల్ల వైదికాచారాలకు కొంతయినా విముఖులవుతా రని.

కనకనే కవులను వారు నటవిటగాయకవర్గంలో చేర్చడం.

సరే, చేర్చారు, నష్టం యెవరికీ?

దేశంలో – బ్రాహ్మల్లోనూ వేదమార్గానికి దూరంగా వుండినవారే యెక్కువ, వెనకటి రోజుల్లో కూడా.

వారంతా పతితులే అయిపోతారా?

తెలుసుకో గలిగితే, సంహితాబ్రాహ్మణాలతో పాటు ఉపనిషత్తులున్నూ యెప్పుడు బ్రహ్మముఖోద్గతా లయినాయో అప్పుడే వేదమార్గాని క్కొంత ప్రాతికూల్యం యేర్పడింది.

కాక:–

కవి ధర్మమే వేరు.

తపోనిష్ఠ ప్రధానం అతనికి, వైదికకర్మలు కాదు.

ఈ విశేషం గుర్తించుకోలేక కవులను చులకనగా చూడ్డం అవివేకం.

ఎప్పటివారో కాళిదాసూ భవభూతీనీ, వారంటే, దినదినమూ మన కాదరాభిమానాలు బలిసిపోతున్నాయి.

వెతికి తెచ్చుకుని భాసుణ్ణి నెత్తిమీదే పెట్టుకుంటున్నాం, ఇవాళ.

వాల్మీకినీ వ్యాసభగవానుణ్ణీ అర్థంచేసుకోడాని కిప్పుడే సరి అయిన ప్రయత్నాలు ప్రారంభం అయినాయి, మనలో.

శంకర భగవత్పాదులవారి రచనలకు పఠన పాఠనాలు ప్రచురం అయినకొద్దీ సమ్యగ్దృష్టి యేర్పడుతుంది మనకి.

మనం అంటే, యిక్కడ, కవులు మాత్రమే కారు, అందరున్నూ.

మరి, శాస్త్రకారుల సంగతి?

ఎందరికో ఉద్వాసన చెప్పేశాం.

మరెందరికో చెప్పేస్తూనే వున్నాం.

కవులను పంక్తి బాహ్యులన్నంత హీనంగా చూసిన శాస్త్రకారులకే యిప్పుడు పంక్తిబాహ్యత, స్వయంకృతాపరాధంగా.

మనమే కాదు, తమతమ శాస్త్రకారుల విషయమ్మై, యేదేశంవారూ యింతే, యేఖండంవారూ యింతే, యేమతం వారూ యింతే.

కాకపోతే యూరపియనుల కయినా మొదణ్ణుంచీ వుందా క్రాపింగు.

వారుమాత్రం తమ శాస్త్రవిధు లుల్లంఘించడం లేదూ?

మరెవరు మాత్రం వుల్లంఘించడం లేదూ?

మనలో ప్రతీవాడూ భగవద్గీత చదవడం వొక ఫేష నిప్పుడు.

మాట్లాడితే అందులో వెన్నో శ్లోకా లుదహరిస్తా రెందరో, సందర్భం అయినా కాకపోయినా.

మరి "యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః" అన్న శ్లోకం అర్థంచేసుకునే మాట్లాడుతున్నారా వారంతా?

ఇలా యెందుకు జరుగుతోందీ మనలో?

ఇది పరిశీలించుకోవాలి తెలివిగలవాడు.

పశువుల కివ్వనిది, భగవంతుడు, బుద్ధి ప్రసాదించాడు మనిషికి.

అది పదునుపెట్టుకోడానిగ్గాని బండపారించుకోడానికి కాదు.

అది కల్పనలమీద కల్పనలు చేస్తుంది; గాని నల్లరాతి లాగ స్తబ్ధంగా పడివుండలేదు.

కన్ను, మాటిమాటికీ రేపెడుతూ వుంటుంది దాన్ని.

మనసు, ఎప్పటికప్పుడు వూపేస్తూ వుంటుంది.

దాంతో నిశితం అవుతుంది ప్రతిభ.

చరిత్ర, కళలు, భౌతికశాస్త్రాలు, భిన్నభిన్న జాతులతో సంపర్క సహవాసాలు, వయఃపరిణామం – ఇవన్నీ దానికి నవ్యత ఆపాదిస్తాయి.

మన పురాణాలున్నూ కొంతవర కీపనే చేస్తాయి, పరిశీలనగా చదివితే.

అదే కొత్తరుచికి కారణం అవుతుంది.

"వెనకటి పద్ధతులూ రుచులూ ఆ బుద్ధి తీర్చినవే కావా?" అంటే, వాటిలో లోపాలు కనపడతాయి, తరవా త్తరవాత, దానికే.

మరి శాస్త్రకారులకు లేదూ యీ బుద్ధినైశిత్యం?

అది మాత్రం మారదూ?

మారకేం?

అయితే, దాని నడక, శృంఖలాబద్ధం కావడంవల్ల యెప్పుడూ శతాబ్దులకు వెనకనే వుంచుతూ వుంటుంది, శాస్త్రకారులను.

ప్రాతిపదికలున్నూ జర్జరితా లయిపోయేదాకా మార్పుల అగత్యం గుర్తించలేరు వారు.

అంచేతే, యేదేశంలోనూ యేఖండంలోనూ యేమతంలోనూ కూడా వారి కనుయాయులు తక్కువగా వుండడమూ "నీ లెక్కేమిటి?" అనేవారే యెక్కువగా వుండడమూనూ.

మరి, సామాన్యుల బుద్ధే యిలాగ కొత్తరుచులు పుట్టిస్తూ వుంటే - మరుగుతూనూ వుంటే, క్రాంతదర్శు లయిన కవుల బుద్ధి యెలాంటి రుచులు పుట్టించనూ?

అంటే, సత్యం - శివం - సుందరం - ఇంతే కవుల ధ్యేయం.

మానవ జాతి సభ్యం కావడమూ, ఆనందానుభూతితో మహోదారం కావడమూ ఇంతే వారికి ప్రాప్యం.

"అయితే, కవులం అనుకునేవా రందరూ కవులేనా?" అని కొందరి ప్రశ్న.

సంశయాత్ముల ప్రశ్న యిది.

ఇంకా చెప్పాలంటే, అపరిణతచిత్తుల ప్రశ్న యిది.

అవునో కాదో నిర్ణయించడానికే కాదు, ఈ ప్రశ్న వెయ్యడానికిన్నీ అర్హులు కారు వారు.

## 47

జుట్టంతా తీయించెయ్యడంవల్ల నా మొగం నాకే వికారంగా కనపడిం దద్దం చూసుకోగా.

"ఇదేమి" టన్నారు గురువులు, చకితులయి.

వారా లిచ్చినవారున్నూ వింతగా చూడసాగారు.

వారం పద్దినాలదాకా, బసలో వున్నంతసేపూ, అద్దం చూసుకోడం వొక్కటే పనయిపోయింది నాకు.

చాలా బాధపడిపోయా న్నేను రూపవ్యత్యయం భరించలేక.

ఈ స్థితిలోనే మావూరు వెళ్ళాను, వారందరినా లుండవలసివచ్చి.

తలుపు తీశారు; కాని యెవరో అనుకున్నారు, మా అమ్మగారు, మొదట.

తుళ్ళిపడిపోయింది మా సీత.

"యాక్కురారీ" అనేసించి మా చెల్లెలు.

ఊరివారున్నూ "యేమిటీ వికారం?" అన్నారు కొందరు.

భాషలోనూ భావనలోనూ పద్యబంధంలోనూ చేసింది కాక, పిఠాపురం వెళ్ళి నేను చేసిన సాధన ఇదే అన్నట్టు భావించారు మరికొందరు.

మా నాయనగారు మాత్రం పొంగిపోయా రదే స్థిరం అనుకుని.

గోష్పాదమాత్రం కంటే యెక్కువ జుట్టుంచుకోడమూ వారికిష్టం లేనిదే మరి.

అయితే, నాలుగు మాసాలకే నిజస్థితి తెలిసివచ్చింది వారికి.

పాపిడి చూసి వీరభద్రావతారమే తాల్చేశారు వారు.

ఇది స్వల్పవిషయమూ, కనక, యిందుకోసం అంత బాధపడ్డం చాదస్తమూ కాదా అంటే, అన్ని మతాలవారిలోనూ వున్నా యిలాంటివి.

క్రైస్తవులకు పుష్పశయ్య అమంగళకరం.

నెత్తిమీదా మొగానా కత్తి కత్తెరా పడితే, శిఖ్ఖులకు పౌరుషహానే కాక మతభ్రంశమున్నూ.

గడ్డం పెంచుకోకపోడం ముస్లిములకు ధర్మాతిక్రమణం.

తప్పూ లేదు, వింతా లేదు, సంప్రదాయగౌరవం గలవారి కెవరికయినా తప్పందే యిది.

ఎవరిదాకానో అక్కర్లేదు, వైదికుల్లో, లుంగీకట్టుకునేవారినీ, చుట్టా బీడీ సిగరెట్టూ కాల్చేవారినీ చూస్తే నాకూ బాధగానే వుంటుం దిప్పటికీ.

కాని, స్వధర్మనిష్ఠా, దానికిముందు, స్వధర్మబోధా లేని జాతిలో మనిషి కొకరకంగా తయారవుతా యిలాంటి వేషభాషలు.

అయితే, ఇలాంటిది తటస్థిస్తే లౌక్యవృత్తిలో వున్నవారిలాగ వైదికవృత్తిలో వుండినవారు సద్దుకోలేరు, కాస్తా కూడా.

నిజంగా, మా నాయనగారు, నట్టింట మతాంతరుడు సంచరిస్తున్నా డన్నంత బాధపడిపోయారు నన్ను చూసి అప్పుడు.

కవి నయినందుకూ, నటు ణ్ణయినందుకూ, గాయకుణ్ణి కాబోయినందుకూ బాధపడిన్నీ అప్పటికి కొంచెం సద్దుకుని వుండినవారల్లా మొదటికి వచ్చేశారు దీంతో వారు.

నన్నేం చేసినా తీరని ఆగ్రహం అయిపోయింది వారిది.

పోనీ, చావగొట్టి చెవులుమూసి కూచోబెడదామంటే, ఆ వయస్సెప్పుడో దాటిపోయివుంది నాకు.

దీనికి సాయం, మా అమ్మగారు "పోనిస్తురూ" అనడం వొకటి.

దీంతో, మా నాయనగారి క్కలిగిన ఆవేదన అప్పుడూ అర్థం అయింది నాకు, ఇప్పటికీ జ్ఞాపకం వుందది.

అయినా, వారి ఆజ్ఞ శిరసావహించలేకపోయా న్నేను.

ఒక్కటి మాత్రం అందరూ గమనించవలసివుం దిక్కడ.

వెయ్యేళ్ళ మహమ్మదీయపరిపాలన తెచ్చిపెట్టలేని మార్పులు తెచ్చిపెట్టింది, నూట యాభై సంవత్సరాల క్రైస్తవ పరిపాలన, మనలో.

చాలామంది విద్యాధికులను తన వలయంలోకి తీసుకోలేకపోయినా, బ్రహ్మసమాజం, ఆర్యసమాజం వంటి కొత్త సంప్రదాయాలు ప్రారంభించే టట్టయినా చేసింది క్రైస్తవమతం.

కళ్ళకు వెలుగిచ్చి కొత్తబాటలు కనపర్చి దృక్పథమే మార్చేసింది, ఇంగ్లీషు వాఙ్మయం, మనకు.

వైదిక విద్యలు నేర్చి స్వధర్మనిష్ఠులయి వుండినవారిని కూడా తమ కుమాళ్ళను ఇంగ్లీషు చదువులో ప్రవేశపెట్టేటట్టు చేసింది ఉద్యోగ వ్యామోహం.

"వీరి కధికారం వుంది, వీరికి లేదు" అనకుండా అష్టాదశ వర్ణాలవారికీ పఠనపాఠనావకాశాలు కల్పించింది రాజ్యాంగం.

దీంతో మన ధర్మసౌధం పునాదులకంటా కూలిపోయింది.

అయితే, స్వాతంత్ర్యం వచ్చింది కనక, మళ్ళీ మన స్వధర్మం ప్రతిష్ఠించబడుతుందా మనగడ్డమీద?

లేదు, లేదు, అందుకూ అవకాశం లేదు.

ఇంగ్లీషు వాఙ్మయం జీర్ణించి, స్వధర్మ పరిజ్ఞానం మొదలంటా నశించి, పైపెచ్చు, బ్రిటిషువారి అడుగుజాడలు విడిచిపెడితే నిలవలేనివారి చేతిలో యిరుక్కుపోయి వుంది, మన ప్రభుత్వయంత్రం యిప్పుడు.

బ్రిటిషువారి చేతిలోకంటే వీరిచేతిలోనే యెక్కువ దెబ్బతింటుంది మన స్వధర్మం.

మనజాతికి ముందే వుంది ముసుళ్ళపండుగ.

వెనకటివాటి స్మృతిచిహ్నాలే లేకుండాపోతా యనేకాలు.

జనసామాన్యానికి, రాజకీయాలే తారకం అన్న అజ్ఞానం పోతే తప్ప మనకి మరి గతి లేదు.

ప్రాతిపదికలకు భంగం రాకుండా స్వధర్మానికి కొత్తసంప్రదాయం సృష్టించగల సమర్థులు ముందుకి రావడంలేదు ఇప్పటికీ మరి.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్."

## 48

తమకు శక్యం కాక, నన్ను మందలించవలసిందని మహేంద్రవాడ గ్రామకరణం ముంజులూరి వేంకటరామయ్యగారిని కోరారు మా నాయనగారు, చివరికి.

వేంకటరామయ్యగారంటే గౌరవభావమే కాదు, నాకు భయభక్తులున్నూ.

సంపన్న నియోగిగృహస్థులు వారు.

గ్రామాధికారులు.

విశేషించి, మా నాయనగారు పాలమూరిలో ప్రవేశించింది మొదలు, ఆ కుటుంబం మాకొక పెద్ద అండ.

నిజంగా, సద్బ్రాహ్మణులు చాలా తక్కువగా వుంటారు, ఉండినవారిలో మాత్రం వేంకటరామయ్యగా రొకరు.

ఏడోయేట వొడుగయిందిట వారికి, అది మొదలు హరీ అనేదాకా సంధ్యావందనం చేసుకోని రోజు – పూట అయినా లేదు, వారి దీర్ఘజీవితంలో.

వయసు పెరిగినకొద్దీ జపతపోనిష్ఠలు పెరిగిపోయాయి వారికి.

నాకు బాగా జ్ఞానం వచ్చేటప్పటికి వైశ్వదేవం చేస్తూ వుండినారు వారు.

మా నాయనగారు ఆ కుటుంబానికి గురువులూ మంత్రోపదేష్టలూనూ.

శుభకార్యాలు వస్తే వారి పురోహితుడు మా నాయనగారి సలహాప్రకారమే తంతు నడిపేవాడు.

కర్మశ్రద్ధకు తోడు వేంకట రామయ్యగారికి స్తవనీయమైన వితరశీలమున్నూ వుండేది.

అతిథులూ అభ్యాగతులూ యెందరు వచ్చినా మహేంద్ర వాడలో, వారి యింటనే ఆదర గౌరవాలు.

వారి వైశ్వదేవిక ప్రతిపత్త్యా లీపాకానికి ఆధ్వర్యవం తరచు నాది.

అంచేత వారి కర్మశ్రద్ధ నాకు బాగా అవగాహన అయింది.

దాంతోటే నాకు, వారంటే ఆదర గౌరవాలూ భయభక్తులూ హెచ్చాయి.

కనక, వారు మందలిస్తే నేను దారికి వస్తానని మా నాయనగారి నమ్మకం.

అయితే, అప్పటికే కాదిప్పటికీ నా స్వభావం నా ఆత్మీయులున్నూ చాలామంది యెరగరు.

అది మంచనండి చెడ్డనండి, మంచి కయినా చెడ్డ కయినా నా నిశ్చయమే నిశ్చయం నాకు.

ఒక విధంగా నిశ్చయం చేసుకోనంతవరకే యెవరి సలహా అయినా నేను పాటించడం.

ఏదీ కూడా రహస్యంగా చెయ్యడమున్నూ నా పద్ధతి కాదు.

ఇది గుర్తించివుండనివారు కనక, వేంకటరామయ్యగారు, మెత్తమెత్తగా ప్రారంభించి మిక్కిలీ నిష్ఠురంగా మందలించా రొకనాడు నన్ను.

"వెంటనే క్రాపింగు తీయించెయ్య" మనిన్నీ ఆజ్ఞాపించారు.

అది నాకు మిక్కిలీ అప్రియమైన సలహా.

అయినా సవినయంగానే విన్నా న్నేను.

"ఇది చిరవాంఛ. కనక మీ ఆజ్ఞ శిరసావహించ లే"నని న్నీ సవినయంగానే మనవిచేసుకున్నాను వారికి.

వారి నెదిరించడం నా కిష్టమూ కాదు, ఉద్దిష్టమూ కాదు; కాని అనివార్యం అయిపోయిం దావేళ.

"క్రాపింగు పెట్టించుకోడం బ్రాహ్మణధర్మం కాదంటారే, మీరు చెంగావిపంచె కట్టుకున్నారు గదా, రంగుబట్ట కట్టడం బ్రాహ్మణధర్మమేనా?" అన్న వొక్క వాక్యంతో పూర్తయింది నా యెదురువాదం, ఆవేళ.

## 49

చెంగావి బట్టలూ, చుట్టు చెంగావిబట్టలూ ఇప్పటివారికి చాలా మందికి చారిత్రక వస్తువులు; కాని నా చిన్నతనందాకా అవే యేలాయి బజార్లు.

ప్రభువులూ, జమీందార్లూ, రాజబంధువులూ, తత్తదనుయాయులూ అవే కట్టేవా రెప్పుడూ.

ఎటొచ్చీ వైదికులు మాత్రం దూరంగా వుంచేవా రవి, కన్నెంత చెదిరిపోతూవుండినా, మనసెంత వుబలాటపడుతూ వుండినాను.

వైదికులంటే, యిక్కడ, అనూచానసంపత్తి గలవారికే గ్రహణం.

అయితే, వైదికస్త్రీలలో, తరుచు, ఆ రకం చీరలే కట్టేవారు, రంగుచీరల్లోనూ ప్రత్యేకించి.

రంగుచీరలు మడికి వాడకూడదనే ధర్మం అప్పు డప్పుడే వుల్లంఘించడం ప్రారంభిస్తున్నారు వారు.

వితంతువులూ పుణ్యస్త్రీలూ వొక్కలాగే వుంటున్న ఈ రోజుల్లో విడ్డూరంగానే వుంటుం దీమాట; కాని దీనికి సంబంధించిన పట్టుదల చాలా యెక్కువగా వుండే దారోజుల్లో.

నేను మరీ చిన్నవాణ్ణయివుండినప్పుడు, మడికోసం అని మా అమ్మగారికి ప్రత్యేకంగా తెల్లచీర లుండేవి కొన్ని, నాకు బాగా జ్ఞాపకం.

ఒకమాటొక చుట్టపావిడ వచ్చింది మా యింటికి.

పేరు బులుసు అంతమ్మగారని, మా నాయనగారికి పింతల్లి కూతురామె.

అప్పటికామె వయస్సు అరవైకి పైని.

మా నాయనగారికంటే పెద్ద.

వితంతువు అయితేనే చాదస్తం పెరుగుతోంది వైదిక స్త్రీలలో, వయసు ముదిరితే దానికిక హద్దే వుండదు.

దీనికి సాయం, ఆమెది కోనసీమ.

ఆరాత్రి ఆమెకి ఉప్పుపిండి వడ్డించేటప్పుడు చెంగావిచీర మడికట్టుకుని వున్నారు మా అమ్మగారు.

పీటమీదికి వచ్చేటప్పుడే మొగం చిట్లించుకుంటూ వచ్చా రామె.

వడ్డన పూర్తయేటప్పటికిక వుండబట్టలేక "మహాలక్ష్మి సోదెమ్మా, నువ్వే రంగుబట్ట మడికట్టుకుంటే యిక నేనేం చెప్పగలనూ?" అంటూ సాగతీసుకున్నారు.

అన్నారు ఫలహారం ప్రారంభించారు, మానలేదు.

ఆ మాటకి, మా నాయనగారు గతుక్కుమన్నారు, సిగ్గుపడి మా అమ్మగారు వెనక్కి వెళ్ళారు.

నేను మాత్రం వూరుకోలేకపోయాను.

ఆమె కొడుకు సూర్యనారాయణశాస్త్రిగారు గొప్ప పండితులు.

దానికితోడు వల్లమాలిన చాదస్తం.

కాని, గూటాల అనే గ్రామంలో నెలజీతం పుచ్చుకుని సంస్కృతపాఠాలు చెబుతున్నా రప్పటికే ఆయన, అగ్రహారం కుర్రవాళ్ళకి.

ఇప్పు డదేమి టనేవారు లేరనే చెప్పవచ్చు; కాని చాలా నింద్యమైన కార్యం అది, అప్పటికింకా.

తన కొడుకే అలాంటి పని చేస్తూవున్నప్పుడు రంగుబట్ట మడి కట్టుకున్నందుకు మా అమ్మగారి నాక్షేపించడంలో యేమిటీ ఔచిత్యం?

నేనిలా అడగ్గా చాలా రుసరుస లాడారామె.

అది చూసి మా నాయనగారు నన్నే మందలించారనుకోండి, ఒక విషయంలో కులధర్మం తప్పినవారు మరో విషయంలో తప్పినవారి నాక్షేపించడమేనా?

చెప్పవచ్చిం దేమి టంటే?

వైదికుల్లో ఆచారవ్యవహారాలకు దూరంగా వుండే కుర్రకారు యెక్కడయినా చుట్టుచెంగావి బట్టలూ చెంగావిబట్టలూ కట్టడం లేకపోలేదు.

నే నెరిగినంతవరకూ మా పెద్దన్నగారి భావమరిది గొల్లకోట నారాయణమాత్రం ఆ బట్టలు కట్టేవాడు.

అతణ్ణే చూసి అలాంటివి కట్టాలని నేనూ వూగిపోయేవాణ్ణి; కాని యిజార్లు తొడిగే మరీ చిన్నతనంలో తప్ప పంచెలు కట్టడం ప్రారంభించాక రంగుబట్ట కట్టనివ్వలేదు మా నాయనగారు మమ్మల్ని.

అయితే, తరవాత్తరవాత, తక్కిన విషయాలతో పాటు వాటివిషయమయిన్నీ నేను లక్ష్యపెట్టకపోయే వుందును; కాని నాలో మార్పు ప్రారంభం అయ్యేటప్పటికే మోటు అనిపించుకుంటున్నాయవి.

1702 మల్లు కట్టడం గొప్ప అనే భావం అప్పుడే ముదురుతోంది.

1702 మీదా, గ్లాస్కోమల్లుమీదా చెంగావీ చుట్టుచెంగావీ అద్దేవారప్పుడు.

నియోగులు అవే కట్టేవారు పాయికంగా.

చెంగావి అంటే యెర్రకలవపువ్వు రంగు, ముదరా లేతా భేదం మాత్రం వుండే దందులో.

తామరపువ్వు చాలా చక్కనిదే; కాని మనోజ్ఞతలో చెంగలువకు బాగా లొచ్చు.

ఆ విషయమై తక్కిన పువ్వులూ అంతే.

కనకనే ఆ రంగుబట్టల కంతమన్నన.

ఆ మన్నన, సర్వతంత్రస్వతంత్రులైన మన పూర్వప్రభువులతో ప్రారంభం అయి మొన్న మొన్నటిదాకా చెలామణీ అవుతూనే వుండేది.

అంత వైదిక మార్గనిష్ఠులు ముంజులూరి వేంకట రామయ్యగారున్నూ అవే కట్టేవారు మడికిన్నీ.

వారు తెల్లబట్టలు కట్టడం నే నెరగనే యెరగను.

రాజులతోనూ, చివరికి జమీందార్లతోనూ నిరంతర సాహచర్యం తెచ్చిపెట్టివుంటుంది నియోగులకా సంప్రదాయం.

మీసాలుంచుకోడం కూడా నియోగుల కలా వచ్చిన సంప్రదాయమే.

అయితే, ఇవాళ చూస్తే వైదికుల్లో మీసాలుంచుకునేవారూ బయలుదేరారు, నియోగుల్లో మీసాలు తీయించేసేవారూ బయలుదేరారు, దేశంలో యింగ్లీషు ముదిరాక వచ్చిన మార్పిది.

ఏమయినా ఎర్రపంచె కట్టుకునేవారు క్రాపింగు పెట్టించుకున్నందుకు వన్నాక్షేపించవచ్చా?

ఇదీ నా పాయింటు.

నే నీమాట అడిగేటప్పటికి వేంకటరామయ్యగారి క్కోపం వచ్చింది.

## 50

చదువు చాలించుకున్నా పిఠాపురం వెడుతూనే వుండేవాణ్ణి తరుచు నేను.

రామకృష్ణకవులను విడిచివుండలేకపోడం కొంతా, ఇంటో కూచుని నిరంతరమూ, రచన సాగిస్తూ వుండడంలో యేమి టేమిటో సందేహాలు వచ్చి గతినిరోధం యేర్పడ్డం కొంతా అందుక్కారణాలు.

అన్నాళ్ళు పిఠాపురంలో వుండడంవల్ల నాకు, పాండిత్యం వేరూ భావుకత వేరూ — పద్యం వేరూ కవిత్వం వేరూ అని నిష్కృష్టమైన జ్ఞానం కలిగింది.

రచన అంతకంటే వేరనిన్నీ స్థిరనిశ్చయం కలిగింది.

పిఠాపురంలో నేను గట్టిసాధన చేశాను, అయితే, అదంతా పద్యసాధన అయి, నడమంత్రపు సిరివంటి దయిపోయింది.

ప్రాజ్ఞత వచ్చాక కూడా నా జీవితంలో మిక్కిలీ విలవ అయిన కాలం కొంత యిలా గడిచిపోయింది, దురదృష్టవశాన.

ఇంటికి వచ్చాక వచన రచన దీక్షగానే సాగించాను; కాని పద్యవ్యామోహం, పూర్వవాసన లాగ వుబుకుతూనే వుండేది, అప్పుడూ అప్పుడూను.

కేవల పద్యమయంగా నేను రచించినది గీతమంజరి అన్న గ్రంథం.

లేఖనీగీతం, ప్రబోధగీతం — ఇత్యాదిగా కొన్ని ఖండకృతుల గుచ్ఛం అది.

దాన్ని పురస్కరించుకుని చెప్పవలసింది వుంది. అది ముందు ముందు.

తరవాతి రచన పాణిగృహీతాశ్రవణానంద శృంఖల.

అదొక కలవంటిది.

అనుకోకుండా వచ్చింది, అవ్యాహతంగా జరిగిపోయింది.

పరిస్థితులలా వచ్చా యనను, నే నందుకు లొంగిపోయాను, స్పష్టంగా.

ఎప్పు డెందుకు ప్రారంభం అయిందో మరి, ఇప్పటికీ నాకిలాంటి వ్యగ్రోత్సాహం కలుగుతూనే వుంటోం దప్పుడప్పుడు.

దానివల్ల కొన్ని అసందర్భాలు కలక్కపోలేదు, మంచి సందర్భాలూ వచ్చా యెన్నో.

నా బహుగ్రంథరచన వాటిల్లో వొకటి.

మరో గ్రంథం రచించాలి గదా?

అది మానేసి ఇదే రచించాను.

చెప్పవచ్చిం దేమిటంటే?

ఆవేళ వినాయకుని చవితి.

సాయంత్రం నాలుగయి వుంటుంది.

గ్రామకరణం శ్రీ బుద్ధవరపు సూర్యనారాయణగారు, అందరికీ లాగే నాకూ వర్తమానించారు "ఒక్కమాటురా"మ్మని.

తటవర్తి వేంకటరాజుగారి విషయం చాలామాట్లు చెప్పివున్నాను, వారి చెల్లెలి భర్త యీ సూర్యనారాయణగారు.

"సూరీరావు" అని వారికి వ్యవహారం.

పేరుకే ఆయన గ్రామకరణం, లౌక్యంలో ఆమాత్రం చెయ్యి బహు అరుదుగా వుంటుం దేదేశంలో నయినా.

మా ప్రాంతం గ్రామకరణాలందరూ నియోగులు.

వారిలో నూటికి తొంభైతొమ్మండుగురు ఆరువేలవారు.

వారిలో అసాధారణ ప్రజ్ఞావంతు లెందరో వున్నారు, వారందరిలోనూ సూరీరావుగారిది అగ్రపీఠం.

వెనకటికి, నియోగులు, మహామంత్రిపదవులు జేగీయమానంగా నిర్వహించేవారంటే అబ్బురమా, గ్రామకరణాల్లోనే అంత ప్రతిభావంతు లుండినప్పుడు.

సూరీరావుగారికి పెద్దబ్బాయి (మరింగంటి లక్ష్మణాచార్యులు)గారన్నా, మా నాయనగారన్నా ప్రత్యేకాభిమానం.

మా కుటుంబంలో నేనంటే మరీ అభిమానం.

నేను కులవిద్యలు విడిచిపెట్టినందుకు వారికీ అసంతృప్తిగానే వుండేది మొదట; కాని, కవి అని నాకు పేరువచ్చాక ప్రత్యేకాదరభావం కలిగింది నామీద.

అంచేతనే అప్పుడున్నూ నా కాహ్వానం రావడం.

నేను వెళ్ళేటప్పటికి బ్రాహ్మలు కొందరూ, తండ్రీకొడుకు లిద్దరు క్షత్రియులూ, రెడ్లు చాలామందీ చేరివున్నా రక్కడ.

విఘ్నేశ్వర చరిత్ర పురాణకాలక్షేపమున్నూ ప్రారంభం అయివుండిం దప్పటికే.

పెద్దబ్బాయిగారు చెబుతున్నా రర్థం.

మైలవరపు సూర్యనారాయణగారని ఆ వూళ్లో యింకో బ్రాహ్మణగృహస్థు.

ఊళ్లో సూరీడు అని ఆయనకు వ్యవహారం.

పెద్దబ్బాయిగారి యెడల గురుభావం ఆయనకు.

నే నెప్పుడూ ప్రత్యక్షంగా యెరగను, కవి అనేవా రాయన్ని కొందరు.

మే మంటే పడేదికా దాయనకు.

మా నాయనగారూ మా అమ్మగారూ తమ యింట భోజనం చెయ్యరని ఆయనకు కోపం.

తెలగాణ్యులు వారు.

తెలగాణ్యుల యింటనే కాదు, మా నాయనగారూ మా అమ్మగారూ యే శాఖాంతరంలోనూ భోజనం చేసేవారు కారు.

అన్నిశాఖల్లోనూ వున్నా రలాంటి స్వయంపాకనిష్ఠాపరులు వేనవేలు.

తెలగాణ్యుల్లోనూ వున్నారెందరో.

వారూ భోజనం చెయ్యరు శాఖాంతరాల్లో.

ఇదీ అందరికీ తెలిసిందే.

అందరికీ యిష్టమైనదిన్నీ.

కాని సూరీడుగారికి "నాకంటే మీ యెక్కువేమిటి?" అని మా నాయనగారి యెడల ద్వేషం.

"పోనీ, మీరూ నియమంగా వుండండి" అంటే, ఊహూ!

ఏ శాఖలోనైనా భోజనం చేసేవా రాయన.

వంటబ్రాహ్మడి వంటకూడా నిషిద్ధం కా దాయనకు.

ఇలాంటి కారణాలవల్ల మాకూ మాకూ తరుచు సంభాషణ వుండేదికాదు.

ఆయన చదువుతున్నా రావేళ పుస్తకం.

నేను వెళ్ళి తటపర్తి వేంకటరాజుగారి దగ్గిర కూచున్నాను.

తాను జరిగి నాకు చోటిచ్చాడు నా చేత విజయవిలాసం చదివించిన సత్తి సుబ్బారాయడు.

రెడ్లలో భూమంచి రెడ్డిశాఖ అతనిది.

తూర్పుపడమటి గోదావరిజిల్లాల్లో యీశాఖ చాలా హెచ్చు.

విఖ్యాత వణిక్ళిఖామణులు కొవ్వూరి బసివిరెడ్డిగారూ, ఆంధ్రభాషాపోషకులు కొవ్వూరి చంద్రారెడ్డిగారూ, ఆ శాఖీయులే.

పూర్తిగా పురాణధోరణి కాదు; గాని చిన్నచిన్న మాటలతో కథ చక్కగా చెబుతున్నారు పెద్దబ్బాయిగారు, సూరీడుగారి పఠనమే బాగా లేదు.

ముఖ్యంగా, అది, అన్వయానుకూలంగా లేక మళ్ళీమళ్ళీ చదివించుకోవలసివస్తోంది పెద్దబ్బాయిగారికి.

ఆయన సరిపెట్టుకుంటూనే వున్నారు; గాని సుబ్బారాయ డూరుకోలేకపోయాడు.

పెద్దబ్బాయిగారి ధోరణి కూడా దెబ్బతింటోందన్న బాధ అతనిది.

పోనీ అంటే తాను రాగరంజితంగా చదవలేడు.

కాగా, వూరుకోలేక, వేంకటరాజుగారిని సంబోధించి నాచేత చదివించమన్నా డతను.

అతనిది, నేను, అన్వయానికి భంగం కలిగించనన్న నమ్మకమే గాని నేనూ రాగరంజితంగా చదవలేను, తెలుసు అతనికి.

అంచేత కూడా నేనందు కంగీకరించలేదు.

వేంకటరాజుగారూ అంగీకరించలేదు, తగువులు వస్తాయని.

ఇది జనాంతికం అని మా ముగ్గురికీ నమ్మకం; కానీ యీమాటలు సూరీడుగారి చెవినిబడ్డాయి.

చాలా కోపం వచ్చిందాయనకు.

ఆ రావడం నామీద వచ్చింది, సుబ్బారాయడిమీదకంటే హెచ్చుగా.

మావూర్వవైరాని కదొక మూరాకు.

ఇంతలో వొక ఆశ్వాసం పూర్తికావచ్చింది.

అంటే ఆశ్వాసాంతపద్యాలు ప్రారంభం అయినాయి.

గ్రంథకర్తకు కవిత్వంకంటే పాండిత్యం హెచ్చు, చాలా జటిలంగా వున్నాయవి.

ఒక పద్యంలో భుజార్కళా అన్న సంబోధన వచ్చింది.

అది నడవలేదు పెద్దబ్బాయిగారికి.

"ఏమిటీ?" "మళ్ళీ" "మళ్ళీ" అంటూ నాలుగైదుమాట్లు చదివించుకున్నా రాయన, అప్పటికీ స్ఫురించలేదు.

నేను చకితుణ్ణయిపోయా నది చూసి.

"ఈ మాట యెప్పుడూ వినలేదే" అంటూ రెట్టించారు పెద్దబ్బాయిగారు, అంతటితో వూరుకోక.

"బాగా చూసి చదవం"డన్నారు సూరీరావుగారు.

దానిమీద మరీ రుసరుసలాడారు సూరీడుగారు.

"బావగారూ, మీకేమయినా అవగాహన అవుతోందా?" అని నన్నడిగారు సూరీరావుగారు, ఆయనమాట లెక్క_చెయ్యక.

అవగాహన కావడానికేం వుందీ, భుజార్గళా అన్న మాట అది, గావత్తుకి బదులు కావత్తు పడిందచ్చులో.

పెద్దబ్బాయిగారున్నూ అడిగారు నన్ను "మీరెప్పుడయినా విన్నారా ఆమాట?" అని.

అది సూరీడుగారికి పరాభవం అనిపించింది.

"మీకేం చాదస్తమా యేమిటండీ?" అంటూ గురువుగారిమీదే చఱ్ఱుమన్నా రాయన.

అయినా, సూరీరావుగారు నన్ను విడిచిపెట్టలేదు.

తప్పనిసరి అయి అప్పుడన్నాను పెద్దబ్బాయిగారితో "అచ్చు తప్పనుకుంటాను. భుజార్గళా అన్నమాట అది" అని.

"బాగుంది" అంటూ అర్థం చెప్పేశారు వారు వెంటనే.

కాని "కాదు కా"దంటూ కూచున్నారు సూరీడుగారు.

"చెన్నపట్నంలో అచ్చయిన పుస్తకంలో వూరి పొలిమేరలు దాటనివాళ్ళు కూడా తప్పులుపట్టడమేనా?" అని ఆయన అభిమానం.

"మనకి తెలిసిన మాట చేర్చుకుంటే సరిటండీ, పుస్తకంలో వున్న మాట కర్థం చెప్పాలి గానీ?" అని ఆయన వాదమున్నూ.

"ఏమయినా "భుజార్గళా" అన్నమాటే అది" అనేశారు పెద్దబ్బాయిగారు.

అప్పటికీ వూరుకోలేదు సూరీడుగారు.

తమ పఠనం బాగాలేదని సభలో గుసగుసలు రేగడమూ, తమర్ని తప్పించమనీ నాచేత చదివించమనీ సుబ్బారాయడు తొందరచెయ్యడమూ, అయిదారుమాట్లో కూడా తాము భుజార్క_ళా అనే చదివుండడం వల్ల తామూతప్పు గుర్తించలేకపోయినట్లు సభ్యు లనుకుంటున్నా రనుకోడమూ – ఇదీ ఆయన బాధ పాపం!

ఇది పెద్దబ్బాయిగారికి లేనిదిన్నీ.

పోనీ అంటే, వారి కందనిదా యిది?

అచంచలా లయిన బాహుబలదర్పాలు చెప్పవలసినచోట తరుచు వచ్చేదే యీమాట, పూర్వగ్రంథాల్లో. అయితే, "జనార్ధనా" వంటి కొత్తప్రయోగాలు కొన్ని చేశాడాకవి అక్క_డక్క_డ.

అవి పెద్దబ్బాయిగారు చాలా సరసంగానే విరిచి అర్థం చెప్పారు.

ఇదీ అలాంటి కొత్తప్రయోగమేమో అన్న ఆలోచనలో పడ్డా రాయన.

ఇది స్ఫురణకి అడ్డంకి అయింది.

కాక, –

అచ్చుతప్పు గుర్తించినంతమాత్రాన పెద్దబ్బాయిగారికంటే గొప్ప వాణ్ణయిపోయానా నేను?

ఇదేమీ కాదు, తాము తప్పుచేసినట్టూ, అది నేను దిద్దినట్టూ – ఇలా అనిపించింది సూరీడుగారికి.

దీంతో కొట్టినంత పనయిం దాయనకు.

తరవాత కథాశ్రవణం పూర్తి అయిపోయింది.

అందరూ లేచారు.

సూరీడుగారికి మాత్రం దుగ్ధ పోలేదు.

"రోజు లలా వున్నాయండీ! మహానుభావులు తిరుపతి వేంకటకవులు – కాస్తలేసి కుర్రాళ్ళు రామకృష్ణకవులు వారి నెదిరించడం – చూశారు కాదూ?" అంటూ ప్లేటు మార్చా రాయన దివాకరరాజుగారితో.

నాకు నవ్వు వచ్చింది.

భుజార్గళా అన్నది అచ్చుతప్పని గుర్తించలేని పండితుడు – "ఉన్నదున్నట్టే వుంచి దానికర్థం చెప్పా"లంటూ కూచున్న కవి, తమ్ము మహానుభావులన్నంత మాత్రాన తిరుపతివేంకట కవులు మాత్రం పొంగిపోతారా?

ఇది గుర్తించుకోలేకపోయారు సూరీడుగారు.

నిజమే, ఆ సన్నివేశం అలాంటిది మరి; కాని "అదేమిటి మళ్లీ" అన్నాడు సుబ్బారాయడు చకితుడై.

"అదెందుకూ యిప్పుడూ?" అనడుగుతూ సూరీరావు గారు, సూరీడుగారి నటు మళ్ళించారు రెక్కపట్టుకుని.

అమాటా యీమాటా చెబుతూ పెద్దబ్బాయిగారు బయలుదేరారు.

వీధిలోకి వచ్చాక వారి సెలవు పుచ్చుకుని నే నింటికి మళ్ళాను.

నన్ననుసరించాడు సుబ్బారాయడు "మీ గురువులనునిందిస్తే గాని అయనకు తృప్తికాలేదు చూశారా?" అనడుగుతూ.

పదిబారల్లో మా యిల్లు తగిలింది.

తిరుపతివేంకట కవుల సంగతే అడుగుతూ పదిపదిహేను నిమిషాలు నుంచున్నాడు మా వీధిలో సుబ్బారాయడు.

అడుగుతూ అడుగుతూనే "మీ రెప్పుడయినా శ్రవణానందం చదివారా?" అనిన్నీ అడిగా డతను.

"చదివా"నన్నా న్నేను.

"ఎలావుంది?"

"ఉంది, వోమోస్తరుగా."

"చాలా అసందర్భాలు కనపడ్డాయి నాకు."

"నాకూను."

"అయితే, గ్రంథం రేపు తీసుకువస్తా, నిద్దరమూ పరిశీలనగా చూతాం."

"సంయే" అంటే "సంయే" అనుకుంటూ మే మిద్దరమూ విడిపోయాం.

## 51

అన్నప్రకారం శ్రవణానందం పట్టుకుచక్కావచ్చా డతను, అన్న క్షణానికి.

నా పుస్తకం పుచ్చుకున్నేను కూచున్నాను.

తనకి తోచిన అసందర్భాలు కనపరుస్తూ అతనే చదవసాగాడు, నన్ను చూస్తూ వుండ మని.

పదిపది హేను పద్యాలయినాయి ఆ పూట.

మధ్యాహ్నం మళ్లీ కూచున్నాం.

"ఒక్క పద్యంలోనూ చిక్కదనం కనపడ దేమిటండీ?" అనడిగా డతను చదివి చదివి.

"పద్యం తరవాత పద్యం చరచరా నడిచిపోతోంది; కాని కాస్త సాహిత్యపరిచయం వున్నవాడికి, ఇందులో, వొక్కమాటు నిలబెట్టే రచనాప్రౌఢీ లేదు, వొక్కమాటు ఆహో అనిపించే భావమూ లేదు."

"కులాసాగా చదువుకోడానికి బాగుందా పోనీ?"

"పాడుకోడానికి కొన్ని పద్యాలు బాగున్నాయి, అక్కడక్కడ **కుంటుతూ** వుండినా."

"మరి చాలామంది మెచ్చుకుంటారే యిది?"

"నేనూ ఆ భ్రాంతితోనే కొన్నాను; కాని నిరాశ చేసుకోవలసి వచ్చింది." 'మనమూ వద్దిక నాదుమాట వినుమా, మర్యాదగా పాడుమా' అన్న మకుటంతో కొన్ని పద్యాలున్నూ యిందులో; కాని 'నాదు మాట యేమిటండీ?' ఏవో శబ్దాలు ఏదో విధంగా బిగించగానే సరాయిసకపూడి వజ్రంలాగ, అతకవద్దూ? పైగా పిష్టపేషణం తప్ప యేంవుందీ అందులో?" అన్నా డతను.

వెంటనే దొడ్డంపేట వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది నాకు.

"పెద్దబ్బాయిగారికి వినిపించా నిది. చప్పరించేశారు వారు" అనిన్నీ చెప్పా డతను.

ధర్మమే.

మనుచరిత్ర వొక్కటే కాదు, వసుచరిత్రా, ఆముక్తమాల్యదా, రాఘవపాండవీయమూ జిహ్వాగ్రాన వున్నవారు పెద్దబ్బాయిగారు.

ఎందరికో పాఠమున్నూ చెప్పివున్నా రవి.

పద్యం చూస్తే "ఏముందీ దీట్లో విశేషం?" అని పరిశీలించడం వారి పద్ధతి.

నారికేళపాకం అయితేనే ప్రీతికాదు వారికి, విజయవిలాసంలో నున్నూ యేమిటేమిటో విశేషాలు చెప్పేవా రాయన, అంత సులభమైన పద్యాల్లో కూడా విరుపులు విరుస్తూనూ, విశ్లేషించి వివరిస్తూనూ.

అప్పటి రసికు లందరిదీ అదే తీరు.

బంధకవి భుజంగరాయడుగారని వొక సంపన్న నియోగి గృహస్థు.

మాకు మూడుమైళ్ళలో వున్న లొల్ల గ్రామానికి కారణం ఆయన.

తటవర్తి వేంకటరాజుగారి వియ్యంకులున్నూ.

ప్రతిపదార్థం నడిచేది కా దాయనకు, భారత భాగవత రామాయణాలు మాత్రం పురాణం చెప్పేవారు మళ్ళీ, పండితులున్నూ వోహో అనేటట్టు.

పద్యంలో యేదో వొక విశేషం లేకపోతే "ఆంధ్రనామ సంగ్రహం పద్యాలకంటే దీల్లో యేమిటి విశేషం?" అనడిగేవా రాయన నిర్మొగమాటంగా.

కవిత్వంచదివి ఆనందించేవారి దందరిదీ ఇదే పద్ధతి ఆ రోజుల్లో.

ఇది యిప్పుడు మోటుపద్ధతి.

నడకే ప్రధానం యిప్పుడు పద్యానికి.

"రీతి రాత్మా కావ్యస్య" అన్న వామనుడి సిద్ధాంతానికే చెలామణీ యిప్పుడు.

పద్యం కడితే కమ్మెచ్చున తీసిన ట్టుండాలిట.

మాకూ అలాగే వుండాలి, మరి.

పద్యం పాడితే లలితమైన నాదం రావాలిట.

మాకూ రావాలి, మరి.

మరి?

తరవాతి మాట?

పద్యం చదివితే ఆలోచించినకొద్దీ చవులూరించే గంభీర భావా లుండవద్దూ?

"కవిత్వం అందరికీ తెలిసేటట్టుండాలి" అని మరో కొత్త నినాదం యిప్పుడు.

అశక్తదుర్జనత్వం యిది.

కవిత్వం, మనిషికి, తనంతట తానే తెలిసిపోవాలా, ప్రయత్నించి మనిషే కవిత్వం తెలుసుకోవాలా?

ప్రతీమనిషి హృదయమూ స్పందిస్తుందా కవిత్వానికి, పోనీ?

ప్రపంచంలో యేభాషలో నయినా వుందా అటువంటి కవిత్వం?

జగత్తులో యేమూలనయినా వుందా అలాంటి జాతి అయినా?

ఇది సృష్టిక్రమానికే ప్రతికూలం.

పూర్తిగా తప్పుడు సిద్ధాంతమున్నూ.

ఎంత గాంభీర్యంవుంటే అంతా ముసద్దీతనం అనిపించుకుంటుంది వ్యవహర్తకు.

నిత్యవ్యవహారసరణిలోనే గాంభీర్యాని కిలాంటి మన్నన వున్నప్పుడు, అతిలోక రమణీయమైన కవిత్వంలో వుండవద్దూ అదీ?

కాక, —

కవిత్వం మాటల్లో లేదు, మాటల కూర్పులో వుంది.

ఆ కూర్పు అవగాహన చేసుకోగలవారికే అనుభూతం అవుతుంది కవిత్వం.

శబ్దార్థపరిజ్ఞానం వేరూ, శబ్దరచనావైచిత్రి అవగాహన చేసుకునే యోగ్యత వేరూను.

కవి ప్రవృత్తిని బట్టి కూర్పు, విశదమూ కావచ్చు, శ్లిష్టమూ కావచ్చు.

ఎంత సరళమైన భావం అయినా శ్లిష్టపదబంధంలో యిమడ్చడం వొక గుణం కాని దోషం కాదు రచనకు.

క్లిష్టత మాత్రమే దోషం.

గర్హ్యమున్నూ.

మల్లెపువ్వులోనుంచి అనుస్యూతంగా వ్యక్తం అవుతుంది సౌరభం.

పద్యంలోనుంచయినా వచనంలోనుంచయినా భావమున్నూ అలాగే ద్యోతకం అవుతూ వుండాలి, నిరవధికంగా

విచారణకున్నూ ఆగాలి అది.

అదీ కవిత్వానికి యోగ్యత.

ఆలోచనామృతం గాని సంగీతంలాగ ఆపాతమధురం కాదు కవిత్వం, మరి.

ఆ ఆలోచనకున్నూ అధికార తారతమ్యం వుంది, మళ్ళీ.

ఈతపండు సులభంగా నోట వేసుకోవచ్చు, పనసతొన సాధించుకోడమే శ్రమ, పండు చేతిలో పెట్టినా.

శ్రమ అంటే కవిత్వం సందర్భంలో కాయికం కాదు, మనోధర్మం.

ఆస్వాదన చతురతకు సంబంధించిన విచారణ వచ్చినప్పుడు, పనసతొనతినేవాడికా ఆదరగౌరవాలు, ఈతపండు తినేవాడికా?

ఇవి రసికుల విశ్వాసా లప్పుడు.

ఇవాళ "రసికు"డంటే తిట్టు అని భావన.

"సరసు"డన్నా వొణికిపోతారు కొంద రిప్పుడు.

మన జాతికిప్పుడు గాఢానుభవాని క్కావలసిన జవసత్వాలు లేకపోడమే యిందు క్కారణం.

తెలుసుకోగలిగితే, సరసతా రసికతా కూడా విశిష్టమైన నాగరకతకు చిహ్నాలు.

అవి సభాపూజ్యాలున్నూ.

మనిషి కవి వుండడమే సభలో ప్రవేశించడాని కర్హత, డబ్బుండడమూ అధికారం వుండడమూ రాజకీయాల్లో తిరుగుతూ వుండడమూ కావు.

ఏమంటే?

అవిన్నీ మనోధర్మాలే.

కళాప్రీతి కాదు వాటిక్కాలబద్ద, కళాపరిజ్ఞానం.

శాకుంతల నాటకం చదివి, గేథే అనే జర్మను సాహిత్యవేత్త కూడా ఆనందతాండవం చేశాట్ట, మరి, ఆ శాకుంతలం రచించిన కాళిదాసే కుమారసంభవంలో అష్టమసర్గా రచించాడు, అతని రసికత నింద్యమేనా?

చెప్పవచ్చిందేమిటంటే?

ఇప్పటి మనవారి చదువు వేరు.

అది లేశమూ జాతీయం కాదు.

రసానుభవపద్ధతి వేరు.

అది యేకొంచెమూ భారతీయం కాదు.

జీవనసరణి వేరు.

దాని క్కావలసినంత మనోదార్ఢ్యం లేదు.

దృక్పథమున్నూ వేరు.

దానికి స్ఫుటమైన ప్రాప్యమే లేదు.

ఎటూ కాని తరం యిది.

పోనీ అంటే యేసంస్కారమూ అస్థిగతం కాని తరం యిది.

చరిత్రకున్నూ యెక్కలేని తరం యిది.

జాతికి అవిచ్ఛిన్నత మాత్రమే సంఘటించే తరం యిది.

వేత్తలయిన సాహిత్యప్రియు లెవరూ కూడా పద్యాలు గదా అని, వీరిలాగ, వదులువదులు రచనలు చదివి ఆనందించలేరు, ఎవరేమన్నా.

వీరానందించగలిగే సారస్వతం శాశ్వతమూ కాలేదు.

## 52

"చదివి చదివి, చెప్పిన్నీ చెప్పి 'నీచులకు గురుత్వంబు వైష్ణవులకు సతంబు' అన్న పద్యం విని మిక్కిలీ అసహ్యించుకున్నారు పెద్దబ్బాయిగా"రంటూ తాను నిరసనభావం కనపరుస్తూ కిందపడేశాడు పుస్తకం, సుబ్బారాయ డావేళ.

ఉలిక్కిపడ్డా న్నేను.

పెద్దబ్బాయిగారు పూర్వాచారపరాయణులు.

తమ తమ్ములు నరసింహాచార్యులుగారికంటే వీరవైష్ణవు లాయన.

ఆయన కామాట కోపకారణం కావడం ఆశ్చర్యం యేమీ లేదు.

కాగా, – కేవలసాహిత్య రసికుడైనవాడు అర్థాంతరన్యాస అని సంతోషించడమా, అసభ్యం అని యేవగించుకోడమా అది?

వైష్ణవులకు శిష్యులైనవారు నీచులనడం యెవరయినా ఆక్షేపించతగ్గదే.

ఏమంటే?

వైష్ణవశిష్యులకు తిరుపతివేంకట కవు లారోపించే యీ నీచత పుట్టుకను పురస్కరించుకునా, మతవిశ్వాసం పురస్కరించునా?

పుట్టుకను బట్టే అయితే, హీనజాతులవారే కాక, రెడ్డి, కమ్మ, వెలమ, కాపు – ఇలాంటి యోధజాతులవారికీ తగులుతుం దీ నింద.

వారే కాదు, బ్రహ్మ క్షత్రియవైశ్యులున్నూ వున్నారు వైష్ణవశిష్యులు – వారికీ తగులుతుం దీ దెబ్బ.

మతవిశ్వాసం పురస్కరించుకునే అయితే, వైష్ణవానికే తగులుతోంది, సూటిగా.

దీనికి వైష్ణవు లేమంటారని కాదు మనం చూడవలసింది, ఇలాంటి కల్పనలు చేస్తేగాని రసస్ఫూర్తి కలిగించడం సాధ్యం కాదా, రసికు లానందించరా?

"శ్రవణానంద కథకు మూలం యేమిటో అది చాలామందికి తెలుసు. అద్వైతి అయిన నాయకుణ్ణి విశిష్టాద్వైతిగా చిత్రించడంలోనే వుంది అసలు, దుస్సాహసం" అన్నారు పెద్దబ్బాయిగారు, పాలాన తారసపడి వొకనాడు.

ఆకులు బొత్తిపెడుతూ వొక మర్రిచెట్టుకింద కూచుని వున్నారు వా రపుడు.

నేనూ మర్రి ఆకులకోసమే వెళ్లా నక్కడికి, యథాపూర్వంగా.

కర్రి వెంకయ్య అనే వొక రెడ్డి చేలో వుందా చెట్టు.

ఆ వూరి బ్రాహ్మల్లో యెవరికి మర్రాకులు కావలసి వచ్చినా ఆ చెట్టే ఆధారం, యే రోజుల్లోనూ కూడా.

బ్రాహ్మలంటే విశిష్టమైన గౌరవాదరా లతనికి.

అక్షరం రాదు; కాని గొప్ప వ్యవహర్త అతను.

ఊరుమ్మడి వ్యవహారాల్లో, చాలాకాలం, సూరీరావు గారికి ఏకైక ప్రతిస్పర్థి అతను.

ఎత్తుపై యెత్తుల్లో సూరీరావుగారు వెంకయ్యను మించితే, వెంకయ్య సూరీరావుగారిని మించేవాడు.

షష్టి ఘడియలూ లౌక్యంలో మునిగి తేలుతూ వుండీ కూడా, ఇట్టే సావధాను డయిపోయేవాడు విద్యల గొడవ వచ్చేటప్పటి కతను.

నిదర్శనా లెన్నో వున్నాయందుకు, దర్భా బైరాగి శాస్త్రిగారు వచ్చారొకమాటు, మా యింటికి.

కూడా వొక శిష్యుడున్నూ వచ్చాడు, మాఘం చదువుతూ.

ఉదయం దంతధావనంకాగానే రెండోసర్గ చింతన చేసుకోసాగా డతను, వీధి అరుగుమీద కూచుని.

సంస్కృతంలో అన్వయించుకుంటూ తెనుగులో భావం చెప్పుకుంటున్నా డతను, సభలో కూచుని పురాణం చెబుతున్నట్టు.

ఎందుకో వీధిలోకి వచ్చాను, అప్పటికే వెంకయ్య కూచుని వున్నాడతని కెడంగా.

నేను పలకరిద్దా మనుకుంటూ వుండగానే మాట్టాడకుండా కూచోమన్నట్టు సన్నచేశా డతను నాకు.

కొద్దిదినాల కిందటే మాఘం మొదటి నాలుగుసర్గలూ స్వయంగా అన్వయించుకుని వున్నా న్నేను, ఆ విద్యార్థి చింతన నాకూ హృదయంగమంగానే వుంది.

మరో రెండుగంటల కాచింతన పూర్తిచేసుకుని స్నానానికి కాలవకి వెళ్లిపోయా డావిద్యార్థి.

అప్పుడన్నాడు వెంకయ్య "కృష్ణుడూ బలరాముడూ, ఉద్ధవుడూ ఆర్గ్యా చేశారు, వినడాని కెంతో బాగుం"దని.

ఎవరు – ఎక్కడ పురాణం చెప్పినా, వూళ్లో వున్నాడా – తెలిసిందా – అతను వచ్చి కూచున్నా డన్నమాటే అక్కడ.

పౌరాణికుడి ధోరణి బాగుందా లేదా అంటే విచారణ యేమీ అవసరం లేదతణ్ణి చూస్తే చాలు.

బాగుందీ, అత్యాసక్తితో వినేవా డతను చెవులోర జేసుకుని.

లేదూ, గోడకి చేరబడి అక్కడే కమ్మగా నిద్రపోయేవాడు, గుర్రుపెడుతూ.

ఏ విద్య అన్నా అతని కిష్టమే, జ్యోతిషం అంటే మాత్రం మరీ యిష్టం.

జాతకాలు చెప్పించుకోడమూ, రాయించుకోడమూ, ప్రశ్నలడగడమూ – ఇవంటే ప్రత్యేక శ్రద్ధ అతనికి.

తన దౌహిత్రుని జాతకం నాచేత రాయించుకున్నా డతను.

దాని క్కారణం వింత అయినది.

ఒకనాడు, సాయంత్రం, జ్యోతిషానికి సంబంధించిందేదో చెబుతున్నారు మా నాయనగారు, మా అన్నదమ్ములం ముగ్గురమూ వింటున్నాం, అరుగుమీద కూచుని.

పరుగుపరుగున చక్కావచ్చా డతను "ప్రశ్న చూడ"మంటూ.

ప్రశ్న చెప్పమంటారే గాని విషయం చెప్పరు కొందరు.

ఫలితం సరిగా చెప్పగలవాడికి విషయం తెలుసుకోవడం యేమంత కష్టంకాదు; గాని, విషయం ముందు చెప్పే ఫలితం చెప్పమనేవా డతను.

"నా భార్య ప్రసవించుబోతోంది. మొగపిల్లవాడు పుడతాడా, ఆడపిల్ల కలుగుతుందా?" ఇదీ అప్పుడతని ప్రశ్న.

కొందరడిగి తెలుసుకుంటారు, అంతే, అతను మాత్రం యే సంతానం కలిగినా వెంటనే పుత్రోత్సవం చేసేవాడు, వూళ్లో వున్న బ్రాహ్మల నందరినీ పిలిచి గుమ్మడిపళ్లో కొబ్బరి బోండాలో సదక్షిణాకంగా యిచ్చి.

లగ్నం కట్టుకుని మేము నలుగురమూ బదులు చెప్పాం, ఎవరికి వారే ఆలోచించుకుని.

మా నాయనగారూ మా అన్నలూ కూతురు పుడుతుందన్నారు, అందుకు భిన్నంగా "కొడుకు పుడతా" డన్నా న్నేను.

పరుగు పరుగున వెళ్ళి యెగిరివచ్చా డతను "మీ చిన్నబ్బాయిగారి మాటే నెగ్గిం"దంటూ.

తరవాత, అతని దౌహిత్రుని జాతకం నేను రాయడాని కిదీ కారణం.

## 53

తక్కిన మన విద్యల్లో దేనిమీదా కూడా లేశమూ లేదు; గాని మనవారిలో కొందరికి, జ్యోతిశ్శాస్త్రంమీద – ముఖ్యంగా జాతకప్రశ్నల భాగలమీద గట్టి నమ్మకమే వుందిప్పుడు.

వారిలో కొందరు, ఒక్క వారఫలాలకోసమే పత్రికలు కొంటారు, అవి తప్పించి వొక్క అక్షరమైనా చదవకపోయినా.

సిద్ధాంతులకున్నూ యిప్పుడీ రెండు భాగలవల్లనే మంచి రాబడి, బాగా ఆలోచించగలవా రయితే.

మా నాయనగారికిన్నీ జీవితయాత్ర సుకరం కావడానికీ విద్యలు చాలా వుపకరించాయి.

ఒక నిదర్శనం చెబుతాను.

మునికొడవలి విడిచి మా నాయనగారు పొలమూరు ప్రవేశించిన కొత్తరికం అది.

పక్కవూళ్ళో వొక డీ–పీ–డబ్ల్యూ కంట్రాక్టరు.

ఒక్కక్షరమైనా చదువురాదు; కాని పక్కా ముస్సద్దీ.

పిట్టంత మనిషి; కాని ప్రభుదర్పం పొంగిపోయేది, మొగాన.

ఎక్కడికి వెళ్లినా గుర్రంమీద వెళ్లేవాడు.

తలుచుకున్నాడా, ఏమయినా చెయ్యగల నిగ్రహానుగ్రహసమర్థుడు.

నమ్మినచోట ప్రాణం అయినా ధారపోసే ప్రకృతి అతనిది.

మా నాయనగారు తరుచు చూస్తూవుండేవా రతణ్ణి, మరికొందరు సంపన్నుల తోపాటు.

ఒకనాడు వెళ్లేటప్పటికి దిగాలుపడిపోయి వున్నా డతను.

పరివేష్టించివుండిన పోష్యవర్గీయులున్నూ కత్తివేస్తే నెత్తురు చుక్క లేకుండా వున్నారు.

"ఏమా?" అనుకుంటూ మా నాయనగారు సమీపించేటప్పటికి "ప్రశ్న చెప్పండి" అంటూ ప్రత్యుత్థానం చేశా డతను.

"కంగారు పడనక్కరలేదు, జయం చేతికి వచ్చింది, పది నిమిషాల్లో వార్త అందుతుంది" అని చెప్పారు మా నాయనగా రాలోచించి.

"ఈ సిద్ధాంతిగారి శక్తి యేమాత్రం?" అనుకుంటూ వుండేవా డంతవరకూ అతను.

"అది యిప్పుడు తెలిసిపోతుం"దనుకున్నా డప్పుడు, అంత నిక్కచ్చిగా చెప్పడం చూసి.

"జయం జయం" అంటూ నిదానం వినిపించింది, ఉరుములాగ, ఇంతలో.

అందరూ సందుమొగకేసి చూశారు.

గుమాస్తా కనపడ్డాడు మేఘాలమీద యెగిరివస్తూ.

ఆలస్యం సహించలేక యెదురువెళ్లాడు కంట్రాక్టరు.

"జయం జయం" అంటూ మళ్ళీ అరిచాడు గుమాస్తా, యజమాని ఆత్రం చూసి.

అందరూ ప్రఫుల్లముఖులయినారు.

గందరగోళం అయిపోయింది, ప్రశ్నోత్తరాలతో కొంతసే పక్కడ.

దిగులు పోయి ఆనందమున్నూ లాస్యంచేసిం దక్కడ.

కంట్రాక్టరు గుమాస్తా చాకచక్యం మెచ్చుకోగా, పరివేష్టించి వుండినవారు కంట్రాక్టరు అదృష్టం మెచ్చుకున్నారు.

"మీ విశేషం యిప్పటిదాకా గుర్తించలేకపోయా" నంటూ మా నాయనగారి పాదాలమీదే వాలిపోయాడు కంట్రాక్టరు.

అస లేమి టంటే?

ఒక పడవలకాలవ లోతు చెయ్యడానికి తవ్వకం కంట్రాక్టు చేశా డతను.

లక్షరూపాయల పని అది, పాతిక వేలది మాత్రమే జరిగింది.

బిల్లు మాత్రం లక్షకూ వెళ్ళింది దఫాదఫాలు.

చాలామట్టుకి చేతికీ వచ్చింది డబ్బు.

కాని పోటీపడి తిరస్కృతు లయినవారు పైకి పిటీషన్లు పెట్టారు "మోసం జరిగింది పరీక్ష చేయించ"మని.

ఖైదు – ఆస్తి జప్తు – ఇలాంటివి తటస్థపడతా యంతపనీ జరిగితే.

ప్రతీఅడుగునా మోసమే జరిగింది తవ్వకంలో మరి.

ఆ చుట్టుపట్ల గ్రామాల్లో చక్రవర్తిగా చెలామణి అవుతున్నా డతను.

డబ్బుపోయినా బాధపడ డతను, పరువు పోతుంది.

తలయెత్తుకు తిరగడానికి వీలుండ దిక.

అందుకే అతని కాదిగులు.

అందుకే గుమాస్తా బయలుదేరివెళ్ళాడు చక్రం అడ్డు వెయ్యడానికి, రెండెడ్ల బండిమీద.

రాత్రి పన్నెండు కొడితే చాలు కాలవకు నీరు విడిచిపెడతారు.

విడిచిపెట్టారా, దేవుడు వచ్చినా మోసం గుర్తించలేడు.

నిజమే; కాని పైనుంచి దొర టెలిగ్రాం కొట్టాడు "కాలవలు తెరవ్వద్దు, మెయిల్లో వస్తున్నా"నని.

అయితే, కంట్రాక్టరు వొక్కడికే కాదు దిగులు, ఇక్కడి ఆఫీసర్లకున్నూ.

"కాలతలు సరిగా వున్నా"యని గట్టిగా సర్టిఫై చేశారు మరి, వారు.

ఆ రోజుల్లో మద్రాసు మెయిలూ, కలకత్తా మెయిలూ కూడా అర్ధరాత్రివేళ వచ్చేవి రాజమండ్రీ.

సామర్లకోట విడిచిపెడితే రాజమండ్రీనే మెయిలాగడం – అంచేత, మధ్య ఎక్కడో దిగి, కాలవగట్టే ధవళేశ్వరం చేరుకోడానికి వీళ్ళు లేవు.

పోనీ అంటే, ఇండియా మొత్తంమీదే లేవు మోటారు కార్లప్పటికి.

ఆఫీసర్లు, రాజమండ్రీ వెళ్ళి, స్వాగతం నివేదించి, ధవళేశ్వరం తీసుకువచ్చి దొరని విడిదిలో ప్రవేశపెట్టారు, ధర్మపత్నీ సమేతంగా.

ఇక్కడివా రందరూ కంగారుపడిపోతున్నట్టే వుండినారు – "ఈ అకస్మికాగమనం యెందుకా?" అన్నట్టు.

తెల్లవారింది.

దొర బయలుదేరాడు, పిటీషన్లు చేతబుచ్చుకుని.

కాని, ఏటి లాకుదగ్గిరికి వెళ్లేటప్పటికి పొంగిపొర్లిపోతోంది కాలవ, నాట్యకత్తెలాగ.

ఆఫీసర్లు కొయ్యయిపోయారు ముందు.

"ఏమిటిది?" అంటూ వురిమాడు దొర, ఇంతలో అగ్గి అయి.

అత నొక్కడే కాదు దొర, యిక్కడివారిలోనూ వున్నారు కొందరు, గవర్నరునిమించి చెలామణీ అవుతూ.

వారూ, వారికిందివారూ కూడా అగ్గీ అయిపోయారు దొరతోపాటు, నీళ్లా కారిపోయారు ఏటిలాకుతో పాటు.

కొంతసేపటి కొక లాస్కర్ని పట్టి తీసుకువచ్చారు "ప్యూన్సు."

వొణికిపోతున్నాడు లాస్కరు.

కాళ్లలో పట్టుతప్పిపోయేటట్టున్నూ వుంది వాడికి.

ఈ దొరలతో కలిసి మళ్ళీ వురిమా డాదొర.

అంతకి ముందే మీదపడిపోయారు "ఇండియనాఫీసర్లు" నీకు బుద్ధి లేదా అంటూ.

బుద్ధి అందరికీ వుంది, వెకిలిప్రశ్న అది.

పశువులకు లేనిదీ, మనుష్యుల కున్నదీ యీ బుద్ధే.

బుద్ధితోపాటివే మనుష్యులకు సిగ్గుబిడియాలున్నూ, విశిష్టాలు.

అన్యోన్యా లివి.

ఒక రాశి యివి.

అభేద్యం కాదిది, భిన్నం అయితే మాత్రం అవ్యవస్థ యేర్పడుతుంది, మానవత్వానికి.
ఎంచేత నంటే –
సిగ్గుబిడియాలు, బుద్ధికి, అతివ్యాప్తీ అవ్యాప్తీ మిథ్యావ్యాప్తీ కలక్కుండా చూస్తాయి.
బుద్ధి, తనకి, కశ్మలం అంటకుండా సిగ్గుబిడియాలు మాటు పెట్టుకుంటుంది.
బుద్ధి, సిగ్గు, బిడియాల యీ సమవాయానికే "శీలం" అని నిర్దేశం.
బుద్ధిమత్వానికి పరమావధి యిది.
మానవత్వానికిన్నీ పరాకాష్ఠ యిది.
కాని, చాలామంది గుర్తించ రిది.
చాలామంది యెరగనే యెరగ రిది.
చాలామంది లెక్కచెయ్యరిది.
అజ్ఞానం దీని క్కారణం.
అహంకారమూ, మమకారమూ దీనికి పోషకాలు.
స్వార్థానికి మూలా లివన్నీ.
అయితే, స్వార్థం సాధించుకోవాలంటే, బుద్ధి, కల్పన మీద కల్పన చెయ్యవలసిందే మళ్లీ.
సిగ్గుబిడియాలకు మాత్రం ప్రసక్తి వుండ దక్కడ.
శీలభ్రంశాని కీ విశ్లేషమే పునాది.
రాక్షసత్వానికిన్నీ యీ సన్నివేశమే ప్రాతిపదిక.
మనిషి అయినవాడికి ఇంతకంటే పతనం లేదు.
మనిషి అయినవాడికి ఇంతకంటే నికృష్టమైన అవస్థ కూడా మరిలేదు.
ఇంచేతనే స్వార్థం అంటే లోకం గర్హించడం.
ఈ స్వార్థం మీదనే వేత్తల క్షైత్రప్రస్థానం.
కనకనే, లోకానికి, వేత్తల ననుసరించవలసిన విధి.
మరి వేత్తృతకు నికషం?
కవిత్వం.
సంప్రదాయం పరిశీలించుకుంటూనూ, ధర్మం నిర్ణయించుకుంటూనూ శాసనం చేస్తాడు కవి.
ఆ శాసనం ఆచరణలో పెట్టవలసినవాడు రాజు.
అర్థతః:– రాజు సమాజానికి భృత్యుడు.
భృత్యుడంటే, జీతనాతాల్లోనూ, అధికార పరిధుల్లోనూ అంతరువులున్నాయే గాని – పైనుంచి కిందిదాకా – అంటే, రాజు మొదలు తలారిదాకా – రాశిలో అంతా వొకటే, రకంలోనే భేదం.
సనాతనమైన మన రాజ్యాంగవ్యవస్థ యిది.
అనేక కారణాలవల్ల ఆ రాశి చెడింది, మనదేశంలో.
ఇప్పటికీ యిదే స్థితి మనది.
చెప్పవచ్చిం దేమి టంటే?

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆఫీసు విడిచివెళ్ళేటప్పుడు, సాయంత్రం "ఈ రాత్రే కాలవలు విడిచిపెట్టడం" అని అందుకు సంబంధించిన గుమాస్తాకు చెప్పి వెళ్లిపోయారు, ఆఫీసర్లు.

కొబ్బరికాయలూ, పసుపూ, కుంకుమా – ఇలాంటి పూజా సామగ్రి అంతా యిచ్చి అడ్డకట్ట కొట్టెయ్యమని ఆ లాస్కర్ని నియోగించా డాగుమాస్తా.

తరవాత వచ్చింది దొర టెలిగ్రాం.

స్టేషనుకు వెళ్ళాలని అందరికీ వర్తమానించడం తొందరలో, ఈ సంగతి ఆ గుమాస్తాకు తెలియజెయ్యడం మరచిపోయా రాఆఫీసర్లు.

"ఏర్పాటంతా చేసేశాం" అన్న తృప్తితో చల్లగా పడుకున్నా డాగుమాస్తా.

"తెల్లవారితే మాట పడవలసివస్తుం" దన్న భయంతో, పన్నెండు కొట్టడం తడువుగా గంగమ్మతల్లికి పూజచేసి, ఆరగింపున్నూ కానిచ్చి అడ్డకట్ట కొట్టేశాడా లాస్కరు.

నెలరోజుల నిరోధం తొలగిపోగా, పంచకళ్యాణి అయి కాలవల్లో స్వారిచేసింది గంగమ్మతల్లి.

ఇలా చెప్పి "సారీ" అన్నారిక్కడి దొరలు.

"ఎక్స్క్యూజ్" చెప్పుకున్నారు కిందివారు, వంగిదండాలు పెట్టి.

సలాములు చెప్పి, వెనక్కి తిరిగి కళ్లు చికిలించుకుంటూ పక్కకి వెళ్ళిపోయాడా లాస్కరు.

అప్రబద్ధంగా వచ్చి దొంగతనం పట్టుకుందా మనుకున్న దొర, విభ్రాంతుడయిపోయాడీ సంజాయిషీతో.

వెంటనే లూ యెక్కేశాడు తూర్పుగా తిరిగి.

గుమాస్తా ః జయవార్త యిది.

ఈ సన్నివేశం జరిగింది మొదలు తాను బతికివుండినంతకాలమూ మా నాయనగారిని దేవు డన్నట్టు చూసుకున్నా డాకంట్రాక్టరు.

## 54

ఆచార్యప్రాచార్యు* లేకకాలాన తారసపడితే, ముందు ప్రాచార్యుణ్ణే సేవించుకోవాలి, శిష్యుడు.

ఆపస్తంబ మహర్షి నిబంధించిన ధర్మసూత్రం యిది.

దీన్నిబట్టి మా నాయనగారి సంగతి చెప్పడానికి ముందు, వారి కాచార్యులైన పిడపర్తి పెద్ద దక్షిణామూర్తి శాస్త్రిగారి సంగతే చెప్పాలి, నిజానికి; కాని వొక విషయం ప్రతిపాదించేటప్పుడు, దాని కుపబలకా లైనవి చెప్పడంలో మహితోత్తరంగా చెప్పడం కూడా వొక మంచి పద్ధతే.

పెద్దవే ముందు చెప్పేస్తే, తరవాత చిన్నవి చెప్పడాని కవకాశమూ, అగత్యమూ వుండకపోవచ్చు.

---

* ప్రాచార్యుడు = గురువుకి గురువు. "ప్రపితామహుడు" వంటి శబ్దం యిది. దీనికి ప్రతిశబ్దం "ప్రశిష్యుడు."

"పోనీ, విషయ నిర్ధారణమే గదా కావలసింది, వొక్క పెద్దది మాత్రమే చెప్పి వూరుకుంటే యేమీ?" అంటే వొప్పుకుంటాను.

అయితే, వైవిధ్యం మరీ బలకరం మరి.

చిన్నవి చిన్నవిగానే వుంటాయి స్వరూపంలో, కాని వాటిలో కూడా మహోజ్వలా లుంటాయి, పెద్దవాటిని పోలేవే.

అవి విడిచిపెట్టడం వివేకం కాదు.

ఇంతకీ:–

పెద్ద దక్షిణామూర్తిశాస్త్రిగారి శిష్యులు గదా మా నాయనగారు?

అయినప్పుడు "మరి, వారి విద్వత్తు యెంతటిదో?" అన్న ఆకాంక్ష పుట్టనే పుడుతుం దిది విన్న యెవరి కయినా.

ఈ వుత్కంఠ వారి గొప్పతనం బాగా అవగాహన కావడానికి సహాయకారిన్నీ అవుతుంది, చాలామట్టుకి.

నా యీ ప్రయత్నంలో యీ విశేషం సాధించడమున్నూ వుద్దిష్టమే.

ఏమంటే?

బూరాడపేట అగ్రహారీకులు వారు.

పిడపర్తి శివరామశాస్త్రిగారికి విజయనగరం పూసపాటి ప్రభువు లిచ్చిందా అగ్రహారం.

ఆ వంశంలోవారే పెద్దదక్షిణామూర్తి శాస్త్రిగారు.

వారే మా నాయనగారి గురుదేవులు, జ్యోతిర్విజ్ఞానంలో.

ఇరవై – యిరవై రెండేళ్లు నిండేటప్పటికే మా నాయనగారు దైవజ్ఞబిరుదాంచితులు.

వారికి, వేదశ్రౌతాలూ, స్మార్తమూ పూర్తయినా యిప్పటికి.

పాదుకాంతదీక్షాస్వీకారమూ అయింది, మంత్రశాస్త్రంలో.

జ్యోతిశ్శాస్త్రోపదేశమున్నూ అయింది.

నేర్చిన అన్ని విద్యల్లోనూ స్వతంత్రులే అయినారు; కాని పంచాంగరచనలో మాత్రం వెనకబడిపోయారు.

శాస్త్రం బాగా తెలుసు, గణితమే నలగలేదు.

కారణం తగినంత అధ్యాపనం లేకపోడం.

అది సొంతంగా సాధించుకోతగ్గదిన్నీ కాకపోడం.

మా తాతగారికి, అటు, అరుణోదయం అయింది మొదలు, ఇటు భోజనాల వేళదాకా జపం.

భోజనానంతరం కొద్దిపాటి నిద్ర.

నిద్ర కాగానే ఉద్గ్రంథాలకు ప్రతులు రాసుకుంటూ కూచోడం.

ఊళ్ళవూళ్లనుంచీ వచ్చేవారు ఆస్తికులు, వారి కందరికీ ధర్మసందేహాలు తీర్చడమున్నూ వారి దినచర్యలో చేరిందే.

"అలా కూచునే పంచాంగం చెయ్యం" డనేవారు మా నాయనగారినీ మా పెత్తండ్రిగారినీ వారు.

మా పెత్తండ్రిగారికీ అయినా యీ విద్యలన్నీ అప్పటికి; కాని వొక్కటే స్వాధీనం కాలే దప్పటికీ.

ఎక్కడి కక్కడే మరుపూ, యెక్కడి కక్కడే తప్పడమున్నూ.

ఎప్పుడూ పుస్తకాపేక్షే

అయినా, కణికలు పుచ్చుకుని ఉత్సాహంగానే కూచునేవా రిద్దరూ బల్లదగ్గిర.

గణితమూ చేసేవారు తదేకదీక్షతో.

కాని తప్పులు వచ్చేవి తప్పనిసరిగా.

అంటే, దారి తప్పి చెయ్యి స్తంభించిపోయేది.

ఆ స్థితి వివరించి "యేమి చెయ్యా లిక్కడ?" అనడిగితే, "మళ్ళీ మొదణ్ణుంచీ చెయ్యం" డనేవారు మా తాతగారు.

తమ కేమో పూర్తిగా స్వాధీనమే అది.

కాని, గణితం చెయ్యడానికి బద్ధకం.

"చేసి చూపించాలా యీ మాత్రాని" కన్న వుపేక్ష వొకటి.

అన్నిటికీ పైని, రాత ఆగిపోతుందన్న బెంగాను.

మరి కొడుకులకు విద్య?

ఈ దృష్టి లేకపోయింది వారికి.

"కోశవా నాచార్యః"

పుస్తకసంపత్తి పుష్కలంగా వున్నవాడే పండితుడు.

"కనక, అబ్బాయిల కీపుస్తకాలగత్యం అవుతా" యన్న చూపే గాని "ఇది చేతనయితే గదా?" అన్న వూహా లేకపోయింది, వారికి.

కాగా, – విసుగెత్తిపోయింది మా నాయనగారికి.

"ఇంటో వుంటే యీ విద్య స్వాధీనం కాదు మనకి" అన్న నిశ్చయం కలిగింది చివరికి.

పోనీ "శ్రద్ధగా చెప్పం" డనడానికా గడగడ.

కనక "బూరాడపేట వెళ్లవలసిందే" అని స్థిరపరుచుకున్నారు మా నాయనగారు.

విద్వత్తుకు తోడు బంధుత్వమున్నూ అక్కడ.

బూరాడపేటలో మాకు యెనిమిది యకరాల భూమి వుండడమున్నూ దీనికి బలకరం అయింది.

నిరతాన్నదాతలు వారు.

పంక్తిభేదం యెరగనివా రాయింటి యిల్లాళ్ళు.

విశేషించి, ఓనమాల తరగతి విద్యార్థులయి కాక, కొన్ని విద్యల్లో ఉత్తీర్ణులయి వుండడం వొక విశిష్టత తమకు.

దానాదీనా, ఆ విద్వన్మండలిలో ఆదరాభిమానాలున్నూ యేర్పడతాయి తమకు విద్యలతోబాటు.

కాని, యిది తెలిసిందా, తండ్రిగా రిల్లు కదలనివ్వరు.

కొడుకులను విడిచివుండలేకపోవడం అందుక్కారణం.

ఆ నిశ్చయం గుప్తంగానే వుండిపోవలసివచ్చిం దీకారణంవల్ల.

బలపడీపోయిం దాగుప్తస్థితి వల్ల.

నిద్రాహారాలు వెగటయిపోయాయి క్రమంగా.

ఇల్లు ఎప్పు డెలా విడిచిపెట్టాలో, ఏదారి నేవ్పూరిమీదుగా ప్రయాణం సాగించాలో, ఎక్క డెక్కడ మకాములు వెయ్యాలో, ఎన్నాళ్ళకి బూరాడపేట చేరుకోడమో, అక్కడ యెలా ప్రవేశించడమో - ఈ ప్లానంతా తయారయిపోయింది, నిశ్చితంగా.

ఒకనాడు మా పెత్తండ్రిగారితో చెప్పారు మా నాయనగా రిదంతా.

స్వయంగా తోచలేదుగాని, మా పెత్తండ్రిగారికీ వుందీతపన.

దీనికి సాయం అటూ యిటూ కూడా మా నాయనగారి మార్గదర్శకత్వం.

"సరే" అనేశారు వారున్నూ.

అంతే.

"ఏమయిపోయారు మనవాళ్ళు?" అంటూ మా తాతగారిక్కడ బెంగటిల్లిపోయారు; కాని వారంరోజులు తిరిగేటప్పటికి పెద్దదక్షిణామూర్తి శాస్త్రిగారి దగ్గిరనుంచి వుత్తరం "మామా, కంగారుపడకండి, మీ కుమా ళ్ళిక్కడ క్షేమంగా వున్నారు. పంచాంగ రచనలో స్వతంత్రులయి వచ్చి మిమ్ము సేవించుకుంటారు త్వరలోనే" అని.

మొత్తం రెండు సంవత్సరాలుండివారు మా నాయనగా రక్కడ.

స్వతంత్రులూ అయినారు.

ఇక మా పెత్తండ్రిగారా?

గ్రంథాలు వల్లించారు.

గణితాలు చేశారు.

కాని, డిటో ప్రకారమే.

ఒక్కక్షర మైనా చెప్పనక్కరలే దెవరూ, కూడా మాత్రం తీసుకువెళ్లాలి బల్లదగ్గిర వుండి - అంతే.

## 55

మా నాయనగారూ, మా పెదనాయనగారూ యిదిగో, యిందుకోసం అక్కడ వుండినప్పుడు, అగ్రహారానికీ సంస్థానానికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది.

అగ్రహారం యిచ్చారే గాని సిద్ధాంతులను సరిగా ఆదరించలేకపోయారు, సంస్థానాధీశుల్లో తరవాత్తరంవారు.

వైమనస్యాలు బలిసిపోయాయి.

నిర్లక్ష్యభావాలున్నూ ముదిరాయి, అటూ యిటూ.

వెనకటివారు అంతటితో నిలిచిపోగా, అప్పటిరాజు అగ్రహారంమీద పన్నువిధించాడు, మరో అడుగు ముందుకివెళ్ళి,

సిద్ధాంతు లందు కంగీకరించలేదు.

"ఇది సర్వాగ్రహారం. పన్ను కట్టడానికి మీ కధికారం లే" దంటూ గట్టిగా ప్రతిఘటించారు వారు.

వ్యవహారం కోర్టు కెక్కింది.

విచారణా జరిగింది విశాఖపట్నం జిల్లాకోర్టులో.

జడ్జీ యెటు మొగ్గుతాడో యెవరికీ తెలియదు.

"సిద్ధాంతిగారిని నెగ్గించా" లని నిశ్చయించుకున్నారు వకీళ్లు.

మహారాజు వకీళ్లూ వున్నా రాపూనుకున్నవారిలో, ప్రచ్ఛన్నంగా.

దివాన్జీ చేసిన కుట్ర తప్ప మహారాజు వాదంలో ధర్మం లేదు, మరి.

ఇటు పెద్దదక్షిణామూర్తిశాస్త్రిగారి తేజస్సున్నూ అటువంటిది, మరి.

కాగా, వొక నాటకం ఆడెయ్యా లనుకున్నారు వారు.

కాక:—

మన విద్యల విలవ బాగా తెలిసినవా రప్పటి లౌక్యులు.

మన విద్వాంసుల యెడల మహానుభావులన్న ఆదర గౌరవ భావాలున్నవారు అప్పటి మన యింగ్లీషు విద్యాధికులున్ను.

ఎంచేతనంటే?

వైదికులయినా నియోగులయినా ఆ లౌక్యుల తండ్రులూ, ఆ యింగ్లీషు విద్యాధికుల తండ్రులూ మన విద్యలు నేర్చినవారూ — కనీసం — సంప్రదాయపరులున్నూ.

బ్రాహ్మణ "ఇతరు"లున్నూ స్వధర్మ పరిజ్ఞాతలూ, స్వధర్మపరులున్నూ అప్పుడు.

వార్షికాలూ, వృత్తులూ, యీనాములూ, చివరి కగ్రహారాలూ యిచ్చి మన విద్యలనూ విద్వాంసులనూ పోషించిన వారందరూ బ్రాహ్మణ "ఇతరు"లే ప్రాయకంగా అప్పుడు, చరిత్ర చూసుకుంటే.

మన అప్పటి ప్రభువులు విద్యలను వ్యాపింపజేశారు; గాని అమ్ముకోలేదు మరి.

వారున్నూ వారే తమ బిడ్డల నింగ్లీషులో ప్రవేశపెట్టినవా రప్పుడు.

ఉద్యోగాలకోసమే వారా పనిచేశారు; గాని మన ధర్మం విడిచిపెట్టుకోడానికీ, ఇంగ్లీషువిద్యలే విద్యలనీ కాదు.

వారి కాభిజాత్యం యెక్కువ.

తరతరాలుగా — యుగయుగాలుగా తమకు వెలుగుతోపిస్తున్న మన విద్యలను కాదనడానికి వారి "అంతరాత్మలు" కలుషితాలు కాలేదు.

"నాకు ఒక విశిష్టధర్మం లేకపోతేగా?" అనుకున్నవారు, వారు.

"ఇంగ్లీషువారిలో మాత్రం మతవిద్యలు నేర్చిన స్వధర్మపరులకు సంఘంలో ప్రత్యేకత లేదూ మరీ?" అన్న వివేకం వుండినవారు వారు.

అప్పటి కలాగ ఆత్మగౌరవం వుండిన అలాంటి సంఘంలో మెలుగుతూ వుండినవారు కావడంవల్ల ఆ యింగ్లీషులో ప్రవేశించినవారున్నూ మన విద్యలకూ, మన సంప్రదాయాలకూ, మన ధర్మానికీ దూరం కాలేదు.

పాఠశాలల్లో యింగ్లీషు విద్యలూ నేర్చుకున్నారు, ఇళ్లల్లో వర్ణాశ్రమాచారధర్మాలూ పాటించుకున్నారు, లక్షణంగా వారు.

ఆ "యింగ్లీషువారి" కొడుకులూ నయమే కొంత.

కొంచెం బద్ధకం వంటిది ప్రారంభం అయినా, మన ధర్మాలు వింటూ, మన సంప్రదాయం చూస్తూ మన ఆచారాలు విడిచిపెట్టనివారే వారు.

ఆ కొడుకుల కొడుకులూ మనమలూనూ ఇప్పటివారు.

వారిని చూసి అదే నాగరకత అనుకుని గుడ్డిగా దానికి దాసులయినవారున్నూ యిప్పటివారు.

సంప్రదాయం విచ్ఛిన్న మయిపోయింది, వీరు బయలుదేరాటప్పటికి.

మన విద్యలూ, మన ధర్మాలూ అజ్ఞానవిలసితాలయి పోయాయి వీరికి.

పోనీ అంటే, ఆ యింగ్లీషు విద్యలంటాయే గాని ఆ సంస్కారం అబ్బలేదు, నికరమైనది వీరికి.

ఆ యింగ్లీషు సంప్రదాయమున్నూ అంటలేదు, జాతీయమైనది.

అంట లేదంటే అసాధ్యం అయికాదు, ఎబ్బెట్టయి.

ఆ యింగ్లీషు చదువులను తా మనుకరింపగలిగారే గాని, తమ స్త్రీలను ఆ యింగ్లీషుస్త్రీల ననుకరింపచెయ్యలేకపోయారు వీరు మరి.

మాట్లాడితే అరిస్టాటిలూ, సోక్రటీసూ, డార్వినూ – ఇత్యాదులు స్ఫురిస్తారు వీరికి.

పోనీ, వారి మాటమీద నడుస్తారా?

అది చేతకాదు మళ్ళీ.

ఏమంటే?

మన దర్శనాలంటే అసంతృప్తీ, క్రిష్టియన్ దర్శనం అంటే అపనమ్మకమూనూ వీరికి.

"ఇతోభ్రష్ట స్తతో భ్రష్టః"

ఇది పనికిరాదు – అది పనిచెయ్యదు.

జ్ఞానం – సంస్కారం – దృక్పథం – సాధన – ప్రాప్యం అన్నీ తమతోనే ప్రారంభం వీరికి.

పోనీ అంటే, అవి శుద్ధసంకీర్ణాలు.

ఆటవికులకున్నూ నికృష్ట మైనదో మహోజ్జ్వల మైనదో వొక గతచరిత్ర వుంది, వీరి కాపేరింటిదే లేదు, లేశమూ.

దయనీయమైన స్థితి వీరిది.

వింతెందుకూ?

ఇంగ్లీషువారు మన యూనివర్సిటీల్లో, తమచేతికింద గుమాస్తాగిరీ నిర్వహించ గలవారు తయారుకావడానికి చాలిన విద్యాప్రమాణం మాత్రమే ప్రవేశపెట్టగా, అదే సర్వమూ అనుకున్న వీరి భవితవ్యం మరో విధంగా యెందుకుంటుందీ?

వెనకటి మన "యింగ్లీషు" వా రిలాంటి త్రిశంకువులు కారు.

కనకనే మన విద్యలంటే వారి కలాంటి ప్రమాణబుద్ధి.

మన విద్వాంసు లంటేనూ అలాంటి ఆదరగౌరవాలు.

అంచేతనే పెద్ద దక్షిణమూర్తి శాస్త్రిగారియెడల అంత విధేయులు వారు.

ఆ కారణంవల్లనే వారలా స్థిరపరుచుకున్నారు.

ఇంతలో జడ్జీ వచ్చాడు.

వా రందరూ లేచినుంచున్నారు.

జడ్జీ గద్దెయెక్కాడు.

బిలబిల్లాడుతూ వారు కూచున్నారు.

కూచున్నారు; గాని మళ్ళీ లేచినుంచున్నారు, వెంటనే.

దక్షిణామూర్తి శాస్త్రిగారు హాల్లో ప్రవేశించారు, మరి.

చూడగా, బ్రహ్మవర్చస్సు మూర్తీభవించిన ట్టున్నారు వారు.

అది చూసి చకితుడైనాడు; కాని "యేం లేచారూ?" అనడిగాడు వకీళ్ళను జడ్జీ.

"అరుగో, వారు దయచేశారు. దైవజ్ఞులు వారు. దైవం తరవాత మాకంతటివారున్నూ. అలాంటివారికి ప్రత్యుత్థానం చెయ్యడం అనివార్యం మాకు" అని బదులుచెప్పారు వకీళ్లు, తమ నాయకుని పరంగా.

"అలాగా?" అన్నాడు జడ్జీ, జిజ్ఞాసతో.

యూరపియను అతను.

తా నిది అర్థంచేసుకోలేడు; గాని మనస్సు గుబగుబలాడిపోయింది, తానూ లేచేశా డనుకోకుండా.

"వారి విశిష్టత యేమిటీ?" అనిన్నీ అడిగాడు, లేస్తూనే.

"సర్వజ్ఞులు వారు. ధర్మనిరతులున్ను. జ్యోతిశ్శాస్త్రం వారికి కరతలామలకం. వారు పంచాగం చేస్తారు, దృక్సిద్ధంగా వుంటుం దది. జాతకాలు రాస్తారు, వాక్కక్షరమున్నూ బీరుపోదు. ప్రశ్నలున్నూ చెబుతారు, వారిమాట జరిగితీరుతుం" దన్నారు వకీళ్లు.

జడ్జీ బుద్ధి చమత్కృతం అయింది, దీంతో.

"ఒక్క ప్రశ్న అడగవచ్చునా?" అనడిగా డతను.

"అడగ" మన్నారు వకీళ్లు, శాస్త్రిగారి యింగితం కనిపెట్టి.

"నేను కోర్టుకి బయలుదేరేటప్పుడు మా ఆవు ఈనడానికి సిద్ధంగా వుంది. అది పెయ్యను పెట్టిందా, కోడెను పెట్టిందా? ఇది చెప్పమనండి."

వారి సంస్కృతి అలాంటిది.

ప్రత్యక్షమే వారికి ప్రమాణం, మరి.

"యద్దృశ్యం తన్నశ్యం" అంటే నమ్మరు వారు.

"కాగితం మీద రాసియిస్తాను. పైకి చెప్ప"న్నారు శాస్త్రిగారు.

లగ్నం కట్టుకుని ఆలోచించి రాసిన్నీ యిచ్చారు.

అది టేబులుమీద పెట్టుకుని నౌకర్నింటికి పంపాడు దొర.

శాస్త్రిగారి ముఖం మిక్కిలీ గంభీరంగా భాసిస్తోంది; కాని "మనం యేమయిపో తామో?" అంటూ ఆందోళనపడసాగారు, వకీళ్లు.

అటు నౌకరు వచ్చాడింతలో, యిటు దొర కాగితం తీశాడు చురుగ్గా.

బెంచిక్లార్కు అనువదించాడు.

"సెబాస్, సరిపోయింది" అన్నాడు దొర.

అన్నాడు కాని, వొక సందేహం పుట్టుకువచ్చిం దతనికి – "మన మిటు నౌకర్ని పంపగానే, వకీళ్లున్నూ అటు తమ నౌకర్ని పంపివుండగూడదూ మన యింటికీ?" అని.

సిద్ధాంతాలు ఎంత మంచివయినా అవి ప్రత్యక్షప్రమాణంతో రుజువయితే గాని ముందుకు వెళ్ళరు వారు.

వారి భౌతిక విజయాల కిదే కీలకం.

చూసిచూసి "యింకొక టడగవచ్చునా?" అనడిగా డతను.

వకీళ్ళకి నిశ్చింత.

"వో, అడగవచ్చు" నన్నారు వారు.

"ఈ హాలుకి నాలుగు ద్వారాలున్నాయి, కోర్టుపని ముగించుకుని బయటికి వెళ్ళేటప్పుడు నేనే ద్వారంనుంచి వెడతానూ? ఇది రాయమనం" డన్నాడు దొర.

శాస్త్రిగారు రాసి వకీళ్ళ కిచ్చారు.

ఒక కవరులో వుంచి అతికించి అది దొర కందించారు వకీళ్ళు, ధీమాగా.

దొర జేబులో పెట్టుకున్నా డది.

వ్యవహారం ప్రారంభం అయింది.

అయిదింటికి పూర్తి అయింది.

అందరూ లేచారు.

వెనక ద్వారాన తన ఛాంబర్సులోకి వెళ్ళిపోవలసిన దొర అందరి మధ్యకీ వచ్చాడు, హాల్లోకి.

విషమసమస్య ప్రారంభ మయినట్టయింది, దాంతో.

నీరవు లయిపోయారు వకీళ్లు; కాని దొర మాత్రం సావధానుడయినాడు, చురుగ్గా చూస్తూ.

పంక్చ్యుయాలిటీ దెబ్బతింటుంది, లేకపోతే మరి.

దానికోసం నిద్రాహారా లయినా మానుకుంటారు, పాశ్చాత్యులు.

"వోస్, క్షణంలో మునిగిపోతుంది కామోసు" ననుకుంటాం మనం.

అసలు, ప్రపంచమే క్షణికం, అమాటకి వస్తే.

ఉందనుకుంటే వుంది, సమస్తమూ.

లేదనుకుంటే, ఏమిన్నీ లేదు.

అయితే, ఈ "అస్తినాస్తి విచికిత్స" అంత సులభంగా తేలేది కాదు; కాని వొక సూక్ష్మధర్మం ప్రతిపాదించారు మనవాళ్ళు – "నాకు ముసలితనం రాదు, చావున్నా లేదు – అనుకుంటూ చదువూ డబ్బూ సంపాదించు. జుట్టుపట్టుకుని మృత్యువు లాక్కుపోతోంది అనుకుంటూ ధర్మం చెయ్యి" అని.

"మరి ముసలితనమూ – రాక, చావూ లేనప్పుడు, చదువుకోసమూ, డబ్బు కోసమూ అంత తొందరపడ్డం యెందుకూ?" అంటే, చదువుకి అంతం లేదుకనకా, డబ్బుకిన్నీ ఇయత్త లేకపోయినా, జీవితప్రారంభం నుంచీ ఇటు దానధర్మాలు చేస్తూ అటు భోగాలున్నూ అనుభవించాలి కనకాను.

ఇది నెరవేరా లంటే, ఏక్షణంలో చెయ్యవలసిం దాక్షణంలో చెయ్యాలి, ముందువెనక ల్లేకుండా.

అదే పంక్చ్యుయాలిటీ.

ఆలోచనకు ప్రేరకం అది.

సద్యస్స్ఫూర్తికిన్నీ దోహదం అది.

చిన్నప్పట్నుంచీ అలవాటయివుంటుంది పాశ్చాత్త్యుల కిది.

కాగా – "ఏగుమ్మాన వెడతాడో?" అనుకుంటూ ఆత్రంగా వున్నారు వకీళ్ళందరూ; కాని వుడతలాగ వొక కిటికీలోనుంచి బయటికి దూకేశాడు దొర "రండి" అని వకీళ్ళను పిలుస్తూ.

అందరూ తెల్లపోయారు.

వెంటనే కవరు తీశాడు జేబులోనుంచి దొర.

కవరులోనుంచి కాగితమూ తీశాడు, అవ్యవధానంగా.

ఆ కాగితం అతనిచేతిలో వుండగానే చదివేశాడు బెంచిక్లార్కు.

"వొక కృత్రిమద్వారంలోనుంచి బయటి కురుకుతావు" అని.

తుళ్ళిపడ్డాడు దొర.

ఎగిరిపడ్డారు వకీళ్లు.

## 56

చెప్పవచ్చిం దేమి టంటే?

దగ్గిర వుండి, వొక రెడ్డియువకుణ్ణి చెట్టెక్కించి మర్రాకులు కోయిస్తున్నాడు సుబ్బారాయ డావేళ, కిందపడ్డవన్నీ పెద్దబ్బాయిగారి దగ్గిరికి చేరుస్తూ.

సుబ్బారాయడే తెచ్చాడు శ్రవణానందం ప్రసక్తి, అప్పుడు.

చాలాదూరమూ తీసుకువెళ్ళా డది, ఆ పట్టుపట్టు.

వినివిని "అసందర్భాలే కాదు, అన్వయదోషాలూ, రసభంగాలూ, అపార్థాలూ, పడికట్టురాళ్ళూ, ప్రక్రమభంగాలూ – ఇలాంటివన్నీ చాలా వున్నా యందులో" అన్నారు పెద్దబ్బాయిగారు.

చకితుణ్ణయిపోయా న్నేనది విని.

అలాంటి శీర్షికలు నిర్ధారణ చేసుకునే యెన్నో దోషాలు గుర్తుపెట్టుకునివున్నా న్నేనప్పటికి, యెర్రపెన్సిలుతో.

ఇది విని "కనక, శ్రవణానందం విమర్శించాలి మీ" రంటూ కూచున్నాడు సుబ్బారాయడు.

చిన్నప్పుడు దొడ్డంపేటలోనే కలిగివుండింది, నాకీ వుద్దేశం, మరిచిపోలేదు.

పిఠాపురంలో సాహిత్య సాధన చెయ్యడంలో యెంతో కొంత యోగ్యతా అబ్బివుంది, నా కప్పటికి.

కాని "శ్రమా, కాలహరణమూ, డబ్బు దండుగూ తప్ప దానివల్ల మరి ప్రయోజనం వుండ" దన్నారు పెద్దబ్బాయిగారు.

"భాషాపరంగా నయినా, సాహిత్యదృష్ట్యా అయినా ప్రామాణికత్వం యేర్పడివుందా దాని కసలు?" అనడిగారు ముందు, వారు.

"నలుగురూ చదువుతున్నా రని మీరు భ్రాంతిపడకండి. అచ్చుపడి బయటికి రావడమే తడువుగా జనసామాన్యంలోకి చొచ్చుకుపోయిన గ్రంథానికి వ్రాతమూ వుండదు, అంతస్థూ యేర్పడదు. పద్యాలు సులభంగా వుండడమూ తమాషాగా వుండడమూ కాదు రసికుల కాకర్షకం. రసభావాలకు సంబంధించిన విశిష్టత కర్ణతాడితం అయితేనే వా రేగ్రంథం కోసమైనా అర్రులు చాపుతారు. కనక, గుణప్రచురమైనది విమర్శించాలి గాని మీవంటివా రిలాంటిది కాదు" అనిన్నీ చెప్పారు వారు, దృఢంగా.

నా నమ్మకమూ యింతే, యివాళ.

కాని వారి హితోపదేశం నా చెవికెక్కలేే దాపాలపాంగులో.

పైగా, ఆవేళ, నేదునూరి శంకరంగారు చేసిన లౌక్యం జ్ఞాపకం వచ్చింది నా కప్పుడు.

దాని కెప్పణ్ణుంచో ప్రతిక్రియ చెయ్యాలని వుంది నాకు.

సుబ్బారాయడి ప్రోత్సాహం అందుకున్నూ త్వరపెట్టింది నన్ను.

దాంతో, ఆ రాత్రే ప్రణాళిక చేసుకున్నాను.

ఆ కవులే రచించిన పాణిగృహీత జ్ఞాపకంవచ్చింది నా కాసందర్భంలో.

కానయితే, శ్రవణానందాని కున్న పేరు లేదు దానికి.

కవులున్నూ అంతంతగానే శ్రద్ధపట్టారు దాని రచనలో.

ఇక కథా, మరీ నీరసం అది.

తిరుపతి వేంకట కవులకు శ్రవణానందం వల్ల వచ్చిన కీర్తిలో, పాణిగృహీత వల్ల యెంతో కొంత తగ్గిపోయింది గాని హెచ్చలేదు.

నిజంగా, తమ పేరుతో రావలసిన గ్రంథమే కాకపోయినా వారు సగర్వంగా ప్రకటించుకున్నా రది.

కనక "అది విమర్శించతగ్గ దయితే యిది విడిచిపెట్ట తగ్గదా?" అనిపించింది నాకు.

అదిన్నీ చదివాను శ్రవణానందం విమర్శ అపుచేసి రెండుమాట్లు, శ్రద్ధగా.

తరవాత రెండు మాసాలు నిద్రాహారాలు మరిచిపోయాను.

గ్రంథం తయారయింది.

చిత్తులో "పాణిగృహీత – శ్రవణానందము" అని వున్న పేరు "పాణిగృహీతాశ్రవణానంద శృంఖల" అయిపోయింది, సాపులో.

అచ్చున్నూ పడిపోయిం దది, అవ్యవధానంగా.

## 57

పాణిగృహీతాశ్రవణానంద శృంఖల రచించినందుకూ, సాహసించి ప్రకటించినందుకూ – అనుబంధానికి భంగం రానివిధంగా, చాలా కోప్పడ్డారు వేంకటరామశాస్త్రిగారు, నామీద.

"రాతప్రతి మాకెందుకు చూపించలేదూ?" అంటూ నిక్కచ్చిచేశారు రామకృష్ణశాస్త్రిగారు.

"దీంతో, మీరున్నూ యీ అగ్గిలో వురికినట్టయింది. మా ప్రేరణ లేకపోడం వొకటే యిందులో వున్న విశేషం. అయినా, మీరు చేసివుండవలసింది కాదు; కాని కీడొక్కటే కాదులెండి మేలూ వుంది దీనివల్ల కావలసినంత" అని కూడా అన్నారు వారు.

"మీ రచనలో కొన్ని పొరపాట్లున్నాయి మరి" అనీ అన్నారు, నిర్గమాటంగా.

కాకపోయినా, నా విమర్శ ఖండిస్తారు వేంకటశాస్త్రిగారు, తప్పనిసరిగా.

ఏది యేమయినా యిది నేదునూరి శంకరరంగారికిన్నీ కళ్ళ బడాలి.

ఒక ప్రతి అకొండి కామరాజుగారి కివ్వడమే అందు కుపాయం.

సరిగా గురువులు శృంఖల పరిశీలిస్తున్నప్పుడే కామరాజు గారు వచ్చారు, పిలిచినట్టుగా.

"శంకరంగారి కిది ప్రతిక్రియ" అనిన్నీ అన్నారు, నే ననుకున్నట్టే.

వెంటనే వారికో ప్రతి యిచ్చా న్నేను.

"ఈ వివాద సందర్భంగా అనేకాలు తామే రాసి వేంకట శాస్త్రిగారు తమ శిష్యుల పేరు పెట్టడం మనకందరికీ తెలుసు. అలాకాక – మీ పక్షంగా – మీకు తెలియకుండా మీ శిష్యుడీ గ్రంథం రచించడమూ ప్రకటించడమూ మీ పక్షానికి మిక్కిలీ మంచిది" అన్నారు కామరాజుగారు, ప్రసంగవశాన.

"నా మాట ప్రమాణం కాదు, నాకూ తెలుసు. వేంకటశాస్త్రిగారి రచనల విషయమై మల్లయ్య (పురాణపండా) శాస్త్రిగారున్నూ పెదవి విరిచారు, మా నాయనగారి దగ్గిర. అనేకులు ప్రామాణికుల భావమూ అలాంటిదే వింటున్నాముగా? అయినా, మీకూ మాకూ అసలు, కలహం రావడమే చాలా అనుచితం; కాని ప్రారంభం అయిపోయింది, అనుకోకుండా. పెరిగిపోయింది హద్దులేకుండా, ఇక అటూ యిటూ కూడా మూలపురుషులతోనే యిది పరిమితం అయివుండాలంటే సాగదు. ఉభయత్రా శిష్యులూ అభిమానులూ కూడా యిందులో వురకడం అనివార్యం. కనక, సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చేసింది నేను తప్పనను. అయితే, దీనివల్ల అయనకూ కొన్ని దెబ్బలు తగుల్తాయి, తప్పదు; కాని సాహిత్య వ్యవసాయి కదీ వొక సాధనోపాయమేగా?" అనికూడా అన్నారు వారు.

"అది వొక్కటే యిందులో వున్న విశేషం" అన్నారు చివరికి, వేంకటరామశాస్త్రిగారు.

ఒకవిధంగా నిరుత్సాహంగానూ, మరోవిధంగా ప్రోత్సాహంగానూ యింటికి వచ్చేశా న్నేను.

పుస్తకం చూసీ పిఠాపురంలో జరిగింది వినీ చాలా సంతోషించాడు సుబ్బారాయుడు.

పెద్దబ్బాయిగారూ చదివారు శృంఖల; కాని "తుషాహననం చేశారు మీ" రన్నారు, నిష్ఠురంగా.

చాలా పత్రికలకు పంపాను పుస్తకం.

కొన్ని అటూ, కొన్ని యిటూ రాశాయి.

పండితులున్నూ తెగిడినవారు తెగిడారు, పొగిడినవారు పొగిడారు.

ఆంధ్రభారతి అంటూ వొక మాసపత్రిక వచ్చే దారోజుల్లో.

ముట్నూరి కృష్ణారావుగారే ప్రకటించేవా రది బందరులో.

"శృంఖలాతృణీకరణం" అని పేరుపెట్టి, వేంకటశాస్త్రిగారు, నా విమర్శమీద ఖండన ప్రారంభించారా పత్రికలో.

వేంకటశాస్త్రిగారి శిష్యులు కస్తూరి శివశంకరకవిగారు తమ సుదర్శనిపత్రికలో విమర్శ ప్రారంభించారు, నరసాపురంలో.

"ఇక్కడ తిరుపతివేంకట కవులు పొరపడ్డారు, సందేహం లేదు; కాని సుబ్రహ్మణ్యశాస్త్రిగా రిక్కడ తప్పుకానిది తప్పన్నారు. దానికీ దీనికీ చెల్లు" – ఈ ధోరణిలో నడిచింది, శివశంకరకవిగారి విమర్శ.

వేంకటశాస్త్రిగారు మాత్రం ఖండించినంతవరకూ "ఘాటు"గానే ఖండించారు.

"ఘాటుగా" అంటే బుకాయిస్తూ అన్నమాట.

ఇక "ఖండించినంతవరకూ" అనేందు కన్నానంటే, నా ఆక్షేపణల్లో, సగానికయినా వారు బదులుచెప్పలేదు.

పైగా క్రమం విడిచి అక్కడొకటీ యిక్కడొకటీ ఆక్షేపించి ఖండించేశా ననిపించుకున్నా రాయన.

నా విమర్శ అంతా ఖండించేసినట్టు లోకాన్ని భ్రమపెట్టడాని కాయన ప్రయత్నం.

పాణిగృహీతా శ్రవణానందశృంఖల అసలు నేను రాయనేలేదని ఆయన వాదం.

వేంకటరామకృష్ణకవులే రాసి నా పేరు పెట్టారని ఆయన ప్రచారం.

చాలాకాలం యిలాగే చెప్పేవారు(ట) ఆయన.

అమలాపురంలో వారి శిష్యులొకరు ప్రయివేటు మెడికల్ ప్రాక్టీషనరు.

పేరు జ్ఞాపకం లేదు – ఇంటిపేరు బులుసువారు.

రాజా శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరువారి కుమారులు శ్రీధరరావు బహద్దరువారి వివాహానికి వెళ్లినప్పుడు వారి యింటోనే బసచెయ్యడం తటస్థించింది నాకు.

మా నాయనగారూ మా చిన్నన్నగారూ కూడా స్వయంపాక నియమం గలవారు కావడంవల్ల ఆడపెళ్ళివారు మాకోసం ప్రత్యేకంగా వొక బస యేర్పాటు చేశారు.

కాని అది దూరాన పడిపోయింది.

దానివల్ల వచ్చే యిబ్బందులు గుర్తించి నేను మరో బస చూడ్డానికి బయలుదేరాను.

ఒక రిద్దరు వీలులే దన్న తరవాత "సరే, రావచ్చు" నన్నవారు, ఆ డాక్టరుగారు.

నా పేరు చెప్పకుంటూ బస అడిగా న్నేను.

"పరోక్షంగా మిమ్మ ల్నెరుగుదు" నంటూనే బస యిచ్చారు వారు.

అప్పుడే అన్నారు వారు "రామకృష్ణకవులే రాసి మీ పేరు పెట్టారనే వేంకటశాస్త్రిగారి నమ్మకం మొన్నటిదాకా; కాని తక్కిన మీ రచనలు – ముఖ్యంగా వీరపూజ చూశాక అది మీరే రాసివుంటారని నిశ్చయించుకున్నారు వారు" అని.

నా పుస్తకాల విషయమై వారెంతో, వారి పుస్తకాల విషయమై నేనూ అంతే, స్వతంత్రులం మేము, ఏమనుకోడాని కయినా.

కాగా, – వేంకటశాస్త్రిగారి ఆ నిశ్చయంతో నాకు తరిగేదీ లేదు, ఈ నిశ్చయంతో వారిగేదీ లేదు.

పోతే, శృంఖలారచన నా కెంతో మేలుచేసింది.

అది రచించడంలోనూ, వేంకటశాస్త్రిగారి తృణీకరణం ఖండించడంలోనూ నే నెంతో సాధన చెయ్యవలసివచ్చింది మరి, ఏకాగ్రంగా.

ఆ పునాదిమీద నా సాధనకు మించిన నిర్మాణాలు చెయ్యడానికి తగ్గ శక్తి కలిగింది నాకు.

కాగా, అది రచించినందు కిప్పటికీ నేను కించపడ్డంలే దేకొంచెమున్ను.

## 58

శృంఖలాతృణీకరణం చూసి వొకవిధంగా నవ్వుకున్నా న్నేను.

వెంటనే దానిమీద ఖండన రాయడానికిన్నీ పూనుకున్నాను.

నా రచనపేరు "గళహస్తిక."

మొదట నే నిచ్చిన శీర్షికల్లో ఏయేనెంబర్లకు వేంకటశాస్త్రిగారు జవాబులు రాయలేదో చూపించి "యిందుకేం చెబుతా" రని నిక్కచ్చిచేశాను.

వా రిచ్చిన జవాబుల్లోనూ అనేకా లెంత అసందర్భంగా వున్నాయో సహేతుకంగా నిరూపించాను, తరవాత.

వారి జవాబుల్లో కొన్ని అంగీకరించి, నా పొరపాట్లున్నూ వొప్పుకున్నాను, చివరికి.

ఇక సాపు రాయడమే తరవాయిగా వుండగా, వొకమాటు గురువులకు చూపిద్దామని పిఠాపురం పట్టుకువెళ్ళా నది.

28 అరటావులు – అంటే యెడాపెడా 56 పేజీల గ్రంథం అది.

అచ్చులో 80 పేజీ లవుతుంది, బిగిసి.

గురువు లిద్దరూ కూచున్నారు పరిశీలనకు.

సమయానికి ఆకొండి కామరాజుగారున్నూ వచ్చారు.

రెండుమూడు గంటలసే పదే పనయింది మా కాపూట.

రామకృష్ణశాస్త్రిగారు స్వయంగా చేతబుచ్చుకుని చదివా రది.

"ఒకటి రెండుచోట్ల మీ సమర్థనం చాలదు" అని, "అయినా నే నొకటి చెబుతాను వింటారా?" అనడిగారు చదవడం పూర్తిచేసి.

అది ప్రకటించవ ద్దంటారు వారు, అనుకున్నదే.

"అయినా, సెలవిప్పించండి" అన్నా న్నేను.

అన్నాను – అంతే, నిలువుగా రెండు చీలికలు చేసేశారు వెంటనే వా రది.

చకితుణ్ణయినాను నేను.

"అదేమిటీ?" అంటూ తెల్లపోయారు కామరాజు గారున్నూ.

ఇది చాల దన్నట్టు "భేష్, మంచిపని చేశా" వన్నారు వేంకటరామశాస్త్రిగారు.

"నే నిలా చెయ్యడం కష్టంగానే వుంటుంది మీకు" అంటూ ప్రారంభించా రప్పుడు రామకృష్ణశాస్త్రిగారు, మెల్లిగా.

"గ్రంథకర్తలకు స్వాతంత్ర్యం వొక్కటే కాదు, బాధ్యతా వుం దెంతో. 'నిరంకుశాః కవయః' అన్నమాట యెరుగుదును; అయితే, దాని కతివ్యాప్తి పట్టకుండా చూసుకోవాలి కవి అయినవాడు. ఔచిత్యం భంగపడనంతవరకే ఆ నిరంకుశతకు

చెల్లుబడి. మీరు తిరుపతివేంకటకవుల పాణిగృహితా శ్రవణానందమూ విమర్శించా రంటే పండితులయినవారి కందరికీ సామాన్యధర్మమే అది. ప్రశంసించేవా రెప్పు డుంటారో విమర్శించేవారూ అప్పుడే వుంటారేదో యెత్తున ఏ గ్రంథానికయినా. గ్రంథకర్త మొదట గుర్తించుకోవలసిన సత్యం యిది. అయితే, కొందరు ప్రశంసించి నందుకు పొంగిపోడమూ, మరికొందరు విమర్శించినందుకు కుంగిపోడమూ? గ్రంథకర్త గంభీర్యమూ, ఔచిత్యపరిజ్ఞానమూ వెల్లడి అయే సన్నివేశం యిది. తిరుపతివేంకట కవులు వయస్సులో మనకంటే చాలా పెద్దలు. చాలా దేశం తిరిగారు. కిందా మీదా కూడా పడ్డారు. తన్మూలంగా అనుభవమున్నూ యెక్కువగానే సంపాదించుకున్నారు. కనక వారి ప్రవృత్తి మరో విధంగా వుండవలసింది. అలా వుండకపోడంవల్లనే మాకూ మాకూ యీ కలహం. ఇక మీ విమర్శ సంగతి. మీరు వారి రచనల్లో తప్పులు పట్టారు. అవి వొక్క భాషకూ, వ్యాకరణానికీ, ఛందస్సుకీ మాత్రమే సంబంధించినవి కావు. అచ్చంగా కవిత్వానికి సంబంధించినవిన్నీ. మీ విమర్శకు గల విశిష్టత యిది. నిజంగా అవి తప్పులేనా? అహం విడిచి గ్రంథకర్త లాలోచించుకోవలసిన విషయం యిది. తప్పులయితే దిద్దుకోవాలి, మాట్లాడకుండా. కావూ? ఆక్షేపణలు చూసీచూడన ట్యూరుకోడం గ్రంథకర్తలకు పరమధర్మం. గ్రంథకర్తల కుండవలసిన యోగ్యతకు పరమావధి యిది. కాక, – కవి తన రచన సమర్థించుకున్నా సమర్థించుకోవచ్చు, అది గాంభీర్యానికి లోటే గాని తప్పుకాదు. మీకూ వారికీ కూడా యిప్పుడిదీ హద్దు. 'మరి, మీరలా చేస్తున్నారా?' అనడక్కండి. మాది కలహం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సంకుల సమరం. స్వత్వానికీ భుక్తానికీ సంబంధించిం దిది. ఆక్రమణకూ ప్రతిఘటనకూ సన్నాహం యిక్కడ. ఒకవిధంగా మాకూ మాకూ జీవన్మరణసమస్య యిది. విమర్శలతో ప్రారంభం కాలే దిది. విమర్శలతో ఆగదు. విమర్శలతో ముగియనే ముగియదు. విమర్శ, యిక్కడ, వొక ఆయుధం, అంతే. మీ సంగతి యిలాంటిది కాదు. అది ఉత్కృష్టమైన వొక కళకు సంబంధించినది. మీరూ మీరూ కూడా చివరి అడుగువేశారు. ఇక ముందుకు వెళ్ళడానికి మీ కుభయులకూ గూడా అధికారం లేదు. మీ ఉభయుల విషయంలోనూ యిక రసికులదే బాధ్యత. మీ ఆక్షేపణలకూ వారి జవాబులకూ విలవకట్టవలసినవారు వారు. వారికయినా, యీ సాధన సామగ్రితో పాణిగృహీతలోనూ శ్రవణానందంలోనూ ఉజ్వలమైన కవిత్వం వుందో లేదో విచారణ చెయ్యడానికే అర్హత. అవి మంచివో చెడ్డవో – నిలుస్తాయో అంతరిస్తాయో – ఇవి నిర్ణయించే అధికారం కాలానిది. అలాకాక, – మీ హద్దు జవదాటి మళ్లీ మీరు వారి రచన విమర్శిస్తారూ? మీ విమర్శలు వారూ విమర్శిస్తారు పర్యాయత్వేనా. కనక, మొదట విరమించవలసిన పూచీ మీకే వుంది, యెక్కువగా. మీ రిప్పుడే అలా చెయ్యడంలో యెంతో ఔచిత్యమూ వుంది. మీరూ మీరూ కూడా యిది గుర్తించుకోకపోతే లోకగర్హణకు గురి అవుతారు. ఇంతకీ, – వారి సంగతి మా కక్కరలేదు. మాకూ మీకూ దృఢమైన అనుబంధం వుంది. అంచేత, మీకు మాకు నచ్చచెప్పవలసిన విధి వుంది. మీ రయినా మా మాట అంగీకరించారు, కనపడుతూనే వుంది. ఇది ప్రకాశమానమైన వొక గొప్ప ఘట్టం అవుతుంది మీ జీవితానికి."

"సెబాస్, చాలా బాగా చెప్పా" రన్నారు కామరాజుగారు నే నందుకోకముందే.

నే నయినా మాట అందుకోడానికి మారుగా ముందా నిలువు చీలిక లందుకున్నాను.

ముక్కముక్కలున్నూ చేసేశాను, వీలయినంతవరకూ, తరవాత.

అప్పు డన్నాను. "మీ ఆజ్ఞ శిరసావహిస్తున్నా" నని, రెండుచేతులూ యెత్తి.

ఇందు కెంతో సంతోషించారు వేంకటరామశాస్త్రిగారు.

"కవి అయినవాడికి ఎంత సాహసం వుండాలో అంతా చూపించారు, ఎంత నిగ్రహం వుండాలో అంతా కనపరిచారు మీరు. మీ అభ్యుదయాని కిదొక శుభసూచన. కాక, – స్వతంత్ర గ్రంథాలు మీరింకా చాలా రచించవలసివుంది. పట్టుబడ్డ కులవిద్యలు విడిచి కొత్తదారి తొక్కినందుకు ఈ కవితా కళ సందర్భంలో బాగా ముందుకివెళ్ళి మీ పురుషకారమున్నూ లోకానికి బాగా చూపించుకోవాలి మీరు. ఇప్పటికే మీ ప్రజ్ఞ బహుముఖం. అయినా, మీ రింకా సాధన చెయ్యాలి. చేస్తూన్నూ వుండాలి కనక, యిందుకు నిరుత్సాహపడవద్దు. లోకం పోకడ బాగా పరిశీలించుకోడం పెట్టుకోండి, ప్రధానంగా. గ్రంథపఠనం అహోరనిద్రలకంటేనూ ముఖ్యంగా చూసుకోండి. రచనమీద రచన చెయ్యండి. ఇది మీకు శ్రేయస్కరమూ, మాకు ప్రశంసావహమున్నూ" అనిన్నీ మంత్రోపదేశం చేశారు వారు.

వేంకటరామశాస్త్రిగారిలా చెప్పి వూరుకోగా "శృంఖల వెయ్యిప్రతులూ త్వరగానే చెల్లిపోతాయి, సందేహం లేదు. కాని మీ రది మళ్ళీ అచ్చువేయించవద్దు. విజయ విలాసం మీద మీరు ప్రారంభించిన సమీక్ష పూర్తి చెయ్యండి. నేను చెప్పిన మాసపత్రిక కూడా ప్రారంభించండి త్వరగా" అన్నారు రామకృష్ణశాస్త్రిగారు.

వారి ఆజ్ఞ శిరసావహించి కొండంత తృప్తితో యింటికి వచ్చేశా న్నేను.

## 59

ఇక రెండో సంగతి.

ఇది చెప్పకుండా వుండడం మంచిది.

అంత వెకిలితనం పేరుకుని వుంది దీన్లో.

కాని జరిగిపోయింది.

నడిబజారులో జరిగింది, సందుల్లోనూ గొందుల్లోనూ కాదు.

వందలాది జనం చూస్తూ వుండగా జరిగింది, చాటునా మాటునా కాదు.

కనక, చెప్పకుండా వుండలేను.

చెప్పకపోడం ధర్మమూ కాదొక విధాన.

ఏమంటే?

మనస్తత్వశాస్త్రానికి సంబంధించిన అతిగహనమైన వొక సూత్రానికి వార్తికం యిది.

కాక, – నా అనుభవాలు చెప్పడానికి పూనుకుని వున్నా న్నేను.

అసభ్యమే కాని, పెద్ద అనుభవం యిది.

రచన నాకు జీవిత పరమావధి అయిన ధర్మం.

ఆ రచనకున్నూ సంబంధించిన అనుభవం కావడం దీని విశేషం.

ఎలాంటివాడికీ గూడా వొక్కొక్కప్పుడసందర్భ పరిస్థితుల్లో మసులుకోవలసివస్తుంది.

విజ్ఞోడు మనుష్యులతో వ్యవహరించవలసిన్నీ వస్తుంది.

మిక్కిలీ అనిష్టమైన పనులే చెయ్యవలసివస్తుంది కూడా.

అదుసు తొక్కవలసేవస్తుంది, అనివార్యంగా వొక్కొక్కప్పుడు.

కళాపరులకు సంబంధించి కళల పరంగానున్నూ తటస్థించి వుంటే, అవి, జాతిపరా లయిపోతాయి, వ్యక్తులను విడిచి.

జాతి ఉన్నత్యవనతులు కాలికంగా నిర్ధారణ చేసి చూపించవలసిన చరిత్ర నిర్మాతల కవి అందించిన్నీ తీరాలి.

లోకం పోకడను బట్టి వ్యవహారం మరి.

శరీరాలు మాత్రమే భిన్నంగా వున్న స్నేహితు లుంటారు, లోకంలో.

వారి ప్రకృతులు మాత్రం సర్వాత్మనా వొకటే విధంగా వుండవు.

కళ్లబడితేనే నరుక్కోడానికి సిద్ధపడే గర్భశత్రువులూ వుంటారు.

కొన్ని సందర్భాల్లో వారి ప్రవృత్తు లేకోన్ముఖా లయి వుంటాయి.

ఇది లోకసామాన్యధర్మం.

అక్కడ అహానికీ స్వార్థానికీ ప్రాముఖ్యం అయితే, యిక్కడ సహనానికీ నిర్లిప్తతకూ ప్రాబల్యం.

ఎక్కడపడితే అక్కడ కనపడతాయి నిదర్శనాలు దీనికి.

కాని స్నేహితులయినా విరోధులే అయినా, అతీతులయినవారు – అతీతులం అనుకునేవారున్నూ యెలాంటి సందర్భంలోనూ కూడా చిత్తసంస్కారం చూపించుకుంటూ వుండాలి, అనుక్షణమూ.

మరి చిత్తసంస్కారం అంటే?

తెలిసిన సంయమం.

ఇది విశిష్టధర్మం.

విశేషించి కవులకు ముఖ్యధర్మం.

ఎంచేతనంటే?

శబ్దశక్తి కవులకు తెలిసినట్టు మరెవరికీ తెలియదు.

వారు వాడినంత పొదుపుగానూ, జాగ్రత్తగానూ శబ్దాలు వాడ్డం కూడా మరెవరికీ సాధ్యం కాదు.

చరాచరాత్మకమైన విశ్వం అంతా శబ్దాలతో చిత్రించాలి వారు, మరి, అతిలోకరమణీయంగా.

ఆ చిత్రణం ఆదర్శంగా వుండేటట్టున్నూ చూసుకోవాలి కవులు.

మరి, సంయమం లేని కవి కిదెలా సాధ్యపడుతుందీ?

కాని లోకంలో చూస్తాం, చాలామంది కవుల్లోనే కనపడుతుందీ సంయమం లేకపోడం, ప్రాయికంగా.

వారి సంస్కారం సంపన్నం కాకపోడం అందు క్కారణం.

వారి ప్రతిభా ప్రజ్ఞా దిక్కాలాద్యనవచ్ఛిన్నాలు కాకపోడమున్నూ అందు క్కారణం.

ఈ అపరిణతి వారి రచనల్లోనే కనపడుతుంది, స్పష్టంగా.

అయితే, కవుల శక్తీ యెలాంటి ప్రవృత్తీ వయినా, తత్కార్యకాలయిన కావ్యాల విలవలు నిర్ణయించేది మాత్రం కాలం వొక్కటే.

కవులు కారు.

పాఠకు లసలే కారు.

మరి, పండితులో అంటే, వారూ కారు.

ఏమంటే?

కవుల కహమిక వుండడాని కవకాశం వుంది.

పాఠకులు పామరుల్లో పై అంతస్థుకి చెందినవారు – వేత్తలయినవారు వివరించి చెబితే గాని మంచీ చెడ్డా కూడా సక్రుచ్ఛ్రింగా గుర్తించలేరు వారు.

పోనీ, పండితులను చూస్తామా, వారి రుచులు భిన్నభిన్నాలు.

దీనికి సాయం, పాక్షికత అలుముకోడమున్నూ సంభవమే పండితు లయినవారికి.

అయితే, మరి, విమర్శ కవకాశం యేదీ?

విమర్శ అక్కరలేదూ?

కావాలి.

తప్పకుండా కావాలి.

విమర్శించడానికిన్నీ అధికారం మళ్లీ పండితులదే, వొప్పుకుంటాను.

కాని విమర్శ యెందుకోసం?

ఇది చూసుకోవాలి ముందు.

రుచిభేదం అన్నది సిద్ధాంతాలకు సంబంధించివుండాలి గాని వ్యక్తుల యిష్టానిష్టాల క్కాదు.

పండితు లిది గుర్తించుకుంటే యే ఆక్షేపణా లేదు.

ఒక్కొక్క గ్రంథం లోకంలో యిట్టే పాకిపోతుంది.

కారణం?

దాని కలాంటి సత్తా వుందా?

ఉంటే, అది యెలాంటిదో, యెంతటిదో నిర్ధారణ కావాలి.

లేదూ?

పై మెరుగులేనా దానివి?

అయితే, అది చదవడం నిరుపయోగం అని లోకానికి చెప్పాలి.

ఒక్కొక్క గ్రంథానికి కొంచెమున్నూ వ్యాప్తి రాదు లోకంలో.

ఏం?

అది మృతకళేబర ప్రాయమూ, దాని అంతస్థు సామాన్యులందుకో లేనిదా?

అదిన్నీ చూడాలి, పండితుడైనవాడు.

దాని మంచిచెడ్డలు లోకానికి వివరించి చెప్పాలి.

రుచిభేదం పురస్కరించుకుని యే గ్రంథం విషయమ్మై అయినా అభిప్రాయభేదా లేర్పడతాయీ?

మంచిదే.

నిగ్గు తేలుతుం దెప్పటికయినా.

గ్రంథానిక్కంటే కవికే యెక్కువ మేలు దానివల్ల.

కవి అయినవాడి అంతస్థు పెరుగుతుంది దానివల్ల.

కనక, కవి అయినవాడికి, ఫలపరిత్యాగం చేసి – సర్వమూ కాలానికి విడిచి, రచనమీద రచన సాగించుకుంటూ వుండడానికే అధికారం.

అది రసికుల చేతుల్లో వుంచడానికిన్నీ మాత్రమే పూచీ.

అది గొప్పదో తక్కువదో, నిలుస్తుందో యెగిరేపోతుందో – ఇది నిర్ణయించే – నిర్ధారణ చేసే – చెప్పే పూనిక వుండగూడదు కవికి.

ఉందీ?

అతని అపరిణతికి డప్పుకొడుతుందది.

"అతను మహర్షి కాడు, శుద్ధ ప్రాకృతుడు" అనిన్నీ చాటి చెబుతుందది.

తన విషయమయ్యే తన కిలాంటి ప్రతిబంధకా లున్నప్పుడు, కవికి, కొందరిని పట్టుకుని కుకవులని నిందించడాని కధికారం యెక్కడిదీ?

తన రచన ఫలానా శ్రేణికి చెందుతుందని చెప్పుకోడానికే తన కధికారం లేనప్పుడు, అది యెవరయినా విమర్శిస్తే, వారిని నిందించడానికీ ద్వేషించడానికీ మాత్రం అధికారం యెక్కడిదీ?

## 60

కాళిదా సేదేశంవాడు?

ఏ జాతివాడు?

అంటే, అతని మాతృభాష యేమిటి?

అతని వంశవృత్తాంతం యెలాంటిది?

అత నేం చదివాడు?

ఆ చదివింది యెవరి దగ్గిర చదివాడు?

అతను తన గ్రంథాలు, ఏయే తేదీల్లో ప్రారంభించి ఏయే తేదీల్లో పూర్తిచేశాడు?

ఇవేమీ అక్కర్లేదు లోకానికి.

రసికుల కసలే అక్కర్లేదు.

అతనేమేమి రచించాడన్నదే వారి ఆకాంక్ష.

అతని రచన లెలాంటి వన్నదే వారి జిజ్ఞాస.

అవి తమ కానందం కలిగిస్తున్నాయా లేదా – ఇదే వారి క్కావలసింది.

పాశ్చాత్యులు మాత్రం ఆ వివరాలకున్నూ ప్రాముఖ్యం యిచ్చారు.

మనవారి కాదృష్టే లేకపోయింది.

అయితే, యెవరి దృక్పథం మంచిదీ?

ఈ చర్చ యిక్కడ కాదు.

పోతే, –

కవి రచన, వొక్కొక్కచోట ఆహా అనిపిస్తుంది రసికులకు.

ఒక్కొక్కచోట ఆనందముగ్ధులను చేస్తుంది, వారిని.

ఒక్కొక్కచోట మార్గదర్శి అవుతుంది, వారికి.

ఉత్తమకావ్యాలవల్ల కలగవలసిన ప్రయోజనా లివే, యెవరికయినా.

కవి జీవిత వివరాలంత అగత్యాలు కావు.

అంచాతే కాళిదాసు సంగతి మన కక్కరలే దనడం.

అతని రచనే కావాలి మనకి.

కనకనే అతనూ చెప్పుకోలే దది.

ఇక్కడ అతనిత్యాగం గొప్ప దనడంకంటే ఔచిత్యదృష్టి బహూ నిశితం అనడం మంచిది.

అతని రచనల్లో అడుగడుగునా గోచరిస్తుం దిది.

అంచేతనే కవికుల గురువైనా డతను.

కనకనే అతనే మిగిలాడు లోకంలో.

శతాబ్దులు గడిచాయి, అయినా అత నున్నాడు.

యుగాలూ గడిచిపోతాయి, అప్పుడూ వుంటా డతను.

ఏమంటే?

అతని వాక్కు అజరామరం అయిపోయింది.

అది రసమయం కావడం దాని క్కారణం.

అతని శరీరం పంచభూతాల్లోనూ కలిసిపోతే, అతని చైతన్యం అతని రచనల్లో మిళితం అయిపోయింది.

కనకనే వాటికా జీవకళ.

కవి అయినవాడు సాధించుకోవలసిన ప్రాప్యం యిదీ.

కాళిదాసు కిది బాగా తెలుసు.

అంచేతనే కావ్యత్వాని కగత్యంకాని సంగతు లత నెత్తుకోలేదు, లేశమూ.

"నామూలం లిఖ్యతే కించి" త్తని మల్లినాథుడు,

"నావశ్యం లిఖ్యతే కించి" త్తని కాళిదాసు శపథం పట్టుకుని వుంటారు.

"అయితే 'మందః కవియశఃప్రార్థీ' ఇత్యాదు లతను చెప్పుకోతగ్గవి కావని తేలడం లేదూ?" అంటే నిజమే.

అత నవి చెప్పుకోకపోతేనే బాగుండేది.

కుమారసంభవంలోనూ, మేఘసందేశంలోనూ, ఋతుసంహారంలోనూ యేమీ చెప్పుకోనివాడు, రఘువంశంలో అమాత్రం అయినా యెందుకు చెప్పుకోవాలీ?

అంటే, దీనివల్ల వొకటి నిర్ధారణ చేసుకోవచ్చు మనం.

అత నెంత హద్దుమీ రనివాడయినా, జీవితక్రమంలో, వొక దశ దాటి మరో దశ కెగబాకుతున్నా డప్పుడు.

సాధకావస్థ విడిచి సిద్ధావస్థ చేరుకుంటున్నాడు, స్పష్టంగా.

అర్థతః:-

జనసామాన్యంనుంచి విడిపోయి, వొక మహోన్నత పదవి అధిరోహించబోతున్నాడు, నిరాటకంగా.

మరి, అప్పుడయినా యిప్పుడయినా జనసామాన్యాని కసూయాజనకమైన సన్నివేశం యిది.

అయినా, వారిమధ్య బతకా లతను.

వారితో కలిసిమెలిసి తిరగాలి.

వారి అసూయ, అడుగడుగునా దారికొడుతుం దతణ్ణి.

అలాంటి స్థితి రానిచ్చుకోగూడదు, తెలివైనవాడు.

కాక, నిండుకుండ అతను.

అన్నీవున్న ఆకు అణగిమణగే వుంటుంది.

కనక "నేను మందు"ణ్ణని చెప్పుకున్నా డతను.

"చాపలం తప్ప కవి అనిపించుకోడానికి లేశమూ నా కర్హత లే"దని చెప్పుకున్నాడు.

"దీల్లో యేమయినా విశిష్టత వుందేమో, అది సజ్జనులు నిర్ధారణ చెయ్యాలి. నాకేమీ తెలియ" దని విన్నవించుకున్నాడు.

చాలు, అసూయతో రాళ్లు రువ్వేవారి కది సమ్మోహనాస్త్రం.

దీంతో, పురోగమనం నిష్కంటకం అయివుంటుం దతనికి.

ఏతావతా:—

రఘువంశం అతని మొదటి రచన.

ఆత్మప్రత్యయం బలపడ్డం తడువుగా అతను రచించిన దది.

అయితే, అతని శ్రవ్యాలలోనూ దృశ్యాలలోనూ గూడా దానికి విశిష్టస్థానం వుంది.

మరి, అదే మొదటి రచన అయితే, అంతటి రసవత్తత సంఘటించడం యెవరి కయినా శక్యమా?

లోకంలో యిదో వాదం వుంది, తెలుసు.

కాని, మిక్కిలీ దుర్బలం యిది.

ఎంచేతనంటే?

కుమారసంభవమూ, మేఘసందేశమూ ప్రౌఢంగా — వస్తునిర్దేశంతో ప్రారంభించినవాడు, పార్వతీపరమేశ్వరులకు మొక్కుకుని మరీ యెందుకు ప్రారంభించాలీ రఘువంశం?

పైగా, — "ఈ వంశం కృతవాగ్ద్వారం" అన్నాడు తనకి.

పూర్వసూరివరేణ్యులు తనకి దారిచేసిపెట్టా రన్నాడు.

కనక, తా నందులో నిరాఘాటంగా సంచరించగల నన్నాడు.

అది మొదటి రచనే కాకపోతే, అత నీవుసులుబా టెందుకు చెప్పుకోవాలీ?

ఇంతేకాక:—

రఘువంశం వొక వంశచరిత్ర.

ఏకనాయకం కాదు, బహూనాయకం అది.

ఆ వంశం యెంత సత్సంప్రదాయసిద్ధం అయినా, ఆ వంశీకులున్నూ యెంత ధార్మికులయినా, వారి వందరివీ భిన్న ప్రవృత్తులూ, భిన్న రుచులూనూ.

వారి జీవిత క్రమాలున్నూ భిన్నాలే.

వారి జీవితాల్లో ఇంద్రదిలీపసంవాదం, అజవిలాపం వంటి రసవత్తరఘట్టా లెన్నో వున్నాయి.

అనన్య సాధారణమైన కవితాశిల్పం చూపించగలవాడి కవన్నీ మేలిమిబంగరుముద్దలే.

అందుకు తగ్గట్టు, అక్కడా అక్కడా, తన ప్రతిభ అంతా – తన నైపుణి అంతా కనపరుచుకున్నాడు కాళిదాసు.

దీన్నిబట్టి చూస్తే, రఘువంశం అనేక ఖండకావ్యాల సంపుటం కాని, ఒకటే మహాకావ్యం కాదు.

అంచేతనే కుమారసంభవం లాగా, మేఘసందేశం లాగా గ్రంథం అంతా వొకయెత్తున కాక, కైలాసాదిమహోన్నత శిఖరాలతో హిమగిరిలాగ మిక్కిలీ విశిష్టంగా తయారయింది రఘువంశం.

ఈ విశేషం గుర్తించకుండా, ఈ వైవిధ్యంతో వచ్చిన విశిష్టత మాత్రం చూసి, యిది అతని మొదటి రచన కాదనడం ధర్మమా?

## 61

చెప్పవచ్చిందేమిటంటే?

కవిత్వపరంగా మొదటే అలాంటి మహోన్నత శిఖరా లధిరోహించగలిగినవాడికి, తన విషయమై – తన వంశ విషయమై వొక్క శ్లోకమే చెప్పుకున్నా తన ప్రతిభ కది దుర్వినియోగమూ దుర్వ్యయమూ అయి వూరుకుంటుంది.

నిజంగా, కవి అయినవా డిది సహించలేడు.

అంచేతనే కాళిదాసు లేశమూ తన విషయం చెప్పుకోలేదు.

ఆదిలో యీ సత్సంప్రదాయం ప్రారంభించినవాడు వాల్మీకి.

కవిత్వమూ ఈ సంప్రదాయమూ ఏకకాలాన ప్రారంభించా డతను.

మనం తవ్వి తలకెత్తుకుంటున్న అతని జీవితవిశేషాల్లో వొక్కటీ గూడా అతని రచనలో – రామాయణంలో లేదు.

అంతటి విపులగ్రంథంలోనూ తాను తపస్వినని మాత్రమే చెప్పుకున్నా డతను.

తపస్సు చేసి చెప్పుకున్నా డది.

తపస్సు చేసి దాని ఫలితం సంపాదించుకుని మరీ చెప్పుకున్నా డది.

తపస్సు – అంటే వొక సాధన.

అతని పక్షంగా అతర్కితమే కావచ్చు, దానికి సిద్ధి కవిత్వం.

తపస్వి, మహర్షి – ఏకార్థబోధకాలు.

పర్యాయపదాలు.

కవిత్వానికి పూర్వావస్థ మహర్షిత్వం.

వాల్మీకి డాబుకోసం అనుకున్న మాట కాదు తాను తపస్విననీ, కవులకు మంత్రోపదేశంగా వుద్దేశించిన దిది.

"తపస్సు చెయ్యి, తరవాత కలంపట్టు" అని దానికి వివరణ.

తపస్వి అన్న శబ్దాని కిక్కడ ఈ విశేషార్థం చెప్పుకో గలిగితేనే సొగసు.

మహా భారతకర్త వ్యాసుడూ ఇలాంటివాడే అచ్చంగా.

అయితే, భారతేతిహాసంలో అతనొక పాత్ర.

నిగ్రహానుగ్రహసమర్థుడు కనక తన పాత్రా నిర్వహించుకో గలిగాడు లక్షణంగా, మహర్షి కనక – కవి కనక, శాశ్వతమైన ఇతిహాసంగానూ రూపొందించగలిగాడా గాథ అంతా అతను.

కాని, లోకం గుడ్డిది.

కనకనే, ఆ యితిహాసంలో కృష్ణుడికీ భీష్ముడికీ విదురుడికీ ద్రోణుడికీ ధృతరాష్ట్రుడికీ ధర్మరాజుకీ భీమార్జునులకూ ద్రౌపదికీ కర్ణుడికీ దుర్యోధనుడికీ – చివరికి దుశ్శాసనుడికీ యిస్తున్న ప్రాముఖ్యంలో సహస్రాంశమున్నూ యివ్వలేకపోతోంది వ్యాసుడికి.

రామాయణంలో వశిష్ఠుడి విషయమూ ఇంతే.

రామాయణంలోనూ, భారతంలోనూ, మహోజ్జ్వలపాత్రలని యెవరిని పొగడుతోందో లోకం – పండితులున్నూ కీర్తిస్తున్నారో – అక్కడ వశిష్ఠుడూ ఇక్కడ వ్యాసుడూ వెనక నిలిచివుండకపోతే ఆ పాత్రలకా ఔజ్జ్వల్యం సిద్ధించివుండేది కాదు.

బ్రాహ్మణధర్మం విశిష్టత అది.

అయితే, దీని విస్తరం మరొకప్పుడు.

పోతే, – రామాయణంలో వాల్మీకికీ వుందిలాంటి విశేషం యే చివరో; కాని వ్యాసుడి పాత్ర భారతగాధకు మూలం.

ఇంతేకాదు.

భారత గాధకు వ్యాసుడు కీలకం.

అంతకి ముందు లేనిది ఆ వంశంలో అతనివల్లనే ప్రారంభం అయింది ద్వైధీభావమున్నూ.

అంచేత మహాభారతంలోనే తన సంగతి చెప్పుకోవలసి వచ్చిం దతనికి.

కాని తన గ్రంథకర్తృత్వం విషయమై అత నేమీ డాబులు చెప్పుకోలే దందులో.

పైపెచ్చు, – "నావల్ల అయేదేనా యిది?" అంటూ ఆందోళనే కనపరుచుకున్నాడు, స్పష్టంగా.

ఆదికవి నన్నయా అవలంబించాడు తెనుగులో ఈ పద్ధతి.

అయితే, అతనూ కొన్ని విశేషణాలు వేసుకోలేదా అంటే,

అవి అతని స్వధర్మనిరతికి ద్యోతకాలు కాని బిరుదులూ డాబులూ కావు.

అందరు మహానుభావులు బలిసివుండిన ఆ నిండుకొలువులో, రాజరాజు, తననే భారతం అనువదించమని అడగడానికి తనకి యోగ్యత వుందని చెప్పుకోడానికే గాని తాను మహాకవినని విర్రవీగడాని క్కాదవి.

అవయినా, యెవరో అన్నట్టు చెప్పుకున్నాడు.

అయినా, వొకమెట్టు దిగడమే అది సందేహం లేదు.

నన్నయ్య తరవాత తిక్కన్న కూడా కనీసం యీ హద్దులోనే వుండివుంటే బాగుండిపోను.

స్వప్నవృత్తాంతం వొకటి బయటపెట్టుకున్నా డతను.

అత ననుకున్నది వేరే.

అది విశిష్ట మైనదిన్నీ, సందేహం లేదు.

కాని అన్యథా పరిణమించిం దది.

తరవాత యెందరికో వచ్చాయి స్వప్నాలు.

తరవాత్తరవాతివారు అనుచితాలైన యెన్నో కొత్త పోకడలు పోడానికి బీజప్రాయం అయిం దది.

"వాణి నా రాణి" అనేశా డొక కవి.

అసభ్యం మాత్రమే కా దది, జుగుప్సాకరమున్నూ; కాని యిలా అన్నందు కాకవిని మెచ్చుకునేవారున్నా రిప్పుడున్నూ కొందరు.

ఈ వూపున కూచిమంచి తిమ్మన్న కవిసార్వభౌముడే అయిపోయాడు, అదీ యిదీ యెందు కని.

మన తిరుపతివేంకట కవులు చాలా అడుగులే వేసేశారు ముందుకి "కింకవీంద్రఘటాపంచాననుల" మంటూ.

స్వప్నవృత్తాంతం చెప్పకోడంవంటిది చేసినా, తిక్కన్న, తా నుభయకవిమిత్రుణ్ణని చెప్పకున్నాడు.

మరి, తిరుపతివేంకట కవులు?

ఏదోవిధంగా కవులయివుండినవారికే శత్రువులు.

ఏమిటి దీల్లో విశేషం?

ఎవరిని తా మణిచివేస్తామంటున్నారో వారు "కింకవీంద్రు"లని తామే చెప్పేటప్పుడు దానివల్ల తమకు వచ్చే ఘనత యేమిటి?

పోనీ, తాము గొప్పకవుల మయినట్టు తేలిందా?

తిక్కన్న అంతవాడు అంతటి ఉదాత్తత కనబరచడమూ, తిరుపతి వేంకట కవు లింతటి ఉద్ధతి చూపించడమూ గమనించవలసిన సంగతులు.

## 62

తిరుపతి వేంకటకవులు, బతికివుండినంతకాలమూ తిరుపతి వేంకటకవులుగానే వుండి పోయారు, దివాకర్ల తిరుపతిశాస్త్రిగానూ, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగానూ కాక.

వారి మైత్రి అంత గాఢమైనది.

అది మైత్రి అయినా అనుబంధం అయినా మిక్కిలీ ప్రశంసించతగ్గ విషయం.

కాని వారి ప్రవృత్తులు మాత్రం మిక్కిలీ భిన్నంగా కనపడతాయి.

వారితో గాఢపరిచయం వుండినవారున్నూ ఇలాగే చెప్పారు.

రామకృష్ణ కవులకూ వారికీ నడిచిన వివాదంలో, విశ్లేషించి చూస్తే తిరుపతిశాస్త్రిగారికి తగినంత ప్రమేయం వుండినట్టు కనబడదు.

వివాద నడిచిన తీరునుబట్టిన్నీ యిది స్పష్టమే.

పాణిగృహీతాశ్రవణానందశృంఖలా, శృంఖలాతృణీకరణమూ వచ్చిన కొన్నాళ్ళకు దుగ్గిరాల సూర్యప్రకాశరావు గారితో పనివుండి కాకినాడ వెళ్ళా నొకమాటు.

ఆ రోజుల్లో కాకినాడ వెడితే వారియింటోనే నా బస.

మిత్రులు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ద్వారా వారితో నాకు పరిచయం.

సూర్యప్రకాశరావుగారితో పరిచయమే రాజకీయాలన్నా రాజకీయ సభలన్నా నాకు రుచిపుట్టించింది.

"గోదావరీ మండలసభ" అంటూ వొక రాజకీయసభ నడిపించేవారు వారు.

ఏటా వార్షిక సమావేశాలు జరిగేవి దానికి.

నే నెన్నో సమావేశాలకు వెళ్ళాను, వారి ప్రోత్సాహంతో.

పని ముగిసింది, "రండి, పోలవరం జమీందారుగారి దగ్గిరికి వెడదాం" అంటూ బయలుదేరారు, సూర్యప్రకాశరావుగా రావేళ.

మేము వెళ్ళేటప్పటికి (మధ్యాహ్నం రమారమీ 4 గంటలవేళ) జమీందారుగారి భవంతి అరుగుమీద తిరుపతిశాస్త్రిగారు పచారుచేస్తున్నా రేదో ఆలోచించుకుంటూ.

దూరంగా చాలామాట్లు చూసివున్నా న్నేనప్పటికి వారిని.

ముందు ప్రకాశరావుగారూ, తరవాత నేనూ వందనాలు చెప్పాకున్నాం వారికి.

ఆశీర్వదించి "వా రెవ" రని నన్ను నిర్దేశిస్తూ తిరుపతి శాస్త్రిగా రడగడమూ "అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. మీకు శృంఖలాలు తగిలించినవారే వీరు" అంటూ ప్రకాశరావుగారు చెప్పడమూ గబగబా జరిగిపోయాయి.

"అయితే, మా శత్రుకోటిలో వారే అన్నమాట" అన్నారు శాస్త్రిగారు వెంటనే, ముందు.

కాని అంతలో యేమనుకున్నారో యేమో "కాదుకాదు, మా పొరపాట్లు చూపించినవారు మిత్రకోటిలోవా రవుతారు గాని శత్రుకోటిలోవా రెలా అవుతారూ?" అన్నారు, తరవాత.

చకితుణ్ణయినా న్నేను.

ప్రకాశరావుగా రింతలో జమీందారుగారి దగ్గిరకు వెళ్ళగా "రండి" అంటూ నన్ను పిలిచి, తా మక్కడ వుండిన బల్లమీద కూచుని, నాకున్నూ పక్కనే స్థలం నిర్దేశించి సంభాషణ ప్రారంభించారు శాస్త్రిగారు.

వారు ఘర్షణ పెంచుతా రనుకుని అందుకు సావధానుణ్ణయే కూచున్నా న్నేను; కాని వారు చాలా ఉదాత్తంగా ప్రారంభించారు సంభాషణ.

నే నప్పటి కేమేమి రచించివున్నానో తెలుసుకున్నారు.

అప్పుడేమి రచిస్తున్నానో అడిగారు.

నాలుగైదు పద్యాలు చదివించుకుని విన్నారు.

అప్పటికి జ్ఞాపకం రాగా, తమ శిష్యుడు మల్లాది సత్యనారాయణశాస్త్రి నా గురువరణవిధానం తమకు చెప్పివుండినట్టు చెప్పారు.

"సంధ్యావందనం అంటే అంత ద్వేషం యేమీ?" అనడిగారు.

శృంఖల రాయవలసిన అగత్యం నా కేమి వచ్చిందో చెప్పమన్నారు.

చివరికి "మీ గురువులు చెప్పిందేమాట. ఈ వ్యవహారంలో దిగడం మీ కనవసరం" అన్నారు.

మొత్తం రమారమీ రెండుగంటలసేపు మాట్లాడుకున్నాం మే ముభయులమూ.

ఎంతో హుందాగా వుండింది వారి ధోరణి.

తరవాత, ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవం సందర్భంలో గుంటూరిలో కలుసుకున్నాను మళ్ళీ వారి న్నేను.

పరిషత్తుకి సర్వమూ అయిన జయంతి రామయ్యపంతులుగారు గుంటూరిలోనే వున్నా రప్పుడు సబ్ (?) కలెక్టరుగా.

ఏ.సీ. కాలేజీ మేడమీద జరిగిం దామహోత్సవసభ.

రాజా శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావు పంతులు బహద్దరుగా రధ్యక్షులా సమావేశానికి.

రూపొందినందు కానందంతో పాటు, నిర్వహణలో వుండుకున్న అసందర్భాలు పురస్కరించుకుని పరిషత్తంటే అసంతృప్తిన్నీ ప్రారంభం అయివుం దప్పటికే పండితలోకంలో.

ఏదో ప్రస్తావన (తీర్మానం) సందర్భంలో ఘర్షణకు పూనుకున్నారు పురాణం సూరిశాస్త్రిగారు తొలినాటి మధ్యాహ్నం.

విశ్వనాథ కవిరాజుగారికీ నాకూ ఆ మహోత్సవం సందర్భంగానే మొదటి పరిచయం.

శృంఖల విషయం ప్రస్తావిస్తూనే వెతుక్కుంటూ వచ్చి నాతో స్నేహం కట్టారు కవిరాజుగారు.

మే మిద్దరమూ కలిసేవెళ్ళి, అక్కడ, బసలో శ్రీ తిరుపతి శాస్త్రిగారి దర్శనం చేసుకున్నాం.

కాకినాడలో లాగే వారు నా క్షేమసమాచారాలూ, నా రచనావ్యాసంగాలూ అడిగి తెలుసుకున్నారు.

అది చూసి కవిరాజుగారు మిక్కిలీ చకితులైపోయారు.

అక్కణ్ణుంచి వచ్చేటప్పుడు, రెయిల్లో, బెజవాడ దాకా తిరుపతిశాస్త్రిగారున్న కంపార్టుమెంటులోనే ప్రయాణం చేశాం మే ముభయులమూ.

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారితో పరిషత్తు సందర్భంగానే చర్చసాగిస్తూ వేటూరి ప్రభాకరశాస్త్రిగారున్నూ వున్నా రాకంపార్టుమెంటులోనే.

అప్పటికి బక్కపలాచగా రెక్కపాయలా వుండేవారు ప్రభాకరశాస్త్రిగారు.

బెజవాడ చేరేదాకా పరిషత్తు విషయమే చర్చించుకున్నాం అందరమూ.

"కాకినాడ యెప్పుడు వచ్చినా నా క్కనపడకుండా వెళ్ళవ"ద్దని నాకు చెబుతూ రెయిలు దిగి ప్రభాకరశాస్త్రిగారితో కలిసి బెజవాడ వూళ్ళోకి వెళ్ళిపోయారు తిరుపతిశాస్త్రిగారు.

## 63

తరవాత కూడా మరో రెండుమూడుమాట్లు కలుసుకున్నాను తిరుపతిశాస్త్రిగారిని; కాని, రాజా శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరువారి వివాహం సందర్భంలో, బందరులో, వొక్కమాటే చూసివున్నాను, వెంకటశాస్త్రిగారిన్నే నప్పటికి.

ఆ మహోత్సవంలో కవిసమ్మేళనం వొక విశేషం.

అందుకోసమే వెళ్లాను, మా పెద్దన్నగారితో పాటు నే నక్కడికి.

అప్పటికే వారకాంత అనే నాటకం రచించి మహాకవి నయిపోయినట్టు మురిసిపోతూ వుండినా న్నేను.

ఒకనాడు బెంగుళూరి నాగరత్నంగారు పాడారు. ఇంకోనాడు తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు వీణ వాయించారు, మూడోనాడు సదస్యం అయింది, చివర జరిగింది చాలా గొప్పగా కవి సమ్మేళనం ఆ మహోత్సవంలో.

హరికథ చెప్పినట్టు లేదుగాని, నారాయణదాసుగారు వచ్చి వున్నా రక్కడికి, కవిసమ్మేళనంలో పాలూ పుచ్చుకున్నారు.

ఆవేళ బందరుపట్నం అంతా విరగబడిపోయిం దాసభకు.

అది నిర్వహించినవారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు.

ఆ సందర్భంలోనే దూరంగా చూశాను వారి న్నేను.

అసలు, అది తలపెట్టినవారు రాజా శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావు పంతులుగారు.

వారు శ్రీ విశ్వసుందరరావుగారి బావమరిది.

అంటే, జనకసోదరి భర్త.

నాకు తెలిసినంతవరకూ, ఈ శతాబ్దిలో, వివాహమహోత్సవాల సందర్భంలో కవిసమ్మేళనాలకు నాందీవాక్యం పలికినవారు భుజంగరావుగారే.

విశ్వసుందరరావుగారి వివాహంలోనే అది ప్రారంభించా రనుకుంటాను.

తరవాత, వారు, తమ కూతుళ్లు అందరి వివాహాలలోనూ జరిగించా రది.

వారీ కవిసమ్మేళనా లేర్పాటు చెయ్యడానికి పూర్వం వివాహ సదస్యాల్లో "కవిత్వప్పళ్ళెం" అంటూ వొక యేర్పా టుండేది.

వేదవేదాంగవేత్తలతోపాటు కవులను గూడా సత్కరించడానికా యేర్పాటు.

అంటే, దీన్నిబట్టి, కవిత్వం అంటే జనుల కెంత యిష్టమో, కవులను వా రెంత అభిమానించుకుంటున్నారో, ఇలాంటి పరిస్థితు లేర్పడ్డా యంటే కవు లెంత ప్రచారం చేసివుంటారో మనం సులభంగా గుర్తించవచ్చు.

అయితే, వినడమే గాని నే నెక్కడా చూడలే దిది.

నాకు ప్రాజ్ఞత వచ్చేటప్పటికే అంతరించిపోయిం దీ సంప్రదాయం.

మనలో సదస్యం అనేది గొప్ప నిర్మాణం.

సదస్యానికే "మహదాశీర్వచనం" అని మరోపేరు.

అంటే, "మహతాం ఆశీర్వచనమ్."

చిత్తసంస్కారం గల పండితులు చేసే "ఆశీర్వచనమ్" అది.

ఈశ్వర కటాక్షానికీ, తన్మూలంగా అభ్యుదయపరంపరాభివృద్ధికీ యిదొక సోపానం.

సదస్యంలో, వధూవరులు, నవగ్రహ పూజాదికం నెరవేర్చి నూతనవస్త్రాలు ధరించాక జరుగుతుం దీమహదాశీర్వచన కాండ.

అందుకోసం, పురోహితుడు, అక్షతలతో నిండివుండిన పళ్లే లందిస్తా డొక క్రమాన పండితులకు.

పండితులంటే సామూహికమైన మాట యిది.

ఆ పళ్ళే లందుకోడానికి మొదటి అధికారులు వేదాలు నేర్చి యజ్ఞయాగాలు చేసినవారు.

యజ్ఞయాగాలు చేసినవారికి "ఆహితాగ్నులు" అని వ్యవహారం.

విద్వదాహితాగ్నుల తరవాత చదువుసంధ్యలు లేని ఆహితాగ్నులదీ, వారి తరవాత వేదార్థవేత్తలదీ, వారి తరవాత వేదపాఠకులదీ, వారి తరవాత శాస్త్రాలు నేర్చినవారిదిన్నీ ఆ అధికారం.

ఆ పళ్ళేలందుకుని ఘన, జట, క్రమం - ఇత్యాది విభాగాలతో వేదమంత్రాలు - కాలికాలయిన పనసలు చెప్పి వారు వధూవరుల నాశీర్వదిస్తారు.

శాస్త్రవేత్తలున్నూ యిలాంటి సందర్భాలకోసం కొన్ని పనసలు వల్లించుకుని వుంటారు.

అలా ఆశీర్వదించిన వారిని - అంటే పళ్ళేలు చెప్పినవారిని వరపక్షంవారు, శాలువలు - కాసులు - వరహాలు - జామార్లు - ఇలాంటి కాన్కలతో సత్కరిస్తారు.

ఏ చదువూ - అంటే యే వైదికవిద్యా రానివారికి దొడ్డి సంభావన.

బ్రాహ్మలుగదా - తీరా వచ్చారుగదా - ఎంతోకొంత ఖర్చుపెడుతూనే వున్నాంగదా - నోటితో లేదనడం యెందుకూ అన్న ఉదారబుద్ధితో యిస్తా రిది సంపన్నులు.

ఆదిలో, అప్పుడప్పుడే విద్యాభ్యాసం ప్రారంభించివుండిన - గుర్తించతగ్గ వొక అంతస్థుకి రాని బ్రాహ్మణబాలురకోసం వుద్దిష్టం యీ దొడ్డిసంభావన.

కాని, యిప్పుడు ఈ దొడ్డిసంభావన పుచ్చుకుంటున్నవారిలో బహు కొద్దిమంది మాత్రమే యిందు కర్హులుగా వున్నారు.

అనర్హుల కివ్వడం సదస్యం వుద్దేశానికే ప్రతికూలం.

వెనకటికి, సదస్యం జరిగించేవారు కవులనూ సత్కరించేవారు.

అందుకోసం యేర్పడ్డదే "కవిత్వప్పళ్ళెం."

వేదవేదాంగవేత్తల కందించినట్టు కాక, పురోహితుడు, కవుల నాహ్వానిస్తూ అక్షతల పళ్ళెం వొకచోట వుంచుతాడు, సభలో.

అప్పు డాసభలో వున్న కవులు "ఆ పళ్ళెం అందుకునే అర్హత నాకే వుందంటే, నాకే వుం" దంటూ యెగబడతా రెవరికివారే.

ఆశుకవిత్వం, చిత్రకవిత్వం, బంధకవిత్వం, సమస్యాపూరణం, నిర్దిష్టాక్షరి, చర్చ - ముఖ్యంగా బుకాయింపు - ఇలాంటి విధానాలతో కవుల కక్కడ తారతమ్యపరీక్ష

అందులో నెగ్గినవా రందుకునేవా రాపళ్లెం, భూరిసంభావనతో పాటు.

వీగిపోయినవారికీ జరిగే దీసత్కారం, విజేతల కిచ్చినదానికంటే, కొంచెం తక్కువగా.

ఇందులో, కవిత్వం విషయమై సరైన జ్ఞానం లేకపోడం స్పష్టంగానే కనపడుతోంది; కాని రానురాను, కవులకు, ఆమాత్రపు సత్కారమున్నూ అంతరించిపోయింది.

ఇలాగ కవిత్వప్పళ్ళేల పద్ధతి అప్పుడు వెనకబడితే, సదస్యం పద్ధతే యిప్పుడు వెనకబడిపోతోంది, అనవసర వ్యయం అన్న నిర్ధారణతో.

జాతికీ, జాతీయ సంస్కారానికీ పతనం కాని అభ్యుదయం కా దిది.

ఈ సదస్యం యేర్పాటు, వేదవేదాంగాదివిద్యల నాదరించడానికీ, ఆరాధించడానికీ, పోషించడానికిన్నీ గాని, ఏదో విధంగా కొంతడబ్బు ముట్టజెప్పి బ్రాహ్మలను మేపడానిక్కాదు.

క్రిష్టియనుల్లోనూ, ముస్లిముల్లోనూ తమతమ వేదవేదాంగాలు నేర్చినవారిలో కొందరికి ప్రభుత్వమే భృతు లిస్తుంది.

తక్కినవారు ఏదో వొక లౌకికవృత్తి అవలంబించుకుంటారు బతుకు దెరువుకోసం.

మనలో బ్రాహ్మలకు వృత్తులు నిషిద్ధాలు.

వేదవేదాంగాలు నేర్చినవారు చాలా నిర్లిప్తులయివుండాలి.

పఠనపాఠనాలకే అంకితాలు కావాలి వారి జీవితాలు.

శ్రౌతస్మార్తకర్మలున్నూ అవశ్యమూ నిర్వర్తించుకుంటూ వుండాలి వారు.

ఉత్తమోత్తములైన ఆచార్యదేవులు కావడానికీ, వారివల్ల విద్యలు వ్యాపించడానికిన్నీ వారికీ నియమనిషేధాలు.

బాగానే వుంది, మరి, బువ్వ?

ప్రభువులు పూచీపడివుండేవా రందుకు, వెనకటికి.

అందుకోసం పుట్టినవే అగ్రహారాలు.

వృత్తులూ మాన్యాలూ కూడా అందుకోసమే.

రాజ్యాలు చేతులు మారినా అగ్రహారాలూ వృత్తులూ మాన్యాలూ నిరాటంకంగా భుక్తపడుతూనే వుండేవి పండితులైనవారికి.

కొత్తగా వచ్చిన రాజులు వెనకటి రాజులిచ్చిన అగ్రహారాదికాలు వెంటవెంటనే ధ్రువపరిచేవారు, మొదటిపనిగా.

తమ రాజ్యంలో కొత్తపండితులు బయలుదేరితే, వారిని తమ ఆస్థానానికి రప్పించుకుని — కోరి వారే వస్తే సాదరంగా దర్శనం యిచ్చి వారి సత్తా ననుసరించి సత్కరిస్తూనే వుండేవా రప్పటి రాజు లెప్పటికప్పుడు.

కనీసం వార్షికాలయినా యిచ్చేవారు.

వేదవేదాంగాలకే గాదు, సకల విద్యలకూ వారిలా రక్షణ కల్పించేవారు.

విద్వాంసులను పోషించి, విద్యలు వ్యాపింపచెయ్యవలసిన భారం వహించడమే గాని, విద్యావిధానం అంటూ వొక కొత్తపద్ధతి యేర్పరిచి విద్యలను తమ యిష్టానిష్టాలకు పాల్పరుచుకునేవారు కారు వారు.

ప్రాథమిక విద్య — అంటే బడిచదువున్నూ వారిలాగే వ్యాపింపచేసేవారు, ఉపాధ్యాయులకు వార్షికాలిస్తూ.

అంచేత, జ్ఞానమూ, దానికి సాయం బోధనాశక్తీ, వీటికి తోడు అభిరుచీ వుండినవారే ఉపాధ్యాయులవృత్తి అవలంబించే వా రప్పుడు.

విద్య లీవిధంగా వర్ధిల్లేవి నిష్కంటకంగా, దేశంలో.

అగ్రహారం అంటే, అటు ఋషివాటికా, యిటు విద్యాపీఠమున్నూ.

అగ్రహారీకులకే కులపతులన్న బిరుదు.

దేహీ అంటూ వచ్చిన ద్విజయువకులకు అన్నమూ బట్టాయిచ్చి విద్యలు నేర్పి స్నాతకులను చెయ్యడమే ఆ కులపతుల బాధ్యత.

ఈ విశేషం గుర్తించి, తన అంతస్థు ననుసరించి జనసామాన్యమున్నూ తన బాధ్యతగా వేదవేదాంగాది విద్యావేత్తల నాదరించేది, శుభకార్యాల్లో సదస్యం మొదలైన సందర్భాలు కల్పించి.

కాలం వెళ్ళబుచ్చుకోడాని కెంతో కొంత డబ్బు దొరకడమూ, వేత్త అన్న గౌరవాదరాలు పుట్టడమూ – ఇవీ సదస్యాలవల్ల విద్వాంసులకు కలిగే మేళ్ళు.

వేత్తల సత్తా కూడా నిర్ధారణ అయేది, మార్కుల పద్ధతి అక్కరలేకుండా యీ సదస్యాలవల్ల.

ఇవికాక, దేవతలకు సంబంధించిన కల్యాణమహోత్సవాలు కూడా విద్వాంసుల నాదరించేవి, కాన్కలిచ్చి.

శివరాత్రి మహాపర్వపుణ్యకాలాన పట్టిసంకొండమీద గొప్ప ఉత్సవం జరిగేది.

కోటిపల్లిలోనూ జరుగుతుం దావేళ అలాంటి మహోత్సవం.

కాని, కోటిపల్లిలో లేనిదీ, పట్టిసంలో వుండేది వేదపాఠకుల సమావేశం.

ఆవేళ ఆ సమావేశం నడిపేవారు మా మునికొడవలి వేగేశ్వరపురం విద్వాంసులు.

ఆవేళ వేదపాఠకులు ముఠాముఠాలుగా స్వస్తి చెప్పేవారు, ఉపవాసదీక్షతో.

ఇందుకోసం దూరప్రదేశాలనుంచి కూడా వచ్చేవారు వారు.

వారిలో, అప్పుడప్పుడే విద్య పూర్తయినవారిది ముందంజ.

వారి సత్తా అక్కడే నిర్ధారణ అయేది.

"గట్టివాడు" అన్న బిరుదమున్నూ అక్కడే వచ్చేది.

అప్పు డక్కడ "అవు" ననిపించుకున్నవారి విద్వత్తు ఆ మాఘాదిపంచంకంలోనే దేశం అంతటా గుర్తించబడేది.

ఇప్పటివారు ఈ బాధ్యత వహించలేకపోడమే కాదు, నిరసించే స్థితికిన్నీ దిగిపోయారు, నాగరకత పేరుతో.

కారణం పరవిద్యలు చేర్చి తన్మూలంగా స్వస్వరూపజ్ఞానం పోగొట్టుకోడం.

అయినా, అక్కడా అక్కడా, సరసులైన సంపన్నులు కొందరు సదస్యాలు జరిగించి విద్వాంసులను సత్కరిస్తూ విద్యలు నిలుపుతూనే వున్నారు.

విద్వాంసుల నాదరించవలసిన బాధ్యత వివాహమహోత్సవాలలో వరపక్షంవారిది మాత్రమే కాదు, కన్యాదాతలదిన్నీ.

అయితే, వరపక్షంవారికి గల అవకాశం సదస్యం అయితే, కన్యాదాతలకు గల అవకాశం కన్యాదానసమయం.

అంచేత, విద్వాంసులు, కన్యాదాత ఆహ్వానంతో సుముహూర్త సమయానికి వచ్చి వరపక్షంవారి ఆహ్వానంతో సదస్యం జరిగేదాకా వుండిపోయేవారు.

ఆ విద్వాంసుల రాకతోనూ, వునికితోనూ ఆ మహోత్సవాలకు విశిష్టశోభ వచ్చేది.

కన్యాదాత చేసే అన్నదానం ఇలాగ విద్వాంసులకు వినియోగపడి సఫలం అయేది.

విద్వాంసులున్నూ ఆ మూడుదినాలూ చర్చలు సాగిస్తూ శాస్త్రార్థాలు చేస్తూ, స్వస్తి చెబుతూ వుండేవారు.

దీనితో ఆ మహోత్సవాలకు విశిష్టశోభ వచ్చేది.

ఎక్కడెక్కడి పల్లెటూళ్ళవారికీ గూడా గొప్పగొప్ప పండితుల దర్శనభాగ్యం పట్టేదీరూపంగా.

ఆ పండితుల శిష్యులకు విద్యాస్పర్థ ఎక్కువ అయేది, భిన్న స్థలాల విద్యార్థుల సమాయోగంతో.

యోగ్యుడైనవాడికి "పైకి వస్తున్నా" డన్న ఖ్యాతి ప్రారంభం అయేది, విద్యార్థిదశలోనే అప్రయత్నంగా.

ఊరి యువకులకున్నూ విద్యలయెడల శ్రద్ధాసక్తులు పుట్టడమే కాదు, ఏ విద్యకోసం యెక్కడికి వెళ్ళాలో, యెవరి నాశ్రయించాలో తెలిసిపోయేది.

భుజంగరావు పంతులుగారు వైదిక విద్యల నాదరించకపోలేదు; గాని తమ శ్రద్ధాసక్తులు కవుల యెడల యెక్కువగా కనబరిచేవారు.

కూచిపూడి భాగవతులనున్నూ ఆహ్వానించేవారు వారు.

కూచిపూడి వారి విద్వత్తు సంప్రదాయసిద్ధమూ సర్వతోముఖమూ అన్న విషయం అక్కడే అవగాహన అయింది, నాకు మొదట.

భుజంగరావు పంతులుగారు జమీందారు మాత్రమే కారు, సరసులు.

సరసులు మాత్రమే కారు, మహోదారులు.

మహోదారులున్నూ మాత్రమే కారు, పండితులు.

పండితులు మాత్రమున్నే కారు, కవులు.

శొంఠి భద్రాద్రిరామశాస్త్రిగారు ఆస్థానపండితులూ, ఆస్థాన కవులూ, కవితాగురువులున్నూ వారికి.

నేను రాసిన వారకాంత అనే నాటకం, "వారకాంత" అనే ఆ భుజంగరావు పంతులుగారి చాటు ప్రబంధకథ ననుసరించినదే.

పుంజీలమీదా, పదులమీదా మాత్రమే కాదు, వందలమీద వచ్చేవారు, వారు జరిగించిన వివాహమహోత్సవాలకు కవులు.

వారిలో వేదం వేంకటరాయశాస్త్రిగారూ, వడ్డాది సుబ్బారాయుడుగారూ వంటివారితోపాటు అప్పు డప్పుడే పద్యబంధం ప్రారంభించినవారిదాకా, అన్ని అంతస్థులవారూ వుండేవారు.

వచ్చినవారి నందరినీ రాకపోకల ఖర్చులిచ్చి శాలువులతో సత్కరించేవారు భుజంగరావుపంతులుగారు.

శాలువులంటే అచ్చంగా అవి శాలువులే, కద్దరు దుప్పట్లూ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పరిభాష ననుసరించి వడియాల గుడ్డలూ కావు.

అలాంటి సరసులు పూనుకోడంవల్ల విశ్వసుందరరావుగారి వివాహం సందర్భంలోనూ చాలా ఘనంగా జరిగింది కవి సమ్మేళనం.

ఆ సందర్భంలోనే చూశాను, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి న్నేను.

దూరంగా చూడ్డంమట్టుకే జరిగింది, వారి దర్శనం చేసుకుని సావకాశంగా మాట్లాడ్డం పడలేదు నాకు.

కాని, అనేకలు చెప్పా రెన్నోమాట్లు, వేంకటశాస్త్రిగారి దగ్గిర పారుష్యం యెక్కువ అని.

రవంతలో దాటిపోయింది; గాని నారాయణదాసుగారికీ వేంకటశాస్త్రిగారికీ ఆ సమ్మేళనంలో ప్రారంభమే అయింది రగడ.

## 64

"చెప్పకుండా వుండలే" నన్నానే, ఆ రెండో సంగతి వివరణ యిదిగో, యిక్కడ.

ఉదయం పది కాకుండా పోల్నాటిసీమకు చెంది బూరుగుపూడి గ్రామంలో భోజనంచేసి, జగ్గంపేట మీదుగా సామర్లకోట చేరుకుని, రెయిలెక్కి మూడుగంటలకు రాజమండ్రీ చేరుకున్నా నావేళ నేను.

బూరుగుపూడిలో జంధ్యాల సూర్యనారాయణశాస్త్రిగా రని మంచి సాహిత్యప రులూ, వితరణశీలురున్నూ.

మంచి స్థితిపరులు.

ఆ ప్రాంతాన వారి పలుకుబడిన్నీ అసాధారణం.

పండితుల కెందరికో మంచిమంచి వార్షికాలిచ్చేవా రాయన.

వారి ఆ వదాన్యతవల్లనే ఆ ప్రాంతాల బూరుగుపూడికి మన్నన.

నే నిలా వెళ్ళాను, వైయాకరణులు వేదుల సూర్యనారాయణశాస్త్రిగా రలా వచ్చారు, వార్షికంకోసం, అక్కడికి.

వారు చాలాకాలంగా వస్తున్నవారే, నేనే కొత్త.

అప్పటి కయిదారు మాసాలకు పూర్వమే నాకూ సూర్యనారాయణశాస్త్రిగారికీ మొదటి పరిచయం, రాజమహేంద్రవరంలో.

సమయం నిర్దేశించి వారు రమ్మనడంవల్లనే నే నప్పుడక్కడికి వెళ్లాను.

చెరుకుగానుగుల రోజులవి.

భూములమీది రాబడి వారిచేతికందే సమయం.

నన్నూ వేదులవారినీ రెండురోజు లాపేశారు వా రక్కడ.

రాత్రి భోజనాల క్కూచున్నాం, "మీ అష్టావధాన ప్రక్రియ చూడాలండీ" అన్నారు, సూర్యనారాయణశాస్త్రిగారు హఠాత్తుగా.

"పూర్తిగా అక్కర్లేదు. వ్యస్తాక్షరి చూడాలని యెన్నాళ్లనుంచో సరదా. నాలుగుపద్యాలు కూడా చెప్పండి, చాలు" నన్నారు వారు.

"నుంచున్న పాళంగా" రమ్మని వూళ్లో పదిమందికీ వర్తమానం కూడా పంపేశారు.

రమారమీ పాతికమందితో అరుగు కిటకిటలాడిపోయింది.

వ్యస్తాక్షరి ఇవ్వడానికి వేదులవారు కూచున్నారు.

"వంచు, చంచు, తంచు, త్వంచు, మ్రుంచు, మ్లుంచు, మ్రుచు, మ్లుచు – గత్యర్థాః" అన్న వ్యాకరణసూత్రం యిచ్చారు వారు విడతీసి.

ఆడుతూపాడుతూ చెప్పేశాను పద్యాలు, వ్యస్తాక్షరే కొంచెం తికమక లాడించింది.

ప్రతీ వొక అక్షరంతరవాతా "చు" అన్న అక్షరం రావడమే అందు క్కారణం.

"కష్టపెట్టాలనే యిచ్చా నిది. ఇవ్వడం మొదలుపెట్టాక చాలా పరితపించాను" అన్నారు వా-్ఠరంతా పూర్తయాక "సెబాస్" అంటూ వీపు తట్టి.

వేదులవారికి పాతికరూపాయలు పెట్టి బరంపురం తాపితా కొని యిచ్చి, పాతికా నాకు రొక్కమే యిచ్చారు సూర్యనారాయణశాస్త్రిగారు.

ఊరివారు అష్టావధానం ముగిసిన వొకగంటకి మరో పాతిక తెచ్చియిచ్చారు, చందాలు వేసుకుని.

చూసి నేను మనసుపడగా, నిలువుపాడుగున్న పాలకఱ్ఱ కూడా ఇచ్చారు సూర్యనారాయణశాస్త్రిగారు నాకు.

నా చేతిలోనే వుందది ఆ సమయాన.

బజారుపని ముగించుకుని మళ్ళీ యేడుగంటల రెయిల్లో బయలుదేరి అనపర్తిలో దిగి, తొమ్మిదింటికి మహేంద్రవాడ వెళ్ళే ప్రయత్నంలో వున్నా న్నేను.

అంచేత రాజమండ్రీ స్టేషన్నుంచి మిక్కిలీ వడిగా వెడుతున్నాను, బజారుకేసి.

తాలూకా ఆఫీసు దాటాను, "నమస్కారం సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ, నుంచోవా లొక్కక్షణం" అంటూ యెవరో పిలిచారు నన్ను.

చూడగా, పందిరివారి అరుగుదిగి యెవరో వస్తున్నారు నాకేసి.

"నన్ను మీ రెరగరు. మిమ్మల్ని నే నెరుగుదును. నా పేరు శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి" అంటూ దగ్గిరికే వచ్చా రింతలో వారు.

"మూనేపల్లి కంపెనీహాలు (పక్కనే వుంది)లో మైలవరం నాటక సమాజంవా రివాళ నా సావిత్రి ఆడుతున్నారు. ఉండి మీరు చూసి వెళ్ళా" లన్నారు సచ్చిదానంద శాస్త్రిగారు.

నా పనితొందర విన్నవించి క్షమించమంటున్నా న్నేను.

"మీరేనా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగా రంటే?" అంటూ మరో కంఠం వినవచ్చిందింతలో నాకు.

చూడగా, ఎఱ్ఱశాలువు బుజాన వేసుకునివున్నవా రెవరో వస్తున్నారు నాకేసి.

"నేను చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిని లెండి" అంటూ దగ్గిరకే వచ్చారు వా రింతలో.

"నమస్కారం" అన్నా న్నేను.

ఆశీర్వదించలేదు సరిగదా, తిట్లకు లంకించుకున్నారు వేంకటశాస్త్రిగారు.

తెల్లపోయా న్నేను.

ఇంతలో చాలామంది చేరా రక్కడ.

అటూ యిటూ రోడ్డే వెళ్ళేవారున్నూ ఆగిపోయారు.

అలా తిడుతూనే వున్నారు వేంకటశాస్త్రిగారు, మరో మాట లేదు.

ఇక లాభం లేదని నేనూ ప్రారంభించాను, తిట్టుకుతిట్టు.

"నా పుస్తకాలు విమర్శిస్తావా?" అని వారి దబాయింపు.

"ఆకాశంనుంచి వూడిపడ్డాయా నీ పుస్తకాలు, మహా?" అంటూ నా బుకాయింపు.

"సభ చేయిస్తాను వస్తావా?" అనడిగా రాయన.

"మగతనం వుంటే చెయ్యవలసిన పని అదీ. ఈ తిట్లేవిటి క్షుద్రజాతి మనిషిలాగ?" అని బదులడిగా న్నేను.

"ఊరుకోం దూరుకోం"డంటూనే వున్నారు చేరినవారిద్దర్నీ, "ఇదేమిటో చూశావా?" అంటూ కాలెత్తి చెప్పు చూపించారు వేంకటశాస్త్రిగారు.

ఎడమకాలి చెప్పు లాగే మాట్లాడా న్నేను "సరదాగా వుంటే రా" అంటూ.

అప్పటిదాకా చూస్తూ వింటూ వద్దువద్దంటున్న వారల్లా అక్కడ మూగివుండిన వారిలో కొందరాయ న్నటూ, మరికొందరు న న్నిటూ లాగేశారు "తప్పు త" ప్పంటూ.

అయినా మేము తిట్లు మానుకోలేదు.

ఇదంతా వీరేశలింగం పంతులుగారి శిలా విగ్రహానికి కొంచెం దక్షిణంగా జరిగింది.

నేను బజారుకేసి నడక ప్రారంభించేటప్పటికి పేరుపెట్టి నన్ను పిలిచా రెవరో మళ్ళీ.

వెనక్కి తిరిగి చూడగా అరవ ఆదినారాయణమూర్తిగారు సమీపించా "రేమిటీ అఘాయిత్యం?" అనడుగుతూ.

"మీరేం చూశా" రనడిగా న్నేను.

"కాలెత్తి ఆయన చెప్పు చూపించారు, ఎడమకాలు చెప్పు దూసే మాట్లా డుతున్నారు మీరు. అప్పుడే వచ్చా న్నేను స్టేషన్నుంచి అక్కడికి" అన్నా రాదినారాయణమూర్తిగారు.

పేరుపడ్డ స్టేషనరీషాపు వారిది రాజమండ్రీలో.

బహు సౌమ్యు లాయన.

గుప్తదానాలు చేసేవా రాయన తరుచు.

"ఇవ్వా ఇప్పించగల" మహోదారు లాయన.

శృంఖల చదివేవున్నా రప్పటికే ఆయన.

నే నేపుస్తకం ప్రకటించినా రాజమండ్రీలో వారికిన్నీ వొకటివ్వడం నా కలవాటు. సాధారణంగా పదేసి రూపాయ లిచ్చేవారు నా కాయన.

"అదిగో, నే నా శృంఖల రాశానని వారి కీవుడుకు మోత్తనం" అన్నా న్నేను.

"అయితే? ఇదా పండితలక్షణం?" అనడిగా రాదినారాయణగారు.

ఈ సంగతే మాట్లాడుకుంటూ మేము వారిషాపు చేరుకున్నాం.

## 65

ఆ రాత్రంతా "ఏమిటిదీ?" అన్న అబ్బురపాటే నాకు.

సుమారు నలభై సంవత్సరాల కిందటి మాట అది.

అరవైకి అటో యిటో వేంకటశాస్త్రిగారి వయస్సూ ముప్పయికి లోపు నా వయస్సూను.

ఇద్దరమూ బజారుమనుష్యులం అయిపోయాం ఆ క్షణాన.

ఇదీ నా కించ.

అనేకు లనేకుల పుస్తకాలు విమర్శించడం నే నెరుగుదును; కాని యెక్కడా యిలాంటిది చూడలేదు.

రాజమండ్రీలోనే వుండేవా రన్యోన్యమూ ఖండనమండనలు చేసుకుంటూ వుండే పండితులు.

ఆ బాప తిప్పటికీ వున్నారు.

వా రందరూ కటుభాషే వాడుకుని వున్నారు, తమ ఖండన మండనల్లో, తక్కువ చెయ్యలేదు.

ఏదోవిధంగా వొకచోట చేరుకుంటూనూ వుండినారు వా రప్పుడప్పుడు.

కాని, యిలా మాట్లాడుకోడం యెరగ రెప్పుడూ.

పోనీ, వెంకటశాస్త్రిగా రేమి బాముకున్నారు దీనివల్ల?

అసలే బ్రాహ్మణ్యమూ?

ఆపైని పాండిత్యమూ?

దానికి తోడు కవిత్వమూ?

అన్నిటినీ మించి వయోవృద్ధత్వమున్నా?

ఏమయిపోయిన ట్టివన్నీ?

తిరుపతి శాస్త్రిగారికీ వేంకటశాస్త్రిగారికీ పోలిక యెక్కడ?

పదిపద్దెనిమిది సంవత్సరాలపాటు ఆ సన్నివేశం యెలా సమకూడిందో నా కవగాహన కాలేదు.

ఉండగా వుండగా, వొకనాడు సచ్చిదానందశాస్త్రిగారే చెప్పారు మద్రాసులో, కలిసి ట్రాములో ప్రయాణం చేస్తూ.

రాయపేట మిడ్లాండు థియేటరులో నాటకకళాపరిషద్వార్షికోత్సవం జరుగుతోం దప్పుడు, "నభూతో నభవిష్యతి"గా.

శ్రీ నీలంరాజు వేంకటశేషయ్యగారూ గూడవల్లి రామబ్రహ్మంగారూ జరిగిస్తున్నారు.

నటులు సరే, కవులూ పండితులూ కూడా వచ్చారు చాలామంది, దేశం నాలుగుమూలలనుంచీ.

ఇప్పటిలా కాదప్పుడు, కవులకూ పండితులకూ గూడా ఆహ్వానాలు ఆదరణా వుండేవి.

ఇప్పుడది పూర్తిగా రాజకీయాల్లోకి దిగిపోయింది.

జనులకు, దృఢమైన కళాప్రీతీ, గంభీరమైన కళాపరిజ్ఞానమూ, నిశితమైన రసగ్రహణశక్తీ, మంచి సభ్యతా అలవడేదాకా యెక్కడా కూడా, యెలాంటివాటిల్లోనూ కూడా ఇలాంటి అసందర్భాలు జరుగుతూనే వుంటాయి.

డాక్టరు శ్రీ గోవిందరాజుల సుబ్బారావుగా రా సమావేశాని కధ్యక్షులు.

ఆవేళ (?) శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వేనరాజు నాటకప్రదర్శనం జరిగింది.

ఉదయం యెనిమిదయింది, సభాభవనానికి వెడుతున్నాం ట్రాములో.

మళ్ళీ అదే కలుసుకోడం శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారూ నేనూ.

అక్కడ సమావేశం అయి వుండినవారికి తమకూ రామకృష్ణకవులకూగల వివాద విషయమే చెబుతున్నారుట వేంకటశాస్త్రిగారు, ఆవాళ, రాజమండ్రీలో.

శృంఖల ప్రసక్తి కూడా వచ్చిందిట, ఆ సందర్భంలో.

సరిగా ఆ క్షణానే నేను కనపడ్డానుట రోడ్డుమీద.

"అరుగో సుబ్రహ్మణ్యశాస్త్రిగా" రన్నారుట కూడా యెవరో.

'నువ్వు వెళ్ళి ఆయన్ని నిలుపుచెయ్యి. ఇంతలో నేనూ వస్తాను' అంటూ తరిమారు శాస్త్రిగారు నన్ను. శాస్త్రిగారు వచ్చేదాకా మిమ్మల్ని ఆపడానికే నా నాటక ప్రస్తావన. అయితే ఘర్షణ జరగవచ్చు ననుకున్నాను; గాని శాస్త్రిగా రంత తొందరపడతా రనుకోలేదు నే" నంటూ వివరాలున్నూ చెప్పారు సచ్చిదానందశాస్త్రిగారు.

దీన్నిబట్టి శృంఖల కారణంగా వేంకటశాస్త్రిగారి మానసిక వ్యవస్థ యెలా తయారయిందో సులభంగానే గ్రహించుకోవచ్చు, ఎవరైనా.

అయితే, పని విమర్శిస్తా న్నేను, కర్తను ద్వేషించను.

మొదణ్ణుంచీ నా నియమం యిది.

వేంకటశాస్త్రిగారికీ నాకూ వున్న భేదం యిది.

శృంఖలలో నేను కటుభాషే వాడాను.

దాని క్కారణం వేంకటశాస్త్రిగారి ఉత్తరం.

శృంఖల వస్తోందని కరపత్రం ప్రకటించా న్నేను.

అది చూసి నన్ను దూషిస్తూ వుత్తరం రాశా రాయన.

అప్పటికి చిత్తుమాత్రం తయారయింది శృంఖల.

పాణిగృహీతా శ్రవణానందమూ కూడా దోషబహుళాలే; కాని అక్కడక్కడ చక్కని పద్యాలు లేకపోలేదు.

అవి సవివరంగా చూపించివున్నాను చిత్తులో నేను.

తూలుమాటలు లేనే లేవు చిత్తులో.

వారి జాబువచ్చాక ఉద్రిక్తుణ్ణయి మంచి తీసేశాను.

హేళన మాటలు చేర్చాను.

పుస్తకం ప్రకటించేశాను.

అయితే, అలాంటి కటుభాష వాడవలసివచ్చినందుకే గాని శృంఖల రచించినందు కిప్పటికీ నాకేమీ కించలేదు.

ఇది జరిగిన కొద్దిదినాలకే తిరుపతిశాస్త్రిగారు తారసపడ్డారు సామర్లకోట రెయిల్వేప్లాటుఫారంమీద.

నేను వారిని చూడలేదు, వారే పిలిచారు నన్ను.

రాజమంద్రీ బజారుసంగతిన్నీ వారే కదిపారు.

జరిగింది జరిగినట్టు చెప్పా న్నేను.

"విన్నాను. ఇది యిలా జరక్కుండావుంటే బాగుండేది" అన్నారు వారు.

"మీ మిథునానురాగం చదివాను. వీరపూజా చదివాను. రచనలో రెండింటికీ వున్న తారతమ్యమూ గుర్తించాను. అయితే, చక్కగా అలాంటి గ్రంథాలు రాయక యిలాంటి విమర్శ లెందుకూ మీ"కనడిగారు వారు.

గళహస్తిక ప్రస్తావన కూడా వచ్చిం దప్పుడు.

అప్పటికి సామర్లకోట స్టేషనులో వొకటే ప్లాటుఫారం.

గార్డులు పచ్చజెండాలు చూపించగా వారు వెళ్ళి కాకినాడ డూప్లికే టెక్కారు, నేను పిఠాపురం వెళ్ళాను.

విని విని "జరిగిన మర్నాడే తెలిసింది నాకు. ఆ బజారు వృత్తాంతం మీకే జయపతాక" అంటూ ప్రారంభించారు రామకృష్ణశాస్త్రిగారు.

"పాణిగృహీతా శ్రవణానందశృంఖల మేమే రాసి మీపేరు పెట్టామనుకుంటున్న వేంకటశాస్త్రిగారు, మరి, దానికెందుకు బదులు రాశారూ? అథవా – తమ కలవాటేగదా – శిష్యులపేరుగా యెందుకు ప్రకటించకపోవాలీ తృణీకరణం? తృణీకరణప్రకటనతో గూడా వేంకటశాస్త్రిగారి బాధ తీరలేదంటే, శృంఖల యిప్పటికీ వారికి హృదయశల్యంగానే వుందని స్పష్టం కావడం లేదూ? కలియబడితే యెవరు గెలుస్తారనేది మూర్ఖుల ఆకాంక్ష . సాహిత్యపర మైన వివాద వచ్చినప్పుడు కవి అయినవా డిలాగేనా ప్రవర్తించవలసింది?" అనడిగారు వారు.

"గళహస్తిక నేను చింపెయ్యడంలో యెంత ఔచిత్యం వుందో యిప్పుడు మీకు బాగా తెలిసివుంటుంది. శృంఖలా తృణీకరణం అసమగ్రమే కా దసమర్థమున్నూ. శృంఖలే యింకా నిలిచివుంది 'ఏమి చెబుతా'వంటూ నిలవతీస్తూ, కనపడుతోందా?" అనిన్నీ అడిగారు వారు.

వేంకటశాస్త్రిగారున్నూ యీ మాటే చెప్పారు.

## 66

"పని విమర్శిస్తాను, కర్తను ద్వేషించ" నన్నాను.

"నా నియమాల్లో ఇదొకటి" అని కూడా చెప్పివున్నాను.

రసికులైనవారు గాని యిందులో వుండుకున్న ఔచిత్యం గుర్తించలేరు.

ఉపాధిభేదంతోనే వచ్చేస్తుంది రుచిభేదం.

నా రుచి నాది.

అలాగే యెవరి రుచి వారిది.

రుచిని బట్టి దృక్పథమూ, దృక్పథం అనుసరించి పనీని.

అయితే, యే దయినా వొక పని చెయ్యడానికి మనిషి యెంత స్వతంత్రుడో అంత అస్వతంత్రుడు.

తన వొక్కనితోనే లేదు ప్రపంచం, మరి.

తనవంటి అనేకులతో కలిసి బతకాలి తాను.

అంటే, యెలాంటివాడూ కూడా తన రుచి కొంత నిగ్రహించుకోవాలి, తప్పనిసరిగా.

మహామహా చక్రవర్తుల క్కూడా మినహాయింపు లేదిక్కడ.

ఈ నిగ్రహం పనిలో కనపడాలి, ముఖ్యంగా.

కనపడకపోతే, ప్రతిఘటన వస్తుం దన్నివైపులనుంచీ.

అలాంటి పరిస్థితు లేర్పడకుండా చూసుకోడం వివేకం.

ఇలాంటి వివేకంతో పనిచేసేవాడు అసాధారణశక్తి కలవాడయి వుంటాడు.

ఆ శక్తి, ఆ మనిషిచేత, మన కిష్టమైన పనులూ చేయిస్తుంది, పర్యాయత్వేనా.

దాంతో మనమున్నూ మెచ్చుకోవలసివస్తుం దతణ్ణి.

ప్రకృతి ధర్మం యిది.

అసూయ, అసహనం వంటి దుష్టప్రవృత్తులు అణచిపెట్టవచ్చు; గాని అసలే ఆ మెప్పు కలక్కుండా చెయ్యలేవు.

మెప్పు కలగడమూ – అయినా సహించలేక అది అణచుకోడమూ – ఇది తటస్థించినప్పుడు నిజంగా మరణవేదన అనుభవిస్తాడు మనిషి.

కనక, వ్యక్తిని ద్వేషించడం దౌర్జన్యం.

తనకే అభ్యుదయం కావాలనుకునే స్వార్థపరుడైనా హృదయం విశుద్ధంగా వుంచుకోడం చాలామంచిది.

నా నియమాని కీవివరణ చాలు.

పోతే, – వేంకటశాస్త్రిగారి పాణిగృహీతా శ్రవణానందమూ కూడా ఉత్తమ వాఙ్మయంలో చేరవు.

అయినా, వారి దగ్గిర మంచిశక్తులు కొన్ని వున్నాయి.

అవి జనులను మెప్పించాయి.

ఆ జనుల్లో నే నొకణ్ణి.

వైదికాచార పరతంత్రులయి వుంటారన్న అపోహ లేకపోయి వుంటే, వారిదగ్గిరకే వెళ్ళివుండేవాణ్ణి గదా నేను, చదువుకోడానికి?

కాగా, – రాజమండ్రీ బజారుసంఘటన నాక్కాదు లజ్జాకరం

వేంకటశాస్త్రిగా రంటే నాకు ద్వేషభావం లేదు.

అంచేత, వారికి సంబంధించిన అభ్యుదయ వార్తలు వినడం నాకెంతో యిష్టం.

అలాంటి వార్త పత్రికల్లో కనపడింది నా కొకటి.

వేంకటశాస్త్రిగారు యథాకాలాన, తమ ఆంధ్రోపాధ్యాయత్వం విరమించుకున్నారు.

బందరు విడిచి కడియం ప్రవేశించబోతున్నారు, వారు.

అందరు జనులతోనూ రానిది, వారి ఉనికితో, బందరు పట్నానికి నూత్నశోభ వచ్చింది.

అది గుర్తించుకుని, బందరు పౌరులు, ఆ సందర్భంలో వారిని సన్మానించ బూనుకున్నారు.

ఇదీ ఆ వార్త.

అప్పుడు నెల్లూరిలో వున్నా న్నేను.

ఆ వార్త నాకు పరమానందకరం అయింది.

అది వ్యాసరూపంగా కృష్ణాపత్రిక కందించా న్నేను.

"కవిపూజ" అని దానికి శీర్షిక.

అయితే, అది ప్రకటించడంలో కృష్ణాపత్రిక సంపాదకులు, ముట్నూరి కృష్ణారావుగారు కొన్ని అసందర్భాలు చేశారు.

మొదటిది:— సంపాదకీయంగా ప్రకటించారు వా రది; కాని నా పేరు తీసేశారు.

రెండోది:— ఒక పేరాలో, వొక వాక్యంలో, "బందరు పౌరులు" అన్నది "మా పురవాసులు" అని మార్చారు, పోనీ అంటే, ఆ పేరాలోనే మరో వాక్యంలో బందరు పౌరులను బందరు పౌరులుగానే వుంచేశారు.

మూడోది:— తమ సొంతరచన చివర వొక పేరా చేర్చారు.

ఇతరుల రచనల నప్పుడప్పుడు తమ సంపాదకీయాలుగా ప్రకటించుకోడం పత్రికా సంపాదకుల కొక మంచి సంప్రదాయమే, నాకు తెలుసు.

రచయిత కది ప్రశంసావహమే, సందేహం లేదు.

ఈ కృష్ణారావుగారే అంతకి మునుపూ తరవాతా కూడా చేస్తూ వచ్చా రాపని; కాని, నా రచనలో తప్ప మరెందులోనూ రచయిత పేరు తీసివెయ్యలేదు వారు.

"మా పురవాసులు" అంటే వచ్చే ఘనతా, "బందరు పౌరులు" అంటే పోయే ఘనతా యేమీ లేదు; కాని వొకచోట వొకలాగా, మరోచోట మరోలాగా వుంచడంలో మాత్రం అర్థం లేదు.

వారి సొంత రచన చూస్తామా, అది నా రచనకు భిన్న వాక్యాల కూర్పు.

ఇంత చేసిన్నీ కృష్ణారావుగారు "పరప్రత్యయ నేయబుద్ధుల కొరకు విమృష్ట గ్రంథములను సమర్థించుకొనుట తగనిపని. ప్రమాదము లున్నవని తోచినచో దిద్దుకొనవలెను. లేవని ధైర్యమున్నచో నూరకుండవలెను. ప్రత్యుత్తరములు చెప్పబూనినచో అంధ్రభాషయందు – విశేషించి కవిత్వమునందు పూర్వపక్ష సిద్ధాంతముల కంతముండదు" అన్న నా మాట అలాగే వుంచేశారు.

అంధ్రభారతిలో తామే ప్రకటించిన శృంఖలాతృణీకరణానికివి ప్రతికూలాలు.

గళహస్తిక చింపేస్తూ నా గురువులు రామకృష్ణశాస్త్రిగారన్న మాట కనువాదాలివి.

శృంఖలాతృణీకరణ రచన నిరర్థకం అని ఆ మాటల ధ్వని.

ఇది గుర్తించలేదు కృష్ణారావుగారు.

ఈ సంగతులు విస్తరిస్తూనూ, నా పేరు తీసివేసినందు కసమ్మతీ అక్షేపణా తెలుపుతూనూ జాబు రాశా న్నేను; కాని కృష్ణారావుగారు జవాబు రాయలేదు.

"ఏమిటిదీ?" అనడుగుతూ మిత్రుడు మంగిపూడి వేంకట శర్మకూడా కార్డు రాశాడు. దానికీ బదులు రాయలే దాయన.

అందుక్కినిసి వేంకటశర్మ "మొత్తానికి కృష్ణారావుగారు మంచి రచయితలే గాని, చూడగా మొగలాయీల మనస్తత్వం అయనది" అంటూ తన చికాకు చూపించి వూరుకున్నాడు.

## (67)

కవిపూజవంటిదే నా మరో రచన "షష్టిపూర్తి."

చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి యిది.

బందరులో జరిగిం దిది.

చాలా గొప్పగా జరిగిందని వార్తలు.

ఆ సందర్భం పురస్కరించుకునే రాశా న్నేనది.

భారతి మీగడతరకల విభాగంలో పడిం దది.

భారతిలో, మీగడతరక లన్నది, నా రచనల్లో వొక రకమైన వాటికి ప్రత్యేక శీర్షిక.

అంతకిముం దాశీర్షికలో ఇతరుల రచన లొకటో రెండో పడ్డట్టుంది; గాని అప్పుడు భారతి సంపాదకధర్మం నిర్వహిస్తూ వుండిన గన్నవరపు సుబ్బరామయ్యగారు నా రచనలకే కేటాయించారు తరవాత.

నా రచనలు చాలా పడ్డా యీవిభాగంలో, వివిధ శీర్షికలతో.

"శాస్త్రి" అన్న సంతకంతో వుండేవవి.

పాఠకులకు ప్రత్యేకశ్రద్ధ కలిగించడానికీ, జిజ్ఞాస రేపెట్టడానికీ సుబ్బరామయ్యగారే నిర్ధారణ చేశా రీ"పెన్ నేము."

వారి వుద్దేశం నెరవేరింది.

చాలామంది, చదివా రవి దీక్షగా.

ఈ "శాస్త్రి" యెవరో తెలుసుకోవా లని సాహిత్యపరులూ, రచయితలూ, పాఠకులూ కూడా చాలామంది ప్రయత్నించారు, గట్టిగా.

ఎన్నోవిధాల ప్రయత్నించారు, ఎంతో ప్రయత్నించారు.

కొన్నాళ్ళు మల్లాది రామకృష్ణశాస్త్రిగా రనుకున్నా రుట కొందరు.

సుబ్బరామయ్యగారు మిక్కిలీ గాంభీర్యం వహించా రెవరెంతగా అడిగినా.

చివరి వుపాయం వొకటుంది, అప్పటి భారతి సంప్రదాయంలో.

అది తత్పత్రికాధిపతులైన నాగేశ్వరరావుగారిని పట్టుకోడం.

దాంతో ఆ శాస్త్రి నేనని తెలిసిపోయింది, చాలామందికి.

ఆ షష్టిపూర్తి మహోత్సవమున్నూ చాలా బాగా జరిగిం దిట.

చాలా సంతోషించా నందుకు నేను.

నా రచనలో అది నిండుగా కనపడుతుం దెవరికయినా.

"శ్రీ వేంకటశాస్త్రిగారి శక్తిప్రవృత్తులు ఇంత విశదంగా చేసిన శబ్దచిత్రణం మరొకటి లే"దని సుబ్బరామయ్యగారి ప్రశంసావాక్యాలున్నూ వున్నాయి దాల్లో.

అవి యివి, –

"శాస్త్రిగారు సాహిత్యాచార్యులు, ప్రబంధ పరమేశ్వరులు, నాటక ప్రణేతలు, వాదప్రవీణులు, విమర్శకప్రముఖులు, సువక్తలు, హృదయము నుఖ్యాత లూచు 'పాటకులు'–

"ఇట్లు శాస్త్రిగారి తేజస్సు అపారమైనదే; కాని దానికి అట్టిదే క్రీనీడ కూడ నున్నది, –

"శాస్త్రిగారు కలహప్రియులు, పరుషభాషులు, శీఘ్రకోపులు, ధౌర్త్యమునకు వెనుదీయరు, చిత్తు అగుదురు; కాని బుకాయింతురు."

ఇలాంటి సందర్భాల్లో తిరుపతిశాస్త్రిగారికీ, వేంకటశాస్త్రిగారికీ లేశమూ పోలిక లేదు.

ఒకమాటలో చెప్పా లంటే, –

తిరుపతిశాస్త్రిగారిది బహూ సమర్థతా, వేంకటశాస్త్రి గారిది మిక్కిలీ తొందరపాటూనూ,

చాతుర్యం వొక్కటే వేంకటశాస్త్రిగారికి రక్ష.

అయితే, యెక్కడికి వెళ్ళినా, వారి శిష్యులకు తప్ప, తక్కిన సాహిత్యపరులందరికీ వేంకటశాస్త్రిగా రంటే వైముఖ్యమే.

వారి జీవితం అంతటిలోనూ కొట్టవచ్చినట్టు కనపడుతుం దీవిషయం.

సామాన్యజనుల ఆదరగౌరవాలే గాని పండితులూ కవులూ రచయితలూ ఆర్ద్రచిత్తత గడించుకోలేకపోయారు వేంకటశాస్త్రిగారు.

వారి యీ ప్రవృత్తే ఇటు రామకృష్ణకవులతోనూ, అటు కొప్పరపుకవులతోనూ తీవ్రకలహాలకు దారితీసింది.

ఇంకా యెందరో వున్నారు వారిని ప్రతిఘటించినవారు, దేశం అంతటా.

నాలుగు వైపులనుంచీ ప్రతిఘటన వచ్చిందంటే, పండితుడైనవాడి సర్వతోముఖ ప్రజ్ఞ కది ఘనతే; కాని వేంకటశాస్త్రిగా రది తట్టుకోలేకపోయారు.

చాలా చికాకుపడిపోయిన్నీ వుండినారు వారు.

ఆ చికాకే రాజమండ్రీ బజారు వ్యవహారానికి మూలం.

ఏమయినా, తిరుపతి శాస్త్రిగారికంటే, వేంకటశాస్త్రిగారు మిక్కిలీ అదృష్టవంతులు.

వారు బాగా ఆర్జించుకున్నారు కీర్తితోపాటు ధనమున్నూ. స్థితిపరు లయినారు. వారి అదృష్టం చివరచివర మరీ యెక్కువయింది.

లేవలేని స్థితిలో – చివరి ఘడియల్లో అప్పుడప్పుడే ఏర్పడిన ఆస్థాన కవిత్వపదవి లభించడం వారి అదృష్టానికి పతాక.

ఆ పదవి వచ్చినప్పుడు, వారికి, బెజవాడలో జరిగిన గౌరవం వంటిది – సత్కారం వంటిది – ఆరాధన వంటిది – మరెవరికి, మరెప్పుడు, మరెక్కడ జరిగిందీ?

## 68

మంచి ఆధునిక వాఙ్మయం ప్రకటించాలన్న వుద్దేశంతోనూ, తన్మూలంగా డబ్బు గడించాలన్న ఆశతోనూ రాజమహేంద్రవరంలో వొక ప్రకటనసంస్థ నెలకొల్పాము మేము.

మేమంటే, మల్లిడి సత్తిరెడ్డిగారూ, చెన్నుభొట్ల పెద్దసత్యనారాయణగారూ, నేనున్నూ.

సంస్థపేరు ఎస్.పీ.ఏ.ఎల్.

మద్రాసులో వున్న ఎస్.పీ.సీ.కే.కు అనుకరణం యిది.

దాని బృహన్నామం "సొసైటీ ఫర్ ది ప్రొమోషన్ ఆఫ్ ది క్రిష్టియన్ లిటరేచర్" అయితే, దీని బృహన్నామం "సొసైటీ ఫర్ ది ప్రొమోషన్ ఆఫ్ ది ఆంధ్ర లిటరేచర్" అని.

చెన్నుభొట్లవారి నామకరణం యిది.

"మనకీ యింగ్లీషు పేరేమి కర్మం?" అనడిగా న్నేను.

"పని ప్రధానం మనకి. మీ వొక్కరిదే కాదీసంస్థ. పైగా, బాధ్యత అంతా తమమీద వేసుకుంటున్నా రాయన, వొప్పుకోండి" అంటూ బలవంతపెట్టారు రెడ్డిగారు.

నే నంగీకరించ లేకపోయాను.

అంగీకరించకుండానూ వుండలేకపోయాను.

దాని నిబంధన లంత ఆకర్షకంగా వున్నాయి.

ఏ పని చెయ్యడానికయినా రెడ్డిగారి సాహచర్యం కావాలి నాకు.

అలాగే, యెందుకయినా చెన్నుభొట్లవారి సావాసం వుండాలి, రెడ్డిగారికి.

ముందు తా మందుకు సిద్ధపడే నాకు చెప్పారు, తరవాత రెడ్డిగారు.

ఏమయినా, యిది "స్వల్ప విషయం" అంటే నే నంగీకరించను; కాని, నేను కాదూ కూడదంటే, నన్ను దూరంగా వుండమంటా రేమో వారు?

అసలు, సంస్థే ప్రారంభం కాదేమో?

సిరి రా మోకా లొడ్డిన ట్టయిపోతుందేమో నా పని?

కనక, నేను పట్టుపట్టలేకపోయాను పేరు విషయమై.

పోనీ, వా రిద్దరూ నడిపించుకోరాదూ అదీ?

ఇదీ ఆలోచించాను; కాని మరి గ్రంథాలమాట?

అవి రచించి యివ్వడానికి నేను.

"నే నచ్చువెయ్యగలను. డబ్బూ పెట్టగలను. కృత్య విభాగమూ సరిగా కుదిరింది; కనక, నిరాఘాటంగా సాగిపోతుంది. లాభం రావడం నిస్సందేహం" అన్నారు రెడ్డిగారు.

ఇది వినాటప్పటికి "మనం గ్రంథాలు రాయగలం. త్వరగా గజం యెత్తు పుస్తకాలు రాయడాని కిదొక ప్రేరకం అవుతుంది. వెంటవెంటనే అచ్చుపడిపోతాయి రచనలు. లాభం తప్పదు కనక, నిశ్చింతగా నిర్వహించుకోవచ్చు స్వతంత్రంగా సంసారం" అనుకున్నా న్నేను.

"మరి, చెన్నుభొట్లవా రెందుకూ?" అంటే, పుస్తకా లమ్మడానికి.

"బాగుం" దనిపించింది నాకు.

గ్రంథకర్తా, పెట్టుబడిదారూ, అమ్మకంమనిషీ – ఇంతకంటే యేమి కావాలీ ప్రకటన సంస్థకు?

కొంచెం శ్రద్ధ చేస్తే తప్పకుండా సాధించవచ్చు విజయం.

అయితే, గ్రంథాలు రచించినందుకు నాకేమీ ప్రతిఫలం లేదు.

కాపీరైటు మాత్రం నాదీ.

సంస్థ వున్నంతకాలమూ, ప్రకటనకు సంబంధించిన స్వత్వం మాత్రమే సంస్థది.

నేను రచించి యిచ్చిన ప్రతీగ్రంథమూ ప్రకటించడానికి, రెడ్డిగారు, ఎప్పటికప్పుడే వేరేవేరే పెట్టుబడి పెడుతూవుండాలి.

వారది తిరిగీ రాబట్టుకోగూడదు, లాభంతోనే తృప్తిపడాలి.

అచ్చుపడివున్న ప్రతీ గ్రంథం మీదా వారికీ వుంటుంది స్వత్వం.

అంటే, నా పెట్టుబడి గ్రంథమూ, రెడ్డిగారి పెట్టుబడి దాని ప్రకటన క్కావలసిన డబ్బూను.

ఇదే భంగ్యంతరంగా చెప్పాలంటే, నా పుస్తకం అచ్చువేయించి అమ్మకానికి సిద్ధం చెయ్యడానికి రెడ్డిగారెంత పెట్టుబడి పెడతారో, నా రెమ్యూనరేష నంతన్నమాట.

గ్రంథం ప్రకటించినప్పుడల్లా సంస్థకు మూలధనం పెరుగుతూనూ వుంటుం దన్నమాట.

మరి, చెన్నుభొట్లవారి మాటేమిటంటే, పుస్తకా లమ్మడం వారివిధి.

అమ్మకంమీద నూటికి నలభైరూపాయల కమీషను మాత్రమే వారికి ప్రతిఫలం.

ఆఫీసులో అమ్మే పుస్తకాలకూ, వీపీలద్వారా అమ్మే పుస్తకాలకూ గూడా ఆ రేటున వారి క్కమిషనివ్వవలసిందే.

డిస్కవుంటిచ్చి బుక్సెల్లర్లకు పుస్తకా లమ్మినా వారి కమిషను తప్పదు.

అయితే, యిందులో వొక విశేషం.

ప్రతీ పుస్తకమూ మేము రెండేసివేల ప్రతు లచ్చు వేయించాలి.

ఆ రెండువేల ప్రతులూ చెన్నుభొట్లవా రమ్మాలి.

అమ్మి తీరాలి.

అమ్మాలంటే, వూరూరూ తిరిగి – ఒకచోట అంగడి పెట్టి కాదు.

అలా తిరగడం రామచంద్రపురం తాలూకా వూళ్ళన్నీ తిరగాలి, ముందు.

అంటే, సంస్థ కాయన ట్రావెలింగు ఏజం టన్నమాట, ఇటు సోల్ ఏజెంటు కావడంతోపాటు.

ఏజెంటు అన్నది గౌరవాస్పదం కాదుట, అంచేత ట్రావిలింగు ఇన్స్పెక్ట రనాలి మేము.

ఖర్చులయినా ప్రతిఫలమయినా అంతా ఆయనకా కమిషనే.

కాగా, – సంస్థ అంటే మేము ముగ్గురమూను.

భాగస్వామ్యం మాత్రం నాదీ రెడ్డిగారిదిన్నీ.

పోతే, – రెడ్డిగారికి లేని అదనపు బాధ్యత నాకు రాజమండ్రిలో వుండి ఆఫీసు నిర్వహించడం.

అందుకోసం, సంస్థ, నాకు నెలకింత అని యిస్తుంది.

అన్నిటికీ ప్రధానమైన నిబంధన – లాభం రాకపోతే – సంస్థ నిలిపివెయ్యవలసిన అవస్థ వస్తే అప్పటికి మిగిలివుండిన పుస్తకాలు నేనూ రెడ్డిగారూ చెరిసగం పుచ్చుకోవడం.

"ఇది చూస్తే, చెన్నుభొట్లవారి చేరికవల్ల యేమిచిక్కు వస్తుందీ!" అనిపిస్తుం దెవరికయినా.

కాని, అంతా సిద్ధం అయినాక – రాజమండ్రీ ప్రవేశించి నే నాఫీసున్నూ తెరిచాక, వొక వింత కోరిక వెల్లడించా రాయన.

ఊళ్లల్లో తిరిగేటప్పుడు, తమ పని నిరూఘాటంగా సాగాలంటే, తమ్ము చూసి జనులు విభ్రాంతులయిపోవాలి కనక, తమవెంట వొక బిళ్ళబంట్రో తుండాలిట వారికి.

పుస్తకాల అమ్మకం బాపతు, తమ దగ్గిర చాలా డబ్బుంటూ వుంటుంది కనక, భద్రతకోసం తమదగ్గిర అరుగుళ్ళ రివాల్వరుండా లిట.

కనక, బాడ్డీకీ, రివాల్వరుకీ లైసెన్సు కావాలని కలెక్టరుకి దరఖాస్తు పెట్టుకున్నా రాయన.

"వల్లకా" దని నేను.

"మనకేం, అదంతా ఆయనే చూసుకుంటారు, డబ్బూ ఆయనే పెట్టుకుంటా" రని రెడ్డిగారు.

అయితే, లాభం వస్తుందన్న ఆశతో రెడ్డిగా రంగీకరించినట్టే, పుస్తకాలచ్చున్నా పడతాయన్న ఆశతో నేనూ చివరికందు కంగీకరించాను.

"అయితే, యెన్నాళ్లు సాగుతుందీ యిదీ?"

సామెత చెప్పినట్టు; మొదణ్ణుంచీ యిదొక సమస్యే నాకు.

ఎంచేత నంటే?

నన్ను మింగెయ్యాలని చెన్నుభొట్లవారికీ, ఆయనకు దేవిడీమన్నా చెప్పించాలని నాకూ దీక్ష

ఒకవిధంగా జీవన్మరణసమస్య మా కిది.

ఎప్పటి కప్పుడే దృఢపరుచుకుంటూ వుండేవాళ్ళం మే మది.

కాని, ఎప్పటికప్పుడే యేదో పని ప్రారంభించేవారు రెడ్డిగారు, మమ్మ ల్నిద్దర్నీ కలిపి.

ఎప్పటికప్పుడే మా యిద్దరి వైమనస్యమే కారణంగా అపజయమున్నూ తప్పేది కాదు మాకు, ఎందులోనూ కూడా.

అయినా, నన్నూ విడిచిపెట్టలేకపోయేవారు, చెన్నుభొట్ల వారినీ విడిచిపెట్టలేక పోయేవారు రెడ్డిగారు.

## 69

రాజమహేంద్రవరం ప్రవేశించి కార్యక్రమం ప్రారంభించాను:

పదింటికి తక్కువ కాకుండా, వరాసగా, ముందు నవలలే ప్రకటించాలని మా నిర్ణయం.

అవి నేనే రచించాలని నిబంధన.

కనక, వెంటనే నే నొక నవల రచించడానికి పూనుకున్నాను.

గజం యెత్తు పుస్తకాలు రచించాలన్న శపథం నెరవేరినట్టే పొంగిపోతూ పూనుకున్నా న్నేనందుకు.

కాని, అచుంబిత ప్రక్రియ నా కది.

అంతవరకూ నే నాప్రయత్నం చెయ్యలేదు.

ఆ సంకల్పమే కలగలేదు నాకంతకి ముందు.

అంచేత, నే నందుకు సంబంధించిన సాధక బాధకా లాలోచించుకోలే దెప్పుడున్నూ.

సంకోచమే కలగలేదు నా కప్పుడయినా.

కాగితాలూ కలమూ పుచ్చుకున్నాను, వెంటనే.

సర్వజ్ఞుడి స్థితి యిది.

సర్వాజ్ఞుడిదిన్నీ ఈ స్థితి.

అగత్యం యేర్పడితే – సంకల్పమున్నూ కలిగితే, మనిషిని ముందు కురికించేవే యీ రెండూ కూడా.

కా నయితే, వీరేశలింగం పంతులుగారివీ, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారివీ, విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారివీ కూడా కొన్ని నవలలు చదివ్వున్నా న్నేనప్పటికి.

తెలుగు భాషలో అప్పటి కపురూపా లవి.

సాహిత్యంలో నవ్యప్రక్రియలూ, వాఙ్మయంలో నవ్యరచనలూ, రచనల్లో నవ్య నిర్వహణరీతులూ కావాలనుకునేవారూ, అవి ఆచరించగలవారూ, రసానుభూతిలో కూడా నవ్యత ఆకాంక్షించేవారూ అందరూ, చదివా రవి.

నేనూ అందుకే చదివా నాటగా.

కాని, కథలూ కల్పనలూ మాత్రమే వున్నాయి వాటిలో.

"ఆహా" అని మాత్రమే అనిపించాయి నా కవి.

బంకించంద్రుని నవలలూ చదివాను, తరవాత, కొన్ని.

కథలూ, కల్పనలూ మాత్రమే కాక కవిత్వమున్నూ వుంది వాటిలో, పుష్కలంగా.

తామరమొగ్గమీద సూర్యకిరణాలు పడ్డట్టయింది, నాకు.

పెద్ద పాతు దొరికినట్టున్నూ అనిపించింది నాకు.

నా హృదయం స్పందించింది, అతివేలంగా.

కొత్తవెలుగూ కనపడింది నా కళ్ళకి.

రచయిత అయినవాడికి, ఇంగ్లీషుపరిజ్ఞానంవల్ల కలగవలసిన సంస్కారం బంకించంద్రుడి దగ్గిరే కనపడింది నాకు.

అవి చదివినప్పు డప్రయత్నంగా విశదం అయింది కొంత, సప్రయత్నంగానూ తెలుసుకున్నాను నే నది కొంత.

కొద్దిపాటిదే కాని, ఆ యెరుకే కలిగించింది నాకీ ధైర్యసాహసాలు.

ఈ దిలాసాతో పూనుకున్నా న్నేనందుకు.

బాగానే వుంది, అయితే, మరి కథ?

ఇదొక గడ్డు సమస్య అయిపోయింది నాకు.

బంకించంద్రుడి నవలలు చదవడంవల్లనే యిది యిలా తటస్థించింది.

ఏమంటే?

బంకించంద్రుడి నవలలు, ప్రాయికంగా, బంగాళాదేశ చరిత్రకూ, బంగాళీ జీవితానికి, బంగాళీ సంప్రదాయానికీ, బంగాళీ జాతీయతకూ సంబంధించినవి.

తన రచనలో, పాతకొత్తలకు సమన్వయపద్ధతి ప్రవేశపెట్టీ జీవితానికి కొత్త విలవలు కట్టీ, జాతికి కొత్తతోవలు కనపరిచీ, పురుషకారానికి నవశక్తి సంఘటించడానికి పూనుకున్నా డతను.

అపహాస్యం చెయ్యడానికీ, హాస్యం పుట్టించడానికిన్నీ కాక ఆత్మజ్ఞానమూ, ఆత్మవిశ్వాసమూ, ఆత్మగౌరవమూ, ఆత్మత్యాగమూ, దీక్షా, ఏకాగ్రతా, దక్షతా –

అన్నిటికీ మకుటాయమానంగా జాతీయతా – తన బంగాళీలకు ఇవి ఉద్బుద్ధం చెయ్యగలిగేటట్టు చిత్రించాడు తన పాత్ర లతను.

ఆ రచనలు చదివి కొత్త ప్రపంచంలో పడ్డారు మనవాళ్ళు.

ఇంతేకాదు, బంగాళాదేశమే దేశ మనుకున్నారు.

బంగాళీ భాషే భాష అనుకున్నారు.

బంగాళీలే మనుష్యు లనుకున్నారు.

బంగాళీ వేషమే వేసుకోసాగారు.

చివరికి, బంగాళీలయెదట, తమ ఆంధ్రు లధము లనిన్నీ అనుకోసాగారు.

బంకించంద్రుడి సంస్కార విశేషమూ, అతని దృక్పథమూ అర్థం చేసుకోలేకపోడంవల్ల వచ్చిన పుట్టిమునక యిది.

గ్రంథం చదవడం వినోదానికీ, కాలక్షేపానికీ మాత్రమే అనుకోడంవల్లనున్నూ వచ్చిన దౌర్భాగ్యం యిది.

వీరేశలింగంగారి రచనలు చదవడంవల్ల అప్పటికే తప్పుదారిలో పడిపోయివున్నారు మనవాళ్ళు, అందువల్లకూడా ఏర్పడ్డ అసందర్భం యిది.

సత్యం గుర్తించగలిగితే, –

సంఘం సంస్కరించాలన్న చూపు వీరేశలింగంగారిది.

అంతటితో పరిమితం అయిపోలే దది, జాతిలో బ్రాహ్మధర్మం ప్రవేశపెట్టా లనిన్నీ వారిపూనిక.

ఇందుకోసం మన ధర్మాన్ని తూర్పారపట్టారు వారు.

"మన జీవనసరణి వొక మురికికూపం" అన్నభావం పుట్టించారు మనవాళ్ళకి, వారు.

"దీనిక్కారణం యేమిటీ?" అని పరిశీలిస్తే, –

కేవలమూ బ్రహ్మసమాజం పరంగా చూస్తే, అక్కడ బంగాళీలకూ, ఇక్కడ మన వీరేశలింగంగారికీ గూడా క్రైస్తవధర్మమే పూర్తిగా వరవడి.

అయితే, బంగాళీ బ్రహ్మసామాజికుల్లో చాలామంది పెద్దలకు మన దర్శనాల పరిజ్ఞానం బాగా వుండినట్టు కనపడుతుంది.

మన వీరేశలింగంగారికి మాత్రం అదేమీ లేదు.

వారి వీరి సంస్కారంలో ఈ భేదం పూర్తిగా కనపడుతుంది.

అంచేత, మన వీరేశలింగంగారికి, బ్రహ్మసమాజం సందర్భంలో అనుయాయితే గాని, ప్రామాణికత్వం సిద్ధించలేదు.

సంస్కర్త అయినవాడికీ, నాయకు డయినవాడికీ పెద్దలోపం యిది.

లోపంమాత్రమే కాదు, పూర్తిగా అనర్హతాను.

కాక, –

బంకించంద్రుడిది పూర్తిగా, సాహిత్యదృష్టి.

వీరేశలింగంగారిది పూర్తిగా, సంస్కారదృష్టి.

బంకించంద్రుడికి సాహిత్యం ఆరాధ్యదైవం.

వీరేశలింగంగారికి సాహిత్యం తమ ఆరాధ్యదైవాన్ని పూజించడాని కొకపుష్పం.

కాగా, బంకించంద్రుడు తన జాతిలో, తన బంగాళీతనం ఉద్బుద్ధం చేసుకోగా వీరేశలింగంగారు మన జాతిలో, ఆంధ్రత్వం అపహాస్యం పాలుచేశారు.

ఈ యిద్దరి రచనలూ మిక్కిలీ పదునైనవే.

కనక, అవి చెయ్యవలసిన పని చేశాయి, పూర్తిగా.

దీంతో, బంకించంద్రుడి రచనతో బంగాళీవాడు, ముందు కొత్త దృక్పథంతో ముందు కడుగువేసి, తరవాత తన దురాచారాలు సవరించుకుని తానుగా నిలవగలిగాడు.

వీరేశలింగంగారి రచనతో మన తెనుగువాడు, ముందు తన దురాచారాలు చూసుకుని సిగ్గుపడిపోయి, తన్మూలంగా కుంగిపోయి, కొత్త దృక్పథం అలవడక ముందు కడుగే వెయ్యలేక, చివరికి తానుగా నిలవలేకపోయాడు.

అంటే, –

బంగాళీవాడు, తన బంగాళీతనం బలపరుచుకున్నాడు.

తెనుగువాడు, తన తెనుగుతనం అసహ్యించుకున్నాడు.

అంచేత, బంగాళీవాడు సాటి బంగాళీవాణ్ణి నమ్ముతాడు, ప్రేమిస్తాడు, బలపరుస్తాడు, తన ప్రాణాలకున్నా తెగించి నిలవబెడతాడు.

తెనుగువాడు, సాటి తెనుగువాణ్ణి నమ్మలేడు, ప్రేమించలేడు, బలపరచలేడు, తనకు ప్రయోజనం లేకపోయినా పడగొట్టకుండానూ వుండలేడు.

ఏతావతా, –

బంకించంద్రుడి జీవితంలో మనం గుర్తించవలసిన పరమార్థం యేమిటంటే?

అతను బంగాళీ.

అంటే, విశాలమైన భరతఖండంలో – బలిష్ఠమైన భారతీయతలో వొక ప్రత్యేక జాతికి ప్రతినిధి అతను.

ఈ సంగతి బాగా గుర్తించుకున్నవా డతను.

ఆత్మ గౌరవమున్నా కలవాడు.

దీంతో, తన వ్యక్తిత్వం దృఢపరుచుకోవలసివచ్చిం దతనికి.

అలా చేసుకుంటే గాని, తన బంగాళీజాతికీ, తన భారతదేశానికీ, తద్వారా ప్రపంచానికీ సందేశం యివ్వడానికి అర్హత సంపాదించుకోలేడు.

అది సాధించుకోలేకపోతే చలిచీమకూ తనకూ భేదం యేమిటి?

ఇలా అభిమానపడ్డా డతను.

నిద్రాహారాలు మరిచి – విడిచిన్నీ పెట్టి సాధన చేశాడు.

అంటే, –

ఎంతో చదివాడు.

ఎంతో విన్నాడు.

ఎంతో చూశాడు.

ఎంతో అవగాహన చేసుకున్నాడు.

ఎంతో మథనపడ్డాడు.

ఈ సంరంభంలో కిందా పడ్డాడు, మీదా పడ్డాడు.

కాని, ముందుకే వేశా డడుగు.

మహా మానిసి మరి, అతను.

దీనికి సాయం, కలకత్తాలో – వొక పే–ద్దనగరంలో నివాసం అతనికి.

కాగా, ప్రపంచంలో ప్రవృత్తికెన్ని చీలికలున్నాయో బాగా తెలుసుకోగలిగాడు.

ఎన్ని ఆకాంక్ష లున్నాయో అవగాహన చేసుకోగలిగాడు.

ఎన్ని, ఎలాంటి భిన్న ప్రాప్యాలకోసం నిండు జీవితాలు బలి అయిపోతున్నాయో కళ్ళారా చూసుకున్నాడు.

మానవ జాతిలో, మనుగడకోసమూ, సుస్థితి కోసమూ ఎంత సంఘర్షణ జరుగుతోందో పరిశీలించుకున్నాడు.

ఏకత్వంలో భిన్నత్వాని కెంత ప్రాముఖ్యం చూపించబడుతోందో పరకాయించు కున్నాడు.

తన జీవితం తన కెంతటి గొప్ప వరప్రసాదమో, దానికి తా నెంత ఉన్నతి కలిగించుకోవచ్చునో, ఎంత కలిగించుకోవాలో అంచనా వేసుకున్నాడు.

తన అస్తిత్వానికి హేతుభూతమైన తన బంగాళీ జాతికి తా నెంత ఋణపడివున్నాడో గుర్తించుకున్నాడు.

స్వార్థానికి పరార్థమే పరమావధి అన్న నిగూఢ సత్యం బోధపరుచుకోగలిగా డప్పటికి.

అంటే, కవి అయినాడు.

మహర్షి కాగలిగాడు.

దేవత్వానికిన్నీ అతీత మైన పదవి మనిషి కది.

ఈ మహర్షిత్వం, ప్రాణికోటికి, జన్మపరంపరలో చివరి మెట్టు.

అక్కడే వుంది బ్రహ్మపదార్థం.

కనక, మహర్షి కాగలిగిన వాడికి, తరవాతి ఘటన బ్రహ్మైక్యమే.

కాని, ఆ మెట్టెక్కడంతో ఆ ప్రాణి విధికృత్యం పూర్తికాదు.

విశేషించి, విలక్షణ మైన – విశిష్ట మైన యోగ్యత వొకటి సిద్ధిస్తుం దక్కడ.

అనన్య సాధారణం అది.

అది నిర్వహించుకోవలసిన విధిన్నీ మీదపడుతుం దక్కడ.

అనన్యసాధ్యం అది.

అంతేకాదు, మానవ సంస్కారానికి పరమావధిన్నీ అది.

ఒక్కముక్కలో చెప్పా లంటే, –

ఐహిక జీవితంలో యాతనాబహుళ మయివున్న మానవకోటికి రసానందానుభూతి ప్రసాదించవలసిన బాధ్యత అది.

బ్రహ్మానందానికి సబ్రహ్మచారి యీ రసానందం.

కనక, బంకించంద్రుడు, సంతత పరిశ్రమతో యీ విధంగా ఆత్మోన్నతి సాధించుకున్నాడు.

కలంపట్టాడు.

తన చరిత్రమీద – తన సంప్రదాయంమీద – తన ప్రత్యేకతమీద – తన బంగాళీజాతీయతమీద కవిత్వంవెల్లువలు ప్రవహింపచేశాడు.

తన్మూలంగా, పృథక్త్వంలో ఏకత్వం సాధించుకుని, యీ విశాలప్రపంచంలో తాను భారతీయుడుగా నిలవదొక్కుకో గలిగాడు.

## 70

"కోహమ్?"

"నే నెవణ్ణి?"

బంకించంద్రుడి నవలలు చదివి, అతని దృక్పథం యే కొంచెమో అవగాహన చేసుకుని, కొంతకి కొంత కవిత్వపరమార్థమున్నూ బోధపరుచుకోగలగడం వల్ల యిదిగో, యీ ప్రశ్న నిలవేసింది నన్ను.

చాలా సంతోషించా న్నేనిందుకు.

నిజంగా, దేవతాసాక్షాత్కారం అయినంత ఆనందం కలిగింది నాకు.

నా అనుభవాల్లో మిక్కిలీ రమ్యమైన ఘట్టం యిది.

చాలా జటిలమైన సన్నివేశమున్నూ యిది.

నా స్వస్వరూపం నేను తెలుసుకో గలిగేటట్టు చేసిన మంత్రోపదేశం యిది.

నా పురోగమనానికి సుపరిష్కృతమైన వొక ఘంటాపథం కల్పించిపెట్టిన ఘటన యిది.

నా జాతీయతకు రెండు సమానకేంద్రా లున్నాయని వివరించి చెప్పిన వ్యాఖ్యానపంక్తి యిది.

కాగా, –

"ఆంధ్రోహమ్"

ఆ ప్రశ్నకి ప్రత్యుత్తరం యిది.

బంకించంద్రునికి బంగాళీతనం యెలాంటి జీవన్మరణసమస్యో, నాకున్నూ అలాంటి జీవన్మరణసమస్యే అయింది, తెనుగుతనం.

దీంతో, నా తెనుగుతనం నేను దృఢపరుచుకోవలసివచ్చింది.

అటు బంకించంద్రుడిలాగే, యిటు నేను కూడా నా తెనుగు జాతీయతను భరతఖండాని కంతకూ చెయ్యెత్తి చూపించుకోవలసివచ్చింది నాకు.

కనీసం, నా తెనుగువాడికి "నేను తెనుగువాణ్ణి" అన్న ఆత్మప్రత్యయం కలిగించవలసిన బాధ్యత మీదపడింది నాకు.

ఇది గుర్తించుకోలేకపోతే నా భారతీయతకు నే నేమి దోహదం చేసుకోగలనూ?

మరి, యిది నిర్వహించుకోకపోతే నా పురుషకారానికి ప్రశంస యెక్కడిదీ?

నా వ్యక్తిత్వానికి అస్తిత్వమున్నూ యేదీ?

వేదవేదాంగాదికాలైన కులవిద్యలు విడిచిపెట్టి, కలంపట్టినందుకు ప్రయోజనమున్నూ యేమిటీ?

కనక?

నా దృష్టిలో తెనుగుదేశమే దేశం.
తెనుగుభాషే భాష.
తెనుగు మనుష్యులే మనుష్యులు.
తెనుగువేషమే వేషం.
ఇంతేకాదు, –
ఏ జాతి యెదటా – ఏ సందర్భంలోనూ – ఎందుకున్నూ నా తెనుగుజాతి తీసిపోదు.
అంచేత, ప్రపంచాని కిది ఉద్ఘాటించి చెప్పడానికి, నా సేవలు తెనుగుజాతికే మీదుకట్టుకోవాలి నేను.
తెనుగులో మాత్రమే రచన చెయ్యగలిగివుండడంవల్ల కూడా, ఇంతకంటే మరో పరమార్థం లేకపోయింది నాకు.
అయితే "యిది పృథక్త్వానికి దారి తియ్యడం లేదూ?" అంటే, తప్పేం, వున్నదే అదయినప్పుడు?
ఇది చూసి, నా తెనుగువాళ్ళే కొందరు నిర్విణ్ణులయిపోతారు, నాకు తెలుసు.
కాని, యెవ రేమయిపోయినా సత్యం సత్యమే.
ఇది అవగాహన కావడానికి కొంత వివరణ చేస్తాను.
ఏమిటంటే?
మనిషయినవాడు, నివృత్తిమార్గంలో "నేను" "నాది" అన్న చిత్తవృత్తి చంపుకుంటేగాని ముందుకివెళ్ళలేడు, ముందు.
అలాగే, మనిషయినవాడు, ప్రవృత్తిమార్గంలో "నేను" "నాది" అన్న చిత్తవృత్తి దృఢపరుచుకుంటే గాని ముందుకి వెళ్ళలేడు, ముందు.
పరకాయించుకోగలిగితే, ప్రపంచం అంతటా వున్నదే యిది.
అర్థంచేసుకోగలిగితే, యీశ్వర నిర్ణయమే యిది.
కనక, తెనుగువాళ్ళం మనం తెనుగువాళ్ళమే.
బంగాలీలు బంగాలీలే.
తమిళులు తమిళులే.
ఓఢ్రు లోఢ్రులే.
కన్నడులు కన్నడులే.
మహారాష్ట్రులు మహారాష్ట్రులే.
గుజరాతీలు గుజరాతీలే.
తక్కినవారున్నూ యెవరికి వారే.
ఎంచేతనంటే?
వీరికందరికీ ప్రత్యేక దేశా లున్నాయి.
ప్రత్యేక భాష లున్నాయి.
ప్రత్యేక చరిత్ర లున్నాయి.
ప్రత్యేక సంప్రదాయా లున్నాయి.
ప్రత్యేకాకాంక్ష లున్నాయి.

ప్రత్యేక ప్రాప్త్యాలున్నాయి.

సాధనాలున్నూ ప్రత్యేకప్రత్యేకాలున్నూ యెన్నెన్నో.

ఆ ప్రత్యేకతలు పోషించుకోవలసిన విధీ వుంది, మిక్కిలీ బలీయం.

ఈ విధికి తప్పితే ఘోర మైన ప్రత్యవాయమూ చుట్టబెట్టుకుంటుంది, అంతకంటే గాఢమైనది.

## 71

"అయితే, మరి, భారతీయత మాట?"

ఈ ప్రశ్న వస్తుంది.

వెంటనే వస్తుంది, సందేహం లేదు.

ఈ భరతఖండంలో వొక తప్పుడు సిద్ధాంతం ప్రచలితం అవుతోంది మరి, యిప్పుడు.

కనక, ఈ ప్రశ్న వస్తుందనీ తెలుసు, రావడం అనివార్యం అనీ తెలుసు.

కనక, వెంటనే రావడంలోనే సొగసుంది.

ఏమంటే?

ఆంధ్రజాతీయత యెలాంటిదో మనకు, భారతజాతీయతా అలాంటిదే, మరి.

అయితే, వీటి ప్రసక్తికి భిన్నభిన్న సందర్భాలున్నాయి.

అంటే, –

ఆంధ్రజాతీయత ప్రసక్తి వచ్చినప్పుడు భారతజాతీయత స్మరణకు రాదు.

అలాగే, భారతజాతీయత ప్రసక్తి వచ్చినప్పుడు ఆంధ్ర జాతీయతా స్మరణకు రాదు.

తేజస్తిమిరాలవంటి వివి.

తేజస్సుంటే తిమిరం లేదు.

తిమిరం వుంటే తేజస్సున్నూ లేదు.

దేనికదే ప్రత్యేకాలివి.

కలపరానివీ విడతియ్యరానివీ కూడానూ యివి.

కానీ, అన్యోన్యాలు.

ఇదొక విచిత్ర సన్నివేశం.

మిక్కిలీ గాహనమున్నూ.

కనక, సూక్ష్మవిచారణక్కాని అందిది.

ఓఢ్రదేశం, దక్షిణ మహాసముద్రం, తమిళదేశం, కన్నడదేశం, మహారాష్ట్ర దేశం, మధ్యమాగాణాలు – ఈ హద్దుల మధ్యస్థమైన విశాల భూభాగం రత్నగర్భ.

దేవతలకున్నూ ప్రలోభజనకం యిది.

యుగయుగాలనుంచీ వుంది; కాని, సముద్రంలోనుంచి హఠాత్తుగా పొటమరించుకు వచ్చింది కాదివాళ.

మరి, దీన్నేమనీ పిలవడం.

దిఙ్నిర్ణయం చేసి వ్యవహరించడాని కనువుకాని దిది.

చూసీ చూడన ట్బారుకోడానికిన్నీ వీలుకాని దిది.
దృఢమైన జీవనాడి ప్రచలితం అవుతోంది మరి, యిక్కడ.
ఎవరెంత పిసుక్కున్నా లాభం లేదు, తెనుగుదేశం అని దీని కీశ్వరనిర్దేశం.
తెనుగుజాతికి మహోజ్వలమైన సింహాపీఠం యిది.
అంచేతనే తెనుగుదేశం అని దీనికి వ్యవహారం.
మరి, తెనుగుజాతికి?
తెనుగుభాషనుపట్టి వ్యవహారం.
అయితే, తెనుగుభాషో అంటే, సరస్వతి వాగ్విలాసం అది, స్వయంభువు.
అసూయాజనకమైన మాధుర్యం దానిది.
ఖండాని కంతకూ ఏకైక మధురిమం అది.
కాగా, లోకవ్యవహారానికి భాష ప్రాతిపదిక అవుతోంది.
ఇది కాదనడానికి వీలులేదు.
మానవజాతి అంతా వొకటే, కనక, జాతిని పట్టికాదు భాష.
వృత్తి ననుసరించీ, రంగు పురస్కరించుకునీ, మతాన్నిబట్టిన్నీ కూడా జాతికీ, దేశానికీ పేరు రాదు.
భాష – జాతి – దేశం – ఇదీ క్రమం.
అన్యోన్యా లివి.
ఇదొక రాశి.
సంపూర్ణ స్వరూపం యిది.
ఇందులో యేది తక్కువయినా తక్కినవి కృత్రిమాలే.
దీన్నిపట్టి చూస్తే, తెనుగుతనం సంపూర్ణం.
స్వతంత్రం.
ఒక మూలపదార్థమున్ను.
మరి, తెనుగుభాష వుండినప్పుడు – ఆ భాష మాట్లాడే జాతి వుండినప్పుడు – ఆ జాతికి కాణాచి అయిన భూభాగం వుండినప్పుడు అదొక ప్రత్యేకదేశం కావడం అసంబద్ధం యెలా అవుతుందీ?
సత్యం యిది కాగా, –
తెనుగుదేశం వొక్కటే కాదు – బంగాళాదేశమూ, ఓఢ్రదేశమూ, తమిళ దేశమూ, కర్ణాటకదేశమూ, మహారాష్ట్రదేశమూ, గుజరాతీదేశమూ, మలయాళ దేశమూ – ఇంకా ఇంకా యిలాంటివీ కూడా ప్రత్యేకప్రత్యేకాలు.
సర్వస్వతంత్రాలు.
భిన్నప్రకృతికాలున్నూ.
అయితే, – మన పూర్వులు – మన ధార్మిక వ్యవస్థ యేర్పాటుచేసిన మహర్షులు "ఛప్పన్న దేశాలూ" అన్నారు "భరత ఖండమూ" అన్నా రొకనోటితోనే.
అంటే, ఇటు పృథక్త్వమూ నిర్ధారణ చేశారు కావా లని, అటు యేకత్వమూ ప్రతిపాదించారు, తెలివిగా.
తత్వం గుర్తించుకోగలిగితే మరోవిధంగా చెయ్యడానికే వీల్లే దసలు.

ఎంచేతనంటే?

ఇంతటి వైశాల్యానికి తగినంతగా యేవొక్క భాషా విస్తరించలేదు.

ఇలాంటి విభిన్న శీతోష్ణస్థితుల్లో యే వొక్క సంప్రదాయమూ స్థిరపడలేదు.

కనకనే, –

అంగ – వంగ – కళింగ – కాశ్మీర – కాంభోజ – కామరూప – సౌవీర – సౌరాష్ట్ర – మహారాష్ట్ర – మగధ – మాళవ – బంగాళ – నేపాళ – కేరళ – చోళ – పాంచాల – సింహళ – తమిళ – నాట – లాట – ఆంధ్ర – గాంధార – విదర్భ – విదేహ – బాహ్లిక – కురు – కిరాత – బర్బర – కేకయ – కోసల – కుంతల – టెంకణ – కొంకణ – మత్స్య – మద్ర – ఘూర్జర – ఇత్యాదిగా భిన్నదేశా లేర్పడ్డా యీ ఖండంలో.

"ఈ ఖండంలో" అన్నా నిక్కడ, యాదృచ్ఛికం కా దిది.

దీనిపేరు భారతదేశం కాదు, మరి.

ఇది యిటీవలి పేరు.

అసలుపేరు "భరతఖండం" అని.

జంబూద్వీపంలో – భరతవర్షంలో – భరతఖండం యిది.

ఆంధ్రవంగాదులన్నీ దీని అంతర్గత దేశాలు.

ఈ భిన్న దేశాల కన్నిటికీ ప్రత్యేకభాష లున్నాయి. భరతఖండానికే లేదు.

దేశభాషల ప్రాముఖ్యాని కింతకంటే వేరే నిదర్శనం అక్కర్లేదు.

కనక, ఇవన్నీ పృథక్త్వానికే పోషకాలు.

ఈ దేశభాషలన్నీ సర్వస్వతంత్రాలున్ను.

దేని కదే లక్షణంగా బతగ్గలవు కూడా.

## 72

కార్యకారణ సంబంధా లిదమిత్థంగా నిర్ధారణ చెయ్యలేము; గాని, మన మహర్షులు ఈ దేశాలన్నీ వొక సమాహారంగా దృఢపరిచారు.

అదే యేకత్వం.

అది సాధించడాని కివన్నీ వొక తాటితో బంధించారు.

బులబులాగ్గా కాదు, చాలా దృఢంగా బంధించారు.

అంటే, –

ఈ ఖండాని కంతకూ వొకటే ధర్మం విధించారు వారు.

అదే ఆ బంధనం.

అది వేదప్రోక్తం.

ఋగ్యజుస్సామాథర్వణాత్మకమైన ఆ వేదమూ, దాని షడంగాలూ ఆ ధర్మానికి మూలాలూ ప్రవర్తకాలూను.

ఈ దేశాలవారి కందరికీ ఆత్మానాత్మవివేకం కలిగించే దర్శన సముచ్చయం కూడా ఆ బంధనంలో వొక పేటే.

సాధారణ మైనది కాదది, శుద్ధ భౌతికాలైన యీ భిన్న దేశాల కన్నిటికీ ఆధ్యాత్మికమైన బంధనం అది.

అనన్య సాధారణం అది.

మరెవ్వరూ సాధించుకుని వుండనిదిన్నీ అది.

అది లేకపోతే ఆంధ్రవంగాదులన్నీ వేటికవే ప్రత్యేకాలు.

చైనాకూ అరేబియాకు ఎలాంటి సంబంధమో, అఫ్ఘనిస్థానానికీ అమెరికాకూ యెలాంటి సంబంధమో, ఇంగ్లండుకూ జపానుకూ యెలాంటి సంబంధమో, రష్యాకూ బర్మాకూ ఎలాంటి సంబంధమో ఈ ఛప్పన్న దేశాలకున్నూ అలాంటి సంబంధమే, వొకదానికీ మరొకదానికీని.

అప్పుడీ దేశాల నొక రాశిలో చేర్చడానికే వీలులే దసలు.

మరి, యిప్పుడు?

ఈ దేశాల ప్రజలందరూ వొక ధర్మానికి చెందినవారు.

ఆ ధర్మమే సమష్టిజాతీయత.

ఆంధ్రజాతీయతా, వంగజాతీయతా, తమిళజాతీయతా, మహారాష్ట్రజాతీయతా, కన్నడజాతీయతా, ఓఢ్రజాతీయతా, గుజరాతీజాతీయతా – ఈ రత్నాల కన్నిటికీ యేకసూత్రం అది.

ఇది కాదనడాని కెవరికీ అధికారం లేదు.

అనడం అవివేకం.

చలనం లేని యేకత యిది.

ఇక్కడ "యూరపు ఖండంలో వున్న ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, రష్యా, స్వీడన్ వంటి దేశాలవారి దందరిదీ వొకటే క్రైస్తవధర్మంకదా, మరి, వారికి, మన యేకత వంటి యేకత వుందా?" అన్న ప్రశ్న వస్తుంది, తెలుసు.

నిజంగా, యిది వొక ప్రశ్నే, కాదనను.

కాని, వారికీ మనకూ పోలిక లేదు.

ఏమంటే?

మనది భారతజాతి.

వారివి క్రైస్తవజాతులు.

ఆ దేశాలవారు, క్రైస్తవధర్మం తమ మానప్రాణాలకంటే యెక్కువగా చూసుకుంటారు, తెలుసు.

అయితే, ఆ ధర్మం, వారు ఎవరికి వారే తమతమ భాషల్లో నిబంధించుకున్నారు.

తమతమ భాషల్లోనే వా రాధర్మం చదువుకుంటారు.

తమతమ భాషల్లోనే దానికి సంబంధించిన సంప్రదాయాలున్నూ నిర్వర్తించుకుంటారు.

మరి, మనం?

మన ధర్మం – అంటే, మన వేదవేదాంగాలు సంస్కృతభాషలో వున్నాయి.

సంస్కృతంలోనే మనం అవి చదువుకుంటాం.

సంస్కృతంలోనే మనం తత్సంప్రదాయాలు నిర్వర్తించుకుంటాం.

మన మాతృభాషలు ఐహికాలకు మాత్రమే పరిమితాలు.

ఆధ్యాత్మికాలు వచ్చాటప్పటికి సంస్కృతమే మన కందరికీ శిరోధార్యం.

శిరోధార్యమే కాదు, గతిన్నీ.

వేదవేదాంగాలు మనం మన మాతృభాషల్లో అనువదించుకోవచ్చు.

వాటిలో ప్రతిపాదించబడివున్న ధర్మం, పామరులున్నూ తెలుసుకోడానికి మాత్రమే పనికివస్తా యీ అనువాదాలు.

ధర్మాచరణ వచ్చేటప్పటికి మాత్రం మనం మనదేశ భాషలు వెనక్కి పెట్టుకోవాలి.

సంస్కృతమే స్వీకరించాలి.

తేలిం దేమి టంటే?

ధర్మం యెలాంటిదో సంస్కృతభాషా మనకలాంటి దయింది.

కాగా, మన ధర్మమూ సంస్కృతభాషా అవినాభావాలు.

అంటే, :—

మన ఛప్పన్న దేశాలవారికీ ఏవిధంగానూ చలించని ఏకత వుందంటే, దాని క్కీలకం యిదిగో, యిక్కడ వుంది.

అది సంస్కృతం మనకు జాతీయభాష కావడం.

"జాతీయభాష" అన్నమాట డిడ్డడబిడ్డశబ్దాల వంటిది కాదు.

ఎంతో గాంభీర్యమూ, ఎంతో గొప్పభావమూ గర్భితం అవుతున్నా యందులో.

జాతి జీవనాడికి అది ప్రవర్తకం మరి.

రాజకీయాలు – అంటే – రాజ్యతంత్రం జాతీయం కాదు.

ఆర్థికాలు – అంటే – వర్తక వాణిజ్యాలు జాతీయాలు కావు.

ఐహికాలు – అంటే – నిత్యకృత్యాలున్నూ జాతీయాలు కావు.

ఆహార నిద్రాభయాదు ల్లాగ మానవజాతి కంతకూ సామాన్యా లివి.

మానవజాతి మొత్తంమీద చూస్తే, వీటిలో ఈషద్భేదాలూ వుండవచ్చు, బృహద్భేదాలూ వుండవచ్చు.

మానవుల్లో వీటివల్ల కాదు ప్రత్యేకత లేర్పడ్డం.

ధర్మందగ్గిరే వస్తుంది బాహుముఖ్యం.

దాంతోనే మానవులొకరి కొకరు దూరందూరం అయిపోతారు.

ఈ ధర్మం పురస్కరించుకునే జగత్తంతటా రక్తం వెల్లువలయి ప్రవహించింది, గతంలో.

కనక, ధర్మమే జాతీయతకు మూలం యెవరి కయినా.

ఆ జాతీయతకు ప్రవర్తకం అయినదే జాతీయ భాష అవుతుంది.

తన మాతృభాష కోసం పడిచచ్చిపోతాడు బంగాళీ.

మహారాష్ట్రుడూ, గుజరాతీ, తమిళుడూ, కర్ణాటకుడూ, ఓఢ్రుడూ, మలయాళీ – వీరున్నూ తమతమ మాతృభాషలకోసం పడిచచ్చిపోతారు.

మనమూ అంతే.

ఎవరూ కూడా అంతే.

కాని, ధర్మానికి సంబంధించిన పనివచ్చిందా, ఆ బంగాళీ, ఆ మహారాష్ట్రుడూ, ఆ గుజరాతీ, ఆ తమిళుడూ, ఆ కర్ణాటకుడూ, ఆ ఓఢ్రుడూ, ఆ మలయాళీ, ఆ మనమూ, ఆ యెవరున్నూ కూడా సంస్కృతానికే మోకరిల్లుతారు.

ఏమంటే?

ఈ విశాల భరతఖండంలో, ఈ భిన్నదేశాలవారికి – ఈ భిన్నభాషలవారికి – ఈ భిన్నసంప్రదాయాలవారికి – ఈ భిన్నజాతులవారికి, ఆదిలో యేకత కలిగించినదీ, ఎలాంటి వడిదుడుకులు వచ్చినా అది చెడకుండా నిలుపుచేసిందీ, ఇప్పటికీ నిలుపుతూనే వున్నదీ యీ సంస్కృతభాషే.

మన ధర్మానికి ప్రవర్తకం అయింది కనకనే దీనికీ శక్తి.

ఈ భరతఖండంలో యెంతెంతలేసి చక్రవర్తులో వెలిశారు.

ఎంతెంత కాలమో పరిపాలించారు వారు.

ఏమి టేమిటో కూడా చేశారు వారు.

అంతేకాని యీ భిన్నదేశాలకు ఏకత సంఘటించినవారుమాత్రం వారు కారు.

ఆ యేకత నిలిపినవారున్నూ వారు కారు.

వారికందేదే కాదస లిది.

ఎంచేతనంటే?

ఏ సామ్రాజ్యమూ సార్వకాలికం కాలేదు.

ఏ చక్రవర్తి ప్రాభవమూ శాశ్వతం కాలేదు.

చక్రవర్తిత్వాలూ, చక్రవర్తుల అధికారాలూ కూడా త్రికాలాబాధ్యాలు కావు మరి.

కాగా, ధర్మాని కొక్కదానికే వుంది ఆ యోగ్యత.

ఆ ధర్మానికి ప్రవర్తకమైన భాషకే వుంది ఆ సత్తా.

కనక, మనకు – ఈ ఛప్పన్న దేశాలవారికీ చిరసంచితమయి వుండిన ఆ యేకత అక్కరలే దనుకుంటే తప్ప మనం సంస్కృతం విడిచిపెట్టడానికి వీల్లేదు.

వైదికధర్మం విడిచి మనం – ఈ ఛప్పన్నదేశాలవారమూ మరొకధర్మం అవలంబిస్తే తప్ప ఈ విశాల భరతఖండంలో సంస్కృతానికి భుక్తం అవుతున్న యీ జాతీయభాషాపదవి కూడా పోదు.

## 73

ఇప్పటికీ మనకు సంస్కృతమే జాతీయభాష.

అయితే, వెనకటి రోజుల్లో, ఆంధ్రవంగాది ఛప్పన్న దేశాల్లోనూ ఆయా దేశభాషల్లోనే వ్యవహారం అంతా.

అప్పటి సామంత రాజ్యాలు – అంటే, ఈ ఛప్పన్నదేశాల ప్రభుత్వాలు తమ దేశీయ విషయాల్లో సర్వస్వతంత్రాలు.

ఇప్పటి మన రాష్ట్రీయ ప్రభుత్వాల్లాగ శుద్ధ అస్వతంత్రాలు కావు.

కప్పం కట్టడం – చక్రవర్తికి విధేయత చూపడం – అగత్యం అయినప్పుడు సైన్యంతో వెళ్ళి సాయం చెయ్యడం – సామ్రాజ్యంతో సామంత రాజ్యాల కింతే సంబంధం.

శాసనం మాత్రం సామ్రాజ్యానికంతకూ – భరతఖండానికంతకూ వొక్కటే.

అదే మనుస్మృతి.

దానికి వాదమే మూలం.

అంటే, వేదానికి ప్రతికూలం కారాదు శాసనం.

శాసనసభలూ, తత్సభ్యుల యెన్నికలూ, తరుచుగా సమావేశం అయి, వారు శాసనాలు నిర్మిస్తూ వుండడమూ, సవరించుకుంటూ వుండడమూ, రద్దుచేసుకుంటూ వుండడమూ – ఇదంతా యింగ్లీషువారు నేర్పారు మనకు.

ప్రపంచం అంతటా ఈ పద్ధతే నడుస్తోం దివాళ.

ఇది మంచిదా చెడ్డదా అనికాదు, నా జిజ్ఞాస.

మన పద్ధతి కాదు.

మన తత్వానికింకా జీర్ణం కాలే దిది.

మనకు – భరతఖండాని కంతకూ వొక్కడే శాసననిర్మాత.

అతనే మనువు.

అతను చక్రవర్తిన్నీ.

తరవాతివారు మాత్రం అందరూ మహర్షులు.

అయితే, అప్పుడప్పుడు ఆ మహర్షులు చేసింది, శాసనసవరణే గాని శాసన నిర్మాణం కాదు.

కాలం గడిచినకొద్దీ ఇలా సవరించడం తప్పనిసరి.

అలా సవరణలు చేస్తూ వచ్చిన మహర్షుల్లో పరాశరు డిప్పటికి చివరివాడు.

అతనూ, అతనికి పూర్వం సవరించినవారూ కూడా వొక్కొక్కరే చెయ్యలే దాపని.

ఇందుకోసం పరిషత్తు లేర్పడే వప్పుడు.

సభ్యులు మాత్రం అందరూ మహర్షులు.

వారికి తెలియంది లేదు.

వారి క్కావలసిందీ లేదు.

రాగద్వేష రహితులు వారు.

త్రికాల జ్ఞానసంపన్నులు వారు.

ఉంఛవృత్తితోనూ, శిలావృత్తితోనూ బతికేవారు, వారు.

జగత్కుటుంబీకులు వారు.

చతుస్సాగర పర్యంతమూ జనుల శుభసౌభాగ్యాలే ధ్యేయాలు వారికి.

కనక, శాసనం సవరించడానికి సర్వాత్మనా వారికే అర్హత.

వారు చేసిన సవరణలకే యుగధర్మాలని వ్యవహారం.

చక్రవర్తులకయినా, సామంతులకయినా ఆ శాసనం అనుసరించడమే విధి.

అంచేత, ప్రభువులూ రాజకార్యనిర్వాహకులూ కూడా సంస్కృతం నేర్చుకోవలసిందే అప్పుడు.

సర్వాంగసుందరం కనక – వేదశాస్త్రాలు మాత్రమే కాక ఉత్తమ వాఙ్మయం అంతా అందులోనే వుంది కనక, జ్ఞానమూ, దక్షతా, ఆనందమూ కావలసినవా

రందరూ జనసామాన్యమున్నూ అది నేర్చుకునేది.

కులవర్ణాల భేదాల్లేవు దానికి.

పైగా, గుడ్డిగవ్వ ఖర్చులేదు, అది నేర్చుకోవాలంటే.

విద్యలు చెప్పడానికి గురుకులాలుండే వప్పుడు.

అప్పటి ప్రభువులు, విద్యావిధానం తమ గుప్పిట్లో యిరికించుక్కూచో లేదు, మరి.

విద్యలు అమ్ముకోనూ లేదు, మరి.

మనదేశంలో విద్యలకు దిగ్బంధనం చేసినవారు ఆంగ్లేయులు.

మన సంస్కారం మనకు దూరంచేసి, తమ సంస్కారం మనకు మప్పవలసిన అగత్యం యేర్పడింది వారికి.

విద్యావిధానం తమ గుప్పిట్లో వుంటేనే సాధ్యపడుతుం దిది.

అయితే, వెనకటిరోజుల్లో భరతఖండంలో పాఠశాలల్లేవా అంటే, కావలసినన్ని.

పాఠశాలలే కాదు, విశ్వవిద్యాలయాలూ వుండేవి జగత్తుకంతకూ సరిపోయే వెన్నో.

ఇప్పుడు మనం గుర్తించవలసిం దేమిటంటే?

ఉపాధ్యాయులను గ్రామస్థులే పోషించేవారు.

సంపన్నుడే కానీ, బీదవాడే కానీ, చదువుకోవా లనుకునేవాడికి కానీ ఖర్చు పెట్టవలసిన అగత్యం వుండేది కా దప్పుడు.

ఊళ్లిచ్చీ, నిధులిచ్చీ విశ్వవిద్యాలయాలను ప్రభువులు పోషించేవా రప్పుడు.

సంపన్నులున్నూ కానుకలు చెల్లించేవారు వాటికి.

ఎవ రేమి చేసినా "న మమ" అనుకునే చేసేవారు; గాని పెత్తనమూ, నిర్వహణా కోరి కాదు.

అవి గురుకులాలు కనక, కులపతు లనేవారు నిర్వహించేవా రవి.

వాటిమీద సర్వాధికారాలూ కులపతివి.

అతనే ప్రధానాచార్యుడు.

అన్నమూ బట్టా యిచ్చి విద్యార్థులకు చదువులు నూరిపోసేవాడు కులపతి.

విద్యార్థులు వేలమీద వుండేవారు, కులపతి కింద ఎందరో ఆచార్యులతోపాటు.

కులపతి అన్నశబ్దం చాలా విలవయినది.

కాని, కులపతి మహర్షి అన్నశబ్దాలు, ఇప్పుడు, అనర్హులకే వినియోగపడుతున్నాయి, చాలామందికి.

'అన్నదానాదినా దశసహస్రాణి య ఏకో భరే త్స కులపతిః"

అన్నమూ బట్టా, జ్ఞానమూ – ఇలాంటి విచ్చి పదివేలమంది విద్యార్థులను భరించేవాడు "కులపతి" అని నిర్వచనం మరి.

ఆ విశ్వవిద్యాలయాల్లో ఉత్తీర్ణులయి దిగ్గంతు లనిపించుకునేవారు పండితులు.

జనులకూ, రాజులకూ, చక్రవర్తులకూ గూడా ధర్మ సందేహాలు తీర్చేవా రాపండితులు.

జాతికి జాతి అంతా ఆ పండితులకు పాదపూజలు చేసేది.

సంస్కారులు వారు.

జాతి మొత్తంమీద సంస్కారం నిలపడం వారి పని.

ఏదేశాని కాదేశం తన రాజకార్యాలు తన మాతృభాషలోనే నిర్వర్తించుకునేది.

జనులున్నూ సర్వవ్యవహారాలూ తమ మాతృభాషలోనే దిద్దుకునేవారు.

భాషైకదేశవ్యవస్థ ఈశ్వరనిర్మాణం.

ఏవిధంగానూ దానికి ప్రాతికూల్యం వుండేది కా దెప్పుడూ.

భరతఖండం అంతటా జ్ఞానం లాస్యం చేసిం దప్పుడు.

దేశాలన్నీ సుభిక్షంగా వుండే వప్పుడు.

జనులందరూ శాంతంగా బతికేవా రప్పుడు.

## 74

ఇప్పుడే కా దెప్పుడూ, భరతఖండంలో, యే వొక్క దేశానా జనవ్యవహారంలో వుండిన భాష కాదు సంస్కృతం.

"మన వూహాల కందని యెన్నో శతాబ్దులకు పూర్వం వ్యవహారచ్యుతం అయిపోయిం దది" అనుకోడం అవివేకం.

అది వేదభాష.

మానవులు రచించింది కాదు, వేదం.

అపౌరుషేయం అది.

బ్రహ్మముఖోద్గతం.

మన మహర్షులు వినగలిగా రది.

అంచేతనే "శ్రుతి" అది.

కనక, దేవభాష సంస్కృతం.

అయితే, మిక్కిలీ గహనం అది, సుబోధం కాదు.

పోనీ అంటే విడిచిపెట్టడానికి వీల్లేనిదిన్నీ.

మన సంస్కారం అంతా మంటగలిసిపోతుం దలా చేస్తే.

ధర్మదూరులం అయిపోతాం మనం.

ఆటవికులదీ మనదీ వొక్కటే అంత స్తవుతుం దప్పుడు.

ఇంతకంటే పతనం యేమి వుంటుందీ?

వేదం మాట అలా వుండగా, సంస్కృతమున్నూ, మహేశ్వరుని అమరుకంనుంచి అవిర్భవించిన భాష.

కనక, వేదంవంటిదే మన కదిన్నీ.

ఇది గుర్తించి, అందరికీ సుబోధం అయేటట్టు చక్కగా సంస్కరించారు మనవాళ్ళాభాష.

దానికే "సంస్కృతం" అని వ్యవహారం అప్పణ్ణుంచీ.

వాల్మీకిమహర్షి రామాయణమూ, కృష్ణద్వైపాయనుడు మహాభారతమూ రచించిం దాభాషలోనే.

గౌతముడూ, జైమినీ, పతంజలీ – ఇలాంటి బ్రహ్మవేత్తలు దర్శనాలు రచించిందీ ఆ భాషలోనే.

కాళిదాసూ, భవభూతీ, బాణుడూ – ఇత్యాది మహాకవులు కూడా తమ అమూల్యరచనలతో రసస్రవంతులు ప్రవహింపచేసిందిన్నీ ఆ భాషలోనే.

అష్టాధ్యాయీ, దానిమీద శబ్దేందుశేఖరమూ, నవాహ్నికమూ, కైయటమూ వంటి భాష్యాలూ – ఇంత సమగ్రమైన వ్యాకరణం మరేభాషకూ లేదు.

ఈ విధంగా, అటు విజ్ఞానమూ యిటు లోకజ్ఞానమూ నిండివున్నా యీ భాషలో.

ఎంత మృదులమో అంత మధురం అది.

ఎంత సరళమో అంత ప్రౌఢం అది.

ఎంత లలితమో అంత గంభీరం అది.

ఎంత సంపూర్ణమో అంత క్లుప్తం అది.

దానికందని భావం లేదు.

అందులో లేనిదిన్నీ భావంలేదు.

మనకు నిర్మాణ శక్తేవుండాలి గాని, పారిభాషికాలకంత అనువైన భాష మరొకటి లేదు.

మన తలలో నాలుక అది.

మన రక్తంలో జీవకణం అది.

కనక, మన హృదయమున్నూ సంస్కృతమే.

ఇంత అవినాభావం గుర్తించే మన మహర్షులు జాతీయభాషగా నిర్ధారణ చేశారది.

ఇక్కడ మరొక విశేషం కూడా వుంది.

ధూమజ్యోతిస్సలిల మరుత్తుల సన్నిపాతం మేఘం.

పృథివి కాదు, గగనసీమ దానికి విలాసభూమి.

అయితే, పార్థివాలు కలిస్తేనే దానికి రూపనిష్పత్తి.

అది లేకపోతే, రత్నగర్భ అయిన యీ భూమి అంతా వో-ట్టి చవుటిపఱ్ఱ.

ఆ మేఘంవంటిదే మన భారతజాతీయత.

అలౌకికం అది.

ఖండాంతరాల్లోనే దాని ప్రసక్తి.

ఒక దేశానికి సంబంధించింది కా దది.

ఎన్నో దేశాలు కలిస్తేనే దానికి రూపనిష్పత్తి.

అది లేకపోతే మాత్రం, ఆంధ్రవంగాదు లైన ఈ ఛప్పన్న దేశాలూ చెట్టుమీది పిట్టలు.

కనక, భారతజాతీయత అలౌకికమైన నిర్మాణం.

అసాధారణం అది.

మహర్షులకే సాధ్యం అది.

భౌతికదృష్టి కందేది కాదది.

కాగా, అలౌకికమైన భారతజాతీయతకు అలౌకికమైన సంస్కృతమే భాష కావడం సహజంగానూ వుంది, ఎంతో గొప్పగానూ వుంది.

అది అర్థంచేసుకోవాలంటే చిత్తసంస్కారం వుండాలి.

పోతే, –

ఈ జాతీయభాష విషయమై మన మహర్షులు కనబరిచిన దూరదృష్టి మిక్కిలీ ప్రశంసాపాత్రం.

ఎంచేత నంటే?

భరతఖండానికి ఆంధ్రవంగాదు లన్నీ సమానాలే.

వాటిలో వాటి కీషత్తారతమ్యా లుండవచ్చు; కాని దానియెదట మాత్రం యేవొక్క దేశానికీ ఆధిక్యం లేదు.

అంచేత, వాటిలో వొకదాని భాషను భరతఖండానికి జాతీయభాషగా ఏర్పాటుచేస్తే, ఆ ప్రత్యేక దేశానికి తక్కినవాటికంటే వొకవిధమైన "శిష్ట"త్వం ఆరోపించిన ట్టవుతుంది.

ఆ దేశంవారి స్వార్థానికి దోహదం చేసిన ట్టవుతుంది.

తక్కిన దేశాల భాషలను అగౌరవపరిచిన ట్టవుతుంది.

తక్కిన దేశాలవారిని అనాగరకులని, ఆటవికులని, కిందపరచిన ట్టవుతుంది.

ఆ దేశానికది ఘనతా, తక్కినదేశాలకు అందువల్ల అపఘనతా అవుతుంది.

ఇంతటితో పోదు.

తక్కిన దేశాలవారి కీర్ష్యాసూయాజనకం అవుతుం దది.

దాంతో కలతలకున్నూ మూలం అవుతుంది, చివరికి.

అంటే "నా భాష అది. నాది కాదు. మనది కావడానికి దాని కర్హత లేదు" అన్న ద్వైధీభావం బయలుదేరుతుంది, తక్కిన దేశాలవారిలో, అవ్యవధానంగా.

"నీ భాష న్నేనెందుకు నెత్తి కెక్కించుకోవాలి?" అన్న అభిమానమున్నూ పుట్టడాని క్కారణం అవుతుంది వారికి, అవ్యవధానంగా.

ఆ భాష యెవరిదో వారికి "మీరంతా పురుగులు" అన్న నిరసనభావం పుట్టిస్తుంది తక్కిన దేశాలవారిమీద, తప్పనిసరిగా.

అపాయకరమైన సన్నివేశం యిది.

అంటే, భారతీయైక్యతకు కూకటివేరూ, వేరుపురుగూ వొక్కమాటే యేర్పడతాయి.

మహర్షులు రాగద్వేషరహితు లన్నాను.

త్రికాలజ్ఞానసంపన్ను లన్నాను.

దానికి సమన్వయం ఇలాంటిచోట కనబడుతుంది.

వా రాయోగ్యత యిక్కడ కనబరుచుకున్నారు, పూర్తిగా.

రాగద్వేషాల దుర్దమశక్తి యెరిగివుండినవారు కనక, వారు సప్రయత్నంగా అవి జయించినవారున్నూ కనక, సంస్కృతమే మనకు జాతీయభాషగా నిర్ణయించగలిగారు వారు.

వారి దూరదృష్టికి మరో నిదర్శనం చెబుతాను.

శ్రీరాము డయోధ్యావాసి.

శ్రీకృష్ణుడు ద్వారకావాసి.

"అయితే, వారి మాతృభాష లేమిటి?"

"అయోధ్యలోనూ ద్వారకలోనూ జనభాష లేమి టప్పుడు?"

ఈ ప్రశ్నలే పుట్టనివ్వలేదు మన మహర్షులు.

శ్రీరాముడు సంస్కృతభాషలోనే అవతరించాడు.

శ్రీకృష్ణుడున్నూ అంతే.

మిక్కిలీ జటిలాలైన చరిత్రలు వారివి.

ఆదర్శభూతా లైన ప్రవృత్తులున్నూ వారివి.

దేని కదే అవి, వొక్కొక్క ప్రపంచం.

సంస్కృతభాష అంతా ఆక్రమించుకుని వున్నా యవి.

కాగా, వారి విషయమై వొక్క అక్షరం కావాలన్నా సంస్కృతమే మనకు గతి.

మన ధర్మేతిహాసా లవి.

కనక, మనం చదివే తీరవలసిన వవి.

మరి, వారిభాష సంస్కృతం కాకపోతే?

"వా రెవరో"

అనేక దేశాలవారికి "మనవాళ్ళు" కారు వారు.

వెంటనే పుడతా యీభావాలు.

"గొప్ప పాత్ర"లని మెప్పు మాత్రం కలగవచ్చు; కాని ఆత్మీయత యేర్పడదు.

ఇది, వారి భారతజాతీయతాజనకత్వానికి గొడ్డలిపెట్టు.

మన మహర్షు లుద్దేశించిన భారతీయైక్యతకున్నూ పిడుగుపాటు.

అంటే?

వారు మన మూలపురుషులు కారు.

మనం వారి వారసులమున్నూ కాము.

దీంతో, ఛప్పన్నదేశాలవారికీ వుండుకున్న దృఢానుబంధం సడలిపోడం లేదూ?

తెగిన్నీపోడం లేదూ?

ఇంతటితో ఆగలేదు మహర్షులు.

మన పురాణసముచ్చయమూ, మన శాస్త్రాలూ, మన సర్వస్వమూ సంస్కృతంలోనే నిక్షేపించారు వారు.

ఆ గ్రంథాల్లో దేశభాషల ప్రసక్తే యెత్తలేదు వారు.

అంటే –

మన పురాణపురుషులూ, మన శాస్త్రకారులూ, మన మహర్షులూ సంస్కృతంలోనే అవతరించారు.

సంస్కృతంలోనే ప్రవర్తించారు.

కనకనే ఛప్పన్నదేశాల్లో యే వొక్కదేశంవారూ కారు వారు.

విశేషించి అందరికీ "మనవాళ్ళు."

"వారు మనవా"ళ్ళయితే, మరి, మనం?

ఒకటి కాదూ?

ఏకత అంటే యింతకంటే మరే మయినా వుందా?

వైదిక ధర్మం ప్రతిపాదించిన భారతీయైక్యతను, మన జాతీయభాష – మన సంస్కృతం, ఈవిధంగా దృఢపరిచింది.

శతాబ్దుల కిందట – కాదు కాదు – సహస్రాబ్దులకిందట – అదిన్నీ కాదు – మహాయుగాలకిందటే యీ యేకతను మన రక్తంలో కలిపేసింది సంస్కృతం.

తానూ కలిసిపోయింది మన రక్తంలో.

మరి "సంస్కృతం మృతభాష" అన్న సిద్ధాంతం మన వొప్పుకోడమేనా?

## 75

"అయితే, దానివల్ల, మన పృథక్త్వం నశించిందా?"

లేదు లేదు, ఆ యేకత్వంతోపాటు క్రమంగా దృఢపడింది.

అంటే, మన పృథక్త్వం వొంటిపేట.

మన యేకత్వం జమిలిపేట.

మన పృథక్త్వం సృష్టిక్రమంలోది.

మన యేకత్వం మనమే కల్పించుకుని, ప్రాణపదంగా మనమే పోషించుకున్నది.

విశ్లేషించి చూసుకుంటే, దీనివల్ల ఇటు ఆంధ్రజాతీయతా తప్పనిసరి అవుతోంది మన ఆంధ్రులకు, అటు భారతజాతీయతా తప్పనిసరి అవుతోంది.

ఒక చెట్టుం దంటే, దాని కాండం యేకాండంగా పెరిగిపోదు, పైకిపైకి.

ఒక అవధిలో అనేకాలు దాని కొమ్మ లేర్పడతాయి.

అది సృష్టిక్రమం.

ఆ కొమ్మలు దేనికదే ప్రత్యేకాలు.

వాటిలో వొక యెండిపోతే – అధవా – విరిగిపోతే, తక్కినవి దాన్ని నిలపలేవు.

ఒకటి యేపుగా పెరిగినా తక్కిన వద్దుకోలేవు.

దాని బతుకు దానిదే.

అంటే, కొమ్మ ఆధేయం.

కాండం ఆధారం.

మన భారతజాతీయతకూ, తదంతర్గతాలైన ఆంధ్రవంగాదిదేశాల భిన్న జాతీయతలకూ ఇదే పోలిక.

ఆంధ్రం – వంగం – కర్ణాటకం – మహారాష్ట్రం – ఓఢ్రం – తమిళం – ఇవన్నీ కొమ్మలవంటివి.

భరతఖండం కాండంవంటిది.

మరి, ఆ భరతఖండం చెడితే?

హరోంహర, ఛప్పన్న దేశాలూ ఏకకాలాన దెబ్బతింటాయి.

కనక, భారతీయైక్యత, మానప్రాణాలకంటేనూ మన కందరికీ ముఖ్యం.

దాన్ని మనం అందరమూ పోషించుకోవాలి.

ఆ పోషించుకోవలసిన విధానం చాలా స్పష్టం, గాహనం కాదు.

మనం ఆంధ్రులం.

మన భాషను మనం పోషించుకుంటాం.

మన జాతీయతను మనం దృఢపరుచుకుంటాం.

మన దేశం మనం బాగుచేసుకుంటాం.

తమిళుడూ ఇంతే చేస్తాడు.

కర్నాటకుడూ, మహారాష్ట్రుడూ, ఓఢ్రుడూ, గుజరాతీ, బంగాలీ – తక్కినవారూ ఇంతే చేస్తారు.

మరి, భారతదేశమో అంటే, యింకెక్కడుందీ అది?

ఇలా కాకపోతే, మరెలాగ అది బాగుచేసుకోడం?

గుజరాతీ వచ్చి ఆంధ్రభాషనూ, ఆంధ్రజాతీయతనూ, ఆంధ్రదేశాన్నీ వుద్ధరిస్తాడా?

ఉద్ధరిస్తే ఆ గుజరాతీ సంగతి యెవరు చూస్తారు?

ఆ "యెవరి" సంగతి మాత్రం మరెవరు చూస్తారు?

ఇది గుర్తించుకోలేక ఏమిటేమిటో చిలకపలుకులు పలుకుతారు పరప్రత్యయనేయబుద్ధులు.

కాక, –

రామేశ్వరం అరవల దొక్కళ్ళదే కాదు.

తిరపతీ శ్రీశైలమూ మన ఆంధ్రులవి మాత్రమే కావు.

జగన్నాథం ఓఢ్రుల దొక్కళ్ళదే కాదు.

తక్కినవిన్నీ ఆ ప్రాంతాలవారివే కావు.

భారతజాతీయత స్వత్వాలవి.

భారతజాతీయతకు దోహదా లవి.

ఈ భావం వైదికధర్మం కలిగిస్తోంది మనకు.

ఈ మనభావం సంస్కృతభాష ధ్రువపరుస్తోంది.

కనక, ఆ వైదికధర్మం విడిచిపెట్టేసుకుంటే – ఆ సంస్కృతభాష కూడా విడిచిపెట్టేసుకుంటే – మన భారతీయతనూ, మన జాతీయతనూ, మన మానప్రాణాలనూ నిలపగలవాడు సృష్టిలో లేడు.

## 76

అయితే, పృథక్త్వం మొదటిదా, ఏకత మొదటిదా మనకు?

మనకు – అంటే ఛప్పన్న దేశాలవారికీ గ్రహణం.

మొదట మనం ఆంధ్రులం,

కనక, తరవాత భారతీయులం.

ఇంత సుస్పష్ట మైన ఈ విషయం తికమకలు చేస్తున్నారు కొంద రిప్పుడు.

అనుమానాలు కలిగిస్తున్నారు.

అపనమ్మకాలు పుట్టిస్తున్నారు.

అపాయకరమైన ప్రయత్నం యిది.

నా భారతజాతీయత సుస్థితికోసం తెనుగువాణ్ణిగా నేనిది దృఢంగా గర్జిస్తున్నాను. మళ్ళీ దృఢంగా చెబుతున్నాను.

మొదట మనం ఆంధ్రులం.

వెంటనే మనం భారతీయులం అని స్ఫురిస్తుం దెవరికైనా.

ఆంధ్రభాష మన మాతృభాష కనక – మనం ఆంధ్ర జాతిలో పుట్టాం కనక – ఆంధ్రదేశం మన కాణాచి కనక – మొదట మనం ఆంధ్రులం.

మన ఆంధ్రదేశం భరతఖండంలో వొకభాగం కనక, వెంటనే భారతీయత మనకు సహజంగానే సిద్ధిస్తోంది.

ఇలాకాక మొదట మనం భారతీయులం అయితే?

మనం ఆంధ్రులమే అన్న స్ఫురణ యెలా కలుగుతుందీ?

మనం గుజరాతీలం అని యెందుకు అనుకోగూడదూ యెవరైనా?

తమిళులం అని యెందు కనుకోగూడదూ?

మరొకళ్ళ మనిన్నీ యెందు కనుకోగూడదూ?

మొదట మనం ఆంధ్రులం అనుకుంటే భారతీయులం కాక ఆఫ్రికన్ల మవుతామా?

అమెరికన్ల మవుతామా?

మరెవళ్ళమయినా అవుతామా?

కనక, మనకు భారతీయత మొదటి దనడం అవివేకం.

లేక మరెందుకో ప్రయత్నం.

మనుష్యుడు వొంటరిగా బతకలేడు.

బలగం కావాలి.

అంటే, సంఘం కావాలి.

అయితే, ప్రారంభం యెక్కణ్ణుంచి?

ఏమాత్రం బుద్ధి వుపయోగించినా విశదం అవుతుందిది.

ప్రతీ మనిషీ యెవడికి వాడే.

బలగం కావాలి, కనక, ఎవడి కుటుంబం వాడిది.

ఎవడి యిల్లు వాడిది.

ఎవడి వీధి వాడిది.

ఎవడి పేట వాడిది.

ఎవడి వూరు వాడిది.

ఎవడి ఫిర్కా వాడిది.

ఎవడి తాలూకా వాడిది.

ఎవడి జిల్లా వాడిది.

ఎవడి రాష్ట్రం వాడిది.

సరి, యింతవరకే ప్రత్యేకత.

ఆంధ్రుడికి ఈశ్వరుడు నిర్దేశించిన పరిధి యిది.

మరి, ఈ పరిధికి రక్షణ కావాలి.

దార్ఢ్యం కలిగించుకోవాలి మనం.

అదే భారతీయత.
కనక భరతఖండం మన అందరిదీని.
ఛప్పన్న దేశాలవా రందరిదీని.
ఇందులో వున్న రహస్యం యేమి టంటే?
పరిధి యెక్కువయినకొద్దీ ఏకత్వం సిద్ధిస్తుంది.
పరిధి తక్కువయినకొద్దీ వృథక్త్వం బలపడుతుంది.
పృథక్వం నుంచే ప్రారంభం.
అంచేతనే మన యిప్పటి రాజ్యతంత్రంలోనూ, వెనకటి రాజ్యతంత్రంలోనూ కూడా గ్రామమే పునాది.
కనక?
మొదట, మనం ఆంధ్రులం.
మన ఆంధ్రభాష బాధ్యతా, మన ఆంధ్ర జాతీయత బాధ్యతా పూర్తిగా మనవి.
ఈ బాధ్యతలు మనమే నిర్వర్తించుకోవాలి.
శాస్త్రీయమైన కృత్యవిభాగం యిది.
తక్కినవారికిన్నీ యివే బాధ్యతలు.
దీంతో అందరమూ బాగుపడతాం.
ఈ బాగు సార్వత్రికం అయి భరతఖండం జేగీయమానం అవుతుంది.
అంటే, ఈ భిన్నజాతుల జైత్రప్రస్థానానికి, చివరికి, భారత జాతీయత సంగమస్థానం అవుతుంది.
అదీ మన ధ్యేయం.
అదీ మన గమ్యం.
అదీ మన ప్రాప్యం.
అందుకూ మన పరాకాష్ఠ.

## 77

అదిగో – "మరి, కథ?" అన్న సమస్య నా కద్దు పడ్డప్పుడు, ఇదిగో యింత మథనపడ్డా న్నేను.
మా పెద్దన్నగారూ, నా గురువులు రామకృష్ణకవులూ నిర్దేశించిన గ్రంథాలు చదవడంవల్లనే నా బుద్ధి వికసించిందెంతో కొంత.
బంకించంద్రుడి నవలలు చదవడంవల్లనే నాకొక దృక్పథం యేర్పడిందేదో విధంగా.
రచయితను కూడా కాగలిగా నేదో యెత్తున.
కనక, నేను రాసిన గ్రంథాలవల్ల కొందరికయినా బుద్ధి వికసించాలి, ఏకొంచెమయినా, నా తెనుగువాళ్లకి.
అంటే, నా రచన చదివిన ఆంధ్రుడు, పదహారణాల ఆంధ్రుడయి నిలవగలగా లెక్కడికి వెళ్ళినా.
ఇరుగుపొరుగు జాతులవారితో కలిసిమెలిసి వుంటూ, పనిపట్టినప్పుడు పదహారువన్నె భారతీయుడుగా రూపందగలగాలి, విశాలవిశ్వంలో.

ఈ ధోరణిలో పడ్డాను దాంతో నేను.
కనక, తెనుగుకథ చూడాలి, ఏదో వొకటి.
సావకాశంగా కాదు, చటుక్కున చూడాలి.
ఇదిన్నీ వొక నిర్బంధం అయింది నాకు.
చూడనూ చూశాను, కథా దొరికింది కానైతే.
గొప్ప కథే దొరికింది కూడా.
మరి, మననం?
అంటే భావన?
కథ గొప్ప దయినా సామాన్యం అయినా, భావనవల్ల పూర్వాపరాలు స్ఫురిస్తాయి, ముందు.
అవిధంగా, క్లుప్తంగానే కావచ్చు, సమగ్రమైన కంకాళం యేర్పడుతుంది.
తరవాత రక్తమాంసాలు పుట్టుకువస్తాయి, రకరకాల భావాల రూపంగా, క్రమంగా.
ఇక దానికి జీవం పొయ్యడమే తరవాయి అవుతుంది, చివరికి.
అదే రచన.
ఇక్కడే తెలిసిపోతుంది, రచయిత జీవశక్తి యేపాటిదో.
అతను మహర్షి అయిందీ కానిదీ యిక్కడే తేలిపోతుంది.
మరి, యింతతంతు జరక్కుండా కాగితం యెక్కేస్తుందా యేకథ అయినా?
ఎక్కితే, అది చదవ్వలసిందే అవుతుందా?
ఈ గొడవలో పడ్డా న్నేను.
ఈ స్థితిలో సత్తిరెడ్డిగారు వచ్చారు.
నేనొక దారిన బయలుదేరగా, వారు మరోదారిన వచ్చారు.
పులుగుర్త నరసమాంబగారి సావిత్రి పత్రిక వచ్చేది, అంతకిమ్ముందు, కాకినాడ నుంచి.
దాని తాలూకు వొక సంచికలో "ఫుల్‌జానీబేగం" అని వొక కథ.
శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారి రచన అది.
అప్రయత్నంగా వచ్చివుండింది, నాచేతి కెప్పుడో ఆ సంచిక.
ఎవరో యిచ్చా రది, యెందు కిచ్చారో?
ఇలాంటివెన్నో జరుగుతూ వుంటాయి, యాదృచ్ఛికాలు మాత్రం కావవి.
దాతా ప్రతిగ్రహీతా కూడా గుర్తించలే రది, అప్పట్లో.
కాలక్రమాన దాని ప్రయోజనం కనపడుతుంది.
ఒక పెన్నిధే అవుతుంది, అప్పు డది.
కావాలంటే కూడా దొరకనిదిన్నీ అవుతుంది, అప్పుడు.
కోరి తీసుకువచ్చి అనపర్తి స్టేషనుమాష్టరు పిళ్ళెగారు నాకు లక్ష్మీనారాయణీయం యివ్వడమే యిందుకు నిదర్శనం.
చాలా గొప్పకథ అది.
చక్కనిది మాత్రమే కాదు, జరిగిందిన్నీ.
చరిత్రగ్రంథాల కెక్కని చారిత్రికాంశం అది.

ఔరంగజేబు చేతిలో జరిగిం దది.

ఎలాంటివాడికీ గూడా గుండెలు గుబగుబలాడించే సన్నివేశం వుం దందులో.

నవల – నాటకం – కథ – ప్రబంధం – ఏది రాయాలన్నా వొదిగే కథ అది.

నేనూ రెడ్డిగారూ కూడా ఎన్నోమాట్లు చదివేవున్నాం అది, యెవరికి వారుగానూ, యిద్దరమూ కలిసిన్నీ.

చదివినప్పుడల్లా – విన్నప్పుడల్లా "ఆహా" అనేవారు రెడ్డిగారు, నేను మాత్రం ఏదో ఆలోచనలో పడేవాణ్ణి, అనుకోకుండా.

నా చూపు బాగా ఆకట్టేసిం దది.

అంటే, నా భావనలో పడ్డమూ, ఎంతో కొంత కల్పన తోచడమూ జరిగిం దప్పటికే.

"అదిగో, అది రాయండి" అన్నారు రెడ్డిగారు.

రచయిత సమర్థుడయితే గొప్పనవల అవుతుందది, సందేహం లేదు.

రచించావచ్చు; కాని తెనుగు కథ కాకపోయిం దది.

"అయితే యేం?" అంటే మరి, నా దృక్పథం మాట?

కాక, –

మనకేం కరువా, తెనుగుదేశ చరిత్ర సప్తసముద్రాల కంటేనూ విశాలం.

కౌస్తుభం వంటి కథారత్నాలు వేలూ లక్షలూ కోట్లున్నూ అందులో.

ఆంధ్ర సంఘం చూద్దామా పోనీ, అంతూ దరీ లేనిది.

పైగా, – కళ్ళు విప్పి చూడగలిగితే, భరతఖండానికంతకూ, గురుస్థానీయమైన వైదిక సంస్కారం మనది.

భరతఖండం అంతా కమ్ముకున్న సామ్రాజ్యాలు మనవి.

ఎలాంటి ఘోరయుద్ధాల్లోనూ ఉరుములూ, మెరుములూ కల్పించిన శౌర్యసాహసాలు మనవి.

ద్వీపాంతరాల్లో కూడా నాగరకత మొలక లెత్తించిన వర్తక వాణిజ్యాలు మనవి.

అన్నపూర్ణ తల్లికి నట్టిల్లయిన భూభాగం మనది.

దక్షిణాపథాని కంతకూ ఒక ప్రత్యేక రూపందించిన కళావేత్తృత మనది.

ఇవన్నీ విడిచిపెట్టుకుని, భారతీయమే అయినా, సంప్రదాయాలు నాకు బొత్తిగా తెలియని మరో జాతి కథనే నెంచుకు చిత్రించాలీ?

ఇది సంకుచిత చిత్తతే కావచ్చు; కాని, "స్వయం తీర్ణః పరాం స్తారయతి" మరి.

పోనీ "యెవర్ని చూసి నువ్విలాంటి దృక్పథం యేర్పరుచుకున్నావో ఆ బంకిం చంద్రుడు, వంగీయం కాని కథ యెత్తుకుని 'రాజసింహ'వంటి నవల రచించలేదా?" అంటే, అందుకు తగ్గ పరిణతి అబ్బిందా నాకు?

నే నాంధ్రుణ్ణీ భారతీయుణ్ణీ కూడానూ; కాని మొదట నా ఆంధ్రత్వం దృఢపడవద్దూ?

కన్నతల్లిని కళ్ళతో అయినా చూడకుండా, యిరుగు పొరుగమ్మలకు పాదపూజలు చెల్లించడం ధర్మం అనిపించుకుంటుందా?

ఇలా వికసిస్తోంది నా చిత్తవృత్తి అప్పటికి.





అప్పటికీ నా భారతీయతలో నా ఆంధ్రతాముద్ర ప్రస్ఫుటంగా వుండాలనే నా నిశ్చయం.

కాని అదే రాయమని రెడ్డిగారి పట్టు.

"మీ వ్రతం తప్పనను. అది మా రెడ్డి ప్రాభవానికిన్నీ అమరత్వం ప్రసాదించవచ్చు ముందుముందు. పైగా, మీరు స్వయంగా పూనుకోడం కూడా కా దిది. నాకోసం రాయండి. నా ప్రార్థన మన్నించి రాయండి" అంటూ కూచున్నారు, వారు.

"మద్రాసునుంచి కాగితాలు వచ్చివున్నాయి. త్వరగా అచ్చు ప్రారంభించాలి, మరి, రచన మొదలుపెట్టండి" అనిన్నీ తొందరపెట్టారు వారు.

నాటి సాయంత్రానికే యింటికి వెళ్ళిపోవాలనుకుని వచ్చి వుండినవారు, ఆ కథ చేపట్టించడానికే వచ్చారు కనక, నాచేత వొప్పించడానికి మర్నాటి సాయంత్రం దాకా రాజమహేంద్రవరంలో వుండిపోయారు వారు.

"కాదు" అనలేకపోయాన్నేను.

రెండుమూడు రోజులు బాగా భావనచేసి రచనా ప్రారంభించేశా న్నేను.

అయితే, యీ భావనకు, ఇతరుల అనుభవం మరోవిధంగా వుండవచ్చు, నాకు మాత్రం వొకపద్ధతి వుంది.

మంచికథ అని తోచింది నా మెద డాక్రమించుకుని వుండిపోతుంది, వెంటనే.

ఏకకాలంలో రెండూ మూడూ – మరికొన్నీ కూడా అలా వుండడం వుంది.

నడుస్తున్నా, కూచున్నా, పడుకున్నా, కాలక్షేపంకోసం యెవరితోనైనా మాట్లాడుతూ వున్నా, కలంపుచ్చుక్కూచుని వున్నప్పుడు తప్ప అవే జాగృతాలవుతూ వుంటా యెప్పుడూ.

దాంతో, చిలవలూ పలవలూ పుడుతూ పెరుగుతూ వుంటాయి వాటికి.

అవి పెరిగినకొద్దీ సంస్కారమున్నూ జరుగుతూ వుంటుంది.

ఇలా జరగ్గా జరగ్గా – ఎవరిదయినా కోరికో, నా వుద్వేగమో యేర్పడి, కాగితంమీది కెక్కేస్తుంది వొక్కొక్కటే, అణా – తప్పితే – బేడకంటే యెక్కువ ఖర్చుండదు కనక.

ఇంత తంతు జరిగితేనే నామట్టుకి నాకు తృప్తిగా వుంటుందా రచన.

అదరాబాదరా భావనచేసి రాస్తే యీ తృప్తి కలగదు నాకు.

అంచేత, తొందర అయి, అసమగ్రంగానే కాగితం యెక్కేసిం దీకథ.

అయితే, వొక్క సంగతి చెప్పా లిక్కడ.

ఈ కథ విషయమై రెడ్డిగారి వొత్తిడి చాలా హెచ్చే, వొప్పుకుంటాను; గాని మరో కారణం కూడా యేర్పడింది, నాకిది బలవంతాన అయినా రాయడానికి.

మహారాష్ట్రజాతి అంటే, నాకోవిధమైన ప్రత్యేకాభిమానం ప్రాజ్ఞత వచ్చినప్పణ్ణుంచీ.

నా దృష్టిలో ఆంధ్రజాతి మొదటిదీ, మహారాష్ట్రజాతి రెండోదీనీ, భారతీయతా మూర్తిమంతంలో.

బాలగంగాధర తిలకుగారి నిండు భారతీయత అందుకు సన్నికృష్ట కారణం.

భారతీయతా వికాసంకోసం మహారాష్ట్రులు కనబరిచిన త్యాగం విప్రకృష్టకారణం.

"మరి, యీా విషయమై విజయనగర సామ్రాజ్య భూమికను మరిచిపోయావా?" అంటే లేదు లేదు.

అది జ్ఞాపకం వుంది కనకనే మహారాష్ట్రుల తత్వం అర్థం చేసుకోగలిగాన్నేను.

కాగా, ఆ విప్రకృష్టతలో, విజయనగర సామ్రాజ్యంకంటే, మహారాష్ట్ర సామ్రాజ్యం సన్నికృష్టం మనకు.

అంటే, అది మొన్నటిదీ యిది నిన్నటిదీనీ మనకు.

ఆ మహారాష్ట్రజాతి యేకైక ప్రతినిధి తిలకుగారు బతికే వున్నారు నేను కలంపట్టేటప్పటికి.

కాక, –

ఆంధ్రదేశానికీ మహారాష్ట్ర దేశానికీ కాడిగట్టు.

తెలంగాణాలో ఆ మహారాష్ట్రులతో సహవాసమూ, సాహచర్యమూ కూడా వున్నాయి, మనకు.

మనలో మహారాష్ట్ర దృక్పథమూ వుంది, మహారాష్ట్రుల్లో మన ఆంధ్రదృక్పథమూ వుంది.

మహారాష్ట్రులు మన దగ్గిరే నేర్చుకున్నారు, రాజనీతి.

శివాజీకి మన కృష్ణరాయని రాజ్యాంగమే వరవడి.

తిలకుగారే చెప్పా రీసంగతి.

మన రాజనీతి పరిజ్ఞానం మళ్ళీ మనం సంపాదించుకోవాలంటే, మహారాష్ట్రుల దగ్గిరే సంచితం అయివుందింకా అది.

ఆ మహారాష్ట్ర జాతికి చెందిన కథ నేను రాయబూనుకున్నది.

"ఫుల్ జానీబేగమ్" అన్నది ఔరంగజేబు పెట్టిన పేరు.

అసలు పేరా మెది "కమలాబాయి" అని.

ఏసాజీ భార్య ఆమె.

నారాయణరావుశిరకే కొడుకూ కోడలూను వారు.

దివ్యప్రేమ వారిది.

## 78

"నవలలు రాయలుపరిమాణంలో ప్రకటించాలి. 150 పేజీలకేదీ తక్కువ వుండగూడదు. పేజీకి రెండుకాలాలుగా అచ్చువేయించాలి. వెల 0–8–0 మాత్రమే వుంచాలి."

లెక్కలు చూసుకుని నేనూ రెడ్డిగారూ చేసుకున్న నిర్ణయం ఇది.

బాగానే వుంది, మరి, ఆ కథ ఆ పరిమాణానికి మించితే?

అథవా – అంత కాకపోతే?

ఇలా అనుకుంటూనే శ్రీరామ చుట్టేశా న్నేను.

కాని, తలుచుకుంటే వొణుకు పుడుతుం దివాళ.

ఏమంటే?

నవల రాయాలన్నా, నాటకం రాయాలన్నా, కథ రాయాలన్నా – చివరికి వ్యాసం రాయాలన్నా నాలుగైదు చిత్తులు రాసుకుంటా నివాళ నేను.

"శుభికే, శిర ఆరోహ" అన్న కథతోనే ప్రారంభం యీ పద్ధతి.

ఒక చిత్తు రాసి, అందులో హంసపాదులు పెట్టుకుంటూ సవరణలు చేసుకోడం కాదది, ఏచిత్తు కాచిత్తు మొదణ్ణుంచి చివరిదాకా సమగ్రంగా రాసుకుంటా న్నేను.

పరిస్థితిని బట్టి నాలుగోచిత్తో, అయిదో చిత్తో అనుసరించి సాఫు రాసుకుంటాను.

"మరోచిత్తు కూడా అయివుంటే బాగుండేది" అనిపిస్తూ వుండడం కూడా వుం దప్పుడప్పుడు నాకు.

వెంటనే అచ్చుకాకుండా రెండు మూడేళ్ళయినా అది అలా వుండిపోతే – అచ్చు కివ్వడం తటస్థపడ్డప్పుడు మళ్ళీ సమగ్రంగా రాసుకుంటే గాని తృప్తి కాదు నాకు.

పైగా, ఇలా యెన్నిమాట్లు రాసుకున్నా, అందుకు, రెండుపక్కలా రూళ్లు వేసిన మంచి కాగితాలే కావాలి నాకు.

రెయిలుబండికి పట్టాలెంత అగత్యమో, నా కలానికి రూళ్ళంత అగత్యం.

గ్రంథం పెరిగిపోడంవంటి దోషమూ వుందిందులో, వొప్పుకుంటాను; కాని, దీనివల్ల నాకెంతో మేలు కలుగుతోంది.

నా రుచి పురస్కరించుకుని చిత్రణం సమగ్రం కావడమే నా క్కావలసింది.

అచ్చు ప్రారంభం యినాక, యథామాతృకంగా వుందా లేదా అని చూసుకోడమే గాని, మరి, మార్పులు చెయ్య న్నేను.

అచ్చుకిచ్చి, ప్రెస్సువారెన్ని ప్రూఫులిచ్చినా, చివరికి మెషీను ప్రూఫులోకూడా పేరాలకు పేరాలూ, పద్యాలకు పద్యాలే మార్చేసి, మళ్లీ కంపోజు చెయ్యవలసిన గతి పట్టించేవా రెందరో వున్నారు నాకు తెలుసు.

అది మంచిదనుకో న్నేను.

నా స్థితి చూసి "చాదస్తం" అన్నవా రున్నారు.

"సంస్కారం చాలదు" అన్నవారూ వున్నారు.

మందహాసం చేసి, ముభావంగా వుండిపోయిన ప్రౌఢులూ వున్నారు, చాలామందిని చూశా న్నేను.

అయినా, నే నిందుకు సిగ్గుపడ్డంలేదు.

ఈ పద్ధతి మానుకోలేకుండానూ వున్నాను.

ఎంచేత నంటే?

ఎవరో అనక్కర్లేదు, నామట్టుకి నాకు తెలిసిం దెంత?

నేను చదివిం దెంత అసలు?

నేను చూసిం దెంత, యీ విశాల ప్రపంచంలో?

నాకున్న శ్రుతపాండిత్యం మాత్రం యేపాటిది?

భాషకున్నూ అంతూ దరీ యేదీ?

భావనకు మాత్రం అవధి యెక్కడ?

ఏమయినా, – నేను రాసేది గ్రాంథికం కూడా కాదాయె.

అందులో నయినా పద్యబంధం కాదాయె.

పోనీ, అడుగులో అడుగువేసుకుంటూ పోదామంటే, ఆదర్శభూతమైన రచన లేకపోయె.

ఎటు చూసినా నేలవిడిచిన సాముూ, కత్తులమీది పరీక్షాను.

కాక, –

గ్రాంథికాని కాదర్శాలు శతాబ్దులనాటి పాతపుస్తకాలయితే, వ్యావహారికానికి మనచుట్టూ ఆవరించి వుండిన జీవలోకం ఆదర్శం.

వారు పండితు లైనా పామరు లయినా లోకుల మాటతీరులో సహజమైన కాకు వుంటుంది.

అవ్యక్త మైన నాదం వుంటుంది.

అంతులేని గాంభీర్యం వుంటుంది.

అనిర్వచనీయమైన మధురిమ వుంటుంది, పుష్కలంగా.

అప్రయత్నంగా అవగాహన అయే ఆత్మీయత కూడా వుంటుంది కావలసినంత.

వాటి సమాహారమే జీవనాడి.

అది పట్టుకోగలిగితేనే రచయితకు సిద్ధి.

కనుచూపు మేరలో కూడా లేదు, నా కిప్పటికీ అది.

ముప్ఫయిసంవత్సరాలుగా నిర్విరామంగా రాస్తున్నాను వ్యావహారికం, అయినా నాదింకా సాధకావస్థగానే వుంది.

జీవద్భాషకు బహూదూరం అయి, శతాబ్దులకిందటి భాషలో పడి, దశాబ్దులకు దశాబ్దులు మునకలు పెట్టివుండడంవల్ల వచ్చిన చిక్కు నా కిది.

నా లెక్క ననుసరించి, నా స్థితి, విశేషానుభవం వుండిన యిప్పుడే యిలా వుంటే, ఆ ప్రారంభావస్థలో యెలా వుండనూ?

పైగా, భాష పాతపడిపోయినది కావడంతోపాటు సాధన కూడా అంతంతమాత్రమే అయిపోయింది నాకు.

అయినా, అప్పుడు, మొదటి చిత్తూ అదే సాఫూ అదేగా, అచ్చు కిచ్చేశాను.

పుస్తకం పూర్తిచేసి, అక్షరస్ఖాలిత్యాలు సవరించుకోడానికయినా వొక్కమాటు చదువుకున్నానా అంటే అదీ లేదు.

వీలే లేకపోయిం దందుకు.

నా రచన రాజమహేంద్రవరంలోనూ, అచ్చు రాయవరంలోనూ అయిపోయింది.

కాగా, – ఏరోజు కారోజు, అచ్చులో 8 పేజీల రాయల్ ఫారం అయేటట్టు ఎనిమిది అరటావులు రాసి నేను పోస్టు చెయ్యడమూ, ఏరోజందింది ఆరోజే రెడ్డిగారచ్చు వేసెయ్యడమూను.

ప్రూఫులు చూడ్డానికీ అవకాశం లేదు.

నిన్న ఏమి రాశానో?

కథ అతుకుతోందో లేదో?

ఇది చూసుకోడానికీ వీల్లేకపోయింది.

ఒరుగాలిలో దీపం పెట్టి "దేవుడా, నీ మహిమ" అనడం అచ్చంగా యిదే.

సరిగా యిరవై ఫారాలయిందా పుస్తకం.

పీఠికతో కలిపి 21 రోజుల్లో నేను రచన పూర్తిచెయ్యడమూ, 21 రోజుల్లోనే రెడ్డిగారు అచ్చుపూర్తి చెయ్యడమున్నూ అయిపోయాయి.

దానిపేరే మిథునానురాగం.

మరోనాలుగురోజుల్లో రెండువందల ప్రతులు తెచ్చి ఆఫీసులో గుమ్మరించారు, రెడ్డిగారు.

అది భయవ్యాకోచమో, ఆనందోచ్ఛ్వాసమో మరి, నా పుస్తకాలు చూసి వొళ్లు మరిచిపోయా న్నేను.

## 79

కాకీ యూనిఫారంతోనూ, మొలలో ఆరుబారుల రివాల్వరుతోనూ అచ్చంగా పోలీసు సబినస్పెక్టరయి, కొద్దిపాటి భేదంతో అలాంటి వేషమే వేసుకుని వొక రెడ్డియువకుడూ, పుస్తకాల కట్టతో డలాయతూ వెంటరాగా, మా తాలూకా గ్రామాల్లోనే సంచారం ప్రారంభించారు చెన్నుభొట్లవారు.

ఆధునిక వాఙ్మయం పల్లెల్లో వ్యాపించడం చాలా అగత్యమే.

గ్రంథకర్తకి, ఇరుగుపొరుగు వూళ్లలో, యేదో వొక విధమైన పేరు రావడమూ మంచిదే.

"దినమ్మూ పుస్తకాలు పట్టుకు వెడుతున్నారు."

"నెలనెలా కొత్త పుస్తకాలు తెమ్మంటున్నారుట జనులు."

"కొద్దిబకాయీతో దినమ్మూ సొమ్మిస్తున్నారు నాకు."

"పట్టుకు వెళ్లిన పుస్తకాలు వెనక్కి తేవడం లేదు."

"రెండో నవల త్వరగా పూర్తి చెయ్యాలి మీరు."

"ధోరణి చూడగా మొదటి కూర్పు నాలుగేసివే లచ్చువేస్తేగాని చాలేటట్టు లేదు."

"చెన్నుభొట్లవారి విషయమై మీకున్న దురభిప్రాయం యికనైనా తొలగిపోతుందని నమ్ముతున్నా న్నేను."

ఇలాగ ఉత్తరాలమీద ఉత్తరాలు రాయసాగారు, రెడ్డిగారు నాకు.

శ్మశానవాటిక అప్పటికి చిత్తుపూర్తయి వుంది.

కొంత అనుభవంతో, అది యింకా సాపురాద్దా మనుకుంటున్నాను; కాని కొద్దిపాటి బకాయీ లేమిటీ?

రెండుమూడుమాట్లు రాశా నీసంగతి; కాని రెడ్డిగారి జవాబులే దందుకు.

రెండుమాసాలు గడిచాయి.

రెడ్డిగారి జాబులే తగ్గాయి.

చూసిచూసి నేనే వెళ్ళాను రాయవరం.

చప్పరించేసి "మరి లాభం లే"దన్నారు రెడ్డిగారు.

"రెండోనెల పూర్తి కావచ్చేటప్పటికి జీతం ముట్టక అసిస్టెంటు మానుకున్నాడు. 'ఏరోజుకూలి ఆరోజు ఇస్తేనే' అంటూ డలాయతు మానుకున్నాడు. పట్టుకువెళ్ళిన ఆరువందల పుస్తకాలకూ నూటపాతిక రూపాయలు మాత్రమే నా చేతికి వచ్చాయి.

పోనీ అంటే, మొదణ్ణుంచీ నూటికి యాభై చొప్పున కమిషనిస్తేగాని నావల్ల కాదంటున్నారు, ఇన్స్పెక్టరు ధారవారు" అని వివరాలున్నూ చెప్పారు వారు.

ఎందుకూ ఏమి చెయ్యలేని స్థితి అయిపోయింది రెడ్డిగారిది.

వారి బెల్లంవ్యాపారం భాగస్వామి వొకాయన అక్కడే వున్నా రాసమయాన, "బాబూ" అని సంబోధించారు నన్ను.

"రాత్రి పదయాకా, ఉదయం ఏడున్నర అయాకా వీధి గుమ్మాన నుంచుని రివాల్వరు పేలుస్తాడు చెన్నుభొట్ల ఆయన. 'అదేమిటయ్యా?' అనడిగా న్నేను. 'రాత్రి రివాల్వరు పేలిందంటే యినస్పెక్టరుగారు పడుకున్నా రన్నమాట. దేవుడు వచ్చినా దర్శనం యివ్వరు. ప్రొద్దున్న రివాల్వరు పేలిందంటే, పని వున్నవారు దర్శనం చేసుకోవచ్చు నన్నమాట' అని బదులు చెప్పాడు నాకు. ఇనస్పెక్టర్లందరూ యింతేనా బాబూ?" అనిన్నీ అడిగారాయన నన్ను.

నాకు నవ్వు వచ్చింది.

ఉరిమినట్టు నవ్వారు రెడ్డిగా రొక్కక్షణం గతం మరిచి.

"ఇకనైనా మేలుకో" అన్నారు రెడ్డిగారి తండ్రి.

"తొందరపడకం"డంటూనే వున్నా న్నేను; కాని లెక్కలు తేల్చి, ఇచ్చి పుచ్చుకోడాలు వివరించి, చెన్నుభొట్ల వారిని నమ్మి నన్నీ వ్యవహారంలోకి యిరికించినందుకు విచారించి, కొద్దిపాటి నష్టం తాము భరించి, మిథునానురాగం ఆరువందల ప్రతులే తాము పుచ్చుకుని యెనిమిదివందలు నాకిచ్చి "ఇవాళతో ఎస్.పి.ఏ.ఎల్. ఆఖరు" అనేశారు రెడ్డిగారు, చేతులు దులుపుకుంటూ.

## 80

అనుకున్నదే నే నిది.

అయనాల్లో కావలసింది, రుతువుల్లో అయింది, అంతే.

అయినా, యెప్పుడూ అనుకోనిది రెండు నవలలు రాయించింది ఎస్.పి.ఏ.ఎల్. నాచేత.

నా జీవితాని కిది మంచి ముందడుగు.

కాని, మరి, ముందుమాట?

ఇక రాజమహేంద్రవరంలో వుండి చెయ్యగలిగిందేమీ లేదు నాకు.

కాని, బాగా అలవాటు పడ్డా, నెలాగా పట్నం విడిచిపెట్టడం.

పొద్దుటిపూట అంతా, సాధారణంగా, మా ఆఫీసులో గడిపేవారు చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు, వేంకటరామయ్యరు హోటల్లో ఉప్మాకాఫీలు పుచ్చుకు వచ్చి.

అప్పుడప్పుడు వడ్డాది సుబ్బారాయుడుగారి దగ్గిర కూచుంటూ వుండేవాణ్ణి నేను, దూరం పదిబారలే కావడంవల్ల.

శ్రీపాద కామేశ్వరరావుగారితో గూడా నాకు బాగా కాలక్షేపం అయేది వారు, ట్రెయినింగు కాలేజీ పని ముగించుకుని వెళ్ళేటప్పుడు మా ఆఫీసులోనూ, రాత్రి భోజనానంతరం వారి యింటోనూ.

తమ అల్లుడు (రామకృష్ణకవుల్లో రామకృష్ణశాస్త్రి) గారి శిష్యుణ్ణి కావడంవల్ల ఏర్పడ్డ వాత్సల్యంతో, అర్ట్సు కాలేజీ పని ముగించుకుని యింటికి వెడుతూ,

సాహిత్యపరంగా ఆమాటా యీమాటా చెబుతూ, గోదావరి స్టేషనుదాకా వెంటబెట్టుకు వెళ్ళేవారు నన్ను, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు.

"నువ్వు లక్ష్మీపతి సోమయాజులుగారి మూడో కొడుకువిటోయీ?" అనడుగుతూ, మార్గవశాన మా ఆఫీసుకి వచ్చి తరవాత తమ యింటికి రప్పించుకునేవారు, ఏమిటేమిటో సాహిత్యవిషయాలు చెబుతూ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు, అప్పు డప్పుడు.

నాలుగు దాటింది మొదలు నవ్వులతో నింపేసేవారు టవున్‌హాలంతా, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.

ఆ హాలు మేడమీద వుండిన వీరేశలింగం (తరవాత పీపిల్సు – చివరి కిప్పుడు గౌతమీ) లైబ్రరీలో కాలక్షేపం చేసేవాణ్ణి అప్పుడూ అప్పుడూ నేను.

రాజా శ్రీ వత్సవాయి రాయజగపతివర్మగారు, తమ (పెద్దాపురం సంస్థాన) పూర్వప్రభువుల సాహసౌదార్యాలు అంతూపంతూ లేకుండా చెబుతూ వుండేవారు, తమ బసలోనో మా ఆఫీసులోనో తరుచు.

టంగుటూరి శ్రీరాములు ప్రభృతులమీద వీరేశలింగంగారు తెచ్చిన మాననష్టపు కేసు విచారణ జరుగుతూ వుండేరోజు లవి.

ఆ కేసు వినడానికి ప్రతీవాయిదాకూ వచ్చి, విచారణ జరిగినన్నాళ్ళూ మా ఆఫీసులో వుండేవారు, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

వారానికొక మంచి సాహిత్య సభ జరుగుతూ వుండే దప్పుడు టవున్ హాల్లో.

వక్తకు ప్రతికూలు రైనవారి నేరి తెచ్చి ప్రెసిడెంటుగా కూచోపెట్టేవారు, కార్యకర్తలు.

ఒకనాడు గయోపాఖ్యానంమీద విమర్శ జరిగింది.

వక్తల్లో మరికొంద రితర్లు లేకపోలేదు; కాని, శ్రీపాద కామేశ్వరరావుగారూ, శ్రీపాద పేరయ్యశాస్త్రిగారూ, శ్రీపాద సుబ్బయ్యగారూ, నేనూ, మా శ్రీపాదవారే మరొకరూ – ఇలాగ అయిదుగురం శ్రీపాదవారం ఉన్నాము.

దాంతో, "శ్రీపాదవా రందరూ గయోపాఖ్యానంమీద విరుచుకుపడ్డా"రంటూ వారందినాలపాటు పట్నం అంతా గోలగోల అయిపోయింది.

ఇలాగ పండితులతోనూ కవులతోనూ లౌక్యులతోనూ బాగా పరిచయం యేర్పడింది నా కక్కడ.

మరి, యిలాంటి గోష్ఠులు పాలమూరిలో వుంటాయా?

అంచేత, ఎస్.పి.వి.ఎల్. పడిపోయాక గూడా కొన్నాళ్ళు రాజమహేంద్రవరంలోనే వుండిపోయా న్నేను.

హోటల్ భోజనం కావడంవల్ల, ఉండగా వుండగా అజీర్తి బాధ ప్రారంభం అయింది నాకు.

అయినా, వోపట్టాన రాజమహేంద్రవరం విడిచిపెట్టలేకపోయా న్నేను.

ఈ స్థితిలో, చివరచివర, మల్లాది సత్యనారాయణశాస్త్రి వచ్చి షష్టి గడియలూ నాదగ్గిర కూచోసాగాడు.

"అష్టావధానాలు చేస్తూ దేశం తిరుగుదాం" అంటూ పోరున్నూ మొదలుపెట్టా డతను.

☆ ☆ ☆

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# కథలు

మూడు సంపుటాలు

పునర్ముద్రణ

# త్వరలో!

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ - జ్ఞాపకాలూను

☆ ☆ ☆

## మూడో సంపుటం

★ ★ ★

అయిదారు మాసాలపాటు తిప్పి తిప్పి కొట్టింది నన్నష్టావధాన వ్యామోహం.

కూచుంటే పద్యం, నుంచుంటే పద్యం, పడుకుంటే పద్యం– అష్టావధానం చేసే టప్పుడు చూపించవలసిన మెళుకువలూ, మొలిపించవలసిన చమక్కులూ–తరుచు వీటికీ–యిలాంటి భేషజాలకూ సంబంధించిన ఆలోచనలు–ఇలా గడిచేది కాలం నాకా సందర్భాన.

ఒక్కొక్కప్పుడు, నిజంగా, అష్టావధానం చేస్తున్నా ననుకుంటూ ఉపక్రమోప సంహారాలకు సంబంధించిన ఉపన్యాసాలు కూడా దంచే వాణ్ణి నాలో నేను, ఏకాంతస్థలాన.

స్వయంభువూ కాదు, సాధ్యాసాధ్యాలూ అవసరావసరాలూ చర్చించుకుని స్థిరపరుచుకున్నదీ కాదు, కేవలమూ నడమంతరపు సిరివంటి దయిపోయింది నాకది.

నడమంతరపు సిరీ, నరాలమీది కురుపూ వొకటే రాశి.

వాటి ఉద్ధృతం తట్టుకోడం సాధ్యం కాదెవరికీ.

గతినిరోధం యేర్పడాలి, నసాళం అంటే దెబ్బయినా తగలాలి అవి తప్పించుకోవాలంటే, మరో దారి లేదు.

కాగా, దాసోహం అనకుండా వుండలేకపోయా న్నే నష్టావధానానికి.

దాని క్కారణం – ఎటు చూసినా, నాకు, సంసారం నిర్వహించుకోవడానికి తగ్గ అర్జనశక్తి లేకపోడమూ, సంసారం మీదే పడిపోడమున్నూ.

అయితే, చాలాకాలం నేనది పట్టించుకోలేదు.

నాకెప్పుడూ వుంటున్నదే డబ్బు ఇబ్బంది, అప్పుడు మరీ దారుణం అయిపోయింది.

అభిమానం ముంచుకురావడం వల్ల యేర్పడిం దది నా కప్పుడయినా, అనివార్యంగా కాదు.

తరవాత కూడా, చాలాకాలం మానాయనగారే పోషించారు నన్ను; కాని "యిక నైనా సొంతంగా పొట్టపోసుకోవా" లనిపించింది, రాజమహేంద్రవరం నివాసంతో నాకు.

ఇరవైమూడో సంవత్సరం పూర్తికావస్తోంది నా కప్పటికి.

మానవజీవితాని కంతకీ నిగ్గయిన వయస్సది.

ఒక దృక్పథం యేర్పడ్డమూ, అది స్థిరపడ్డమూ, చివరి కది జీవన్మరణసమస్య అయిపోడమూ—ఇదీ ఆవయస్సులో యేర్పడేస్థితి.

అంటే, జీవితానికి విలవ తెలిసివచ్చే సమయమూ, విలవ కట్టుకోవలసిన సందర్భమున్నూ అది.

ఒక విధంగా సాధకావస్థకు ప్రారంభం అక్కడ, మరో విధంగా పతనావస్థకు ఉపక్రమమున్నూ అక్కడ.

సాధకావస్థలో పడ్డాడా, నిద్రాహారాలు మరుపువచ్చే దశ అది.

పతనావస్థలో పడ్డాడా, విలాసాలమీదికి దృష్టి పోయే దశ అది.

ఈ దశల నిర్ణయం ఎవడికి వాడికే యేర్పడుతుంది, పరిసరాలను బట్టి.

వాటికి తగ్గ అర్థబలమైనా అంగబలమైనా కూడా తరవాతే యేర్పడతాయి, వాటికవే.

ఐహికజీవితాని కిదీ ప్రారంభక్రమం.

అయితే, సాధకావస్థ ప్రారంభమే అయివుంది, స్వాతంత్ర్యమే లేకపోయింది నాకప్పటి కింకా.

ఒక రుచి అంటూ దృఢంగా యేర్పడింది; కాని దానికి విఘాతాలు కలుగుతూ వచ్చాయి, ఎక్కడి కక్కడా, యెప్పటికప్పుడున్నూ.

కులవిద్య అన్న పేరితో మానాయనగారు నన్ను మరో విద్యలో కట్టిపడవేశారు, నిర్బంధంగా.

అదిన్నీ అంటకపోలేదు నాకు, కాని వెగటు పుట్టిపోయింది దానిమీద.

దారుణమైన ఘర్షణ యేర్పడపోయింది నాప్రారంభజీవితంలో, యీవిధంగా.

కాని, నా ప్రయత్నం నేను మానలేదు.

నా సాధన కూడా నేను కట్టిపెట్టుకోలేదు.

ఇటు గ్రంథరచనా, అటు అష్టావధానవ్యామోహమూ— ఇంతే ప్రపంచం అయిపోయివుంది నాకు.

మరి, ఐహికమూ, యిది, ఆధ్యాత్మికమూ?

ఏమయినా, డబ్బే ప్రధానమా వీటికి? అంటే ప్రాప్యమా?

పోనీ, డబ్బు సంపాదించి గుట్టలు పెడతాయా యివి?

నిశితంగా పరిశీలన చేస్తే, వొకదాని కొకటి పొంతనలేని ద్వంద్వం యిది.

అవధానం సంగతి యేమయినా, వీటిలో గ్రంథరచన ప్రాప్యమే వేరు.

అది డబ్బు కానేకాదు.

అసలు, నా గ్రంథరచనోద్యోగమున్నూ డబ్బుకోసం కాదు.

మరెందుకూ అంటే, యీ విచికిత్సే కలగలేదు నాకెప్పుడూ.

ఎలా కలిగిందో – యెందుక్కలిగిందో – యెప్పుడు కలిగిందో – శుద్ధ అజ్ఞానదశలోనే కలిగిందినాకు, గ్రంథాలు రచించి గుట్టలు పెట్టాలన్న సంకల్పం.

"గ్రంథం" అంటే యేమిటి? దాని ప్రయోజనమున్నూ యేమిటి? పోనీ, అది రచించడమ్మైనా యెలాగ? ఈ ప్రశ్నలయినా పుట్టని కేవల అభావదశ నా అజ్ఞానదశ అంటే.

తటవర్తి వెంకటరాజుగారి మామిడితోటలో, చీమతలకాయ లంతేసి అక్షరాల ఇంగ్లీషు పుస్తకం చూసినప్పుడు నాక్కలిగింది గ్రంథపరిమితి నిర్ధారణేకాని, రచనాసంకల్పం కాదు.

అప్పుడయినా నా హృదయంలో అలాంటి సంకల్పం జాగృతం అవుతోందని నే నెరగనే యెరగను.

ఆదిలో, సహపాఠులకూ, రెడ్లపిల్లకాయలకూ కథలు చెప్పే వాణ్ణి కల్పించి నేను.

తరవాత్తరవాత రాసేవాణ్ణి.

గ్రంథాలు రచించాలన్న నా సంకల్పాని కదే ప్రాతిపదిక యేమో నేను చెప్పలేను.

పోనీ, గ్రంథం అంటే యేమిటో స్పష్టంగా యిప్పుడయినా నిర్వచించగలనా నేను.

అది చెప్పడానికి నేనింతవరకూ చేసిన సాహిత్యవ్యవసాయమూ చాలదు, భావాంబరవిహారమూ చాలదు.

అంటే, నాదృష్టిలో, గ్రంథం అంతస్థు అంత గొప్పది.

అంచేతనే గ్రంథం రచించడానికి–ముఖ్యంగా కావ్యం రచించగలగడానికి మనిషి మహర్షి అయి వుండాలన్న నమ్మకం నాకేర్పడ్డం.

మరి, మహర్షి అంటే?

ఇదిగో, యిది చెప్పలేకే నేను గ్రంథం అంతస్థు గొప్పదనుకోడం.

డబ్బు, మహర్షిని తయారు చెయ్యలేదు.

డబ్బు, మహర్షిని నడిపించనూలేదు.

డబ్బు భౌతికం, కవిత్వం ఆధ్యాత్మికం, తదాలంబమ్మైన మహర్షిత్వం లోకాతీతమున్ను.

కనక, డబ్బుకీ కవిత్వానికీ లంకెపెట్టడం–అథవా–లంకె వుందనుకోడం కేవలమూ అజ్ఞానం.

డబ్బు భంగురమూ, కవిత్వం నశ్వరమున్ను.

కాదంటే, ఛందస్సుకీ డబ్బుకీ ఏమయినా లంకె పెట్టవచ్చునేమో కాని భావనకు మాత్రం అది పొసగదు.

ఛందస్సూ, పదరచనా బుద్ధివిభవాలు.

భావన పూర్తిగా హార్దికం.

అది దైవికశక్తి.

బుద్ధి కందేది కాదది.

ఏమంటే?

బుద్ధి భౌతికావరణం దాటలేదు.

భావన భౌతికావరణానికి పైది.

కనకనే కవిత్వం మానవలోకాతిశాయి.

మనుష్యబుద్ధికి పరమావధి అది గుర్తించగలగడమూ, అనుభవించి ఆనందించగలగడమున్నూ మాత్రమే.

బుద్ధిమంతుడికి పండితుడని మాత్రమే వ్యవహారం, కవి అని కాదు.

బుద్ధిమంతుడైనవాడు ప్రవృత్తిమార్గం బాగా గుర్తించుకో గలిగితే సాధనాంతరాలతో అతి సులభంగా డబ్బు సంపాదించుకోవచ్చు.

ఏమిచేసిన్నీ కవిమాత్రం ఆపని చెయ్యలేడు.

కవి కాగలగినవాడికి డబ్బుకి సంబంధించిన పరిజ్ఞానమే వుండ దసలు.

కాగా "మరి, నేను కవినా, కాదా?" అన్న ప్రశ్నేవద్దు.

మల్లాది సత్యనారాయణశాస్త్రి నా వెంటపడ్డప్పుడు నాక్కావలసి వున్నదే డబ్బు.

స్వయంభువు కాకపోయినా, అంచేతనే నాకష్టావధానవ్యామోహం ముమ్మరించడం.

పోనీ అంటే, అష్టావధానులయినవారు – శతావధానులున్నూ అయినవారెవరైనా ధనికులు కాగలిగారా?

దినాని కొక రూపాయి చేతిలో పెడితే, కూలిమనిషి మన కేపనయినా చేసిపెడతాడు.

దాంతో ఆమనిషి కొక దినం గడిచిపోతుంది.

మరి, అష్టావధాని బతుకున్నూ అంతమాత్రమే అయితే, ఆ మనిషి విశేషం యేమిటి?

ఆ మనిషిని కవి అనవలసిందేనా?

పామరుల కీవిచికిత్స కలగదు.

అంచేతనే, పద్యాలుమాత్రమే కట్టగలిగే అష్టావధానిని కవి అని గౌరవిస్తారు వారు.

కృత్రిమాలైన యీ ఆదరగౌరవాలు ఆధారంగా అష్టావధాని దినభత్యం సంపాదించుకోగలుగుతాడు.

కాలం నిలిచి పోద్దతనికి, అర్థాకలితోనో వడిదుడుకులతోనో గడిచిపోతూనే వుంటుంది.

ఆమాత్రం అయినా శక్తిలేదునాకు, స్వతంత్రించానా పస్తుపడుకోవలసిందే నేను.

కానయితే, నేనూ మాసీతా మా అమ్మగారూ మానాయన గారూ– ఇంతే మాసంసారం.

వచ్చేపోయేవారూ వుండేవా రడపా తడపా.

అది అప్పుడూ తప్పలేదు, ఇప్పుడూ తప్పడంలేదు, ఎప్పుడున్నూ తప్పిపోదు, ఇష్టా పూర్తయిన అలవాటు మా కుటుంబానికది.

మా పితామహులకాలంలో మా యింటి నిరతాన్న దాతృత్వం పరాకాష్ఠ అందుకుంది.

మునికొడవలి విడిచి మానాయనగారు పాలమూరు ప్రవేశించాకగూడా తప్పనిదే అయింది మా కది, యేకొంచెమో.

మా తాతగారి దగ్గిరనుంచి మానాయనగారి కలవాటు కావడం—పాలమూరులో అతిథులూ అభ్యాగతులూ వస్తే మాయింటోతప్ప మరి భోజనం దొరక్కపోడం—ఈ రెండు కారణాలవల్లా మాకున్నూ వ్రతంకాని వ్రతమే అది.

ఆబాలగోపాలమూ అదొక ఘనతగా భావించుకుంటాం మేము.

"అభ్యాగత స్స్వయం విష్ణుః" అన్నమాట చిన్నప్పణ్ణుంచీ యెరుగదున్నేను.

దాని ఆంతర్యం పూర్తిగా గుర్తించడమూ, దానికి విలవ కట్టడమూ ఎవరికీ సాధ్యంకాని పనులు.

అతిథులను పూజించడమూ, అభ్యాగతుల నారాధించడమూ – ఇవి ఆర్ష సంప్రదాయాలు.

మన సంఘవ్యవస్థలో దైవికాంశ సంక్రమింప చెయ్యగల నిర్మాణాలివి.

కాని, కాలం మారింది, బుద్ధులు మారాయి, దృక్పథం మారింది. ధర్మం విలవలు మారాయి, రాజమహేంద్రవరం వంటి పట్నాల్లో పరిస్థితులూ మారిపోయాయి పూర్తిగా.

పొరుగూళ్ళు వెళ్ళినప్పుడు "అన్నం పెడతారా?" అని గృహస్థులనడగడం వైదికులుకూడా తప్పుగా—హీనంగా భావించుకోడం దాకా భ్రష్టులయిపోయిన రోజులివి.

బాగా పరకాయిస్తే, అలా అడగ్గలిగినవారిలో పంక్తి బాహ్యులుగా భావించవలసిన వారుంటున్నారు, చాలామంది.

ఇంతవరకూనేను, అనేకవూళ్ళలో – అనేకుల ఇంటికి అతిథి గానూ వెళ్ళాను, అభ్యాగతుడుగానూ వెళ్ళాను.

అదొక భాగ్యంగా కూడా భాగ్యంగా భావించుకుంటున్నానిప్పటికీ నేను.

అన్నం దొరక్క నేనెక్కడా పస్తుండలేదు.

వైదిక ధర్మం విలుప్తమయిపోయేదాకా చెక్కుచెదర దీ సంప్రదాయం యీ భారత భూమిలో.

హోటళ్ళు విస్తరించడం యీకాలానికి తగ్గట్టేవుంది, కాదనను.

వాటి అగత్యమూ యెక్కువే, ఆక్షేపించను.

కాని, అప్పట్లో "యీ కాస్త సంసారభారమే మొయ్యలేమూ మనం?" చాలా అభిమానపడి పోయాన్నేను.

ఆ వయస్సున—పెళ్ళాం కాపరానికి వచ్చాకకూడా కానీకికీన్నీ పరాపేక్షగా బతకడం హేయమే.

అయితే, అదృష్టవశాన, ఆ స్థితి యేర్పడ్డప్పుడే కలిగేది నాకీ ఆవేదన.

ఒక్కొక్కప్పుడు తల తిరిగిపోయేటంతగా కూడా కలిగేది.

దాంతో, ఎటుచూసినా శూన్యమే కనపడేది కళ్ళకి.

మనసున్నూ అయోమయావస్థలో పడిపోయే దెంత బిగపట్టుకున్నా.

కాని, ఉండుండి వ్యగ్రోత్సాహం కలిగిపోయేది రచన విషయమై, దానికదే.

అంతా – క్షోభ సమస్తమూ మరుపువచ్చేది, దాంతో.

అంతగా క్షుభితం అయిపోతూవుండిన మనస్సున్నూ నిశ్చలం అయిపోయేది, మంత్రించినట్టు.

ప్రపంచమే తెలిసేది కాదు.

మత్తు—మైమరుపు—పారవశ్యం—మరేమయినా అనండి, అదేదో అది కలిగిపోయేది నాకు.

యాతనా బహుళమైన మానవజీవితంలో స్తుతిపాత్రాలైన మధురక్షణాలివి.

అయితే, కళావేత్తలా, కళాపరులా సఫలజీవితాల్లో మాత్రమే ప్రసన్నాలవుతాయివి.

సామయికంగానైనా ద్వంద్వచింత నశిస్తేనే కలిగేవిన్నీ యివి.

కనక, దేవతలకున్నూ ప్రలోభజనకం యీస్థితి.

"సమాధి" అని దీనికే మారుపేరు.

బుద్ధి సూక్ష్మతా, నిపుణతా, ప్రతిభాత్వమూ – ఇవి బహుజన భాగధేయాలు.

ఇవి కావు ఈమధురక్షణా లేర్పడ్డానిక్కారణాలు.

చిత్తవృత్తికి చాంచల్యమూ – బాహ్యాముఖ్యమూ మాత్రమే కలిగిస్తాయివి.

చిత్తవృత్తి నిరోధమే కలగవలసిన స్థితి యిది.

యోగీశ్వరులైన మహర్షులకే సిద్ధిస్తుందిది.

కనకనే "మహర్షి–కవి" యివి పర్యాయపదాలని చెప్పి వున్నా నొకచోట.

అయితే, ఋషిత్వం జాగృతం అయేచోట భాసించేది ఐక్యానుసంధానమూ, కవిత్వం జాగృతం అయేచోట భాసించేది రసనిష్ఠాను.

తోడబుట్టిన వివి; కాని భిన్న ప్రకృతికాలు.

ఐక్యానుసంధానం యేర్పడిందా, జగత్తు నశిస్తుంది.

అది లయం.

రసనిష్ఠ యేర్పడిందా, జగన్నిర్మాణం జరుగుతుంది.

ఇది సృష్టి.

ఇవి రెండూ సామాన్యుల కందనివి మాత్రమేకావు, అవగాహన కానివిన్నీ.

సొంతానికి సాధ్యాలు కాకపోయినా, యోగుల సమాధ్యవస్థా, కవుల తన్మయావస్థా గుర్తించగలగడం మనిషికి గొప్ప పరాయణాలు.

నా యీ అవస్థ, మా నాయనగారు సకృతులుగానూ, మా చిన్నన్నగారు తరచుగానూ భంగపరిచేవారు.

మిత్రుల మనుకునేవారున్నూ చేస్తూ వచ్చారీపని.

నాశ్రేయస్సు కోరుతున్నా మనుకుంటూనే అలాచేస్తూ వచ్చారువారు, కాదనను.

వారికి దుశ్చింతా ఆరోపించలేను.

కాని వారనుకున్నది కాదు, నే నాశించిన శ్రేయస్సు.

వారు పోషిద్దా మనుకున్నదీ కాదు నేను సాధించుకుందామనుకున్న శ్రేయస్సున్నూ.

శ్రేయోరూపమైననా ప్రాప్యం సర్వాత్మనా వేరు.

దానికి చెయ్యవలసిన ప్రయత్నమున్నూ వేరు.

"ప్రయత్నం" అన్నదిక్కడ పామరభాష, "సాధన" అంటే దానికి సరిపోతుంది కొంచెం.

దాని నిజమైన పేరు "తపస్సు"

ఈ విషయమై నాకింత నిశ్చయజ్ఞానమూ, యింత దృఢనమ్మకమూ వుండినా, నన్నుపూర్తిగా పెడదారిని పట్టించింది, అష్టావధాన వ్యామోహం.

గురూపదేశం, లేకుండా స్వయంకృషితో సాధనచేస్తే "యిది నిష్కృష్టం అవునా కాదా?" అన్న మీమాంస కలుగుతూ వుంటుందెవరికయినా, ఎప్పుడైనా.

నాకు సంభవించిం దిదే.

కొంతక్కొంతయినా నా జీవితం వ్యర్థంగా గడిచిపోడానికిదే ముఖ్యకారణం.

ఈ కారణం వల్లనే సత్యనారాయణశాస్త్రి మాట కాదనలేక పోయాన్నేను.

అయితే, అతను కవికాకపోవడం వల్ల, జంటకవులం కావడానికి వీల్లేకపోయింది మాకు.

మొలలోతు దుఃఖంలో మోకాలిలోతు సంతోషం అన్నట్లు, నా దురదృష్టంలో యిదొక అదృష్టం.

మేము జంటకవులమే అయినామూ, స్పర్థ, ఉత్సాహం, కీర్తికాంక్ష–ఇలాంటి ప్రలోభాలతో పెనవేసుకుపోయినా జీవితం అంతా నిరర్థకం అయిపోయివుండును, పూర్తిగా.

నాగురువులు జంటకవులే; కాని జంటకవుల సిద్ధాంతం యెప్పుడూ ఆమోదించలేదు నేను.

సమర్థులే అయినా, యిద్దరు కవులు సమిష్టిగా కవిత్వం సాగిస్తామనడం హాస్యాస్పదం.

కవిత్వానికే అపచారం అది.

చాలా మాట్లే వచ్చింది నాగురువుల దగ్గిరకూడా యీచర్చ.

ఇది విని, వొక్కమాటే స్పష్టంగా చెప్పారు వారిద్దరూ కూడా "వ్యవహారరీత్యా మాత్రమే దాని ప్రయోజనం" అని.

"అయినప్పుడు, మరెందుకూ కవిత్వంపేరు చెప్పుకుని కలియడం?"

దీనికి సత్యనారాయణశాస్త్రి చెప్పిన ప్రత్యుత్తరం "మన అష్టావధానం విశిష్టమై మిక్కిలీ జనరంజకం కావడానికి" అని.

ఈ జనరంజకత వొకటే అష్టావధానంలో వుండుకున్నది, మరో పరమార్థం లేనేలేదు.

మేమిద్దరమూ కలిస్తే అది మాత్రం మే .మనుకున్నదాని కంటే యెక్కువగా కలుగుతుంది, సందేహం లేదు.

నేనష్టావధానం చెయ్యగలిగితే అతను నేత్రావధానం చెయ్యగలడుమరి.

వీటిలో వొకటి చలవగలవెన్నెలా, మరొకటి కలిమిగల పరిమళమున్ను.

కనకనే, అష్టావధానం అంటేనే యెన్నో మాట్లెంతో తిరస్కరిస్తూ వచ్చాను, గాని యీ విశేషం కనపడ్డాక మరి కాదన లేకపోయాన్నేను.

అతని క్కలిగినంత కాకపోయినా, నాకూ కలిగింది "మనం వొక్కళ్ళమూ బయలుదేరితే రూపాయవచ్చేచోట, అతణ్ణి కలుపుకుంటే పదిరూపాయలు వస్తా"యన్న నమ్మకం.

అయితే, అష్టావధానంలో మిక్కిలి కష్టసాధ్యమైనది నిషిద్ధాక్షరీ, మిక్కిలి సులభసాధ్యమైనది నేత్రావధానమున్నూ.

ఏమంటే?

నిషిద్ధాక్షరి నిర్వహించాలంటే నికరమైన సాహిత్యమూ, నిశితమైన సద్యస్ఫూర్తీ వుండాలి. నేత్రావధానం నిర్వహించాలంటే మాత్రం కళ్ళూ, ఆకళ్ళలో చూపూ వుంటేచాలు.

ఆచూపన్నదయినా రాసి చేతికిచ్చింది గ్రహించగలగడానికే. కనుగుడ్లుంటేనే చాలు, సూచించడానికి.

తంతివార్తచేత్తో కొడతారు, నేత్రావధానం కళ్ళతో కొడతారు, అంతే భేదం.

నేత్రావధానానికీ అక్షరసంధాత (కంపోజిటరు) కూ వుండవలసిన యోగ్యత వొక్కటే, అది అక్షరజ్ఞానం వుండడం.

కనుగుడ్లు అటూఆయిటూనూ, గిరగిరానూ-గబగబానూ, ఆచిఆచీ రెప్పలల్లార్చడమూ-ఇంతే నేత్రావధానం.

అదీ వొక విద్యే అనుకుంటే, మూఢులూ మూర్ఖులూ కూడా చెయ్యవచ్చు, అది నేర్చుకోడానికీ, సాధనచెయ్యడానికీ రెండు రోజులయినా అక్కర్లేదు, పూర్తిగా.

వల్లించవలసిన మాటలూ, చింతన చేసుకోవలసిన రచనా, అవగాహన చేసుకోవలసిన విషయమూ, అలవర్చుకోవలసిన నిపుణతా, జ్ఞాపకం వుంచుకో వలసిన కథా-కనీసం యేకరువు పెట్టుకుంటూ వుండవలసిన గ్రంథమూ-ఏమీ లేవందులో.

భావమే లేదందులో, భావుకత అసలే అక్కర్లేదు.

రబ్బరు బొమ్మకూడా కళ్ళు తిప్పుకుంటుంది, కీ యిస్తే.

కేవలమూ శుష్కప్రక్రియ అది.

నలుగురిలోనూ వున్నప్పుడు ప్రేయసీ ప్రియుడూ కళ్ళతోనే మాట్లాడుకుంటారు.

ఎన్నెన్నో రహస్యాలూ, ఎంతెంతలేసో ఆంతర్యాలున్నూ మాట్లాడుకుంటారు.

అతిమధురాలూ వుంటాయి వాటిలో, యెన్నో.

భావుకతకూ గ్రహణశక్తికీ ప్రాముఖ్యం ఇక్కడ.

ముఖ్యంగా స్త్రీలకు-వారిలోనూ మళ్ళీ తరుణుల కెక్కువగా వుంటుందా నేర్పు.

హావభావాలతోనే వారి వ్యవహారాలకు నిర్వహణ, మరి.

పురుషుల నెందు కెందుకో ఆజ్ఞాపించడానికీ, తమ చుట్టూ తిప్పుకోవడానికీ ఆవిధానమే అవలంబిస్తారు వారెక్కువగా.

ఆకళ్ళతోనే రకరకాల అవసరాలు తీర్చుకుంటారు వారు.

అదొక విద్య.

సామాన్యం కాదు, చాలా గొప్ప విద్య.

కేవలమూ విద్యమాత్రమే కాదు, కళకూడానూ.

కళ్ళల్లోనూ, మళ్ళీ, లలితకళ.

నేర్చుకుంటే వచ్చేది కాదది, స్వయం వ్యక్తం కావలసింది.

స్త్రీలకు మిక్కిలీ శక్తివంతమైన విజయకీలకం అది.

అది వుండినందువల్లనే స్త్రీల కంత ఆకర్షణ.

కనకనే కావ్యాని క్కాంతతో పోలిక.

సంతోషమూ విషాదమూ—కోపమూ ప్రీతీ—దైన్యమూ ధైర్యమూ—యాచ్ఞా ఆజ్ఞా—ఆదరమూ తిరస్కారమూ—ప్రతీక్షాతృప్తీ— ఆశానిరాశా—కోరికా నిర్లిప్తతా—ఉత్సాహమూవిసుగూ—మెప్పూదెప్పూ—నవ్వింపూ కవ్వింపూ—కొసరికోలూ కసరికోలూ—ఆమోదమూ ముభావమూ—వెటకారమూ తృణీకారమూ—ఇలాంటి మానసిక వికారాలన్నీ చూపించుకుంటారు వారా కళ్ళతో.

సూటిగా, గుండెల్లో నాటేస్తారు కూడా అవి.

కాని, నేత్రావధానం అన్నది, ఆ ప్రేయసీ ప్రియుల ఆకళ్ళ వ్యాపారంతో పోల్చడం అన్నది మిక్కిలి దుస్సాహసమే అవుతుంది.

నేత్రావధానంలో అక్షరాలు మాత్రమే వుంటాయి, భావాలు కావు, వాక్యాలయినా కావు.

అది కలకాదు.

కూసువిద్యకాని విద్యేకాదు, అసలు.

కాని, పామరులు మాత్రం ఉబ్బితబ్బిబ్బయిపోతా రదిచూసి.

విద్యలూ, కళలూ గూడా గ్రహించలేరుమరి, వారు.

సూచన పని చెయ్యదు వారిదగ్గర, వాచనమేగాని.

అష్టావధానమే కూసువిద్య, నేత్రావధానం ముష్టిలో గోరుముష్టి వంటిది.

అయితే, అనేకుల అష్టావధానంలో వుండనిది అది.

అదివుండిన అష్టావధానం చూసినవారున్నూ బహూ తక్కువగా వుంటారు.

చూస్తే మాత్రం డంగయిపోతారు, తప్పదు.

కనక?

తానూ నేనూ కలిస్తే దోచెయ్యవచ్చునని అతని పేరాస.

ఇంతకీ,—

కవే కాడుగాని, మంచి సాహిత్యవేత్త అతను.

అతని గ్రహణశక్తి మెచ్చతగ్గది.

ప్రాస్తావికనైపుణ్యమున్నూ కొనియాడతగ్గది.

మంచి సద్యస్ఫూర్తీ ఆకర్షణశక్తీ కూడా వున్నవాడతను.

ఎలాంటివారినీ యిట్టే సావధానులను చేసుకోగలిగేవాడు.

సావధానులను ఇట్టే లోబరుచుకునేవాడు.

ఇక అతని దగ్గిర వుండిన లోటల్లా, తనకున్న శక్తులన్నీ అష్టావధానం దగ్గర దిగతుడుపు అన్న భ్రాంతి.

అతి సులభంగా ద్రవ్యం సంపాదించగలడు, ఎక్కడికి వెళ్ళినా సొంతంగా బతగ్గలడు; కాని యిదిగో, యీ భ్రాంతే నా చుట్టూ తిప్పిందతణ్ణి.

పద్యాలు కడితే గాని అష్టావధానికి వేషం పూర్తికాదు.

పద్యాలు కట్టడానిక్కావే కానక్కరలేదు.

తక్కిన అన్ని హంగులూ వున్నాయి, పద్యం కట్టడం మాత్రం కుదరలే దతనికి.

"కవిత్వం లేకపోతే మానె, చక్కని కల్పన అయినా వుండక పోతే యెందు కాపద్యాలూ?" అని యెదురడిగా డతనొకమాటు. "పద్యమే కట్టలేవ్వూ?" అనడగ్గా.

"పద్య వేరూ, కవిత్వం వేరూను" అన్న పరమార్థం తెలిసిన వారు చాలా అరుదు మన వదాన్యుల్లో.

ఈ జ్ఞానం కవుల మనుకునేవారిలో కూడా చాలామంది కున్నట్టు లేదు.

"ఛందస్సులో వుండే నాదం వేరూ, సంగీతంలో వుండే నాదం వేరున్ను" అన్న సత్యం తెలిసినవారు కూడా చాలా తక్కువ మన రసికుల్లో.

ఈ విషయం యెంతో గంభీరంగా వివరించా డతనొకమాటు.

ప్రసక్తాను ప్రసక్తంగా, తిరుపతి శాస్త్రిగారికీ వేంకటశాస్త్రిగారికీ చాలా అంతరం వుందన్నాడతను.

"తిరుపతి శాస్త్రిగారి దగ్గిర సాధారణంగా జనులాట్టేచేరరు"ట.

"వేంకటశాస్త్రిగారిని మాత్రం పదులూ పాతికలూ వందలూ చుట్టుకుంటారు"ట, కళ్ళు బడ్డం తడువుగా.

"అదంతా ప్రస్తావచాతుర్యం" అని అతని నిర్ధారణ.

"ఝుడితి స్ఫూర్తీ, మాటల్లో యెదురు దెబ్బ తీసే నేర్పూ, పద్యం చదవడంలో వొడుపూ, బలగం కోసం విచక్షణలేకుండా ప్రతీవాణ్ణీ చేరదీసుక్కోవడమూ, చేతికందిన వాణ్ణల్లా తమ గొడవల్లో యిరుకించుకుని మరి కదలకుండా చేసుకోవడమూ—వెంకట శాస్త్రిగారి సత్తా యిది. ఇదే కవిత్వం అనుకుంటుంది పామర లోకం" అని అతని వివరణ"

"వో—ట్టి శబ్దార్థంగాణ్ణి పట్టుకు పాకులాడతా వేమిటోయ్?" అవడిగారుట వెంకటశాస్త్రిగారు, తిరుపతి శాస్త్రిగారినోమాటు, కళ్ళతో తనని నిర్దేశిస్తూ.

"వినపడిందా?" అన్నట్టు, సాకూతంగా చూశారుట తనకేసి తిరుపతి శాస్త్రిగారు.

"దానికి బదులు చెప్పాలంటే కొంచెం పెద్దమాట వాడాలి; కాని అది తిరుపతి శాస్త్రిగారి సమక్షం కావడం వల్ల మూగ వాణ్ణయి పోయాన్నేను, కావాలని" అన్నాడతను.

తిరుపతి వెంకటకవులను గురించి కచ్చితమైన అతని వివరణ "విడిపోతే తిరుపతి శాస్త్రిగారు జనరంజనచెయ్యలేరు. స్వశక్తినే నమ్ముకుంటే వెంకటశాస్త్రిగారు పండితుల యెదటా, పండిత కవులయెదటా నిలవలేరు" అని.

మా రామకృష్ణశాస్త్రిగారున్నూ యెన్నో మాట్లన్న మాటయిది.

ప్రసంగవశాన, దివాన్ మొక్కపాటి సుబ్బారాయుడుగారి సన్నిధిని, పురాణపండా మల్లయ్యశాస్త్రిగారున్నూ వొకమాటన్నమాట యిది, మా రామకృష్ణశాస్త్రిగారితో.

అయినా, తిరపతి వేంకట కవుల్లాగ తానుకూడా సభలకు వెళ్ళాలనీ, వోహో అనిపించుకోవాలనీ వుబలాటం అతనికి.

అయితే, సభ అంటే అనంతకోటి ప్రజానీకానికి అనిర్దిష్ట ప్రాతినిధ్యం వహించే పరిమిత జనుల సమావేశం.

అందరూ పండితులయినవారే వుండరు దాల్లో.

తమాషాలు చూడ్డానికి వచ్చే నేలబారు మనుష్యులే అధికంగా వుంటారుకూడా, అందులో.

కనక, విద్యలక్కంటేనూ కళలక్కంటేనూ వినోదాలకే యెక్కువ చెల్లుబడి సభల్లో.

గోష్ఠి అయితే మాత్రం యెంత పాండిత్యం అయినా చూపించవచ్చు, ఎంత రసికత అయినా కనపరచవచ్చు.

సభకి వెడితే సత్యనారాయణశాస్త్రి దగ్గిరవున్న రంజక శక్తి నేత్రావధానం వొక్కటే.

కాని, బరిమీద అదొక్కటీ చాలదు.

ఉపాంగంగా మాత్రమే చూపించతగ్గదది, ప్రధానంగా కాదు.

కనక, మరో రంజకశక్తి కలవాడితో కలియడం అగత్యం అయిందతనికి.

ఆ మరో రంజకశక్తి పద్యబంధం అయి, ఆ మరో మనిషి అష్టావధానిన్నీ అయివుంటే?

"దోచెయ్యవచ్చు" నన్న పేరాస, యిదిగో, యీ నమ్మకంతో కలిగిందతనికి.

ఇంకొకటి కూడా చెప్పాలిక్కడ.

అష్టావధానం మీద వున్న ఆదరభావమూ, వ్యామోహమూ శతావధానం మీద లేవతనికి.

శతావధానంలో జటిల లేదంటా డతను.

"నూరుగురికి చెప్పాలి పద్యాలు, నిజమే. కాని పనిమాత్రం వొక్కటేగా" అన్నాడతను, పెదవి విరుస్తూ.

ఆశుధార వుండినవారెవరైనా చెయ్యవచ్చు శతావధానం, సుళువుగా.

అష్టావధానం అయితే, యెనిమిది పనులు చెయ్యాలొక దానికొకటి సంబంధం లేనివి, ఏకకాలాన.

ఆ యెనిమిదీ కూడా చాలా జాగ్రత్త పడవలసినవే.

పైగా "సమిష్టి బాధ్యత"కలవి కూడానూ అవి.

ఒకటి చెడ్డా అంతా చెడిందన్నమాటే.

కనక, అనేకవిధాల సావధానత కనబరుచుకోవా లష్టావధానంలో.

"ఆల్‌రౌండు మనిషి - బహుముఖ ప్రజ్ఞాశాలి" కావాలి, అష్టావధానం చెయ్యాలంటే.

అంచేతనే రంజకత్వమూ, ఆకర్షణా యెక్కువ, దాల్లో.

ఎనిమిది - వంద - ఈ మొత్తాల కుండుకున్న అంతరం చాలా గొప్పదే.

మూర్తిమంతంలో సింహానికీ ఏనుక్కీ వుండుకున్న అంతరం వంటిదది.

కనక, అంతరం మాత్రమేకాదు చూడవలసింది, అంతస్థుగాని.

శతావధానం అంటే, ఎదటబడి ఆక్రమణచేసే శత్రువుని కాసుకోడం మాత్రమే.

అష్టావధానం అంటే, ఎదటా పక్కలా వెనకా కూడా కమ్ముకుని ఆక్రమణ చేసే ఎందరో శత్రువులను కాసుకోవడం.

కాక, – శతావధానం సత్యనారాయణశాస్త్రికి ప్రమేయం వుండదు, పద్యాలు కట్టలేడు కనక.

అష్టావధానంలో అయితే కల్పించుకోడానికి చాలా అవకాశం వుంది.

అతనితో కలియడం అష్టావధానికే యెక్కువ శ్రేయస్కరం.

కనక, నేత్రావధానంలో వుండుకున్న పామర రంజకశక్తి బాగా గుర్తించగలవాడైతే, అష్టావధాని, కోరీ, ప్రార్థించీ, ప్రలోభ పెట్టీకూడా తనకు సహచరుడుగా చూసుకుంటాడు.

అంచేతనే, మనస్సు కలసిన పూర్వపరిచయానికీ వూహా తోడుకాగా, ఎన్నోమాట్లు వచ్చాడు నాకోసం అతను.

ఎంతో ప్రయత్నించాడు.

ఒకమాటు రెండురోజు లుండిపోయాడు కూడా, నాబసలో, ఎలాగయినా నన్నొప్పించాలని.

ఆ రెండురోజుల్లోనూ, నలభై యేడుగంటల యాభై తొమ్మిది నిమిషాలపాటు చాలా గట్టిగానే ప్రతిపక్షం చేశా నతని ప్రతిపాదన, నేను.

కాని, చెప్పానుగా?

నా డబ్బు ఇబ్బంది బలీయం కావడంతో, చివరికి "సరే" అనేశాను, కళ్ళుమూసుకుని.

## 3

నిజానికి, ఆదిలో, కవిత్వం పరంగానే పుట్టింది అష్టావధానం; కాని కవిత్వం మాత్రం వుండ దందులో.

వో–ట్టి పద్యాలు మాత్రం వుంటాయి, కొల్లలుగా.

ఆ పద్యాలు వదులు వదులుగానూ వుండవచ్చు, బింకం గానూ వుండవచ్చు, కాని కాగితప్పువ్వులూ అవీ వొకటే రాశి.

అయినా, వాటికోసమే యెగబడతారు పామరులు.

"తక్కువ కులాలవారు – అథవా – చదువుకోనివారు" అని కాదు, పామరులంటే నా నిర్వచనం, "అర్థజ్ఞానమూ–అది వుండినా రసగ్రహణశక్తీ లేనివారు" అని మాత్రమే.

వారికిక్కూడా, శుద్ధ శుష్కాలయినా, రసమహితాలే అయినా పద్యాలు విని ఆనందించాలంటే, అందుకొక అనుపానం వంటి దేమయినా వుండాలి, దండిగా.

పామరులదృష్టిలో, పద్యాలకా అనుపానం వంటిది సంగీతం వొక్కటే.

కాని, విని, అనుభవించి, ఆనందించాలంటే మరోకళ తోడ్పాటక్కరలేదు కవిత్వానికి.

సహజంగానే మధురాతిమధురం అది.

ముఖ్యంగా, సంగీతమే దానికి తోడు కావాలనడం అజ్ఞానం.

ఆలోచనామృత మైనదానికి, ఆపాత మధురమైనది తోడ్పడుతుందనుకోడం హాస్యాస్పదమైన విషయం.

సంగీతం కలపడం, కవిత్వానికి నైచ్యం ఆరోపించడం అవుతుంది.

దీనికి సాయం, పద్యమే కవిత్వం అనుకునే అజ్ఞానం వొకటి పేరుకునివుంది, మనదేశంలో.

కాగా, కవిత్వం, అనుభవించి ఆనందించడానిక్కాదు మన వారికి, పాడుకుని ఆనందించడానికి.

అంచేతనే కవులక్కంటే పద్యబంధ నిపుణులకు మన్నన యెక్కువ మన దేశంలో.

శరీరబలం కలవారు, రకరకాల మొగ్గలు వేస్తారు, కొందరు.

మరి, మొగ్గలు వెయ్యడానికేనా శరీరబలం?

పామరులను ఆకర్షించడానికీ, తన్మూలంగా, వారి దగ్గిరవున్న డబ్బు లాగడానికీ చేసే వంచన సర్కస్సు.

పద్యబంధ నిపుణులు చేసే అష్టావధానమున్నూ సర్కస్సే, తద్భిన్నం కాదు.

ఒక గారడీ అని కూడా గట్టిగా చెప్పవచ్చునది.

అర్థతః,—అష్టావధానంలో నేత్రావధానం అంటే, గారిడీలో మరో గారిడీ అన్నమాట.

చూడ్డానికి చాలా "తమాషా"గా వుండవచ్చునవి, పామరులకు.

కాని, నిజంగా కవి అయినవాడికి, అష్టావధాని కావడమూ, శతావధాని కావడమూ పతనం.

పామరులు ఏదీ తరచాలేరు, అవగాహనా చేసుకోలేరు, అనుభవించాలేరు, సాకల్యంగా.

గాఢ ప్రతిభులు కారు మరి, వారు.

కాలక్షేపం మాత్రమే కావాలి వారికి.

అందుకేదో వొక వినోదం కావాలి.

అదిగో, అవినోదాల్లో వొకటి అష్టావధానం.

వట్టి వినోదంకాదది, పృచ్ఛకులకు విద్వాంసులన్న బిరుదం యిస్తుందది.

పద్యబంధ నిపుణులకు మహాకవులన్న బిరుదమూ యిస్తుందది.

కాని, దానివల్ల, వారు పండితులూ కారు, వారు కవులయినాకారు.

కవి అయినవాడు కవితా కళ చూపించాలి, పండితుడైన వాడది గ్రహించి ఆనందించ గలగాలి.

అవధానంలో, మస్తిష్కానికెంతో కొంత పొంగు పుట్టించేదేమయినా వుంటే వుండవచ్చుగాని హృదయానికి స్పందనం కలిగించేది లేశమూ లేదు.

అంచేతనే అది కళకాదనడం.

వీపుమీద కొట్టిన పువ్వులో దూరాన కొట్టిన గంటలో సరిగా లెక్కచెప్పడమూ, క్రమం తప్పించీ, విడివిడిగానూ, అప్పుడూ అప్పుడూ యిచ్చే అక్షరాలు సక్రమంగా కలిపి వప్పచెప్పడమూ, సమస్య పూర్తిచెయ్యడమూ, సవ్యస్ఫూర్తితో సంభాషణ సాగించడమూ, — ఇలాంటి పనులు భంగపాటు లేకుండా ఏక కాలాన నిర్వహించగలవాడు కుశాగ్రబుద్ధీ, మేధావీ అనిపించుకుంటాడేగాని కవి అనిపించుకోడు.

కవితా సామగ్రి అనిపించుకోతగ్గ లేదుమరి, అందులో.

మనదేశంలో అవధానాల కుందుకున్న మన్నన, మన కళావేత్త్వమూ మన కళాభినిరతికీ అపకీర్తికరం.

తెగబడి, అష్టావధానమో శతావధానమో చేస్తూ దేశం తిరిగితే యెంతోకొంత డబ్బు సుళువుగా నొల్లుకోవచ్చు నెవరైనా.

అవధాని కదే పరాయణం.

కవికి–కవిత్వం అని చెప్పకోతగ్గ రచన చేసే కవికి లేదంత మన్నన, చాలాచోట్ల చూశాను.

ఇప్పటికీ యిదే మనవాళ్ళ అంతస్థు.

కవిత్వమే యెరగని మనిషికి, కవిగా – మహామహా కవిగా చెలామణీ మనదేశంలో, యెన్నో – యెంతెంతో బిరుదులతో.

తెనుగుభాషలోనే జాతీయత యెరగనివారికి సంస్కృతంలో కూడా ఆచార్య పీఠం.

జనసామాన్యం మాటే కాదు, పెద్దపెద్ద పదవుల్లో వున్న వారిదిన్నీ యిదే స్థితి, పండితులనూ కవులనూ గుర్తించడంలో.

కనపడ్డ చోటనల్లా – ముఖ్యంగా సభల్లో తమమీద పద్యాలు చదివితే – చాలు, వారి దృష్టిలో కూడా ఆ చదివిన వారు మహాకవులే.

దీనివల్ల కలిగే నష్టమూ, చెడే ప్రగతీ జాతికి, మరి.

పద్యం వేరూ, కవిత్వం వేరూ–ఇంతమాత్రమే కవిత్వం పరమార్థమున్నూ వేరు.

కవి మనస్తత్వమే వేరు, అసలు.

మహర్షి అయినవాడే కవి కాగలడన్న సత్యం అవగాహన చేసుకోగలవారికే బోధపడే విషయం యిది.

మహర్షికీ కవికీ చిత్తవృత్తీ, దృక్పథమూ వొకటే.

అయితే, మహర్షివి తనకు మాత్రమే సంబంధించీ, కవివి జాతికి–లోకానికి సంబంధించీ ప్రవృత్తా లవుతాయవి.

ఆంతరికమైన సత్తా యిద్దరిదీ వొకటే, దాని పరిధులు మాత్రం వేరు.

ఏమంటే?

మహర్షికి ఆత్మోద్ధరణమూ, కవికి లోకోద్ధరణమూ ప్రాప్యాలు.

ఈ ప్రాప్యాలు భిన్నాలు కావడం వల్లనే వారి ప్రవృత్తులకు భిన్నమార్గా లేర్పడ్డం.

మహర్షి సాధనాక్రమం వేరూ, కవి సాధనాక్రమమున్నూ.

ఇద్దరికీ నిర్లిప్తత మాత్రం ప్రధానం.

ఇద్దరికీ ఐహికం నశ్వరమే.

కాదూ, మహర్షికి భ్రంశమూ, కవికి పతనమున్ను.

మహర్షికీ కవికీ స్వస్వరూప సాక్షాత్కారం అయినాకే నిజమైన కర్తవ్య పరాయణత రూపుకడుతుంది.

ఈ కర్తవ్య పరాయణత స్థిరపడాటప్పటికి, మనకి, మహర్షి దూరం అవుతాడు, కవి, దగ్గర అవుతాడు.

కవి కార్యక్షేత్రం సంసారం, మరి.

కనక, కవిత్వానికి స్పందనశీలం ప్రధానం.

అది యెంత నిశితం అయితే, లోకాని కంతగా సిద్ధిస్తుంది, కల్యాణం.

అయితే, అది, హృదయానికి ఆనందముగ్ధత మాత్రం కలిగిస్తే చాలదు, సంస్కారమున్నూ కలిగించాలి, మనిషికి.

అంటే, కవిత్వం, ఆకర్షకం అయితే చాలదు, పరివర్తకం కావాలి.

పద్యబంధం అయినా, వచనరచనే అయినా అప్పుడే, కావ్యత్వసిద్ధి, దానికి.

కవి రచన యింతటి కావాలంటే, యింతటిది పనిన్నీ చెయ్యాలంటే, అతను మహర్షి అయి వుండకపోతే సాధ్యపడుతుందా?

కనకనే, అష్టావధాని పరాయణం వేరూ, కవి పరమార్థం వేరున్నూ అనడం.

కవిపేరు చెప్పినచోట అష్టావధానిపేరు చెప్పడం సంస్కారం లేదనడానికి గుర్తు.

అష్టావధాని కుక్షింభరి, అచ్చంగా.

అష్టావధాని పెంటపాటి బైరాగి, కచ్చితంగా.

అయితే, చక్రవర్తుల ఆస్థానాల్లో అసాధారణాదర సత్కారాలనుభవించి వుండిన బట్టుమూర్తి మొదలైన మహాకవులున్నూ కొంద రవధానాలు చేసివుండినట్టు కనపడుతుంది, చరిత్రలు తెరిస్తే.

దానివల్ల, వారిమాట యేమయినా, తెనుగు కవిత్వం మాత్రం అధోగతి పాలయినట్టు తోస్తుంది.

అయినా, వారి సత్తా నిరవధికం కనక, వారి గ్రంథరచనే మిగిలివుంది, అజరామరం అయి.

వారి అవధాన పరిశ్రమ వారి కళ్ళయెదటే కొట్టుకుపోయిందెక్కడికో, గాలికి.

మరి, యింతకంటే మరేమి నిదర్శనం కావాలీ అవధానాల నికృష్టతకు?

వెనకటిమాట యేమయినా, యీ అవధానాల కిటీవల విశేష ప్రాచుర్యం కలిగించినవారు తిరుపతి వేంకటకవులు.

నాగురువులు రామకృష్ణ కవులున్నూ యీ అవధానాలవల్ల పైకి వచ్చినవారే, అదిలో.

కాని, పిఠాపురం ప్రవేశించిన కొద్ది కాలానికే విడిచి పెట్టేశారు వారవి.

దివాన్, మొక్కపాటి సుబ్బారాయుడుగారి రసతృష్ణ అలాంటిది, మరి.

తిరుపతి వేంకటకవుల – ముఖ్యంగా వేంకటశాస్త్రిగారి దీర్ఘ జీవితం అవధానాలతోనే జటిలం అయిపోయింది.

అయితే, వొక విశేషం.

సాహిత్య ప్రక్రియల్లో, యింకా అనేకాలున్నూ అపరిమితంగా సాగించారు వారు.

తరవాతి పద్యబంధ నిపుణుల్లో చాలామంది ఆ అంతస్థు కెగబాకలేక, అవధానాల్లోనే మునిగిపోయారు.

ఇంతకీ, –

విజయనగర సామ్రాజ్యం పతన మయిపోయాక, నాయక రాజుల పాలనమున్నూ అంతరించాక, ఆంధ్రకవిత్వానికి వెర్రి తలలు ముదిరిపోయాయి.

బంధకవిత్వమూ, చిత్రకవిత్వమూ, నిమిషకవిత్వమూ, శ్లేషకవిత్వముగా, ఆశు కవిత్వమూ, అవధానకవిత్వమూ – ఇత్యాదిగా విజృంభించాయా వెర్రితలలు.

కాని, తిరుపతి వేంకటకవులు, పామరజనాకర్షణ ఆశించి ఆశుకవిత్వానికీ అవధానకవిత్వానికీ వూపిరి పోశారు.

జీవితావధికాలే చేసుకున్నారు వారవి.

ఇప్పటికీ ప్రచారం అవుతూనే వున్నా యేకొంచెమో అవి, వారి ప్రచారమే హేతు వందుకు.

అది నా అదృష్టం అని మాత్రమే చెప్పాలి, అవధానాలంటే ప్రాజ్ఞత వచ్చినప్పణ్ణుంచీ వెగటే నాకు.

దీనికి సాయం, రామకృష్ణకవుల మంత్రోపదేశంతో–వీరపూజ రచన పురస్కరించుకుని కూడా, పద్యబంధం మీదే అరుచి పుట్టిపోయింది, నాకు.

పరప్రత్యయనేయత బొత్తిగా తప్పించుకోలేని దశలో, పోలవరంలో, ఆదిమధ్యం భావనారాయణ స్వామిగారి కిచ్చిన మాట చెల్లించుకోడానికి మాత్రమే శ్రద్ధ పట్టాను తరవాత నేమాత్రమో అష్టావధానం విషయమ్మై.

అది చెల్లించుకోనూ చెల్లించుకున్నా నా స్వల్పదీక్షతో, నువ్వా నేనా అన్న సభలో

అప్పటికి మూడేళ్ళయింది ఆ చెల్లించుకునికూడా.

సత్యనారాయణశాస్త్రి వెంట బడేదాకా ఆ స్మృతే లేదు నాకు మళ్ళీ.

అప్పుడయినా, నుంచున్న పాటున డబ్బు సంపాదించవలసిన అగత్యం యేర్పడివుండకపోతే, అతనెంత బలవంత పెట్టినా నేనంగీకరించి వుండకపోదును.

కొనవూపిరితో నైనా, ఎస్.పి.ఏ.ఎల్ నడుస్తూ వుండినా నేనందుకు తలవొగ్గి వుండకపోదును.

నిజంగా, అష్టావధానాలు చెయ్యవలసిన అగత్యం యేర్పడ్డం వొక దుర్దశ నాజీవితానికంతకూ.

వచ్చిన పుట్టిమునక యేమిటంటే?

ఎటుచూసినా, గాఢాంధకార బంధురం అయిపోయి వుండింది నాస్థితి, అప్పుడు.

బయటపడా లందులోనుంచి.

స్వభుజా బలంతో బయట పడాలి.

మాసాల్లో కాదు, వారాల్లో నూకాదు, రోజుల్లో బయటపడాలి.

హరిఃఓ మ్మంటూ కూచుని, పామరులను రంజింపజేసి, ఇవితి శ్రీ అంటూ లేచాటప్పటికే యెంతో కొంత డబ్బు నాచేతికి రప్పించగల శక్తి, నా దగ్గిరవుండిన దల్లా వొక్క అష్టావధాన ప్రక్రియే అయిపోయింది.

అసంపూర్తిగా నయినా మరేదీ లేకపోయింది కూడా.

కాని, తెలిసివుండిన్నీ – క్షుద్రం అని తానే నిర్ధారణ చేసుకుని వున్న పని చెయ్యడానికి, కేవలమూ డబ్బుకక్కూర్తితో తానే సిద్ధపడ్డం గర్వ్యం కాదూ?

అయితే, యెంతోకొంత ప్రతిభ వుండిన్నీ – పరమ దుర్లభం అని తానే యెరిగివుండిన ఐహిక జీవితం తానే భగ్నం చేసుకోడానికి సిద్ధపడ్డం మాత్రం స్తవనీయం అవుతుందా?

వడిదుడుకు లేర్పడ్డప్పుడు జీవితానికి భంగపాటు తటస్థపడకుండా చూసుకోవడానికే అపద్ధర్మాలు.

అవి శాశ్వతంగా అవలంబించ తగ్గవి మాత్రం కావు.

ఎవరి కయినా—ఎంత అప్రయోజకుడి కయినా — దీర్ఘజీవితంలో గడ్డుదినాలు బహూ పరిమితంగానే వుంటాయి.

అవి గడిచిపోతా, యేదోవిధంగా, నిలిచిపోవు

తరవాత, సరి అయిన—తాను వోహో అనిపించుకోతగ్గ—వృత్తి చూసుకోవాలి, బుద్ధి వుండినవాడు, నిదానించి.

ఆ స్థితి తటస్థించేదాకా బతికి వుండడానికే అపద్ధర్మాలు.

అవయినా, యిప్పటి మన నడవడికి బహూ భిన్నంగానే వుంటాయి.

అవయినా, ధర్మసాంకర్యం కలక్కుండా వుంచడానికే యేర్పడ్డాయి; గాని విచ్చలవిడిగా సంచరించడానిక్కాదు, ఇప్పటిలాగ.

ఏతావతా,—

ఐహికం కష్టనిష్ఠురం.

దుఃఖబహుళం.

యాతనా భూయిష్ఠమున్నూ.

పేదలకేగాదు, సాదలకున్నూ వున్నదే యిది.

మనిషి సంపాదించుకోవలసిన మొదటి పరిజ్ఞానం యిది.

జీవితం గడిచిన కొద్దీ — అనుభవం పెరిగినకొద్దీ బలపడుతుందిది.

బుద్ధి వుంటే తాత్కాలిక విపత్తు చూసుకుని అంత భయపడవలసిన పనిలేదు.

మోఘమైన వొకశక్తి యీ బుద్ధి.

కష్టాలు రాసి పెట్టిన భగవంతుడే ప్రసాదించిందది.

దాని కసాధ్యం లేదు.

కష్టాలు సుఖాలుగా మారుస్తుందది.

దుఃఖం ఉల్లాసంగా తేల్చేస్తుందది.

యాతన సుఖంగా పరిణమింపచేస్తుందది.

గర్వం చూపించుకోడం కాదు, ఏ కొంచెమో నాకుందది.

అది వుండినందున నాకెంతో ఫలితం కనపడింది, ఎన్నో మాట్లు, నా కప్పటికే.

ఒక్కొక్కడి కొక్కొక్క మార్గాన అనుభూతం అవుతుంది.

రచనలో కనపడుతోంది నాకు.

పెద్దలవల్ల తెలుసుకోవలసిన సుళువు లెన్నో సంపాదించుకున్నాను, స్వబుద్ధితోనూ, స్వయంకృషితోనూ నేను.

ఆ రచన మానలేన్నేను.

జీవిత పరమావధికం నాకది.

నేను చెయ్యగలిగినా చెయ్యలేకపోయినా, దేశీయు లది గుర్తించినా గుర్తించకపోయినా — నా జాతికి నేనే చెయ్యవలసిన దోహదం కొంత వుంది.

రచనే అందుకు సాధనం నాకు.

అది సాగించాలంటే కాలూ చెయ్యీ ఆడాలి, నాకు.
అలా ఆడ్డానికి బువ్వకావాలి.
కళాజీవి అయినవాడికి బువ్వ ప్రయోజనం అంతే.
ఆహార నిద్రాదులు శరీర ధర్మాలు.
అవి తప్పవు మనిషికి.
కళాజీవికీ తప్పవు, భోగపరాయణుడికీ తప్పవు, విరాగికీ తప్పవు, ప్రతిభాశాలికీ తప్పవు, శుద్ధ మొద్దుకీ తప్పవు.
అవి రాజయోగ్యంగా వుండాలనీ కాదు, ఉండకూడదనీ కాదు – ఈ వునికి లేమరికాలు కానేకాదు ప్రధానం.
అవి యెలా వున్నా కాలక్షేపం చెయ్యగలడు కళాజీవి.
వాటిలోకాదు, అతనికి తృప్తీ ఆనందమూను.
కళలోనే కనపడతా యతనికవి.
కళలోనే అనుభూతాలున్నూ అవుతా యతని కవి.
అతని బుద్ధీ, చిత్తవృత్తీ కళావలయంలోనే పరిభ్రమిస్తూ వుంటా యెప్పుడూ.
శారీరిక ధర్మాలు వాటిని కలుషితం చెయ్యలేవు.
చిత్తవృత్తి నిరోధకశక్తి వుండడం వల్లనే కళాత్మకం అయివుంటుం దతని ప్రవృత్తి.
ఆ ప్రవృత్తికి శరీరం ఆలంబం.
ఆ శరీరంకోసమే బువ్వ.
ఆ బువ్వ అంతస్థు ఏమయినా కావచ్చు, అది మాత్రం ధన సాధ్యం.
అందువల్లనే నాకున్నూ ధనతృష్ణ పట్టుకుంది.
కళ సాధించుకునే అవస్థలోనే ఆర్జనకున్నూ పాటుపడవలసిన దౌర్భాగ్యం పట్టింది నాకు.
నా కేర్పడ్డ దౌర్భాగ్యాల్లో యిదీ పెద్దది.
పోనీ అనుకుంటే, అప్పటికప్పుడు నిర్ధారణ చేసుకోవలసి వచ్చిందందు కేదో వొకదారి.
ఆక్షణంలో అవలంభించవలసి వచ్చిం దేదో వొక వృత్తిన్ని.
కాని నాకేదీ కనపడ్డం లేదప్పటికి.
కనపడ్డా నచ్చడం లేదు.
నచ్చినా మనస్సు కెక్కడం లేదు.
కాక, – అప్పుడే కా దిప్పుడున్నూ నాకు బువ్వ పెట్టడం లేదు, రచన.
నాకే కాదు, తాదాత్మ్యం అనుభవించగల యే తెలుగు రచయితకూ పెట్టడం లేదది.
మరిగతి?
మరి, యీ శరీరం సుష్టుగా ప్రవర్తించి కరచరణా లాడ్డానికి ఉపాయం?
ఈ నిరాలంబస్థితిలో – ఈ గవేషణలో – నా దృష్టిపథానికి తెచ్చాడు సత్యనారాయణశాస్త్రి, అష్టావధానం.
"సరే" అనేశాన్నేను.

ఇష్టాపూర్తిగా కాదు, బాధపడుతూ అనేశాను.

నన్ను నేనే తిట్టుకుంటూ – నా సంచితాన్ని నిందించుకుంటూ – అంగీకరించాను.

అయితే, వొక్కటి మాత్రం చెప్పుకోవాలిక్కడ.

పోలవరంలో వొకమాటు చేసివుండడం వల్ల – అక్కడ వోహో అనిపించుకునిన్నీ వుండడం వల్ల – దిలాసాగానే అంగీకరించా నతని ప్రతిపాదన.

ఓనమాలు దిద్దుకోవలసిన అగత్యం లేకపోయింది, నాకందులో.

నిద్రాహారాలు మరిచి సాధనచేసుకోవలసిన దుర్గతికూడా లేకపోయింది.

ఒక్క దూకున సభకి – సభలోకి – వెళ్ళ వచ్చు, నిస్సంకోచంగా కూచో వచ్చు ధీమాగానే ప్రారంభించనే వచ్చు అవధానం.

ఇదీ, అప్పటి. కీడులో నాకొక మేలు.

## 4

పోలవం అష్టావధానం జ్ఞాపకం వస్తే నా కిప్పటికీ పులకలు పేటెత్తుతాయి.

ఆసన్నివేశం అనుభూతం అవుతున్నట్టుంటుంది, కళ్ళక్కట్టినట్టున్నూ వుంటుందా పరిస్థితి.

శాలువు కప్పుకుని, సభలో నిటాగ్గానుంచుని, పృచ్ఛకులకేసి చూస్తూ "ఏమికావాలి మీకు?" అని అడుగుతున్నట్టున్నూ వుంటుంది.

ఏ వొక రిద్దరో అప్పటికే అపరిచితులై వుండినవారు తప్ప, తతిమ్మా పృచ్ఛకులందరూ పడగొట్టాలన్న స్పర్ధతో కసిగా చూస్తున్నట్టుకూడా వుంటుంది.

ఒక నిర్దేశం లేదు, వొక సూచనలేదు, వొక ప్రయత్నం లేదు, వొక ఆలోచనలేదు, చూసినంతసేపూ వొక వినోదం చూశాను, కళ్ళనిండా – అప్పటి కప్పుడొక అగ్నిపరీక్షకు సిద్ధపడ్డాను, సర్వమూ మరిచి.

జరిగిం దేమిటంటే?

"ఇదిగో, నేను తయారయి వచ్చాను మరి, సభ చేయించం"డంటూ వెళ్ళి యెదట నుంచునేటప్పటికి చకితులయిపోయారు, భావనారాయణస్వామిగారు.

అప్పటిదాకా ఆజ్ఞాపకమేలేదు వారికి.

అప్పుడయినా "అప్పుడలా యెందుకన్నామూ?" అంటూ బాగా పశ్చాత్తాపపడు తున్నట్టుంది, వారివాలకం.

అది యేమయినా, వారప్పుడు నన్నలా రెచ్చకొట్టి వుండక పోతే నా జీవితంలో అష్టావధాన ప్రసక్తే రాకపోయి వుండును.

దానికోసం కొంత సాధనా చేసుకుని వుండకపోదును, అందు కోసం ప్రత్యేకించి పోలవరమూ వెళ్ళి వుండకపోదున్నేను.

మరి, వారు సభ చేయించకపోతే?

నా వుత్సాహం గాఢంగా దెబ్బతింటుంది.

కొన్నాళ్ళయినా చాలా బాధ పడతాన్నేను.

ఇది గుర్తించుకున్నారు వారు, మరి, కాదనలేకపోయారు.

"ఏదో మాటవరసకంటే అదే పట్టుకున్నా చ్చున్నా వేమిటయ్యా?" అంటూ యిటు తిరిగి నన్నే నెపపెట్టవచ్చువారు.

అలా తప్పించుకునేవారు – ఎదురు దెబ్బతీసేవారు చాలా మందే వున్నారు, లోకంలో.

మానమూ అభిమానమూ చాలా తేలిక వస్తువులు వారి దృష్టిలో.

మరి, వారి జన్మలు?

ఇది చూసుకోరు వారు.

భావనారాయణస్వామిగారు మాత్రం తమ మాట నిలబెట్టుకోడానికే పూనుకున్నారు.

సహజంగా మితభాషులు వారు.

మొగమాటం చాలా యెక్కువ, వారికి.

మితభాషులయినవారు నలుగురితోనూ ధారాళంగా కలిసి తిరుగలేరు.

ముందుకిన్నీ రారు దేనికీ.

కలగా చేసుకో రెందుకూ.

అక్కడికీ వొక పూటల్లా కిందా మీదా పడ్డారు వారు, తమలోతాము.

చివరికి, డిప్యూటీ తహసీలుదారు దగ్గరికి తీసుకువెళ్ళారు, సాహసించి నన్ను.

అది మన్యప్రాంతం కావడం వల్ల జనసంఖ్యా తక్కువే. అక్కడ, రామచంద్రపురం తాలూకా లాగ తెనుగు మీరి పోయిన ప్రాంతం కాదుకనక, వ్యవహారాలూ తక్కువే.

కాగా, తహసీలుదారు, జిల్లామున్సబూ, సబ్ మేజస్ట్రేటూ–ఈ ముగ్గురివిధులూ నిర్వహించడం వొకరే.

అప్పుడక్కడ ఆపదవుల్లో వుండినవారు పోతుల లక్ష్మీనరసయ్య నాయడుగారు.

అష్టావధానం యెప్పుడూ చూడలేదు, ట, వారు, చూడాలని మాత్రం చాలా వుంది, ట, చాలా కాలంగా.

ఇట్లు సరదా – అటు భావనారాయణస్వామిగారి ప్రోత్సాహం – దీంతో, సభ చేయించే బాధ్యత తాము వహించారు నాయడుగారు.

రుచిగల విషయం అయితే, పలుకుబడి వుండినచోట, కర్తృత్వమూ కారయితృత్వమూ తప్పించుకోలేరు, రసికులైన వారు.

ఇది యిలా పరిష్కారం కావడంతోనే, రెబ్బాప్రగడ పాపయ్యగారి దగ్గరికిన్నీ తీసుకువెళ్ళారు నన్ను, భావనారాయణస్వామిగారు.

పాపయ్యగారు, అక్కడి ఎస్టేటు మానేజరు.

భావనారాయణస్వామిగారి శక్తిసామర్థ్యాలు – ముఖ్యంగా, వారి సాహిత్యకృషీ, జాతకాలు చెప్పే వైదుష్యమూ బాగా తెలిసి వుండినవారుకనక, వారికి ప్రీతిపాత్రుణ్ణయి వుండడం వల్ల నేనూ సమర్థుణ్ణే అయివుంటానని భావించుకున్నారు పాపయ్యగారు.

పండితులన్నా కవులన్నా వారికీ చాలా ఆదరమే.

దాంతో, నాయడుగారితోపాటు, వారున్నూ బాగా శ్రద్ధ పట్టారు సభవిషయమై.

జమీందారు, రాజా, శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు, పోలవరం విడిచి, యెప్పుడో కాకినాడలో మకాం పెట్టుకుని వుండినారు.

అంచేత, అక్కడి జనులకు పాపయ్యగారే జమీందారన్న ఆదరగౌరవాలు.

"ఫలానా విద్య తమకు తెలుసునా తెలియదా — అథవా — దానిమీద తమకు ప్రీతి వుందాలేదా" అని కాదు ప్రశ్న, విద్య యేదయినా అది పోషించడమే జమీందారు బాధ్యత.

జమీందారంటే, తెనుగు దేశానికంటే సంబంధించినంత వరకూ మహారాజనే నిర్వచనం.

సర్వతంత్ర స్వతంత్రమైన ప్రభుత్వం, ఇక్కడ. బహువచనం మీదే వుండేది, ఆదిలో.

కాని, శతాబ్దులకిందే అంతరించిపోయింది.

డిల్లీలో పాదుషాలూ, గోల్కొండ హైదరాబాదుల్లో నవాబులూ స్వతంత్ర ప్రభువులయి వుండినంతకాలమూ తెలుగు దేశంలోనూ వుండేవారు ప్రభువులు.

అంగ్లేయు లిక్కడ స్థిరపడ్డంతో చాపచిరిగి చదర అయిపోయింది.

మహారాజు లంతరించారు, జమీందార్లే వెలిశారందరూ.

సామంతు లనిపించుకోడానికిన్నీ అర్హతలేనివారు జమీందార్లంటే.

యోధులను గుమాస్తాగిరీకి మప్పింది అంగ్లప్రభుత్వం, ప్రభువులను జిరాయితీ దార్లుగానూ రూపొందించింది.

అయినా, అనువంశికాలైన లక్షణాలు నిలుపుకున్నారు, జమీందార్లు కొంతవరకూ.

అంచేత, ప్రభువుల లక్షణాలు మనకూ పరిచితాలే కొంత వరకూ.

రాజులు కాకపోయినా, తెనుగుదేశంలో, యిటీవల వారే "రాజా"లు కనక, జమీందార్లున్నూ తమ విధులు నిర్వర్తించుకున్నారు, కొంతవరకూ.

ఇంత,—

ప్రీతి వైయక్తికం.

విద్యలు సార్వజనీనాలు.

వాటి ప్రయోజనం, ముఖ్యంగా, జనులకు.

కనకనే వాటి పోషణభారం ప్రభువుది.

ఈ పరిజ్ఞానం వుండాలి, మనిషికి.

అధికారమూ వుండాలి.

ప్రభువు లక్షణాలివి.

జనులను తమ అదుపాజ్ఞల్లో వుంచుకుంటూ, వారి కష్టార్జితం కొంత, పన్నులపేరిట నిర్బంధంగా వసూలు చెయ్యాలి, ప్రభువు.

సుఖ సౌభాగ్యాలు కలిగించి, ఆ జనులను రంజింపనూ చెయ్యాలి.

ఇది తప్పనివాడే మహారాజు.

తప్పాడూ, మరి, తరాజే.

అంచేత, పోలవరంలో జరిగే యే కార్యక్రమంలో నయినా, జమీందారుకి బాధ్యత వుందంటే, వారికి ప్రతినిధులు కనక, పాపయ్యగారే అవి నిర్వర్తించేవారు.

చాలామట్టుకి, స్వతంత్రంగానే నిర్వహించే వారది.

భావనారాయణస్వామిగారు, నన్ను, పాపయ్యగారి దగ్గిరికి తీసుకువెళ్ళారంటే, యిదిగో, యిది గుర్తించే.

అయితే, నెమ్మదిమీద, యేవారం పదిదినాలకో సభ జరుగుతుందనుకున్నా న్నేను.

ఎన్ని కోణాలనుంచో సాధక బాధకాలు పరకాయించుకుని, యెన్ని అవకాశాలో కల్పించుకుని, కట్టుబాట్లుగూడా యెన్నో చేసుకుని గాని కార్యక్షేత్రంలో అడుగుపెట్టరు ముసద్దీలు.

దీప్తో దీప్తిహానో కలిగించేదిగా వుంటేగాని, తృప్తికాదు వారి కేపనీ.

కాని, అనుకోనిది, మరి రెండు రోజుల్లోనే ఆ వూరి బాలికా పాఠశాల వార్షికోత్సవం వచ్చింది.

గవర్నమెంటుదది, వూరిపెద్దల పర్యవేక్షణలోది కాదు.

అయితే, అలాంటి సంస్థల వార్షికోత్సవాలనీ అదనీ యిదనీ కల్పించుకునే 'రెస్పాన్సిబిలిటీ' పెట్టుకోదు, మన గవర్నమెంటెప్పుడూ.

ఊరివారిదే అందుకు ఖర్చూ, ఉత్సాహమూ కూడా.

జనుల కుత్సాహం కలిగించే వేడుకలవి.

అంచేత, పాపయ్యగారే వూనుకున్నా రందుకున్నూ.

దివాణం భవనంలోనే యేర్పాటయిందది.

అక్కడి సబ్ కలెక్టరధ్యక్షుడా సభకి.

ఆయనా త్రిమూర్త్యాత్మకుడే పై మెట్టున, అక్కడ.

ఆంగ్లోయిండియ నాయన, పేరు G.L. డిక్రూజ్.

తాలూకా ప్రధానస్థానమే అయినా అది పల్లెటూరే కావడం వల్ల బాలికా - ఎలిమెంటరీ బాలికీ పాఠశాల వార్షికోత్సవమే పెద్ద ఉత్సవంలో లెక్క అయింది.

అంచేత, మిడిల్‌స్కూలు (ఇప్పుడు హైస్కూలు) ఉపాధ్యాయులూ, ప్లీడర్లూ, ఈనాందార్లూ, రకరకాల ఆఫీసుల గుమాస్తాలూ, వూరివారూ చాలామంది వచ్చారు, స్త్రీ పురుషులాబాల గోపాలమూ.

మేడహాలు చాలా విశాలమైనది, అదంతా నిండిపోయింది.

కాని, దీపాలు పెడతారనేటప్పటికే దాని కార్యక్రమం ముగిసిపోయింది.

ఆ సూచన కనపడగానే చాలా నిరుత్సాహపడి పోయారు, స్త్రీలూ పురుషులూ కూడా.

అరుబూరుమంటూ ముస్తాబయి వచ్చినంతసేపు పట్టలేదు మరి, వారికి.

అది గుర్తించి నాయుడుగారితో యేదో మాట్లాడారు పాపయ్యగారు.

నాయుడుగారున్నూ అధ్యక్షునితో ఏదో మాట్లాడారు.

నా పక్కనే కూచునివున్న భావనారాయణస్వామిగా రెందుకో వెళ్ళి నాయుడుగారితో యేదో మాట్లాడారు.

వెంటనే వచ్చేశారు వారయినా, కాని నాయెదటికివచ్చి "నుంచున్న పాటున మీ రష్టావధానం చెయ్యాలి. మళ్ళీ యింతటి సభ కూడ్డం అసంభవం, యింతలో.

ఎంతటికూడ్డానికయినా వారం పద్దినాలయినా పడుతుంది మరి, చూసుకోండి" అన్నారు.

తుళ్ళి పడ్డా న్నేను.

కాని, నిజమే, నాకోసం మళ్ళీ అంతటి సభ కూడ్డం అసంభవమే, వెంటనే. "సరే" అనేశాను.

ఆలోచించుకోడానికే అవకాశంలేదు; గాని అగత్యమూ లేదు, నిజానికి.

ఏ విషయమ్మై అయినా, శక్తిసామర్థ్యాలకంటే ధైర్యసాహసాలెక్కువ నాకు, వచ్చిన సందర్భంలో.

కాకపోయినా, అంతా అప్పటిపరిస్థితులనుసరించి జరగవలసిందే; గాని తయారు కావడానికీ, జాగ్రత్తపడ్డానికీ యేమీలేదు, అష్టావధానానికి.

ఉపాసన అనీ, మరేమిటేమిటో అనీ పెద్దకబుర్లు చెబుతారు కొందరు; కాని, అదంతా భేషజమూ నటనాను.

కాక,–నాకొక మంచి అవకాశంకూడా కనపడింది, అప్పుడే నేనందుకు సిద్ధపడ్డంలో.

వచ్చి వున్నవారిలోనే కొందరు సిద్ధపడతారు పృచ్ఛకులుగా, అప్పటి కప్పుడు.

ఈ విషయమే తెలిసివుండదు వారి కంతకి ముందు.

కుమ్మక్కు చేసుకుని వచ్చినవారుండరు, వారిలో వొక్కరూ గూడా.

నా ప్రత్యుత్తరాల్లాగే వారి పృచ్ఛలున్నూ ఆశువులయి వుంటాయి.

ఇది గుర్తించిన్నీ సిద్ధపడ్డాన్నేను.

"అయిదు నిమిషాల్లో యీ కార్యక్రమం ముగిసిపోతుంది. తరవాత, శ్రీ వెంకటరామకృష్ణ శిష్యులు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఇక్కడే–ఇప్పుడే అష్టావధానం చేస్తారు" అని ప్రకటించారు నాయడుగారు, వెంటనే.

సభ అంతా ఉత్సాహోదగ్రం అయింది.

ఒక్కరూ కదల్లేదు, అందరూ సావధానులయినారు.

అనుకున్నవేళకి వార్షికోత్సవం ముగిసింది, అన్నవేళకి నా అవధానం ప్రారంభం అయింది.

ఆ కార్యక్రమం ప్రెసిడెంటే, యీ కార్యక్రమానికిన్నీ ప్రెసిడెంటు.

"నే" నంటే "నే"నంటూ పృచ్ఛకులుగా తయారైనారు, కొందరు.

పెద్దలే సిద్ధపడ్డారు, కుర్రలు కారు.

అయితే, నా అష్టావధాన ప్రక్రియలో వొక్కరికే–వొక్క పద్యమే చెప్పడం

ఏక కాలాన, ఎనిమిదిపనులు–బాగా జాగ్రత్తపడవలసినవి – భంగపడకుండా నెరవేర్చడమే అష్టావధానం అంటే, ఎనమండుగురికి పద్యాలు చెప్పడం కాదు.

పనులెనిమిది, పృచ్ఛకులున్నూ ఎనమండుగురు.

నా గురువులు రామకృష్ణకవుల సంప్రదాయం యిది.

పద్యాలుచెప్పడం వొక్కరికే కాదంటే, యెనమండుగురి కన్న నిర్ణయంమాత్రం యేమిటి?

పద్యా లెనమండుగురికి చెప్పడం అయితే, అది, పంచదశావధానం అవుతుందిగాని, అష్టావధానమే కాదసలు.

"వల్లకా"దంటూ వితండవాదానికి సిద్ధపడ్డారు మొదట కొందరు; కాని, నేను బదులు చెప్పవలసిన అగత్యం లేకుండానే అది పరిష్కారం అయిపోయింది.

దీంతో, పృచ్ఛకులుగా సిద్ధపడ్డవారిని వడబొయ్యవలసి వచ్చింది.

కాగా, పృచ్ఛకులుగా నిర్ధారణ కాగలిగినవారందరూ, పెద్దలూ, మెరికల్లాంటివారూ కావడం తటస్థపడింది.

ఒక విధంగా అపాయకరమూ, మరోవిధంగా గౌరవావహమున్నూ యిది.

సమర్థులయిన వారిని తృప్తిపరచడమే తృప్తిపరచడం, మరి.

వెంటనే, పృచ్ఛకులు చుట్టూ కూచున్నారు, కుర్చీలమీద, నా కటూ ఇటూ.

సబ్ కోర్టు శిరద్దారు సమస్య యిచ్చారు, శార్దూల విక్రీడితంలో.

గాదె దాసన్న పంతులుగారు (స్కూళ్ళ యినస్పెక్టరు) లోకాభిరామాయణాని కూర్చున్నారూ "శాస్త్రిగారూ, ప్రారంభిస్తామా" అనడుగుతూ.

భావనారాయణస్వామిగారు దశావతారాల పేళ్ళు చెప్పమన్నారు కందంలో, వరస తప్పకుండా.

ఎస్టేటు గుమాస్తా వొకాయన (పాపయ్యగారి నామినీ) గంటలకు బదులు కూతల కూర్చున్నారు, సైకిలు బూరా చేత బుచ్చుకుని.

నాయడుగారు పురాణం చెప్పమంటూ కూచున్నారు, భాగవతం తెరుచుకుని.

మేఘ సందేశం పాడ్డానికూర్చున్నా డొక వకీలు విద్యార్థి.

అచంట వెంకటరావుగారు (మా సోమప్ప ప్లీడరు) చదరంగం బలం సద్దుకూచున్నారు, ఎత్తు వెయ్యడానికి సిద్ధంగా.

"నేనివ్వవచ్చా?" అనడుగుతూ అధ్యక్షులు సిద్ధపడ్డారు, వ్యస్తాక్షరికి.

## 5

కార్యకారణ సంబంధాలు పురస్కరించుకుని, భావనారాయణ స్వామిగారిమీదా, నాయడుగారిమీదా, పాపయ్యగారిమీదా వొక్కొక్క పద్యం కట్టుకుని వున్నా నదివరకే నేను, ఆశువుగా అల్లుతున్నట్టుగా నటించలేదు.

ప్రెసిడెంటుమీద మాత్రం అప్పటి కప్పుడు కట్టాను, –

క. అష్టావధానమను! నుత్కృష్టక్రియ చూడనేగుదెంచిన ఘనుడీ
మిష్టర్. జి.యల్.డి. క్రూజ్! హృష్టుండగునట్టు లిప్పుడే నొనరింతున్॥అని.

తనపేరు రావడం–అదిన్నీ సంగీతంలో రావడం – ఇది గుర్తించి చకితుడై, నాయడుగారి నడిగి సంగతి తెలుసుకుని తల పంకించుకున్నాడు, దొర.

పద్యాలు పూర్తిచేసి నాసంగతి చెప్పకున్నాను, ముందు.

నా పూనిక హేతువున్నూ చెప్పకున్నాను, తరవాత.

"డబ్బుకోసం కాదు. భావనారాయణస్వామిగారి ఆజ్ఞ శిరసావహించడానికి మాత్రమే వచ్చా"నన్నాను చివరికి.

నిర్దాక్షిణ్యంగా నమ్ముకున్నారు పృచ్ఛకులు వెంటనే.

స్త్రీలూ పురుషులూ ఆబగా చూడసాగారు.

దాసన్న పంతులుగా రసలే వసపోసిన పిట్ట.

సంవత్సరం నరగా మాకిద్దరికీ బాగా పరిచయం.

అయినా, మొగమాటం దూరంగా పెట్టి, బహూ విషమంగా ప్రారంభించారు, వారు, సంభాషణ.

మరో ప్రచ్ఛకునితో నేను వ్యవహరించాటప్పుడు "చూడండీ" అంటూ నా చెయ్యి పట్టుకుని లాగిన్నీ ప్రశ్నలవర్షం కురిపించసాగారు నామీద.

ఆచంట వెంకటరావుగారున్నూ, నేను తమ దగ్గరికి వచ్చాటప్పటికి జంతువులు మార్చేసుక్కూచునేవారు, తమ కనుకూలంగా.

ప్రెసిడెంటు సూచనమీద ఎన్నో మాట్లు మెల్లిగా వూదాడు బూరా, ఎస్టేటు గుమాస్తా.

"స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమోహిప్రియేషు" అన్నచోట బాగా వివరించి చెప్పమంటూ కూచున్నాడు, వకీలు విద్యార్థి.

ఇంగ్లీషు పద్యం యిచ్చాడు వ్యస్తాక్షరి, వొక్కొక్క అక్షరమే విడివిడిగానూ, క్రమం తప్పించిన్నీ.

అదే నా మొదటి అవధానం.

"అహమస్మి" అంటూ అంతమంది పెద్దమనుష్యులున్న సభలో, నిటాగ్గా నుంచోడమున్నూ అదే మొదటి మాటు, నాకు.

మొదట కొంచెం జంకాను; కాని పావుగంట గడిచాటప్పటిక్కొంచెం ధైర్యం అవలంబించాను.

భావనారాయణ స్వామిగారూ, దాసన్నపంతులుగారూ చకితులయి పోయారది చూసి.

పురాణం చెప్పడంలో, అవ్యక్తుడన్న విశేషణం వచ్చింది భాగవతంతున కొకచోట.

"అంటే, తెలివితక్కువ వాడని కాదూ?" అంటూ యెదురు వాదం ప్రారంభించారు నాయడుగారు.

"తెలియనివా"డన్నాను ద్వ్యర్థిగానేను, కావాలని.

"అంటే, అజ్ఞాని అనే కాదూ?" అంటూ రెట్టించారు నాయుడుగారు.

"బాగా తెనిగించి చెప్పాలంటే, నాకూ మీకూ, మరెవరికిన్నీ కూడా యెంతమాత్రమూ తెలియనివా"డన్నాను, చివరికి నేను.

ఇలాంటి సందర్భాలు వచ్చినప్పుడల్లా కరతాళధ్వనులతో ముఖరితం అయిపోతూ వచ్చింది, సభ అంతా.

"స్త్రీణా మాద్యం–" అంటూ మళ్ళీ రెట్టించాడు వకీలు విద్యార్థి.

వయస్సుకి చాలా చిన్నవాడాయన.

వాలకం చూస్తే రంగేళీ పురుషు డన్నట్లున్నాడు.

ధోరణి చూడగా సూచనచేస్తే గుర్తించలేని వాడన్నటున్నూవున్నాడు.

అయితే, రెండువందలకు తక్కువగాలేరు, స్త్రీ లక్కడ.

పిల్లలకంటే పెద్దలే యెక్కువగా వున్నారు వారిలో.

అందరు పురుషుల్లో నే శృంగారవిషయాలు వివరించడం అసభ్యం అనిపించు కుంటుందసలు.

కాని యీా బిడియం వున్నట్టు లేదాయనకు.

"వద్దువ"ద్దన్నారు భావనారాయణస్వామిగారు.

"తప్ప్వత"ప్పన్నారు పాపయ్యగారు, చిరాగ్గా.

నాయడుగారు చాలా గట్టిగా ఆక్షేపించారు, చల్లచల్లగా.

దాంతో వొదిలి పోయిందా బెడద.

అవధానం కూడా పూర్తయింది.

ఒక్కగంటా, ముప్ఫయి నిమిషాలు పట్టిందందుకు.

నాకంటే సభ్యులూ, సభ్యులకంటే నేనూ మహోత్సాహ తరంగాలమీద వూగిపోయాం.

మాటి మాటికీ "సెబాసు"లు ప్రతిధ్వనించాయి.

"అ౯ఫాదమ్లు కేప్సుబేర్ ఫుల్ యే జెమ్ ఆఫ్ ప్యూరెస్టురే" ఇత్యాదిగా వ్యస్తాక్షరి వొప్పగించాను మొదట.

చాలా వింతపడి, మిక్కిలి ఆనందించి, థాంక్సు చెబుతూ లేచి, ప్రీతిగా - ఉద్రేకంతో షేక్ హేం డిచ్చాడు దొర.

మెల్లిగా కూసినవీ, గట్టిగా కూసినవీ బూరా కూతల కూడా వివరంగా చెప్పినప్పుడు కరతాళ ధ్వనులకున్నూ పూనుకున్నాడాయన.

తక్కిన పృచ్ఛకులున్నూ తమ గాఢ సంతృప్తి వెల్లడించారు.

సభ్యులందరూ చాలా ఆనందించారు.

నేను కృతజ్ఞత చెప్పుకున్నాను, చివరికి.

నాయడుగారు లేచారు వెంటనే.

"శాస్త్రిగారు తమ ప్రజ్ఞ చూపించారు. మనం మన రసికత చూపించుకోవాలిప్పుడు. వారికొక బంగారుమెడ లివ్వడం మనకు మర్యాదగా వుంటుందనుకుంటున్నాం మేము. దొరగారు మొదటే పది రూపాయలిచ్చారు. మనమున్నూ యెవరికి తోచింది వారు - తోచినంతే - తోస్తేనే యిద్దాం. నిర్బంధం లేదు. ఇప్పుడే యిద్దాం, కనీసం, రేపు సాయంత్రాని కయినా నాకందాలి" అన్నారు.

అంటూనే పర్సుతీశారు, తామున్నూ.

పాపయ్యగారూ తీశారు, వెంటనే.

ఎవరెవరో కూడా తీశారు.

అప్పటికప్పుడు - అక్కడికక్కడ - యెనభై రూపాయలకు పైగా వసూలయినాయి.

మర్నాటి సాయంత్రానికి మరికొంత చేరింది.

ఒక జామారుకొని, తులంనర బంగారంతో ఆ వూళ్లోనే మెడలు చేయించి, మరోరెండు రోజులకు అదీ అదీ పాపయ్య గారిచేత నాకు బహూకరింపించారు నాయడుగారు, తమ యింటనే చిన్న సమావేశం జరిగించి.

చెయ్యిపట్టుకుని స్టీమరుదాకా వచ్చి, టిక్కట్టు తామే కొని, పాదివిపట్టుకుని స్టీమరెక్కించి, నన్ను కేబినులో కూచోపెట్టి, నా రెండు చేతులూ పట్టుకుని

"మిమ్మల్ని కష్టపెట్టాన్నేను. మీరు మాత్రం నన్నానంద పెట్టారు" అని ప్రశంసించి, ప్రీతిగా సాగనంపారు నన్ను, భావనారాయణస్వామి గారు.

మా అమ్మగారూ మా సీతా సరేసరి, ఆ మెడలు తిప్పి తిప్పి చూసి, మళ్ళీ మళ్ళీ ఉజ్జాయింపుగా తూకం కట్టి, చాలా చాలా ఆనందించారు మా నాయనగారున్నూ, చాలా సేపు.

కవిత్వం పరంగా నన్ను గుర్తించడమూ, తామానందించడమూ అదే మొదటి మాటు మా నాయనగారికి.

## 6

ఈ అనుభవం పునాదిగా, చాలా ధైర్యంగానే అంగీకరించాను, సత్యనారాయణశాస్త్రి ప్రతిపాదన.

శ్రద్ధా పట్టాను, వెంటనే.

శ్రద్ధ పట్టానంటే, నేత్రావధాన ప్రక్రియ నేర్చుకోడానికే, అష్టావధానం విషయమై నేను కొత్తగా చెయ్యవలసిన సాధన యేమీ లేదు.

కాగా, వెంటనే నేత్రావధానం గుర్తులు రాసి యిచ్చి వొక రోజల్లా నాచేత సాధన చేయించా డతను, దగ్గిర వుండి.

దేవనాగరి అక్షరాలు గుర్తించడమూ, ధారాళమైన వాచక శక్తి సంపాదించడమూ రెండు దినాల్లో జరిగిపోయాయి నాకు, చిన్నప్పుడు.

నేత్రావధాన ప్రక్రియకూడా రెండు రోజుల్లోనే బాగా స్వాధీనం అయిపోయింది నాకు.

వేగమున్నూ వచ్చేసింది అతనితో సమానంగా.

తెనుగుభాషకూ సంస్కృతభాషకూ యెన్ని కావాలో అన్నీ వున్నాయి, నేత్రావధానానికిన్నీ అక్షరాలు.

కాని, కళ్ళతో చూపించడానికే గాని, కలంతో రాయడానికి వీలుపడవు, గుణింతం సంకేతాలు.

కాక జంటకొక విధంగా వుంటాయా అక్షరం గుర్తులు కూడా.

కనక, అది వొక లిపిగా వుపయోగపడదు.

అది యెంత క్షుద్రప్రక్రియో, దాని గుర్తులూ అలాంటివే వొక సూత్రాని కందిరావు.

ఏమయినా, నా కళ్ళక్కొంచెం బాధ కలగడమూ, దానికదే తగ్గిపోవడమూ కూడా జరిగిపోయిందా రెండు దినాల్లోనూ.

విద్య మాత్రం మిగిలింది.

విద్య అన్నందుకు మన్నించాలి, అడుక్కోడానికి బయలుదేరి, నడివీధిలో దొర్లుకుంటూ వీధులకు వీధులు దాటేస్తారు ముష్టివా ళ్ళదీ అలాంటి విద్యే.

పరమక్షుద్రం అనే నా నమ్మకం యిప్పటికీ.

అయితే, ద్వంద్వభూయిష్ఠం అయిన ఐహిక జీవితం నడుపు కోవాలంటే- సంఘర్షణాత్మకమైన సంఘంలో బతకాలంటే-నేల బారుగా వుండినంతకాలమూ

అలాంటి క్షుద్రసాధనాలు కొన్ని ఆగత్యం అవుతూనే వుంటాయి, మనిషికి.

సత్యనారాయణశాస్త్రి చెప్పినట్టు, రసికులయిన వారికంటే, వినోదాలతో ఉబ్బి తబ్బిబ్బు లయిపోయేవారే యెక్కువ, లోకంలో.

అసలు, లోకం అంటేనేవారు.

లోక సామాన్యధర్మం అన్నది- వారినిబట్టే – వారికోసమే పుట్టింది కూడా.

హృదయం స్పందించిందా, ఎంతెంత ఆదరగౌరవాలున్నూ చూపిస్తారు, రసికులు.

కానుకలున్నూ యిస్తారు, వోపిన మట్టుకి.

ఏమీ యివ్వలేకపోతే బాధయినా పడతారు, తమ భాగధేయం తిట్టుకుంటూ.

వో–ట్టి వినోద ప్రియులకు వుంటుంది హృదయం, శరీర ధర్మానికి మాత్రమే దాని ప్రయోజనం.

అది కరగదు, చలించదు.

మస్తిష్కం మాత్రం వొక్క పొంగు పొంగుతుంది వినోదాలు చూసినప్పుడు, వారికి.

ఆ పొంగుతోనే యెంతో కొంత డబ్బు విదుపుతారువారు, ఆ విశేషానికింతా, యీ విశేషానికింతా అంటూ విభాగాలు చేసుకుంటూ.

వాటిలో కొన్ని విశేషాలకు "సీత్ సాయింపాకమైనా" యివ్వరువారు.

మళ్ళీ, ఆ స్మృతి అయినా వుండదు వారికిచ్చినా, వెళ్ళిపోతారు చేతులు దులుపుకుంటూ.

హృదయానికి బదులు వారి డబ్బుకి మాత్రమే చలనం కలిగిస్తాయి, వినోదాలు.

అదయిపోయింది, మరి, తరవాత?

"పునరపి మరణం, పునరపి జననం–" అలాంటి వారిని గురించి చెప్పిందే యీ మాట.

ఈ విధంగా, ఆ విద్యలు చూపించేవారికి డబ్బు అవసరమూ తీరుతుంది, ఏ కొంచెమో?

కాని, మళ్ళీ, అదే ప్రశ్న.

"అదే పరాయణమా మనిషి జీవితానికి?"

ఏదో కారణంతో – ఏదో విధంగా – చేతులు మారుతూనే వుంటుంది డబ్బు.

అసలు, ఆ చేతులు మారడంలో వుంది, దానికి విలువ.

ఇనప్పెట్టిలో మూలుగుతున్నంతసేపూ డబ్బూ, మేటిలో అణగివున్న గడ్డిపరకా సమానమే.

నదులు నిండడం కాదు ప్రధానం, సుపరిష్కృత మార్గాల్లో ప్రవహించాలవి.

అలా జరిగినప్పుడే వాటికి విలువ.

అలాగే, డబ్బున్నూ ప్రయాణాలు చేస్తేనే – యుక్తరీతిగా చేతులు మారితేనే లోకప్రవృత్తి.

ఉదారుడైనవాడే గుర్తించ గలడిది.

కనక, రిక్తుడే అయినా ఉదారుడు, జన్మకి సాఫల్యం సంఘటించుకోగలడు, ధనికుడైనా లోభికది సాధ్యం కాదు.

లోభులు, కళ్ళతో గూడా చూసుకోలేరు డబ్బు, మనస్సెక్కడ చలించిపోతుందో అని.

మూటమీద మూట కట్టడంలోనే వాడి పరాకాష్ఠ.

అయితే, చూడకా తినకా కూడా ఆ లోభులు కూడబెట్టిన ఆ డబ్బుకున్నూ కాళ్ళు వస్తాయి, క్షణంలో, వాళ్ళ పారం పండాలి, అంతే.

వినోదా లాశించేవారున్నూ ధన్యులే వొక విధంగా లోభుల కంటే – ఎందుకో వొకందుకు – ఎప్పుడో వొకప్పుడు – ఎంతో కొంత – లోభుల పరిభాషలో – వారున్నూ డబ్బు "తగలేస్తారు" కనక.

కాని లోభులతో తారతమ్య పరీక్ష వచ్చినప్పుడే వారి త్యాగానికి పరిగణన–విద్యల ప్రస్తావనా, జాతి వికాసం కలిగించే ఏర్పాట్లు ప్రసక్తి వచ్చినప్పుడు మాత్రం వారూ భూభారం కిందే లెక్క, అడవులతోనూ, పర్వతాలతోనూ, సముద్రాలతోనూ పాటు.

మంచిదేదో చెడ్డదేదో వారు గుర్తించలేరు, మరి.

పైగా, బుద్ధికూడా దూరం దూరంగానే వుంటుంది వారికెప్పుడూ.

మనస్సే నడిపిస్తుంది, వారిని.

అది చంచలం.

అదీ, కోతీ వొకటేరాశి.

మరి, దానికి వశులయినవారు?

ఏతావతా,–

వినోదాలు కూడా బహువిధాలు.

వాటిలో కొన్ని జిజ్ఞాస రేకెత్తేవిన్నీ వుండవచ్చు.

గాలి వాటాన యెగిరిపోయేవే యెక్కువ.

అదిగో, అలాంటి వాటికోసమే ఆరకం మనుష్యులు డబ్బు ఖర్చుపెట్టడం.

ఆ ఖర్చుల కొక దారీ తెన్నూ వుండదు.

ఒక అర్థం వుండదు.

ప్రయోజనమున్నూ వుండదు, లేశమూ.

వర్షపునీరు నిలవదు.

వాగులు కడుతుంది.

ఉరుకుతుంది, దూకుతుంది, సాగుతుంది, ప్రవహిస్తుంది, ఉప్పుటేట్లో కలుస్తుంది, చివరికి.

లోభుల డబ్బూ అంతే.

అది పెరుగుతుంది.

రకరకాలు దానిచేరిక.

పెరుగుతుంది పెరుగుతుంది, విరుగుతుంది చివరకి.

ఒక్కటే మూర్గాన దాని పోబడి.

ప్రపంచం నాలుగు మూలలనుంచీ రెండేళ్ళో మూడేళ్ళో అయింది, కండలు తిరిగిన మనుష్యులు వచ్చి మద్రాసులో చెడ్డ కొట్టుకున్నారు.

తక్కిన పత్రికలమాట నాకు తెలియదనుకోండి, తెనుగు పత్రికలు మాత్రం వారి యేపూ, వారి రూపూ, వారి చూపూ - వారు పూటూ, వారి పోటూ, వారి పాటూ - చివరికి వారి ప్రతీకదలికా నీహారవేశాలు కూడా విడిచి పెట్టకుండా, అదే వొక పరాయణం అన్నట్టు ప్రకటించాయి.

వారి రూప చిత్రాలు చూపించాయి, భిన్నభిన్న అవస్థలవి.

వారి తూకమూ, వారి యెత్తూ, వారి లావూ, వారి ఆహార నిద్రలూ, వారి అలవాట్లూ, వారి సరదాలూ క్షుణ్ణంగా వివరించాయి.

బొంబాయి, ఢిల్లీ, కలకత్తా - చివరికి కర్నూలునుంచిన్నీ వేలకువేలు - లక్షలకు లక్షలున్నూ మద్రాసు చేరుకున్నారు, వారికోసం.

వారాలూ పక్షాలూ వుండిపోయా రక్కడ.

తిండీ తిప్పలూ మరిచిపోయారు.

మరిచిపోయారనికాదు, విడిచి పెట్టేశారు.

మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుపెట్టారు, డబ్బు.

మరి, విద్యలంటే - శాస్త్రాలంటే - కళలంటే - పరిశోధన లంటే - నిర్మాణాలంటే - పోనీ బీదలంటే వొక్క గవ్వ అయినా రాలుస్తారా, వారు?

ఊరు విడిచి పెడతారా?

చెవిని పెట్టుకుంటారా, వాటి ప్రసక్తి అయినా.

ఒక్క రాగం విసిరి ఐక్యానుసంధానం కలిగిస్తాడు గాయకుడు.

ఒక్క భావం వొలిపించి ఆనందమేకాదు, సంస్కారమున్నూ కలిగిస్తాడు, కవి.

ఒక్క నల్లరాయి గండనించి నిలువునా జీవం తొణికిసలాడిస్తాడు శిల్పి.

ఒక్క కుంచె విసిరి ప్రపంచం అంతా యెదట నిలుపుతాడు చిత్రకారుడు.

తమాషాకి కాదు, తమ మెదడు సుపరిష్కృతం చేస్తారు వారు.

తమ హృదయం కదుపుతారు, గడియారం పెండ్యులం కదిపేటట్టు.

మరి, ఆ రోజుల్లో, మద్రాసు చేరిన వారిలో యెందరు చేరతారక్కడ?

ఎందరు సంచులు కోస్తారు వారికోసం?

అసలు, ఆ కళావేత్తల నొకచోట చేర్చడానికి మాత్రం యెవరు పూనుకుంటారు?

వారికివారే చేరుకున్నా, వారి అంతరశక్తుల నెవరు వివరిస్తారు, లోకకళ్యాణంకోసం?

మరి, డోలు మీద దెబ్బపడితే?

కనక, అలాంటివారి జేబులు కాళీకావాలంటే అలాంటి విద్యలే కావాలి.

అలాంటి విద్యల్లో వొకటి స్వాధీనం అయింది నాకా కొద్ది పాటి పరిశ్రమతో.

అయితే, అలాంటి క్షుద్రవిద్యలతో పొట్టపోసుకోడానికేనా నాకీ నిండు బతుకిచ్చాడు భగవంతుడు?

"కాక,—ఆకటితో కడుపుమాడ్చుకోడానికా?"

ఈ ప్రశ్నా వుంది, దాని తరవాతిదే యిది.

అరుదుగా వచ్చే అవస్థ లివి మనిషికి.

అరుదుగానైనా, కొందరికే వచ్చేవిన్నీ.

నలుగురితో పాటయినవారికి రానూరావు, అర్థమూ కావసలు.

మనిషి విలవకి గణకాలివి.
మనిషి యెత్తుకి తూకాలివి.
మనిషి బతుక్కి సాఫల్యమో వైఫల్యమో కలిగించేవివి.
మనిషిలో వుండే దైవికాంశ లోకానికి చూపిస్తాయివి.
ఏమయినా, తిప్పితిప్పి కొడతాయి, బులబులాగ్గా తేలిపోవు.
ఒక్కటి మాత్రం గట్టిగా చెప్పవచ్చు.
జటిలాలైన జీవితాలే యెన్నుకునే సమస్యలివి.
కనక, వొక ఆట ఆడించే విడిచి పెడతాయి, చివరికి.
ఆ ఆటలో పడిపోతా డా మనిషి, నిలుస్తాడా?
ఆ సమస్యలు కావు, ఇదీ ప్రధానం.
సముద్రంతో పోల్చారు పెద్దలు, సంసారం.
వెలలేని రత్నాలూ వున్నాయి, భీకరాలైన జలజంతువులూ వున్నా యందులో
అవీ యివీ కూడా బహుళాలే, విరళాలు కావు.
మరి, కళ్ళుమూసుకుని "హరోంహర" అంటూ అందులో వురకడమా, వెనక్కి తిరిగి, వూపిరి బిగపట్టుకుని పారిపోవడమా?
మనిషి జీవశక్తికి వార్తికాలివి.
అన్నీ సమస్యలూ, అన్నీ పరిష్కారాలే సంస్కారంలో.
ఒక్కొక్క సమస్య అడ్డుతగులుతుం దొక్కొక్కడికి.
ఒక్కొక్క పరిష్కారం గమ్యం చేరుస్తుం దొక్కొక్కణ్ణి.
ఎవరికి వారికే దొరుకుతుం దేదో వొక సాధనం.
సంస్కారాన్ని బట్టి వుంటుందా దొరకడం అయినా.
ముద్దకొక వ్యంజనం కావాలి చక్రవర్తులకు, మృష్టాన్నం అయినంత మాత్రాన చాలదు.
ఉప్పుగల్లుం టే చాలు, కడవలతో దోర్చేస్తాడు బీదవాడు గంజి.
అదీకా, దిదీకాదు, వో – ట్టి గాలిమేసి యుగాలకు యుగాలు గడిపేస్తాడు మహర్షి.
పుట్టుకకూ, దృక్పథానికీ ఫలితాలివి.
సంస్కారాన్ని బట్టి వుంటుంది పర్యవసానం.
దాని తరవాతిదీ, దాని కనుగుణమున్నూ పురుషకారం.
పండితుడైనవాడికి జీవనసరణి పరిష్కరించుకోడంలో వుంది, ప్రజ్ఞ.
మరి, పండితుడం టే?
అనుభవపరుడు, సంస్కారి, దీర్ఘదర్శి.
శబ్దార్థాలు మాత్రమే తెలిసినవాడు కాడు.
అయితే, పండితుడికిన్నీ అడ్డు తగలడం వుంది, పరిస్థితులు.
సంసారంలో వున్నంతసేపూ, యేదీ, యిదమిత్థం అన్న నిర్ధారణ కందదు.
లోయిల్లోకి జారవలసే వస్తుంది.
శిఖరా లందుకోడమున్నూ పడుతూనే వుంటుంది.
ఇక సమతలం దొరకడమా?

జీవిత ప్రారంభంలోనే దొరకవచ్చు, చాలా కాలం గడిస్తే గాని అందకపోవచ్చు, ఎప్పటికీ అందకపోయినా అందకపోవచ్చు కూడా.

మరి, గమ్యం?

మరి, ప్రాప్యం?

అది మరిచిపోగూడదు.

అదిగో, అందుకోసం బతకాలి, మనిషి.

## 7

"సరే" అన్నానంతే నేను "హైదరాబాదురాజ్యంలో సాహసానికి సాహసమూ, ఔదార్యానికిన్నీ ఔదార్యమూ హెచ్చు" అంటూ ప్రయాణమే కట్టేశాడు, సత్యనారాయణశాస్త్రి.

ఏమిటేమిటో నిబంధనలు చెప్పాడు, ఏమిటేమిటో నిర్ధారణలూ చేశాడు, స్వతంత్రించి కంభం మెట్టుకి టిక్కట్టు కొనేశాడు, రెయిలున్నూ యెక్కించేశాడు తీసుకువెళ్ళి నన్నతను.

బెజవాడలో మారిన బండి తెల్లవారుతోందనగా కొండపల్లి దాటింది, అది మొదలు "పరాయిదేశం వెడుతున్నా" మన్నట్టుంది నాకు.

ఇప్పటికిన్నీ, తూర్పుగోదావరి జిల్లాలో పుట్టి పెరిగినవాడికి, మొదటి మాటు, తునిదాటితే మరో ప్రపంచమూ, ఒంగోలు దాటితే మరో ప్రపంచమూ, నరసారావుపేట దాటితే మరో ప్రపంచమూ, కొండపల్లి దాటితే మరో ప్రపంచమున్నూ.

అసలు, ఏలూరుదాటితేనే భేదం కనపడుతుంది, అది అవగాహన కానిది కాదు.

అక్కడిదీ, అక్కడిదీ, అక్కడిదీ, అక్కడిదీ కూడా కండగల తెనుగే; గాని, కాదేమో అనిపిస్తుందెక్కడి కక్కడే.

అందుకు బెదరక, మళ్ళీ మళ్ళీ వెళ్ళాడా, తెనుగుభాష తన విశ్వరూపం కనపరుస్తుంది; ఆంధ్రత్వమున్నూ సమగ్రం అవుతుంది, వెళ్ళిన వాడికి.

ఒక్కొక్క సీమలో వొక్కొక్క జీవకణం వుంది తెనుగు రక్తంలో, అన్నీ వొకచోటికి చేర్చగల – అన్నీ వొక్క తెనుగు వాడి రక్తంలో నిక్షేపించగల మొనగాడు పుట్టుకు రావాలి, అంతే.

మొదటి మాటు విశాఖపట్నం వెళ్ళాన్నేను.

అప్పటికి నాకున్నది వొక్కటే ప్రాణం.

వారం రోజులున్నా నా మొదటి మా టక్కడ.

రెండో ప్రాణం సంక్రమించిన ట్టనిపించింది, దాంతో నాకు.

తరవాత నెల్లూరు వెళ్లాను, మూడో ప్రాణం సంక్రమించినట్టనిపించిం దక్కడ.

అదయిన తరవాత కడపా, అనంతపురమూ, నంద్యాలా వెళ్ళాను, నాలుగో ప్రాణం సంక్రమించిన ట్టనిపించింది.

చివరికి హనుమకొండ వెళ్ళాను, అయిదో ప్రాణం కూడా నాకు సంక్రమించినట్టు – నా ఆంధ్రరక్త పరిపూర్ణం అయినట్టనుభూతం అయింది నాకు.

ఇవాళ చూసుకుంటే, అయిదు ప్రాణాల నిండు జీవితమే నాది. అందుకు తగ్గ దార్ఢ్యం మాత్రం కూడలేదనే చెప్పా, లింకా.

అందుకోసం నేను చేసుకున్న దోహదం బహూ తక్కువ, మరి.

ఆంధ్రహృదయం–ఆంధ్రభాషపరంగా వ్యక్తం అవుతున్న జీవనసరణి నాకింకా బాగా అవగాహన కాలేదు.

నా స్వప్రాంతపు పలుకుబడిలో యెంత జీవశక్తి వుందో, అక్కడక్కడి పలుకుబళ్ళలోనూ అంతంత జీవశక్తివుంది, వారాల్లోనూ మాసాల్లోనూ పట్టుబడేది కాదది.

ఒక్కొక్కచోట ప్రచలితం అయే కాకువూ, వొక్కొక్క చోట ప్రయుక్తం అయే యాసా పుస్తకాలు చదివితే అందవు, వొకచోట కూచున్నా దొరకవు – పల్లెలూ పట్నాలూ తిరగాలి, అష్టాదశవర్ణాల వారిలోనూ పరభాషా వ్యామోహం లేనివారిని కలుసుకోవాలి, ఆ పలుకుబళ్ళు చెవులారా వినాలి, ఆ ప్రయోగవైచిత్రి సవిమర్శంగా పట్టుకోవాలి, ఆ నాదం – చిక్కని ఆ మధుర గంభీరనాదం అవగాహన చేసుకోవాలి, అన్నిటికీ ప్రధానంగా "ఇది నా సొంతభాష–మొదటిమాటు, నా తల్లి, నా జీవశక్తికి జత చేసిన– నాకు వాగ్ధార అవిర్భవింప చేసిన సంజీవిని అన్న ఆత్మీయతా, మమతా ఉద్బుద్ధాలు చేసుకోవాలి, ముందు."

అప్పుడు గాని యే తెనుగువాడికీ నిండు ప్రాణం వుందని చెప్పడానికి వీల్లేదు.

దానికోసం నా పరితాపం యిప్పటికీ.

నిజం చెప్పవలసివస్తే, యే వొక్క శాస్త్రంలో సమగ్ర పరిజ్ఞానంలేని షట్శాస్త్ర పండితుని స్థితి నా దివాళ.

అయినా, నా తెనుగుభాష శాస్త్రీయం–తాటా బూటం కాదు.

నా తెనుగు భాషయుగయుగాలుగా ప్రవాహిని అయివుండినదిగాని, యివాళ, ఆభాషలోనుంచి వొక మాటా, యీ భాషలోనుంచి వొకమాటా యెరువు తెచ్చుకుని భారతవిద్య ప్రదర్శిస్తున్నది కాదు.

నా తెనుగుభాష సరస్వతికే తెనెచినుకు లందించింది గాని నిరుచప్పనిది కాదు.

నా తెనుగుభాష ఎక్కడ పట్టినా చక్రవర్తుల రాజ్యాంగాలు నడిపిందిగాని, పరాన్న భుక్కుకాదు.

నా తెనుగుభాష స్వతంత్రంగా బతగ్గలది గాని కృత్రిమ సాధనాలతో ప్రాణవాయువు కూర్చుకోవలసిందీకాదు, అక్రమ దోహదాలతో పోషించబడవలసిందీ కాదు.

యావద్భారతదేశంలోనూ, యీ విశాల విశ్వంలో కూడా తెనుగువాణ్ణిగా, నేనే నిర్వహించవలసిన కార్యక్రమం కొంత వుంది, – నా దృఢ విశ్వాసం యిది.

అందుకోసం, అన్నిసీమల పలుకుబళ్ళూ బోధపరుచుకుని అన్నిసీమల జీవశక్తీ కూర్చుకుని స్వస్వరూప జ్ఞానంతో దృఢంగా నిలవగలగాలి నేను.

సత్యనారాయణశాస్త్రికి వొక్క డబ్బుమీదే ఆశ.

నాకు మాత్రం యీ ఆకాంక్ష కూడా వుంది, పూర్తిగా.

కాగా, ఆ కమ్మంమెట్టులో, వొక్కొక్కమాట– వొక్కొక్క ప్రయోగం–వొక్కొక్క కాకువు కొత్తరక్తం పెట్టసాగింది నాకు.

ఆ ప్రాంతం నా తెనుగు దేశపు జీవగడ్డల్లో వొకటి.

అక్కడ, నేను, నా ఆంధ్రసోదరులతో సంబంధం పెట్టుకోవాలి.

ఈ ఆకాంక్ష–ఈ ఆత్రం–యీ పూనిక–వీటితో కమ్మంమెట్టు స్టేషనులో దిగాన్నేను.

## 8

"ఇలాంటి వాటికి, యిక్కడి తహాసీలుదారుని చూడ్డం మంచిది ముందు" అన్నాడు, మాతో పాటు అక్కడే దిగిన ఆ వూరి పెద్దమనిషి వొకాయన.

"సాధారణంగా, పండితులెవరు వచ్చినా ఆయన్ని తప్పకుండా చూస్తారీవూళ్ళో" అనిన్నీ చెప్పాడాయన.

అప్రయత్నంగానో సప్రయత్నంగానో యిలా వాకబుచేసుకుంటూనే పండితులెక్కడికి వెళ్ళినా.

వారు సంపాదించుకున్న జాపితా సమగ్రమూ కావచ్చు, అసమగ్రమూ కావచ్చు కాని యీ వూళ్ళో వుండగానే ముందు వూరి రసికతా ఔదార్యమూ పరిమితి కట్టుకోడం–ఇదొక మంచి సంప్రదాయం, జాతీయ విద్యలు నేర్చుకున్నవారికి.

తీరా వెళ్ళాక, ఆజాపితా కెక్కిన పెద్దమనుష్యులు కొందరు కనపడావచ్చు, కొందరుకనపడకా పోవచ్చు.

కనపడ్డ వారయినా సత్కరించావచ్చు, తిరస్కరించావచ్చు.

"భాషామంజరి స్వమాప్తః"

ఇక మాట్టాడవలసింది లేదు.

ఆ వూళ్ళో మరి క్షణమైనా వుండనక్కరలేదు.

వార్షికాలు సంపాదించుకునే నలుగు రైదుగురు గురువుల దగ్గర చదువుకుని వుండడం వల్లా, ఎందరో పండితుల ప్రవృత్తి చూసి వుండడం వల్లా యిప్పుడే కాదప్పుడే తెలిసివుండిన సంగతినాకిది.

ఈ యెరుకతో భవిష్యత్తూహించుకుంటూ జట్కాయెక్కాం మేము.

వెతుక్కుంటూ తహాసీలుదారు బసకీ, అక్కణ్ణుంచీ కచేరీకీ వెళ్ళాం.

రెయిలు సహచరుడు డాయన బ్రాహ్మడని చెప్పాడు.

ఇంటికి వెళ్ళగా కచేరీకి వెళ్ళమన్నవారు, కొంచెమో గొప్పో సంస్కృతమున్నూ తెలిసినవాడని చెప్పారాయన.

కాని ముస్లిము అన్నట్టున్నా డాయన వేషభాషల్లో.

మామాటే సరిగా వినిపించుకోలేదా "అధికారి"

ప్రారంభంలో నేనే మాట్టాడాను; గాని ఆ ధోరణి చూసి మొగం తిరిగి, యిటు తిరిగేశాన్నేను.

సత్యనారాయణశాస్త్రి అందుకున్నాడు, అవ్యవధిగా.

కాని, చెవిటివాడిముందు శంఖం వూదడం అయిపోయిం దతనికి ప్రయత్నం కూడా.

అతను కూడా నిరాశ చేసుకునే లోపున నా బుద్ధి మరో చర్చ కందుకుంది.

ఇక్కడి మన లౌక్యులు యురపియనుల్లా వుంటారు వేష భాషల్లో.

హైదరాబాదు రాజ్యంలో మనవాళ్ళే ముస్లిములన్నట్లుంటారు.

"యధారాజా తథాప్రజాః"

"రాజానుమతో ధర్మః"

ఈ మాటల కనుగుణమా యిది?

అయితే, మైసూరూ, బడోదావంటి మన హిందువుల రాజ్యాలున్నాయిగదా; అక్కడా, అలాంటి చోటా దొరలూ, ముఖ్యంగా ముస్లిములూ మనలా వుంటారా వేషభాషల్లో?

ఉండకపోతే 'యెంచేత?

మనకి ఔదార్యంకిందా, సౌందర్య పిపాసకిందా, సౌకర్యాకాంక్షకిందా, లెక్క అవుతుందా, భావదాస్యంకింద జమ అవుతుందా?

నా జిజ్ఞాస యీ స్థితికి వచ్చాటప్పటికి "ఇక వెళ్ళిపోదాం" అన్నాడు సత్యనారాయణ శాస్త్రికూడా, మొగం మొత్తి.

"ప్రథమ కబళే మక్షికాపాతః"

"ఉపశ్రుతి బాగాలే" దంటూ బాధపడ్డాడు సత్యనారాయణ శాస్త్రి.

"కీడు తప్పిపోయిం"దన్నా న్నేను.

ఇద్దరమూ బయలుదేరాం, మళ్ళీ జట్కా యెక్కి.

తొమ్మిదిన్నర దాటింది, ముందు బస చేసుకోవాలి, భోజన సౌకర్యమున్నా కల్పించుకోవాలి, తరవాత.

"ఎక్కడి" కనడిగాడు, జట్కా మనిషి.

"సత్రానికి పోనిమ్మన్నా"న్నేను.

"అయ్యా, ఆగండి" అంటూ వొక మాట వినవచ్చిందింతలో, వెనకనించి.

ఒక పెద్దమనిషి వచ్చి కలుసుకున్నాడు, మాట వెనకనే.

"సభ మాట తరవాత చూసుకోవచ్చు, ముందు, భోజనానికి మాయింటికి దయచెయ్యండి" అన్నాడాయన.

మొగమెరగని దూర ప్రాంతాన తన యింటికి భోజనానికి రమ్మని వొక అపరిచిత వ్యక్తి ఆహ్వానం.

మేము తహాస్సీలుదారుతో మాట్లాడినంతసేపూ ఆయనా వున్నాడక్కడ.

మా సంభాషణ అంతా విన్నాడు.

ఎందుకో, ఆయన మొగాన అసంతృప్తి అంకితం అయివుందప్పుడు.

ఈ ఆహ్వానంతో "బోధపడిందది" అనుకున్నా న్నేను.

తహాసీలుదారు ప్రవృత్తే ఆయన కసంతృప్తి కలిగించి వుండాలి, మరి.

ఏమయినా, వైదిక ధర్మానికి సంబంధించిన సదాచారం యీ భోజనానికి రమ్మనడం.

ఆర్ష సంప్రదాయం.

ఎక్కడో, బొత్తిగా నికృష్టులు తప్ప బ్రాహ్మలందరూ మన్నిస్తారిది.

భరతభూమి అన్నపూర్ణ తల్లి.

అన్నానికీ లోటు లేనిదిది, అన్నదానానికీన్నీ పేరుపడింది వెనకటికి.

ఆ ప్రభు లలాంటి వాళ్ళు, ఆ రాజ్యాంగాలున్నూ అలాంటివి.

మనకు స్వాతంత్ర్యం పోయింది, స్వధర్మమూ కలుషితమయిపోయింది.

ఇవాళ కూడా "మనమేనా మనం?" అన్న స్థితిలో వున్నాం మనం.

అంతేకాదు, ఇప్పుడు, మన నెత్తికెక్కి వున్న పరధర్మవ్యామోహంతో మన స్వధర్మం తప్పపట్టేస్థితిలో కూడా వున్నాం మనం.

మన ధర్మం ప్రాతిపదికలున్నూ అర్థం చేసుకోలేని స్థితిలో కూడా వున్నాం.

వాచా, మన ఆధ్యాత్మికతను పొగిడేవారే మన ప్రముఖులంతా, కాని, కర్మణా మాత్రం గోతులు తవ్వుతున్నారు దానికి వారు.

అజ్ఞానం మాత్రమే కాదిది, దౌర్భాగ్యమున్ను.

దీనికి నిష్కృతి వుందా?

ఈ చర్చ మరొకప్పుడూ, మరో చోటాను.

పోగా, ఆ పెద్దమనిషి ఆహ్వానించడం చూసి, ఎగిసిపడి చూశాడు సత్యనారాయణశాస్త్రి నాకేసి విరగబడిన్ని.

"ఇప్పుడెలావుంది శకునం?" అనడిగా న్నేను.

మాట్టాడలేకపోయా డతను, మెప్పుగా మాత్రం చూశాడు, పెదవులు బిగించుకునీ, తల పంకించుకుంటూను.

చూడగా, నిశ్చలంగా చూస్తున్నాడా పెద్దమనిషి.

సాహిత్యప్రియు డాయన.

ఉన్నంతలో భోగీ, త్యాగిన్నీ.

ఆ ప్రాంతపు సాహిత్య వ్యవసాయోదంతం కొంత చెప్పాడాయన.

విశేషించి, సర్కార్ల సాహిత్య వ్యవసాయమూ తెలుసు, ఆయనకు కొంతకి కొంత.

నా మిథునానురాగం చదివి వున్నా డాయన.

మా యెడల ఆయన కాదర భావం కలగడానికిది కొంత కారణమే, కాని నేత్రావధానం అనేటప్పటికి కరిగిపోయాడాయన.

ఇంటికి వెళ్ళాక, ఆయన చూపించిన ఆదరభావం చకితుల్ని చేసింది మమ్మల్ని.

కళ్ళతో మాట్టాడుకుంటూ మేమూ బాగా చకితుల్ని చేశాం కొంత సేపాయిన్ని.

స్నానమూ భోజనమూ చేసి పడుకున్నాం.

"మొగం కడుక్కోండి టీ పుచ్చుకుందాం" అంటూ గ్లాసులతో చక్కా వచ్చాడాయన, మేము మేలుకోడం చూసి.

అందించడం తడువుగా గ్లాసు కాళీ చేశాడు సత్యనారాయణ శాస్త్రి.

చూసి వూరుకున్నా న్నేను, గ్లాసుకేసి.

టీ అంటే బొత్తిగా యిష్టంలేదు నాకు.

ఒకవిధంగా అనిష్టమూ, నిరసనభావమూ కూడా అదంటే.

పుచ్చుకోగూడ దన్న నియమం లేదుగాని అంత వెగటు అదంటే, నాకు.

చాలా వింతపడ్డాడందు కాతి థేయ.

"మరి యెలాగా?" చాలా కించపడ్డాడు కూడా ఆయన.

"మజ్జిగ యివ్వండి" అని అడిగి పుచ్చుకుని, ఆ సమస్య పరిష్కారం చేసుకున్నాన్నేను.

అప్పుడన్నా డాయన, "మీ రిక్కడ యెన్నాళ్ళుండినా మజ్జన భోజనాదులు మాయింటోనే, సభ చేయించడం మాత్రం నావల్లకాదు, మరి" అని.

దేవత సాక్షాత్కారించి వరం యిచ్చినట్టనిపించింది మాకది.

తప్పనిసరి అయినప్పుడు హోటల్లో భోజనం చేస్తూనేవున్నాన్నేను, నెలల తరబడి కూడా, సత్యనారాయణశాస్త్రికి సుతరామూ యిష్టం లేదది.

దాంతో, మేమిద్దరమూ కూడా ఆ ఆహ్వానమూ, ఆ ఆదరమూ గొప్ప సత్కారంగా భావించుకున్నాం.

నే నడగ్గా, చూడవలసిన పెద్దమనుష్యుల జాపితా రాసి యిచ్చాడాయన, పదిపది హేనుగురిది.

వకీళ్ళు, వర్తకులు, ఆఫీసర్లు, డాక్టర్లు, సంపన్న గృహస్థులు—యిలా వుందది.

అందర్నీ చూశాం.

మళ్ళీ మళ్ళీ చూశాం.

కాని "మా భాగే" అన్న వారు కనపడలేదు మాకు.

"ఇదే మా మొదటి ప్రయత్నం. మా విద్య చూడండి. దమ్మిడీ కూడా యివ్వనక్కరలేదు మాకు" అని చెబుతూ కూడా తిరిగాం మరో రెండు దినాలు.

విసిగిపోయాం.

తల తిరిగిపోయే అవస్థలో కూడా పడ్డాం.

వెళ్ళగా వెళ్ళగా, వొక యింటి తలవాకిట యిద్దరు పెద్ద మనుష్యులు కూచుని వున్నారు.

మధ్యవయస్సులో వున్నా రిద్దరూ.

నాగరికులు.

కాని హిందువులా, ముస్లిములా?

బీడీలు కాలుస్తున్నా రిద్దరూ కూడా.

ఉర్దూలో మాట్లాడు కుంటున్నారు ధారాళంగా.

వేషమున్నూ దానికి తగ్గట్టే వుంది.

కాని, యిటు చూడగా, రంగవల్లికలున్నాయి గుమ్మాన.

సాహసించి బీడీలెక్కగా "సర్కార్లనుంచి వచ్చారా మీరు?" అనడుగుతూ సాదరంగా ఆహ్వానించారు మమ్మల్ని.

పూర్తిగానే టూకీగా మాత్రం చెప్పాను, మాసంగతి నేను.

"నేత్రావధానం చూశావా నువ్వు?" అంటే "పోనీ నువ్వు చూశావా?" అంటూ, అని ఆకాంక్షించుకుంటూ అదంటే యెంతో కోరికవున్నట్టు వెల్లడించారు వారు.

"మీ కిష్టం వచ్చింది రాసి యివ్వండి" అనడిగి పుచ్చుకుని, సత్యనారాయణశాస్త్రి, కళ్ళతో చెప్పాడు నాకది.

నే ననువదించాను.

"అష్టావధానం చేసేదినేను" అని తెలుసుకుని, నాకో చీటీ రాసి యిచ్చి, నన్ను కూడా కళ్ళతో చెప్పమన్నారు వారు.

సత్యనారాయణశాస్త్రి అనువదించాడు.

ఇద్దరూ డంగయిపోయారది చూసి.

"సభ జరిగించవలసిందే" అని కూడా కూడబలుక్కున్నారు వారు.

వారి నిశ్చయం తెలుసుకుని, వారి సెలవున్నూ పొంది గుమ్మాలు దిగాం మేము.

పెదవులు బిగించుకుని, కనుబొమ్మ లెగరవేసుకుంటూ, తల కూడా యెగరవేసుకున్నాడు, సత్యనారాయణశాస్త్రి, నాకేసి చూస్తూ.

## 9

మర్నాడే సభ.

రెయిలు కట్టకి పడమరగా, రెయిల్వే ప్లాటుఫారానికిన్నీ యెదురుగా వొక గ్రంథాలయం.

అక్కడ జరిగింది సభ.

ఎవర్నీ యెరగం మేము, పెద్దపెద్దలే వచ్చారని చెప్పారు, సభానిర్వాహకులు.

మొదట్లో మేము కలుసుకున్న వారిలో నలుగు రైదుగుర్నే గుర్తించా న్నేను. ఏడెనమండుగురు వచ్చినట్టు చెప్పాడు, సత్య నారాయణశాస్త్రి.

అన్నట్టు, తహసీలుదారున్నూ వచ్చా డాతిథేయివెంట.

"నే" నంటే "నే" నంటూ పృచ్ఛకులుగా తయారయినారు చాలా మంది; కాని, వారిలో కొందరినీ, తక్కినవారిలో కొందరినీ నామినేటు చేశారు, సభానిర్వాహకులు.

ఆ సంఖ్యచూసి "పనులే యెనిమిది, పద్యం చెప్పడం వొకరికే" అన్నా న్నేను, నిర్మొగమాటంగా.

"వల్లకా"దన్నారు సభ్యులు, చాలా మంది.

"వీల్లే"దన్నా న్నేనుకూడా, దృఢంగా.

ప్రతిష్టంభనం యేర్పడింది, దాంతో.

"సభ జరగదేమో?" అన్నాడు ఆత్రంగా, సత్యనారాయణశాస్త్రి, కళ్ళతో.

"వారు జరపకపోతే నేనూ జరగనివ్వ"నన్నాను నిర్లక్ష్యంగా, నేనూ కళ్ళతోనే.

నిజం చెబుతున్నాన్నేను, డబ్బు సంపాదించుకుందా మనే బయలుదేరాం మేము.

కొన్ని చోట్ల నియమాలను భంగపరుచుకోవలసే వస్తుంది, స్వయంగానే అర్థార్థులకు, నాకు తెలుసు.

కార్యహానే తటస్థించవచ్చు, వొప్పుకుంటాను కూడా.

అయినా, నాపట్టు నేను విడిచిపెట్టుకో లేకపోయాను.

అయితే, నేనొక దారిన వెళ్ళగా, సభా నిర్వాహకులు మరో దారిన వచ్చారు.

వారికి నేత్రావధానం ప్రధానం అయింది, అష్టావధానంకంటే.

కాక, అయిదారుమాట్లు కళ్ళతో మాట్లాడుకున్నాం సత్యనారాయణశాస్త్రి నేనూను.

అది మత్తుమందుగా పనిచేసింది, సభ్యులమీద.

అదికూడా గుర్తించారు సభా నిర్వాహకులు.

"అయితే, వ్యస్తాక్షరి నేత్రావధానంలో కలపండి" అన్నారు వారు, యుక్తిచేసి.

"సరే" అనేశాన్నేను, అవ్యవధానంగా.

కాని, గతుక్కుమనిపోయాడు సత్యనారాయణశాస్త్రి.

చాలా తటపటాయించాడు, నా కొత్తదనం పురస్కరించుకుని అతను.

"తొందరపడుతున్నా" వన్నాడతను, కళ్ళతో, అదుర్దా పడుతూ.

"మరేం భయం లేదు, ధైర్యంగా వుండు" అన్నాన్నేనూ కళ్ళతోనే.

ఈ సందర్భంలో కూడా నాలుగైదుమాట్లు, ఇలా కళ్ళతో మాట్లాడుకున్నాం మేము.

"ఎప్పుడెప్పు" డన్న ఆత్రం కనబరిచారు సభ్యులు, దాంతో.

"ఇక లేదు" అనుకున్న సభ యిది. మావిద్య చూడమని మా ప్రార్థన. వ్యస్తాక్షరి నిర్వహించడమే కష్టం, అది నేత్రావధానంతో కలపమనడం అగ్నిపరీక్షేమాకు. అయినా, అదీ మా కొరకే మన్ననగా మీ ఆజ్ఞ శిరసా వహిస్తున్నాన్నే" నంటూ కార్యక్రమం ప్రారంభించాన్నేను, వెంటనే.

సభ్యులందరూ సావధానులయినారు.

తాదాత్మ్యం యేర్పడిపోయింది, నాకు.

నా స్థితి నాకు గుర్తుకి రాకపోలేదు మధ్యమధ్య, కాని, జీవన్మరణ సమస్య అయిపోయింది నాకా అష్టావధానం.

అయినా పరమేశ్వరానుగ్రహం, నా ప్రజ్ఞా నా శక్తీ యేమీ లేవు, జేగీయమానంగా నెరవేరింది, చివరికది.

గంటన్నర పట్టిందందుకు.

పృచ్ఛకుల్లో కొందరు – సంభాషణ కున్నవారూ, పురాణం శ్రోతా, చదరంగవుజ్జీ చాలా కసిగా కమ్ముకున్నారు నన్ను, పద్యం వొక్కరికే అన్నందుకు, పగపట్టి.

"తొయ్యలి మృద్వియయ్యు మరుతూపయి డెందముదాకె గొబ్బునన్" అంటూ, మొదట నేను వ్యస్తాక్షరి అప్పగించినందుకు, ఆనందతాండవం చేశారు సభ్యులందరూ.

తక్కినవిన్నీ జేగీయమానంగా నెరవేరాయి.

ఉబ్బెత్తుగా లేచి, సభా నిర్వాహకులిద్దరూ కుదిపేశారు నన్ను, పొదివి పట్టుకుని.

ఆనంద బాష్పాలు రాల్చాడాతి థేయ.

"ఈ రాష్ట్రంలో బాగా డబ్బు సంపాదించుకోవచ్చు నన్న ఆశతో వచ్చాం మేము. అయితే, ధనాశ దూరంగా వుంచి, మా ప్రజ్ఞమాత్రమే కనబరుచుకోవలసి వచ్చింది, మాకీ వూళ్ళో, ఇందుకోసం మేము శ్రమపడ్డం ధర్మమే, మీకున్నా

శ్రమ కలిగించాం మేము. క్షమించి మాకు సెలవిప్పించండి" అంటూ కార్యక్రమం ముగించాన్నేను.

గ్రంథాలయం శక్రటరీ వందనాలు చెప్పారు, వెంటనే.

సభానిర్వాహకుల్లో వొక రందుకున్నా, రుత్తరక్షణాన.

"తృప్తిగా మన యిళ్ళకు వెళ్ళిపోవచ్చు మనం శాస్త్రులుగార్లున్నూ ముందుకి వెళ్ళిపోతారు, నిశ్చితంగా. డబ్బు కోసం ఆశపడలేదు వారీ వూళ్ళో. ఇది పరమసత్యం. "మా విద్య చూడండి" అని మాత్రమే కోరారు వారు. మనం చూశాం. చాలా చాలా ఆనందించాం కూడా. అయితే, మన కంభం మెట్టులో రసికత వొక్కటి మట్టుకే కాదున్నది. డబ్బూ వుందెంతో కొంత, ఔదార్యమూ వుంది, యేవూరికీ తీసిపోనిది. కృతజ్ఞత చూపించుకోవలసిన బాధ్యతకూడా యెక్కువగానే వుంది మనకి. కనక, మనం వారిని సత్కరించడం చాలా అవసరం అనుకున్నాం మేము. ఈ అవధానం చూసి ఆనందించిన వాళ్ళమే చేద్దాం ఆ సత్కారం. ఆనందించినవారిలో కూడా యిష్టమూ అవకాశమూ వుండిన వాళ్ళమే చేద్దాం. ఆ చెయ్యడం అయినా యిప్పుడే చేద్దాం యెప్పుడో కాదు. ఎవరికి తోచింది వారివ్వండి" అంటూ పర్సుకూడా తీశారు ముందు, వారు.

ఎవరెవరో కూడా తీశారు వెంటనే.

ఒకట్లు – రెళ్ళు – మూళ్ళు – నాలుగులు – అయిదులు – వొకటి రెండు పదులు – ఎనభై రూపాయలకుపైగా వసూలయినా యక్కడి కక్కడ.

అది నా చేతిలో పెట్టి ఉపచార వాక్యాలున్నూ చెప్పారు వారు.

డబ్బు దొరికింది సరే అనుకోనిది, మొదటి మాటు నేత్రావధానమున్నూ బాగా చెయ్యగలిగాన్నే నందుకు చాలా గర్వించాను.

"మీరు ఫలానా – ఫలానా వూళ్ళు వెళ్ళా" లంటూ సలహాలు చెప్పారు కొందరు.

"బాగా సత్కారం జరుగుతుంది సందేహం లే" దనిన్నీ అన్నారు వారు.

వెళ్ళిన చోటనల్లా, భంగపడకుండా అవధానం నెరవేరడం మొదటి సత్కారం నాకు.

తరవాతిది డబ్బు.

అదిన్నీ రాకపో దెంతో కొంత.

ఆ రాష్ట్రంలో రెండు మూడు మాసాలు తిరుగుదామనీ, హైదరాబాదు నగరంలో కనీసం వొక్క మాసమయినా వుందా మనీ మా సంకల్పం.

కాని, అది వుదుకో జ్వరమో మరి, కంభం మెట్టు ప్రవేశించిన రాత్రే ప్రారంభం అయింది, మా కిద్దరికీ.

అన్నహితవు చెడింది.

నిద్ర కరువయింది.

అసలే మెయి నెల అది.

దానికి సాయం, చివడకాల్చిన యినపగుండులాగ – వూరికి మధ్యగా – నున్నగా చెక్కిన పే–ద్దకోట కొండ.

దానా దీనా, పంచాగ్ని మధ్యం అన్నట్టయిపోయిం దక్కడ మా పని.

"అవధానం చెయ్యాలి, కంభం మెట్టు విడిచి పెట్టాలి" అని దీక్ష పట్టుకుని వుండకపోతే ఆ వారంరోజులూ కూడా మేమక్కడ వుండలేకే పోదుం.

అతిథేయి మా కెన్నో సదుపాయాలు చేశారు, సాదరంగా.

నిజంగా, ప్రాణం యిచ్చారు మాకు, వారు.

ఇద్దరు పెద్దమనుష్యులు—మర్నాటి మధ్యాహ్నం వొకరూ, రాత్రి వొకరూ విందులు చేశారు.

కాని, మరి, వుండలేకపోయాం.

మా స్థితి చూసి "ముందుకి వెళ్ళవద్దన్నారు," అతిథేయీ సభా నిర్వాహకులూ కూడా.

నే నాలోచనలో పడ్డాను; కాని "వెళ్ళిపోదాం" అంటూ మూటే కట్టేశాడు, సత్యనారాయణశాస్త్రి.

ఆరాత్రే రెయిలుకి బయలుదేరాం.

టిక్కట్లిమ్మనగా డబ్బు పుచ్చుకోనన్నాడు బుక్కింగుక్లర్కు.

"మీ అవధానం చూశాను, చాలా ఆనందించాను. నా జేబులో పర్సు లేకపోయిందా సమయాన. ఉండినా బీదవాణ్ణి. చెయ్యాలనేగాని చెయ్యడానికి లేదు శక్తి. అయినా, బెజవాడ దాకా మీ కిద్దరికీ టిక్కట్లిచ్చుకుంటా" నంటూ రెండు టిక్కట్లూ చేతిలో పెట్టి నమస్కారాలున్నూ చేశాడాయన.

చాలా ముగ్ధుణ్ణయిపోయా న్నేను.

కోట్లు డబ్బిచ్చినా అలాంటి తృప్తి కలగదు, కళావేత్తలకు.

నిజాని కాయన యిచ్చింది బహూ స్వల్పం.

ఆరోజుల్లో—నలభై నాలుగు సంవత్సరాల కిందటి రెయిలు రేట్లు తెలుసుకుంటే మరీ స్వల్పం.

కాని, ఆ యిచ్చిన విధానంలోనూ, ఆ యిస్తూ అన్న మాటల్లోనూ, వొక బహూ సమాన్యు డెంతెంతలేసి మహోన్నత శిఖరాలందుకోవచ్చునో చూపించాడాయన.

ఎంత సుళువుగా అందుకోవచ్చునో కూడా చూపించాడు.

డబ్బులేనివాడాయన, అయనే చెప్పాడు.

కాని, హృదయం వున్నవాడు.

రసబంధురం ఆ హృదయం.

ఔదార్యమున్నూ వుంది, దానికి జీవం పోస్తూ.

విశేషించి మాట నేర్పుంది.

వినయంతోడుంది దానికి.

ప్రాగల్భ్యం పొటమరించింది, ఆసమవాయంతో.

ఒక్కటే అన్నా డాయన మాట.

ఆయన హృదయం పొర్లి వచ్చిందది.

నా హృదయమున్నూ నిండిపోయింది.

ఆయన డబ్బిచ్చాడు, అది నిశ్చయం.

కాని, నాచేతిలో పడలేదది.

దాని ఫలితమున్నూ బెజవాడతో చెల్లిపోయింది.

అయినా, ఆయన ఔదార్యం నిలిచివుంది.

అమ్మకం అయిపోయిన ఆ బడుగుదేహాన - అదిగో - పరిపూర్ణ మానవత్వం స్వస్వరూపంతో తేజరిల్లుతోంది.

అమరం అది.

ద్వంద్వాతీతం.

జగజ్జ్యోతి.

కఠోరతపస్సుచేసి, మహాయోగీశ్వరులే సాధించుకోతగ్గదిన్నీ.

ఎందరు గుర్తిస్తారిది?

అసలు, ఎందరు గుర్తించగలరిది?

లోకుల రుచులు బహుముఖాలు.

వారి చేతలున్నూ అనేకవిధాలు.

అనంతకోటి ప్రజానీకంలో యే యిద్దరికీ పొంతన వుండదిలాంటి సందర్భాల్లో.

ఎంతో కొంత భేదం వుంటూనే వుంటుంది.

అవిలంఘ్యాలైన అగాధాలు కల్పిస్తుందది మానవతలో.

నలుగురూ చూశాటప్పుడేగాని, యెవరికీ యేమీ యివ్వలేరు, కొందరు.

వీళ్ళూ-వాళ్ళూ-యెన్నో-యెంతెంతో చూసుకుని గాని యివ్వలేరు, కొందరు.

"దేహి" అని దీనంగా అనిపించుకునిగాని యివ్వలేరు కొందరు.

విసుక్కుంటూ - వొళ్ళు మండబెట్టుకుంటూ - దాన ధర్మాల వ్యవస్థను తిడుతూనేగాని యివ్వలేరు కొందరు.

నిరసనగా చూస్తూ - నీచంగా మాట్టాడుతూ మీదికి గిరవటేస్తారు కొందరు.

వీధే వెళ్ళేవారిని పిలిచి, ఏదో అనవసర ప్రసంగం చేస్తూ సాక్ష్యానికన్నట్టు వారిని దగ్గిర కూచోపెట్టుకుని, వారు వినేటట్టున్నూ అర్థిని చులకనచేస్తూ యిస్తారు కొందరు.

ఇవన్నీ మనోవికారాలు.

కోతి చేష్టలు.

త్యాగం విలవ తక్కించుకోలేని వెకిలితనమున్ను.

తామస ప్రవృత్తి యిదంతా.

రహస్యంగా యిస్తారు కొందరు, మూడో కంటి వాడికి తెలియకుండా.

ఎప్పుడుపడితే అప్పుడే-యెలా వుండినవా రలాగే - యిచ్చేస్తారు కొందరు.

"దేహి" అన్న మాట వినలేక ముందే యిచ్చేస్తారు, కొందరు.

ఎలాగో వొకలాగ యివ్వడమూ-ఇవ్వకుండా వుండలేక పోడమూ - ఇవి హృదయానికి సంబంధించిన కదలికలు.

ఏమయినా, యివ్వడంలో కొంత త్యాగం వుంది, సందేహం లేదు.

కొంత ఔదార్యం వుంది.

మానవత్వమున్నూ వుంది.

కాని తామస ప్రవృత్తులది మాత్రం ముడిసరుకది.

ఇక లోభులున్నారు.

వారి విషయం చెప్పాలంటే అందరికీ సాధ్యం కాదు.

చెప్పకపోడమే మంచి దసలు.

వారి హక్కు భుక్తా లాక్షేపించడాని కెవరికీ అధికారం లేదు.

కలం పట్టుకున్నాను కనక, నేనుమాత్రం చెప్పకుండా వుండలేను కొంచెమయినా, ఎవరికీ నిర్దేశం లేకుండా.

లోభమూ ఔదార్యమూ కూడా బహు ముఖాలు.

సిగ్గు బిడియాలు విడిచి, తానున్నూ తినడం మానుకుని పాక్కాక్క చిల్లిడబ్బే మూటలో వేస్తాడు లోభి.

సిగ్గుపడుతూ – ముడుచుకుపోతూ – చేతిలో యేమివుంటే అదే యిచ్చేస్తాడుదారుడు.

ఇద్దరికీ మాత్రం డబ్బుతోనే పరిగణన.

అయితే, లోభి బతుక్కి, గడ్డిపరకకూడా అక్కర్లేదు తూచడానికి.

ఉదారుడి బతుక్కి బంగారుకొండ అయినా చాలదు.

## 10

తింటూనూ వున్నాను తిరుగుతూనూ వున్నాను:, గాని రెండుమాసాలు పట్టింది నా ఆరోగ్యం వసిపడ్డానికి.

రాజమహేంద్రవరంలో వుండినప్పుడు అజీర్తి బాధ పట్టుకుంది నాకు.

వేంకట రామయ్యరు హోటల్లో వుప్మా కాఫీలూ, కుప్పుస్వామయ్య హోటల్లో మూడు పూట్లా భోజనమూ – ఇవీ అందుక్కారణాలు.

జిహ్వాచాపలం ముఖ్య కారణం.

చాలా మాట్లను కున్నాను; కాని జయించుకో లేకపోయానది.

తెల్లవారాటప్పటికి వచ్చేసేవారు చిలుకూరి వీరభద్రరావుగారు "మరి బయలుదేరండి" అంటూ రోడ్డుమీద నుంచునే నన్ను తొందరపెడుతూ.

అప్పటికి, గోదావరిలో యీతకొట్టి, స్నానంకూడా చేసుకుని, కనిపెట్టుకు నుంచునేవాణ్ణి గదికి తాళంవేసి, వీధి అరుగుమీద నేను.

తామున్నూ స్నానం పూర్తిచేసుకునే వచ్చేవారు, వీరభద్రరావుగారు.

హాల్లో బల్లలుండేవి, కాని, తిన్నగా గాడిపొయ్యి దగ్గిరికి వెళ్ళి పీటలు పరిపించుకుని కూచునేవాళ్ళం మే మిద్దరమూ.

అంటే, ఉప్మా మొదటివాయిలో మొదటిభాగం మాకు భుక్తపడేది.

నలభైనాలుగేళ్ళ కిందటి మాటయిది, అలాంటి వుపమా దొరకలేదు, మళ్ళీ నాకు.

ఉపమా అంటే అదేవుపమా – ఇప్పుడు పెద్దపెద్ద నగరాల్లో – పెద్దపెద్ద హోటళ్ళలో కూడా దొరికేది ఉప్పుపిండి, అంతే.

సూర్యోదయ సమయాని కదయాక, తొమ్మిదింటికి కుప్పుసామయ్యరు హోటల్లో భోజనం.

మళ్ళీ వొంటి గంటకీ, రాత్రి యెనిమిదింటికీ కూడా అలా భోజనమే.

మధ్యాహ్నం మూడింటికి ఫలహారమూ, కాఫీని.

దానాదీనా పట్టుకుంది నాకజీర్తి.

రాజమహేంద్రవరం విడిచి యింటికి వెళ్ళి పోవలసి వచ్చింది ఆరోగ్యం సాధించుకోడానికి నేను.

రాజమహేంద్రవరంలో యిద్దరుముగ్గురు పెద్ద డాక్టర్లే మందిచ్చారు నాకు, వ్యాధి తగ్గలేదు కొంచెమున్నూ.

ఇంటికి వెళ్ళాక, అయుర్వేదంలో నా మొదటి గురువు అంగర వెంకటాచార్యులుగారొక లేహ్యం చేసియిచ్చి, ఇచ్ఛాపథ్యంతో మళ్ళీ వొక నెలలోనే వృకోదరుణ్ణి చేశారు నన్ను.

వారి అనుగ్రహరూపంగా "నాగరఖండం" అన్న పేరితో అదే నే నిప్పుడు నా గంధర్వఫార్మసీలో వాడుతున్నది.

వర్షాలు కురిసి నాట్లు బలపడ్డాక మళ్ళీ పదచలనం ప్రారంభించాన్నేను.

వడ్డాది సూర్యనారాయణగారని, మాకు నాలుగుమైళ్ళలో వున్న బలభద్రపురం గ్రామంలో వొక సంపన్న నియోగి గృహస్థులు.

అక్కడి హెడ్ కరణం వారు.

అంతక్రితం "అష్టావధానం చూడాలని వుంద"న్నారు వొక మాటు నాతో వారు.

ఆ మాట పురస్కరించుకునే వెళ్ళానప్పుడు నేను.

"మీకు తగిన సత్కారం చెయ్యలే"నన్నారు వారు.

"డబ్బుకోసం రాలేదునేను. మీకా కోరిక తీరివుండకపోతే తీర్చడానికే నారాక, 'తీరా చూశాక యే కొంచెమయినా డబ్బివ్వక పోతారా?' అన్న గడుసుభావం లేదు నా కే కోశానా. గృహస్థు మర్యాదగా అతిథ్యం మాత్రమే యివ్వండి నాకు, చాలు" అని చెప్పాన్నేను, స్పష్టంగా.

"అయితే, వొకమాట చెప్పాలి ముందు. నా అష్టావధానంలో నేత్రావధానం వొక అంగం. నా సహచరుడున్నాడతను నిర్వహిస్తాడది. నే ననువదిస్తాను. నన్నే నిర్వహించమంటే అత ననువదిస్తాడది. కనక, అదిన్నీ కావాలంటే మాత్రం అతనుకూడా రావాలి. అతనికి మాత్రం పదిరూపాయలయినా ముట్టచెప్పవలసి వుంటుంది, మరి" అని కూడా చెప్పాను.

అప్పుడక్కడ వొక రెడ్డిగారున్నూ వున్నారు.

వారడగ్గా నేత్రావధానం వివరాలు చెప్పాన్నేను.

"అయితే, అష్టావధానమూ చేయించ వలసిందే మీరు, నేత్రావధానం దాల్లో వుండేటట్టున్నూ చూడవలసిందే" అన్నారు వారు కరణంగారితో.

ఆ రెడ్డిగారి ప్రోత్సాహంతో, వెంటనే జాబురాసి గ్రామ నౌకరునంపి, కడియపులంకనుంచి సత్యనారాయణ శాస్త్రిని రప్పించారు వారు.

ఆ సాయంత్రమే అవధానం.

ఊళ్ళో వున్న బ్రాహ్మలందరూ, రెడ్లు కొందరూ, సమీపం కావడం వల్ల బిక్కవోలునుంచిన్నీ సరసులు కొందరూ వచ్చారు.

అక్కడా నేత్రావధానంలో నిర్వహించవలసి వచ్చింది, వ్యస్తాక్షరి.

అవధానం చాలా చక్కగా నెరవేరింది, చివరికి.

అంతా సంతోషించారు.

సూర్యనారాయణగారు చెప్పగా, రెడ్డిగారున్నూ బలపరచగా వచ్చినవారిలో కొందరు తమకు తోచిందిచ్చి వెళ్ళారప్పటికి.

పదమూడు రూపాయ లయిందా మొత్తం, అది సత్యనారాయణశాస్త్రి కిప్పించాన్నేను.

ఆ రాత్రే పడవమీద వెళ్ళిపోయాడతను, భోజనానంతరం.

మర్నాడు నేనూ ప్రయాణమైనాను; కానిరెండురోజులుండి పోవలసివచ్చింది నాకు.

ఆ రెండురోజులూ నాకు విందులు జరిగాయి, నేను సాహిత్య ప్రసంగాలు చేశాను.

రెండోనాటి సాయంత్రం నా ప్రసంగం ముగిశాటప్పటికి తరవాత తమచేతి కందాయని చెబుతూ పాతిక రూపాయలు నాకు సత్కరించారు కరణంగారు "మీ కేమివ్వగలం?" అని కించపడుతూ.

సంప్రదాయ మహితమైన కుటుంబం వారిది, పండితుల నాదరించడమే చేతనైన వ్యక్తులువారు. ఎంతెంతో యిచ్చిన్నీ అలాగే మాట్లాడతారు, వా రెప్పుడూ.

పాతిక వొకట్లు కాదు, పాతిక కోట్లిచ్చిన్నీ అలాంటి తృప్తీ, అలాంటి ఉల్లాసమూ కలిగించలేరు పండితుల కెవరూ.

దూరం వెళ్ళనక్కరలేదు అచుట్టుపట్ల గ్రామాల కరణాలందరూ వడ్డాదివారూ, బుద్ధవరపు వారూ, ముంజులూరివారూ, బంధకవివారూ, వాడ్రేవువారూ, ముష్టివారూ, నేలకంటివారూ, ఏనుగువారూ – అందరూ యుగంధర ప్రజ్ఞావంతులే–అందరూ సంపన్నులే–అందరూ ఉదారులే–మేమంటే అందరూ ప్రత్యేకాదరాభిమానా లున్న వారే.

అష్టావధానం చేస్తానంటూ నేను వెడితే అందరూ నన్నాదరిస్తారు, సందేహం లేదు.

. కాని, ఏమి సాధించినట్టు అంతవరకూ చేసిన అవధానాల వల్ల నేను?

డబ్బందామా, దానికోసం బుర్రచించుకుని అవధానాలే చెయ్యనక్కరలేదు, సాహిత్య ప్రసంగాలు చేసిన్నీ మంచిమంచి వార్షికాలు సంపాదించుకో గలన్నేను.

కాక, – ఆశుకవిత్వాలూ, అవధానాలూ, బంధకవిత్వాలూ, చిత్రకవిత్వాలూ – ఇలాంటివి బయలుదేరి, మనవాళ్ళకి సిసలైన కవిత్వం గుర్తించకుండా చేశాయి.

కవితాభిరుచే నాశనం చేశాయి.

"పద్యమే కవిత్వం" అన్న దురభిప్రాయమున్నూ కలిగించాయి.

దీంతో, అవధానాలంటే పై ముఖ్యమేకాదు, వైనమస్యమున్నూ కలిగిపోయింది నాకు.

"మరి, గజంయెత్తు పుస్తకాలు రచించా"లన్న వ్రతం నెరవేర్చుకోడం యెప్పుడూ?

ఇదిగో, యీ ఆవేదన గుబగుబ లాడించేసింది, నన్ను.

రచనకు దీక్ష పట్టాను, వెంటనే.

ఎన్నాళ్ళుగానో అనుకుంటున్న వీరపూజ రచనకు శ్రీకార మున్నూ చుట్టేశాను, అవ్యవధానంగా.

## 11

ప్రవాహవేగం తప్పించుకోడం కష్టం.

మంచిదయినా చెడ్డదయినా, అలవాటయిన పని మానుకోడమున్నూ కష్టమే.

పరిస్థితులలా తటస్థిస్తాయి, ఒక్కొక్కప్పుడు.

నా స్థితి అంతే అయింది.

తప్పనిసరిగా మళ్ళీ అష్టావధానం చెయ్యవలసి వచ్చింది, నేను.

మా పెద్దన్నగారి కుమారుని ఉపనయనం.

బంధువులు చాలామంది వచ్చారు, బహు కాలానికి.

వేట్లపాలెంనుంచి దర్భా చలమయ్య శాస్త్రిగారున్నూ వచ్చారు.

అష్టావధానం చెయ్యమంటూ కూచున్నారు నన్నందరూ.

ఏమిటేమిటో చెప్పాను, నేత్రావధానాని కవకాశాల్లేవన్నాను, అదిలేందే అష్టావధానం యేమిటన్నాను; కాని, తృప్తి పడి వూరుకోలేదు వారు.

"నే నెప్పుడూ చూడలేనిదది. ఎక్కడెక్కడో చేస్తావు నువ్వు, మాకెలా కనపడుతుందీ అది?" అంటూ నిర్బంధించారు స్త్రీలున్ను.

మా అమ్మగారిచేత అడిగించారు వారామాట.

"నాకూ చూడాలని వుంది నాయనా" అన్నారామె.

"కాని–ఆలోచించుకో" అన్నారు చివరికి.

నెగ్గితే అందరికీ సంతోషమే.

ఓడిపోతే మరి ఖేదం?

మా అమ్మగారి దవుతుంది, ముఖ్యంగా.

నేనిలా అర్థం చేసుకున్నారు "ఆలోచించుకో" అన్న మా అమ్మగారిమాట.

మా నాయనగారు స్వయంగానూ నన్నందు కాజ్ఞాపించరు, వొకరి మాటమీదా గట్టిగా చెప్పరు.

పైగా, నన్నేకాదు, వారినీ మందలిస్తారు కూడా.

నా దృష్టిలో, మా అమ్మగారి పదవివేరు, మా యింటో.

నాకు మాతృదేవత కావడం అలావుండగా, మా నాయనగారు పెట్టిన బాధలో – ముఖ్యంగా మా చిన్నన్నగారు పెట్టిన యమచెరలో–నిరాశ చేసుకుని నేను కుమిలి పోయాటప్పుడు, ఎన్నో మాట్లు – తరచు నాకు నవజీవం పోస్తూ వచ్చినవారామె.

"కాదు" అనలేకపోయా నామె మాట, అందువల్ల.

అనిష్టంగానే–వొక విధంగా నిరుత్సాహంగానే కూచున్నాను; గాని చాలా బాగా నెరవేరిం దదిన్నీ.

యాభై మాటల యింగ్లీషువాక్యం మాటామాటా విడగొట్టి యిచ్చాడు మా పింతల్లి కొడుకు వ్యస్తాక్షరి.

నాకంటే మూడు రోజులే పెద్ద అతను.

బి.ఏ. ఆనర్సులో పరీక్ష యిచ్చినవాడు.

"ద The" అనే మాట యెన్నోమాట్లు వచ్చిందందులో.

తప్పుతానేమో అని చాలా భయపడ్డాను; గాని అదీ సరిగానే వచ్చింది.

అన్నీ అలాగే నెరవేరాయి.

స్త్రీలూ పురుషులూ కూడా తామూ ఆనందించారు, నన్నూ మెచ్చుకున్నారు.

విశ్లేషించి, దర్భా చలమయ్య శాస్త్రిగారు తా మానందించడంతో పూరుకోక "మాంచి ప్రజ్ఞే సంపాదించాడు మీవాడు" అన్నారు, మా అమ్మగారినీ మా నాయనగారినీ సంబోధించి.

"అదేమంత ప్రజ్ఞలే" అన్నారు మా నాయనగారు, ఒక మూల తా మానందిస్తూనే.

కాని వారి ఆనందం మీద "కులవిద్యలు విడిచి పెట్టాడువీడు" అన్న అసంతృప్తి దట్టంగానే కమ్ముకుని వుంది, నేను గమనించక పోలే దది.

మా అమ్మగారు మాత్రం బ్రహ్మానంద పడ్డారు.

స్త్రీల కందరికీ ముందు కూచున్నా రామె.

ముందెక్కడో కూచున్నా రొక కొసగా; కాని "అక్కడ కాదు. యిక్కడా మీరు కూచోడం" అంటూ చెయ్యి పట్టుకుని, మా పెద్దన్నగారు ముందుకి తీసుకువచ్చి కూచోపెట్టా రామెని.

"అబ్బాయి నెగ్గుతాడో వోడిపోతాడో?" అన్న ఆదుర్దా.

"అందరి మొగాలూ తేటగానే వున్నా" యన్న ధీమా.

"చల్లనిమాట వినబడా"లన్న యెదురుచూపు.

ఇన్ని మనోవికారాలు కనపడ్డాయి, నాకా సమయాన, ఆమె మొగాన.

స్త్రీలలో వొకచివర – మా పెద్దవొదినగారి వెనక వొదిగి కూచుంది, మాసీత.

ఆమెదీ యిదే స్థితి.

చివరికి, నేను లేచి, ముందు తమకి పాదాభివందనం చెయ్యగా నన్ను పొదువుకుని పరవశ అయిపోయారు మా అమ్మగారు.

ఆనంద విహ్వలంగా నాకేసి వొక్కమాటుచూసి యింటోకి వెళ్ళిపోయింది మా సీత.

అదిగో, మా అమ్మగా రలా పరవశ అయివున్న ఆ సమయాన మెచ్చుకున్నారు, దర్భా చలమయ్య శాస్త్రిగారు నన్ను.

దీనిమీద, మా అమ్మగారు తల కొంచెం పంకించుకున్నట్టు కనపడింది, నాకు.

"అదెందుకా?" అనుకుంటూనే వున్నాన్నేను "మీ పెద్దబ్బాయి దగ్గిర యింకో రెండు మూడేళ్ళయినా చదువుకుని వుంటే యింకా గొప్ప ప్రజ్ఞే సంపాదించివుండును మా చిన్నబ్బాయి" అనేశారామె, అంతలో.

అది చలమయ్య శాస్త్రిగారికి ములుకన్నట్టు నాటింది.

అది గుర్తించి, "ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యః" అన్న అదృష్ట సిద్ధాంతం జ్ఞాపకంచేస్తూ చలమయ్య శాస్త్రిగారి నవతలికి తీసుకువెళ్ళారు మా నాయనగారు.

అందుకూ యిందుకూ గూడా సంతోషించాన్నేను.

తగిలిన ఆఘాతం—తీరని అపకారం మరిచిపోలే రెవరూ.

ఎంత సర్దుకుందా మన్నా యెదురు దెబ్బ కొడదామనే అనిపిస్తుంది, ఉప్పూ కారమూ తినేవాళ్ళ కెవళ్ళ కయినా.

మరి, అదే పట్టుక్కూ_చోడమేనా?

దెబ్బ నాటాకయినా సముదాయించవద్దూ అవతలివాళ్ళని, మరెవరయినా?

మా అమ్మగారు చేసిందీ, మా నాయనగారు చేసిందీ కూడా యిది.

ఇందుకూ నా సంతోషం.

అందరు బంధువులమధ్య—ముఖ్యంగా మా అమ్మగారికి, మా నాయనగారికీ, మా సీతకూ యెదట లభించిన నా అఖండ విజయానందానికి, యిదిగో, యిదొక మహోచ్ఛ్వాసం అయింది నాకు.

## 12

వీరపూజ మీదికి పోయింది, నా చూపు.

స్థాయిభావం యేర్పడిపోయిందా విషయమైనాకు.

తెనుగులో అపూర్వరచన, నా వీరపూజ.

అంతకి ముందేకాదు, తరవాతకూడా అలాంటి రచన మరి పుట్టలేదు మన వచన వాఙ్మయంలో.

ఇది గర్వంలో లెక్క_ అవుతుందా?

నా శక్తిమీదకంటే, నా వీరపూజమీద నిశ్చలమైన విశ్వాసం వుంది నాకు, కనక, అందుకు సిగ్గుపడన్నేను.

కచ్చితంగా చెబుతాను, నా వీరపూజ విశిష్ట రచన.

అయితే, యెంతమంది గుర్తించారిది?

పోనీ, యెంతమంది గర్హించారు?

చెడ్డపుస్తకం పుడితే, అది దేశం అంతా పాకిపోవలసిందేనా?

మంచి పుస్తకం బయలుదేరితే, అది, మూలపడిపోవలసిందేనా?

ఇదిగో, యీ రకమైన ఔదాసీన్యం యెక్కు_వగా వుంది, తెనుగుజాతిలో.

రచయితలు బయలుదేరినంత మంది విమర్శకులు బయలుదేరలేదు, మనలో.

రచయితల్లో పోటీలేర్పడ్డం అగత్యం; కాని స్పర్థలేర్పడతాయి సాధారణంగా లోకంలో.

అసహనాలు బలిసిపోతాయి.

మాత్సర్యం రెచ్చిపోతుంది.

నిరాదరణ, ఈసడింపు, నింద, దుష్ప్రచారం, వొళ్ళు మండబెట్టుకోడం – ఇవి హెచ్చిపోతాయి, చివరికి.

ఈ స్థితిలో వుంది మన రచయితల స్థితి యిప్పుడు.

గ్రంథకర్తల కిది అగత్యమా?

పోనీ, శ్రేయస్కరమా?

గ్రంథకర్తల రచనల విషయమై సహేతుకంగా మంచిచెడ్డలు నిర్ణయించే విమర్శకులుంటే యింత దుర్భరం కాకపోయి వుండును, మన దేశంలో యీ స్థితి.

గ్రంథకర్తలుకా దీపని చెయ్యవలసినవారు.

ఇతరుల రచనల విషయమై నిష్కర్షగా చెప్పాలంటే, కొన్ని చిక్కులున్నా వుంటాయి రచయితలకు.

గ్రంథం బాగున్నా చిక్కే, కొందరికి, బాగా లేకపోయినా చిక్కే.

కనక, స్వతంత్రులైన రచనయితలతోపాటు, సమర్థులైన విమర్శకులున్నా బయలుదేరితేనే యే వాఙ్మయానికైనా సరి అయిన వికాసం.

అయితే, రచయితల సంఖ్య పెరిగిపోడాని కవకాశం యెక్కువ, యే దేశంలోనూ కూడా.

విమర్శకుల సంఖ్య మాత్రం అలా పెరగడానికి వీల్లేదు.

కవుల్లో అధికారి తారతమ్యాలు సహజాలు.

విమర్శకుల సంగతీ అంతే కొంతవరకూ, అయితే, యే కవి కంటేనూ కూడా మంచి పరిజ్ఞాత అయివుండాలి విమర్శకుడు.

విమర్శకుడైనవాడు, మంచి పండితుడయి వుండాలి.

రచనమీదికి దృష్టి పోనిచ్చుకో గూడదు.

వాఙ్మయం విలవలు బాగా గుర్తించగలిగి వుండాలి.

జాతి సౌభాగ్యమే తనకు ప్రాప్యం చేసుకోగలగాలి.

ప్రాచీనమూ, నవీనమూ కూడా సాహిత్య శాస్త్రం బాగా తెలిసినవాడయి వుండాలి.

అసహనపరుడు కాగూడదు.

అగత్యం అయితే, ద్వేషం, వ్యక్తిపరంగా మాత్రమే చూపించుకోగల సంయమం కలవాడు కావాలి.

మంచి బాగా గుర్తించి, ఆ రచన యెవరు చేసినా, ఆనంద తాండవం చెయ్యగలిగి వుండాలి.

తనకి ప్రామాణికత ప్రధాన ధర్మం అనిన్నీ గుర్తించుకో గలిగాలి.

రచన గొప్పదయితే, వికాసం జాతికి, తత్కర్తకుకాదు.

రచన చెడ్డ దయితే నష్టమూ జాతికే అదీ కర్తకు కాదు.

సుఖమో దుఃఖమో – ఇవి మాత్రమే రచయిత కందేవి.

ఆత్మవిశ్వాసం, కీర్తికాంక్ష, ద్రవ్యాశ–ఇవి సహజాలు గ్రంథకర్తకు, వొప్పుకుంటాను.

కాని, వాటికి మించిన సంయమమూ, హుందాతనమూ–ఇవి మిక్కిలీ అగత్యాలు గ్రంథకర్తకు.

నిజానికి, జాతి యెదట రచయిత ప్రాముఖ్యం బహూతక్కువ.

ఈజ్ఞానం—ఈసత్యం గుర్తించగల శక్తి—లేకపోతే, రచయితా, విమర్శకుడూ కూడా "మడి దున్నుకు బతకవచ్చు" మునిగిపోయేది లేదు.

రచనా, విమర్శా కూడా పొట్టపోసుకోడానిక్కావు, మరి.

కవీ, రచయితా రచనచెయ్యడం, పఠితలకు ఆనందమూ, జ్ఞానమూ కలిగించడానికి.

తన్మూలంగా పఠితల కున్నత భావాలబ్బి సభ్యత అలవడ్డానికి.

సమిష్టిమీద జాతి దృఢపడ్డానికి.

పండితుడు విమర్శ చెయ్యడం, రచనలోవున్న మంచీ చెడ్డా లోకానికి వివరించి చెప్పడానికి.

తన్మూలంగా, అరచన యెడల పఠితల కాదర భావమో ఏవగింపో కలిగించడానికి.

చివరికి, జాతికి, ప్రలోభజనకమైన శీలం రూపుకట్టడానికి.

ఇలాంటి సన్నివేశా లేర్పడాలంటే అందుకు రాజు పూనుకోవాలి.

ఇప్పుడు, మనకి, రాజుల్లేరు కనక, తత్స్థానీయులయిన నాయకుల విధి యిది.

కవులకూ, రచయితలకూ, విమర్శకులకూ ఇలాంటి ఔదార్యమూ, విధి పరిజ్ఞానమూ, త్యాగనిరతీ మప్పడానికి నాయకుల అగత్యం చాలా వుంది.

ప్రతిభా ప్రాగల్భ్యాలు, ఎంత వెనకబడ్డ జాతికీ వుంటాయి.

అవి మానవనిర్మాణాలు కావు, మరి.

వాటికి దోహదం మాత్రం కావాలి.

వాటికి, సామయికమైన వినియోగమున్నూ చూపించాలి.

అందుకు బాటలు వెయ్యాలి, విశాలమైనవి.

ఇందుకున్నూ నాయకుల అగత్యం చాలావుంది.

అయితే, నాయకు డింతవాడు కావాలంటే, మొదట, పండితుడయి వుండాలతను.

ఈ పనంతా యే భాషలో జరుగుతుందో ఆ భాషలో సమర్థుడూ, ఆపైని సమ్యగ్దర్శీ, ప్రవక్తా, ప్రవర్తకుడున్నూ అయి వుండాలి.

జాతి అగత్యాలు గుర్తించి వుండాలి.

తన వాఙ్మయం చరిత్ర బాగా అవగాహన చేసుకుని వుండాలి.

పరవాఙ్మయాల ఉన్నత్యావసతులూ బాగా గుర్తించుకుని వుండాలి.

తన వాఙ్మయానికి రూపురేఖలు నిర్దేశించగలవాడు కావాలి.

ఒకరికి మార్గదర్శికావాలి, ఒకరివెంటబడి బుర్రవంచుకుని పోయేవాడు కాగూడదు.

నిష్కృష్టాలయిన అభిప్రాయాలున్నవాడు కావాలి, పరప్రత్యనేయబుద్ధి కా గూడదు.

జాతీయత నిర్మించాలంటే పరిస్థితులూ, ఉపాయాలూ, సాధనాలూ దేశాలనుబట్టీ, జాతులనుబట్టీ, సంస్కారం అనుసరించీ భిన్నభిన్నా లయివుంటాయి, మరి.

మరి, ఏ జాతికాజాతి కిలాంటి నాయకు లేర్పడివుండకపోతే?

గాలి సార్వత్రికం, ప్రాదేశికం కాదు.

దురిత విలంబితాలు పట్టవచ్చునేకాని, ప్రపంచం అంతటా వీస్తుందది.

కనక, ప్రపంచంలో వొకచోట పుట్టిన నూత్నభావాలూ, నూత్నాభిరుచులూ మరోచోటా కమ్ముకుంటా యెప్పటికయినా.

అవి కవులనూ, రచయితలనూ స్వయంగా ఉద్రిక్తపరుస్తాయి.

దానివల్ల, నూత్న నిర్మాణాలున్నూ జరిగిపోతా, యెక్కడి కక్కడ.

ఏదేశంలో–ఏజాతికి–ఇలాంటి నాయకుడు లేడో ఆ దేశమూ ఆజాతీని, వెనకపడిపోయేవి.

వీరేశలింగంగారు, రచన యెంత సుళువుగా చెయ్యవచ్చునో చేసి చూపించారు.

ఎంత సులభ భాషలో చెయ్యవచ్చునో చూపించారు.

అది యెన్ని రకాలుగా చెయ్యవచ్చునో చూపించారు.

తన్మూలంగా, ప్రయోజనాలేకాక, ఆనందంకూడా ఎన్ని రకాలుగా కలుగుతుందో చూపించారు.

వాఙ్మయం శక్తి యెంతటిదో, జాతి నది యెలా నడిపిస్తుందో కూడా చూపించారు.

విమర్శ విషయమై కూడా వారు ఒక మార్గం వెయ్యక పోలేదు.

అయితే, అది, తప్పుదారిన పడింది.

ధ్వంసం చెయ్యడానికేగాని, సృష్టి చెయ్యడానికి పనికిరాలేదు, వారి వరవడి.

వాఙ్మయంవారికి ప్రధానం కాకపోడం వల్ల వచ్చిన చిక్కది.

బ్రహ్మధర్మ ప్రచారం వారికది వొక సాధనం కావడం వల్ల కూడా వచ్చిన పుట్టిమునక యిది.

వారి తరవాతనైనా సమర్థులు తదేకదీక్షితులు విమర్శకులు బయలుదేర లేదు, మనలో.

అంచేత, మన ఆంధ్రజాతికూడా సహజంగా ప్రగమనశీలం కనక, మనకి పురోగమనమే యేర్పడింది, సందేహంలేదు.

కాని, అది వొక సుపరిష్కృతపథానపడలేదు.

ఇప్పటి కయినా, యిదయినా గ్రహించినవా రెందరున్నారు మనలో?

దీనికి సాయం, తగినంతమంది పెద్దలు గ్రంథప్రకటనకు పూనుకోలేదు, మనవారిలో.

గ్రంథ ప్రకటనకూడా వొక వ్యాపారమే అన్న చూపు లేకపోయింది వర్తకులకు.

వావిళ్ళ వారొక్కరే కనపడతారందుకు, ఏకతానంగా పని చేసినవారు.

అయితే, పూర్వ వాఙ్మయ ప్రకటనకే అంకితం చేసుకున్నారు ముఖ్యంగా తమ సేవలు, వారు.

మరి, అది వుండనక్కరలేదూ?

అయితే నవీన వాఙ్మయం అక్కరలేదూ అన్న ప్రశ్నా వస్తుంది.

పూర్వం వాఙ్మయం వుండవలసిందే, దొరికినంత వరకూ అందరికీ అందుబాటూ కావాలది.

పూర్వస్మృతి విడిచిపోగూడదు, మరి, నడుస్తున్న బతుకుపట్టించుకో నక్కరలేదూ?

వ్యక్తుల బతుకు సావధికమే, మరి జాతి బతుకు?

జాతి దృష్ట్యా చూస్తే, నడుస్తున్నదేకాదు, నడవ్వలసినదీ పట్టించుకోవాలి, బతుకు.

ఈ విషయం గుర్తించినవారు కొమర్రాజు లక్ష్మణరావుగారొక్కరే, మనలో.

అయితే, అకాలమృత్యువు పొట్టబెట్టుకుంది, వారిని.

పోనీ అంటే, తరవాత, విజ్ఞానచంద్రికను చేపట్టినవారి కది అప్రధానం అయిపోయింది.

కనీసం, అది, బతికివుండవలసిందన్న జ్ఞానమైనా లేకపోయింది, వారికి.

దానాదీనా ఏమయిందీ?

నవీన వాఙ్మయ ప్రకటనకు పూనుకున్నవారే లేకపోయారు.

ఎవరిమట్టుకి వారే—గ్రంథం రచించినవారే తమ గ్రంథాలు ప్రకటించుకోవలసిన్నీ వచ్చింది.

పోనీ అంటే, యేదేశంలోనూ కూడా, రచయిత లయిన వారికి, బీదతనమే రాసి పెట్టా డీశ్వరుడు.

అంచేత, అప్పటికీ యిప్పటికీ నవీనుల రచనలెన్నో – సమర్థుల ఉద్గ్రంథాలెన్నో – జాతికి నవశక్తి సంఘటించ గల అమృత గుటికలవెన్నో అచ్చుకాకుండానే వుండిపోయా, యిప్పటికీ.

పైపెచ్చు, అనుత్తమగ్రంథాలే బయటికి వచ్చాయి, వేలు.

ఫలితం?

జాతి అనుభవిస్తూనే వుందిప్పుడు.

అయితే, తయారయిన గ్రంథాలన్నీ ఉత్తమాలేనా?

నికృష్టాలని మాత్రం యెలాగా నిర్ధారణ చెయ్యడం అవి?

ఈ సమస్య తీర్చేవారెవరు?

కర్తలమాట ప్రమాణంకాదు.

కొంతవరకూ పరిత్పలోకం చెప్పగల దది.

పూర్తిగా – స్పష్టంగా – నిష్కర్షగా చెప్పగలది మాత్రం కాలం.

కనక, తయారయిన రచన అల్లా బయటికి రావాలి, ముందు.

అచ్చుపడడం అందు కుపాయం, యిప్పుడు.

కనక?

నా వీరపూజ బయటికి రావాలి.

అచ్చు పడాలి.

లోకం చూడాలది, ముందు.

ఈ ఆత్రం యెక్కువయింది, నాకు.

ఎంతో ప్రయత్నించా నందుకోసం.

మా ప్రాంతంలోనే యెన్నో వూళ్ళు తిరిగాను.

ఎందరినో కలుసుకున్నాను.

ఒకట్లు—రెళ్ళు—అయిదులు—సకృతుగా పదులు—ఇంతకంటే యిచ్చినవారు లేకపోయారు.

ఆ యిచ్చినవారయినా అప్పుడూ అప్పుడూ యివ్వడం జరిగింది.

ఆ వచ్చింది తిరగడానికే సరిపోయింది.

బట్టలు కొనుక్కోడానికీ—పుస్తకాలు కొనుక్కోడానికీ—సభలకు వెళ్ళడానికీ—ఇలాగ స్వార్థానికిన్ని కర్చయిందెంతో కొంత.

అంటే, మూడువందల రూపాయలు సంపాదించి గుట్టలు పెట్టడం సాధ్యంకాలేదు నాకు.

కాని, అనుకోనివిధంగా అచ్చుపడి పోయిందది.

వింత సంగతి వొక విధంగా, అది.

## 13

అది వివరించాలంటే కొంచెం వెనక్కి వెళ్ళాలి.

వెనకాముందుల కలయికే వర్తమానం, మరి.

పూర్వాపరసందర్భాలు కలిస్తేగాని, కథే లేదు కూడా.

వెనకటిదీ ముందటిదీ సమన్వయం చేసుకోగలిగితే గాని, అనుభవమున్నూ యేర్పడదు, అసలు.

ప్రతీ పూర్వవృత్తానికీ భవిష్యత్తులో ఒక సజాతీయ వ్యవహారం జరుగుతుందా?

జరగావచ్చు, జరక్కాపోవచ్చు, జరిగినా అది గుర్తించా లేకపోవచ్చు, మనిషి.

కాని, యిందులో యేది లేకపోయినా, అనుభవమేకాదు, జీవితమూ లేదు.

మరి, ప్రకృతం.

రాజమహేంద్రవరంలో, కంచుమర్తివారి, రామచంద్రసిటీ (అప్పటికి. మిడిల్) హైస్కూలు భవనంలో దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారి గోదావరీ మండలసభ జరిగింది.

నిష్కర్షగా చెప్పలేను, ఎనిమిదోదని జ్ఞాపకం, నాకది.

మోచర్ల రామచంద్రరావు పంతులుగా రధ్యక్షత వహించారు.

చాలామంది వచ్చారు, జిల్లా అంతణ్ణుంచీ ప్రతినిధులు.

కావడానికి జిల్లాసభేకాని, తక్కిన జిల్లాలనుంచిన్నీ వచ్చేవారు పెద్దలు చాలామంది, అరోజుల్లో.

తెనుగు రాజకీయ జీవితానికి పాక్షికవిషమూ యెక్కలేదు, కులతత్వ పిశాచమూ అవహించలేదు, అప్పటికింకా.

అరోజుల్లో, రాజమహేంద్రవరంలో, కే.యల్.ఎ౯. సోమయాజులుగారు వర్ధమానచంద్రులు గ్రంథప్రకాశకుల్లో.

"రెయిల్వే లిట్రేచరు" బాపతు గ్రంథాలు ప్రకటించేవారు, వారు.

స్కూలు వాచకాలున్నూ విరివిగా అమ్మేవారు.

ఆ సందర్భంలో, పాఠశాల ఆవరణలో పుస్తకాల అంగడి తెరిచారాయన.

ఎస్.పి.ఏ.ఎల్. బతికివుండిన దినాలవి.

కనక, మిథునానురాగమూ తక్కిన నా గ్రంథాలూ ఆ అంగడిలో వుంచాన్నేను, కమిషను పద్ధతిమీద.

మొదటి ఉదయం ఇక సభ ప్రారంభం అవుతుందనగా శ్రీరాజా వత్సరాయి రాయజగవర్మగారూ నేనూ మాట్లాడుకుంటున్నాం, అవరణలో వొకచోట నుంచుని.

"మంచిబొమ్మ చిత్రించావు బ్రదర్" అంటూ వచ్చి నావీపు తట్టాడొక పెద్దమనిషి, ఆ సమయాన.

తిరిగి చూశాను, అపరిచితు డాయన.

మందహాసం చేస్తూ ఆయన పక్కనే నుంచున్నాడు మరో పెద్దమనిషి, ఆయన్ని మాత్రం కొంచెం యెరుగుదున్నేను.

"నేను బొమ్మ చిత్రించడం యేమిటి?"

ఈ మాటే అడిగేశారు మిత్రులు రాయజగపతివర్మగారు.

"స్థాణువులా అలా నుంచోడానికా నిన్ను తీసుకువచ్చాన్నేను?" అని, తాము వెంటబెట్టుకు వచ్చిన పెద్దమనిషిని ముందు కసిరే, "బ్రదర్, నాపేరు కౌతా శ్రీరామశాస్త్రి, యెప్పుడైనా విన్నావా?" అనడిగాడు, నా వీపు తట్టినాయన.

చాలా మాట్లే విన్నా, నా మాటే చెప్పా నాయనకు.

కలుసుకోవాలనీ ఉవ్విళ్ళూరుతున్నా నెన్నాళ్ళనుంచో, అదీ చెప్పాను.

"నీ మిథునానురాగం మాట మాట్లాడుతున్నాన్నేను. బొమ్మ చిత్రించావంటే, చిత్తరువు గీశావని కాదు. మొదటి ప్రకరణం యిప్పుడే చదివాన్నే, నది చక్కగా రూపుకట్టించావు నువ్వు" అని వివరాలు చెప్పాడాయన.

"పేరిలో కొత్తదనం – ఆకృతిలో కొత్తదనం – రచనలో కొత్తదనం – ధోరణిలో కొత్తదనం – ఇవి నన్నాకర్షించాయి. నువ్విక్కడే వుండడం చూపించాడీ పెద్దమనిషి, నీతో స్నేహం కడదామని వచ్చా" నని చెబుతూనే, నా రెక్కపట్టుకుని, మరో చోటికి తీసుకు వెళ్ళి, పొదువుకుని నన్ను తన పక్కని కూచో బెట్టుకున్నాడాయన, వొక బల్లమీద.

జనంతండాలు తండాలుగా వస్తున్నారు, గుంపులు గుంపులుగా మెట్లెక్కి మేడమీదికి వెడుతున్నారు.

సభకూడా ప్రారంభం అయిపోయింది.

శ్రీరామశాస్త్రి ధోరణి అలాగే వెళ్ళిపోతోంది, అఖండ గోదావరీ ప్రవాహం వతుగా.

కొన్ని మాటలు వినిపిస్తున్నాయి, కొన్ని వినిపించడం లేదు, నాకు.

"అక్కడ, రాయజగపతివర్మగారి మాటయేమిటి?" అని నా ఆందోళన.

ఇద్దరు మనుష్యులొకచోట మాట్లాడుకుంటూ వుంటే, మరోమనిషివచ్చి, వారిలో వొకరితో మరో విషయం వుాదర గొట్టడం–ఇది చాలామందికి చేతనవును, మనలో.

అటు, హఠాత్తుగా రావడంతోపాటు, ఇటు అమాంతంగా నన్ను లాక్కుపోడం – యిది విశేషం యిక్కడ, మరీ దారుణం యిది.

ఇద్దరు మాట్లాడుకునేది రహస్యమే కానక్కరలేదు, చొరుచుకు వెళ్ళలేను వారి దగ్గిరికి.

వారి సంభాషణ వినవే అక్కరలేదు, వారి కద్దుతగలడమే వొక దుస్సాహసం నా దృష్టిలో.

పోనీ అంటే, నాతో మాట్లాడుతున్నది మామూలు గృహస్థయినాకాదు, పెద్దాపురం రాజవంశీకులు జగపతి వర్మగారు.

ఇలాంటి సందర్భాల్లో క్షత్రియుల్లో పట్టుదలలు చాలా హెచ్చు.

అది కూడా గమనించలేదు, శ్రీరామశాస్త్రి.

మనలోవున్న మామూలు పద్ధతి, అతనది లక్ష్యపెట్టలేదంతే.

నాకు మాత్రం చాలా బాధకలిగించింది.

అది కనిపెట్టాడతను, కొంత సేపటికి.

"ఏమిటి సంగతి?" అనడిగాడు.

నేను చెప్పాను.

వెంటనే నాలుక కరుచుకున్నాడతను.

"తోచింది కాదు" అంటూ పశ్చాత్తాపమున్నూ కనపరిచాడు.

నా రెక్క మళ్ళీ పట్టుకుని వర్మగారిదగ్గిరికిన్నీ బయలుదేరాడు, వెంటనే.

అతనూ క్షమాపణ కోరుకున్నాడు, నేనూ నా పొరపాటు మనవి చేసుకున్నాను వారికి.

వర్మగారు నిండుకుండ అన్నట్టు ప్రవర్తించా రప్పుడు.

"వద్దు, వద్దు, మీరలా కించపడ నక్కరలేదు" అన్నారు వారు, ముందు.

"మా శాస్త్రిగారు మా శాస్త్రిగారే. తమరూ కవులే కనక, తమరూ మా శాస్త్రిగారే అయినారు. పండితులూ కవులూ మా కిలవేల్పులు. కనక, నన్నే క్షమించాలి తమ రుభయులూ కూడా" అంటూ చేతులు జోడించుకున్నారు కూడా, చివరికి.

ఆశ్చర్యపడ్డాడు శ్రీరామశాస్త్రి, ఆ హుందాతనం చూసి.

వెంటనే మేడమీదికి బయలుదేరాం, ముగ్గురమూ.

కాని, మేడ వసారాలో మళ్ళీ నిల బెట్టాడు శ్రీరామశాస్త్రి, నన్ను.

"బ్రదర్; నువ్వు కూడా నన్ను బ్రదర్ అని ఒప్పుకుంటావా లేదా?" అంటూ కూడా నిలవతీశాడు నన్ను.

కొత్తవారితో ఓ పట్టాన కలియలేన్నేను.

కలిసినా, మొదటే అంత చనువుగా మాట్లాడలేను.

ఇది లోపం అని తెలుసు; కాని సమయానికి దిద్దుకోకుండా వున్నాను.

"ఒప్పుకోకేం?" అని మాత్రం అన్నా నంచేత, ఒకమూల బెదురుతూనే.

"అయితే, నన్ను నువ్వనక మీరంటావేం?" అన్నాడు మళ్ళీ.

"అను" అంటూ పట్టున్నూ పట్టాడు.

నా కంటే పెద్దవా డతను.

వయస్సులో – పరిజ్ఞానంలో – అనుభవంలో – తన్మూలంగా అబ్బిన ప్రౌఢిమను బట్టిన్నీ బాగా పెద్ద అతను.

కాని, ఓ–ట్టి బోళా మనిషి.

ఈ కొద్దిపాటి సంభాషణతోనే బాగా అవగాహన అయిందీ సంగతి నాకు.

బాగా చనువేర్పడింది, దాంతో.

అనేశాను తరవాతి సంభాషణలోనే నువ్వని.

చాలా సంతోషించా డతను.

మళ్ళీ పొదువుకున్నా డతను.

ఏదో సూత్నశక్తి జాగృతం అయింది నాలో, దాంతో.

లోకంలో బహూ స్వల్పంగా వుంటారు, ఇలాంటి అమృతహృదయులు.

అలాంటి వొక పెద్దమనిషితో నాకు మైత్రి – ఆత్మీయత లభించడం చాలా అదృష్టం.

లక్షలు – కోట్లు – డబ్బు దొరికితే యిలా వుంటుందా మనిషికి?

ఆ రెండురోజులూ కలిసే తిరిగాం మే మెక్కడికి వెళ్ళినా.

ముందు, తాను నా కాత్మీయుడయి, తరవాత, తనకునన్నాత్మీయుణ్ణి చేసుకున్నా డతను.

సంసారాల్లో మిక్కిలీ అరుదుగా – చాలా సకృతుగా – ఎంతో అపురూపంగా మాత్రమే వుంటా రిలాంటివారు.

అయినా, మధ్యమధ్య "మీ"రని వచ్చేది నాకుమాట.

ఎన్నోమాట్లు దిద్దాడతను, చివరికి, ఆ రెండురోజులూ గడిచాటప్పటికి బాగా అలవాటయిపోయింది నాకు "ను"వ్వనడం అతణ్ణి.

బంగాళాదేశమూ, బంగాళీభాషా, బంగాళీ వాఙ్మయమూ, బంగాళీజాతీ–ఎంతసేపు మాట్లాడినా యింతే ప్రపంచం అతనిది.

అయితే "తెనుగువాళ్ళం మనం. అలా ముందంజ వెయ్యాలి ప్రతీదాల్లోనూ మనమును" అనేవాడత నెప్పుడూ.

శారద పత్రిక నడిపి, ఉత్తమ సాహిత్య పత్రిక అంటే యెలా వుంటుందో అది తెలుగులోనే మనకు చూపించిన మహాత్యాగి అతను.

ముందే తన మనసిచ్చేవా డెలాంటి వాళ్ళకీ.

నాదీ యిదే పద్ధతి.

అయితే, మనసు పుచ్చుకోతగ్గవాళ్ళు చాలా అరుదు, లోకంలో.

సంశయాత్ములయే వుంటారు, చాలా మంది.

చూసిన్నీ కనిపెట్టలేరు చాలామంది.

పైగా, మనిసిచ్చెయ్యడం చూసి, లోకువ చేస్తారు చాలా మంది, దగాచేస్తారు, ద్రోహమున్నూ చేస్తారు.

ఎందరో చేశారు నా కిలాంటివి.

నా వల్ల మహోపకారాలు పొందినవారున్నూ చేశారు కొందరు.

రచయితలయినవారున్నూ చేశారు.

శ్రీరామశాస్త్రిన్నీ యెందరివల్లనో దగాపడి వుంటాడు, సందేహం లేదు.

కాని, యిదొక ప్రవృత్తి.

ముందే మనసిచ్చే ప్రవృత్తి జన్మక్రమాన్నిపట్టి వచ్చేది.

అది మారదు.

బతికినంత కాలమూ శ్రీరామశాస్త్రి అలాగే బతికాడు, నిశ్చలంగా.

ఎవరినీ లక్ష్యపెట్టేవాడు కాడు.

ఎందుకోసమూ పాకులాడేవాడు కాడు.

డబ్బులేక బాధపడేవాడు.

కాని, కక్కూర్తి–దైన్యం–దిగులు–నీరు కారిపోడం – ఇలాంటివి యెరగని మహానుభావు డతను.

మంచిమంచి సాహిత్య సభలు జరుగుతూ వుండేవారోజుల్లో.

ఆంధ్ర సాహిత్యమే ప్రధానమై వుండే దా రోజుల్లో, మన సాహిత్య పరులకున్నూ.

ఆంధ్ర సాహిత్య వికాసంకోసమే పాటుపడేవారప్పుడు సాహిత్య ప్రియులున్ను, ఇతర సాహిత్యాల వికాసం చూసిన ఉత్సాహంతో.

మిత్రులు, సూరి వేంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వేంకట రమణయ్యగార్ల చేతుల్లో, గ్రంథాలయోద్యమం, నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుండేదా రోజుల్లో.

ఆంధ్రమహాసభకూడా యెందునా ఆంధ్రత్వం పోగొట్టు కోని రోజు లవి.

మన ఆంధ్రుల్లో "నేను" "నాది" "నావాడు" అన్న ఆత్మ విశ్వాసం అంకురించి, మారాలేస్తున్న రోజులవి.

కాస్త మంచి సాహిత్య సభ జరిగిందీ, నేనూ మా సత్తిరెడ్డి గారూ వెళ్ళామన్నమాటే తప్పకుండా.

అక్కడక్కడల్లా శ్రీ రామశాస్త్రి ప్రత్యక్షమయేవా డన్న మాటే నాకు.

మళ్ళీ అంత మమతా కనబరిచే వాడన్నమాటే నామీద, అతను.

అటుచూస్తే, అతనికీ ముట్నూరి కృష్ణారావుగారికీ వొకటే ప్రాణమో అభేదమేనో, అసలు.

ఒకమాటు కలుసుకున్నప్పుడు, "కవిపూజ" సందర్భంలో జరిగిన అవకతవకలు వివరించి "ఇందుకాయన యిప్పుడేమి చెబుతారో కనుక్కో బ్రదర్" అన్నాన్నేను.

మరి అక్కడ యేం జరిగిందో "అది మరిచిపో బ్రదర్" అన్నాడతను, తరవాత కలుసుకున్నప్పుడు.

చేసిన తప్పు వొప్పుకోడం కష్టం యెవరికయినా.

బదులు చెప్పడం కూడా నామోషీ కొందరికి.

పత్రికా సంపాదకత్వం అంటే ఆచార్యపీఠం అని నానమ్మకం.

లౌక్యాలకూ స్వార్థానికీ స్థానం కాదది.

సత్యం నిర్ధారణ చెయ్యలవసిన ధర్మాసనం అది.

ముఖపిదానం చెయ్యవలసిన మాటుకాదు.

ధర్మప్రచారం చెయ్యాలంటే వొక్క ప్రవచనమే సాధనం వెనకటి రోజుల్లో.

పత్రిక అంటే, దాని కీడూ జోడూ అయిన మరోసాధనం యిప్పుడు.

సత్యానికీ ధర్మానికీ దాసుడు అయి వుండాలి సంపాదకుడు.

అసత్యానికీ అధర్మానికీ దండధారిన్నీ అయి వుండాలి.

ముఖ్యంగా స్వతంత్రుడు కావాలి.

గురుపీఠం అధివసించి వుండాలి, వొకడి వెనకబడి పోయే పరప్రత్యయనేయబుద్ధి కా గూడదు.

జాతికి, స్వార్థానికి ప్రగతిశీలమూ కలిగించాలి, పరార్థానికి అవధులూ చూపించాలి.

ప్రవృత్తికే సాధనం మరి, పత్రిక.

పత్రికా సంపాదకులను, ఆకాశం యెత్తునవుంచే మాట్లాడతాన్నేను, అయితే, వారు, నా ఆత్మగౌరవమూ, తమ హద్దూ గుర్తించుకో గలిగితేనే తరవాత కూడా నా ఆదరగౌరవాలు చెడకుంటాయి వారి యెడల.

"మనలో మనమాట"గా యీ సంగతి శ్రీరామశాస్త్రికి వివరించి, తరవాత నేనా వ్రాసే యెత్తుకోడం మానేశాను.

మరి కొన్నాళ్ళకి, గోదావరీ మండల సభ రామచంద్రపురం కోటలో జరిగింది.

పోలవరం జమీందారుగా రధ్యక్షులా సభకు.

రామచంద్రపురం రాజాగా రాహ్వాన సంఘాధ్యక్షులు.

అయితే, వారి కోరికమీద, వారి స్వాగతోపన్యాసం దివాకర్ల తిరపతిశాస్త్రిగారు చదివారు ముందు బాగా సాహిత్య వాసితంచేసి.

ఆ సభకివచ్చి రెండురోజులూ వున్నారు ముట్నూరి కృష్ణారావుగారు.

దూరాన, తర్జననిర్దేశంతో, వారికి చూపించాడు శ్రీరామశాస్త్రి నేను బాగా గుర్తించా నది.

కాని, వొకపూట భోజనాలదగ్గిర పక్కపక్కగా కూచున్నాం, మరో పూట మహాసభలోకూడా పక్కపక్కగా కూచున్నాం, మధ్యమధ్య, వొకరినొకరం అప్రయత్నంగా చూసుకోనూ చూసుకున్నాం, కాని నాతో కృష్ణారావుగారూ మాట్లాడలేదు, కృష్ణారావుగారితో నేనూ మాట్లాడలేదు.

ఎవరి మానాన వాళ్ళం బయలుదేరుతున్నాం, సభానంతరం.

మా సత్తిరెడ్డిగారి కోసం సొంతబండి వచ్చి రెండెడ్లది, వారెక్కే వున్నారు.

రాయజగపతివర్మగారూ నేనూ మాట్లాడుకుంటున్నాం, బండిక్కొంచెం యెడంగా.

"బ్రదర్" అంటూ వూచలావచ్చి, "నీకసి మహా చెడ్డదోయ్" అన్నాడు శ్రీరామశాస్త్రి, నా వీపుతట్టి.

"ఇందులో యెవరు తక్కువ తిన్నారు బ్రదర్?" అని యెదురడిగాన్నేను.

"కుర్రవాళ్ళు వినయవిధేయతలు కనబరచాలంటే, పెద్దల మనుకునేవారు టెక్కువిడిచి నడుచుకుంటేనే" అనిన్నీ చెప్పాన్నేను.

"సరే, సరే" అంటూ వెళ్ళి కృష్ణారావుగా రెక్కివున్న జట్కా యెక్కాడు బ్రదర్ శ్రీరామశాస్త్రి, నేను రెడ్డిగారి బండెక్కాను.

## 14

అనేకమాట్లు–అనేకచోట్ల–కలుసుకున్నాం నేనూ శ్రీరామశాస్త్రిని తరవాత, పానుగంటి రామరాయణంగారి యాజమాన్యాన, విశాఖపట్నంలో జరిగిన మూడో ఆంధ్ర మహాసభ సందర్భాన కలుసుకోడం ప్రకృతం.

భూపతిరాజు వేంకటపతిరాజుగా రాహ్వానసంఘాధ్యక్షులా సభకు.

కురుపాం మార్కెట్టులో జరిగిందది.

మార్కెట్టింకా ప్రారంభం కాలేదు, భవనం మాత్రం తయారయి వుంది సర్వసిద్ధంగా.

చుట్టూవున్న గదుల్లో ప్రతినిధులసభలూ, మధ్యగావున్న తెరపిలో ఆకాశం అంత పందిట్లో మహాసభను.

ఇక వొక్కగంటలో సభ ప్రారంభం అవుతుందనగా వెళ్ళాన్నేను, రెయిలు దిగి.

గదులన్నీ కిక్కిరిసి వున్నాయి, బస దొరకలేదు.

వసారాలో శ్రీరామశాస్త్రి కనపడ్డాడు, నా బస విషయం మాట్టాడుకుంటున్నాం.

పక్కనే వొక గదిగుమ్మాన నుంచునివున్నా రొక పెద్దమనిషి "మీ పేరెవ?" రనడిగారు వారు, నన్ను.

నేను చెప్పాను.

వెంటనే దగ్గిరికి వచ్చి, నాచెయ్యి పట్టుకుని "మేమున్న గదిలో ప్రవేశించండి" అంటూ అహ్వానించారు వారు నన్ను.

చకితుణ్ణయినాన్నేను, ఆ ఆదరానికి.

పొణకా పట్టాభిరామారెడ్డిగారు, మరెవరో కాదు.

అప్పుడే–అక్కడే–ఆవిధంగానే మా మొదటి పరిచయం.

లోపలికి తొంగి చూస్తినిగదా, వారి మేనల్లుడు మరపూరి పిచ్చిరెడ్డిగారూ, జమీన్‌రైతు పత్రిక సంపాదకులయివున్న నెల్లూరి వెంకట్రామా నాయుడుగారూ – యింకా మరికొందరు యువకులూ నిండివున్నారు.

నేను సందేహించాను; కాని చోటుచేసి, నన్ను తమతో చేర్చుకున్నారు, రెడ్డిగారు.

మనుమసిద్ధి సీమ కంతకూ వొక్క గునుపాటి యానాది రెడ్డి గారికి మాత్రమే నా కప్పటికి పరిచయం.

రెండోవారు పట్టాభిరామారెడ్డిగారు.

అంధ్రోద్యమం, గ్రంథాలయోద్యమం – ఇలాంటి ప్రజాహితోద్యమాల్లో రెడ్డి యువకులకందరికీ వొక్క పట్టాభిరామారెడ్డిగారిది ముందంజ, అప్పట్లో.

ఆ పూట సభ పూర్తయింది.

శ్రీరామశాస్త్రిని తీసుకువెడుతూ, నన్ను కూడా తమ యింటికి భోజనానికి తీసుకువెళ్ళారు, ఆ వూరి యువక వకీలొకాయన.

భోజనంచేసి అక్కడే పడుకున్నాం కాస్సేపు, మేము.

నిద్ర రాలేదు మా కిద్దరికీ, యేమిటేమిటో సంభాషణ మాత్రం వచ్చింది.

వాటిలో వీరపూజ విషయం వొకటి.

వినివిని "మహాబాగా తెచ్చావు సమయానికీ ప్రస్తావన" అంటూ పడుకుని మాట్టాడుతున్నవా డల్లా వుబ్బెత్తుగా లేచి కూచ్చున్నాడు శ్రీరామశాస్త్రి.

"గ్రంథకర్త లెందరో తమ గ్రంథా లచ్చుకాక బాధపడుతున్నారు మనవాళ్ళు. ఆ గ్రంథాల్లో ఉద్గ్రంథాలున్నూ కొన్ని వున్నాయి. అది గుర్తించారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. అలాంటివారికి సాయం చెయ్యాలని నిశ్చయించుకుని,

అందుకో పథకమున్నూ వేసుకున్నారు వారు. కాగితం—అచ్చు—బైండింగు—ప్రకటన—వీటిఖర్చులన్నీ తామే భరించి మంచి పుస్తకాలచ్చువేయించడమూ, మొదట వచ్చిన రాబడితో తమ పెట్టుబడి తీర్చుకోడమూ, అప్పటికి మిగిలి వుండిన గ్రంథాలన్నీ గ్రంథకర్త కిచ్చెయ్యడమూ – ఇదీ ఆ పథకం. కాపీరైటు గ్రంథకర్తదే. ఈ పథకంలో నీ వీరపూజ బయటికి రావచ్చు" అన్నాడతను.

పుస్తకం నా బసలోనే వుంది.

ఆ రాత్రి, పృథ్వీరాజు, భీమసింహుడు – వీరి చరిత్రలు చదివి వినిపించా నతనికి, కావాలని.

విన్నంత సేపూ అక్కడక్కడ ప్రశ్నలూ వేశాడు, చర్చా సాగించా డతను.

"మంచి గ్రంథం" అన్నాడు, చివరికి.

మర్నాటి పొద్దున్న నాగేశ్వరరావుగారి గదికి తీసుకువెళ్ళాడు, మరిచిపోకుండా నన్నతను.

కుశలప్రశ్నాదికం ముగిశాక, నా సంగతీ, వీరపూజ సంగతీ చెప్పాడు కూడా, వారికి.

"మీరీ సాయం చెయ్యాలితని" కని సిఫార్సున్నూ చేశాడు, దృఢంగా.

పుస్తకం వెంటబెట్టుకునే వెళ్ళాన్నేనప్పుడు.

విలవగల బైండు బుక్కుల్లో రాసేవాణ్ణి గ్రంథం, మొదట, నేనా రోజుల్లో.

అచ్చుకివ్వడం తటస్థపడితే, తరవాత, విడికాగితాలమీద రాయడం.

అది నాగేశ్వరరావుగారి కందించాన్నేను.

ఏడెనిమిదిచోట్ల, పదేసీ యిరవయ్యేసీ బంతులు చదివి "మంచి పుస్తకం" అన్నారు, వారును.

"ఇలాంటి చిక్కని భాషలో వుండాలిలాంటి గ్రంథాలు. మద్రాసు రండి, అచ్చు వేయించి యిస్తా" ననిన్నీ మాట యిచ్చారు, వారు.

## 15

చేతిలో పద్నాలుగణాలనర వుండగా, అదే పుచ్చుకుని బయలు దేరాన్నేను.

నడిచీ పడవెక్కీ కాదు, రెయిలెక్కీ – అక్కడి యిక్కడికి కాదు మద్రాసు వెళ్ళడానికి – బయలుదేరాను.

మూడువందల డెబ్భయిమైళ్ళ దూరం మాకు మద్రాసు.

పుస్తకం అచ్చు విషయం అంతా నాగేశ్వరరావుగారే చూస్తారు, నిజమే.

మిక్కిలీ అసంభావ్యంగా కనపడుతుం, దెవరికయినా యిది.

కాని, యెన్నో సంభవాలయిపోయా యిలాంటివి నా జీవితంలో.

ఖర్చులకయినా చాలినంతడబ్బు చేతిలో లేదన్న కారణాన నేనెప్పుడూ ప్రయాణం మానుకోలేదు.

మద్రాసు చేరుకోడం – హోటల్లో వొక్కపూట భోజనం చెయ్యడం – ట్రాములో వొక ప్రయాణమున్నూ చెయ్యడం– చాలు, ఈ మాత్రం డబ్బుంటే మద్రాసు వెళ్ళిపోడమే నేను, తరవాత్తరవాత.

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి గారొక పెన్నిధిగా వుండేవారు నా కక్కడ.
గూడవల్లి రామబ్రహ్మంగారున్నూ ఆసరా అవుతూవుండేవారు తరవాత్తరవాత.
అయితే, ఆ మొదటి మాటు మాత్రం అంతా నిరాలంబమే.
పుస్తకం అచ్చుమాట తరవాత, మరి మద్రాసు చేరుకోడం?
రాజమహేంద్రవరం దగ్గిర గోదావరి దాటడం అయినా సాధ్యమా ఆ డబ్బుతో?
ఆలోచిస్తూ కూచుంటే అంతే, మరి సాహసిస్తే?
ఏమవుతుందో చూడ్డమే నా పద్ధతి.
ఈ దిలాసాతో – ఈ సాహసంతో – వీరపూజ అచ్చువేయించుకుని రావడానికి – (తూర్పు) గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా, పాలమూరు గ్రామాన, బయలుదేరాను మద్రాసు వెళ్ళడానికి, రాత్రి భోజనానంతరం తొమ్మిది దాటాక.
మధ్యాహ్నం మూడుగంటలవేళ ఉద్వేగం పుట్టేసింది వీర పూజ అచ్చు ఆలస్యం అయిపోతోందని.
దీపాలు పెట్టేటప్పటికి పెట్టె సద్దేశాను.
కూలి మనిషి కుదిరాడు.
భోజనం చేస్తూ చెప్పాను మా నాయనగారితోనూ, మా అమ్మగారితోనూ.
"సరే" అంది సీత.
సత్తి భామిరెడ్డి, క్రితాత అని యిద్దరు రెడ్డి శిష్యులు.
నలభై యేళ్ళు దాటినవారిద్దరూ.
నన్ను విడిచి పెట్టేవారు కారెప్పుడూ, పొలం పనివేళ తప్పించి.
ఓనమాలు మొదలుపెట్టి రెండు మాసాల్లో పుస్తకం పట్టించాను వారిచేత, అప్పుడప్పుడే.
బాలశిక్ష సగం అయింది.
ఉలిక్కిపడ్డారు వారిద్దరూ "ఇంకొక్క గంటలో ప్రయాణం" అనగా విని.
నేనేదో వొరగదోసుకు వస్తానని వొక సంతోషమూ, కొనలుసాగుతున్న తమ చదువు చెడుతుందని వొక బెంగాను, వారికి.
అయినా, శుభచింతనతో సాగనంపడానికి బయలుదేరారు, వారు నన్ను.
ఊరికుత్తరాన రెండు ఫర్లాంగుల్లో మురుగుకాలవ.
పంటలరోజుల్లో, పొలాల్లో యెక్కువగావున్న మురుగునీరు పోడాని కేర్పడ్డ దది.
పాలమూరివారు, ప్రీతివున్నచోట ఎవరిని సాగనంపడానికయినా అది అవధి.
ఒక్కమాటు గట్టున నుంచున్నాం ముగ్గురమూ.
పుచ్చపువ్వులా వెన్నెల.
చల్లని గాలి.
శ్రావణ మాసం.
రైతులంతా పంటలు యెదురు చూపుతో వున్నారు.
నా యెదురుచూపు పుస్తకం ప్రకటన.
వారు కొంత పెట్టుబడి పెట్టారు, చాలా కష్టపడ్డా రప్పటి వరకూ.

నాదీ తక్కువలేదు; కాని పైకి కనపడేది కాదు.

శిష్యులకూ తెలియదు దాని తత్వమూ, దాని కార్యక్రమమున్ను.

పర్యవసానం కూడా వారి కందలేదు.

మరి నాకు?

ప్రయత్నాలు చేశాను, తిరిగాను, కష్టపడ్డాను, అప్పటికీ మొదటి అడుగులోనే వున్నాను.

"బాబూ, చాలా దారుణమైన సాహసం చేస్తున్నారు మీరు. వెళ్ళేది దూరదేశం. దేవుడు మిమ్మల్ని రక్షించాలి" అంటూ చెయ్యెత్తి మొక్కారు, రెడ్డిద్దరూ.

"మన చేతిలో యేమీలేదు. అంతా యీశ్వరాయత్తం. మీ రిద్దరూ నా క్షేమం కోరుతూ వుండండి, చాలు. మద్రాసులో రెండు మాసాలకు తక్కువ పట్టదు. అగత్యం అయితే, సంవత్సరం అయినా వుందామని వెడుతున్నాను. పుస్తకాల రూపంగా అయినా వెయ్యి రూపాయలు తేగలిగితేగాని, యింటికి రాను" అంటూ ముందు కదుగువేశా న్నేను.

పొలమూరికీ అనపర్తి స్టేషనుకీ రెండుమైళ్ళు.

కావడి బరువుకు్కాడా అణా యిచ్చేవాళ్ళం అప్పుడు కూలి.

రాత్రికావడం మూలాన పావలా పుచ్చుకున్నాడు నా దగ్గిర కూలీ.

అయినా రాత్రిపూట మనిషి దొరికాడు, అది శుభసూచన అనుకునా న్నేను.

స్టేషను చేరుకునేటప్పటికి 0–10–6 వుంది చేతిలో.

రెయిలుదిగి, రాజమహేంద్రవరంలో, జట్కామీద మా మేనల్లుని బస చేరాటప్పటికి 0–4–6 మాత్రమే మిగిలింది.

కాని, తెల్లవారి తొమ్మిది గంటలయాటప్పటికి, ఆ పావలా అర్ధణా అల్లా ముప్ఫయ్యయిదు రూపాయల పావలా అర్ధణా అయిపోయింది, మంత్రించినట్టు.

జరిగిం దేమిటంటే?

నిరాడంబరమైన ఆ ఔదార్యం తలుచుకుంటే పులకలు పేటెత్తుతాయి నా కిప్పటికీ, మహానుభావులు, సోమిన కామేశ్వరరావుగారు రాజమహేంద్రవరాని కంతకూ విశిష్టవ్యక్తులు.

జిల్లా కంతకూ పెద్ద వకీళ్ళలో వారొకరు.

వారిది పెద్ద సంపాదన, అంతా ఖర్చున్ను.

ఏపని చెయ్యాలన్నా పెద్ద యెత్తు వారిది.

నేనంటే చాలా అభిమానం మొదణ్ణుంచీ.

వారి స్వగ్రామం వెదురుపాకా, మా స్వగ్రామం పొలమూరూ మూడు మైళ్ళలోవి.

ఎస్.పి.వి.ఎల్. ప్రారంభానికి ముందు నేనూ సత్తిరెడ్డిగారూ వెళ్ళి వారి సలహా అడిగాం.

"రాతకోతలేమీ వద్దు లెక్కలు సరిగా చూసుకుంటూ పని ప్రారంభించండి" అని మాత్రమే చెప్పారు వారప్పుడు.

అలాగే ప్రారంభించాం.

అది అయిపోయింది.

రసాబా సయిపోయింది.

"తెనుగు వాళ్ళు కలిసి పనిచేసే స్థితికి రాలేదింకా. కాక,– మీ యేర్పాట్లలో చెన్నుబొట్లవారి చేరిక అపాయకరంగా కనపడింది నాకు. సంస్థ నడవదని తోచింది దృఢంగా. అంచేతనే రాతకోతలు వద్దన్నాను. అదే జరిగివుంటే మీరు ముగ్గురూ కూడా కోర్టుపక్షులయి వుందురిప్పుడు. అది లేకపోవడం వల్లనే మీరు విడిపోడం సులువయింది." అని తమ సలహో ఆంతర్యం విప్పి చెప్పారు మా కప్పుడు.

"దేంతోనూ అనుబంధం వద్దు మీకు. రాయండి. ఎడతెరపి లేకుండా – విసుపులేకుండా రాయండి మంచి బేరం వస్తే కాపీ రైట్లు అమ్మండి. లేకపోతే, సొంతంగా అచ్చు వేయించుకోండిప్పటికయినా" అని ప్రత్యేకంగా కూడా నాకు సలహో చెప్పారు వారు.

ఇదిగో, యీ విశ్వాసంతోనూ, యీ అనుభవంతోనూ

"ఈ పనిమీద మద్రాసు వెడుతున్నా"నని వెళ్ళి చెప్పాటప్పటికి పాతిక రూపాయలు నాచేతిలో పెట్టారు, వారు.

అప్పుడక్కడే వున్నారు వారితో మాట్లాడుతూ, కాశీవజ్ఝల సోమేశ్వరరావు వకీలుగారున్నూ పదిరూపాయలిచ్చారు.

వెంటనే పూరీ పాసెంజరులో బెజవాడ బయలుదేరాను, టంగురంగా అంటూ.

## 16

సూరివేంకట నరసింహశాస్త్రిగారు చిరపరిచితులు బెజవాడలో, నాకు.

సాహిత్య ప్రియులైన బెజవాడ వకీళ్ళలో ప్రథమగణ్యులు వారు.

గ్రంథాలయాలకు సంబంధించిన యేడెనిమిది సభల్లో కలుసుకుని వున్నాన్నేను వారిని.

బెజవాడ వెడితే తరుచు వారి యింటోనే భోజనం.

ఆవేళ కూడా వారి యింటోనే బస చేశాను.

గోరీ విషయమై పృథ్వీరాజూ, అల్లాయుద్దీను విషయమై భీమసింహోదులూ చూపించిన ఔదార్యంమీద నేను చేసిన చర్చ విని చకితులయినారు మొదట, వారు.

చూసి చూసి "మీ వాదం పూర్వపక్షం చెయ్యడానికి దారి కనపడ్డంలే" దన్నారు, తరవాత.

"ఏమయినా కొత్త వ్యాఖ్యానం. మంచి చర్చ. త్వరగా అచ్చుకావలసిన గ్రంథం" అన్నారు చివరికి.

మర్నాటి పొద్దున్న అయ్యంకి వెంకటరమణయ్యగారిని కలుసుకున్నాను.

సంగతి చెప్పగా వెంటనే అయిదు రూపాయలిచ్చి "రండి" అంటూ నన్ను వెంటబెట్టుకుని బయలుదేరారు, వారు.

అయ్యదేవర కాళేశ్వరరావుగారి దగ్గిరికి తీసుకువెళ్ళారు, తిన్నగా.

అదే మొదటి మాటు కాళేశ్వరరావుగారిని చూడ్డం, నేను.

ఆ వూరి వకీళ్ళలో మంచి ముసద్దీ ఆయన.

"పుస్తకం అచ్చు బాధ్యత అంతా నాగేశ్వరరావుగారిదేగా?"

అని వెంకటరమణయ్య గారిని ప్రశ్నిస్తూ రెండు రూపాయలిచ్చారు నాకు.

దాంతో నిరుత్సాహపడ్డారు గాని సాహసించి, మరో యిద్దరి దగ్గిరికిన్నీ తీసుకువెళ్ళారు నన్ను, వెంకటరమణయ్యగారు.

మొత్తం వారిద్వారా పాతిక రూపాయలు చేతికి వచ్చాయి.

"నిన్నరాత్రి సూరి వారి యింటో రాతపుస్తకం చదివినవారు మీరేనా?" అనడిగారు నన్నొక పెద్దమనిషి, దారిలో తారసపడి.

డాక్టరు. దంటు సుబ్బావధానిగారు వారు.

డాక్టరు. యఱ్ఱమిల్లి జగ్గన్న శాస్త్రిగారి ద్వారా వారి ప్రగతి వినివున్నా న్నేను. నా సంగతిన్నీ కొంచెం తెలిసినట్టేవుంది, వారికిన్నీ.

మేము కలుసుకోడం మాత్రం అదే మొదటి మాటు.

భోజనం చేసి నరసింహశాస్త్రిగారు కోర్టుకి వెళ్ళిపోయారు, సుబ్బావధానులుగారు వచ్చారు.

కోరి, పృథ్వీరాజు చరిత్రా, భీమ సింహుని చరిత్రా, ప్రతాపసింహుని చరిత్రా చదివించుకుని విన్నారు వారు.

"విషయానికి తగ్గ రచన. కాలానికి తగ్గ వ్యాఖ్యానం" అని తమ అభిప్రాయాలున్నూ చెప్పారు, వారు.

వైద్యవిద్య కలకత్తాలో అభ్యసించారు వారు.

బంగాళీలతో చాలా పరిచయం వారికి, చాలా మందితో.

వారి ప్రవృత్తీ, ప్రగమనశీలమూ బాగా పరిచితాలు వారికి.

"మీరు బంగాళీలయి, మీ గ్రంథం బంగాళీ భాషలో పుట్టి వుంటే, యిది యెప్పుడో అచ్చుయిపోయి వుండడమే కాదు, ప్రపంచ చారిత్రికుల మన్ననలున్నూ అంది వుండే దెప్పుడో" అనిన్నీ అన్నారు వారు.

ఏంతోచిందో మరి, "ఇది చదివే అంగీకరించారా నాగేశ్వరరావుగా రచ్చు వేయించడానికి?" అనడిగారు కూడా నన్ను, గుమ్మం దిగుతూ.

ఆమాటా యీమాటా చెబుతూ పది అడుగులు వేశాన్నేను.

ఇంతలో అవధానులుగారి స్నేహితులెవరో యెదురైనారు మాకు.

"ఆగు" అన్నారు సుబ్బావధానులు గారు.

నా పేరు చెప్పారు ముందువారికి. నా గ్రంథం సంగతిన్నీ చెప్పారు తరవాత. "నీకు చేతనైనంత డబ్బియ్యి వారి, వెళ్ళిపో" అన్నారు చివరికి.

పర్సు తీశారు, పదిరూపాయలే వుంది అందులో.

అది నాచేతిలో పెట్టి వెళ్ళిపోయారు వారు, ముందుకి.

"సంతోషించండి" అన్నారు వెళ్ళిపోయారు అవధానులు గారున్నూ.

ఆరాత్రే మద్రాసు ప్రయాణం నేను.

స్టేషనుకు తీసుకువెళ్ళి, నన్ను వద్దని టిక్కట్టున్నూ తామే కొని, నన్ను రెయిలెక్కించి, టిక్కట్టూ కొంత డబ్బూ చేతిలో పెట్టి, శుభమున్నూ పలికి వెళ్ళిపోయారు నరసింహశాస్త్రిగారు.

బండి కదిలాక–ప్లాటు ఫారమున్నూ దాటేశాక చూసుకోగా టిక్కెట్టుకాక 11–9–0 చేతిలో వుంది.

15–0–0లు ఇచ్చారన్న మాట నరసింహశాస్త్రిగారు.

## 17

బెజవాడ రెయిల్వేస్టేష నొక రేకుల షెడ్డు ఆ రోజుల్లో.

పైని కప్పేకాదు, కింద, గోడలున్నూ రేకులే.

పల్లెటూరి సంతపాకకంటే నికృష్టంగా వుండేదది.

పాతవూరి పక్క కుండేదది, యిప్పటిలాగ మధ్యగాకాదు.

ప్లాటుఫారం యేర్పాటులేదు, రెండు గజాల యెత్తున యెగబాకి రెయి లెక్కవలసి వచ్చేది ప్రయాణీకులకు.

అక్కణ్ణుంచి, మద్రాసుకి, మూడో తరగతి మెయిలు ఛార్జీ 3–7–0లు ఆ రోజుల్లో.

నా జీవితంలో, నేను చెల్లించిన మొదటి పెద్దరెయిలీ ఛార్జీ అది.

మెయిలెక్కడమున్నూ అదే మొదటి మాటు నాకు.

సకాలంలో వచ్చి సకాలంలోనే బయలుదేరింది మెయిలక్కడ.

నిదానం యెక్కువగా వుండే దప్పుడు జనానికి.

ఇప్పుడు రెయిళ్ళ కెక్కువయిం దది.

పరప్రభుత్వంలో అన్నిటికీ ఆత్రమే, ఇప్పుడూ నా మరి?

చిన్న కంపార్టుమెంటులో కూచోబెట్టారు తీసుకువెళ్ళి నరసింహశాస్త్రిగారు, తెనాలిలో మరో వైశ్యయువకు డెక్కాడు, అంతే.

గూడూరుదాకా మే మిద్దరమే వున్నాం, కంపార్టుమెంటు కంతకీ.

తరవాత కూడా, చాలా రోజులదాకా, అదే స్థితి మెయిల్లో కూడా.

ఒక్క కునుకు కానిచ్చి, మెళుకువరాగా కిటికీలోనుంచి తొంగిచూసి విడిచిపెట్టింది వంగోలు స్టేషనన్నాడు మిత్రుడు, అప్పటిదాకా నిద్రపట్టలేదు నాకు, బల్లకిబల్ల అంతా నా స్వాధీనంలోనే వుండినా.

బెజవాడలో మెయిలు బయలుదేరింది, "మద్రాసులో మన పని యే మవుతుందో" అన్న ఆందోళనా బయలుదేరింది నాకు.

అక్కడ నిశ్చింతగా రెండు మాసాలుండడానికీ, రానూ పోనూ రెయిలు ఖర్చులకూ లోటులేదు, మరి, వెళ్ళినపని కాక పోతే?

స్వస్థానంలో వుండగానే యిలాంటి విరాళా లంది వుండ గూడదూ, మరో యే డెనిమిది?

పొట్టకోసం మద్రాసు వెళ్ళనక్కరలేదు.

మద్రాసు వెళ్ళినా వీరపూజ అచ్చు కాకపోతే మరెక్కడికి వెళ్ళడం?

దీపాల వెలుగులో రెయిలు పెట్టెలో కూచున్నవాడికి బయటి అంధకారం యెంత ఘనీభవించి వుంటుందో అంతకంటే ఘనీభవించింది నాకీ ఆందోళన.

ఆలోచనకోసం గుచ్చేసుకున్న కళ్ళలో అంధకారం కమ్ముకుంది.

దాని వెనకనే, దానికి జాతీయమైన నిద్రకూడా ఆవరించింది, వచ్చి.

మళ్ళీ కళ్ళు తెరిచేటప్పటికి అటు సూర్యోదయం అవుతోంది, యిటు గూడూరు ప్లాటుఫారం మీద నిలిచివుంది, మెయిలు.

నేను కొళాయి దగ్గిరికి వెళ్ళి వచ్చాటప్పటికి మరో నలుగురైదుగురెక్కారు కొత్తగా మా కంపార్టుమెంటులో.

ఉండుండి, యేదో స్ఫురించిన ట్టులిక్కిపడి "అయితేన్నూ, మీరెందుకు వెడుతున్నారూ మద్రాసు?" అనడిగాడు మిత్రుడు.

నేను చెప్పాను.

"పుస్తకం వొకమాటు చూడనిస్తారా?" అనడిగా డాయన.

ఇవ్వగా, చదవడం ప్రారంభించాడు.

రెయిలు పరుగెత్తింది, మళ్ళీ ఆగింది.

సుళ్ళూరుపేట స్టేషను, అది.

కృష్ణాజిల్లా యాసా, గుంటూరుజిల్లా యాసా, నెల్లూరు జిల్లా యాసా పోయి, అరవతెనుగు ప్రారంభం అయిందక్కడ, స్పష్టంగా.

డజన్లకొద్దీ అరవపాలరును చూడ్డమున్నూ అక్కడే ప్రారంభం అయింది.

గూడకట్లు పైకి విరిచి కట్టుకోడం—జుట్టుకొప్పులు పెట్టుకోడం—పొగాకు నమలడం—కింది పెదవులు పైకెత్తుకుని మాట్టాడ్డం— చాలా వింతగా కనపడ్డాయవి.

అప్పటివరకూ, అప్పుడూ అప్పుడూ పద్యాలు కడుతూనే వున్నాను, కనక, వొకపద్యం వచ్చేసింది దానికదే, అప్రయత్నంగా,—

గీ॥ ప్రస్తుతింపనా? మూడు రూపాయలనర
కాన్క చెల్లింపలేదా? యీ కిన్కయేల?
తెచ్చి విడిచితె కన్మూసి తెరచునంత
మొగ మెరుంగని యీ అర్వమూక నడుమ?॥ అని.

మెయిలుని సంబోధిస్తూ కట్టిన పద్యం యిది.

"ప్రస్తుతింపనా" యతికోసం పడ్డ పడికట్టురాయి.

రెయిలు కంపెనీకి చెల్లించింది మూడు రూపాయల యేడణాలే, కాని, గణంకోసం మరో అణా చేర్చవలసి వచ్చింది, సేల్సుటాక్సులాగ.

"వెల్ల, చిల్క, మొల్క, అప్ప, అర్వ—ఇది ఆకృతిగణం.

పద్యం కావడం వల్ల వచ్చిన పాట్లివి."

పద్యం కావడం వల్లనే వచ్చిందీ ధోరణి, వచనం కోసం పుట్టనే పుట్టదీ ప్రయత్నం, మరి.

ఇంతలో యెణ్ణూరు దాటింది.

వీరపూజ చదువుతూనే "యెంచేతో రెయిళ్ళిక్కడ పడి పోతూ వుంటాయి, తరుచు" అన్నాడు మిత్రు డెంచేతో?

అది కొత్తసంగతి నాకు, మద్రాసులాగే.

కాల క్రమాన మద్రాసు పాత దయిపోయింది నాకు, దైవ వశాన రెయిలు పడిపోడం మాత్రం పాతది కాలేదు నాకక్కడ, యెప్పుడూ.

మరికొంతసేపటి తండియార్పేటా, దాంతో పాటు వావిళ్ళ వారిపేరూ జ్ఞాపకమూ వచ్చింది.

"వారిది మద్రాసు కాదూ?" అనుకున్నా నాలో నేను.

మాట పైకి వచ్చినట్టుంది "తండియార్పేటు మద్రాసులో వొకపేట" అన్నాడు పక్కని వున్న బాటసారి.

ఏమిటేమిటో చెప్పడం మొదలు పెట్టాడు, దానిమీద మిత్రుడు.

గుక్క తిప్పుకోకుండా చెప్పాడు, చాలా సంగతులు.

ఒక్కటీ బుర్రకెక్కలేదు నాకు, మద్రాసు పరిచయం లేక.

చెప్పి చెప్పి పరుపు కట్టేసుకున్నాడు.

పెట్టె కూడా సద్దుకున్నాడు, నా పుస్తకం నా కిచ్చి.

ఆ సద్దుకోడంలో చిన్న చిన్న వస్తువులెన్నో పెట్టుకున్నాడు బల్లమీద.

వాటిలో మూడు ఫౌంటెన్ కలాలున్నాయి, రంగురంగులవీ, రకరకాలవీని.

అది వొక్కటీ లేనివాణ్ణి నేను. "ఈయనకు మూడెందుకూ?" అనుకున్నాను.

అనుకున్నా నంటే మనసులో అనుకున్నాను, ఇందాకటిలా కాక, బాగా జాగ్రత్తపడి.

కాని వాటిలో వొకటి యెత్తి పట్టుకున్నా డాయన, నాకేసి చూస్తూ.

"ఇప్పటిదాకా మీ రచన చదివాను. అది అర్థం చేసుకోడానికి తగినంత పరిజ్ఞానం లేదు నాకు. కాని వొకటి తోచింది. సరదాక్కొన్నానీ కలాలు మూడు, నా కొక్కటే చాలు, అసలు. చూడగా, మీ జేబులో కలం వున్నట్టు లేదు. మీరు కవులుకనక, మీ కిలాంటిది చాలా అగత్యం. ఇది మీ కిద్దామనీ బుద్ధి పుట్టింది నాకు. నేను భాగ్యవంతుణ్ణనుకుంటూ యివ్వడం లేదు మీకిది. తప్పు కాకపోతే పుచ్చుకోండి. ఉపయోగించండి" అన్నా డాయన.

"శిలాభోగం అనీ, స్థలాభోగం అనీ అంటారు మనవాళ్ళు, అలాగే యిది కలం భోగం కావచ్చు. కవిచేతిలో నలిగే అదృష్టం వుంది దీనికి అనిన్నీ చెబుతూ చేతికందించా డది ఆయన."

అడిగే పుచ్చుకునే పద్ధతి నాది యేమయినా, కనక, పుచ్చుకోడం తప్పనుకోడం యేమిటీ నేను?

నటనమాత్రం యెందుకూ, నేనేదో మహా "మహారాజశ్రీ" నయి వున్నట్టు?

నిరభ్యంతరంగా పుచ్చుకున్నాన్నేను.

ప్రీతిగా–ఉల్లాసంగా–సంతోషంగా–పుచ్చుకున్నాను.

ఆశీర్వచనమున్నూ చేశాను.

ఇప్పటికీ నేను చూపించగల కృతజ్ఞత అంతే యెవరికయినా.

బ్లాకుబర్డు కలం అది.

పేరికి తగ్గట్టే, నల్లగా – సున్నగా – ముద్దుగా వుందది.

చాలా పేరుపడ్డ కలం అది ఆ రోజుల్లో.

ఒక పావులా అటూ యిటూగా మూడు రూపాయల ధరలో వుండే దది.

సంకల్పమే కలగలేదు నా కెప్పుడూ, ఆ మాత్రం డబ్బెన్ని మాట్లో – ఎందు కెందుకో ఖర్చుపెట్టి వున్నాన్నేను.

అప్పుడప్పుడు సరదా పుట్టేది; కాని చేతిలో డబ్బున్నప్పుడు మాత్రం నా కెప్పుడూ పుట్టలేదా సరదా.

కాక,–

అప్పుడే కాదిప్పటికీ కూడా పాళీకలంతోనే రాస్తా న్నేనింటో వున్నప్పుడు.

కనక, దాని అగత్యం అనివార్యం కాలేదు నా కెప్పుడూ.

కాని చాలా వింత పడ్డాను. జరిగినదానికి?

నా కివ్వాలని తోచడం యేమిటీ ఆయన కది?

ఇది చెప్పలేన్నేను.

ఊహించలేను, అసలు.

ఎదటివాళ్ళ కేమయినా యివ్వాలని సొదలకే కాదు, బీదలకూ పుడుతుంది, సంకల్పం.

సొదలది మాత్రమే కార్యరూపం ధరించగలుగుతుంది.

మనసుపడి కొనుక్కున్నా డది ఆయన.

మరి, నా కివ్వడం మాత్రం?

దానం చేస్తే పుణ్యం వస్తుందన్నారు, మనవాళ్ళు.

ఆ కలం నాకివ్వడం వల్ల ఆయనకు కలిగే పుణ్యం మాట అలా వుంచుదాం.

మరి, ఇస్తూ ఆయన కనబరిచిన ఆనందం?

తృప్తి?

స్తవనీయా లివి.

పీడిస్తే యివ్వడం స్తవనీయంకాదు.

అది పరిగ్రహీతకూ శ్రేయస్కరం కాదు.

ఈ యిచ్చి పుచ్చుకోడాలు ప్రతీ మనిషికీ అగత్యాలే, సంసారంలో వున్నంతవరకూ.

కాని, సాధారణంగా పుచ్చుకోడమే రాసిపెట్టా డీశ్వరుడు, నాకు.

"యథాకథం చపరీ పరిగ్రహాస్తేనోహ భవతీతి కౌత్సహారీతా, కాణ్యపుష్కరసాదీ" అన్నాడాపస్తంబుడు.

"పుచ్చుకోడం యెలా జరిగినా, అది దొంగతనమే అవుతుంది" ఈ సూత్రాని కర్థం.

కౌత్సుడూ, హారీతుడూ, కాణ్యుడైన పుష్కరసాదీ నిర్ణయించిన ధర్మం యిది.

ఆ పస్తంబు డంగీకరించాడు, అనువదించాడు కూడా, ఇది.

కనక, ఎప్పుడూ, ఎవరి దగ్గిరనుంచీ కూడా – ఏదీ కూడా పుచ్చుకోకపోవడమే మంచిది.

దృఢమైన వ్రతంగా పాటించుకోవలసిన ధర్మం యిది.

అంచేతనే "నప్రతి గ్రహీతృత్వం" చాలా గొప్పగా భావించారు, మనవాళ్ళు.

"నప్రతిగ్రహీత" అనిపించుకోడం కంటే - కావడమున్నూ కంటే - గొప్ప యోగ్యతలేదు, మనిషికి.

నిరతాన్నదానం చేశారు మాపితామహులు, శివరామ సిద్ధాంతి దీక్షితులుగారు.

ఈ సంగతులు చెప్పేవారిప్పటికీ వున్నారు వృద్ధులు, ముని కొడవలి ప్రాంతాన.

భూవసతి పెద్దదే; కాని రాబడి చాలేదికాదు.

చాలకపోతే రుణాలు చేశారేగాని, యెవరివల్లా యేమీ పుచ్చుకోలేదు.

మా తాతగా రలాంటివారు కావడం మాకెంతో గర్వకారణం.

మరి, నే నిలాంటి వాణ్ణి కావడం వారికి?

ఈ భావన అంతరించిపోతోందిప్పుడు.

పోతోందేమిటి, పోనేపోయింది.

"సంపాదించు. ఎలాగో వొకలాగ సంపాదించు. కుడిచేతా యెడమచేతా గూడా సంపాదించి పోగులు పెట్టు. దర్జాగా అనుభవించు" ఇదీ యిప్పటి నినాదం.

మన విద్యలు వెనకబడ్డాయి.

మన సిద్ధాంతాలు వినపడ్డంలేదు.

మన ధర్మం మరుగున పడిపోయింది.

భారతీయులం మనం.

ఆర్యులం.

ఆధ్యాత్మికం మన సంస్కారం, భౌతికం కాదు.

కాని, యేమిటీ మన దగ్గిర వున్న దిప్పుడు?

ఇది తలుచుకుంటే, గుండెలు బద్దలాసి పోతున్నాయి.

మన ధర్మం దానికది మరుగున పడిపోలేదు.

మనం విడిచిపెట్టేశాం.

పాతాళానికిన్నీ తొక్కేశాం.

"అది ఆటవికుల దశ" అనిన్నీ నిరసిస్తున్నాం.

ఇదీ మన పతనాని కిప్పటి అవధి.

## 18

భావగంభీరమైన వొక వుదంతం.

మిత్రులు, బ్రహ్మశ్రీ ఓలేటి సూర్యనారాయణ శాస్త్రిగారు చెప్పిం దిది.

బహూ చిన్నది; కాని చాలా గొప్పది.

యానాం సమీపాన "వింజరం" అని వొక గ్రామం.

బ్రాహ్మణాగ్రహారం అది.

శాస్త్రపాండిత్యానికి మెచ్చి పెద్దాపురం ప్రభువు లిచ్చింది.

అగ్రహారీకులు - అంటే అగ్రహారం సంపాదించినవారు...

ఆరామ ద్రావిళ్ళు వారు.

ఇప్పటికీ వారిదే అధిక సంఖ్య అక్కడ.

సరస్వతీ పీఠం అది.

అగ్రహారీకుల వంశంలో అని వొక బ్రాహ్మణ్యులు.

గొప్ప విద్వాంసులు వారు.

అపార పాండిత్యం వారిది.

బహు ముఖమున్నా అది.

వారున్నా ప్రామాణికులు.

వేదవాక్యం మరి, వారిది.

ఒకప్పుడు రాజసభలో వొక ధర్మసందేహం వచ్చింది.

పెద్దాపురంలో – రాజసన్నిధిని వున్న పండితు లది తీర్చలేక పోయారు.

ఎక్కడెక్కణ్ణుంచో – యెందరెందరో వచ్చారు పండితులు – వారూ తీర్చలేకపోయారు.

మహారాజుకి తదేకదృష్టి.

తమ పండితుల్లో అది తీర్చగల పండితుల్లేకపోయారే అని బెంగ వారికి.

కాక,– అది తీరితేనే రాజధర్మ ప్రవృత్తి.

ఆలోచించి – చర్చించి "వింజరం అగ్రహారంలో వున్న.......గారు మాత్రమే తీర్చగల రది" అని మనవి చేసుకున్నారు, సన్నిహితులు, ప్రభువుకి.

పదహారుగురు బోయీల పాలకీ, పరివారమూ పంపాడు మహారాజు శాస్త్రిగారికోసం, అవ్యవధానంగా.

శ్రమపడి వెళ్ళి, దరఖాస్తు పంపుకుని, కిందివారిచుట్టూ తిరుగుతూ పడిగాపులు పడివుండడం కాదు, పండితుల అవస్థ అప్పుడు.

వర్తమానంచేసి, దర్శనంకోరి. పాలకీ పరివారమూ పంపి ప్రభువులే యెదురు చూసేవారు పండితులకోసం, అప్పుడు.

సభ కూడింది.

విషయ వివరణమూ, చర్చా జరిగాయి.

విని విని, సిద్ధాంతం ప్రకటించారు, శాస్త్రిగారు.

బృహస్పతి తీర్పది.

అందరూ చకితులైనారు.

పండితు లానందించారు.

ప్రభువు సత్కారం తలపెట్టాడు శాస్త్రిగారికి.

కాని విముఖత చూపించారు శాస్త్రిగారు.

"ఈ కొత్త సత్కారం యేమి చేసుకోను ప్రభూ? ఇప్పుడు లోటేమిటీ నాకు? అన్యత్రా వినియోగం చేయించండి" అని మనవి చేసుకున్నారు, శాస్త్రిగారు.

ఎందరికో జరుగుతూనే వున్నాయి రాజసత్కారాలు, దినమ్మూ.

మరి, అంతటి పండితులు శాస్త్రిగారి నెలాగా విడిచి పెట్టడం?

అనేకవిధాల కోరాడు ప్రభువు "స్వీకరించవలసిం" దని.

మెట్టు దిగవలసి వచ్చింది, శాస్త్రిగారికి.

"ప్రభూ" అన్నారు వారు.

వింజరం చెరువుగట్టున పెద్ద చింతచెట్టు.

విరిగి పడిపోయిందెప్పుడో అది.

ఎండిన్నీ పోయింది, పూర్తిగా.

"మా యింటావిడ వంటకట్టెలు చాలడం లేదని తొందర పెడుతోంది, కనక, అదిగో, ఆ చెట్టు కొట్టించుకోడానికి ఆజ్ఞ యిప్పించండి" అని కోరారు, శాస్త్రిగారు.

☆ ☆ ☆

బ్రహ్మశ్రీ చెరుకుపల్లి బుచ్చిరామశర్మగారు మరో వుదంతం చెప్పారు.

భాగవతి హరిశాస్త్రి గారని సాటిలేని వేత్తలు.

వ్యాకరణ శాస్త్రంలో అంతటి విద్వాంసుడు మరి లేడు.

కాశీలో చదివి, అక్కడా, మార్గానా వున్న పండితుల నందరినీ చిత్తుచేసి వచ్చారు వారు.

కోటిపల్లిలో నివాసం.

తపస్సు–శిష్యులకు పాఠప్రవచనాలు ఇంతే వారి ప్రపంచం.

పదచలనం యెరగరు.

పిఠాపురం ప్రభువు శ్రీరావు గంగాధర రామారాయుణ్ణింగారికి వారిని చూడాలని అభిలాష కలిగింది.

ఎందరో వస్తున్నారు పండితులు, వెడుతున్నారు.

"మరి, హరి శాస్త్రిగారు దయచెయ్యడం లేదేం మన సంస్థానానికి? అనడిగారు, సన్నిహితులను ప్రభువు."

"ఇల్లు కదలరు వారు. వారి దర్శనం కావాలంటే మనమే కోటిపల్లి వెళ్ళా" లని విన్నవించుకున్నాడు, దివాన్.

"ఏమిటబ్బా ఆ టెక్కు?"

"ఏం, వారిని చూడకపోతే యేం?"

సందేహం కాదిది, రాజసమే అనుకోండి.

ఇంతే తోస్తుంది సాధారణంగా, యెవరికయినా.

కాని, ప్రభువు, స్వయంగా బయలుదేరారు, సపరివారంగా, పట్టపుటేనుగెక్కి.

కోటిపల్లిలో మకాం వేశారు.

కాని, శాస్త్రిగారిల్లు కదలరు, కోటిపల్లిలో కూడా.

అంటే, యెవరికోసమూ–యెందుకోసమూ బయటికిరారు.

జీవితావధికమైన వ్రతం యిది.

మరి, దారి?

గోదావరి స్నానంకోసం మాత్రం వీధికి వస్తారు, వారు.

పిడుగులు పడనీ, ప్రపంచం అంతా జలమయం కానీ, అది తప్పదు.

నదుల విశిష్టత తెలిసినవారికి, అటు గంగ యెంతటిదో యిటు గోదావరి అంతటిది, మరి.

అయితే, రాత్రి వుండగానే వెడతారు శాస్త్రిగారు, గోదావరికి.

వెలుగు రాకుండానే–కనుచీకటి వుండగానే మళ్ళీ యిల్లు చేరుకుంటారు.

కనిపెట్టుకుని. వేచివుండి, ఆ దారిలో చూడాలి వారిని.

అందుకున్నూ సిద్ధపడ్డారు, ప్రభువు.

శాస్త్రిగారు వస్తున్నారు.

తడిగావంచా కట్టుకుని వున్నారు, వారు.

నెత్తిమీద, ధౌత వస్త్రాల పిడపలు, ఎడా పెడా.

నొసట విభూతి రేఖలు.

చేతిలో జలపూర్ణమైన కలశం.

నోటితో – మెల్లిగా – కానిస్ఫుటంగా – ఏదో పారాయణ.

మహారాజు తేజస్సు అపారం.

అయితే, పూర్తిగా రాజసం అది.

స్నానం చేసి, పట్టుబట్టలు కట్టుకుని–ఊర్ధ్వమండ్రాలునూ ధరించి వున్నారు వారు.

దేవేంద్రుడన్నట్టున్నూ వున్నారు.

శాస్త్రిగారి తేజస్సున్నూ అపారం.

శుద్ధ సాత్వికం అది.

సాక్షాత్తూ, పరమశివు డన్నట్టున్నారు, వారు.

ప్రభువు చకితులైనారు అల్లంత దూరానే ఆ తేజస్సు చూసి.

అయితే, వచ్చేస్తున్నారు వారు.

గోదావరి విడిచారు, మరి యింటో పడాలి వెళ్ళి.

"ప్రభూ, త్వరపడాలి" అన్నాడు దివాన్.

ముందు కురికారు, ప్రభువు.

దారికడ్డంగా నుంచున్నారు, దోసిలివొగ్గి.

"మహాత్మా, నమస్కారాలు" అన్నారు నమ్రులై.

"శుభం" అన్నారు శాస్త్రిగారు.

"నేను గంగాధర రామారావుని. తమ దర్శనం కోరి–"

"అయిందిగా?"

తప్పించుకుని బయలుదేరారు, శాస్త్రిగారు.

"మనవి" అంటూ వెంటపడ్డారు ప్రభువు.

"ఇంకేమిటీ?"

"పాదపూజ చెల్లించుకుంటాను. మా ద్రవ్యం–"

"వద్దు వద్దు గ్రామదేవత గుడి శిథిలం అయిపోతోందని ఆందోళన పడుతున్నారు జనులు. బాగుచేయించండి, వెళ్ళండి, వెళ్ళండి"

నిశ్చలంగా వెళ్ళిపోయారు, శాస్త్రిగారు.

చకితులై నిలిచి వుండిపోయారు, ప్రభువు.

నిజమే.
ఎవరిది మాత్రం డబ్బెందుకూ పండితుడైనవాడికి?
దినాలు గడిచిపోతున్నాయి.
ఏదో యేర్పాటయివుంది, అదివరకే, అందుకేదో వొక మార్గం.
కొత్తగా, డబ్బెందుకూ మళ్ళీ?
చెయ్యి చాపడమే అందుకోసం?
అందుకోసమేనా అంత చదువూ చదువుకోడం?
చదువుకోడం, ఈశ్వరలీలలు అవగాహన చేసుకోవడానికి, డబ్బెందుకు మరీ?
ఆనందం అదా, తెగతినడమా?
"మహారాజ్యం వా పాలయే న్మహాభాష్యం వా పాఠయేత్" అన్నాడు, తన వ్యాకరణ మహాభాష్యంలో భగవాన్ పతంజలి.
"చేతనైతే మహారాజ్యం పాలించు, లేదూ? మహా భాష్యం పాఠం చెప్పు" అని పతంజలి ఉద్బోధ.
ఒక్కొక్క విద్య అవగాహన అవుతూ వుంటే – అవధి యెక్కడ ఆ ఆనందానికి?
చిళ్ళ పెంకు కాదూ దాని యెదట డబ్బు?
మన విద్యల పరమార్థం యిది.
మన సంస్కారం స్వరూపం యిది.
మానవజన్మకున్నూ పరమావధి యిది,
జీవితం బుద్బుద ప్రాయం.
ఎప్పుడు చితికి పోతుందో యీ బుడగ.
ఈ భూమి కర్మక్షేత్రం.
వ్యక్తి కొక విధి యేర్పడి వుందిక్కడ.
అది నెరవేర్చుకోవాలా మనిషి.
యజ్ఞాలు చెయ్యడం – యజ్ఞాలు చేయించడం – చదువు కోడం – చదువు చెప్పడం – దానాలు చెయ్యడం – దానాలు పుచ్చుకోడం – ఇవీ బ్రాహ్మణ విధులు.
యజ్ఞాలు చెయ్యడం లోకకల్యాణం కోసం.
చదువు జ్ఞానం కోసం.
మరి డబ్బు?
కాలక్షేపానికి మాత్రమే, పోగులు పెట్టడానిక్కాదు.
కనక, దానికోసం పాకులాడ్డం బ్రాహ్మడైనవాడికి పతనం.
దేశంలో అనేకులున్నారు, పండితులు.
లోకంలో లెక్కే లేదు వారికి.
ఎందరున్నా రిది గుర్తించినవారు?
ఎందరున్నారు ఇదే చూసుకునేవారు?
ఇక ఫిలాసపర్సున్నారు వారి సంగతి మరీ ఘోరం.
వారి సంఖ్య అంతా యింతా కాదు.

ఈశ్వరతత్వం తెలుసుకోడానికి వారి చదువు.
కాని, పదవులు కావాలి, వారికి.
ప్రమోషను మీద ప్రమోషను కావాలి.
డబ్బు కావాలి, హద్దూ పద్దూ లేకుండా.
వైభవాలమీద వైభవా లనుభవాలి, వారు.
మన ఫిలాసఫీ లక్షణం కాదు.
పాశ్చాత్యుల దిది.
అగ్గిలో నెయ్యిపోస్తే?
భగ్గుమంటుంది.
దానిమీద కిరసనాయిలు పోస్తే?
దానికిన్నీ మీద పెట్రోలున్నూ పోస్తే?
ఏమిటి పర్యవసానం?
ఇదక్కరలేదు దానికి.
ఈ భూ మండలం చాలడంలేదు, జనానికి.
చంద్రమండలానికి వెళ్ళడానికి బయలుదేరుతున్నారు, వారు.
తరవాత, సూర్యమండలానికి వెడతారు.
తరవాత?
మరి, తరవాత్తరవాత?
హరోంహర.
సర్వం శూన్యం.
అప్పుడయినా వారి తృష్ణ తీరుతుందా?
అది వద్దన్నారు మనవాళ్ళు.
అది అణచిపెట్టుకోమన్నారు మనవాళ్ళు.
బతికివున్నంతకాలమూ నిశ్చింతగా – శాంతంగా – తృప్తిగా – బతకమన్నారు.
ఎగురుపాటు వద్దన్నారు.
అది నిష్ఫలం అన్నారు.
మూరె డెగబాకడమూ–బారెడు దిగజారడమూ–అవివేకం అన్నారు.
"లోకాస్సమస్తాస్సుఖినోభవంతు అన్నారు."

## 19

తిన్నగా వెళ్ళి, నాగేశ్వరరావుగారి ఆఫీసుగదిలో పెట్టుకున్నాను, నాట్రంకు.

"పెట్టుకున్నా"నంటే నేనయికాదు, పంతులుగారికోసం వచ్చాననగా, ఆఫీసు బోయీ చేశాడాపని.

ముందుముందొక సందర్భంలో అవసరం అవుతుంది, నా చిన్న కథల్లో వొకదాని స్ఫురణకున్నూ మూలం అవుతుంది, కనక యిప్పుడే చెబుతా నా బోయీ పేరు "వెంకన్న"

నేను వెళ్ళిన వొక గంటకు వచ్చారు నాగేశ్వరరావు పంతులుగారు.

వచ్చీ రావడంతోనే మేనేజరు వగైరాలు చెయ్యవలసిన నివేదనలు చేసి, పొందవలసిన ఆజ్ఞలు పొందసాగా రొక్క రొక్కరే.

రెండయేదాకా చూశాను, బయటివారున్నూ యెవరెవరో వచ్చి గంటలతరబడి వారితో మాట్లాడసాగారు.

అయితే, పరిశీలించగా, ఆ మాట్లాడేదంతా కాలక్షేపానికన్నట్లే కనపడింది.

ఇక వూరుకుంటే కాదని, అప్పుడు సాహసించాన్నేను, వారియెదట పడ్డానికి.

విశాఖపట్నం ఆంధ్రమహాసభ సందర్భంలో బ్రదర్ శ్రీరామశాస్త్రి పరిచయం చెయ్యడమూ, అప్పుడు వారు చేసిన వాగ్దానమూ జ్ఞాపకం చేశాను, ముందు.

తరవాత, వీరపూజ చేతి కందించాను.

కాని, "అయిదయాక మాట్లాడుకుందాం" అని చెబుతూనే కిందికి వెళ్ళి పోయారువారు, నా పుస్తకం నా కిచ్చేసి, మళ్ళీ.

ఈలోపున సంపాదకీయవర్గంతో పరిచయం చేసుకుందామని బయలుదేరాను.

వారిలో మొదటివారు కర్రా లక్ష్మీనరసింహం గారు.

వారడగ్గా, నా పేరు చెప్పాను, ముందు.

వెంటనే "ఎస్.ఎస్. శ్రీపాద" "అన్నమాట" అన్నారు వారు.

"అదేమి"టన్నా న్నేను.

"నా పేరు ఎల్.ఎ౯. కర్రా లెండి" అన్నా రాయన.

"వానపల్లి దుడ్డు" అనేవారు మా గురువు పురాణపండా మల్లయ్యశాస్త్రిగారు నన్ను" అని కూడా చెప్పారు.

ఒక కాలవకు ప్రసిద్ధి తెచ్చిన వూరు "వానపల్లి" అంటే.

అమలాపురం తాలూకాలో దది.

దుడ్డు కర్రా శబ్దానికి పర్యాయం.

పురాణపండావారి హాస్యధోరణి జ్ఞాపకం రావడమే కాదు, కర్రావారి బోళా తనమున్నూ బాగా బోధపడింది నాకు.

రామకృష్ణ కవులదగ్గిర చదువుకునేటప్పుడు, పిఠాపురంలో, మల్లయ్య శాస్త్రిగారి దర్శనమున్నూ చేసుకుంటూ వుండేవాణ్ణి. తరుచు, నేను.

ఒకనాడు వారం చెప్పకుని వస్తూ, రెడ్డికం వేసుక్కూచున్న శాస్త్రిగారి సన్నిధికి వెళ్ళాన్నేను.

శాస్త్రిగారే యేదో చెప్పసాగారు.

ఇంతలో వొక గడ్డికావటిమనిషి వచ్చి "వట్టిగడ్డి, కావాలా?" అనడిగాడు శాస్త్రిగార్ని.

"అక్కర్లే"దన్నారు వారు, కొంచెం విసుగ్గా.

కాని గడ్డిమనిషి విడిచి పెట్టలేదు, వారిని.

"సామర్లకోటనుంచి తెచ్చాట్ట అది. దాళవాగడ్డిట. పచ్చుకుచ్చులు పనికిరావుట దాని దగ్గిర. అది చేతిలో వుండగా చేస్తే మీటపడిపోతాయట, పశువులు వచ్చి–"

మాట కడ్డం వచ్చి "అదే జరుగుతోందిప్పుడు" అన్నారు శాస్త్రిగారు.

ఆ మనిషి కర్థం కాలే దది.

పోనీ అని వూరుకోవచ్చా, "చెప్పినధరకి బేడతక్కువ చేసుకోం" డన్నాడు. "మీరు కనక, పోనీ పావలా తగ్గించు కోండి" అన్నాడు కూడా.

అసలే చిరాగ్గా వున్న శాస్త్రిగారికి మంట వచ్చింది, దీంతో.

కాని, గంభీరంగా చూస్తూ – చల్లగానే – "మరి తులం యెంతకిస్తా" వనడిగారు శాస్త్రిగారు.

తెల్లపోయాడు గడ్డిమనిషి, దీంతో.

నవ్వాపుకోలేకపోయా న్నేను, దానా దీనా.

"ఏం నవుతారేం? పట్టుకుచ్చులు తులాలలెక్కనేగా అమ్ముతారు?" అనడిగారు శాస్త్రిగారు.

అదిగో, ఆ మల్లయ్య శాస్త్రిగారి శిష్యులు, కర్రా వారు.

పది నిమిషాల్లోనే సన్నిహితులం అయిపోయాం మేము, దీంతో.

నేనడగ్గా "చెప్పవలసిం దేమీలేదు. ఆంధ్రపత్రిక బొంబాయిలో వుండినప్పణ్ణుంచీ పనిచేస్తున్నా న్నేనీ ఆఫీసులో. పంతులుగారి మనస్సులో యేమివుంటే అదే బయటికి వస్తుంది, మాటలరూపాన. బయటికివచ్చిన మాటకూడా యథాతథంగా జరిగి పోతుంది. దంభం లేదు వారిదగ్గర. టెక్కూ, దాపరికాలూ లేవు. మాయ అన్నది అసలే లేదు. కాని, సమయం గుర్తించుకోవాలి. కనిపెట్టుకునిన్నీ వుండాలి, కొన్నాళ్ళు, అంతే" అని చెప్పారు లక్ష్మీనరసింహంగారు, పంతులుగారి విషయమై.

అప్పటికయిదు కాగా, పంతులుగారి గదిలోకి వెళ్ళాన్నేను.

అప్పుడే వచ్చి కూచుంటున్నారు, వారు.

మళ్ళీ పుస్తకం చేతి కిచ్చాను.

ఎవరో వచ్చి కదిపేదాకా పుస్తకం అంతా తిరగవేశారు వారు, పేజీ అరపేజీ చొప్పున చదువుతూ.

వారు పుస్తకం కిందపెట్టాక మాట్టాడదా మనుకున్నాన్నేను.

కాని, ఉన్నట్టుండగా, యిద్దరు పెద్దమనుష్యు లెవరో వచ్చి "రావలసినవా రందరూ వచ్చారు" అని చెబుతూ దగ్గిర వుండి పంతులుగారిని "దయచెయ్యాలి" అంటూ కూచున్నారు.

అదృష్టవశాన వొక గుమాస్తా నుంచుని వున్నా డక్కడ, పంతులుగారి సావధానతకోసం చూస్తూ.

ఆయన, జీతంలో కొంత అడ్వాన్సు ఇమ్మని అడగడమూ, పంతులుగా రాయనికి స్లిప్పు రాసియివ్వడమూ క్షణంలో జరిగిపోయాయి.

ఇంతలో నేను కనబడ్డాను, వారికి.

"వీరికి బస చూపించు" అని ఆ గుమాస్తాతో చెబుతూనే, వచ్చిన పెద్దమనుష్యులతో వెళ్ళిపోయారు, వారు.

ఒక మూలగది చూపించాడు నా కా గుమాస్తా, తానే నా ట్రంకు పుచ్చుకుని బయలుదేరి.

"మీ రిక్కడ స్వేచ్ఛగా వుండవచ్చు నెన్నాళ్ళయినా" అని కూడా చెప్పారు.

చెబుతూ చెబుతూనే నిదానంగా చూశారు, నాకేసి.

"మీరు వేదం చెప్పుకున్నారా?" అనడిగా రాయన.

"కొంచెం చెప్పుకున్నాను"

"అయితే, మీ వేషం యిది కాదు, మొదణ్ణుంచీ"

"నిజమే, కాదు"

"ఏడెనిమిదేళ్ళక్రితం యేలూరు వచ్చారు మీ రొకమాటు"

"అవును, వచ్చాను"

"అప్పుడు మీ గురువుగారూ మీరూ మా యింటోనే బస చేశారు"

"అయితే, మీ యింటిపేరు పిశుపాటివారా?" అనడిగాన్నేను.

"అవు"నన్నా రాయన.

దీంతో, ఆ యేలూరి వృత్తాంతం అంతా నెమరుకి వచ్చింది, నాకు.

మా గురువులు ప్రవాపర్వతావధానులు గారంటే ఆయన తండ్రి కెంతో భక్తి. దసరాలో, వేదవేత్తలను మూడురోజులూ మృష్టాన్నతృప్తులను చేసి, సత్కరించేవారు కూడా ఆయన.

నేను రెండు ప్రశ్నలు చెప్పాను వారికి, రెండూ నేను చెప్పినట్టే జరిగాయి.

తన పేరు "సత్యనారాయణ" అంటూ, ఆ గుమాస్తా, ఆ ప్రశ్నల సంగతిన్నీ జ్ఞాపకం చేశారు.

ఈ విధంగా, కర్రా లక్ష్మీనరసింహంగారూ, పిశుపాటి సత్యనారాయణగారూ నాకు బాగా సన్నిహితులయివారు, నేను మద్రాసు ప్రవేశించిన్నాడే, ఆంధ్రపత్రిక ఆఫీసులోనే.

మద్రాసు అంటే యేదో దూరదేశం అన్న భయం పోయింది, నాకు.

## 20

తొలినాటి ఉదయం పది దాటాక వచ్చాను, సెంట్రల్ స్టేషన్నుంచి ఆంధ్రపత్రిక ఆఫీసుకు.

ట్రాములు, జట్కాలు, గుర్రబ్బళ్ళు, వొంటెద్దుబళ్ళు, లాగుడు బళ్ళు, రిక్షాలు, మోటార్లు, సైకిళ్ళు, మోటారు సైకిళ్ళు – వాటి మధ్య జనుల రాకపోకలు–బహూ సమ్మర్దంగా వుంది, రోడ్డంతా.

ఆ సమ్మర్దం తంబుచెట్టివీధిదాకా వొక్కలాగే వుంది.

అంత వెడల్పాటి వీధులూ, అన్ని యాన సాధనాలూ, అంత సమ్మర్దమూ అక్కడే చూడ్డం నేను, మొదటి మాటు.

కొత్తమనిషి – ముఖ్యంగా పల్లెటూరినుంచి మొదటి మాటు వెళ్ళినవాడు, నిరపాయంగా నడిచి వెళ్ళడం చాలా కష్టం అక్కడ.

అంచేత, ఆ బజారూ, ఆఫీసులూ తెరవకముందా చైనా బజారు – ఇప్పుడు సుభాసురోడ్డు ఎలావుంటుందో చూడాలనిపించింది.

వెంటనే బయలుదేరాను సెంట్రల్ వైపు, ఉదయం యేడు దాటాక.

అటే బయలుదేరడాని కొకటే కారణం.

వచ్చినపని కావడం అంటూ వస్తే, అది, ఆంధ్రపత్రిక ఆఫీసులో.

లేదూ, వెనక్కి మళ్ళీ రెయిలెక్కడం సెంట్రల్ స్టేషనులో.

తక్కిన మద్రాసుతో నా కేమీ పనిలేదు, నిర్దిష్టం.

చేతిలో వున్న డబ్బు బహూ కొద్ది.

కనక, యెలాగయినా వారంలోపునే అటోయిటో తేల్చుకోవాలనుకున్నాను.

ఈ వ్యూహాతోనూ, యీ తొందరతోనూ ఆ దారీ, ఆ స్టేషనూ బాగా జ్ఞాపకం పెట్టుకోవాలని బయలుదేరా నటు.

దారి తప్పిపోకుండా వుండడానికి ట్రాములైను వెంబడే బయలుదేరాను, పచ్చయ్యప్ప కాలేజీ దగ్గిరివున్న జీలిక గుర్తు పెట్టుకుని.

మాంచి రద్దీసమయాన రాజమహేంద్రవరం పెద్దబజారున కంటే యెక్కువగానే వుంది, అనిర్వ్యాపార స్థితిలో కూడా, అక్కడ సమ్మర్దం.

రాజమహేంద్రవరం యెదట, పొలమూరు, సంతసొకళ్ళంత.

మరి, మద్రాసు యెదట రాజమహేంద్రవరం?

పొలమూరు, చెరువునీటిలాగ స్తంభించిపోయి వుంటుందెప్పుడూ.

రాజమహేంద్రవరం, గోదావరీ ప్రవాహంలా వుంటుంది, ప్రగమన శీలంగా.

మరి, మద్రాసు?

సముద్రంలా అల్లకల్లోలంగా కనపడింది నాకు.

పొలమూరిలో ఉత్సాహమే కనపడదు, కంచుకాగడావేసి వెతికినా.

రాజమహేంద్రవరంలో కనపడుతుందది, యే కొంచెమో.

ఇక, మద్రాసు చూస్తామా, ఉత్సాహమేకాదు, ఉద్వేగమూ వుందక్కడ. అతిమాత్రంగా.

పొలమూరిలో చురుకేలేదు, అగత్యమూ తక్కువే అక్కడ.

రాజమహేంద్రవరంలో ఉందని చెప్పవచ్చు, సందేహం లేదు.

మద్రాసు తుపానన్నట్టుంటుంది.

ఏపనయినా, గంటలో తేలిపోయేట ట్టనిపించిందినాకా వాలకం చూస్తే మరి, బందరులో.

క్షణాలమీద లెక్క అక్కడ.

నిమిషం దాటిందా, కొంపలంటు కుంటాయక్కడ.

బుర్ర లెగిరి పోతాయి.

అయితే, పొలమూరిలో వుందా మానవత్వం, రాజమహేంద్రవరంలో వుందా, మద్రాసులో వుందా, లండనులోవుందా, స్వస్వరూపంతో?

ఇదిగో, యీ యెరుక – యీ లోకజ్ఞానం కలగాలంటే ముందు, ఇల్లు విడిచి పెట్టాలి, మనిషి.

ఊరు విడిచి పెట్టాలి.

తాలూకా దాటాలి.

అటూ యిటూ జిల్లాలు దాటాలి.

ఇరుగు పొరుగు రాష్ట్రాలు దాటాలి.
కనీసం, ఎడా పెడా అయినా ఖండాలు దాటాలి.
అప్పుడవుతాడు మనిషి – అనుభవపరుడు.
మనుష్యమేధకు అవధులు కనపడతాయప్పుడు, కొంచెం కొంచెం.
ఉక్కుతో యెంత గొప్ప యంత్రం నిర్మించినా మనుష్యయంత్రం దగ్గిరి గడ్డిపరక, అది.
కనక?
యంత్రం నడుపునట్టే – యంత్రం నడుపుకునేకన్నా యెక్కువగా కూడా నడుపుకోవాలి మనుష్య యంత్రం.
జాతిసంపద మనిషి, అటు బంగారమూ కాదు, యిటు మానవ నిర్మాణాలూ కావు.
మనుష్యసంఖ్య యెంత ముమ్మరంగా వుంటే అంత బలం జాతికి.
ఆ మనుష్య సంఖ్య యెంత సంస్కృతం అయివుంటే అంత వికాసం జాతికి.
జాతీయ నిర్మాతలయినవారు చూసుకోవా లిదంతా.
మరి జాతీయ నిర్మాత?
కవి.
జాతికి సంస్కారం కలిగించగలవాడు–తద్వారా, జాతికి ఉన్నతో అవనతో కలిగించగలవాడు కవి.
మరెవరూ కాదు.
కనక, కవి అయినవాడు తాను జగద్గురువు నని గుర్తించుకోవాలి.
ఆ స్థితి సాధించుకోవాలి, ముందు.
అప్పుడూ కవి అనిపించుకోడం అతను.
అయితే, మన కవుల్లో యెంతమంది కుందీ యోగ్యత?
పోనీ, మన పెద్దల్లో నయినా యెంతమంది కుందీ జ్ఞానం?
సెంట్రల్ అంతా వొక్క గంటసేపు కలయచూసి యిలా అనుకుంటూ వెనక్కి మళ్ళాన్నేను, వాల్టాక్సు రోడ్డుకి మళ్ళకుండా బాగా జాగ్రత్తపడి.
బజారంతా బాగా తెరిచివుంది.
మద్రాసు జీవనం నూట అయిదు డిగ్రీలమీద ప్రవర్తిల్లు తోంది, అప్పటికప్పుడే.
విశ్వరూపం సాక్షాత్కరించింది, మసక మసకగా.
ఉత్సాహం తరంగితం అవుతోంది, వీధుల్లో.
ఉద్రేకం ఉత్తరంగితం అవుతోంది.
ఉల్లాసం వురకలు వేస్తోంది.
ఆనందం వెల్లివిరుస్తోంది.
అనుమానం దోబూచులాడుతోంది.
తొట్రుపాటు కనపడుతోంది.
కంగారు పరుగు లెత్తుతోంది.

దుఃఖం పెల్లుబుకుతోంది.

నిర్వేదం తూలిపడుతోంది.

అటు లయం–ఇటు సృష్టి.

అటు సంహారం – యిటు విహారం.

జీవనజ్యోతులు – మృత్యుచ్ఛాయలు – చివరికి అద్వైతానుభూతి – ఇలా వుంది, మద్రాసు ప్రవృత్తి.

శరీరం వొణికింది.

మనస్సు ఉద్రూతలూగింది.

హృదయం స్పందించింది.

జీవనసరణి సమన్వయం కా జొచ్చింది.

ఈ మైకంలో బ్రాడ్వేదాటేటప్పటికి "మీరు రాజమండ్రీనుంచి వచ్చారా?" అనడిగా డొక యువకుడు, సప్రయత్నంగా పక్కగా నడుస్తూ.

గూడకట్టు – గోష్పాద మాత్రం జుట్టు – మీసాల్లేని మొగం – ఆహారం – చూడగా తమిళుడన్నట్టున్నా డాయన.

తనపేరు "కృష్ణస్వామి శర్మ" అని చెప్పాడు.

తమిళదేశం నుంచే వచ్చాడక్కడికి.

పూర్తిగా తమిళుడే అతను.

కాని–చిన్నప్పుడు తెలుగుదేశంలో (పశ్చిమ) గోదావరి జిల్లా కాకరపర్తి అగ్రహారంలో సంస్కృతం కావ్యనాటకాలు చదివాడు, చాలా రోజులు.

ఆంధ్రపత్రికలో ప్రూఫ్ రీడరుగా పనిచేస్తున్నాడప్పుడు.

ఈ వివరాలతో నాకతను బాగా సన్నిహితుడైనాడు.

ఆంధ్రపత్రిక ఆఫీసు చేరుకునేటప్పటికి నాకు మరో ఆత్మీయుడు దొరికా డనిపించింది.

## 21

ఆవేళా, మర్నాడూ కూడా చాలా ప్రయత్నించాను. ఎటూ తేలలేదు, నా పని.

"చూస్తాను, చెబుతాను" అని తప్ప మరోమాట లేదు, పంతులుగారు.

అసలీ ప్రస్తావన చెయ్యడానికే అవకాశం చిక్కడం కష్టం అయిపోతూ వచ్చింది, వారితో.

రకరకాల మనుష్యులు చుట్టుకుని వుండేవారు, వారినెప్పుడూ, అందరితోనూ వొక్కలాగే మాట్లాడేవారు వారు.

విసుగన్నదీ, చిరాకన్నదీ కూడా కనపడలేదు, వారి దగ్గర.

ఏమిటేమిటో మాట్లాడం – కొంతసేపయాక – రకరకాలుగా డబ్బు ప్రస్తావన చెయ్యడం చివరికెంతో కొంత పట్టుకుపోడం – ఇదీ అ వచ్చేవారిలో చాలా మంది ధోరణి.

వ్యవహారాలు మాట్లాడేవారు చాలా తక్కువ పంతులు గారితో.

నేనూ వొక అర్థినే. నేనూ తక్కిన వారిలాగే ప్రయత్నించనా, కనీసం డబ్బయినా పట్టుకుపోడానికి?

కాని, అలా మాట్లాడం నా కిష్టంలేదు.

అలాగ డబ్బులాగడం నాకు చేతాకాదు.

ఇంతకీ,–

వీరపూజ విషయం నేనుబలవంతం చేసింది కాదు.

పంతులుగారే వాగ్దానం చేశారు అవ్యవధానంగా, నా స్థితి నేను చెప్పకోను.

"మీ రచ్చు వేయించతగ్గ గ్రంథం వీరపూజ, మీరు సాయం చెయ్యవలసినవాడు సుబ్రహ్మణ్యశాస్త్రి" అని చెప్పాడే గాని, శ్రీరామశాస్త్రి అయినా నిక్కచ్చి చెయ్యలేదు, పంతులు గారిని.

అయినా, మళ్ళీమళ్ళీ అడిగితే యేమిటో, అడక్కపోతే యేమిటో?

శ్రీరామశాస్త్రి పొక్తుపరిచిన వ్యవహారం నాకు నేనే పాడుచేసుకుంటానేమో?

"మీరూ విసిగిపోవద్దు. పంతులుగారినీ విసిగించావద్దు" అని సలహా చెప్పారు, కర్రా లక్ష్మీనరసింహంగారు, నా అందోళన చూసి.

"పంతులుగారికే కాదు, ఆంధ్రదేశానికే సర్వాధారం అమృతాంజనం. ఆంధ్రపత్రికా అలాంటిదే అచ్చంగా. అయితే ఆంధ్ర పత్రిక బతుకు అమృతాంజనం గుప్పిట వుంది. ఆంధ్రులు కాదు, దానిని నిలవబెడుతున్నది. కనక, మీ పనిక్కంటే మీకూ, మా పనిక్కంటే మాకూ గూడా ఆ రెండూ ప్రధానాలు. పంతులుగారి స్వస్వరూపం అవగాహన అయిందా? మీరు కొత్తవారు. సాహసించి, ముందుకి చొరుచుకుపోయే స్వభావం కానట్టుంది, మీది. ఊపిరాడకుండా పాతవా రెప్పుడూ చుట్టుకుని వుంటారు పంతులుగారి నెప్పుడూ. పంతులుగారు చెప్పింది చేసే వారికంటే, యేదో విధంగా వారి నిరుకున పెట్టి డబ్బు నొల్లుకుపోయేవారే యెక్కువ, వారిలో. అదొక పద్మవ్యూహం. భేదించుకుని బయటపడలేరు పంతులుగారు. అంచేత, కొత్తవారి పని కొంత ఆలస్యం కావచ్చు. అవుతుంది కూడా తప్పదు. అయినా, వోపిక పట్టడమే నా సలహా మీకు" అనిన్నీ చాలా గట్టిగా చెప్పారు వారు.

పైగా, – పంతులుగారు వేసుకున్న పథకం పక్వానికి వచ్చిందా, యింకా వూహలోనే వుందా?

పూర్తిగా కొత్తవాణ్ణి, నాతోనే అది ప్రారంభం కావడం సంభవమా?

శ్రీరామశాస్త్రి మళ్ళీ ప్రయత్నం చెయ్యవలసి వుంటుందా?

ఇలా కూడా చర్చించుకున్నా న్నేను.

కాక,–చేసేది మాత్రం యేమివుందీ?

తలో అయిదూ తలో పదీ యిచ్చి మూడువందలు నాకు కూర్చిపెట్టలేని మా ప్రాంతంవా రటూ, ఏదో వొకటి, అందరికీ యిస్తూవుండడమే చేతనయిన పంతులుగా రిటూను.

వారి వాగ్దాన విషయమై నిరాశ చేసుకుంటే, మరి గతి?

కేవలమూ అదృష్టం నమ్ముకుని వుండిపోయా న్నేను.

దినాలుగడిచేవి.

వారాలు వెళ్ళిపోయేవి.

విసిగిపోయేవాణ్ణి.

అభిమానం ముంచుకువచ్చేది.

చల్లబడిన్నీ పోయేవాణ్ణి, చివరికి.

ధనికులకు అవగాహన అయేది కాదు, నా యాతన.

కేవలం ధనికులు తీర్చగలదిన్నీ కాదు.

ఓపిక పట్టడం తప్పనిసరి అయిపోయింది, నాకు.

"ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యః"

కుమారసంభవం పూర్తి చేశాను, మేఘసందేశం ప్రారంభించాను - ఆ సందర్భంలో వొక పెద్దమనిషి చేతిలో కనపడింది, పంచతంత్రం నాకోనాడు.

అదే మొదటిమాటు నేనది చూడ్డం.

అడిగిపుచ్చుకుని, పుస్తకం తెరిచాను.

చూడగా, ఈ వాక్యమే కనపడింది మొదటి మాటు నాకు.

నాకేకాదు, మానవలోకానికంతకూ వున్న అనుభవాన్ని పట్టి పుట్టిన సిద్ధాంతం యిది.

చూశాను, నమ్మేశాను, గట్టిగా.

కనక, అప్పణ్ణుంచీ నమ్ముకునే వున్నాను కూడా యిది.

అప్పటి నా స్థితి సరిగా యిది.

ఈ స్థితిలో అంతర్నాటకాలు.

వేంకటరామా అందుకో అప్పుడప్పుడే మారాకు వేస్తోంది.

అన్నదమ్ము లిద్దరూ - వెంకటరావుగారూ, వెంకయ్యగారూ నాలాగే మరో గదిలో వుండేవా రాంధ్రపత్రిక ఆఫీసులోనే.

జిల్లా భూగోళాలవంటి చిన్న చిన్న పుస్తకా లచ్చువేయించుకుంటున్నా రక్కడ, స్వయంపాకం చేసుకుంటూ.

ఒకనాటి రాత్రి భోజనానంతరం నా గదిలోకి వచ్చారు వెంకయ్యగారు.

ఏమిటేమిటో మాట్టాడారు, చాలా సేపు.

పుస్తకాలు ప్రకటించడం అంటే, వొకరి సహాయం వల్ల అయేది కాదన్నారు.

"పాతిక రూపాయలిస్తాం, వీరపూజ మాకిచ్చేసి వెళ్ళిపొండి" అన్నారు, చివరికి.

పుస్తకాల వ్యాపారమే కాదు, ఏ వ్యాపారమూ సాగదు, పెట్టుబడి చేతిలో లేనిదే.

నాకున్నూ బాగా తెలిసిందే యిది.

తగిన ప్రతిఫలం యిచ్చేవారు లేకే నేను సొంతంగా పుస్తకాలు ప్రకటించుకోడం.

తగిన ప్రతిఫలం అంటే పాతికరూపాయ లొక ప్రతిఫలమేనా?

నాలుగు మాసాలు పట్టింది వీరపూజ పూర్తి చెయ్యడానికి.

ఆ రోజుల్లో నయినా పాతిక రూపాయలు సరిపోతాయా, నాలుగు మాసాలు కూచుని తినడానికి?

మరో విధంగా కాలక్షేపం చేసేనా పుస్తకాలు రాయవలసింది గ్రంథకర్త?
అప్పుడే చెప్పేశాను వారికి "ఏమిచ్చినా వీరపూజ యివ్వ"నని
చాలకపోయినా, చేతిలో నిలిచి వుండకపోయినా కొందరి వల్ల కొంతకొంత సాయం సంపాదించుకుని వున్నా నప్పటికేనేను.
మరి, అప్పుడు కాఫీరైటు అమ్ముకుంటే వారి నందరినీ యేమిచేసినట్టు నేను?
కనక, మీకే కాదు, మరెవరికీ యివ్వననిన్నీ చెప్పేశాను, వారికి.
మిత్రులు పాలపర్తి రామమూర్తి గారున్నూ వున్నారప్పుడు మద్రాసులో.
"మన శత్రువులు (?) అన్న పుస్తకం అచ్చువేయించుకుంటున్నా రప్పుడు ఆంధ్రపత్రిక ప్రెస్సులోనే, ఆంధ్రపత్రిక ఆఫీసులోనే వుంటూ."
కలుసుకున్నది మొదట బాగా అభిమానించుకున్న వారిలో వారొకరు నన్ను.
"పబ్లిష రన్నవారి కెవరికీ యివ్వవద్దు. ఎప్పటికయినా వీరపూజ, స్వయంగా మీరే ప్రకటించుకోడం శ్రేయస్కరం" అని చెప్పారు వారు, దృఢంగా.
"పూనుకున్నవారు నాగేశ్వరరావు పంతులుగారు. మరొక రయివుంటే యిదివరకే వెళ్ళిపొమ్మని చెప్పివుందును మీకు" అని కూడా అన్నారు వారు.
ఒక వారం గడిచింది, మళ్ళీ.
"వచ్చినపని కాకపోతే యేమిటీ చెయ్యడం?" అన్న ఆలోచన పట్టుకుంది, మళ్ళీ వొకనాటి రాత్రి.
పడుకుని వున్నవాణ్ణలా లేచి కూచుని, వున్న రూపాయ లెన్నో లెక్క చూసుకుని, యెనిమిది రూపాయలు వేరే పొట్లంకట్టి, పెట్టె అడుగున పడేసి పడుకున్నాను, ముందు.
"తక్కిన డబ్బు అయిపోయేదాకా చూడ్డం. ప్రయోజనం లేదూ? వెంటనే రెయిలెక్కి యింటికి వెళ్ళిపోడం" అని స్థిర పరుచుకున్నాను, గట్టిగా.
సమయానికి, చేతిలో డబ్బులేక ప్రయాణం సాగని స్థితి యేర్పడకుండా వుండాలని చేసుకున్నపని అది.
"రేపు గట్టిగా ప్రయత్నించాలి" అనిన్నీ అనుకున్నాను.
కాని, ఆఫీసుకే రాలే దావేళ పంతులుగారు.
ఆ మర్నాడు వచ్చారు, మూడవుతోందనగా.
వారు రావడం తడువుగా యెదటికెళ్ళి నుంచున్నాన్నేను.
అప్పుడన్నారు పంతులుగారు "కంపోజు చేయిస్తాను, విడి కాగితాలమీద రాయండి గ్రంథం" అని.
ఉత్తరక్షణంలో ప్రారంభించా నాపని నేను.
ఇకముందు ఆలస్యం అయితే, అందుక్కారణం నే నయి పోతాను.
అంచేత, రాత్రీపగలూ కూడా చాలా శ్రద్ధ పట్టానందుకు.
రెండురోజుల్లో పూర్తయి పోయింది చంద్రగుప్త చక్రవర్తి చరిత్ర.
అయితే, అనుకోని అభ్యంతరం వొకటి వచ్చిపడింది, అమాంతంగా.
గదిలో కూచుని రాసుకుంటున్నాను.

రమ్మని వర్తమానించారు పంతులుగారు.

మొదటి ప్రపంచ సంగ్రామం బహూ ముమ్మరంగా జరుగుతున్న దినాలవి.

అచ్చుపడ్డ ప్రతీకాగితమూ నిశితంగా పరిశీలిస్తున్నారు పోలీసులు, రాజద్రోహ ప్రచారం జరుగుతోందేమో అని.

ఈ సంగతి చెప్పి "లక్షరూపాయల ప్రెస్సు నాది. పరప్రభుత్వంతో యుద్ధాలకు సంబంధించిన రచన మీది. బయటికి రావడం తడువుగా పోలీసులది తప్పకుండా పరిశీలిస్తారు. ఏ మాత్రం సందున్నా నేను చిక్కుపడతాను ముందు. కనక, మీరు, మీ రచన చెన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారికి వినిపించి రండి. నేను చీటీయిస్తాను వారికి. వీరపూజవల్ల యెలాంటి చిక్కూ రాదని జవాబు రాయించుకురండి వారిచేత" అన్నారు పంతులుగారు.

## 22

మంచిదే యిది, పంతులుగారికే కాదు, నాకూ శ్రేయస్కరమే.

నేనే శ్రద్ధ పట్టవలసిందిన్నీ యిది.

ప్రభుత్వం మీద తిరుగుబాటు చేద్దామనీ, ప్రాతికూల్యం ప్రచారం చేద్దామనీ అప్పటికేకాదు, ఇప్పటికీ గూడా, యేకోశానా లేదు, నాకు.

నా మార్గమే కా దిది.

గ్రంథరచనే జీవిత లక్ష్యం నాకు.

నేను సాధించవలసింది చాలా కనపడుతోంది, అప్పటికే నా కందులో.

జాతికి నవ్యదృక్పథం అలవర్చి దేశానికి – తెనుగు దేశానికి భారతదేశంలో మహోన్నత ప్రతిపత్తి కలిగించడం నా సంకల్పం.

కనక, అప్రయత్నంగానైనా – అతర్కితంగానైనా – అజ్ఞాతంగా నయినా నా రచనలో అందుకుతగ్గ భావాలేగాని, ప్రభుత్వం మీద ప్రతికూల భావాలుండడం నా వుద్దేశం కాదు.

అంచేత, యిష్టాపూర్తిగానే బయలుదేరాన్నేను శ్రీ భానుమూర్తి పంతులుగారి దగ్గిరికి.

ఛీఫ్ తెనుగు ట్రాన్సులేటరయి వున్నారు వారు, అప్పుడు సర్కారుకి.

నా సంగతి కొంచెం చెప్పకున్నాను, వారికి, ముందు.

నా ప్రయత్నం వివరించి, నాగేశ్వరరావుగారి సందేహం అనువదించాను, తరవాత.

"ఎప్పుడూ–యెక్కడా–యెవరూ చేసివుండని ఆక్షేపణలు చేశాను కొన్ని, నే నిందులో. రాజద్రోహం నా మార్గం కాదు. నాకు సాయం చెయ్యడానికి పూనుకున్నారు నాగేశ్వరరావు పంతులుగారు. వారికి చిక్కులు రావడం తెనుగుజాతికే శ్రేయస్కరం కాదు. కనక, స్థూలంగా కాదు, సూక్ష్మంగానే పరిశీలించండి, బాగా, మీరు. వల్లకాదంటే యీ గ్రంథమే ప్రకటించడం మానుకుంటాను; కాని నా సిద్ధాంతాలూ, నా ఆక్షేపణలూ మార్చుకోనూ, ఉపసంహరించుకోను" అని స్పష్టంగా మనవి చేశాను చివరికి.

నాగేశ్వరరావుగారిదే అనుకుంటే భానుమూర్తిగారిదీ అమృత హృదయమే, పూర్తిగా.

దీనికి సాయం, మంచి సాహిత్యపరులు వారు.

కవులు.

కాగిచల్లారిన పాలవంటి ప్రకృతి వారిది.

అన్నిటికంటే విశేషం – డాబుదర్పా లెరగని వారున్నూ, వారు.

పోలీసుల కనుమానం తగిలిన తెనుగు రచన లన్నీ వారి దగ్గిరికి వెడతాయి.

అవన్నీ యింగ్లీషులోకి మార్చి సర్కారుకి చూపించాలి వారు.

అంటే, తెనుగు వాఙ్మయం విషయమై వారిమాట వేద వాక్యం సర్కారుకి.

ఇది చాలు, వారి పదవీ – వారి బాధ్యతా యెలాంటివో తెలుసుకోవాలంటే.

తుంగచాప స్వయంగా పరిచి, తమ పక్కన కూచోపెట్టుకున్నారు వారు, నన్ను.

మామూలు గృహస్థ మర్యాద అంతా కనపరిచారు.

అయిదు రాత్రులు పట్టింది వీరపూజ పూర్తిగా వినడానికి వారికి.

కొన్ని వాక్యాలూ, కొన్ని పేరాలూ "మళ్ళీ మళ్ళీ" అంటూ చాలామాట్లు చదివించుకున్నారు వారు.

కొన్ని చోట్ల, నన్ను ఆగమని – కళ్ళు గుచ్చేసుకుని కూడా ఆలోచిస్తూ వచ్చారు, వారు.

నాలుగో నాటి సాయంత్రం నేను వెళ్ళాటప్పటికి, మిత్రులు రాయప్రోలు సుబ్బారావుగారు కూచుని వున్నారు, వారి దగ్గిర.

వారి న్నాకూ, నన్ను వారికీ పరిచయం చేశారు భానుమూర్తిగారు, అవ్యవధానంగా.

తరవాత లోకాభిరామాయణం ప్రారంభించారు, వారే.

టాగూరుగారితో ప్రారంభమై గాంధీగారి మీదికి వెళ్ళిందది, కొంతసేపటికి.

నేటాలు విడిచివచ్చి, మనదేశంలో స్థిరపడే ప్రయత్నంలో వున్నారు, గాంధీగా రప్పుడు.

వారు వచ్చాక, మనదేశం, కొత్తదారిన పడుతుందని సుబ్బారావుగారు.

నాకూ తెలుసు అది, కాని, ఆ కొత్తదారి పెడదారి అవుతుందని నేను.

ఎవరి కారణాలు వారం చెప్పకున్నాం.

చాలా పట్టుదలగానే వాదించుకున్నాం మే మిద్దరమూ కూడా.

మధ్యమధ్య భానుమూర్తిగారూ కలగజేసుకుంటూ వచ్చారు, వాదంలో; కాని సుబ్బారావుగారినీ సమర్థించలేదు, వారు, నన్నూ సమర్థించలేదు.

"సరే, గాంధీగారి పూర్వచరిత్రనుబట్టి తోచిన వూహలు మనవి. నా వాదం స్థిరపడాలన్నా, మీ వాదం స్థిరపడాలన్నా–వారిక్కడికివచ్చి రాజకీయాల్లో ప్రవేశించాక, పదేళ్ళయినా గడవాలి" అనుకున్నాం సుబ్బారావుగారూ నేనూ కూడా.

తరవాత, చాలా రోజులకు, అఖిలాంధ్రకవి పండిత పరిషత్తు జరిగింది, రాజమహేంద్రవరంలో.

అధ్యక్షవరణ ప్రసంగం వచ్చినప్పుడు "సుబ్బారావుగారిని పిలుద్దాం" అన్నారు, వారి మిత్రులు.

వారిలో భావరాజు వేంకటకృష్ణారావుగారు ప్రముఖులు.

నేను ప్రతిఘటించాను.

సాహిత్యం సందర్భంలో సుబ్బారావుగారికీ నాకూ భిన్నాభిప్రాయాలు లేవు.

సుబ్బారావుగారి శక్తిసామర్థ్యాలూ, రచనా ప్రౌఢీ నాకు తెలియనివీ కావు.

జనులకు – సాహిత్య ప్రియులైనవారికి, వారి యెడలగల భక్త్యాదరాలున్నూ బాగా తెలుసు నాకు.

కాని, అప్పటికి, కొద్ది కాలంగా మౌనముద్రాంకితులయి వున్నారు, వారు.

అంటే వారి, కొత్త రచనలూ బయటికి రావడం లేదు, సాహిత్య క్షేత్రంలో వారి ప్రగతీ కనపడ్డం లేదు.

పైగా, కొందరు సమర్థులు, బ్రహ్మేస్త్రాలన్నట్టు, కొత్తగా చొరుచుకు వస్తున్నారు, ముందుకి.

ఈ కారణాలు చెప్పి ప్రతిఘటించాన్నేను.

కాని, వారి పేరు ప్రతిఘటించినవారు తమ వాదమే పట్టుక్కూచ్చున్నారు.

నేను, నా అభిప్రాయం చెప్పి వూరుకున్నాను.

నా ప్రతిఘటన వీగిపోయింది, అతి సులభంగా.

సుబ్బారావుగారే వచ్చా రధ్యక్షులుగా.

ఇప్పటి మునిసిపల్ హైస్కూలు భవనావరణంలో జరిగిందా సమావేశం.

గోదావరి స్టేషనులోనే స్వాగతం చెప్పి, సరాసరీ సభాస్థలికే తీసుకువచ్చారు, సభానిర్వాహకులు, సుబ్బారావుగారిని.

సభాస్థలిలో అనేకులతో పాటు నన్నూ పరిచయం చేశారు, వారు, సబ్బారావుగారికి.

భానుమూర్తి పంతులుగారి యింటో కలుసుకున్న అన్నాళ్ళకి, అదే, మే మిద్దరమూ మళ్ళీ కలుసుకోడం.

దేశంలో యెన్నో జరిగాయి, మంచి చెడ్డలు.

గాంధీగారిని అనుసరించేవారే అయినారు నోరున్నవారిలో అనేకులు, దేశంలో.

అది గాంధీగారి ఘనతకు నిదర్శనమే; గాని అదే మంచి దనుకోలేక పోయాన్నేను.

గాంధీగారే కాంగ్రెస్సూ, కాంగ్రెస్సే గాంధీగారూ అయి పోయారు, బాగా.

"ఇప్పటికీ మీ నమ్మకం అదేనా?" అనడిగారు సుబ్బారావుగారు నన్నక్కడే–అ క్షణానే.

"మరి, మీ నమ్మకం?" అని యెదురడిగా న్నేను.

"అంతే" అంతే "అంతే" అనుకున్నాం యిద్దరమూ, కూడా.

నేను, నా నమ్మకం మార్చుకోవలసినంత కారణం యేమీ యేర్పడలేదు, కాంగ్రెస్సుమీద గాంధీగారి సాచిక్యం అంకితం అయినాక.

"మరి, వారికి జయమూ, అపజయమూ?" అంటే, అది, వూహాలక్కూడా అందే స్థితిలోలేదు, అప్పటికింకా.

అదివొక వుప్పెన.

ప్రథమో చ్ఛ్వాసంలో వుందది.

ఏ విధంగానూ చైతన్యం లేని జాతి, మనది.

కొత్త వొక వింత.

కాని, మహామహులెవరూ యేకీభవించలేదు, గాంధీ గారితో.

కొత్తవారు రంగస్థలానికి వచ్చారు.

గాంధీగారి తరవాత అంతటి చలామణీ యేర్పడింది, వారికి.

కద్దరు కట్టడం ప్రారంభించారు కొందరు, దాని అంతర్యం తెలిసి మాత్రం కాదు.

సుబ్బారావుగారు తెల్లని ముతక కద్దరు కట్టుకుని వున్నారప్పుడు.

ఇప్పటికీ వారి వస్త్రప్రీతి అదే అనుకుంటాన్నేను.

మొదట్నుంచీ కద్దరు నమ్మలేదు, నేను.

స్వపరిపాలనాధికారం సంపాదించే యోగ్యత యేమీ లేదందులో, దేశీయుల్లో, విభేదాలకు రూపకల్పనచేసే శక్తి తప్పించి.

ఏ క్షణానికా క్షణం కొత్త వూపిరి పోస్తేనే మనుగడ దానికిప్పటికీ.

మానసికమైన పరిణామం కలిగించే శక్తి కూడా లేదు, దానికి.

అది కడితేనే కాంగ్రెస్సులో ప్రవేశం యెవరికయినా.

ఇలాగ, వొక రాజకీయ పక్షానికి వొక వలయం అయిపోయింది అది.

ఇతర పక్షాలవారు అదంటే విముఖత చూపడంలో అసంభావ్యత యేమీ లేదు.

ఏ రాజకీయపక్షానికీ కట్టుబడనివారు కూడా దాని యెడల ముగ్ధులు కాకపోడంలో కూడా వింతలేదు.

అప్పటికీ యిప్పటికీ గూడా యిదే నా నమ్మకం.

నాది వైదిక సంస్కారం.

దానిమీదే యెంతో నమ్మకం నాకు.

గాంధీగారిది జైన సంస్కారం.

దానిమీదే తమ నమ్మకం అన్నట్టు మాత్రం కనపడరు, వారు.

కాని, నిశితంగా పరిశీలించగలవారికి, వారి దండయాత్ర, అటు బ్రిటిషువారి మీదకంటే, యిటు వైదిక సంస్కారం మీద చాలా యెక్కువ అన్నట్టు స్పష్టం అవుతుంది.

జైనబౌద్ధ మతాలకూ, వైదికమతానికీ వెనకటి శతాబ్దుల్లో జరిగిన ధారుణ సంఘర్షణ తెలిసివున్నవారికేగాని సమన్వయం కాదిది.

కాక,—

సంఘ సంస్కారం అంటే మత ధర్మాలను తిరస్కరించడమే అని మన సంఘ సంస్కర్తల సిద్ధాంతం యిప్పటికీ.

మొదట్నుంచీ వారు చేస్తున్న పెద్ద పొరపాటిది.

సంఘం వేరూ, మతం వేరూను.

మనం మత ధర్మాలకే కాదు, సంఘం కట్టుబాట్లకున్నూ చాలాదూరం అయిపోయి వున్నాం.

ప్రవృత్తి మార్గంలో సంఘం కట్టుబాట్లకే ప్రాముఖ్యం.

అది బాగుపడితేనే జాతికి కొత్తశక్తీకొత్త దృక్పథమున్నూ యేర్పడ్డం.

సంఘం కట్టుబాట్లుచెడి, సహనమూ ఐకమత్యమూ లేని వారికి రాజకీయాధికారం చేజిక్కితే అది వ్యక్తి వికాసాని కుపయోగపడదు, యెదటి వారి నణచివెయ్యడానికే దారితీస్తుంది.

అది విప్లవానికి మూలం అవుతుంది, చివరికి.

రాజకీయాలకే మొదటిదెబ్బ, దానివల్ల.

రామమోహనరాయివచ్చి, యిదివరకే పెరిగిపోయివున్నవి చాలక, మరో క్రొత్త మతం కల్పించాడు, పరధర్మం వరవడితో.

దయానంద సరస్వతీ అదే చేశాడు, అంతకంటే బలంగా.

మనమీద విరుచుకుపడుతున్న క్రైస్తవ ముస్లిం ధర్మాల నెదుర్కొడ్డవలసినవవి, కాని మనలో వున్న చీలికలు మరిన్ని చేశాయి.

ఇది తప్పు దారి.

సంఘం బలపడే సమయం యిది.

తద్వారా జాతి దృఢపడవలసిన సందర్భం యిది.

కనక, లౌకికంగా – ప్రవృత్తిపరంగా–జనుల నడవడి సరిదిద్దవలసిన సన్నివేశం యిది.

సంఘసంస్కర్తలేకాదు, వారితోపాటు రాజకీయవాదులున్నూ గాడి తప్పా రిక్కడ.

మనకు స్వపరిపాలనాధికారం వచ్చింది, అయినా, కప్పల తక్కెడగానే వుంది, పరిపాలన నాటి కంటే, యిప్పటికీ.

దానికి జరగవలసిన సంస్కారమూ, దోహదమూ జరగలేదు, మరి.

జాతీయతకు కూకటి వేరే పురుగు పట్టింది కూడా.

ఇది అపాయకరం అని గుర్తించగలిగినవాడు వివేకానంద స్వామి వొక్కడే.

అయితే, గాంధిగారి కాంగ్రెస్సుసాచివ్యం స్థిరపడేనాటి కాయన లేడు.

పోనీ అంటే, సమగ్రవేత్త మరొకడైనా అలాంటివాడు లేక పోయా డప్పుడు.

ఇదే సూచించా న్నేను, తరవాత నేను నడిపిన ప్రబుద్ధాంధ్రలో, వొకచోట.

"ఉద్బోధయత్యుచ్చై శ్శ్రీమాన్ బాలగంగాధర తిలక మహాభాగో" నసంభవతిసాష్టవం స్వమతసంఘయో, ర్వినా సమగ్రం రాజకీయేష్వధికారం ఇతి. అపదచ్చ వివేకాంద స్వామీ " నలభ్యతే అధికారో రాజకీయో, వినాస్వమత సంఘ యోస్సాష్టవం" ఇతి. ఉభౌ మహాంతా నేవ పండితౌ, నాప్యేకీ భవతః ఏతస్మిన్నే కస్మిన్విషయే. కాపున్నర్గతి స్యామానాం" అని.

కనక, సుబ్బారావుగారి నమ్మకమేకాదు, నా నమ్మకమూ కూడా అప్పటికే కా దిప్పటికీ మారలేదు, లేశమున్నూ.

ఇక ముందున్నూ మారవు, అంత ఘనీభవించి పోయాయవి.

## 23

వీరపూజ పూర్తిగా వినడానికీ, దాని మంచి చెడ్డలు నిష్కర్షగా నిర్ధారణ చెయ్యడానికీ అయిదురాత్రులు పట్టింది భానుమూర్తి పంతులుగారికి.

ఇందుకు, తనబాధ్యత కాపాడుకోడంతోపాటు, నాగేశ్వరరావుగారి క్షేమం ఆలోచించడం కూడా అగత్యం అయింది వారికి.

నిశ్చలంగా ఆలోచించారు, వారు

నిర్మోహమాటంగా తమ సలహా అందించారు నాకు.

మనస్ఫూర్తిగా నా అభ్యుదయమున్నూ కోరారు వారు.

అయిదోనాటి రాత్రి భోజనాని కాపేశారు, నన్ను.

ఇద్దరమూ తాంబూల చర్వణం ప్రారంభించాం భోజనానంతరం.

వీరపూజ సంగతి యెత్తుకున్నారు, వారు, అవ్యవధానంగా.

"నాగేశ్వరరావుగారి భయం సహేతుకమే. రోజులలా వున్నాయి, మరి. వస్తుతః, వీరపూజ విలవ కంటే ఆంధ్ర పత్రిక ప్రెస్సు విలవ చాలా హెచ్చు. న్యాయితః, నాగేశ్వరరావుగారి శ్రేయస్సుకి భంగం రాకుండేటట్టు చూడ్డం కూడా నా ధర్మం. ఈ కోణం నుంచి బాగా నిశితంగా పరిశీలించాను మీ రచన నేను. మీ రచనలో, పోలీసులకు పని కల్పించేది వొక్క అక్షరమైనా లేదు. సాహిత్యవేత్తలే గుర్తించవలసిన రచన మీది. చారిత్రికులే ఆలోచించవలసిన ఆక్షేపణలున్ను మీవి. చరిత్రలు రాసేవారు ఇలా నిశిత విమర్శలు చెయ్యడం చాలా అగత్యం. అంకెలూ, తేదీలూ కాదు చరిత్రలో చూడవలసినవి మీ గ్రంథం చాలా మంచిదని గాఢమైనతృప్తి కలిగింది నాకు." అన్నారు వారు, ముందు.

ఒక్క క్షణం నిదానించి "ఒక్క సలహా చెబుతాను మీకు. ముందు జాగ్రత్తకోసమే, అనుమానం వుండి కాదు" అన్నారు తరవాత.

"ఈ భాగం మాత్రమే కాదు, ఈ వీరపూజ కింకా యెన్నో రాయదలుచుకుని వున్నారు మీరు. కాలక్రమాన ఇలాంటి గ్రంథాలున్నూ మీరురాయవలసివుంది. కనక, మీ పూనిక నిరాఘాటంగా సాగడానికి నా సలహా. అది, ఈ గ్రంథం, జార్జి చక్రవర్తికి అంకితం చెయ్యడమే" అనిన్నీ చెప్పారు, చివరికి.

నాగేశ్వరరావుగారిపేర చీటీ కూడా రాసి యిచ్చారు, తరవాత వారు.

నాకూ దేశ స్వాతంత్ర్యం కావాలి, దాపరికం లే దిందులో.

అయితే, తక్కిన పనులన్నీ మానుకుని, తాదాత్మ్యంతో పని చెయ్యవలసినంత ప్రధానం మాత్రం కా దిది.

అవి సాధించడానికి ముందు చెయ్యవలసింది చాలా వుంది.

మూకతో జరిగే పని కాదుకూడా అది.

వర్ణాలు నాలుగే; కాని కులాలు లెక్కలేనన్ని మనలో.

వర్ణాల్లోనూ, కులాల్లోనూ కూడా శాఖలున్నూ యెన్నో.

వీధికివస్తే యెవడికి వాడే, యిద్దరు కలియడాని కన్నీ అడ్డంకులే అందరికీ.

వృత్తులన్నీ వున్నాయి, అన్నీ అగత్యాలే అందరికీ; కాని, వాటికి ఉత్తమాధమ విభజన.

దాంతో, స్వవృత్తియెడల అసంతృప్తి, పరవృత్తి అంటే అత్యాశ.

మహోత్తమవృత్తి బ్రాహ్మడిది, కాని అతనికీ అది పనికి రాదు.

దేనికీ, యెవరూ, యెవర్నీ ఆక్షేపించడానికి వీల్లేని పరిస్థితులు.

ఆత్మజిజ్ఞాస కనపడదు, అసహనం యెక్కువ అందరికీ.

వీటికి సాయం పరధర్మపరుల ఉపదేశాలు.

ఇటు, బ్రిటిషువారు వెళ్ళిపోయాక క్రిష్టియానిటీ అధికం కావడమూ, అటు, నాయకులే బౌద్ధం పట్టుకు పాకులాడ్డమూను.

అట్టుడికిన ట్టుడికిపోతోంది, జాతి.

ఏ క్షణానో బద్దలు కావచ్చు అగ్నిపర్వతం అన్న స్థితి, యెటు చూసినా.

ఏమిటి భవిష్యత్పరిణామం?

రాజకీయాలు సరిచెయ్యగలవా యీ పరిస్థితులు.

మరేమిటి గతి?

ఇదీ నా ధోరణి.

పోనీ, ఈ సమస్యలు తీర్చగల సామర్థ్యం వుందా నాకు?

ఉద్యమాలు నడపాలంటే లౌక్యం కావాలి, పూర్తిగా.

అదంటే చుక్కెదురు నాకు.

కనక?

అవగాహన చేసుకోడం.

అంతర్గర్భితంగా వున్న అసంతృప్తి తగ్గించడానికి చేతనైనంతా ప్రయత్నించడం.

అదయినా, వాఙ్మయం పరంగా సాధించడం.

కాగా, రచన ప్రధానం నాకు.

సాహిత్యం ఆధారం దానికి.

జనులకు, స్వవిషయం విడమర్చి చెప్పడం – ఆత్మగౌరవం అలవర్చడం – సహనం, కలిగించడం – సరికొత్తభావాలు మప్పడం – కొత్త ఆశలు రేకెత్తించడం – గతంలో వుండుకున్న సత్యం ఆవిష్కరించడం – భవిష్యత్తుకి కొత్తదారులు కల్పించడం – తన్మూలంగా దేశీయుల కందరికీ స్వయం నిర్ణయం శక్తి కలిగించడం – ఇదీ నా ప్లానిక.

అది నిర్విఘ్నంగానూ, నిరాఘాటంగానూ, నిరాటంకంగానూ సాగడం నా లక్ష్యం.

జాతికి, ప్రాతిపదికలకు భంగంలేని గమ్యం కనబరచడం నా ప్రాప్యం.

ఈ మాటే చెప్పి, భానుమూర్తి పంతులుగారి సలహో, దేవతల ఆజ్ఞగా శిరసావహించా న్నేను.

వీరపూజ యెడల అపరిమితమైన తృప్తితో బయలుదేరాన్నేను.

# 24

"ఇవాళ, భానుమూర్తి పంతులుగారూ నేనూ అనుకోకుండా తారసపడ్డాం" అంటూ అందుకున్నారు నాగేశ్వరరావు పంతులు గారు, మర్నాడు.

నేను చీటీ అందించాను.

చూడకుండా అది సొరుగులో పడేసి "అచ్చు ప్రారంభిద్దాం" అని కూడా అన్నారు వారు.

"కానీ–" అన్నా రంతలో.

నా కడుపులో రాయి పడింది.

నూ రామడల సముద్రం దాటాడు హనుమంతుడు.

మరి, గజం దూరం వుందనగా, అవతలిఒడ్డు అందక, సముద్రంలో పడిపోయివుంటే, అతను?

ఇలా అనిపించింది నా స్థితి, నాకు.

మాటరాక నిశ్చలంగా చూస్తూ వుండిపోయాను.

వారే అందుకున్నారు.

"పౌను 0–2–11ల ధరలో వుందిప్పుడు రెడ్ లయను. అంటే, రెట్టింపయి పోయిందన్నమాట దాని ధర. మామూలు ధరలోనే తెలుగు పుస్తకాలు కిట్టడం లేదుకదా, యీ హెచ్చు ధరలో మీ కేమి కిడుతుందీ? పుస్తకాలమ్మి మీరు బిల్లు చెల్లించుకో కలగడం సాధ్యమా?" అనడిగారు, వారు.

రెడ్ లయనంటే, అచ్చువేసే కాగితాలకు సంబంధించిన వొక ట్రేడు మార్కు.

జాన్ డికిన్సన్ కంపెనీవారు, తమ నిర్మాణంలో వొక రకం తెల్లకాగితానికి వాడతారు.

నలుగురికీ అందుబాటులో వుండే విదేశీ కాగితాల్లో అదొక మంచి రకం.

ఆ కాగితం మీద ముద్రించిన గ్రంథం బహూ సొగసుగా వుంటుంది.

"పుస్తకం అచ్చయితే చాలు" ననుకునేవారు మాత్రం, యితర కంపెనీల తక్కువరకం కాగితం వాడతారు.

అదీ విదేశీయమే.

బెంగాల్ కాగితం వాడేవారు బహూ అరుదప్పుడు.

గ్లేజు వాడవలసివస్తే రెడ్ లయనే వాడేవారు నాగేశ్వరరావుగారు.

సాహిత్యపరంగా చూస్తే, స్పష్టంగా కళాదృష్టి వారిది.

అంచేతే ఆ కాగితం మాటెత్తారు, వారు.

అణా పై చిలుకుధరలో వుండేది, అసల్లో, ఆ కాగితం పౌను.

ఇవాళ, సాదా కాగితానికే పౌనుకి రూపాయిపావులా దాకా యిస్తున్నాం మనం.

నిర్లక్ష్యంగా యిచ్చేస్తున్నాం.

అయినా, కాగితం దొరకడంలేదు, మనకి.

0–2–11 లంటే యిప్పటి 1–4–0 లో యెన్నో వంతు?

తెలుగులో గ్రంథాలు రచించేవారిప్పు డున్నంతమంది లేరప్పుడు.

గ్రంథ ప్రకటనకర్తలూ లే రింతమంది.

గ్రంథ తృష్ణే లేదసలు, జనులకు, ఇప్పటిదాల్లో నూరో వంతయినా.

ఇప్పటికీ వున్నా రనుకోండి పుస్తకా లూరికే యిమ్మని పీడించేవారూ, వొకరు కొనుక్కున్న పుస్తకం వారికే అందకుండా చేసేవారున్నూ.

గ్రంథకర్తలు స్వయంగా అచ్చు వేయించుకుంటేనే బయటికి వచ్చేవప్పుడు పుస్తకాలు, సాధారణంగా.

ఆ గ్రంథాలకు గిరాకీ కూడా పెరగడంతో గ్రంథాలు ప్రకటించేవారు చాలా మంది బయలుదేరా రిప్పుడు.

వారి గ్రంథ సంపాదన చాలా విచిత్రమయింది.

వాఙ్మయపుష్టి అక్కరలేదు వారికి, స్వోదర పూరణం తప్పించి.

ఇప్పటి విశేషం, తెలుగు రచయితల మౌలికరచనలు అచ్చు కాకపోవడమూ, పరభాషల్లోనుంచి చవకబారు పుస్తకాలు తెనుగులో వెలయడమున్నూ.

దీంతో, తెలుగుదేశంలో స్వతంత్ర రచయితలే లేరన్నంత గొప్పగా పాకిపోయింది మన అభ్యుదయం ప్రపంచంలో.

ఏమయినా, యిప్పటి పరితులు సర్వాత్మనా వేరు.

కనక, 0–2–11 లు ఒక ధరా అనిపిస్తుంది మనకు.

అప్పుడది భరించరానంత.

ఆ కారణం వల్ల యెన్నో ప్రెస్సులు మూలపడ్డం ప్రారంభించాయప్పుడు.

అయితే "తమ పెట్టుబడి తమకి తిరిగి వస్తుందా రాదా అని పంతులుగారి భయం" అని కాదు, మన గుర్తించుకో వలసింది.

వేలు విరాళా లిచ్చారప్పటికే, వారెన్నో.

ఇస్తూనే వున్నా రప్పుడున్నూ.

ఇస్తారు కూడా, యింకా యింకా.

ఇవ్వడం – అడిగినవాడికి లేదనకుండా యివ్వడం, జీవితావధికం అయిన వ్రతం వారికి.

మరి, వున్న దల్లా యేమిటంటే?

వీరపూజ అచ్చువేయించడాని కొక పథకం అనుసరించి పూనుకుంటున్నారు, వారు.

ఎందరికోసమో ఉద్దేశించిందా పథకం.

మరి, అది, విఫలం అయితే?

ఆ విఫలం కావడమున్నూ నా మూలంగా అయితే?

అంచేతే వారు నన్నామాట అడిగారు.

ఇలా అర్థం చేసుకున్నా న్నేనది.

నా బాధ్యత నేను గుర్తించుకోడానికి – నా నెత్తిమీద వొక బరువు పడుతోందన్న జ్ఞానం నాకు కలగడానికిన్నీ అదొక ఉద్భోద అనిన్నీ అవగాహన చేసుకున్నా న్నేను.

"ఆరు మాసాలిక్కడ వుండదలిచి వచ్చాను. అగత్యం అయితే, మరి కొంతకాలమున్నూ వుంటా నిక్కడ. బిల్లు పూర్తిగా చెల్లించకుండా మాత్రం కదల

నిక్కణ్ణుంచి. ఇంతకీ విరాళాలు సంపాదించుకుంటా న్నేను. పుస్తకాల అమ్మకంతో కాదు, నేను బిల్లు చెల్లించ తలుచుకున్నది" అని వివరంగా చెప్పాను, వారికి.

ఎంత డబ్బు చేతపుచ్చుకుని నే నింటిదగ్గర బయలుదేరిందీ, మద్రాసు ఎలా చేరుకో గలిగిందీ, మద్రాసులో కాలక్షేపమున్నూ ఎలా చెయ్యగలుగుతున్నదీ కూడా చెప్పాను, వారికి.

"సరే, అయితే" అన్నారు పంతులుగారు.

"కాలక్షేపాని కేమయినా యెప్పుడయినా అగత్యం అయితే అప్పుడూ అప్పుడూ యిస్తూ వుంటా, నడుగుతూ వుండండి. అది పుస్తకం పెట్టుబడిలో చేరదు" అన్నారు వారు.

"దేవర" అని బైండింగు విభాగంలో ఫోర్మను.

ఏ కాగితం అగత్యం అయినా అతనే తేవడం ఆఫీసుకి.

"బజారుకి వెళ్ళి, వీరిని కూడా తీసుకువెళ్ళి, డి.సి. రెడ్ లయను 15 రీములు కొని తీసుకురా" అని చెప్పారు వారతణ్ణి పిలిచి.

బులుసు లక్ష్మయ్యగారని ఆఫీసు కాషియరు.

వారిని రప్పించి, అందుక్కావలసిన డబ్బు దేవర కిమ్మని చెప్పారు.

అవుల నారాయణస్వామి అని కంపోజింగు విభాగంలో ఫోర్మను.

"వీరు పుస్తకం యిస్తారు. సాధ్యమైనంత త్వరగా అచ్చు పూర్తి చేయించు సొగసుగా" అని చెప్పారు వారతనికి, నన్ను చూపించి.

"శ్రద్ధగా పని చేయించుకోండి. ప్రూఫులు స్వయంగా దిద్దుకోండి" అని నాకున్నూ చెప్పారు.

చెబుతూనే లేచిన్నీ వెళ్ళిపోయా రెక్కడికో.

## 25

"కంపోజు ప్రారంభం చేయిస్తావా?" అనడగ్గా "ముందు కాగితం చేరాలి, ఆఫీసుకు" అన్నాడు, నారాయణస్వామి.

"కాగితం కొందామా?" అనడగ్గా, "అది కాషియరు గారి చేతిలో వుం"దన్నాడు, దేవర.

కాషియరుగారి దగ్గరికి వెళ్ళగా "నాలుగురోజు లాగా" లన్నా రాయన.

పంతులుగారి దగ్గిరికి బయలుదేరాను.

"నిన్న శ్రద్ధగా పని చేయించుకో"మని మీకు చెబుతూ చెబుతూ లేవడం, "అక్కణ్ణుంచే స్టేషను చేరుకుని బొంబాయి వెళ్ళిపోయా"రన్నారు పిశుపాటి సత్యనారాయణగారు.

ఇటు మద్రాసులోనే కాదు, అటు బొంబాయిలో కూడా తయారు చేయించే వా రమృతాంజనం పంతులుగారు, ఆ రోజుల్లో.

నెలనెలా వెళ్ళి, పది పదిహేను రోజుల చొప్పున బొంబాయిలో వుండిపోయే వా రందుకోసం.

రెండు మూడు రోజులుగా టెలిగ్రాములమీద టెలిగ్రాములు – రాగా, అందుకోసం ట వారు బొంబాయి వెళ్ళింది.

ఏమిటీ చెయ్యడం?

అప్పటి కప్పుడే గ్రంథం సాపు రాయడం అయిపోయింది, పూర్తిగా.

అక్షర స్ఖాలిత్యాలు సవరించడమున్నూ జరిగిపోయింది.

అంతా వ్యర్థం అతను; కాని పర్యవసానం అలాగే అనిపించింది.

"మరో గ్రంథం రచించడం ప్రారంభించండి" అన్నారు కర్రా లక్ష్మీనరసింహంగారు.

ఎన్నో రాశా నలాగ, వొకటి పూర్తికాగానే మరోటి ప్రారంభించి.

అనుకునిన్నీ వున్నాను, "మద్రాసు వెళ్ళగానే-వీరపూజ అచ్చు ప్రారంభించగానే, ప్రారంభిద్దా"మని.

కాని, వీరపూజ విషయం తేలక అప్పటిదాకానూ, అనుకోని యీ విలంబం తటస్థించడం వల్ల అప్పణ్ణుంచీ, మరిపోయింది నాకు.

నిరుపహతస్థలమూ, రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చే కప్పురవిడెమూ, ఆత్మ కింపయిన భోజనమూ, ఉయ్యేల మంచమూ°, ఒప్పూ తప్పూ గుర్తించగల రసజ్ఞులూ, ఊహలు తెలుసుకోగల లేఖకులూ పాఠకులూ" కావాలి, గ్రంథం రచించాలంటే అల్లాసాని పెద్దనకు.

నా కలాంటి అదృష్టమూలేదు. రాతక్కూచోవా లంటే కలమూ కాగితమూ తప్ప మరేమీ అక్కరాలేదు, అతనికున్న శక్తివంటిదిన్నీ లేదు, లేశమూ.

మరి, నా క్కావలసింది ఆత్రం వొక్కటే.

"అయ్యో, రోజులు గడిచిపోతున్నాయి. కూచుంటే యెలాగా? గజం యెత్తు పుస్తకాలు రచించడం యెప్పుడూ? కొత్తకల్పనలు తోస్తున్నాయి, పాతకల్పన కెప్పుడూ గ్రంథరూపం కలిగించడం?" ఇలాంటి ఆత్రం - అదుర్దా - ఇది కావాలి, నాకు.

ఉండకూడనిదిన్నీ వొకటుంది నాకు.

అది ఆందోళనం.

డబ్బు లేదూ?

బెంగలేదు.

ఆశాభంగాలు తటస్థించాయీ?

బాధలేదు.

వేళకి భోజనం అమరలేదూ?

మునిగిపోలే దేమిన్నీ.

"ఏమవుతుందీ పని?"

ఇదిగో, యిది - ఈ ఆందోళనం మాత్రం వుండగూడదు.

అది కాదూ?

వెంటనే తేలిపోవా లా సంగతి.

అది నెరవేరిందీ?

మరి, నిశ్చింత.

ఈ స్థితి కావాలి నాకు.

నాలుగు రోజులు గడిచాయి.

వారం జరిగి పోయింది.

పదిరోజులు కూడా వెళ్ళిపోయాయి.

మనస్సు చెడిపోయింది.

జాడ్యజుష్టం అయిపోయింది బుద్ధి.

"అయోమయావస్థ" అంటే యేమిటో అప్పుడే అవగాహన అయింది మొదటి మాటు, పూర్తిగా నాకు.

"పనిచేద్దాం" అంటే దారి కనపడకపోడమూ "పోనీ, కళ్ళు మూసుకుని పడివుందాం" అంటే సాధ్యం కాకపోవడమూ– నిజంగా యమచెర, యిది.

భోజనం చేస్తాం.

తిన్నట్టుండదు.

నిద్రపోతాం.

పడుకున్నట్టుండదు.

రోజులు గడిచి పోతాయి.

కాళ్ళూ చేతులూ ఆడినట్టుండదు.

బతికివున్నట్టే లెక్కకురాని స్థితి, అది.

అయితే, యీ స్థితి కోరుకునేవారు లేకపోలేదు, లోకంలో.

రోజులు గడిచిపోతాయి.

నిశ్చింత, వారికి.

ఆయుర్దాయం తరిగిపోలేదూ వ్యర్థంగా?

ఈ విచారం వుండదు, వారికి.

"స్థాణువులాగ పడివుండడానికేనా పుట్టింది?

ఈ విచారణా కలగదు వారికి.

కారణజన్ములు వారు, భంగ్యంతరంగా.

ఏదో వొకటి రాయాలి.

ఆనంద పెట్టాలి, రసికులను.

ఏదో వొకటి రాయాలి.

ప్రబోధించాలి, జనులను.

ఏదో వొకటి రాయాలి.

గుబగుబ లాడించాలి, యువకుల .మనస్సులు.

ఏదో వొకటి రాయాలి.

ఉరికించాలి, కార్యక్షేత్రంలోకి, సమర్థులను.

మరి, నా రాతలో అంత జీవం వుందా? అది తరవాతి సంగతి.

ఊరుకోలేను, నేను.

కాని, కట్టుళ్ళలో పడిపోయివున్న ట్టయిపోయా న్నేను.

ఉండగా వుండగా "బజారుకి వెడదాంర"మ్మంటూ వచ్చాడొకనాడు దేవర, హఠాత్తుగా

15 రీములు కొన్నాం, రెడ్ లయను.

నారాయణస్వామి కంపోజు ప్రారంభం చేయించాడు.

నలుగురు పనివాళ్ళు స్టిక్కులు చేతపట్టారు, ఏకకాలాన, నా పనికోసం.

భోజనం చేసివచ్చి, పడుకుని, లేచి, ప్రూఫులు వస్తాయని యెదురు చూస్తూ కూచున్నాను గదిలో.

వట్టిచేతులతో వచ్చి "పంతులుగారు రమ్మంటున్నా" రన్నాడు నారాయణస్వామి.

"ఇదిగో యీ వాక్యం సవరించా"లన్నారు పంతులుగారు, తర్జనీ నిర్దేశంతో ప్రూఫు చూపిస్తూ.

తెల్లపోయా న్నేను.

## 26

రాజనీతి ప్రవృత్తి యిట్టిదని నిర్వచించుటకు వలను పడదు

ఇదీ, సవరించాలని నాగేశ్వరరావుగారు చూపించిన వాక్యం, తెల్లపోయానన్నా న్నేను.

"సెబాస్" అంటూ భానుమూర్తి పంతులుగారు బాగా మెచ్చుకున్న వాక్యమున్ను మరి, యిది.

వింత సన్నివేశం యిది.

అన్వయం లేదా వాక్యంలో?

దోషాలున్నాయా?

క్లిష్టంగా వుందా, పోనీ?

నా కేమీ కనపడలేదు.

"ఏం" అనడిగాను.

"మీ నిర్వచనం అధర్మానికి దారితీస్తుం"దన్నారు నాగేశ్వరరావుగారు.

విరోధాలు వచ్చినచోట ఉభయవర్గాల్లోనూ యెవరిదగ్గిరో వొకరిదగ్గిర అధర్మం వుండనే వుంటుంది. లేకపోతే విరోధాలే లేవు. మరి, అక్కడ, ధర్మం ప్రతిష్ఠించాలంటే?

"పర్యవసానంలో ధర్మాని కది రక్ష కావాలేగాని, ప్రవృత్తిలో ధర్మమూ అధర్మమూ వొకటే" అని నా వివరణ.

ఇది అనువదించాను, నే నప్పుడు.

కాని, వా రంగీకరించలేదు.

గొప్ప వేదం వుంది, మనకి.

మహాభారతం వుంది, దానికి ప్రతిబింబం.

ఇంకా యెన్నో వున్నాయి, ఉద్గ్రంథాలు.

రాజనీతి నిర్వచించా యవన్నీ.

ధర్మం నిక్కచ్చిగా నిరూపించాయవి, రాజనీతిలో.

అవక్రపరాక్రమంతో పరిపాలించారు మన చక్రవర్తులు.

దారుణ యుద్ధాలున్నూ చేశారు.

ధర్మంకోసం ప్రాణాలిచ్చారు.

కొన్నాళ్ళకు, విదేశీయులూ, విమతస్థులూ అయినవారు వచ్చి పడ్డారు మనదేశం మీద.

విలక్షణ యుద్ధ ధర్మాలతో వచ్చి ముట్టడించారు, వారు.

కిందా పడ్డారు మీదాపడ్డారు, మనవాళ్ళు.

గొప్ప అనుభవం సంపాదించారు, కొత్తది.

ఏమయినా, బతకాలి మన జాతి కూడా.

అందుకోసం రాజనీతిలో – సవరణలు చేశారు, సమర్థులయినవారు.

ఆ చేసినవారిలో, చాణక్యుడు బ్రహ్మ అంతటివాడు.

ఆ చాణక్యుని ప్రస్తావనలోనే వచ్చిన వాక్యం యిది.

ఈ కొత్త సిద్ధాంతం పురస్కరించుకునే చేశాను, గ్రంథం అంతటా వ్యాఖ్యానాలు నేను.

భానుమూర్తి పంతులుగారు మెచ్చుకున్న దందుకు.

అంచేతనే, తెల్లపోయాన్నేను, నాగేశ్వరరావుగారి మాటవిని.

"ఏమయినా, అది తప్పుడు సిద్ధాంతం" అన్నారు పంతులుగారు.

ఈ తప్పు మీరు చేశారని కాదు. రాజనీతి అన్నది, ఒక క్షుద్రవిద్య అన్నట్టు తయారుచేశారు మనవాళ్ళు, చివరికి. ధర్మానికది రక్షా కావాలి. ధర్మబద్ధంగానూ వుండాలి." అన్నారు వారు, దృఢంగా.

"చాణక్యుని జీవితం మంచిది కా" దనేశారు కూడా వారు.

ఇంతేకాదు.

"అది సవరించవలసిందే" అని కూడా చెప్పేశారు, చివరికి.

నే నంగీకరించలేక పోయాను.

"నా సిద్ధాంతం నాది. నా రాతకు బాధ్యత నాది. మీ ప్రోత్సాహంతో – మీ వరవడితో రాసింది కాదు నా యీ రచన. మీ సిద్ధాంతానికి విమర్శాకాదు. గ్రంథం అచ్చుకావడానికే మీ సాహాయ్యం నాకు" అని వివరంగా చెప్పాను.

"భానుమూర్తిగారు ప్రత్యేకించి మెచ్చుకున్న వాక్యంయిది" అని కూడా చెప్పాను.

కాని, లాభం లేకపోయింది.

"ఈ పుస్తకం అచ్చుకావడానికి నేను సాయం చెయ్యడం, నాకు ప్రతికూలంగా ప్రచారం చెయ్యమనేనా మిమ్మల్ని" అని? ముదలకించారు పంతులుగారు.

పని ఆగిపోయింది.

నాలుగు రోజు లాగిపోయింది.

"టైపు అలా నిలవబెట్టడానికి వీలులేదు" అని తొందర పెట్టసాగాడు, నారాయణస్వామి.

చూడగా, ముప్ఫయి నలభయి పేజీలకు సరిపోయేటంత గ్రంథం కంపోజయివుంది.

ఉపాయం తోచక భానుమూర్తి పంతులుగారి దగ్గిరికి వెళ్ళాను.

"ఆ" అంటూ చకితులయిపోయా రది విని వారు, ముందు.

శాస్త్రాలుకూడా దిద్దెయ్యవలసిందేనా, యెవరుపడితే వారు?" అనడిగారు.

"వాఙ్మయంశక్తి యెంతటిదో అవగాహన అవుతోందా?" అనిన్నీ అడిగారు, వారు.

అంచేతనే గ్రంథరచన చేస్తున్నా న్నేను, వినోదం కోసం కాదు.

"మీ రాత దిద్దవలసింది కాదు. సరిగా రాశారు మీరు. ఉన్నదున్నట్టు బయటికి రావలసిన గ్రంథం మీది. నే నిలా చెప్పానని చెప్పండి నాగేశ్వరరావుగారితో" అని చెప్పి పంపేశారు వారు, నన్ను.

అయినా, లాభం లేకపోయింది.

"సవరించవలసిందే" అనేశారు వారు, నిక్కచ్చిగా.

చూసి చూసి "అయితే, టైపు కలిపించెయ్యండి. నా గ్రంథం మరొకరి సాయంతో బయటికి రావలసి వున్నట్టుంది. శ్రమ యిచ్చినందుకు మన్నించి, నాకు సెల విప్పించండి" అని కోరాను చివరికి వారి న్నేను.

"మీ యిష్టం" అన్నారు పంతులుగారు.

"అయితే – " అన్నా రంతలో.

"చాణక్య ప్రభుతులగు నప్పటి రాజ్య తంత్రజ్ఞుల దృష్టిలో – అన్న మాటలతో మీ వాక్యం ప్రారంభించడం మీ కిష్టమా?" అనడిగారు.

"చర్చవ"ద్దన్నారు, "ఇష్టమా, అనిష్టమా?" ఇంతే చెప్పండి. అని స్పష్టంగా చెప్పారు వారు.

మళ్ళీ భానుమూర్తిగారి దగ్గరికి వెళ్ళాను.

మళ్ళీ మళ్ళీ విన్నారు, మళ్ళీ మళ్ళీ ఆలోచించారు.

"అంటే, చాణక్యుడు మొదలైనవారు, వెనకటి రాజతంత్రంలో సవరణలు చేశారని, అర్థం నాగేశ్వరరావుగారి సవరణకు, మీరు చేశారని కాదు, ఆ సవరణలు. 'లోకం, అని అంగీకరించింది–లేదు–' అని కూడా కాదు. మీ నమ్మకానికీ, మీ వ్యాఖ్యానానికీ భంగం రాలేదు" అని వివరణ చేసి, మళ్ళీ ఆలోచించి "నందోరాజా భవిష్యతి. ఈ కూర్పిలా కానివ్వండి పోనీ" అని సలహా చెప్పి పంపేశారు వారు నన్ను.

"మీ కింకా కొన్ని అడ్డంకులు వస్తాయని తోస్తోంది, అప్పటి మాట చూసుకుందాం, ఇప్పటికి – ఇక్కడ – యిలా కానివ్వండి" అని కూడా చెప్పారు వారు.

అంతకంటే మరి వుపాయం లేకపోయింది నాకు.

మళ్ళీ పని ప్రారంభం అయింది.

ఈ సంగతి చెప్పగా "రాజనీతి కార్యహాని కంగీకరించదు. నిజంగా, మీరన్నట్టు, 'రాజనీతి ప్రవృత్తి యిట్టిదని నిర్వచించుటకు–' వలనే పడదు. అడుగు ముందుకి పడిందా, మీకు విజయమే. పంతులుగా రిది గుర్తించలేకపోయారు" అని వ్యాఖ్యానం చేశారు, భానుమూర్తి పంతులుగారు, జరిగింది విని.

## 27

వీరపూజ మొదటిఫారం అచ్చయేటప్పటికి ఖరాగా రెండు మాసాలయింది నేను మద్రాసు ప్రవేశించి.

"గ్రంథం పూర్తికావడాని కెన్ని మాసాలు పడుతుందో" అని సందేహం పట్టుకుంది నాకు, కొత్తది.

బెజవాడలో నన్నొక ప్రశ్న వేశారు దంటు సుబ్బావధానులు గారు "ఇది చదివే అంగీకరించారా నాగేశ్వరరావుగా రచ్చు వేయించడానికి?" అని.

అదేమిటో నే నప్పుడాలోచించలేదు.

నాగేశ్వరరావుగారి యీ ధోరణి చూశాక మాత్రం "ఏం జరుగుతుందో చివరికి?" అన్న అనుమానం కూడా పట్టుకుంది.

కాని, ఏమయినా సంతోషమే అనుకున్నాను.

"ఇక దేనికీ అంగీకరించకూడ" దనిన్నీ అనుకున్నాను, దృఢంగా.

ఏమంటే?

నా ఆక్షేపణ లింకా కొన్ని ముందు ముందున్నాయి.

ఆ రెండు మూడు చోట్లా నేను చేసిన ఆక్షేపణలు నభూతాలు.

గొప్ప ఆక్షేపణ లవి నా దృష్టిలో.

కావూ, శుద్ధ అవివేకి నయిపోతాన్నేను.

ఇందులో ఏది తేలినా నాకు సంతోషమే.

"కనక, మరొక ప్రయత్నం చేసుకుందాం అప్పుడు" అని స్థిరపరుచుకున్నాను.

పోతే, రెండు ప్రశ్నలు తోస్తా యీ సందర్భంలో కొందరికయినా.

"మద్రాసులో యెలా జరుగుతోంది కాలక్షేపం?" అనీ,

"పెట్టె అడుగున పడేసిన పొట్టం అలాగే వుందా, ఖర్చయిపోయిందా?" అనిన్నీ.

నావంటి వాళ్ళకే తోచే ప్రశ్న లివి, ధనికులక్కాదు.

కాని, ధనికత్వమూ, నిర్ధనికత్వమూ – ఇవికావు, జీవితాలకు విలవలు తెచ్చేవి.

ఏమి తిన్నా గడిచిపోతుంది, దినం.

ఎక్కడ వున్నా గడిచిపోతుంది జీవితం.

ఒక విధంగా మనిషికివి యెంత ప్రధానాలో, మరో విధంగా అంత అప్రధానాలివి.

ఇవి దర్జాగా వుంటే పొంగిపోవడమూ, హీనంగా వుంటే కుంగిపోడమూ – పామరుల లక్షణాలు.

అనేకమంది మహాకవులు చెప్పారిది, అనుభవంలో కూడా పరమ సత్యంగానే కనపడుతోంది, నాకు.

కనక, ఇవి వివరించడం ధర్మమే అనిపిస్తోంది.

కాక, – ఇంతవరకూ వివరించిన నా అనుభవాలకు వేటికీ తీసిపోవు కూడా యివి.

ఈ కారణంగా, నన్ను బాగా కనిపెట్టిన మరికొందరు పెద్ద మనుష్యులను స్మరించుకోడం కూడా నా విధి.

వీటిలో రెండోది – పొట్టం మాట చెప్పవలసిం దేమంత లేదు.

వీర పూజ ప్రకటన పూర్తి అయి – బిల్లు చెల్లించడం కూడా కూడా అయిపోయి – నాలుగయిదు మాసాలకు పుస్తకాలన్నీ యింటికి పట్టుకు వెళ్ళిపోయాకగూడా నా పెట్టెలోనే వుంది, మరికొంత కాలం అది.

ఖర్చుమాత్రం అయిపోయింది, చివరి కెందుకో.

అసలెందుకోసం జాగ్రత్తపడ్డానో అందుకోసం మాత్రం కాదు.

ఇక మొదటి ప్రశ్న.

చెలికాని సూర్యారావుగారని చిత్రాడ కాపురస్థులు.

సంపన్నులు, ఉదారులున్ను.

వెలమదొరలు వారు, రాజకుటుంబీకులున్ను.

కడియం దరివీరవరంలో, దామెర పార్థసారథిరాయణంగారి ద్వారా వారితో నాకు పరిచయం.

వారూ వారూ చాలా దగ్గరి బంధువులు.

బంధుత్వమే కాదు, చాలా ఆత్మీయతకూడాను, వారికి.

మద్రాసు వెడుతున్నాననీ, యీ పనిమీద యీ విధంగా వెడుతున్నాననీ చెప్పగా, నా చేతికొక చీటీ రాసి యిచ్చారు సూర్యారావుగారు.

రూపాయల పొట్లంతోపాటు పెట్టెలోనే వుందది.

అయితే, నాగేశ్వరరావు పంతులుగారి ఔదార్యంతో వీరపూజ అచ్చు ప్రారంభం అయేదాకా అది పైకి తియ్యగూడదనుకున్నా న్నేను.

రాజమహేంద్రవరంలోనూ, బెజవాడలోనూ దొరికిన సాయంతో నిరాందోళనగా మద్రాసు ప్రవేశించిన్నాడే యిది యిలా స్థిరపరుచుకున్నా న్నేను.

అది స్థిరపడింది, ఇది వెంటనే పైకి తీశాను.

ఉన్నవ భానుమూర్తిగారని వొక పట్టభద్రులు.

సైదాపేటలో మకాం వుంటూ మద్రాసులో బి.ఎల్. చదువుతున్నారు వారు, అప్పుడు.

ఉదయం తొమ్మిదయేదాకా ఆంధ్రపత్రిక ఆఫీసులో రైటర్సు టెలిగ్రాములు తెనుగు చేసేవారు, మరి కొందరితో పాటు, వారున్ను.

ఆ పనికోసం చీకటితోనే బయలుదేరి వచ్చేవారు, వారు పట్నం.

తొమ్మిదిలోపున ఇంటో భోజనం చేసి, వారి తమ్ముడుగారు, వారికోసం భోజనం తెచ్చేవారు, సైదాపేటనుంచి.

మళ్ళీ రాత్రి భోజనాని కింటికి వెళ్ళిపోయేవా రన్న దమ్ములిద్దరూ, కలిసి.

నా పని నిశ్చితం కాగానే దొరగారిచ్చిన చీటీ అందించాన్నేను, భానుమూర్తిగారికి.

“చాలా సంతోషం. మీరు తప్పకుండా మా యింటికి రావచ్చు”నన్నారు వారు, ఆ ఆఫీసులోనే యేర్పడ్డ పూర్వ పరిచయంతో.

కొంతకాలం నా కాతిథ్యం యివ్వవలసిందని, దొరగారి ఆ చీటీ.

ఫోర్టుస్టేషను, హైకోర్టు నానుకునే వుండే దప్పుడు.

పాతబడ్డ రెయిలీబోగీ మాత్రమే స్టేషను భవనం.

9-0, 9-30, 10-0 గంటలకు, ఉదయం మూడు రెయిళ్ళు వచ్చేవి చెంగల్పట్టునుంచి, దీచికి.

ఫస్టాఫీసరు, సెకండాఫీసరు, థర్డాఫీసరు అని వాటికి పేర్లు.

మద్రాసు కచేరీల్లోనూ, షాపుల్లోనూ, కంపెనీల్లోనూ పని చేసేవారు, చాలామంది, మద్రాసులోనేకాదు, చెంగల్పట్టు దాకా స్టేషనున్న వూళ్ళలో కాపరం వుంటారు.

ఇప్పటికీ యింతే యిది.

వారికోసం యేర్పడ్డవే ఆ రెయిళ్ళు.

ఆవిరి రెయిళ్ళకు బదులు, మెరుపు రెయిళ్ళు నడుస్తున్నాయిప్పుడు.

సాయంకాలమున్నూ, వొకటి తరవాత వొకటిగా చెంగల్పట్టు వెడతా యివి.

ఇప్పుడు సంఖ్యా యెక్కువయింది, వేగమూ యెక్కువయింది ఆ రెయిళ్ళకు.

ఫోర్టుస్టేషన్నుంచి, సైదాపేటకు అయిదు కానుల టిక్కట్టప్పుడు.

భానుమూర్తిగారితో కలిసి సాయంత్రం సైదాపేట వెళ్ళి, భోజనం చేసి, ఉదయమున్నూ భోజనం చేసి, వారి తమ్ముడు గారితో కలిసి మళ్ళీ మద్రాసు వచ్చేవాణ్ణి నేను.

డబ్బుఖర్చు తగ్గడంతోపాటు, భానుమూర్తిగారి యింట చక్కని భోజన సుఖమున్నూ యేర్పడింది నాకు.

సైదాపేట వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ కూడా ప్రతీ రెయిల్లోనూ జీతగాళ్ళదే ప్రాముఖ్యం.

వారి చిత్తవృత్తి అదో ప్రపంచం.

తక్కినవారిలో, మళ్ళీ తక్కినవారిమాట యేమయినా, చాలీచాలని జీతాలతో ఆ బహు సంఖ్యాకుల చిత్తవృత్తిలాగే, ఉండీ ఉండని డబ్బుతో నా చిత్తవృత్తిన్నీ ఘూర్ణితం అయిపోతూ వుండేది.

ఇలాగ, రమారమీ రెండు మాసాలు గడిచింది, నాకు.

ఈ రెండు మాసాల్లోనూ వీరపూజ అచ్చు ముగిసిపోయింది.

ఏమనుకున్నారో, ఆ రెండుమాసాల్లోనూ, నా రచన విషయమై సవరణలూ సూచించలేదు, చర్చలూ సాగించలేదు నాగేశ్వరరావుగారు.

భానుమూర్తి గారు నన్నెంతో ఆదరించారు సోదరప్రేమతో.

కాని, ఉన్నట్టుండగా వారి భార్యకు జబ్బు చేసింది.

భానుమూర్తిగా రామెని పుట్టింట దిగబెట్టి వచ్చారు.

మళ్ళీ హోటలు భోజనం చెయ్యవలసి వచ్చింది, నాకు మద్రాసులో.

## 28

తిరువల్లిక్కేణి–తాండవరాయ మొదలివీధి – 31వ నెంబరు మేడమీద తెనుగు విద్యార్థుల వొక లాడ్జి.

కింది అంతస్థులో వొక తెనుగు హోటలున్ను.

బి.ఏ. ఆనర్సు చదువుతూ మా పింతల్లి కొడుకొకడూ, ఇంజనీరింగు కాలేజీలో చదువుతూ మా మరో పింతల్లి అల్లుడొకడూ వుండేవా రా లాడ్జిలో.

అప్పుడూ అప్పుడూ వారిని చూడ్డానికి వెడుతూ వస్తూ వుండడంలో అక్కడి విద్యార్థులందరితోనూ బాగా పరిచయం యేర్పడింది, నాకు.

సముద్రాల వెంకటాచార్యులుగారని వారిలో వొక అనర్ఘ విద్యార్థి.

నా మీద అపరిమితమైన ఆదరభావం యేర్పడింది, వారికి.

"వద్ద వ"ద్దంటున్నా, నా చేత అష్టావధానం చేయించారు, తమ లాడ్జిలో వారు.

ఆచార్యులుగారూ, తక్కిన విద్యార్థుల్లో చాలా మందీ కూడా అదే మొదటిమాటు అష్టావధానం చూడ్డం.

నేత్రావధానమే తక్కువ; కాని అప్పుడున్నూ బాగా నెరవేరిందది.

అది మొదలు ఆచార్యులుగారు బహిః ప్రాణంగా చూసుకోసాగారు, నన్ను.

మర్నాడు తక్కిన విద్యార్థులతో మాట్టాడారు వారు "శాస్త్రిగారిని మన లాడ్జిలో ప్రవేశపెట్టుకుందాం. బాడుగ పుచ్చుకోకుండా వారి కిక్కడ వసతి కల్పిద్దాం" అని.

వెంటనే నే నక్కడ ప్రవేశించవలసి వచ్చింది.

కింది అంతస్థులో తెనుగుహోటల్లో భోజనం.

నిడదవోలినుంచి వచ్చి కామేశ్వరమ్మ అనే ఆవిడ సాగించే దా హోటలు.

నెలకు పదిరూపాయలు పుచ్చుకునే దావిడ.

ఆ పదిరూపాయలున్నూ నెల ముగిసిన్నాడే పుచ్చుకునేది. ముందుకాదు.

అది చాలా మంచి సదుపాయమే నాకు, మరి, అప్పుడైనా ఆ డబ్బుమాట?

ఉన్నవ భానుమూర్తిగారి దయతో మరుపువచ్చిన యీ దిగులు మళ్ళీ మొదటికి వచ్చింది, నాకు.

బ్రాడ్వేలో వొక కాఫీ హోటలు గుమ్మం దిగుతున్నా నొకనాడు నేను.

సరిగా, అదే గుమ్మం యెక్కుతున్నాడు కొత్తా శ్రీరామశాస్త్రి ఆ సమయాన.

"బ్రదర్" అంటూ నా చెయ్యి పట్టుకున్నా డతను, నేను చూడలే దతణ్ణి.

లోపలికివెళ్ళి కూచున్నాం.

అప్పటికి జరిగిన వీరపూజసంగతి అంతా చెప్పా న్నేను.

వింతపడ్డా డతను.

"చాలా గొడవ జరిగిందే" అన్నాడు.

నిశ్చలంగా కిందికి చూస్తూ, వొక్కమాటు తల పంకించుకున్నా డెందుకో.

అక్కడి పనికాగానే బయలుదేరాం.

"వావిళ్ళ వారి దగ్గిరికి వెడదాం, రా" అంటూ తన వెంట తీసుకువెళ్ళాడతను.

వావిళ్ళ వారిని కలుసుకోవాలని చాలా వుండేది నాకు, మద్రాసు వెళ్ళకముందు కూడా.

వెంకటేశ్వరశాస్త్రిగారి మొగాన దీక్షా యేకాగ్రతా చాలా ముమ్మరంగా కనపడ్డాయి నాకు.

తన పని అయాక, నన్ను పరిచయం చేశాడు శ్రీరామశాస్త్రి, వారికి.

తా మొకనాడు, నా గురువులు రామకృష్ణకవులను, పిఠాపురం మహారాజులుంగారి డన్మోరు హౌసులో కలుసుకున్నట్టు చెబుతూ నా మిథునానురాగం ప్రస్తావనా, శృంఖల ప్రస్తావనా కూడా చేశారు శాస్త్రిగారప్పుడు.

వీరపూజ పరిస్థితులున్నూ చెప్పాడు శ్రీరామశాస్త్రివారికి.

చివరికి లేస్తూ "మీరు చేరదియ్యవలసిన రచయిత యితను" అనిన్నీ చెప్పాడతను, వారికి.

"రే పొకమాటు కనపడండి" అన్నారు వెంకటేశ్వరశాస్త్రి గారు, దానిమీద, నన్ను.

"రేపే కాదు, తరుచు వెళ్ళి కలుసుకుంటూ వుండు వారిని" అని చాలా గట్టిగా చెప్పాడు నాకు, ఇవతలికి వచ్చాక.

## 29

వారున్నూ రమ్మన్నారు కనక, మర్నాడే వెళ్ళాన్నేను, వావిళ్ళ వారి దగ్గిరికి.

లోకాభిరామాయణం నడిచిందొక అరగంటసేపు.

"తమ తండ్రి రామస్వామి శాస్త్రిగారు, చిన్నతనంలో, ద్రాక్షారామలో చదువుకున్నా"రని చెప్పా రా సందర్భంలోనే వెంకటేశ్వరశాస్త్రిగారు.

నేను మద్రాసువచ్చిన కారణమూ, ఇక్కడ కాలక్షేపం చేస్తున్న పద్ధతీ, కూడా వచ్చాయి, వీరపూజ విషయంతో పాటు.

తరవాత, గుజరీపుస్తకాల కట్ట వొకటి తీశారు వారు, టేబిలు సొరుగులోనుంచి.

అందులోనుంచి వొక చిన్న పుస్తకమున్నూ తీశారు.

"ఇది చెన్నపట్నం బజారు భాషలోవుంది. సులభ గ్రాంథికంలో ఇది సవరించి యిస్తారా?" అనడుగుతూ నా చేతిలో పెట్టారది, చివరికి, వారు.

"మర్యాద రామన్నకథలు" అన్నది ఆ పుస్తకం.

ఆ భాషేకాదు, కాగితాలూ అచ్చూ కూడా అధ్వాన్నంగా వున్నాయి చాలా.

ఒకటి రెండుచోట్ల, పదేసీ యిరవయ్యేసీ బంతులు చూసి "సవరించి తెస్తా" నని చెప్పాన్నేను.

అప్పటి కంతే జరిగాయి మాటలు, సవరణ విషయమై.

ఆంధ్రపత్రిక ఆఫీసుకి వెళ్ళిపోయి, రెండుమాట్లు చదివా నా పుస్తకం, సొంతంగా.

బసకు వెళ్ళి, భోజనానంతరం కలమూ కాగితాలూ పుచ్చుక్కూచ్చున్నాను, నా గదిలో.

మంచి కథలవి.

నిజంగా చిన్నకథలు.

మంచి యుక్తులున్నాయయా కథల్లో.

నా బుద్ధి చాలా చమత్కృతం అయింది, వాటితో.

ఈ వుత్సాహంతో సవరించి రాశానవి, విధిలేకా, డబ్బుకోసమూ కాదు.

పదిన్నరకి పడుకున్నాను పూర్తిచేసి; కాని నిద్రపట్టలేదు, చాలాసేపు, నాకు.

"వావిళ్ళ వారిపరిచయం స్థిరం అవుతుందా, తాత్కాలికమే అవుతుందా?" అని విచికిత్స.

"మన సవరణ వారికి నచ్చుతుందా, నచ్చదా?" అని మీమాంస.

"ఈ సవరణ కేమిస్తారు మనకి?" అని ఆకాంక్ష

ఈ జిజ్ఞాసతో పాటు, అంత చిన్నపుస్తకం అంత శ్రద్ధాభక్తులతో ప్రకటించడానికి పూనుకున్న శాస్త్రిగారి రుచివైవిధ్యానికి సంబంధించిన మెప్పు కొంత.

అంతంత–అన్ని–పుస్తకాలు ప్రకటించినవారు, ఇంత చిన్ని పుస్తకం మీద లాభాని కాశించడం చూసి వింత కొంత.

మొత్తానికి వొంటిగంటదాకా పొడికళ్ళు పడిపోయాయి, దీంతో నాకు.

ఎలాగో నిద్రపట్టింది–దానికదే తెల్లవారి పోయింది.

స్నానం చేసి కూచుని, అక్షరస్ఖాలిత్యాలు సవరించాను, ముందు.

విద్యార్థులందరితో పాటు భోజనంచేసి, యుక్తకాలాన పట్నం వెళ్ళిపోయాను, తరవాత.

రాతప్రతీ, గుజిలీప్రతీ చేతిలో వుంచాటప్పటికీ చకితులైనారు, శాస్త్రిగారు.

ఏ వారం రోజులకోగాని నేనాపని పూర్తిచెయ్య ననుకున్నారుట మరి, వారు.

ముందది చదువుకోవాలి, వారు.

బాగుందనో బాగా లేదనో తేల్చుకోవాలి, తరవాత.

కనక "ఆంధ్రపత్రిక ఆఫీసులో ప్రూఫులపని చూసుకుని, మళ్ళీ నాలుగింటికి వస్తా"నని చెప్పి వెళ్ళిపోయా న్నేను.

ఎంతో కొంత డబ్బిస్తారు వారు, సందేహం లేదు.

అయితే, నాడే యిస్తారా, వాయిదా వేస్తారా?

"మళ్ళీ నాలుగింటికే వస్తా" ననడం డబ్బుకోసమే అన్నట్టయిందా?

ఈ చర్చలో పడ్డా న్నాలోనేను.

"దీనికంత ప్రతిఫలం" అని వారూ చెప్పలేదు, నేనూ తేల్చుకోలేదు.

కనక, వారెంతయిస్తే అంతతోనే తృప్తిపడ్డమా, కొసరడమా?

కొసిరితే యేమిటి, కొసరకపోతే యేమిటి?

ఇది కూడా వొక చర్చే అయింది, నాకు.

పర్సులో మహావుంటే రూపాయకులోపు, ఆ వేళ.

వారొక రూపాయే యిచ్చినా వేన్నీళ్ళకు చన్నీళ్ళ సాయం.

ట్రిప్లికేనులో జెండామొరం దగ్గిరనుంచి పట్నంలో లా కాలేజీదాకా రానూపోనూ బండిఖర్చు రెండణాలప్పుడు.

ట్రామెక్కినా అంతే ఖర్చు.

కాగా, వారంరోజులు నిశ్చింతగా గడిచిపోతాయి.

## 30

ఈ నిశ్చయంతో వెళ్ళాను మళ్ళీ వారిదగ్గిరికి, పెద్ద ఆశ లేమీ పెట్టుకోకుండా.

"వీరికి 15–0–0లు ఇచ్చేది" అని వొక స్లిప్పురాసి చేతికిచ్చారు శాస్త్రిగారు, వెంటనే.

విస్మితుణ్ణయి పోయాన్నేను.

శ్రామికుల మనస్తత్వాన్ని పట్టి చూస్తే పెద్ద మొత్తమే అది.

కాని, "ఉచితం" అని వుంది ఇంగ్లీషులో, సంతకంపైని.

"ఆ మొత్తం ప్రతిఫలం కాదు" అన్నారు వారు, నా వాలకం గుర్తించారో యేమిటో వారు.

"మీకు సాహాయ్యంగా యిచ్చానని, యిప్పటికి" అని కూడా అన్నారు, స్పష్టంగా.

నాకు చాలా ఆనందం కలిగింది.

మద్రాసులో నెలరోజులు గడిచిపోతాయి నా కా డబ్బుతో.

కళ్ళుమూసుకున్నా గడిచిపోతాయి.

ఈ పునాదిమీద– దీంతో గడిచిపోయే రోజుల్లో మరి కొంత సంపాదించుకోవచ్చు.

చేసిన పనికి ప్రతిఫలం కాదిది, ఆ బాపతు ఎంతో మరి కొంత కూడా వుంటుంది.

పైగా "యిప్పటికి" అన్నారువారు, మరొకప్పుడు కూడా చేస్తారన్నమాట, యిలాంటి సాయం వారు.

ఎంతో ధైర్యమున్నూ కలిగింది నాకు.

రెక్కలమీద బతికేవాళ్ళ కిలాంటి ధైర్యమే జీవగ్ర.

కోటీశ్వరులకూ వుంటుంది ధైర్యం, యిలాంటిది మాత్రం కాదది.

ఇంత గంభీరమూ కాదది, యింత రసవంతమూ కాదు.

ఇంత ఉన్నతమూ కాదది, నిష్కలుషమూ కాదు.

ఇంత హార్దికమూ కాదది, యింత పవిత్రమూ కాదు.

దానిచుట్టూ యెన్నో అనుమానాలు, దీనిచుట్టూ మాత్రం నిశ్చింత.

ఇలాంటి యెన్నో సన్నివేశాలవల్ల పేదలబతుకెంతో సరళంగా నడుస్తుంది.

సాదలబతుక్కి మాత్రం మాటమాటకీ అనుమానాలే–క్షణక్షణానా కల్పనలే–నిమిషనిమిషానా కుట్రలే–అడుగడుగునా ద్రోహా లే–ఎటుచూసినా అపాయాలే.

నేనేమీ మాట్లాడకపోడం – మాట్లాడలేకపోడం చూసి శాస్త్రిగారే అడిగారు మళ్ళీ "మీకు డబ్బు కావాలా, మేము ప్రకటించిన పుస్తకాలు కావాలా?" అని.

ఇది కూడా చకితుణ్ణి చేసింది నన్ను.

వ్యాపారరీత్యా చూసుకుంటే పుస్తకాలివ్వడమే సులువూ, లాభమూ కావచ్చు వారికి, కాని, యిలా అడగడంలో యిదేనా వారి ఉద్దేశం?

ఇదమిత్థం అని నిర్ధారణ చెయ్యలేన్నేను, కాదేమో అనిపించింది.

చదువుకుందా మంటే పుస్తకాలులేని స్థితి అప్పటికీ నాది.

తెనుగంటే అంత అభిమానమేకాని – నన్నయభట్టన్నా అంతంత భక్త్యాదరాలున్నే కాని–తెనుగు భారతమే లేదు నా దగ్గిర, అప్పటికీ పూర్తిగా.

ఏమయినా, ఆలోచన రేపింది, నాకీమాట.

"ఎంత యిమ్మంటారు ప్రతిఫలం?" అని వా రడిగివుంటే, డబ్బే అడిగివుందును నే నప్పటి పరిస్థితులనుబట్టి.

ఇటు, కాలక్షేపానికే అవసరం అయేటట్టుండడం కాక, అటు వీరపూజ అచ్చవుతోంది, బిల్లుమీద పడిపోతోంది, పెద్ద పర్వతంలాగ.

కాని, తెనుగులో సాధించుకోవలసిం దెంతో వుంది, నాకు.

ఇప్పటికే ఆలస్యం అయిపోయింది, త్వరపడాలి.

బతిమాలినా పుస్తకాలు అరుదు దొరకని వూరు నాది.

కనక?

"చదువుకో. జ్ఞానం సంపాదించుకో. బాగుపడు" అన్న ఉపదేశం వినపడింది నా అంతర్వాణిది, వారి యీ మాటతో.

అయితే, యెన్ని పుస్తకాలిస్తారు వారు, నాకు?

ఈ మాట స్పష్టంగా అడగడమే నా స్వభావం.

కాని, మొగమాట పడిపోయాను.

అలాంటి పని నేను చూసివుండలే దప్పటికి.

దానికెంతో ప్రతిఫలం సరిపోతుందో వూహాలక్కూడా అందని విషయం నాకు.

కాగా, "కొంచెం లౌక్యం చేదా"మని పించింది, ఎప్పుడూ లేనిది.

"పుస్తకాలే యివ్వం"డన్నాను, సంఖ్య వారే తేలుస్తారన్న గడుసుదనంతో.

కాని, మరోదారిన వచ్చారు వారు, యాదాలాభంగా.

"ఇదిగో కేట్లాగు. మా సొంత ప్రకటనల్లోవి మాత్రమే జాబితా రాసియివ్వం"డన్నారు వారు, కేట్లాగు చేతి కందిస్తూ.

తెల్లపోయాన్నేను.

నా లౌక్యం బెడిసికొట్టింది, మరి.

ధర్మమే.

నేను చేసి వుండకూడని దది.

నా తత్వానికి విరుద్ధమున్నూ పూర్తిగా, అది.

అయితే, యెంత ఖరీదుగల పుస్తకాలకూ జాపితా రాయడం?

గడుసుపోకడ కట్టిపెట్టి, యీ మాటే సూటిగా అడిగేశాను, వారి నప్పుడు.

అదీ వొక చిక్కుకే కారణం, చూసుకుంటే.

ఇవతలివాడు అప్రగల్భుడయితే, మరింత విజృంభిస్తా రవతలివారు, తిప్పే స్వభావం గలవా రయితే.

తమ గడుసుదనం అంతా చూపిస్తారు–తిప్పితిప్పి కొడుతారు మడతపేచీలతో – లోకువచేస్తారు హేళనమాటలు వాడుతూ–యద్దేవా కూడా ప్రారంభిస్తారు తామే ఆకాశాన్నుంచి వూడిపడ్డట్టు మహా–మరొకప్పుడు చూసుకుందాం. అని కూడా అంటారు, నాస్తి పర్యాయంగా, చివరికి.

కాని, శాస్త్రిగారు మితభాషులు కనక, సూటిగానే బదులు చెప్పారు "డెబ్బై యెనభై రూపాయల పుస్తకాలకు జాబితా రాయండి" అని.

పుస్తకాల కిట్టింపుధర చూసుకున్నా, రమారమీ పాతిక రూపాయలన్నమాట నా పనికి ప్రతిఫలం.

సెలగో సెలగ, నేనే అడిగితే పాతిక ముప్పయి రూపాయిల ఖరీదు పుస్తకాలకంటే యెక్కువ అడగలేకపోయి వుందును.

ఆంధ్ర మహా భారతం, ఆంధ్ర మహా భాగవతం, భాస్కరరామాయణం, నిర్వచనోత్తర రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, నాచన సోమన్న ఉత్తర హరి వంశం, శృంగార నైషధం, మను వసుచరిత్రలు, పారిజాతాపహరణం, కళాపూర్ణోదయం, రాఘవ పాండవీయం, ఆముక్తమాల్యద, విజయ విలాసం–ఇలా గాశాను చివరికి, జాపితా.

చూడ్డం తడువుగా "ఉచితం" అని రాసి సంతకం కూడా చేశారు శాస్త్రిగారు.

షాపులో, చంద్రమౌళి శాస్త్రిగారున్నూ అవి చూడ్డం తడువుగా ఇచ్చేశారు డబ్బూ, పుస్తకాలున్ను.

పావలా యిచ్చి, ప్రత్యేకంగా జట్కా చేసుకుని బస కెగిరి పోయాన్నేను, తెరపి మరుపుల్లో.

## 31

వీరపూజ అచ్చు పూర్తయింది.

అపని–12 డబుల్ ఫారాల అచ్చుపని పూర్తికావడానికి ఆరుమాసాలు పట్టింది, పూర్తిగా.

మొదటిఫారం తప్పించి, శ్రీ నాగేశ్వరరావుగారు ప్రూఫులు చూసినట్టు లేదు.

మరేమీ అక్షేపణలు చెయ్యలేదు, వారు, మరి.

నా రచనకు ఉపోద్ఘాతం రాసి యిచ్చారు వారు.

విడిఫారా లివ్వగా పూర్తిగా చదివే రాశారు వారది.

గ్రంథంలో నా ధోరణి నాదీ, ఉపోద్ఘాతంలో వారి ధోరణి వారిదీగా వుంది.

మొదటి ప్రతి వారిచేతిలో వుంచాను పట్టుకువెళ్ళి నేను.

వెంటనే వారో స్లిప్పు రాసి యిచ్చారు నాకు, కాషియరు దగ్గరికి వెళ్ళమని చెబుతూ.

నాకు పాతిక రూపాయ లిమ్మని వుంది, దాల్లో.

ఉదారులపద్ధతి అది, పుస్తకం చేతిలో వుంచితే చాలు, నోరు చేసుకుని వేరే అడగనక్కరలేదు, ఎంతో కొంత తమకి తామే అయి సత్కరిస్తా రెంతో కొంత యిలాగ, వారు.

పుస్తకం అచ్చు వేయించిపెట్టమనే నేను కోరింది వారిని, పైగా, ద్రవ్యం కూడా యిమ్మని నా వుద్దేశమున్నూ కాదు; కాని నాగేశ్వరరావుగారి పద్ధతి అది.

"అది, యిక్కడ, మీరు కాలక్షేపం చేసుకోగలగడాని కిచ్చా"నంటూ కూడా స్పష్టంగా చెప్పారు వారు.

"పుస్తకాలు మీ వూరు తీసుకువెళ్ళండి, నాదగ్గిర వుంచనక్కరలేదు. వ్యవహారం అంతా మీరే చూసుకోండి. బిల్లు మాత్రం సాధ్యం అయినంత తర్వగా చెల్లించండి" అనిన్నీ చెప్పారు.

నా విషయమై తమ పథకం మార్చుకున్నారా వారు?

కానయితే, ఆ పథకం అనుసరించి వారెవరి పుస్తకాలూ కూడా అచ్చు వేయించినట్టు లేదు, తరవాత్తరవాత కూడా.

ఆ పథకం కొంత మార్చి, ఆంధ్ర గ్రంథమాల రూపించుకున్నా రేమో వారు, నేను చెప్పలేను.

అన్ని విధాలా కృతజ్ఞత విన్నవించుకున్నాను వారికి.

"ఇంతలో యింటికి వెళ్ళను. ఇక్కడేవుండి, డబ్బు సంపాదించుకుని బిల్లు చెల్లిస్తాను. అది చెల్లిపోయేదాకా కదలను" అనిన్నీ చెప్పాను వారికి.

దాని మీద అన్నారు వారు, "కొమర్రాజు లక్ష్మణరావుగారినీ, పండిత గోపాలాచార్యులుగారినీ చూడ"మని.

అప్పటివరకూ "ఫలానా ఫలానా వారిని చూడ్డా"మనే అనుకోలేదు నేనిద మిత్థంగా లక్ష్మణరావుగారి దర్శనం చెయ్యాలని మాత్రం మద్రాసు వెళ్ళకపూర్వం అనుకుని వున్నాను.

నా వీరపూజ చూడాలి వారు.

సూటిగా వారి మాటలూ విమర్శించివున్నా న్నేను నా రచనలో, పేరుమాత్రం పెట్టకుండా.

కనక, వారు నన్నేమంటారో చూసుకోవాలి.

కాక,–చారిత్రకంగా వారిమాటే వేదవాక్యం మన జాతికి.

వారు, నా విమర్శ ఆక్షేపించవచ్చు, నాది దుస్సాహసం అనవచ్చు, నేను స్వతంత్రించి అలా రాయడం మంచిది కాదన వచ్చు, నా ఆక్షేపణలు లెక్కచెయ్యకే పోవచ్చు కూడా, ఏమయినా నా రచన వారు చదవాలి.

వీలయితే, నేనే చదివి వినిపించాలి, వారికి.

అది పెద్ద మన్నన నాకు.

ఎటు చూసినా, హిమవత్పర్వత సానువుల్లో వొక చలిచీమ వంటివాణ్ణి వారి యెదట నేను.

వారి దర్శనం చేసుకోడమే వొక విశేషం నావంటి వాళ్ళకి.

కాగా, నాగేశ్వరరావుగారు చెప్పిన వెంటనే, రెక్కలు కట్టుకుని వారియెదట వాలా లన్నంత ఆత్ర పడ్డాన్నేను.

కాని, సాయంత్రం అయిదు కావస్తోందప్పటికి.

అప్పుడు వారి దర్శనం కావడం సందేహాస్పదం.

వెంటనే నాగదిలోకి వెళ్ళిపోయి, అచ్చూ, పుస్తకం ఆకృతీ చూసుకుంటూ మురిసిపోతూ కూచున్నాను.

వీరపూజ పూర్తి కాలికోబయిండు చేయించారు పంతులుగారు.

దేవరతో బజారుకి వెళ్ళి, స్వయంగా ఏరుకుని ఎర్రకాలికో కొనిపించా న్నేను.

అప్పుడు గజం పావులా వెల, సీమ కాలికో అయినా.

స్ఫుటంగా వుంటే, యేరంగయినా నా కిష్టమే; కాని యెరుపు రంగయితే మాత్రం ప్రత్యేక ప్రీతి.

నాగేశ్వరరావుగారు పూనుకుని వుండకపోతే, మరెన్ని విధాల ప్రయత్నించినా నా వీరపూజ ఆకృతికంత ఔజ్జ్వల్యం వచ్చి వుండేది కాదు.

అది చూసుకుని, నే నప్పు డనుభవించిన ఆనందానికి పరిమితి చెప్పలేన్నే, నిప్పుడున్నూ.

నిజంగా, నేనారాత్రి, నిద్రలోనే మునిగిపోయానో, ఆ ఆనందంలోనే మునిగిపోయానో చెప్పలేను, భళ్ళున మాత్రం తెల్లవారింది.

స్నానాదికం ముగించుకున్నాను, వెంటనే ఎగ్మూరు బయలుదేరాను, ట్రామెక్కి.

"వేదవిలాసం"లో వున్నారు లక్ష్మణరావుగారు.

వెళ్ళి, నా చీటీ యిచ్చి "రమ్మని సెలవయింది" అని చెప్పాడు నౌకరు వచ్చి.

కింది మెట్టుమీద అడుగు పెట్టి పైకి చూశాను, పై మెట్టు దగ్గిర నుంచుని వున్నారు వారు, కిందికే చూస్తూ.

వారి సౌజన్యమూ, వారి నిరాడంబరతా, వారి వేష భాషలూ అనేకులు చెప్పగా విని వున్నాను; కాని దివాను పదవిలో వుండినవారు, అంత "సామాన్యం"గా వుండడం చకితుణ్ణి చేసింది, నన్ను.

తాము, తమచుట్టూ, ఏమిటేమిటో కాగితాలు, తాటాకు పుస్తకాలూ, ఇంగ్లీషుపుస్తకాలూ తెరిచి పరిచి వున్న పెద్ద తుంగచాప మధ్యగా కూచుని, పక్కగా స్థలం చూపించారు వారు నాకు, కూచోమని.

ముందు కూచుని, వెంటనే లేచి సవినయంగా వంగి నా వీరపూజ ప్రతి సమర్పించుకున్నాన్నేను వారికి, నా అసమర్థత నివేదించుకుంటూ.

అది అందుకోడంలో యెంతో ప్రీతి చూపించారు వారు, అయితే "మీ వీరపూజ చూశా"నన్నారు మొదటే.

"చదివా"నన్నారు.

"గంభీరమైన రచన" అని కూడా అన్నారు.

తెల్లపోయా న్నేనది విని.

అచ్చు పూర్తయాక–బయిండున్నూ అయాక – అయిన వెంటనే – ఉత్తర క్షణంలోనే – మొదటి మూడు ప్రతుల్లోనూ అప్పటికప్పుడు నాగేశ్వరరావుగారి చేతిలో వుంచినది మొదటిదీ, మర్నాటి ఉదయం లక్ష్మణరావు పంతులుగారి చేతిలోనే వుంచినది రెండోదిన్నీ.

కాగా–వారది చూడ్డమూ, చదవడమూ, వొక అభిప్రాయం యేర్పరుచుకోడమూ ఎలా సంభవించిందీ?

ఇది అవగాహన కాక అలా తెల్లపోయాన్నేను.

అది గుర్తించి వారే చెప్పారు జరిగిన సంగతి.

"హెచ్.వి. కృష్ణ – అండుకో" అని మద్రాసులో వొక పబ్లిషింగు ఏజన్సీ అప్పుడు.

"హరి సర్వోత్తమరావు – వీరభద్రరావు – కృష్ణ – అండుకంపెనీ" అని దాని పూర్తిపేరు.

"కృష్ణ" అంటే చతుర్వేదుల వేంకట కృష్ణయ్యగారన్న మాట.

నెల్లూరు వారిది.

చతర్వేదుల రాఘవయ్యగారి కుమారులాయన.

రాఘవయ్యగారంటే - తరవాత్తరవాత - కాంగ్రెస్సు వలయంలో పల్లెపాటి సత్యాగ్రహ యోధులు.

మద్రాసులో - తెనుగు ప్రముఖుల్లో చాలామందికి - తలలో నాలుక, కృష్ణయ్యగారు.

దినమ్మూ ఆంధ్రపత్రికా ప్రెస్సుకి వచ్చేవా రాయన.

ఇటు నా వీరపూజ అచ్చు పడే సమయానే, అటు, మాడపాటి హనుమంతరావుగారి మల్లికాగుచ్ఛం అచ్చువేయించే వారాయన.

ఆ సందర్భంలో మాకు పరిచయం.

ఆంధ్రపత్రికా ప్రెస్సులో సొంతం అన్నట్టు ప్రవర్తించేవారాయన.

వీరపూజ, ఏ ఫారాని కా ఫారం చదివారాయన, అచ్చు పడ్డం తడువుగా.

ఏమిటేమిటో రిమార్కులూ చేసేవారు.

"ఏ ఫారాని కా ఫారం ఆ కృష్ణయ్యగా రందించారు నాకది" అని వివరించారు లక్ష్మణరావుగారు.

"తనకితానే తెచ్చియిచ్చే వా రాయన. ఆయన యివ్వడం తడువుగా చదివేస్తూ వచ్చాన్నేను. మీ రచన నన్ను బాగా ఆకర్షించింది" అని కూడా అన్నారు వారు.

"మీ రచనలో - నా సిద్ధాంతాలమీద - ఎక్కువగా పరోక్షంగానూ, సకృతులుగా ప్రత్యక్షంగానూ ఆక్షేపణలున్నాయి. నన్ను మీరలా ఆక్షేపించడం సహించలేకపోయా రాయన, అంచేత, తెచ్చి యిస్తూ వచ్చారు నా కవి, యెప్పటి కప్పుడే. నేను మరోలా అవుతానని ఆశించా రాయన. కాని, మీ రచన మెచ్చుకున్నాన్నేను. ఆయన అనుకోని పర్యవసానం అది." అనిన్నీ అన్నారు.

"మీ ప్రవృత్తి కొంతవరకూ చెప్పారాయన. స్వచ్ఛమైన హృదయంతోనే మీ పరిచయం సంపాదించుకున్నా రాయన మొదట; కాని మీ ఆక్షేపణలు చూశాక కొంచెం అసంతృప్తులయినారు. అందువల్లనే నాకవి తెచ్చి యిస్తూ వచ్చారు. కాని నేను మెచ్చుకోడం చూసి మీ విషయమై కొంచెం వెనక్కి తగ్గారు. అప్పటివరకూ చాలా "ఆగ్రహం"గానే వున్నారాయన మీ విషయమై, వారితో దినమూ కలుసుకుంటూ వుండేవారు మీరు, కనక, వారి మనః ప్రవృత్తికి సంబంధించిన దశాక్రమం మీరు గుర్తించే వుంటారు" అనిన్నీ చెప్పారు, చివరికి.

చాలా వింతపడ్డా న్నేను.

కృష్ణయ్యగారు చాలా స్వతంత్రులు, మొదటే అవగాహన అయింది నా కా సంగతి.

మిక్కిలీ దురుసు తనం వారిది.

తన పద్ధతికి భిన్నంగా ప్రవర్తించేవారంటే, కొంచెం విరసంగా మాట్లాడేవారు.

సాధ్యం కాకపోతే, తన అసంతృప్తి-తమ అనిష్టం అయినా స్పష్టంగా ప్రకటించేవారు, తమని ఏవిధంగానూ గుర్తించనివారి యెదుట కూడా.

"పెద్ద కుండలకు ఎసరు పెడుతున్నారు మీ" రన్నారాయన యెన్నో మాట్లు నన్ను.

నేనూ తక్కువ చెయ్యలేదు.

ప్రతిఘటించాను.

డీకున్నాను.

అయితే, మేమెప్పుడూ కటు భాషల్లోకి వెళ్ళలేదు.

కలుసుకోడం మానలేదు.

మాట్లాడుకోడమూ మానలేదు.

"మీ ఆక్షేపణలెవరు లెక్క చేస్తారు లెండి" అని తన భావం స్ఫుటంగానే చూపించా రాయన వొకమాటు, చివరికి.

"మీ ప్రామాణికత్వం యేమిటిందులో, అసలు?" అని దృఢంగా ప్రశ్నించా న్నేనాయన్ని.

కాని "వోహో" అంటే "వోహో" అనే అనుకునే వాళ్ళం సాధారణంగా.

నాకు బాగా అవగాహన అయిందేమిటంటే?

ఆయన్ని తమ దగ్గిర చేర్చుకోడం వల్ల—ఆయనకు చనువివ్వడం వల్ల—మద్రాసు ఆంధ్రుల్లో చాలామంది—యేదో విధంగా ప్రముఖులయి వున్నవారు తామూ తామూ దూరం దూరం అవుతూ వచ్చారు.

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు చాలా గర్హించేవారాయన్ని.

గోపాలాచార్యులవారు, ఆయన ప్రస్తావనే సహించేవారు కారు.

అయితే, ఆయన వేగునమ్మి, తమ ప్రవృత్తి మార్చుకోని వారున్నూ లేకపోలేదు మద్రాసులో కొందరు, లక్ష్మణరావు పంతులుగారి వంటి వారు.

## 32

నా ఆక్షేపణల ప్రసక్తి వచ్చింది.

నాకు నేనే తెచ్చాను.

ప్రసక్తాను ప్రసక్తంగా, నాగేశ్వరరావుగారు నన్నాక్షేపించడమూ, భానుమూర్తిగారు నన్ను సమర్థించడమూ – ఇదీ వచ్చింది.

"అంతా విన్నా"నన్నారు లక్ష్మణరావుగారు.

చకితుణ్ణయి పోయా న్నేను.

ఈ గొడవ, నాకూ నాగేశ్వరరావుగారికి, భానుమూర్తి గారికీ మాత్రమే పరిమితం అయివుందని నా నమ్మకం.

అది అలా కాలేదని తేలింది, దీంతో.

అయితే, లక్ష్మణరావుగారు చాలా చక్కగా పరిష్కరించారా గొడవ.

"కూటనీతి మొదణ్ణుంచీవుంది, ఆచరణలో. మన జాతిలోనూ వుంది, కావలసి నంత—అయితే, మన పూర్వులది తిరస్కరిస్తూనే వచ్చారెప్పటి కప్పుడు. రాజనీతి ధర్మబద్ధంగా వుండాలని వారి శాసనం. ఆత్మోదయమే రాజనీతి పరమావధి అనుకుంటే మాత్రం పెడదారులు తొక్కవలసే వస్తుంది, సకృతుగా నయినా, ధర్మం పురస్కరించుకునే యేర్పడవు ఘర్షణలు, మరి. అయితే, కూటనీతికి స్వాగతం పలకడంలోనూ, అది అదుపు చెయ్యడం లోనూ చాలా భేదం వుంది. దానికి స్వైరవిహారం అంగీకరించడం అంతగా శ్రేయస్కరం కాదు, పోనీ అంటే, అలా అంగీకరించకపోడంతో, మన పూర్వులు, చాలా దెబ్బలు తిన్నారు చాలా మాట్లు.

ఆ అనుభవం పురస్కరించుకునే చాణక్యాదులు కొత్త సంప్రదాయాలు నెలకొల్పారు. ఆ వాదం అంగీకరించారు మీరు, నాగేశ్వరరావుగా రంగీకరించ లేక పోయా రది" అన్నారు వారు, మొదట.

"అయితే, వీరపూజ అచ్చువేయించి యివ్వడానికి మాత్రమే నాగేశ్వరరావుగారికి పూనిక. మీ రచనలో లేశమూ లేదు, వారికి ప్రమేయం వారి యిష్టానికీ అనిష్టానికీ గూడా అతీతం మీ రచన. అంచేత, మీ రచన విమర్శించడానికీ ఖండించడానికీ మాత్రమే వారి కధికారం. మీ స్వేచ్ఛకు అడ్డు తగలడంలో, తమ ధనికత పురస్కరించుకుని వారు కొంత తప్పుదారి తొక్కారనే చెప్పాలి" అన్నారు తరువాత.

"మీ రచన సమర్థించడంలో భానుమూర్తిగారు కనబరిచిన ఔదార్యమూ, ఔచిత్యమూ చాలా స్తవనీయాలు" అని ఒప్పుకున్నారీ కారణం పురస్కరించుకుని.

"అయితే, ఒకటుంది. "అయితే, చాణక్య ప్రభృతులగునప్పటి రాజనీతిజ్ఞుల దృష్టిలో, రాజనీతి ప్రవృత్తి యిట్టిదని నిర్వచించుటకు వలనుపడదు" అని నాగేశ్వరరావుగారి సవరణ. అగతికమైన స్థితిలోనే మీ రచనలో మీ రా సవరణ చేర్చుకున్నారు మీరు, సందేహం లేదు. ఈ కొత్త సంప్రదాయం ప్రారంభించినవారు మీరు కారు. మన పూర్వులే–చాలా చాలా పూర్వులే–మిక్కిలీ సమర్థులయినవారే చేశారాపని. నాగేశ్వరరావుగారే యిది అంగీకరించారు. అయితే, తాము పాత సంప్రదాయం అంగీకరించేటట్టే, మీ రెండు కంగీకరించగూడదూ కొత్త సంప్రదాయం? ఈ జిజ్ఞాస కలగలేదని మాత్రమే చెప్పాలి వారికి" అని నిర్ధారణ చేశారు, దృఢంగా.

"చివరికి తేలిందేమిటీ? విదేశీయులతో ఘర్షణవచ్చినప్పుడు, మనవాళ్ళ క్కలిగిన కొత్త అనుభవంతో, మనవాళ్ళే ప్రారంభించిన కొత్త సంప్రదాయం సమర్థించడం మీ పూనిక. అయితే, అంతకిముందు, నాగేశ్వరరావుగారు, మన అసలు సిద్ధాంతం బాగా వివరించమని మిమ్మ కోరి వుండవలసింది. తరవాతే కొత్త సంప్రదాయం బలపరుచుకోమనీ కోరి వుండవలసింది. మీ రయినా చేసి వుండవచ్చు స్వయంగా అది, మీ తప్పు కాదు. కాని మిమ్మల్నందుకు నిర్బంధించడం మాత్రం ధర్మం కాదెవరికీ," అని ఒప్పుకున్నారు కూడా.

"అయితే, ఆ కొత్త సంప్రదాయం అంగీకరించడం మాత్రం తప్పనిసరి అయింది నాగేశ్వరరావుగారికి. ఇదీ వారు చేసిన సవరణ ఆంతర్యం" అని నిర్ధారణ చేశారు, చివరికి, వారు.

ఇది నాకు విజయమా అపజయమా? పోనీ, నేను భానుమూర్తిగారి సలహా అంగీకరించడం తప్పనడమా యిది, ఒప్పనడమా?

"మరి, కనక?" అనడిగాన్నేనీ జిజ్ఞాసతో, వినివిని.

చూశారు చూశారు లక్ష్మణరావుగారు.

నా పట్టుదల గుర్తించారు.

బహూ సమర్థులు వారు.

నిండుకుండ.

ఎలాంటి ఘర్షణా కూడా అతి తెలివిగా చల్లబరచగలవారు.

"ఇందులో జయాపజయాల ప్రసక్తి తేనక్కరలేదు. ఔచిత్యం మాత్రం కొంచెం దెబ్బతింది, అంతే" అన్నారు కూడా.

ఎలాగో వొకలాగ నా రచన నలుగురికీ అందుబాటయింది.

నా వాదం బోధాపడింది.

కనక, నాగేశ్వరరావుగారి ఆక్షేపణే పట్టుకొని పాకులాడ్డంలో సొగసులేదు.

ఇది గుర్తించుకున్నా న్నేను.

లక్ష్మణరావుగారి వివరణతో తృప్తిపడి వూరుకున్నానంచేత.

వారే ప్రారంభించారు, మళ్ళీ.

"ఇక పృథ్వీరాజు చేసిన పనివుంది, అది విమర్శించారు మీరు. భీమసింహాదులు చేసిందీ అలాంటిదే. అదీ విమర్శించారు మీరు. మీ వాదం చాలా క్లుప్తంగా వుంది. అయినా చాలా బలంగా వుంది. కొంచెం ఆలోచించాలి నేను. లోతుగానే పరిశీలించాలి. పంక్తి సమన్వయించడంలోనూ, వ్యాఖ్యానం చెయ్యడంలోనూ కొత్తదారి తొక్కారు మీరు. అదీ పరిశోధించాలి బాగా" అన్నారు వారు.

"ఏమయినా, మీ రచన బహూ గంభీరం. దానికి స్వాగతం చెబుతున్నా"నన్నారు, చివరికి, వారు.

## 33

లక్ష్మణరావుగారు గొప్ప పండితులు.

బహుశ్రుతులు.

సర్కారులో సివిల్ క్రిమినల్ అధికారాలు నిర్వహిస్తున్న వారు కాకపోయినా, వొక సంస్థానం దివాను.

వారు రాజసమే చూపించుకుంటే నిరాఘాటంగా చెల్లిపోతుం దది.

కనక, తలుచుకుంటే నన్ను తిరస్కరించవచ్చు, వారు.

నాకు ముఖపిధానం చెయ్యవచ్చు.

కనీసం, నా యెడల నిరసన భావం అయినా కనపరచవచ్చు, బాహాటంగా.

కాని, నా విషయమై వారు చాలా గంభీరంగా ప్రవర్తించారు.

చాలా స్తవనీయంగా ప్రవర్తించారు.

నేను మొదటే చెప్పినట్టు, నాగేశ్వరరావుగారి ఆక్షేపణ ప్రసక్తానుప్రసక్తం మాత్రమే యిక్కడ.

లక్ష్మణరావుగారి రాతల్లో నేను చూపించిన వివాదాంశాలే ప్రధానాలిక్కడ.

మరి, నా ఆక్షేపణ లంగీకరించినట్టా వారు, తిరస్కరించినట్టా?

ఈ జిజ్ఞాసే కలగలేదు నాకు.

విషయ నిగరణంలో వారు చూపించిన ఔచిత్యం కారణం దానికి.

మరి, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారికీ లక్ష్మణరావుగారికీ సాపత్యం యేమిటీ?

పండితుల ప్రసక్తి వచ్చినప్పుడు, వారంతర్ముఖులా, గతానుగతికం బాపతువారా అన్నది, యిలాంటి సందర్భాలను బట్టే వ్యక్తం అవుతుంది బాగా.

పాండిత్యానికి, సత్యధర్మాల్లోనేగాని, బుకాయింపుల్లోనూ, పిడివాదాల్లోనూ కాదు వినియోగం.

స్వవిషయం వచ్చినప్పుడు, పండితులయినవారు, కొంచెం దారి తప్పడం తటస్థించవే వచ్చు.

అదీ వొక అందమే పరకాయిస్తే.

కాని, వారిని సత్రకాయలంటారు కొందరు.

ఎగిసెగిసి పడతారు వారు.

తమ పెండే కాసులకు ప్రతిఘటన రావడం వొక్కటే చూసుకుంటారు వారు.

శివమే యెక్కేస్తుంది వారికి.

వారి పరిజ్ఞానం పూర్వపక్షం అయిపోతుంది, దాంతో.

వారి ఔచిత్యవిచారశక్తి భంగపడిపోతుంది, పూర్తిగా.

చదువుకున్నవారే అయివుంటారు వారు, సందేహం లేదు.

కాని, చదువంటనివారికింద జమ అయిపోతారు వారు.

అనారోగ్యానికీ, వ్యాధులకూ క్రిములూ, దోమలూ హేతు భూతాలయేటట్టు పండితులయివారిలో ముఠా లేర్పడ్డానికీ అసహనం యేర్పడ్డానికీ కారణభూతు లవుతారు, వారు.

ఎదటివారి ఔచిత్యం విషయమే చూస్తారు గాని, వారు తమ పెండేకాసుల మర్యాదా తిక్రమణం గుర్తించలేరు.

మరి, వారిది అజ్ఞానం–మౌఢ్యం–మౌర్ఖ్యమూ కాక పోతే మరే మనాలీ?

మిక్కిలీ దయనీయమైనది వారిస్థితి.

అయితే వొక్కటుంది.

లక్ష్మణరావుగారిలాగ, అలాంటి అభందరం మనుష్యులకు అదుపు చేసేవారు పండితుల్లో బహూ అరుదుగా వుంటారు.

అకర్ణేజపుల మాటలమీద పైకి రావాలని చూసేవారే అధికంగా వుంటారు, లోకంలో.

ధిక్!

## 34

నాగేశ్వరరావుగారు నన్ను చూడమన్నవారిలో లక్ష్మణరావుగా రొకరు.

అయితే, వారు, వారిని చూడమన్న దెందుకోసం?

"ఇందుకోసమే" అనుకోలేదు నేను.

రెండువైపులా పదునుగల కత్తివంటిది లక్ష్మణరావుగారి శక్తి.

ఇటు పండితులు వారు.

సాటిలేని పండితులు.

పండిత ధర్మం మూర్తీభవించిన పండితులు.

అటు ధనికులున్ను.

కనీసం నాకంటే ధనికులు.

ఎంతో కొంత ఇవ్వగల ధనికులు.

కాని, వారివిషయమై మనం చూడవలసిన దీ ధనికత్వం కాదు.

మునగాల రాజాగారి దివాను, వారు.

బహూ సరసులా ప్రభువు.

అలాగే, బహూ సరసులా దివాను.

"మణినా వలయం, వలయేన మణిః" లాంటి సన్నివేశం వారిది.

మరి, నా స్థితి?

ప్రెస్సుబిల్లు చెల్లించవలసింది.

"సాధ్యమైనంత త్వరగా చెల్లించ" వలసింది, ఆ బిల్లున్ను.

భరించలేని భారం నాకిది.

కనక-లక్ష్మణరావుగారిని చూస్తే?

ఆ భారం కొంత తగ్గవచ్చు నాకు.

అంటే, యిక్కడ, అర్థం చేసుకోవలసిన సంగతి మరొకటి వుంది.

అది నాగేశ్వరరావుగారి సూచన.

ఆ సూచన నా భారం త్వరగా తగ్గించడాని కుద్దిష్టం, అంతే.

"నాగేశ్వరరావుగారు తమ బిల్లు త్వరగా చెల్లిపోడానికి చేసింది ఆ సూచన" అని అర్థం చేసుకుంటే, అంతకంటే అనౌచిత్యం మరి వుండదు.

పైగా, ఇంగిత జ్ఞానం లేని అర్థజ్ఞానం అవుతుంది.

పరమ అవివేకి - ద్విపాత్పశువున్ను అవుతాడా అర్థగ్రహీత.

కనక, ఇదిగో యింత గ్రంథం నడిచాక-అప్పుడా విషయం ప్రస్తావించాను లక్ష్మణరావుగారి దగ్గిర నేను.

ప్రస్తావించాను, అంతే, "వెళ్ళి రాజాగారిని చూడండి" అన్నారు లక్ష్మణరావుగారు.

1. నా పుస్తకంలో విలవలేదు. 2. పైగా అసందర్భంగా వుంది. 3. దాని విషయమై రాజాగారి దగ్గిర ప్రస్తావన చెయ్యడానికి లక్ష్మణరావుగారి కిష్టం లేదు. 4. ఎవరినిగురించీ వారలా చెప్పరు. 5. రాజాగా రూరిలో లేరు. 6. ఉండినా వారినిప్పుడు చూడతగిన సమయంకాదు - ఇలాగ పరిపరివిధాల ధ్వనించింది నాకు "వెళ్ళి రాజాగారిని చూడండి" అన్న లక్ష్మణరావుగారి మాట.

నిజానికి, నేను స్వయంగానే వెళ్ళి రాజాగారిని చూడ్డానికి నా కాక్షేపణాలేదు, సందేహమూలేదు.

మునగాల రాజాగారిది. అడగనివాడిదే దోషం అన్న ఔదార్యం.

ఎన్నో సందర్భాల్లో - ఎందరో చెప్పగా విన్న దీమాట.

కనక, వా రూరికే పంపెయ్యరు.

ఎంతో కొంత యిస్తారు.

నిజానికా మొత్తం నిర్ణయించుకో వలసినవారు వారే, కాని, నేను వెడితే అది స్వల్పం అయితే?

కనీసం లక్ష్మణరావుగారే నన్ను వారిదగ్గిరికి పంపితే?

అది కొంచెం పెరుగుతుంది.

కాని, "నన్ను లక్ష్మణరావుగారు పంపా"రని రాజాగారితో చెప్పకోడానికి అవకాశం కనపడలేదు నాకు లక్ష్మణరావుగారి మాటలో.

కనక, వెళ్ళడమా మానడమా?

ఈ విచికిత్సతో వూరుకున్నా న్నేను.

"వెళ్ళిరండి" అని మళ్ళీ అన్నారు లక్ష్మణరావుగారు.

విసుగ్గా కాదు, బహూ సౌమ్యంగా అన్నారు వారామాట.

వెంటనే బయలుదేరాన్నేను.

"ఇలాంటి సందర్భం వచ్చినప్పుడు, రాజాగా రనుసరించడాని కేదయినా వొక పథకం తయారుచేసే వున్నారేమో లక్ష్మణరావుగారు" అనిపించింది నాకు, వారు మళ్ళీ ఆ మాట రెట్టించడంతో.

కాక, –

"ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః"

ఎవడి కెక్కడ ఎంత ప్రాప్తం వుందో అంతా చేతికి వచ్చే స్తుంది.

దానికి విఘాతం వుండదు.

నా నమ్మకం చిన్నప్పణ్ణుంచీ యిది.

నేను వెళ్ళాటప్పటికి రాజాగారింటోనే వున్నారు.

నేను చీటీ పంపించాను.

వారు దర్శనం యిచ్చారు.

పుస్తకం వారి కందించా న్నేను.

తరవాత నా పరిస్థితులు చెప్పకున్నాను.

ప్రెస్సు బిల్లు సంగతి కూడా చెప్పాను.

"మీ విషయం – మీ వీరపూజ విషయం యిదివరకే చెప్పి వున్నారు లక్ష్మణరావుగారు" అన్నారు రాజాగారు.

చకితుణ్ణయిపోయా న్నేను, మళ్ళీ.

నా విషయం నేను లక్ష్మణరావుగారికే చెప్పించుకో వలసి వున్న స్థితిలో, లక్ష్మణరావుగారు, నా విషయమ్మై తామే రాజాగారితో చెప్పడమా?

సంభవమేనా యిది?

మొదటిమాటు – క్షణంకిందట – కొద్ది నిమిషాలసేపు మాత్రమే లక్ష్మణరావుగారితో మాట్లాడివున్నా నేనిది నమ్మ గలనా?

అడిగితే – దేహి అంటే, యివ్వకుండా చేసేవారుంటారు లోకంలో.

ఉంటారేమిటి మళ్ళీ, ఉన్నారు.

బహూవచనం మీదే వున్నారు, మహోదారులయిన ఆ దాతల రక్తం తామే పీల్చేస్తూ.

ఈ "పడగొట్టడం" అన్నది పిఠాపురంలో నా కనుభూత పూర్వమున్ను.

"చి–త్తం" అని మాత్రమే అనగలిగా న్నేను, మాటరాక.

పర్సే పైకి తీశారు, రాజాగారీ లోపున.

"ఇది మొదటి సంపుటం అన్నట్టు చెప్పారు లక్ష్మణరావుగారు. టైటిలు మీద కూడా అలాగేవుంది. తమ రిది యెన్ని సంపుటాలుగా రచిస్తే అంతా సంతోషిస్తాన్నేను. ఎన్ని సంపుటాలు ప్రకటిస్తే అన్ని యాభైరూపాయలిస్తాను కూడా" అంటూ, అయిదు పదులందించేశారు కూడా, నా చేతికివారు.

లక్ష్మణరావుగారు నా పరోక్షంలో నా సంగతి చెప్పడమూ – రాజాగారు నాకు డబ్బివ్వడమూ – ఇది కాదు చూడవలసిందిక్కడ.

నిజాని కిందులో యెవరిదీ తక్కువదికాదు గాని, యీ ఔదార్యంలో, యెవరిదెంత జారా, లక్ష్మణరావుగార్లలో?

ఇవాళ లక్ష్మణరావుగారు లేరు.

చాలా రోజులకిందటే చనిపోయారు వారు.

జాతికి జాతి అంతా పరితపిస్తోంది. అదలా జరిగిపోయినందుకు.

కాని, వారి భావోన్నతి యెవరందుకో గలిగారు?

వారి హృదయ గాంభీర్యం యెవరర్థం చేసుకోగలిగారు?

వారి ఔదార్యం యెవరు పరిమితి కట్ట గలిగారు?

"నభూతో నభవిష్యతి" అన్న మూర్తిమంతం వారిది.

ప్రపంచంలో అపురూపమైన వ్యక్తిత్వం వారిది.

సృష్టిలోనే అపూర్వం అయిన అవతారం వారిది.

ఉండిన్నీ లేనిదయిపోయింది మనకది.

మన దురదృష్టం – ఆంధ్రజాతి దౌర్భాగ్యం యిది.

కనీసం యిప్పటిదాకా నైనా వారుంటే మన వాఙ్మయం–నవీనవాఙ్మయం సంపన్నం అయి ఇతరజాతుల నీరాజనాలందుకుంటూ వుండేది.

## 35

పండిత, డి. గోపాలాచార్యులుగారి దగ్గిరికి బయలుదేరాన్నేను.

నేను వెళ్ళాటప్పటికి క్లాసుకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు, వారు.

దక్షిణ భారతాని కంతకూ మహామహోపాధ్యాయులు వారు, ఆయుర్వేదంలో.

గొప్ప చికిత్సకులు.

వారి వైదుష్యానికీ, వారి నైపుణ్యానికీ మెచ్చి, వైద్యరత్న అన్న ఉన్నతబిరుదం యిచ్చి సత్కరించివున్నారు సర్కారు, వారిని.

స్వయంగా, ఆయుర్వేద కళాశాల నిర్వహిస్తున్నారు వారు.

తామే ప్రిన్సిపాలు దానికి.

ఆంధ్రపత్రిక ఆఫీసుకి అరఫర్లాంగులో వుందది.

గోపాలాచార్యులుగారూ, నాగేశ్వరరావుగారూ ప్రాణస్నేహితులు.

ఇద్దరూ బందరువారు.

నేను చీటీ పంపగా "ఈ శ్రీపాదవా రెవరు?" అనడుగుతూ నే నున్న చోటికే వచ్చా రాచార్యులుగారు.

శ్రీపాద నరసింహశాస్త్రిగారని వొక పండితులు.

గొప్ప పండితులు.

విశేషించి, ఆయుర్వేదాశ్రమాస్థాన పండితులు వారు.

వారంటే, యెంతెంతో ఆదరాభిమానా లాచార్యులుగారికి.

వారి సాహచర్యం వల్లనే "ఈ శ్రీపాదవా రెవరు?" అనడం ఆచార్యులుగారు.

పశ్చిమ గోదావరిజిల్లా లొల్ల గ్రామం నరసింహశాస్త్రి గారిది.

మాకూ మాకూ జ్ఞాతిత్వం లేదు; కాని, వారి అత్తవారి పరంగా బంధుత్వం మాత్రం వుంది.

అయితే, మద్రాసులోనే వారితో నాకు పరిచయం.

రెండు నిమిషాల్లో నా సంగతి చెప్పకున్నా నాచార్యులు గారితో.

"ఇక్కడ కాదు, రండి" అంటూ వెంటనే తమ ఆఫీసు గదిలోకి తీసుకువెళ్ళా రాచార్యులుగారు, నన్ను.

మరో రెండు నిమిషాలు కూచున్నారు నా కోసం.

అక్కడే అందించాను వీరపూజ, వారిచేతికి.

పుచ్చుకున్నా రంతే, మాట్లాడలేదు, పుస్తకం విప్పారు.

పద్మినీదేవిని చెరపట్టడానికి వచ్చిన అల్లావుద్దీనుకి మేవాడు రాణాలు స్వాగత సత్కారాలు చెయ్యడమూ, తనని సాగనంపేటప్పుడా అల్లాఉద్దీనే పద్మినీదేవిని, భర్తను పట్టెయ్యడమూ, ఆ సందర్భంలో నేను మన వాళ్ళ నీతిని విమర్శించడమూ– ఈ ఘట్టం వచ్చింది, వారది తెరిచాటప్పటికి.

అది పూర్తిచేసేదాకా నా కేసి చూడలేదు వారు.

"భేష్" అన్నారు పూర్తిచేసి.

"మంచి విమర్శ. కొత్త వ్యాఖ్యానం. సరిఅయిన దృక్పథం మీది" అన్నారు.

"ఏమిటి మీరు వచ్చినపని?" అని అప్పుడడిగారు నన్ను.

అంతా చెప్పాన్నేను, టూకీగా.

"నాగేశ్వరరావుగారే చెల్లించ మన్నారాబిల్లు?" అనడిగారు వారు.

"అవు"నన్నాన్నేను.

వింతగా చూశారు నాకేసి వారు.

"ఏమయినా, వారనవలసినమాట కాదది. దానికేం, భారతవీరుల చరిత్ర కావాలి నాకు. మీరు రాస్తేనే బాగుండేటట్టుంది" అన్నారు.

"ఇంత అని పరిమితి వద్దు. ఎన్ని అయితే అన్నీ రాయండి, నా ప్రెస్సులో అచ్చువేయించి వుచితంగా యిచ్చేస్తాను మీకు. కాగితం ఖరీదు కూడా నేనే పెట్టుకుంటా" నని కూడా అన్నారు.

వారి వాఙ్మయప్రీతీ, వారి విషయ నిర్ణయమూ, నా యెడల వారి క్కలిగిన ఆదరభావమూ, వారి మహౌదార్యమూ–ఇవి గుర్తించి చకితుణ్ణయిపోయా న్నేను.

నాకున్నదే ఆ వుద్దేశం.

ముందు వీరపూజ రాయడాని కదే కారణం నేను.

దాల్లో చెయ్యి తిరుగుతుంది నాకే కొంచెమయినా.

మన చారిత్రిక వీరులు అసాధారణులే.

అయితే, పరిస్థితుల ననుసరించినది వారి ప్రవృత్తి.

భారతవీరులది విశిష్ట ప్రవృత్తి.

అసలు, వారున్నారా, కల్పితపురుషులా వారన్న ప్రశ్న యెప్పుడూ లేదు నాకు.

ఆదర్శభూతాలయిన జీవితాలు వారివి.

ధర్మంకోసం బతికిన బతుకులు వారివి.

తన్మూలంగా, మన కారాధ్యులువారు.

పైపెచ్చు, వ్యాసమహర్షి దిద్దుపాటు వారికి.

కాని, వారి చరిత్రలు రాయడానికి నాకో చిక్కుంది.

కవిత్రయం వారి భారతం తెనుగుభాషకే ప్రమాణం మనకు.

తెనుగు కవిత్వానికిన్నీ ప్రమాణం.

భారతకథకూ, భారతధర్మాలకూ అది ప్రమాణం కానేకాదు.

చాలా చోట్ల, సంస్కృతమూలానికి చాలా భిన్నంగా వుందది.

పండితులయినవారూ, విమర్శకులయినవారున్నీ అనేకులనే మాట యిది.

కాగా, సవిమర్శగా, వీరపూజ వరవడిలో భారతవీరుల చరిత్ర రాయాలంటే, సంస్కృత భారతం చదవాలి, ముందు నేను.

అప్పటికి తెనుగుభారతమే ఇతిశ్రీగా చదివివుండని స్థితి నాది.

కనక, ముందది చదవాలి.

తరవాత, చదవాలి సంస్కృత భారతం.

చదవాలి, చర్చించుకోవాలి, సమన్వయం కుదుర్చుకోవాలి, ఒక నిర్ణయం చేసుకోవాలి, ముందు నేను.

అప్పటికయినా నా కందు క్కావలసిన తాహతు అబ్బుతుందా అంటే, అది, వేరే విషయం; కాని గోపాలాచార్యులు గారి ఆజ్ఞ శిరసావహించాలంటే, అప్పుడు నేను సాహసించ వలసిన అవకాశం.

ఇదంతా మనవి చేసుకున్నా నాచార్యులుగారికి.

అది నచ్చింది వారికి.

"ఆ ప్రయత్నం చెయ్యం" డన్నారు వారు.

"ఎప్పుడు వీలయితే అప్పుడే చెయ్యండాపని. ఏమయినా, మన కాదర్శాలు భారతవీరుల చరిత్రలు. మన జాతి బాగుపడాలంటే అవి చదువుకోవాలి మనం. అవి పారాయణ చెయ్యాలి. అవి మననమున్నూ చేసుకోవాలి. ఉజ్జ్వలమైన భాషలో – బిగువయిన రచనలో – భారతసంస్కార దర్పణాలుగా కావాలి మనకు. మీరు రాతప్రతి యెప్పుడు తెస్తే అప్పుడే అచ్చు వేయిస్తాన్నేను" అని మాట యిచ్చారు వారు.

నా బిల్లు చెల్లింపుసంగతి ప్రస్తావించి "రేపురండి, సరిగా యీ వేళకే రండి. పెద్ద ఆశమాత్రం పెట్టుకోకండి" అన్నారు, లేచారు.

అన్నా సమయానికి మర్నీ వెళ్ళాన్నేను, మర్నాడు.

"అన్న సమయానికి వచ్చారు మీరు" అంటూ చాలా ప్రశంసించారు, ముందు, వారందుకు నన్ను.
అంటూనే డ్రాయరు లాగారు.
లాగుతూనే పర్సు తీశారు.
తీస్తూనే వొక బాంకినోటందుకున్నారు అందులోనుంచి కొంచెం చాటుగా.
నూరు రూపాయలనోటు తరవాత యాభైరూపాయలది కూడా వుండే దా రోజుల్లో.
అయితే, యాభై రూపాయలనోటుదీ, అయిదురూపాయల నోటుదీ కొంచెం వ్యత్యాసంతో వొక్కటే పరిమాణం.
అయిదురూపాయల నోటిప్పటి పదిరూపాయలనోటుకంటే బాగా పెద్దది.
కాగా, వారందుకున్న దేదో నాకు బాగా కనపడలేదుకనక, అది యాభై రూపాయలదయినా అయి వుండవచ్చు, అయిదురూపాయలదయినా అయి వుండవచ్చు.
అదిన్నీ వొక మడత మడిచారు ముందు వారు.
ఆ మడవడంలో కూడా కొంచెం చాటుగానే మడిచారు.
ఆ మడత మళ్ళీ మడిచారు.
మళ్ళీ మడిచారు, మళ్ళీ మడిచారు, చివరికి రూపాయ కాసంత అయేదాకా మడిచారు.
అప్పుడయినా నా కందించలేదు వారది.
ముందు నా చెయ్యి చాప మన్నారు.
ఆ మడత, వొకచేత్తో నా చేతిలో వుంచారు.
అదిమారు కూడా.
తరవాత, తమ రెండో చేత్తో నా వేళ్ళు మడిచారు.
"నడివీధిలోకి వెళ్ళేదాకా గుప్పెడి విప్పవద్దు మీరు" అన్నారు.
"మరి, నాకు టయిమయిపోయింది, మీరు వెళ్ళండి" అంటూనే లేచారు కూడా.
కృతజ్ఞత చెప్పకుంటూ బయలుదేరాన్నేను.
ఎంతో కొంత యిచ్చారువారు, పుస్తకం ఖరీదు కంటే యెక్కువే అది, సందేహంలేదు; కాని, ఇవ్వడంలో వారవలంబించిన విధానం వల్ల, యిచ్చి వారు చేసిన ఆజ్ఞవల్లా అది అయిదురూపాయలదో యాభైరూపాయలదో చూడాలన్న ఆత్రం కలిగింది నాకు.
గుబగుబలాడిం చేసింది కూడా.
అయినా, అణుచుకున్నానా ఆత్రం నేను.
గబగబా నడిచాను.
ఉరుకుతూ మెట్లు దిగాను.
అంగలువేసుకుంటూ గుమ్మాలు దాటాను.
కొలిచినట్టు నడివీధిలోకి వెళ్ళాను.
అప్పుడు తెరిచాను గుప్పెడి.
చూడగా యాభై రూపాయల నోటది.

పరవశుణ్ణయిపోయా న్నేను.

కాని "భేష్! చెప్పినట్లు చేశారు మీరు. తరుచు దర్శనం యిస్తూవుండండి" అన్నమాట వినపడింది నాకు.

చూడగా, ద్వారబంధాలు పట్టుకుని సింహద్వారాన నుంచుని నాకేసే పరీక్షగా చూస్తున్నా రాచార్యులుగారు.

నేను చూడ్డం చూశారు, రివ్వున తిరిగి, చర్రున మెల్లెక్కేశారు.

అది చూసిన్నీ చకితుణ్ణయిపోయా న్నేను.

కీ.శే. ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులుగారు దేశ ప్రసిద్ధులు.

వారూ అయుర్వేదాశ్రమ పండితులే.

బహూ సమర్థులే వారున్ను.

మద్రాసులో, మొదట కలిగిన పరిచయం వారితోనే నాకు.

అయుర్వేదంతో వారికీ సంబంధం లేదప్పటికి, నాకూ సంబంధం లేదు.

సాహిత్యపరంగానే – విశేషించి సంస్కృత సాహిత్యం పరంగానే మాకు తరచు సల్లాపం.

తరుచు కలుసుకునేవాళ్ళం మేము.

ఆదివారాలు వచ్చాయా, వొక పూటకిపూటే గడిచి పోయేది మాకు.

ఎంతెంతో చెప్పేవారు గోపాలాచార్యులుగారి సంగతులు వారెన్నెన్నో.

"గోపాలాచార్యులుగారి చెయ్యి, ఇటు, బహూ చిక్కనా, అటు, చాలా ఉదారమున్ను. అర్థివచ్చాడా, ముందు సామర్థ్యం చూస్తారు వారు. చేసే పని పరిశీలిస్తారు తరవాత. దాని విలవా, అది వారి ఆ అర్థి నిర్వహించడమూ అతినిశితంగా పరిశీలిస్తారు. నచ్చిందీ, అనుకున్నదానికంటే యెక్కువ యిస్తారు. లేదూ, దమ్మిడీ కూడా యివ్వరు"– ఇదీ పిండితార్థం కృష్ణమా చార్యులుగారు చాలా మాట్లు చెప్పినదానికి.

దీని కెన్నో వుదాహరణలూ చెప్పేవారు వారు.

అంచేత, ఆచార్యులుగా రిచ్చిందెంతో చూడాలన్న ఆత్రం చాలా యెక్కువయి పోయింది నాకు.

అయినా, అణుచుకున్నానది, సప్రయత్నంగా.

ఆ అణుచుకో గలగడమైనా నడివీధిలోకి వెళ్ళే దాకానే.

1 ఇచ్చిన వారియెదటే అదెంతో చూసుకోడం మర్యాద కాకపోడం. 2. ఎంతోకొంత యిచ్చే వున్నారు వారు. 3. అది, కనీసం అయిదయినా అయివుంటుందన్న నమ్మకం కలగడం– 4. వారి వృత్తి బహుముఖాల బహూవారం విని వుండడం – 5. ముందు చేతిలో పెట్టే అన్నారు వారామాట, కనక, వారి అజ్ఞ యెందుకు శిరసావహించక పోవాలీ అన్న ఆలోచన కలగడం– 6 మళ్ళీ మళ్ళీ దర్శనం చెయ్యడానికి వారే అహ్వానించడం–ఇన్ని కారణాలున్నాయి గదా యిక్కడ, యిల్లాంటప్పుడైనా ఆ ఆత్రం నిగ్రహించుకోలేకపోతే, యీ జీవితంలో నేనేమి సాధించుకోగలనూ?

అంతకిముందూ తరవాతా గూడా వారిని కలుసుకోడం చాలా మాట్లు జరిగింది; కాని ప్రకరణానురోధంగా ఆ సమావేశంమాటే చెబుతున్నాను.

ఈ ద్రోణంరాజు నరసింహారావుగారు, పానుగంటి నరసింహా రావుగారి అల్లుళ్లు.

వారూ, పానుగంటి నరసింహారావుగారి సోదరులు సుబ్బారావుగారూ కూడా అక్కడ వుండగా వచ్చిందీ ప్రస్తావన.

నేను వెళ్ళాటప్పటికి, వంగూరి సుబ్బారావుగారు, పానుగంటి వారి సారంగధర నాటకం విశిష్టత వివరిస్తున్నారు.

ఆ పుస్తకం వారిచేతిలోనే వుందప్పుడు.

అప్పటి క్కొద్ది మాసాలక్రితమే అచ్చుపడివుంది, నా రచనా.

"మీ కొత్తనవల చదివానండీ" అంటూ సుబ్బారావుగారే తెచ్చారు, దాని ప్రస్తావన.

వారు "మీ... కొత్త నవల–" అంటూ ప్రారంభించారు ఆ వాక్యం.

"మీ..." అంటూ అప్లుతం వుచ్చరించడంలో వారు, తమ మాట చాలా జాగ్రత్తపడుతున్నట్టు స్పష్టంగానే తెలిసింది.

సాధారణంగా "మీ శ్మశానవాటిక చదివానండీ" అనడం లేకపోలేదు చాలా మంది.

తప్పేం, నా రచనపేరే అదయి వున్నప్పుడు?

రచయిత తన రచనకు పేరు పెట్టడంలో యెంతో ఆలోచిస్తాడు.

మంచి చెడ్డలతోపాటు – అందచందాలతో పాటు – సార్థకత కూడా చాలా ఆలోచించుకుంటాడు.

ఇక, ఆ పేరుచ్చరించడంలో, విరుపులు విరవడమూ, శ్లేషలు తియ్యడమూ – ఇవి, అవతలివాళ్ళ బుద్ధి జాతినిపట్టే వుంటుంది.

పూర్వకవుల కంతగాలేనిది, నవీనులకు, తమ రచనలకు పేర్లు పెట్టడంలో కొత్త అభిరుచు లేర్పడ్డాయి.

అవి యింగ్లీషు చదివినవారు, ఇంగ్లీషు రచనలను చూసి అలవర్చుకున్నవి.

క్రమంగా, ఇంగ్లీషు నేర్వని మనవాళ్ళు–నావంటి వాళ్ళున్నూ ఆ మార్గం తొక్కుతున్నారు ధారాళంగా.

అయితే, యీ కొత్త సంప్రదాయం అనుసరించి పెట్టిన పేర్లలో, కొన్ని గ్రంథకర్త పేరితో కలిపి పలికితే, కొన్ని విపరీతార్థాలు స్ఫురించడం వుంది.

అయినా, వారా పద్ధతి మానడంలేదు.

ఇది నాకు, వెనకటివా రెందరో తొక్కిన మార్గం.

ఇటీవలి వారీ మార్గమే తొక్కుతున్నారు, బహుళంగా.

ఇక్కడ, కొందరు గ్రంథకర్తల పేర్లతో కలిపి, కొన్ని నవీన గ్రంథాల పేర్లుదహరిస్తాను.

1. వీరేశలింగంగారి 'అభాగ్యోపాఖ్యానం'
2. గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం'
3. ఉన్నవ లక్ష్మినారాయణగారి 'మాలపల్లి'
4. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి 'పాణిగృహీత'
5. మళ్ళీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి 'శనిగ్రహం'

6. మంత్రిప్రగడ భుజంగరావుగారి 'వారకాంత'
7. పానుగంటి నరసింహారావుగారి 'వృద్ధవివాహం'
8. కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణం'
9. ఆచంట లక్ష్మీపతిగారి 'చలిజ్వరం'
10. భమిడిపాటి కామేశ్వరరావుగారి 'పెళ్ళి ట్రెయినింగు' 'గుసగుస పెళ్ళి'–'మడతపేచీ', 'మేజువాణీ'.
11. విశ్వనాథ కవిరాజుగారి 'దొంగాటకం'
12. కొడవటిగంటి కుటుంబరావుగారి 'కులంలేనిపిల్ల'
13. మంగిపూడి వేంకటశర్మగారి 'బాలవితంతు విలాపం'
14. వజ్ఝల కాళిదాసుగారి 'చాకిరేవు'
15. పిలకా గణపతిశాస్త్రిగారి 'గృహదహనం'
16. మునిమాణిక్యం నరసింహారావుగారి 'ప్రణయకలహం' 'ఘోషా', 'మృత్యురథం', 'ప్రాయశ్చిత్తం'.
17. పురాణం కుమారరాఘవశాస్త్రి(?)గారి 'గళ్ళచీర'
18. శ్రీశ్రీ గారి 'మహాప్రస్థానం'

ఈ కోవలోదే అవుతుంది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'శ్మశానవాటిక' కూడా. మరి, ప్రపంచం మునిగిపోయినట్టు, కొందరు బుగ్గలు నొక్కుకోడంలో ఏమయినా సొగసుందా?

పోతే, యిక, ప్రకృతం.

పోతే, "వారిచేతిలోనే వుందా పుస్తకం (సారంగధర నాటకం)" అని చెప్పి వున్నాను.

మొదట, 'మీ కొత్తనవల చదివా' నంటూ ముభావం గానే మాట్లాడారుగాని, వంగూరి సుబ్బారావుగారు సూటిగా 'శ్మశానవాటిక' అన్న పేరుతోనే సాగించారు సంభాషణ క్రమంగా.

"అదేం, పేరండీ? ఏవగింపుగాలేదూ?" అనడిగారు వారు.

చిరునవ్వు నవ్వుతూ, శిరఃకంపంమాత్రం చేసి వూరుకున్నాన్నేను.

"పానుగంటి నరసింహారావుగారు కూడా ఈ మాటే అన్నారు" అన్నారు, తరవాత వారు.

"విన్నా"నన్నాన్నేను.

నా కొత్తనవల ప్రస్తావన, నరసింహారావుగారు తమ దగ్గిర కూడా చేసివున్నట్టు అదివరకే చెప్పారు నాకు, పురాణపండా మల్లయ్య శాస్త్రిగారు.

నేనీ మాటకూడా అనగా, ద్రోణంరాజు నరసింహారావు గారూ, పానుగంటి సుబ్బారావుగారూ సాకూతంగా చూశారు వంగూరి సుబ్బారావుగారికేసి.

ఊరుకోలేదు "మరి మల్లయ్యశాస్త్రిగా రేమన్నారు?" అనడిగారు వంగూరి సుబ్బారావుగారు.

"వారూ ఆక్షేపించా"రన్నాన్నేను.

ఇది విని ద్రోణంరాజు నరసింహారావుగారికేసి, పానుగంటి సుబ్బారావుగారికేసి తాముూ సాకూతంగా చూశారు, బదులుగా.

వంగూరి సుబ్బారావుగారి చేతిలోనే వున్న పానుగంటివారి సారంగధర నాటకంలో, యిద్దరు పరిచారికలు మాట్టాడుకుంటారొకచోట.

ఆ ఘట్టం తీసిచూపించి "ఈ ఘట్టం స్ఫుటంగా చదవండి మీరు" అని కోరాన్నేను సుబ్బారావుగారిని.

"ఏం, చదవక?" అంటూనే అని చదివారు వారు.

"వాటి అర్థమూ భావమూ కూడా సెలవిప్పించండి" అని కోరాన్నేను.

కాని, పక్కకిచూస్తూ వూరుకున్నారు వారు మాట్టాడలేదు.

"సెలవిప్పించండి" అని మళ్ళీ కోరాన్నేను.

అయినా మాట్టాడలేదు వారు.

ఇలాగ, నేను, మళ్ళీ మళ్ళీ కోరడమూ, అయినా తటపటాయిస్తూ వా రూరుకోడమూ–ఇదేమిటో అవగాహన కాక, "ఏమిటామాట?"లనడుగుతూ పానుగంటి సుబ్బారావుగారూ, ద్రోణంరాజు నరసింహారావుగారూ కూడా, పర్యాయత్వేనా ఆ పుస్తకం అందుకుని ఆ ఘట్టం చదువుకున్నారు; కాని వారున్నూ వూరుకున్నారు, పలక్కుండా.

అప్పుడన్నాన్నేను, వంగూరి సుబ్బారావుగారితో "నా రచనపేరు ఆక్షేపించినవారు మీ గురువుగారని మీరే చెప్పారిప్పుడు. అది మీకు స్వయంభువుకాదు. అది అనువదిస్తున్నారంతే, మీరు. ఇక్కడా అదే మార్గం. ఈ మాటలకు అర్థమూ చెప్పవద్దు మీరు, భావమూ చెప్పవద్దు, స్వతంత్రించి. మీ గురువుగారినే చెప్పమనండి. వాటిమీద వారు చెప్పిందిన్నీ అనువదిస్తూనే వుండండి మీరు" అని.

"అయితే, పానుగంటివారి రచన కంతకీ యిదేనా విచారణ చెయ్యవలసిన ఘట్టం?" అనడిగారు వంగూరు సుబ్బారావుగారు, కొంచెం దురుసుగా.

"కాదనో అవుననో మీరే నిర్ధారణ చెయ్యండి. మీ నిర్ధారణ క్కారణాలేమిటో అదిన్నీ చెప్పండి. అయితే, ఈమాటలు మీ గురువుగారు ఉద్దేశపూర్వకంగా రాసివుంటారో, పొరపాటున రాసివుంటారో అది కూడా మీరే సెలవివ్వండి" అని మాత్రమే కోరాన్నేను, దానిమీద.

అప్పుడు కలగజేసుకున్నారు ద్రోణంరాజు నరసింహారావుగారూ, పానుగంటి సుబ్బారావుగారూను.

మమ్మల్నిద్దరినీ వూరుకోమన్నారు వారు.

"మా ప్రూఫులపని నిలిచిపోయిం"దని చెబుతూ "వెళ్ళిపోండి" అని కూడా ఆదేశించారు వారు, మమ్మల్నిద్దరినీ.

పానుగంటివారి రచనలు చాలా చదివాన్నేను.

కనబడితే, యిప్పటికీ చదువుతూనే వుంటాను కూడా.

ఒక విధంగా చూస్తే, చెప్పకుని మనజాతి గర్వించుకోతగ్గ రచనలు వారివి.

మన హాస్యరచయితల్లోకూడా వా రొకరు.

ప్రముఖులున్ను.

అయితే, ఎంతబాగా నవ్విస్తుందో, వారిహాస్యం, అక్కడక్కడ, అంత జుగుప్స కలిగిస్తుంది.

ఒకమాటు వర్ణచిత్రం రచిస్తూ, వారిని గురించి, నా ప్రబుద్ధాంధ్రలో యిలా రాశాను.

"సాక్షివ్యాసా లనేకాలు పదిమందీ కూచున్నచోట చదవడాని కర్హంగావుండవు రసికు లందులో అనేకాలు చదవనే లేరు పట్టుపట్టి అదేపనిగా చదివితేమాత్రం భావసౌకుమార్యం కోల్పోయి, మొరటు లయిపోతారు"

"అయినా, పంతులుగారికి మంచి గ్రహణశక్తి వుంది. కథనశక్తి వుంది. భావనాశక్తి వుంది. తన్మయీభవనయోగ్యతవుంది. నిర్వహణ సామర్థ్యమున్నూ వుంది"

"పంతులుగారు, శబ్దాలు తూచివేస్తారు. వాక్యాలు పొంకంగా బిగిస్తారు"

"కాని, అన్నీ గ్రామ్యంతో నిండివుంటాయి"

"పగటివేషాలు రసికులూ చూస్తారు. కాని ఆ హాస్యం సభ్యం అని అంగీకరించలేరు భామవేషాలూ గొల్లవేషాలూ కూడా చూడ్డానికే ముచ్చటపడతారు రసికులు. కాని, ఆ హాస్యమున్నూ ఉత్తమం అని చెప్పలేరు"

"పంతులుగారి హాస్యం ఆ తరగతిలోది"

"ఏమయినా, పంతులుగారికి, కవులజాపితాలోనూ, వాఙ్మయంలోనూ మంచిస్థానమే వుంది"

"ఏమీ సందేహం లేదు"

## 36

కళా సూర్యనారాయణ అని మా రెండో పింతల్లిగారి కొడుకు.

సంస్కృత కావ్యాలు చదివాడతను, కాకరపర్తిలో.

నా కంటే పెద్ద.

ఒకమాటు మావూరు వస్తున్నాడతను.

రాజమండ్రీలో స్టేషనులో రెయిలెక్కాడు.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారున్నూ రెయిలెక్కా రక్కడ.

ఇద్దరూ వొక కంపార్టుమెంటులోనే వున్నారు.

"మీ దేవూ"రంటే, "మీ దేవూ"రంటూ వొకరిసంగతి వొకరు చెప్పకున్నారు.

"మీ రెక్కడికి వెడతా" రనడిగారు వేంకటశాస్త్రిగారు.

"అనపర్తి స్టేషనులో రెయిలుదిగి 'పొలమూరు' వెడతా"నన్నాడు మా సూర్యనారాయణ.

"అక్కడ యెవరయినా బంధువులున్నారా?" అనడిగారు వెంకటశాస్త్రిగారు.

"మా పెత్తల్లిగారున్నా రావూళ్ళో. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి మా పెత్తల్లిగారి కొడుకే" అన్నాడు సూర్యనారాయణ.

చాలు, మరేమీ అక్కర్లేదు వెంకటశాస్త్రిగారికి.

వారి బుద్ధి చమత్కరించింది, వెంటనే.

"మీ శ్మశానవాటిక నేను చూశా"నని చెప్పం డాయనతో" అన్నారుట వారు ముందు.

"చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రియిలా చెప్పమన్నా"డని చెప్పండి" అని కూడా అన్నారుట, తరవాత.

ఆ మాటమీద చాలా బాధపడ్డాడుట, మావాడు.

"ఇంత తెలివితక్కువపని చేశాడేం?" అనుకున్నాను సుమా నేను అన్నాడు కూడా నాతో.

మళ్ళీ బయలుదేరాడు స్వగ్రామం "నడిపూడి" వెళ్ళడానికి. కడియం మీదుగానే వెళ్ళమన్నా న్నేను.

"కడియంలోదిగు. వెంకటశాస్త్రిగారిని కలుసుకో" అన్నాను.

"వారన్నమాట నాతో చెప్పావుకనక, ఆ సంగతి వారితో చెప్పు" అన్నాను మొదట.

"నేను శ్మశానవాటిక నిర్మించాను. దానియెడల యేమాత్రమైనా శ్రద్ధాసక్తులు న్నవారు "స్వేచ్ఛగా వుపయోగించుకో వచ్చు నని చెప్పమన్నాడు మీతో" అని వారితో చెప్పు" అని చెప్పి మరీ పంపించా నతణ్ణి.

కడియం మీదుగానే వెళ్ళాడతను.

వెంకటశాస్త్రిగారిని కలుసుకుని నేను చెప్పమన్నదిన్నీ చెప్పాడు వారితో.

దానిమీద చాలా కోప్పడ్డారుట వెంకటశాస్త్రిగారు.

చాలా ఘర్షణపడ్డారుట యిద్దరూ.

అప్పుడొక వెలమదొరగారున్నారుట అక్కడ.

వారి నిద్దరినీ దూరం దూరంగా తొలగించేశారుట ఆ దొరగారు.

ఇంటికివెళ్ళి యిదంతా నాకు రాశాడు మా సూర్యనారాయణ.

## 37

అదిగో, ఆ శ్మశానవాటిక అచ్చయింది.

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగా రచ్చువేయించి యిచ్చారది.

నా గ్రంథమాలకు పోషకభారం వహించారు వారు.

నూటపదార్లందుకు; నాకు బహూమానం.

కాని, మరోమాట చెప్పారు వారు.

కాగితం, అచ్చుఛార్జీలు, బైండింగుఛార్జీలు – అన్నీ నేనే భరిస్తాను, రాతప్రతి తీసుకురండి, వెయ్యి ప్రతులు అచ్చువేయించి యిస్తా" నన్నారు వారు.

అలాగే చేశారు.

నేను కోరగా, యెర్రకాలికోతోనే మూడువందల ప్రతులు బైండు చేయించి యిచ్చారు వారు.

మొదటిమాటు మూడు ప్రతులు తెచ్చి నా కందించాడు బైండరు.

వెంటనే వొకటి వేంకటేశ్వరశాస్త్రిగారి కిచ్చాను.

టవునుకివచ్చి రెండోప్రతి నాగేశ్వరరావుగారి కిచ్చాను.

మూడోప్రతి గోపాలాచార్యులుగారి కిద్దామని వెళ్లాను.

కాని వారూరికి వెళ్లారు, వారి దర్శనం కాలేదు.

"పిఠాపురం వెళ్ళారు వారు. ఇప్పుడే వెళ్ళారు మెయిలుకి. తొందరపడనయితే సెంట్రల్ స్టేషనులో కలుసుకోవచ్చు వారి" నని చెప్పారు గుమాస్తాలు.

ట్రామెక్కి వెళ్ళాను.

సెకండుక్లాసు కంపార్టుమెంటులో కూచుని వున్నా రాచార్యులుగారు.

అప్పటికి – నాగేశ్వరరావుగారూ, వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారూ, గోపాలాచార్యులుగారూ – మద్రాసు కంతకూ యీ ముగ్గురే నేనంటే ప్రత్యేకశ్రద్ధ చూపేవారు.

అంచేత, వారి ముగ్గురికీ మొదటి మూడుప్రతులూ యివ్వాలని నా సంకల్పం.

నా ప్రయత్నం యిదే, కాని వొక అసందర్భం జరిగిందావేళ.

"ఇది నా కొత్తనవల బైండుపని పూర్తి అయి ఇప్పుడే నా చేతికి వచ్చింది. తమకోసం కాలేజీకి వెళ్ళాను. తా మూరికి వెడుతున్నట్టు చెప్పారు గుమాస్తాలు. ప్రయాణంలో సావకాశంగా చదువుతారన్న వూహతో తెచ్చాను" అని చెబుతూ పుస్తకం వారి చేతిలో వుంచాను.

పేరు చూశారంతే, వారు.

వారి చూపుల్లో అసంతృప్తి కనపడింది.

"తంతివార్తరాగా వైద్యం పనిమీద లక్ష్మీనరసాపురం వెడుతున్నా న్నేను. ఇదా నాకు శకునం యిప్పుడు? ఈ మాత్రం అయినా ఆలోచించారుగారేం శాస్త్రులుగారూ?" అనడిగా రాచార్యులుగారు.

దురుసుగా అడగలేదు.

వారి మొగం ప్రసన్నంగానే వుంది.

కాని, సిగ్గుపడిపోయాన్నేను.

చాలా పరితపించాను.

ఏమిటేమిటో చెప్పకోడం ప్రారంభించాను.

వెంటనే "వద్దువ"ద్దంటూ లేచివచ్చి, నన్ను కంపార్టుమెంటులోకి తీసుకువెళ్ళి, తమ పక్కని కూచోపెట్టుకున్నారు, ముందు, వారు.

వీపు తట్టారు.

"ఊరికే, చమత్కారాని కన్నాను. మరేమీ అనుకోకండి. కావలసిందెలా వుంటే అలా అవుతుంది. చికిత్స సందర్భంలో నేనిలాంటివి చూడను."

నాయెడల మీ భావా లెలాంటివో నాకు తెలుసు. అది మరిచిపోండి" అంటూ చాలా చెప్పారు, కూడా.

బండి కదిలేదాకా చెబుతూనే వున్నారు.

మర్నాడులేదు, ఆ మర్నాడు వర్తమానం వచ్చింది నన్ను రమ్మని.

"వెళ్ళినపని వాకట్లోనే అయింది. పిఠాపురంలో దిగాను. రోగి చనిపోయినట్టు చెప్పారు. పిఠాపురంలోనే నాకు బసయేర్పాటు చేశారు. తిరుగుమెయిల్లో వచ్చేశాను" అన్నారు వారు, మొదట.

"శకునం మాట మరిచిపొండి. చమత్కారాని కన్నానంతే" అన్నారు మళ్ళీ.

"ఇలాంటి కేసులు నెగ్గడం కష్టం. చివరికి వచ్చేదాకా అక్కడివారు చికిత్స చేస్తూనే వుంటారు. అంతా అయింతర్వాత నాకు తంతికొట్టారు. సకాలంలోనే అందింది నాకది; కాని మెయిలు కదలాలి, రాత్రంతా నడవాలి, నేను పిఠాపురంలో దిగాలి, లక్ష్మీనరసాపురం చేరుకోవాలి – ఇంతవరకూ కాలమూ నిలవదు, రోగమూ నిలవదు. ఆ వ్యక్తి బతికేవుంటే, నే నక్కడికి వెళ్ళేటప్పటికే అక్కడివారి చికిత్స వల్ల రోగం మళ్ళవచ్చు. ఇదంతా అవతలివారి అదుర్దామాత్రమే" అన్నారు, తరవాత.

"శకునంమాట మరిచిపొండి" అంటూ మళ్ళీ అందుకుని "కాని, రాత్రి నన్నేడిపించారు మీ" రన్నారు, గంభీరంగా చేస్తూ.

నాకు తెలుసు, హృదయం వున్నచోట అలా జరుగుతుందని. అయినా చేతులు జోడించుకున్నా న్నేను.

"వద్దు వ"ద్దంటూనే నా అంజలిబంధం పట్టుకొని "అలాంటి రాతరాసి యిప్పుడిలా చింతించడం యేమి సొగసూ మీరు" అనడిగారు.

"చమత్కారం జరిగిం"దన్నారు తరువాత.

"సెల విప్పించం"డన్నా న్నేను.

వారు ప్రారంభించారు.

"కంపార్టుమెంటు కంతకూ ఒక యూరోపియనూ, నేనూ మాత్రమే వున్నాం. బండి బయలు దేరింది. నేను మీ నవల విప్పాను. యురోపియ నొక పుస్తకం విప్పాడు. రెండు పేజీలు చదవడమూ ఆ కాగితం చింపి కింద పారెయ్యడమున్ను అతను. గూడూరు దాటింది మొదలు కళ్ళ నీళ్ళు పెట్టుకోడమూ, తుడుచుకోడమూ, నా పెదవులు వణకడమూ, అయినా నవల చదువుతూనే వుండడమున్ను నేను. 'అదేమి' టనడిగాడతను. 'నువ్వాకాగితాలు చింపెయ్యడం ఏమిట'నడిగాన్నేను."

ఇలా అని, ఒక క్షణం ఆగి, విన్నారా అన్నట్టు చూసి, మళ్ళీప్రారంభించా రాచార్యులు గారు.

"రెయిలు ప్రయాణాలవంటి సందర్భాల్లో. కాలక్షేపం కావడానికి ఉద్దిష్టాలీపుస్తకాలు. ఒకమాటు చదివితే చాలివి. అంతే, యిది చదివితే కలిగే ఆనందం మళ్ళీ అనుభవించ నక్కరలేదని కాదు. కొత్తపుస్తకాలు వస్తున్నాయి. ఎందరో యువకులు తమ ప్రతిభ ప్రకాశం కోరుతున్నారు. వారి రచనలు కూడా చదవాలి మనం. వారికిన్నీ ప్రోత్సాహం కలిగించాలి మనం. మన రచన చదువుతోంది లోకం, కనక మనమున్నూ రాద్దాం" అన్న సంకల్పమున్నూ కలిగించాలి, మనం కొత్త యువకులకు.

"అంటే, యీ రచన వుద్దేశం యేమిటో అది నెరవేరి పోయింది. ఈ రచనకీ ఆకృతి ఎందుకోసం పుట్టిందో... అది నెరవేరిపోయింది. ఇక నిలిచివుండవలసింది కాదిది. ఉండ నివ్వ వలసిందీ కాదు. ఉండనివ్వడం వివేకంకాదు. అవివేకం అవుతుంది" అన్నాడు దృఢంగా అతను.

"ఇది వింతగా వుంటుంది మీకు" అంటూ ప్రారంభించాడతను.

"మీకూ, మాకూ దృక్పథంలో చాలా భేదంవుంది. పరిస్థితులున్నూ మావి వేరు. మీవి వేరున్నూ, అలాగే. అచ్చు లేని రోజుల పరిస్థితిన్నీ వేరు. పుస్తకం

చదవడానికంటే సంపాదించు కోడానికెక్కువ బాధపడవలసి వచ్చే దారోజుల్లో. పుస్తకం తయారుచేసుకోడానికే దమ్మిడీ అయినా ఖర్చుఉండేది కాదప్పుడు. ప్రతి రాసుకోడానికే శ్రమపడవలసి వచ్చేది. ఇప్పుడలాకాదు. ఇచ్ఛామాత్రంగా పుస్తకం అందుబాటవుతుంది. అయితే గుర్తించవలసింది, మన ఆ యిచ్ఛ వెనక, యెందరిదో శ్రమ చాలా యెక్కువగా వుందని. ఎందరో శ్రద్ధపడితేనే గాని దీనికీ రూపం రాలేదు."

"అయితే యెందుకోసం వారంత శ్రద్ధపట్టరు, ఎంచేత అంత శ్రమపడ్డారు? అదంతా పొట్టకోసం. మరి యీ ప్రతి ఇలాగే శాశ్వతంగా వుండిపోతే? వారి శ్రమకు వినియోగం యేదీ? పైగా వారి పొట్ట గడచేమార్గం రుద్ధం అయిపోదూ?"

"వారు శ్రమపడ్డమేకాదు, యీరచన కీరూపం సిద్ధించడానికి వొకడో, కొందరో డబ్బు ఖర్చుపెట్టవలసి వచ్చింది. ఆ ధనికుల వుద్దేశ మేమిటి అలా చేయడానికి? వారు పొట్టకోసమే చేశారది."

"అయితే బయటికివచ్చిన రెయిల్వే లిట్రేచరు ప్రతీది నిలవ వుండిపోతే?"

"ఇది మరొకడు చదువుతాడు. ఇంకొకడు చదువుతాడు. వేరొకడు చదువుతాడు. మరెందరో చదువుతారు. చదువుతూనే వుంటా డెవడో ఒకడు. వారి సంఖ్య యెంతయినా అవుతుంది."

"ఏ పుస్తకాని కయినా అందరు చదవడం గొప్పే."

"అయితే అందరూ చదవ్వలసిన – అందరూ కొనవలసిన అగత్యం యీ ఒక్కప్రతే తీరుస్తుంది. అప్పుడు పబ్లిషరేమవుతాడు?"

'మరి, లైబ్రరీ లక్కరలేదూ?' అన్న ప్రశ్నేవస్తుంది దీని మీద. తెలుసు. దాని కొక్కటే సమాధానం. లైబ్రరీలు రెయిల్లో వుండేవి కావు. ఉండవలసినవిన్నీ కావు.

"రెయిల్వే ప్రయాణీకులు విసుగులేకుండా ప్రయాణం చెయ్యగలగడమే ప్రయోజనం. రెయిళ్ళలోనూ రెయిల్వే స్టేషన్లలోనూ లైబ్రరీలుండవు. కనకనే యివి స్టేషన్లలో అమ్మడానికవకాశా లేర్పా టయినాయి."

"ఇవి నిలవ వుండవలసినవి కావు. ఇవి యెవడికి వాడు తన అగత్యం తీరేక యిలా చింపేస్తే? అగత్యం అనుకున్న వాడెవ డికివాడే కొనుక్కో వలసివస్తే?"

"అప్పుడే గ్రంథం యెన్ని ప్రతులు ఖర్చుఅవుతాయో ఆలోచించారా? పబ్లిషరు వ్యాపారం ఎంత పెరుగుతుందో గ్రహించారా?"

"అప్పుడు పబ్లిషరు ఎన్నెన్ని ఎంతెంత లేసి పుస్తకాలు ప్రకటించడానికుత్సాహ పడతాడో గమనించారా?"

"ఈ పుస్తకం నే నట్టేపెట్టేస్తే? నేను ఆ గ్రామికులకూ ఆ పబ్లిషరుకూ వృత్తి భంగం చేసిన వాణ్ణయిపోనూ? ఇది ప్రవృత్తికి భంగం కాదూ?" అనడిగాడు చివరికతను.

"విశిష్టమయిన మనస్తత్వం ఇది. మన కర్థం అవుతుంది. కాని నచ్చదు. ఎవడికి వాడే పుస్తకం కొనుక్కోడమే ధర్మం. అందరికీ ఆ శక్తి కలిగించాలనే జ్ఞానం లేదు మనకి."

"ఆ యూరోపియను ప్రవృత్తి పరంగానే అర్థం చేసుకోవాలి మనం. అప్పుడే ప్రవృత్తి అంటే ఏమిటో అవగాహనవుతుంది, మనకి."

"ఇక మీ నవల సంగతి."

"అది పూర్తిగా చదివాన్నేను. మీ రచనలో జీవం వుంది. మీ రచన ముందు నన్నేడిపించింది. కనకనే తరవాత నన్నానంద పెట్టింది. కనక మళ్ళీ, మళ్ళీ, రాయండి మీ రిలాంటి నవలలు. ఇంకా ఇంకా రాయండి" అంటూ ఆచార్యులుగారు నన్నెంతో ప్రోత్సహించారు.

☆ ☆ ☆

# కథక చక్రవర్తి కీ.శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

వెలనాంటి శాఖీయ బ్రాహ్మణుడు. కౌశికస గోత్రుడు. తల్లి: మహాలక్ష్మి సోదెమ్మ. తండ్రి: లక్ష్మీపతి సోమయాజులు. జన్మస్థానము: పొలమూరు (రామచంద్రపురము తాలూకా). నివాసము: రాజమహేంద్రవరము. జననము: 23 ఏప్రిలు 1891 ఖర సంవత్సర చైత్రశుద్ధ చతుర్దశీ గురువారము.

నేంటి తెలుగు కథా రచయితలలో, మునుముందుగా జ్ఞప్తి కందు కొందఱిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారొకరు. ఒక రనుటకంటే, మొదటి వారనుటయు నతిశయోక్తము కారాదు. కారణము అయన వ్రాసిన ప్రత్యక్షరము సహజ ప్రతిభనుండి పొటమరించినది: అయన చేసిన ప్రతి కల్పనము ప్రత్యక్షమున కవిరుద్ధమైనది; అయన పాత్రలచేం బలికించిన ప్రతిపదము, ఇరుగుపొరుగుల మనము వినుచున్నది; అయన ప్రదర్శించిన ప్రతి సంవిధానము మన యనుభూతులకు దవ్వుగానిది: అయన కట్టిన కథలెల్ల తెలుంగు దేశపుటెల్లలు గడచి పోయినవి. ఈ తీరున సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అచ్చమైన తెలుగుదనమును వలచి వచ్చిన రచయిత. అంగలముకాని, వంగముకాని, మఱియొక వాఙ్మయముకాని మర్యాదకైన జదివిచూచిన వారు కారు. విశేషించి, "హిందీ"ని చేరదీయ రాదని చిరకాలమునుండి వారి వాదము. ఇంక సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కూడబెట్టుకొన్న సంపత్తి సంస్కృత సాహిత్య మొక్కటే. ఇటులు విజాతీయమైన సంస్కార ధోరణి దూరముగానిలచి, కృతకృత్యగర్హితముకాని యాంధ్రత్వము నారాధించిన రచయిత రచన లెటులుండును? అనుకరణములు కాని అనువాదములుకాని చేయవలసిన ప్రారబ్ధము సుబ్రహ్మణ్య శాస్త్రిగారికిలేదు. యథార్థముగా అయన చూపులకుం గనిపించిన వస్తువు, అయన చెవులకు వినిపించిన మాటలు, మూట గట్టుకొని కథలలో బెట్టి కళ కట్టించును. ఉత్తమ జాతి రచయితచేసెడి పనియు నింతే! దీని వివరణము ముందు మనవి చేసెదను.

శ్రీపాద వారిది యనూచానమైన పండిత వంశము. శ్రౌతస్మార్తములు. జ్యోతిషము వీరి వంశ విద్యలు. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి తండ్రిగారు యజ్వ. అయన కన్న ముప్వురు కుమారులలోను మన శాస్త్రిగారు మూండవవారు. వంశస్థులందఱి వలెనే వీరుకూడ శ్రౌత స్మార్తములు పరాయితము అధ్యయనము చేసినారు. జ్యోతిషము స్కంధత్రయము పఠించినారు. అదికాక, వల్లూరిలో గుంటూరి సీతారామశాస్త్రి గారు, వేట్లపాలెములో దర్భా బైరాగిశాస్త్రిగారు, తమయింట అన్నగారు శివరామసిద్ధాంతి దీక్షితులుగారు గురువులుగాం గావ్యపాఠము చేసిరి. పసినాటనే తెలుగులపై నభిరుచి యంకురించినదగుటచే శాస్త్రిగారు గురువులచాటున నాంధ్రకృతులు జదువుటయు, ఏవోచిన్న చిన్న రచనలు చేయుటయు సాగించినారు. సరియైన యుపదేశమున్నగాని కవితారచన చేయరాదని ౧౯౧౦ సం॥లో సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నిశ్చయము కలిగినది. ఈ నిశ్చయమే, పీఠికాపుర సంస్థానకవులగు వేంకట రామకృష్ణులను

శాస్త్రిగారికి కవితా గురువులుగా జేసినది. ౧౯౦౨౧౦ సం॥లో రామకృష్ణ కవుల సాహచర్యమున నెన్నో సాహిత్యపు మెలకువలు కవిత్వపు బోలపము శాస్త్రిగారు గుర్తింపగలిగినారు. ఇరువది యేండ్ల యీడు వచ్చుసరికి శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారు సానఁబెట్టిన రత్నము.

ప్రధానముగా వీరి జీవితములో మెచ్చఁదగిన విషయము, వీ రేయధికారిని దోసిలి యొగ్గి "నెలకూలి చాకిరీ" కొడబడ కుండుట–వీరి వలె నాత్మగౌరవము నధికముగా నిలబెట్టుకొనువారు తక్కువ. అట్లని, పరనిరపేక్షముగా జీవింపగల విత్తవంతుడును కాఁడు. అయనలోని తలపులు పయి మాటలు నొకటై సూటిగానుండును. దాపఱికములేదు. చెప్పిన దానికిఁదిరుగుండ రాదు. ఎదుటివాడు సహృదయుఁడయినచో హృదయముముద్దగట్టి ముందుబెట్టును. కానిచో పిలచినను, పెడమొగము పెట్టును. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యదార్థవాదిత బంధువిరోధమునకుఁ గారణము కారానిది. ఇది యిటులుండగా వారితొలిరచన 'వారకాంత' యను నాటకము కవిత్వము నాటకాంతము కావలయునన్న పెద్దలమాట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ముందునకు దెచ్చినారు. ఈ సందర్భమున వారొకప్పుడు చెప్పిన 'రేడియో' ప్రసంగము స్మరణకు వచ్చుచున్నది.

"పాఠకునకూ, ద్రష్టకూ రసానుభవం కలిగించి తనసందేశం స్ఫుటముగా వినిపించాలంటే, 'రచయితకు' తక్కిన కావ్యాల కంటే నాటకం చాలామంచి సాధనం. కాని నాటకరచన చాలా కష్టమైనది. సామాన్యంగా కావ్యం రచించే టప్పటికంటే నాటకం రచించే టప్పుడు రచయిత గొప్పబాధ్యత వహించ వలసి వుంటుంది. తన జాతివారికి సభ్యత అలవడ జేయడమూ – అది తప్పిపోకుండా చూడటమూ–ఇదే ఆ బాధ్యత. కవికి ఇంత శక్తీ బాధ్యతా ఉందని తెలుసుకున్నప్పుడు, శక్తి ఉందా లేదా అని చూసుకోకుండానే నేను నాటక రచనకి పూనుకున్నాను, నేను మొట్టమొదట రాసిననాటకం–అంటే నాకు నేనైరాసిన నాటకం – "వారకాంత". కాని దాని కర్తృత్వం నేను మరచిపోతున్నాను. నా నాటకాలలో నేను చెప్పుకో గలవి "ప్రేమపాశం", "నిగళబంధనం", "రాజరాజు" – ఇవి. వీటిలో ఒకటీ రంగస్థలం ఎక్కలేదు. చదివినవారు మాత్రం అనుకూలంగానూ ప్రతికూలంగానూ కూడా మాట్లాడారు. కొన్ని ఏకాంకికలున్నూ రాశాను. వాటిలో నాకు మిక్కిలి ప్రీతి పాత్రం "కలంపోటు".

ఈ "వారకాంత" నాటకములోఁ పద్యములు కూడ జేర్చినారు. ఇది ప్రత్యేకించి చెప్పటలో సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ౧౯౩౪ నుండి బొత్తిగా పద్యబంధ ప్రాతికూల్యము వహించుటకారణము. ఈ ప్రతికూలభావము వారికి పద్యము హృద్యముగా వ్రాయలేక పోవుట వలనఁగలిగినది కాదని ఈ క్రింది పద్యము సాక్ష్యము చూపుచున్నాను.

బ్రతుకు ఘటించునోషధి కరాళ విషంబున నుక్కుతీవలం
దతి మృదునాదమున్, దహనునందు ప్రకాశము నుప్పునీటిలో
రతనము లాణిముత్తెములు, రాళను కప్పుకు జీవనంబులున్
చతురతఁ గూర్తు వెయ్యది యసాధ్యము నీకిక దీనబాంధవా!

"అత్త – అల్లుడు", "అలంకృతి", "అభిసారిక", "బాలిక, తాత" మొదలగు ఖండకావ్యములు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మనోహరముగా రచించినవి యున్నవి.

శ్రీ శాస్త్రిగారి మొదటి నవల 'మిథునానురాగము'. అట్లే మొదటి కథ ౧౯౧౪ ఫిబ్రవరిలో వెలువడినది. "ఇరువుర మొక్కచోటికే పోదము" అని దాని పేరు. "ఇదియాది ౧౯౨౩సం॥ దాక గ్రాంథికములోనే శాస్త్రిగారు రచనలు సాగించుచు వచ్చిరి. క్రమముగా రెండుమూడేండ్లకు సంపూర్ణముగా వ్యవహారిక భాషావతరణము. విశేషమేమనగా వీరు గ్రాంథికము వ్యవహారికము కూడ సహజమధురమైన శైలిలో వ్రాయగలవారు. శాస్త్రిగారు మున్ముందట వెలువరించిన చరిత్రగ్రంథము వీరపూజ. ఆ గ్రంథమందలి గ్రాంథిక శైలీ సౌభాగ్యము చాలా విలువగలది. శ్మశాన వాటిక, రక్షాబంధనము ఇత్యాదులగు వీరినవలలు ప్రజానీకములో సువ్యాప్తములై యున్నవి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వచన రచనలోఁ జలువచందనము వంటి దేదోయుండి హృదయమునకు రాసికొనుచుండును. సమాసముల గడబిడలు, అన్వయముల తిరుగుడులు మచ్చునకును రానిచ్చు స్వభావమాయన కలమునకు లేదు. ఎంతసేపును శాస్త్రిగారి చూపు సహజత్వముమీద. ఇది యటుండె."

౧౯౨౧సం॥ నుండి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సర్వసిద్ధాంతములకు బీఠమై "ప్రబుద్ధాంధ్ర" వెలసినది. శాస్త్రిగారి సంపాదకత్వమున నీ పత్రిక తొలియేఁడు ప్రతి పక్షమునకు వెలువడుచు రెండవయేటినుండి మాసపత్రికగా మారినది. ఆదిలో ప్రబుద్ధాంధ్ర సగము సంస్కృతభాషా రచనలతోను, సగము తెలుఁగు రచనలతోను వెలువడుట శాస్త్రిగారి యుభయ భాషా వైదుష్యాభిమానములకు నిదర్శనము. అల్ప కాలముననే 'ప్రబుద్ధాంధ్ర' తెలుఁగునేల మూలమూలలకు బ్రాకి పాఠకులను వలవైచి లాగినది. ఈ ఆకర్షణమునకు మహోత్తమ రచయితల వ్యాసములేకాక శాస్త్రిగారి వ్యాఖ్యలు విమర్శనములు హేతువులైనవి. వీరి కలమునకు జంకుగొంకులు లేవని తొలుత ననుకొంటిమి. గతానుగతిక ధర్మావలంబన మాయన బొత్తిగా సహింపలేరు. దానిని బట్టి హృదయములో నుండియో ఉండకో నూటికిఁదొంబదిమందిచే ద్రొక్క బడుచున్న సిద్ధాంతమును అమాంతముగా శాస్త్రిగారు గర్హింతురు. వట్టిగర్హణముతో సరిపెట్టక వాడిగల వ్రాఁతలో బెట్టి సుప్రచారము చేయుదురు. ఆయనలోనున్న యీ గుణమునకు వారి 'ప్రబుద్ధాంధ్ర' నిలువుటద్దమైనది. "హిందీ–గాంధీ–ఖద్దరు" ఈ మూఁడును శాస్త్రిగారి సిద్ధాంతమునకు విరుద్ధమైన పదార్థములు. బౌద్ధుల త్రిరత్నము వలె భారతీయుల పారాయణములో నున్న యీమూడు శబ్దములను విమర్శించుచున్న శాస్త్రిగారి గుండెనిబ్బరమునకు, అబ్బురమైన పట్టుదలకు మనము మెచ్చవలయును. "ప్రబుద్ధాంధ్ర" తొమ్మిది యేండ్లు నడచి మంచి ప్రసిద్ధిలో నాగి పోయినది. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి జీవన వైభవమునకు "ప్రబుద్ధాంధ్ర" సాగిన దశాబ్దము మెఱుగుకాలము. ౧౯౩౪సం॥ నుండి అపత్రికలో పద్యప్రకటనము నిషేధించి వచన రచనలే ప్రచురించెడివారు. కావున వచన వాఙ్మయమున కా పత్రిక చేసినమేలు మరువరానిది. శాస్త్రిగారి సర్వగ్రంథ రచనము నొకయెత్తు, ఈ పత్రికా ప్రచురణ మొకయెత్తుగా సాగినది. సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ౧౯౧౫ మొదలు నాలుగేండ్లు కళాభివర్ధనీ నాటక సమాజము నడిపిరని యుచటఁ బేరుకొనుట వారి కళాభిరతికి గుఱుతు. నాటకములలో స్త్రీ–పురుష వేషధారణము చేసెడి వారనియు వినుకలి. సంగీత కళపై వీరికెక్కువ మక్కువ. సుమారు నూరుకృతులు గురుముఖమున జెప్పుకొనిరట. కాని గొంతెత్తి పాడగా నేను వినలేదు. ౧౯౪౮నుండి సంగీత సాహిత్య సభలు జరిపించుచు వీరు రాజమహేంద్రవరమున

నూత్నకళాగౌరవము చాటుచుండుట ప్రశంసింపదగిన సంగతి. నన్నయ-శ్రీనాథ జయంతులు జేగీయమానముగా నడిపించుచున్న శాస్త్రిగారి ప్రాచీన సారస్వతాదరణము నమస్కరణీయమైనది.

ఇంక, ప్రకృతము, వారు చిన్న కథలు వ్రాయుదురు. కాని అవి గుణమున పరిమాణమున గూడా పెద్దకథలు. సంభాషణముల సంతనలో నింత పరిపక్వత గల కథా రచయితలు తక్కువ. పాత్రల మాటలలో వ్యక్తులతీరులు భంగిమములు సుస్పష్టముగా మనకు గోచరింప జేయుదురు. సాంసారికమైన ముచ్చటలు, సాంఘికమైన యాచారములు ప్రదర్శించుటలో శాస్త్రిగారిది యందెవేసినచేయి. వైదికకుటుంబములోని నడతలు వీరి కథాప్రపంచమున నచ్చుగ్రుద్దినట్లు కానుపించును. వడ్లగింజలు, మార్గదర్శి, కన్యా కాలే యత్నాద్వీరతా — ఇత్యాదులైన వీరి కథలు రసవాహినులు. ప్రేమపాశం, నిగళబంధనం, రాజ రాజు, కలంపోటు మొదలయిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాటికలకుఁ "దెలుగునాట" ప్రసిద్ధివచ్చినది. నాయుద్దేశములో "రాజరాజు" వీరినాటకముల కన్నిటికిని కన్నాకువంటిదని. అందులో నన్నయ పాత్రపోషణము అనన్యసాధారణమైన తీరులో శాస్త్రిగారు తీర్చినారు. రాజరాజుకడ, ఆత్మగౌరవము వీసమంతయినను చెడిపోకుండ నన్నయచేఁ బలికించిన పాటవము సుబ్రహ్మణ్యశాస్త్రిగారికే చెల్లినది. ఇది యన్నమాటకాదు, ప్రతిపాత్రయును రాజరాజులో జీవన్మూర్తులై కనిపించును. ఇట్టి "రాజరాజు"ను సాహిత్యసామ్రాట్టు విక్రమదేవవర్మ మహారాజు కృతిపొందుట యభినందనీయము. "కలంపోటు" మొదలగు నాటికలు వీరిని యెన్నిసారులు చదివినను జదువవలయు ననిపించును.

నాటికారచనలో పత్రికా సంపాదకతలో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారిది తెలుగు భూమిలో నొకప్రత్యేకపీఠము.

★ ★ ★

# శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి (వీలునామా) ఉత్తరం

పురిపండా అప్పలస్వామి గారికి!

"ఇవాళ తెల్లవారాటప్పటికి నాకివాళ పక్షవాతం సందేహం కలిగింది. మీరు హైదరాబాదునుంచి ఎప్పుడువస్తారు?"

నాగేశ్వరరావుగారికి కథలు పుస్తకాలు ఇచ్చెయ్యదలచుకున్నాను. వెనక ఒకమాటు వారు పేజీకి 3–00 మూడు రూపాయలు చొప్పున బేరంచేసి స్థిరపరచుకున్నారు. నేను కథలు పట్టుకు వెళ్ళి యివ్వబోతే, డబ్బులేదు ఇప్పుడు వద్దన్నారు. ఆబేరం మొన్న జ్ఞాపకం చేశాను. నిజమే అప్పుడు డబ్బులేక పోయిందన్నారు. ఇప్పుడు ఆ రేటున పైసలు చెయ్యండి. కుదరకపోతే మీ ఇష్టం వచ్చినట్లు పైసలు చెయ్యండి. తక్కినపుస్తకాలున్నూ యిప్పించెయ్యండి. వారికి నాలుగువేల చిల్లర నేనుబాకీ. నవలలూ, నాటకాలూ వగైరా కాపీరైట్లూ, స్టాకుఅంతా యిప్పించండి. మీకు సాధ్యమైన ధరకు యిప్పించి రుణం లేదనిపించి అదనంగా యిస్తే అది నా భార్య చేతికి యివ్వండి. నా కుటుంబానికి మీరే సాయం చెయ్యగలరు. కథలు సాపు రాసినవున్నాయి. పేపరు కటింగులున్నాయి. మందు చికిత్సకూ తిండికి డబ్బు కావాలి. ఇప్పించండి. ఈ నెల ఇంకా అద్దె యివ్వలేదు.

పుస్తకాల వ్యవహారం పూర్తిగా పరిష్కరించి మరీ వెళ్ళాలి మీరు. అనుభవాలు 2 విశాఖపట్టణం పంపాలి. పోషకులకూ తక్కినవారికీ, రాజమండ్రిలో మైలవరపూ, వింజమూరీ, రామచంద్రపురంలో దువ్వూరీ, చావలీ, వేపామాత్రమే యిచ్చాను. వేపావారు 116 – ఇస్తానన్నారు. ఇప్పుడే కొంత ఇవ్వవచ్చు. కాకినాడ సాహిత్యవేత్తగారంటే శ్రీ పార్థసారథిగారు. వారికి నాయెడ చాలా దయ. మీరు చెప్పితే నాకు గాని నా కుటుంబానికిగాని వారేమైనా సాయం చేసి చేయించవచ్చు.

నాకుటుంబం చెట్టు క్రింద వుంది. మీరు సాయం చెయ్యండి. విశాఖలోకూడా ఏమైనా వీలవుతుందేమో చూడండి.

గుంటూరిలో చావలిసూర్యనారాయణగారు (I.L.T.D. లేబరుఆఫీసరు) 66–00 ఇవ్వాలి. ప్రయత్నం చెయ్యండి. వారు రామచంద్రపుర గాంధీ డాక్టరుగారి అన్నగారు. డాక్టరు ద్వారా ప్రయత్నించండి. డాక్టరుగారున్నూ రామచంద్రపురం మిత్రుల చేతయేమైనా చేయించవచ్చు. నెల్లూరు శివరామయ్య గారేమైనా పంపవచ్చు. డాక్టరు కనక రాజుగారున్నూ చెయ్యవచ్చు.

శ్రీ నాగేశ్వరరావుగారి విషయం – వారికి అభ్యుదయం నా చేతనైనంతా కలిగించాలనుకున్నాను. భగవంతుడిలా చేశాడు. నేను వ్యర్థుణ్ణయిపోయాను. స్నేహితులైనందుకు మీకీ శ్రమమాత్రం కలిగిస్తున్నాను.

నాగేశ్వరరావుగారి వ్యవహారం మీరే పరిష్కరించడం నా ఆశ. మీరు మిక్కిలీ ఘనంగా సన్మానించారు. మీకు శ్రమమాత్రమే కలిగించాన్నేను. శ్రీసింహాచలంగారి

స్నేహం నాకు మహామేరువు. వారికి నా కృతజ్ఞత సరిగా చూపించలేక పోయాను.

మీకు నేను బరువైనట్టే నిశ్చయం. మీలాగ మనసిచ్చిన వారు నాకు మరొకరులేరు. మీ రుణం తీర్చుకోలేను. అది తీర్చుకోడానికయినా మరో జన్మం యెత్తుతాను. ఒకటికాదు, పదివంద ఎత్తుతాను. ఒక సామాన్యుడికి మీరూ సింహాచలం గారూ కనకాభిషేకం చేయించారు. ఇది నాకు పరమేశ్వరుడు చేయించలేనిది.

ఇలాటిస్థితిలో నేను భారం అయిపోతున్నాను. విచారించను. అది తీర్చుకోడానికయినా మరోజన్మ యెత్తుతాను కనక.

నాకేమీ విచారం లేదు. నా భార్య నన్న నేకవిధాల కాపాడింది. చిన్నప్పణ్ణుంచీ దాన్ని కష్టపెట్టాను. గాని సుఖపెట్ట లేకపోయాను. ఇప్పుడు ఇక ఆ వూసేలేదు కదా?

నిరర్థక జన్మ అయిపోయింది నాది.

రచనలయినా సాపురాసి అన్నీ జాతికి సమర్పించుకో లేక పోయాను.

పరమేశ్వరుడు మీకు సకల సుఖాలూ కలిగించాలి. సారస్వత సేవలో మీకు సాఫల్యం పూర్తిగా కలిగించాలి. మీ కలం జాతిని ఉద్ధరిస్తుంది.

(సం)
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

☆ ☆ ☆

## ఈ "అనుభవాలూ -జ్ఞాపకాలూను"

శ్రీ శాస్త్రిగారి అకాలమరణమువల్ల మూడవ సంపుటముతో ఆఖరు.

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
## అనుభవాలూ - జ్ఞాపకాలూను

మిక్కిలి అపూర్వమైన గ్రంథం యిది. అంటే, మన తెనుగు వాఙ్మయంలో యీరకం గ్రంథాల కిదే మొదటిది.

మొదట వైదిక విద్యలు నేర్చుకొని, 13వ ఏటనే కథలు రాయడం ప్రారంభించి, అగత్యం అయి తెనుగు పాండిత్యం గడించుకోడంలోనూ రచన చెయ్యడంలోనూ, శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఎదురుకొన్న ప్రతిబంధకాలూ, అనుభవించిన నిర్బంధాలూ, పొందిన ఆవేదనా, పట్టిన దీక్ష చేసిన సాధనా, ఆ సాధనలో వారు కనపరిచిన పరాకాష్ఠా, తత్ఫలితంగా వారు పొందిన విజయాలూ, గ్రంథ ప్రకటనకు కలిగిన — కలుగుతూనూ వున్న యిబ్బందులూ — ఈవివరాలు పాఠకుల హృదయాలు కరిగించడమే కాదు, రసమహిమలున్నూ చేస్తాయి చదివితే.

అనేక చోట్ల — అనేక సందర్భాల్లో — అనేక మాట్లు రాత ప్రతిని చదివించుకుని విని అనేకులు మిక్కిలి ముగ్ధులయివున్నారు.

వెల: రూ.180/-